# స్వవిషయము.

---

ఆర్యవర్యులార! 1914

ఇది యానందసంవత్సర ద్వితీయసంచిక. ఈపత్రికయానందసంవత్సర ప్రారంభమునుండి మాసపత్రికగా మాఱినది. కాని చందాలో, సర్వసాధారణముగ సులభసాధ్యము కావలయు నన్ని మా[illegible]యలేదు. ప్రమాదీచనామ సంవత్సరమునఁ జేరిన పాఠకవర్యుల కానందసంవత్సరమునఁ బత్రిక కావలయునా వలదా యని మే మడిగినందులకుఁ గొందఱు[illegible]ప్రత్యుత్తర మీయలేదు. అట్టివారు చందాధనమునుగాని వి. పి. కట్టుమని జాబునుగాని బంపఁ గోరుచున్నారము. భాషాభిమానులు తమస్నేహితులను గూడఁ బ్రోత్సాహపఱచి పరివత్పత్రికాపాఠకులనుగా నొనర్పఁగోరెదము. భాషావిషయకములుగాని, దేశచారిత్రములు మొదలయినవిగాని సలక్షణభాషలో వ్యాసములుగ వ్రాసి పంపినచో వానిని మాపత్రికయందుఁ బ్రచురించెదము. సాధ్యమయినంతవఱకు వ్రాయునట్టి వ్యాసములు రసవత్తరములై యెనిమిదిపుటలకు మించకుండవలయును.

మేనేజరు.

# ప్రకటన

---

## ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజారావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ - వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీపిఠాపురమురాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

" ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

" నెమలి పట్టాభిరామారావు పంతులుగారు బి. ఏ.,

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహాదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,

రావు బహాదూర్ పట్టి త్యాగరాయసెట్టిగారు, బి. ఏ.,



కార్యస్థానము.

2/7 హారిస్ రోడ్డు, పుదుపేట.

చందానిర్ణయము.



పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించులక్షణశాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును ప్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్య మొనర్చుట, భాషావిషయములఁజర్చించుటకుఁ బత్త్రిక నొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

| | | |
|---|---|---|
| 1. ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. పోషకులకు | " | 1000. |
| 3. యావజ్జీవసభ్యులకు | " | 100. |
| 4. సాధారణసభ్యులకు సంవత్సరమునకు | " | 6. |

పరిషత్సభ్యులు పత్త్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# విమర్శనాస్వభావము, దానిలాభములు.

(కాకినాడ సభలోఁ జదువఁబడినది.)

అగ్రాసనాధిపా! ఆంధ్రసాహితీపరిషత్తులారా! సభాస్తారులారా! నేను నుడువఁ బోవు విషయ మందఱికిఁ దెలిసియు గమనింపకున్న దై యున్నది. ఈవిషయ మాంధ్రవాఙ్మయదేహమునకు ముఖ్యాంగ మై యున్నది. అట్టి యంగము లేకున్నఁ గాని వంకరగ నున్నఁ గాని వాఙ్మయదేహ మవకరముగ నుండునే కదా! దాని కొఱంత యనివార్య మైన దని నే నిఁకముందుఁ జెప్పఁ బోవు దానివలన మీకుఁ దోఁచక మానదు. అట్టి దాంగ్లేయాది భాషలయందు సమగ్రముగ నున్నది. ఆంధ్రభాషయందు బొత్తిగ నలక్ష్యము చేయఁబడినది. నేను జెప్పఁబోవు విషయము "విమర్శనాస్వభావము, దాని లాభములు." ఏభాషయందును వాఙ్మయముతోడనే విమర్శనము పుట్టియుండ లేదు. ఆంగ్లేయ వాఙ్మయ మభివృద్ధి చెందినకొలందిని అందలి విశేషములను బ్రజలకు సుస్పష్టముగఁ దెల్పుడుచేయు నావశ్యకత్వము పొడమి విమర్శనా ప్రారంభమున కవకాశము కల్గినది. ఆంగ్లేయభాషయందు మొట్టమొదట విమర్శన మీర్ష్యాపురస్కృతమై యుండినది గాని రానురా నిప్పటి కది ప్రాశస్త్యస్థితి నందియున్నది. ఏకారణమువలననో గాని యాంధ్రభాషయందు విమర్శనము పుట్టియుండ లేదు.

వాఙ్మయము తక్కువగ నున్నదా యని ప్రశ్నించుకొనినచో మనభాషయం దది విశేషముగఁ గల దనియే చెప్పవలసియున్నది. ఆంధ్రగ్రంథరాజములం దున్నగుణములు లోకులకు సుస్పష్టములు గాక సముద్రమునం దున్న రత్నములవలెఁ గప్పువడియున్నవి. చక్కని విమర్శనమే ప్రబలి యున్నచో నందలి విశేషము పలువురకు గోచర మై భాషయం దెక్కుడాదరభావము హెచ్చి యుండును. మణియందలి ప్రాశస్త్యము తెలియనప్పుడు గులకరాయికంటె దాని కెక్కుడు విలువ యుండదు గదా! నన్నయభట్టునకుఁ బూర్వమే కొందఱు కవీశ్వరు లాంధ్రభాషయందు గ్రంథములు వ్రాసినట్లు కనఁబడుచున్నది. అప్పటినుండి నేఁటివఱకు నాంధ్రభాషలో గ్రంథములు వ్రాయఁబడుచునే యున్నవి. జనసామాన్యసుబోధకములు గాక ప్రశస్త మైన వని మాత్రము పండితులచే నంగీకరింపఁబడిన గ్రంథరాజము లసంఖ్యాకములుగ నున్నవి.

అం దిమిడియున్న విశేషములు లోకమునకు వెల్లడి చేయుట కెవ్వరును బూనుకొనఁ జాలరైరి. అట్టి యావశ్యకత్వము లే దని యప్పటివా రూహించి రేమో తెలియదు. వాఙ్మయ మభివృద్ధి చెందినకాలంది నైన నిట్టి యావశ్య కత్వము వారికిఁ బొడకట్టి యుండలేదు.

అప్పకవియంతటివాఁడు సహితము తనవిమర్శనములో

"బమ్మెరపోతరాజకృత భాగవతంబు సలక్షణంబు గా
కిమ్మహిఁ నేమిటం గొదవ యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలసి ప్రాసము లైనకతంబునం గదా
యిమ్మహిఁ నాదిలాక్షణికు లెల్లరు మాని రుదాహరింపఁగన్."

అని భాగవతమువంటి మహామాత్మ్యప్రగ్రంథమునే నిరసించియున్నాఁడు. లక్షణము లన్నియుఁ దూచాతప్పకుండ గ్రంథమందు గమనింపఁబడినవా యని, ఆంగ్లేయభాషయందు పోపు, డ్రైడన్ కాలమునందువలె, నిప్పటిలాక్షణికులు పరీక్షచేయువాడుకయుండియుండు నని దీనివలనఁ దెలియుచున్నది. సర్వలక్షణ సమగ్రమై నిర్దోషమై, సంపూర్ణయోగ్యత కలగ్రంథము విమర్శనాతీతము (Above criticism) గాను, లక్షణన్యూనత గలవానిని విమర్శనానర్హములు (Below criticism) గాను రెండుతెఱంగులుగ విభజించి విమర్శనమునకుఁ జోటీయకుండి రని యనుకొనవచ్చును. కొంద ఱానాఁటికవిశిఖామణులు తా మాశ్రయించియున్న భూపతులపట్టు చూచుకొని, వారి మన్ననలచే గర్వించి యహంభావభూయిష్ఠు లై తమగ్రంథములందుఁ దప్పులే లే వనియు, నున్న వనువారిని చెంపకాయలు కొట్టుదు మనియు భయపెట్టుటచే విమర్శనము చేయుటకు భయపడి మానిన ట్లూహింపవచ్చును. అందున కుదాహరణముగ రామలింగకవి.—

చ. ఒకనికవిత్వమం దెనయు నొప్పులుఁ దప్పులు నాకవిత్వమం
దొకనికిఁ దప్పుపట్టఁ బని యుండదు కా దని తప్పు పట్టినన్
మొకమటు క్రిందుగాఁ దిగిచి మొక్కలు వోయినయన్నకత్తితో
సిక మొదలంటఁ గోఁతు మఱి చెప్పునఁ గొట్టుదుఁ గాలఁ దన్నుదున్ ॥

అని వ్రాసియున్నాఁడు.

అత్తకోదండ్రదత్తప్రులో సరస్వతి బలవత్తరమై లక్ష్మిని బాఱఁద్రోల నామెవిరోధురాలగు వామె యక్కకు సరస్వతి చెంత యిరవు గలుగఁ గవిసార్వభౌము

లుదరపోషణార్థమై భూపతుల నాశ్రయించి వారియాస్థానములం దుండి వారి యభీష్టానుసారముగా గ్రంథముల రచియించుచు, నయభయంబులచేఁ గానుకల ముల సేకరించుకొని కాలక్షేపము సేయుచుండిన కాలమున వారు రచించిన గ్రంథములను విమర్శనము చేసినచో నాభూపతుల కెట్టియలుక పుట్టునో యను భీతితో మానుకొని రనియు నూహించిన నూహింపవచ్చును. ఏమైన నేమి? పర్యవసానము విమర్శన మారంభము కాలేదు. ఒకవేళఁ బ్రారంభమైయుండి న నీర్ష్యాస్పదమై, స్వోత్కృష్ట ప్రభూయిష్ఠమై, పరనిందాకరమై యుండు నేమో, అట్లుండినను మేలే! దోషములు చేసినంగాని దిద్దుకొనుటకుఁ బ్రాశస్త్యము ను గాంచుటకును మార్గము వేరొండు లేదు గదా. గొప్పవా రందఱు మొదటఁ దప్పు చేసి దిద్దుకొనినవారే. ఆంగ్లేయభాషయందును మొదట విమ ర్శన మీర్ష్యాపురస్సరంబుగనే యారంభ మైనది. అది యుక్తము గాదని తెలిసి మంచిమార్గ మవలంబించి విమర్శనమును వాఙ్మయమునకు ముఖ్యాంగముగఁ జేసియున్నారు.

విమర్శన మన నెట్టిదో దానిస్వభావమునుగుఱించి యోజింతము. గుణ దోషనిర్ధారణము విమర్శనము. గ్రంథముయొక్క గుణములను విలువను నిర్ధార ణము చేయఁగల ప్రావీణ్యమునకు విమర్శన మని పేరు. దేనియందుఁగాని గుణ ములను నిర్ధారణము చేసి చెప్పుటయు, నందుఁ బ్రశస్త మని లోకులు తెలిసి కొనఁ దగినదాని ననుకొనఁ దగిన దానిని నేర్చుకొనుటయుఁ బ్రచురము చేసి జనులకు నేర్పుటకై ప్రయత్నించుటయు, విమర్శనము యొక్క ముఖ్యోద్దేశ ములు. గ్రంథముయొక్క గుణదోషములను వేర్వేరుగ వ్రాసి ప్రకటనమునకై సిద్ధముచేయఁబడిన పట్టిక యని కొందఱుమతము. రంధ్రాన్వేషణమే విమర్శన మని సామాన్యముగఁ గొంద ఱనుకొనుచున్నారు. కాని యది కేవల మప్రశస్త ము, నగ్రాహ్యము.

తప్పులు వెదకుట గాని నిందించుట గాని విమర్శనాలక్షణము కాదు. విమర్శనాశబ్దమునకు గుణదోషనిర్ధారణ మని యర్థము గాని రంధ్రాన్వేషణ మని యర్థ మెందును లేదు. న్యాయదృష్టితోఁ జూచిన సలక్షణమై నిర్దోషమై నిరాక్షేపణపాత్రము లగుభారతాద్యుద్గ్రంథము లెంత విమర్శనమునకు యో గ్యములో యాక్షేపణభూయిష్ఠము లగు గ్రంథములు నంతయోగ్యము లైనవే. లక్షణవిరుద్ధము లై దోషభూయిష్ఠము లగుగ్రంథములు విమర్శనమున కయో

గ్యము లని చెప్పినం జెప్పవచ్చును. కాని నిర్దుష్టములై సలక్షణము లగు గ్రంథరాజములను విమర్శనాతీతము (above criticism) లని వదలివేయరాదు. విమర్శనమునందుఁ బ్రావీణ్యము కలవాఁ డట్టిగ్రంథములయందలి గుణములను బ్రాశస్త్యమును వెల్లడిచేయక యుండఁగలఁడా? అట్టివానిచేతనేగద మనకు బుద్ధి వికసన మగుచున్నది? వానియందలి యందమును వెల్లడిచేయ కూరకొన లేఁడు. మొదటఁ దా నానందించి వెనుక నొరుల నానందింపఁజేయుట కదా సువిమర్శకుని లక్షణము. గుణములను బ్రచురముచేసి గ్రంథకర్తయొక్క యనల్పకల్పనాశక్తి, రచనానైపుణ్యము, కావ్యయోగ్యత, శాశ్వతము చేయుట కదా వానిపని. నిజముగ యోజింప సువిమర్శకునివంటి యాత్మబాంధవుండు గ్రంథకర్తకు వేఱొకఁ డుండునా? తా రచించిన గ్రంథమువిలువ, రచనాచమత్కారము గ్రంథకర్తకు సహజము లగుటచే, నంత గొప్పవిగఁ గన్పింపవుకాని విమర్శకునకుఁ దెలియవా? తెలిసి వాఁ డూర కుండనేర్చునా? దానియం దున్న సర్వసుగుణములను దాను గ్రహించి యానందించి ప్రపంచమునకుఁ దెల్లముచేసి లోకులు గ్రహించునట్లును, నానందించునట్లును జేసి, యాగ్రంథమునం దభిరుచిని బుట్టించి, గ్రంథమును శాశ్వతము చేయుటయే గాక, గ్రంథకర్తకు ఖ్యాతిఁ దెచ్చి, తానును బ్రఖ్యాతిని బొందుచున్నాఁడు. అందుల కుదాహరణములు పెక్కులు తెలుఁగునందు లేవు గాని యింగ్లీషునం దనేకములు గలవు. 'జాన్సన్ జీవితము' వ్రాసి బోస్వెల్ ప్రఖ్యాతిఁ గాంచి యుండలేదా! హూణకాళిదా సని ప్రఖ్యాతిఁ గాంచిన షేక్స్పియర్ గ్రంథములను విమర్శనము చేసి యెందఱో యింగ్లీషు పండితులు యశము వడసి యుండలేదు? ఆవిమర్శనాగ్రంథములను లెక్కింపఁ గలమా? అట్టి విమర్శనము, నట్టి విమర్శనముచే, గ్రంథగ్రంథకర్తలు విఖ్యాతిఁ గాంచుట, విమర్శకుఁడు వన్నె కెక్కుట, యట్టి విమర్శనమాంధ్రవాఙ్మయమునందుఁ జేరి భాష నభివృద్ధిపఱచుట, యాంధ్రభాష కింకను నబ్బకుండుట విచారకర మగువిషయమే.

షేక్స్పియరు మొదలగు హూణకవీశ్వరులు వ్రాసిన కావ్యములకంటె వానిపై వ్రాసిన విమర్శనాగ్రంథములే లెక్క కెక్కు డై యాంగ్లేయవాఙ్మయమును వృద్ధిచేసిన విషయ మాంగ్లేయభాష నభ్యసించిన సభ్యవరుల కవగతమే. చేమకూర విజయవిలాస మెంత పాకమునఁ బడినది! పద్యమును జవి

చూచిన రుచి మఱతురా! మనుచరిత్ర మెంత హృద్య మైనది! వతాదృశగ్రంథములయందలి యందమును బండితు లందఱు సానుభవముగ గ్రహించిరేకాని విమర్శనముచేసి తాము గ్రహించిన విశేషమును దాము గనిపెట్టిన గుణమును లోకమునకు వెల్లడించిరా! లోకమున కాగ్రంథములయం దభిరుచిఁ బుట్టింపఁ గల్గిరా? సాహితీసరసాగ్రేసరు లఁట! భాషాసరసు లఁట! ఉన్న యాంధ్రవనిత సౌందర్యమును గన్నెత్తి చూడ సామర్థ్యము లేదు. ఇంకను సృష్టింపవలెనఁట! క్రొత్తవి కావలెనఁట! ఉన్నగ్రంథములకుఁ జక్కనివిమర్శనము వ్రాసి యాంధ్రభాష నభివృద్ధి చేయరాదా! ఇదియు నొకమార్గము కాదా? ఉత్కృష్టగ్రంథము లనేకము లున్నవి. చక్కనివిమర్శనము వ్రాయించి యాంధ్రకావ్యములయం దాదరము హెచ్చింపఁజేసి, విమర్శన మన నేమియో ప్రపంచకమునకుఁ దెల్పుడుచేసి, యట్టిసువిమర్శనమునందుఁ బండితులకుఁ బ్రోత్సాహము కలుగఁజేసి, ఆంధ్రవాఙ్మయము నభివృద్ధిచేయుట యావశ్యకము. ఉన్నవానియం దనాదరము చూపి పెక్కుగ్రంథములను బేరునకు మాత్రము ప్రకటింపఁజేసి ప్రఖ్యాతి వడయఁజూచుటకంటె నిటువంటి యొక్కవిమర్శన గ్రంథము వలన నెక్కుడు ప్రఖ్యాతిఁ జెందవచ్చును. భోజరాజువంటి రాజు లున్నచోఁ గాళిదాసువంటికవులు లేకపోరు. రసము తెలిసి యాదరించు ప్రభువులున్నచోఁ గవీశ్వరు లెప్పుడును గలరు. కవీశ్వరులకు సహజ మగుదారిద్ర్యదోషముచే నిట్టి యుద్యమములకుఁ బూనుకొనక యధమ మగు సేవకావృత్తి నంగీకరించి పొట్ట పోసికొనుచున్నారు. ఆంధ్రభాషాభిమాను లంద ఱీదెసఁ గృషిచేసి వానికిఁ బ్రోత్సాహముఁ గలిగించుప్రయత్నమునకుఁ బూనుకొందురుగాక.

గ్రంథములందుఁ దప్పులు వెదకుట చులుకన యగుపనియే.

" తప్పు లెన్నువారు తండోపతండంబు
లుర్విజనుల కెల్ల నుండుఁ దప్పు
తప్పు లెన్నువారు తమతప్పు లెఱుఁగరు
విశ్వదాభిరామ వినుర వేమ—''

యన్నట్లు తప్పు లేనివా రెవరు? భారతకవీశ్వరులకుఁ దప్పులు పట్టలేమా? తప్పు లేని సర్వజ్ఞమూర్తి భగవంతుఁ డొక్కఁడే. గొప్పకవుల కావ్యములయందుఁ గొన్ని నెరసు లున్నను వానిని దప్పు లనరాదు. 'ప్రమాదో ధీమతా మపి' యన్నట్లు ప్రమాదవశమునఁ గొన్నిదోషములు దొరలును.

తప్పుచేయుట మానవస్వభావము; వానిని పాటిసేయక యుదారస్వభావముతో మన్నించుట దేవభావము.

" దిద్దవలెఁ దప్పు కల్గిన
ముద్దుగ నైషధంటికంబు మూలముఁ గని తా
రెద్దియుఁ జూడక రోసెదు
గద్దరికుమతులను లెక్క గాంచరుసుమతుల్."

అని యొకకవీశ్వరుఁడు వ్రాసియున్నాఁడు.

"ఊరు మెచ్చఁ బెండ్లి నొగిఁజేయఁగాలేరు, ఓపినంత సేయకుండలేరు"

అన్నట్లందఱు మెచ్చుకొనులాగున గ్రంథము వ్రాయవలె నన్నఁ "గావువాఁడు, కొడుకు, గాడిద" కథ సామ్యమువచ్చును. తప్పులు వెదకు స్వభావముగల విమర్శకుల విషయమై నిరసనభావము చూపుచు నొక కవీశ్వరుఁడు—

గీ॥ గంధచందనములు మేనఁ గల్గియున్న
నగరు పన్నీరు నెంతయు నలమికొన్న
వ్రణము కల్గినతావునే పరఁగ మక్షి
కంబు వెదకును గాదె యాంకాంక్ష సేసి."

యని వ్రాసియున్నాఁడు. కావ్యరచనమందుఁ గవీశ్వరుఁడు పడుపాట్లు దైవమున కెఱుక; విద్వాంసుని కెఱుక.

" విద్వా నేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్।
నహి వంధ్యా విజానాతి గుర్వీమ్ ప్రసవవేదనామ్"

అన్నట్లు తక్కువారల కెట్లు బోధపడును? ఇంతకష్టపడి వ్రాసిన గ్రంథమును గువిమర్శకుఁ డొకఁడు తప్పులను వెదకి గ్రంథమును నిరసించి దూషించినచో నాకవీశ్వరుని డెందం బెంత యాందోళనంబు చెందునో యూహింపుఁడు. అసూయాపరతచేఁ గాక యిట్టిపనికిఁ గారణ ముండునా? దీనివలన నెట్టిలాభము లభించును? కేవలము దీనివలననే పేరుప్రఖ్యాతి వచ్చునా?

నిజ మగువిమర్శన మెట్లుండవలెను? నిష్పక్షపాతముగ నుండవలెను. లేనిపోని స్తోత్రపాఠములు గాని నింద గాని యుండరాదు. ఈవలసిన పొగడ్త నీయవలెను చూపవలసినంత యాదరమును జూపవలెను. ఎక్కువ నీయరాదు,

తక్కువనీయరాదు. గ్రంథకర్తను బాగడవలె నని కాని నిందింపవలెనని కాని యుద్దేశముతో విమర్శన మారంభింపరాదు.

విమర్శనమందు విమర్శకునకుఁ బ్రవీణత కలిగియుండవలెను. చదువ నేర్చిన ప్రతిమనుజుఁడిందునకుఁ దగఁడు; పూనుకొనరాదు. గ్రంథమునందుఁగల గుణదోషములను జక్కఁగఁ వేఱుచేయుశక్తిగలవాఁడై యుండవలెను. న్యాయమును దీర్పుచేయు న్యాయాధిపతివంటివాఁడు విమర్శకుఁడు. లంచగొండి గాని న్యాయాధిపతికిఁ "ఫిర్యాదీ" యందుఁ గాని "ముద్దాయి" యందుఁ గాని పక్షపాతము లేదు. వాదియందుఁ గాని ప్రతివాదియందుఁ గాని మనసు పోనిచ్చి విచారణకు దొరకొనఁడు "ఫిర్యాదు" "దావా" ల యందలి నిజానిజముల నుభయకక్షుల సాక్ష్యవాదములను నిష్పక్షపాతబుద్ధితో విని యెటు న్యాయపు ములు గౌరవము చూపునో యట్లు తీర్మానించును. అట్టివాఁడు విమర్శకుఁడు. అంతకంటె నెక్కువవాఁ డనియుఁ జెప్పవచ్చును. గుణము కల్గినచోట గుణమును, దోష మున్నచోట దోషమును జూపును. ఎప్పుడు తప్పులను వెదకు స్వభావము కలవారివిషయమై చెప్పుచు "The critics are men who have failed in literature and art", "వాఙ్మయమందును కల్పనాకౌశలమందును సమర్థత లేనివారే విమర్శకులుగా మారుచున్నారు" అని బెంజమెన్ డిస్రాయిలి యను నాంగ్లేయకవి వ్రాసియున్నాఁడు. అసూయాపరతచే నిందించుచు విమర్శనము వ్రాసిన నది నిలువఁజాలదు. గ్రంథముయొక్క యోగ్యత యెప్పటికైనను బయలుపడక మానదు. అప్పుడు వీరివ్రాఁతలు నిరర్థకములు కాక మానవు. కువిమర్శనముచే అరిస్టాటిల్, డాంటి, రైనాల్డుస్, సెంటుబిఱో, మాత్యూ ఆర్నాల్డు, మొదలగువారిపేర్లు రూపు మాసినవా? అసూయాపరతచే నిందించినను గుణము బయటఁబడక మానినదా? గుణగ్రహణము సర్వోత్కృష్టమగుపని. క్షీరనీరముల వేఱుచేసి క్షీరములనె గ్రహించు రాజహంసంబువలె సద్విమర్శకుఁడు దోషములను వదలి గుణములను జూపి గ్రంథప్రాశస్త్యమును వెల్లడిచేయును.

విమర్శకుఁడు లక్షణవేత్త యై యుండవలెను. లక్షణమునుబట్టి విమర్శనము చేయవలెను. కావ్యముల కన్నిలక్షణములు పట్టినవా యని చూడరాదు. ఒకకాలపువిధుల వేఱొకకాలమున కుపయోగింపరాదు. లక్షణము లన్నియుఁ

బట్టకున్నను ఏయుద్దేశముతో నట్టిగ్రంథము వ్రాయఁబడినదో యాయుద్దేశము నెఱవేఱినదా లేదా యని యోజించి నెఱవేఱియున్నచో గ్రంథమునందు గుణమున్న దనియే తీర్పు చేయవలసి యున్నది.

కవీశ్వరుని యభిప్రాయమును సాధ్యమైనంతవఱకు గ్రహింపవలెను. గ్రహింపక నిందింపరాదు. విద్య యొకనిసొమ్ము గాదు. పాండితికి మేర లేదు. తన పాండిత్యమునే మేరగాఁ గొని యెదుటివారి నపండితు లనుట పండితంమన్యుని లక్షణము గాని పండితవాచ్యుల లక్షణము కాదు.

లక్షణగ్రంథములనుబట్టి విమర్శనమునకుఁ దొడంగితిమా యొక కావ్యము విధ్యుక్తముగ నుండదు. చాలవఱకు ననుగుణముగ నున్నదా లేదా యని మాత్రము చూడవలసియున్నది. తప్పులు పట్టుటయే పనిగఁ బ్రారంభింపరాదు. తప్పులు లేనిగ్రంథమే లేదు. కొలఁదినెరసులు ప్రమాదవశమున దొరలినంత మాత్రమున నసంఖ్యాకము లగుగుణము లన్నియు మన్నునఁ గలియవలసినదేనా? వెనుక శశిలేఖపత్త్రికాముఖమున "భారతధర్మసందేహము" లను శీర్షికతో నాదిపంచకమందుఁ దీసి వివిధము లగు శతసందేహములను బ్రకటించియున్నాఁడను. ఎవరైన సమాధానములనువ్రాసినచో సందేహనివృత్తి చేసికొని తెలివి నభివృద్ధి చేసికోవలె నను నుద్దేశముతో వ్రాసితినిగాని కవిత్రయమువారియందు దోష మెంచవలె నని నాయుద్దేశము గాదు. పండితు లెవరును వానిని సమర్థింపలేరైరి. అంతమాత్రముచే భారతమును నిరసింపవలసినదేనా? అందలి గుణజాలము వర్ణనాతీతముగదా? అరలకుఁ బ్రాస ముంచినంతమాత్రమున, ద్రుతద్విత్వ మున్నంతమాత్రమున భాగవతపుణ్యగ్రంథరాజమును లక్షణగ్రంథము కాదనవలసినదా! పోతరాజు సహజపాండితీప్రకర్ష కలవాఁడు. అతనిపదలాలిత్యము నంత్యనియమము రచనాకౌశలము మృదుమధురశైలి యెవరికిఁ దెలియదు? ఆమధురిమచే నెంతమంది యెన్నిస్కంధముల నెన్నిఘట్టములను వల్లించినారు కారు? భాగవతమును నేను వర్ణింపఁగలనా?

వ్రాయువారికే తప్పులు. వ్రాయనివారికిఁ దప్పులే లేవు. తప్పులకు జడిసి వ్రాయుటమానుదుమా? మానము గాని కువిమర్శకులకు జడిసి కొందఱు వ్రాయుట మానినారు. నిజమగువిమర్శన మాంధ్రభాషయందుఁ బ్రబలకుండుటయే యీదోషమునకు మూలము. నిజమగువిమర్శన మన నెటులుండవలెనో

వ్రాసి దారి చూపినచోఁ గువిమర్శకులు తప్పుత్రోవ మార్చుకొని గుణగ్రహణ పారీణు లగుదు రని నానమ్మకము. ఈర్ష్యాళువులు కానిచో వారు గొప్పవిమర్శకు లని ఖ్యాతినొందకమానరు. ఆంగ్లేయభాషయందును మొదట నీర్ష్యాభావము మెండుగ నుండినే విలియమ్ బ్లేక్, కీట్సు, మిల్టన్, మొదలగువారిని గువిమర్శకులు మొదట నిందించి యున్నారు. గ్రంథములయం దసంఖ్యాకము లగు దోషముల నెన్ని యున్నారు. కాలక్రమమున నిజ మగువిమర్శనము ప్రబలి యా కవీశ్వరుల కావ్యప్రాశస్త్యము లోకమునకు వెల్లడి యైనది. వారికిఁ జిరకీర్తి కల్గినది. పాప మాకవీశ్వరుల జీవితకాలములయందు మాత్ర మాఖ్యాతి లభించి యుండలేదు. వోల్టేర్ (Voltaire) కవీశ్వరుఁడు చెప్పినచొప్పునఁ గువిమర్శకుల విమర్శనము రోదోంతరాళమందు నిర్మింపఁబడిన కాచభవనమట్లు పాండిత్యప్రకర్షావిమర్శనముచేఁ బగిలి పటాపంచలై గచ్చువిచ్చై పోవును.

విమర్శనమందు సూత్రములు కొన్ని ముఖ్యములే కాని గ్రంథము సూత్రానుగుణముగ నున్నదా లేదా యని గట్టిగా పరీక్ష చేయరాదు. అభిప్రాయమున కొదిఁగి యుండవలసిన సూత్రమే నిరంకుశప్రభువువలె వర్తించినచో విమర్శనోద్దేశమే చెడిపోవును.

విమర్శకునకుఁ గావలసిన యితరలక్షణములలో ముఖ్యము లగునవి.

1. పాండిత్యము, (Knowledge) 2. పరేంగితజ్ఞానము, (Sense) 3. అభిరుచి, (Taste) 4. గుణగ్రహణశక్తి, (Appreciative faculty). 5 అనసూయాభావము, (Unenviousness) 6. ఉదారస్వభావము, (Liberal Spirit) 7. సమత. (Sympathy) 8 స్పష్టత (Clearness)

పాండిత్యము లేనిచో విమర్శనమునకుఁ బూనుకొనుటయే వెఱ్ఱితనము. కవిహృదయము గుర్తెఱుఁగఁ గోరినవాఁడు కవీశ్వరునివలె నెక్కుడు పాండిత్యము కలవాఁడై యుండవలెను. తప్పులు వెదకుట విమర్శనలక్షణము కాదు. గుణము నిర్ధారణము చేయుట ముఖ్యోద్దేశము. గ్రంథమును విమర్శించునప్పుడు విమర్శకుఁడు 'ఇది యొప్పు' 'ఇది తప్పు' అని చెప్పినంతమాత్రమునఁ జాలదు. ఒప్పు లనుటకుఁ దప్పు లనుటకుఁ గారణములను సహేతుకముగఁ జెప్పవలెను.

పరేంగితజ్ఞానము ముఖ్య మైనది. కవిహృదయము తెలిసినఁ గదా గ్రంథమునం దెక్కుడు రుచి చదువరులకుఁ బుట్టును.

"ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించులా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవ చొప్పు నీ
కింతభయంబు లే కడుగ నెల్లిద మైతిమె మాటలేటికిఁ." మనుచ.

"ఇంతలు" మొదలగు సాభిప్రాయపదములం దెంతయంద మిమిడియున్నది! కవిహృదయమును విమర్శకుఁడు వెల్లడి చేసినచో మనుచరిత్ర నెవఁడు చదువక మానును?

"మున్ను సైఁపదు సంతోషమున భుజింప
వెనుక సైఁపదు చింతచేతను భుజింప
భామకడ నున్న తఱి యెడఁబాయుతఱియు
నొక్కలాగయ్యెఁ బాండువంశోత్తమునకు" విజయవిలాసము.

ముద్దులొలుకు తేటపదములను రత్నములపేరువలె గుదిగూర్చి యెంత భావము నిమిడ్చి యున్నాఁడు! ఎంత యనుభవసిద్ధముగను స్వాభావికముగను జెప్పియున్నాఁడు! తానే యర్జునుఁడైనచోఁ దా నిట్లు చేసియుందు నని వేంకట కవి యనుకొనియుండఁడా? వ్యాసవిస్తరభీతిచే స్థాలీపులాకన్యాయము ననుస రించితిని గాని మఱికొన్ని యుదాహరణములను జూపింపవలె ననియే యున్నది.

అభిరుచి—వాఙ్మయమునం దభిరుచి పుట్టి విమర్శనమునకుఁ గడంగవలెను గాని పరుని దూషింపవలె నని కాని వంచింపవలె నని కాని ప్రారంభము చేయ రాదు. కావ్యములయందలి గుణములఁ బరిశీలించి ముందుఁ దా నానందించినఁ గదా యొరుల నానందింపఁజేయ శక్తుఁ డగును?

గుణగ్రహణశక్తి మిగుల ముఖ్యమైనది. ఎచ్చట గుణము గలదో దాని నేర్పాటుగ నిర్ధారణ చేయుశక్తి శ్లాఘనీయమైనదే. వంగతోఁటలోని గ్రుడ్డివాని వలెఁ బలువురు నవ్విరి గాన నేనును నవ్వుదు ననుట యుక్తము కాదు. అట్లు చేసినచో గ్రంథము చదువుట కాసక్తి మెండగును.

అనసూయాభావము—కవీశ్వరునకుఁ గీర్తి కలుగుట కిష్టము లేనివారై గ్రంథమును నిందింపవలె నను నుద్దేశముతో విమర్శనమున కారంభించుట యుక్తము కాదు. తా నభినందింపకున్నను నిజముగ గుణమున్నచో మఱియొకరు భూషింపక మానరు. నిష్పక్షపాతబుద్ధితో వ్రాసినవిమర్శనము వన్నెకెక్కును. అసూయాపరతచే వ్రాసినవ్రాఁత గౌరవముపడయుదు. అట్టివారివ్రాఁతలు నిర

ర్థకములై పైపెచ్చు వారికే యపఖ్యాతి నాపాదించును. గుణదోషములను విమ ర్శించునపుడు మృదుమధురశైలి నుపయోగింపవలెను. కర్ణకఠోరము లగుశబ్ద జాలమును బ్రయోగింపరాదు. అట్లు చేసినచో నసూయాపరతచే వ్రాసియున్నాఁ డని లోకు లనుకొందురు. లోకోపకారార్థము విమర్శనము కాని కేవలము గ్రంథకర్త కుపకార ముద్దేశించి కా దని జ్ఞాపక ముంచుకొనవలెను.

ఉదారస్వభావము—గ్రంథరచనాశక్తి మిగుల దుష్కరమైనది. వెక్కిరించుటసులువు. దీనివిషయమై పైని ముచ్చటించియే యున్నాఁడను. తప్పులను లెక్కసేయక గుణమును శ్లాఘించుస్వభావము కలవిమర్శకుఁడు కడు విరాజిల్లును.

సమతాస్వభావము—అన్నిటికంటె నెక్కుడైనది. ఆస్థితిలోనే తా నున్నచో నంతకంటెనెక్కుడు ప్రశస్తముగ వ్రాయఁగల్గునా యని తనకుఁ దాను బ్రశ్నించుకొనుచు నంతవఱకుఁ గష్టపడి సాధ్య మగునంతలక్షణయుక్తముగను నిర్దుష్టముగను వ్రాసినందులకు సంతసించుచుఁ బ్రమాదవశతకు జాలినొందుచు దోషము లెచ్చుట నైనఁ బాడకట్టినచోఁ బ్రమాదవశ మని యోజించుచు గుణమును భూషించుచు విమర్శించువాఁ డుత్తముఁడు. దోషమును ఖండించునపుడు నిష్పక్షపాతబుద్ధితో బహిరంగముగ నుండవలెను గాని పాము చావకుండఁగను బడితె విఱుగకుండఁగను ద్వ్యర్థిపదముల నుపయోగించి చెప్పీచెప్పనట్లు చెప్ప రాదు. కవీశ్వరుని విరోధిగ నెంచి విమర్శకుఁ గడంగరాదు. తన ప్రియమిత్రుని వలె నెంచి వాఁ డెదురుగ నున్నచో నెట్టి "సలహా" నిచ్చునో యట్లె 'సలహా' నీయవలెను.

విమర్శనము స్పష్టముగనుండవలెను. తోఁచినదానిని స్పష్టముగఁ జెప్ప వలెను. ఆ యభిప్రాయ మొకవేళ విరుద్ధముగ నున్నచో మఱియొక విమర్శకుఁడు దానిని ఖండించి నిశ్చితాభిప్రాయము వెల్లడిచేయ సమర్థుఁ డగును. నిజమెప్పటికైన బయటఁబడును. గూఢార్థద్వ్యర్థిపదజాలము నుపయోగించి తనప్రయోగము పదిమందికిఁ దగులు నట్లు వ్రాయరాదు. ఒకరిని బట్టి యందఱిట్టివారే యని తెగను దూషింపరాదు. విశేషమును బట్టి సామాన్యమును సాధింపఁ బ్రయత్నించుట విమర్శకునిలక్షణము గాదు. తనబుద్ధిహీనతను దీర్ఘ సమాసములలోను గంభీరము లగుకఠినపదజాలములోను గప్పిపుచ్చరాదు. పండితంమన్యులు సర్వజ్ఞత్వ మారోపించుకొని దురభిమానభూయిష్ఠులై తమంతవారు

లే రనిపించుకొనుటకై యిట్టినిరర్థకశబ్దజాలమును దడదడ కొండమీాదినుండి క్రిందఁబడు సెలయేటివలె శబ్దింపఁజేయుచుఁ బెడత్రోవలు త్రొక్కుచుండుట మన కనుభవైక వేద్యమేకదా! అట్టిబడబడలయం దర్థ మాకాశపుష్పముగదా! తెలివిలేని "ప్లీడర్లు" నిరర్థకవాగాడంబరమును బల్లగుద్దుటలనుజూచి పల్లెటూరి 'పార్టీలు' "గబికీగబికీ మాపీడరుమూాడుమాట్లుబల్లగుద్దిండు" అనిసంతసించుచుఁ జెప్పుకొనులాగున విద్యాగంధ మెఱుంగని శ్రోతలు 'గాబరా'పడి నివ్వెఱగంది చూచుటచే నాత్మగౌరవమున కాధిక్యత కలుగు ననుదురభిప్రాయముచేతనే గాక యీానిరర్థకవాగాడంబరమునకు వేఱుకారణ మున్నదా? దానిలాభము తన తెలివిహీనతను గప్పిపుచ్చుకొనుటయే. కాని విద్యావంతు లగువారి కాదొంగ తనము బయటపడక మానదు. అది గౌరవహానికి మార్గమే కాని వృద్ధికిఁ గార ణము కానేరదు.

ప్రతివాక్యముఁ జక్కఁగఁ బరిశీలించి గ్రంథకర్త యుద్దేశమును గ్రహింప వలెను. కవి యేకాలపుఁజరిత్ర వ్రాసినాఁడో యాకాలము, నాస్థలము, నాభాష, యాకవీశ్వరుని కెట్టిమార్పును గలిగించినవో గ్రహించి యందున కనుగుణముగ విమర్శనము వ్రాయవలెను. ఉదారసమతాస్వభావము లేనిచో నెంతపాండిత్య మున్నను, ఎంత విద్యాభిరుచి యున్నను నిష్ప్రయోజక మని నొక్కి వక్కా ణింపఁగలను.

ఈరీతిని విమర్శనము వ్రాయఁబడినచో గ్రంథములు వ్రాయుట కెందఱో యారంభింతురు. పండితులయం దొకరియెడల నొకరి కీర్ష్యాభావము మాసి పోవును. మంచి విమర్శనము ప్రబలి విమర్శనాగ్రంథము లెక్కుడు కాఁగా గ్రంథరాజములయం దిమిడియున్నగుణము, దోషము లోకమునకు వెల్లడి యగును. అనేకుల కాగ్రంథములు చదువుటయం దభిరుచి పుట్టును. గ్రంథము లకుఁ బ్రాచుర్య మధిక మగును. గ్రంథకర్తలకు విమర్శకులకుఁ గీర్తికలుగును భాషయం దభిరుచి హెచ్చును. ఆంధ్రవాఙ్మయ మభివృద్ధిఁ జెందును. 'ఆంధ్ర భాషలో విమర్శనాగ్రంథములు లేవు. భాష యంగవైకల్యతను జెందియున్న ద' ను కొఱఁత పోయి యన్నిభాషలతోపాటు తులతూఁగుచుండును.

విద్వద్వరిష్ఠులారా! భోజరాజకృష్ణదేవరాయాది విద్వత్సార్వభౌము లగు మహామండలాధిపతు లేలిన యీాభరతఖండమందుఁ; గాళిదాసు, భవ భూతి, తిక్కన, సోమన, పెద్దన, మొదలుగాఁగల యనేకమహాకవీశ్వరులతో

జన్మస్థానమై యాచంద్రతారార్కముగఁ గోటిసూర్యప్రభతో వెలుంగు పరమోత్కృష్టకావ్యముల రచించి దేశమునకు వన్నె తెచ్చి తెలుఁగుభాషకుఁ “దూర్పు ఇటాలియా” భాషయను ప్రఖ్యాతిని దెచ్చి మృతులయ్యును ఇప్పటికిని గీర్తికాయులై యున్న యీభరతఖండమందు, దురాచారఖండనంబుఁ బొనర్చి సదాచారసంపత్తి సంస్థాపనార్థమై యవతరించి వర్ణాశ్రమధర్మములను శాశించి శాశ్వతప్రతిష్ఠఁగాంచిన శంకరభగవానులు మొదలగు మతోద్ధారకులు ప్రబలిన యీభరతఖండమందు, శ్రీకృష్ణభగవానులు భారతీయుల జన్మసాఫల్యార్థమై మహోత్కృష్టమును నైహికాముష్మిక సాధనంబును, జ్ఞానదాయకంబును, బౌనఃపున్య జన్మరాహిత్యకారణంబును నగు భగవద్గీతను, లోకానుగ్రహాకాంక్షను బరంపరవ్యాప్తిచే లోకోద్ధారణకారణ మగుటకు నర్జునున కుపదేశించిన యీభరతఖండమందు, మోక్షమూలరు మొదలగు హూణపండితులు సహిత మేదేశవాసుల వేదములను భాష్యములను, వేదాంతమును, జూచి యపరిమితానంద పారవశ్యతను బొంది చదివి సారమును గ్రహించి లోకమందలి దేశస్థులందఱికంటె హిందూదేశస్థుల వాఙ్మయ ముత్కృష్టమైనదనియు, వారి వేదాంతమునకు సరిపడున దేచోటను బ్రపంచకమునందు లేదనియుఁ దెలిసికొని లోకమునకుఁ జాటి, హిందువుల సంస్కృతవాఙ్మయమునందలి ప్రీతి గౌరవము పట్టఁజాలక ‘మాక్స్‌ముల్లర్’ అను తనహూణనామమును ‘మోక్షమూలరుభట్టు’ గా మార్చుకొని యుండెనో యట్టి యీ భరతఖండమందు, మనసౌఖ్యమునకే యిండియాను స్వీకరించి మనక్షేమమే వారిక్షేమ మని పలుమాఱు చాటించి చెప్పుచు మనకు లాభకారిగ నాంగ్లేయులు పరిపాలించుచున్న యీ భరతఖండమందు, పాండితీప్రకర్ష కలిగి స్వార్థపరత యింతైన లేక లోకోపకారార్థము, భాషోపకారార్థము వ్యయప్రయాసముల కోర్చి సర్వదాపాటుపడుచున్న యింతమంది మీవంటిపండితపుంగవులచే విరాజిల్లు నీభరతఖండమందు, నిప్పుడైన నేమియుఁ గొఱఁత రాదు. విద్యాగంధ మెఱుంగని భూపతులకుఁ గృతు లిచ్చి వారిని వేఁడిన లాభము లేదుగదా! కవితాసారమెఱుంగలేని భూధవునకుఁ గృతి నిచ్చి బహుమానము లందుటకంటె రసజ్ఞుఁ డగు నరపాలునకుఁ గృతినిచ్చి యవమానముఁ బొందుటయైన శ్రేష్ఠ మని యొక కవి వ్రాసియున్నాఁడు. ఇప్పుడు నుదారస్వభావు లగు భూధవులు లేకపోలేదు. స్వార్థపరత్వశూన్య మగు నౌదార్యాభిమానము లీకాలమున నరుదె. నిజపరిజ్ఞానశూన్యతచే వారిమహి

మము నేతిబీఱకాయ సామ్యమైనది, కారణ మెట్టి దైనను గార్య ముపకారియే గదా! వారి సహాయమున నెట్టికఠినకార్యము నైనను సాధింపవచ్చును. ద్రవ్యవంతు లగు భూపతు లనేకులున్నారు. వారు పూనుకొన్న సాధింపరాని దేది? అందులకై తగువారు ప్రయత్నించినఁ జాలును.

కాశ్లకూరి సాంబశివరావు.

(గతమాసశేషము.)

రుగానె కట్టివుందురు. గనుక అంద్దుండ్డి *ఆయాచావిళ్ల వారు సలాములు శేయంగ్గా మొదటిదొర మితపరిజనములతో మహాలుమీద కొలువైయుండ్డి కొలువు దీరి నగరికి పొయ్యేటప్పుడు వున్నతమైనమార్గములుగానె కట్టివుండ్డును. గనక ఆ వున్నతస్థానమందు నిలిచి వెలిచావళ్లలో వుండ్డేవాల్లకును జూచి వారి వాల్లకు నిత్యకట్టడ బహుమానము సన్మానంబ్బులు నడిపించ్చే క్రమానికి నడిపించ్చ మని ఉత్తరవు ఇయ్యగానే ఆయా పనులవారు రొక్కవుడుగరలు దట్టి కబాయి తలపాగ పట్టీలు యివి అన్నిన్ని ఆయా చావిళ్లలోనే వుండ్డును గనక తోడుతోన తెచ్చి మొదటిదొర ముంద్దుగానె దివాణానకు ఇయ్యగా సకలమైన వాల్లున్ను కొలువుజేసి వుంద్దురు గనక యొద్దరు వచ్చిన వాల్లకు గ్రాసం కట్టడజేశి వుండ్డును గనక వారలకు గ్రాసంయిప్పించ్చి మరి వెనక నగల్లోనికి పోదురు నియ్యోగులు దిక్కులనుండ్డి వచ్చిన కమ్మకాగితములు చదివించ్చక విని యేనుగలున్ను కొత్తపాయదళమున్ను నామజాదులు ఆలోచనశేయగా విన్నవివరం విజయాపురం అహముదానగరం గోలకొండ్డమీద కార్యం శేయమని మూడులక్షలగుర్రాలున్ను వెయ్యియేనుగలున్ను కొంత్త పాయదళమున్ను నామజాదుల జేశినారు వారువచ్చి దిగితే వారలతో పోరాడేది దుర్ఘటమై వుండ్డును ఉత్తరాన అఘువురంవారున్ను దక్షిణాన కన్నాటకంవారున్ను తూర్పున గజపతివారున్ను కనుపించుకొనేటట్టు వున్నది. అశ్వపతి గజపతి నరపతులలో యీ మూడుసింహాసనాల వారినిన్ని విరుద్ధమైనవారియెవ్వరినిన్ని కనమని కొలిచేవారము కాము. మూడు సింహాసనములకున్ను గురిలేక వుండ్డగాను మూడుతెగలరాజ్యములోను యేలుబడి అయ్యేస్థలాలు ఆక్రమించ్చుకొని మెడబలిమిని దినాలుక్రమిస్తా వుంట్టిమి వారితోవారు అన్యోన్యమై కార్యం శేయమని తమతమసరదులవుండ్డె వాల్లను కనుపించ్చుకొమ్మని నామజాదులు అంప్పితే వారితో పోరాడేది శక్యముగాదు తాము జేషిన అదృష్టమువల్లనుంన్ను తమదొరలపాలిట కర్తారువల్లనున్ను అంత్తరమంన్నిలమై అరువైయేండ్లుబట్టిన్ని, అవనికి అధిపతులు లేకుండ్డగ యెదులశాహు కుతుపనములక నిజాంశాహు అనేపేరు గలిగి వున్నది సింధుదేశమునసుండి గోదావరీపర్యంతమున్ను అఘువురంవారున్ను కేరళంముదలు కృష్ణవేణిపర్యంతము కన్నాటకం వారున్ను జగన్నాధమునసుండి బెడదకోటపర్యంత్తం గజపతివారున్ను యేలుదురు. యీ

మూఁడు దక్షిణహిందూ రాజ్యములు.

---

* అనుస్వారమునకుఁ బిమ్మట వచ్చు ప్రత్యక్షరమునకు ద్విత్వము రెండవప్రతిలో లేదు.

మూడు సింహాసనాలవారికి అంగ్దుబడి గాక అసాధ్యమైన దుర్గాలున్ను చేపట్టి త్రిపురాలవలె వున్నది గనక భయములేదని తమలోతాము ఆలోచన జేసుక వుండ్డగా తాత్కాలికమతి అనే ఆయన వారితోను వీరుజేశిన ఆలోచన యథార్థమాను త్రిపురాలలోనున్న రాక్షసులు మహాబలవంత్తులు యీశ్వరవరప్రసాదమువల్ల కామగమనం గలిగి సురులు అసురులు మొదలైనవారలచేత వైఖ్కరిచేతనయిన లయంలేకుండ్డా వరమడుక్కొని పంద్రెండ్డు యేండ్లకు వొఖసారి మూడుం ముక్కాలుఘడియ త్రిపురులు ముగ్గురున్ను కూడివుండ్డి ఆలోచనజేసుకొని యెప్పటివలెన యథాయథలై సంచరింపుదురు. అటువంటి త్రిపురాధిపతులకు కాలంకూడేటప్పుడు భూదేవి బ్రంహ్మదేవునితోను విష్ణుదేవునితోనున్ను పరమేశ్వరునితోనున్ను అధర్మపతులైన త్రిపురులను మోయలేనని మొరబెట్టగా బ్రహ్మదేవుడు త్రిపురాలవారిని వఖరిచేత నిగ్రహించ శక్యముగాదు. నీవురథమై వేదములు గుర్రాలై మేరుపర్వతము విల్లై, ఆదిశేషుడు నారియై క్షీరాబ్ధిశాయి నారాయణాస్త్రమై ఫాలలోచనుండ్డు రథికుండై త్రిపురాలను నేలగూలిస్తే అప్పుడు ఆదానవులు నాశమై పోవుదురు అని అనుగ్రహించిరి. ఆరీతిగాను విజయాపురం అహముదానగరం గోలకొండ్డ అనే త్రిపురాలకు మూడుసింహాసనాలవారున్ను యెప్పుడు కనుపించ్చుకొంటా వున్నారో అప్పుడు అపాయం వచ్చేది నిశ్చయమని తాత్కాలికమతి తెలుపగా ఆనియోగులు అందరున్ను "ఆరీతు అవును అయినా వుంన్నదినాలకు రాజలక్షణములున్ను మంత్రాలోచనలున్ను నడపవలె గనక వూరకే వుండరాదు యిప్పుడు కర్నాటక * సింహాసనానకు కృష్ణరాయలవారిని అధిష్టానకర్తల జేశినదారభ్యం తురకలమీద కార్యంజేశే ఆలోచన అక్కడవుండే ముఖాములు కాకితములు అంప్పినారు. అదినిమిత్యం ఆలోచనపరులై హానివృద్ధులకు లోనై యెనులసాహువారికి వ్రాయించ్చి అంప్పించ్చినారు గనక వారున్ను తమతమ కాకితములు సరదు స్థలాలకు రస్తుసామగ్రీలు అంప్పించ్చి గడిస్థలాలను బలవంతముగా వుండ్డేటట్టు తాణ్యాములకు నామజాదులు అంప్పించి మొదటిస్థలానికిన్ని యీది హెచ్చరికలతో వున్నారని వ్రాశివచ్చెను. మన రెండుతెగలవారున్ను శీమసరుదులు వున్నదుర్గములు కోటస్థలములకు అంప్పతగినవాల్లను † అంపించ్చి కర్నాటకం వారు దళము కూర్చుకొని స్థళము

* రెండవప్రతిలో సర్వత్ర కర్నాటయని కలదు.

† రెండవప్రతిలో వాల్లు, వేగుల్ల యిట్టిచోటుల ద్విత్వములేదు.

సరుదులకు వచ్చేవారై వక్కప్రదేశానదిగినారని కమ్మకాగితములు వస్తే అప్పుడు అంద్దుకు తగిన ఆలోచనజేసి నడిపించ్చుకొంద్దాము ఇప్పుడునానాటి ప్రవర్తకములు తెలిశివచ్చి చెప్పమని నూటయిరువై వేగుల్లను పయనంశేశి అహముదానగరం వారున్ను గోలకొండ్డ వారున్ను అంప్పగా విద్యానగరానకు బహు వేషభాషల బహురూపాలుగావచ్చి వారు వేగుల్లను అంప్పించ్చి [1] మరించ్చి ఆలోచనశేశేవివరం కృష్ణరాయలవారు తురకాణ్యంమీద దళమెత్తివచ్చి అని మొనలకార్యంపూని నడిపించ్చే యడల జయాపజయములు యెవరికని దైవజ్ఞులయినబాంహ్మల [2] నున్ను ముల్లాశాస్త్రప్రవీణులయిన పక్కీరులనున్ను భూత భవిష్యద్వర్తమానములు తెలిశిన శకునజ్ఞులనున్ను పిలుపించ్చి అడుగగా వాల్లు కన్నాటకమున విష్ణు అంశగా నృపతి ఉద్భవించి యీ రాజ్యమున్ను అశ్వపతిరాజ్యమున్ను గజపతి రాజ్యమున్ను అంత్తా జయించి జయస్తంభమువేయించ్చి మగుడి పొద్యేటప్పుడు కల్యాణ వేంకటేశ్వరుల దర్శించ్చి నూటయెనిమిది దివ్యతిరుపతులనున్ను డెబ్బైరెండ్డు దేవస్థానములున్ను పదునెనిమిది శక్తులనున్ను సేవించ్చి సేతువుకు బోయి రామనాథుల దర్శించ్చి ధనుష్కోటిలో ఖడ్గము కడిగి కన్నాటకం సింహాసనాన అరువైనాలుగు యేండ్లు యెదురులేక యేకచక్రముగాను రాజ్యమేలేటట్టు వున్నది [3] అనిచెప్పినారు గనక పిన్నపెద్దలు ఆతీరే అవుగాబోలు మ్లేఛులు అధర్మానకున్ను నిర్దయత్వమునకున్ను రాక్షసకృత్యమునకున్ను వెరవరు గనక భూదేవి తాళునా త్రిపురాలకు వచ్చినట్టు వచ్చునేమో తెలియదు అని అంద్దరున్ను ఆలోచన శేశుక తమతమ ఇండ్లకుపోగా వారితో కూడావుండ్డి నగరు వెడలి పక్కీరులతోకూడా పట్ణమువెల్లివచ్చి భాగీరథినుండ్డిన్ని రామధనుష్కోటికి వచ్చి వచ్చేవారివెంబ్బడినీళ్ళుదాటి కన్నాటకమునకు వచ్చి యెప్పటివేషముదాల్చి పట్ణమునకు వస్తిమి అహముదానగరం గోలకొండ్డలో కన్నవిన్న వార్తలు వేగుల అరవరాముదున్ను పక్కీరిగోపాడి [4] యిద్దరు తెలియవిన్నపంశేయగా రాయలవారితోను అప్పాజి అయ్యమరసు [5] కొండమరసుగారున్ను తురకాణ్యమనగా యెమునిరాజ్యమువంట్టిది ఆపట్ణముఅటువంట్టిది ఆవ్రూరిలోవుండ్డేవారు యమదూతలు అనేటంద్దులకు సంద్దేహంలేదు అటువంట్టి దిక్కులకుబోయి సకలవార్తలున్ను

1 రెండవప్రతిలో "మరిన్ని" 2 బ్రాహ్మణుల. 3 ఉన్నది. 4 గోపాజి. 5 కొండమరసుపేరు రెండవదానిలో లేదు.

పరామరిక శేసుక స్వామివారి ప్రతాపమువల్ల మ్లేఛు లయినవారి నగళ్లున్ను రాజ్యములున్ను నూరుభాషలభూములున్ను మహారాష్ట్ర గుజ్జెరి గణ్ణోజి యిటు వంట్టిగాయకులతో కలహస్థులైకష్టబడక సంచ్చరించ్చి పట్ణానకు వచ్చినారంత్తే గాని అరపేదకాలుశేదమనుష్యులయినవారికి పోనురానుశక్యమూ అని నగరువేగు లఁను కొనియాడగా రాయలవారు చాలా సంతోషబడి తలా [1] యోనూరేశి ఘట్లుంన్ను ఉడగరులుయిచ్చి యెప్పటివలెనే ఆయాపట్ణముల సంచ్చరించ్చి నానా టిసమాచారములువచ్చి వింన్నపంశాయమని అంప్పించ్చి వద్దనున్న వాలఁను కడకు పోంమ్మని రాయలవారు సామాజికులతో విజయాపురం వర్తఁమానా లున్ను అహముదానగరం గోలకొండ్డవార్తఁలున్ను వింట్టిరేగా ఆరెండ్డుఇండ్ల వారికింన్ని చాలా ఆలోచనపుట్టి యింత్తేశివార్తలకు హేతువు యెయ్యద్ది అని అడుగగా సామాజికులు యీవరకున్ను తురకాణ్యాముమీద కార్యంశేయవలె నని వదంత్తి పుట్టింద్దిలేదు గనక యీసింహ్వాసనస్థులనుండి విచారం లేక వుండ్డగా వూరకె వుండ్డిరి యిప్పుడుస్వామివారు సింహ్వాసనానకు కర్తఁలై దానక్షాత్రము లుకనుపింంచ్చువార్తఁలుగా ఆనతిస్తిరిగనక అరిజనులైనవాల్లఁకు ఆలోచనపుట్ట కవుండ్డునా మీరుదినమున్ను ఆమూడు తెగవారి ముఖాములతోను వినయమైన వార్తఁలు ఆనతిస్తేను వారుబుద్ధిశాలులు గనక తమయేలినవారిని స్వామివారి నింన్ని అట్టిపట్ణగతాన సింహ్వాసనస్థులైన వారు శేసినసంబ్బళం సారికెలు యిప్పించ్చి దిక్కుల స్థానాపతులతోడట్టు కొలువుకువస్తే కమ్మకాగితములు గలిగితేను మాట పలుకులునడిపించ్చినట్టయితె ఇప్పుడున్ను నడుచుకవచ్చే మర్యాదవక్కా లాకులు యిచ్చి అంప్పుదురు. ఆరీతిగ స్వామివారు పట్టాభిషిక్తులైన దారభ్యం నిలిచిన వారికేమి శాతురాణువకేమి బొక్కసానవే రొక్కరూపాయలు ఇమ్మని కట్టడజేశి కైజీతం నిలిపి గతం అమరపు దొరతనములవారి శీమ సంబంద్ధాలున్ను నడిపి నగరి నియ్యోగులకు పరస్థళం నియ్యోగులకు బహుమాన సంమ్మానము లున్ను ఉచితముగా రొఖ్కరూపాయిలున్ను యిచ్చి మూడుతెగలవారి పట్ల లియ్యమైనమాటలున్ను ఆడుతాఉన్నారు గాబట్టి ఆమూడుతెగల నియ్యోగులు న్నుకన్నాఁటకాంన్న బహుదినాలుగావుంన్నారు యిదిగాక వాల్లుఁ నీతిప్రబం ధములుచదివివుండ్డురు కాబట్టి ఆలోచనపరులై వ్రాశిఅంప్పించ్చినారు అనినంద్దు లకురాయలవారు మేము అగ్రహబడి ఆరీతిని యీరీతిని ఆనతిచ్చినవారముగాము

1 యేనూరు అని 2 వ ప్రతిలో.

వారికి వారి యేలినవారి మర్యాదగా బహుమాన సన్మానములుగా వినయమైన సరససల్లాపములుగా అంద్దుము అనినంద్దులకు అయ్యమరసు స్వామివారు వినయపూర్వకముగా యెప్పుడు ఆనతిచ్చినారో అదే విపరీత మని యెంచ్చ వచ్చును అదెట్లంట్టిరా అంద్దుకు నీతిపద్యం

క. ఘనుఁడా వినయం బాడిన
వినయంబా మీఁద నదియు విపరీత మగున్
కొననుండి విల్లు వంగుట
వినయంబా యెదుటివాని వేగమె త్రుంచుౘ

అనే అర్థముగనక కన్న కార్యములున్ను విన్నవార్తలున్ను హృదయాలోచన అనుమానముగానున్న నియ్యోగులు వ్రాసేదిచాణుక్యనీతి గనక ఆరీతిని వ్రాతురు అక్కడివారు ఆకాకితములు జూచుక ఆవార్త ఆలోచన నడపతగినదే ఆవార్తలుపరిశోధించ్చి చెప్పినారని సామాజికులువిన్నపం శేశినారు గనక మన ముంద్దర నడిపించ్చే కార్యములకు హేతువుతోస్తున్నది అని పలుకరించ్చిఅప్పాజిమొదలయినవాళ్లు అంప్పించ్చుకో వచ్చినతర్వాత అయ్యనముల అంకుశఖానుంద్దు రాణాజగదేవ గణుతి తిమ్మప్పనాయడు రావూరి రామినాయడు పెమ్మసానిరామలింగమనాయడు హండ్డే మల్లారావు బోయిరామప్ప హరివాణం కొమాళ్లయిన పదునెనిమిదికప్పణాలవారున్ను దళనాయకులు అప్పరపిళ్ళ కుప్పరపిళ్ళ సాళువనాయడు కొమార తిప్పమ్మ [1] సంగ్గరాజు చెర్వప్రధాని తిప్పరసు అయ్యప్పనాయడు కోటికంవిశ్వనాధనాయడుచెవ్వప్పనాయడుఅక్కప్పనాయడు కృష్ణప్పనాయడువెలిగోటియాచమనాయడు కన్నడ బసవప్పనాయడుసాళువమేక రాజు మట్లఅనంతరాజు తిమ్మరాజు వీరమరాజు మొదలైనవారున్ను బొంమ్మిరెడ్డి నాగారెడ్డి బసువారెడ్డి మొదలయిన రెడ్డికొమాళ్ళున్ను కమ్మనాయకులు విఠలప్పనాయడు అల్లుంఢ్లుకొమాళ్లు రాచరికం మొదలైన అమరనాయకంవాళ్లు ౘన్నరప్పించ్చి వారివారి యోగక్షేమాదులు అడిగి మీవద్ద యేనుగ గుర్రాలు బంట్లు పరిజనాలు యెంత్తవున్నదని అడిగినందులకు విఠలప్ప నాయని స్థానాపతులున్ను పరశురామనాయడి తెగాను అమరగాళ్లు స్థానాపతులలోవీరభద్రయ్యఅనే ఆయనాను దళపతిరాయడున్ను రాయులవారితోను స్వామివారు

1 తిమ్మప్ప.

్తై జీతం కట్టిన వెనక అమరవృశీమలకు నగరి లెఖ్ఖల ప్రకారానకు కుంద్దకం లేకుండా వారువాల్లును యేనుగగుర్రాలు రావుత్తులు మావుత్తులు బంట్లు పరిజనములున్ను సంత్తరించ్చినారు యిన్నాళ్లవలె కాదు స్వామివారు యేవ్యాళ రాచకార్యానకు ఉమ్యుక్తులై లెకదులుదురు అనిన్ని చిత్తంవచ్చినప్పుడు గణితి బెట్ట కరణీకులకు ఉత్తరవు యిచ్చి వారు వచ్చి గణితి పెట్టినప్పటికిన్ని నగరి లెఖ్ఖకన్నా పదేశి యేనుగులున్ను నూరేశి గుర్రాలున్ను వెయ్యిమనిషి బంట్లున్ను అధికముగా వుండ్డవలెనని సంత్తసించ్చినారు స్వామివారి సొమ్ము ఇన్నాళ్లు ప్రసాబడ్డంద్దుకు నగరి అవసరకార్యాలకు చిత్తం రా నడిచే వారై యున్నారు అని విన్నపం శేశినంద్దులకు రాయల వారు చాలా సంతోషపరులై అమరగార్లతోను నిండ్డుకొలువై వుండ్డగా అయ్యానమలక అంకుశరావుతోను మీరు విజయాపురాన బహుదినాలు వుంట్టిరి గనక మొదుల సాహువారి దొరతనముకన్నా మీ దొరతనం పూర్వమైనది అని విండ్డము వారిపూర్వోత్తరములున్ను నిజాంశావు కుతుపనమలక వారి వర్త్తమానములున్ను మీరు దెలిశివుండ్దురు గనక వీరలకు దొరతనం వచ్చే దేరీతు అని అడిగినంద్దులకు అయ్యానమలక రాయలదేవునితోను విన్నపం శేసిన వివరం అశ్వపతి గజపతి నరపతి యీమూడు సింహాసనాలకు గల రాజ్యములో ఢిల్లిసురధాణికిన్ని వోరగంటి ప్రతాపరుద్రునికిన్ని గాక పదిహేను సంవ్వత్సరములు పోరాడెను అంతట దుర్గాలలోనున్ను కోటలోనున్ను రస్తుసామగ్రీలు సరిపోయి గనక ప్రతాపరుద్రుండ్డు ప్రజలను వూరకే చంప్పేది ధర్మంకాదని వెలుబడి సమరం శేయగా దైవగతిని ఢిల్లి

ఢిల్లిలోనున్న ప్రతాపరుద్రుని వృత్తాంతము.

సురధాణిచాతను ప్రతాపరుద్రుండ్డు తగిలెను గనక జయభేరి వేయించ్చి ఢిల్లికి కొంచ్చుపొయనని ఆ సమాచారము విని సురధాణితల్లిగారు ప్రతాపరుద్రుణ్ణి చూడవలెనని కొడుకును అడుగగా ఆయన వొఖనాడు నిద్రపొయ్యేటప్పుడు చూడమని చెప్పినాడు గనక ఆతీరున్ను ఆయమ్మ రాత్రివేళ నిద్రపొయ్యే సమయాన వోరగంట్టి ప్రతాపరుద్రుండ్డు మనుష్యశక్తిగాదు రుద్రాంశ త్రిశూల డుమరులతోడట్టు వుంన్నాడు అటువంట్టి రాజును నీవు పట్టుక రావచ్చునా అని అన్నంద్దులకు సురధాణి నవ్వి ప్రతాపరుద్రుండ్డు నిద్రబోగా చూస్తే మీకు యీశ్వరాంశమై కనుపట్టెగదా నేను నిద్రపొయ్యేటప్పుడు చూడుమూ అని చెప్పి అంప్పె గనక ఆ తెరంగ్గునను సురధాణి నిద్రపొయ్యేటప్పుడు చూడండా శేషశాయిగా శంఖచక్ర గదాయుధములతో లక్ష్మీసమేతుడై శ్రీవత్స కౌస్తుభముతోడట్టు విష్ణుస్వరూపమై కనుపట్టెగాబట్టి

ఆయమ్మజూచి ఆశ్చర్యబడి యింత్తటి వాడవుగావుంట్టే ప్రతాపరుద్రుంణ్ణి తోడుక వచ్చునా అనిమనస్సున యెంచి మర్నాడు ఢిల్లిసురధాణి తోను మీామహిమలు మీాకె తెలుసును ప్రతాపరుద్రుంణ్ణి పంత్తిబెట్టుక ప్రసాబడి బహుమాన సన్మానములు శేశి షారిగింట్టికి అంప్పితె నీకీర్తి శాశ్వతముగావుండ్డును అని తల్లిగారు చెప్పగా ఆతీరుగానె మంజ్జన భోజనాదులప్రతాపరుద్రుంణ్ణి తృప్తి శేయించిబహుమాన సన్మానములు శేశి వెరగంటికి అంప్పిరి గనక ఆవార్త్తలు విని వుండ్డురే గదా.

అహమ్మదానగర, విజాపురగోలకొండ రాజ్యవృత్తాంతము.

బెడదకోట బరీదు అనే ఆయన కొత్తరాజ్యమున్ను కొత్త దుర్గ్గాలున్ను ఆక్రమించ్చుక బలవంతుడై రాజ్యం శేస్తావుంణ్డును ఆయనవద్ద గింఢ్డిబెట్టుకవుండ్డగా అతగానికి యెదులశాహు అనే పేరు వచ్చెను డేగలపట్టుక వుండ్డగా నిజాంశాహు అనేపేరు వచ్చెను కుక్కలకాపాడేటందులకు చేర్వగాడై యుండ్డగా కుతుపనమలక అనేపేరు వచ్చెను యీాముగ్గిరిలో యెదులశాహు అనే ఆయన విజయాపురమున్ను నిజాంశాహు అనే ఆయన అహముదానగరమున్ను కుతుపనమలక అనే ఆయన గోలకొండ్డానున్ను యీామూాడు సంస్థానాలున్ను యేలుతావుండ్డురు బెడదకోట బరీదువారు వీరలదొరతనము లనంగా నూరేండ్లదనింన్ని వారిలో నిజాంశాహు పెద్దలు ఆతర్వాత యెదులశాహు ఆపిమ్మట కుతుపనమలక యీా క్రమాన సింహ్మాసనాలను ఉడుగర బహుమానం పక్కలాకులు నడుపుచు యీామూాడు యింణ్లనున్ను మంచ్చిగుఱ్ఱాలుగా లక్షగుఱ్ఱాలున్ను నూరు యేనుగ ఘట్టాలున్ను కాల్బలంయెలే రాజ్యముగాదు కొలిచేతురకలు లేరు కన్నాౕటకాన చతురంగ్గబలమున్ను కలదు గనక యిక్కడి జగడాల నేర్పు ఆదేశమువారు యెరుగరు అటుగనక కన్నాౕటకం వారి ముంద్దర కడమదొరతనాల వారు నిలువలేరు అని కన్నకార్యములు తెలిపినంద్దులకు అంకుశరావు జగదేవరావు పలకరించ్చినది సరె అనిమలకరావు జెప్పినది అని మొనలను తారశిల్లినప్పుడు తురకలు యెదురు బలమున్ను తనబలమున్ను జూచుక జగడం శేశేవి లేదు ముష్కరముగానడవగా యెదటివారు విరిగినట్టాయనా యెొద్దుబోయినా విడువక నరుకుదురు యెదటివారు హెన్మత్తుగా నిల్చినట్టాయనా వెనకబలిమాలుదురు ఆవర్తమానములు యెరిగి వాటికి పిన్నపెద్దలు నియ్యోగులు జగడం శేశేది కార్యంగాదు తీశిరమ్మంట్టే ఆక్షణమె తీశివచ్చే టింత్తేగాని అనిమొనలకువచ్చి వెనకతీశివచ్చినట్టు అయితే ప్రభుత్వానకు

కొదవగా అనేలభిమానము యెంచ్చి నిలిచేదిలేదు అటుగనక కన్నాటకంవారు విచక్షణులై కార్యాకార్యములు తెలిశి జగడమిచ్చి పోరాని కార్యమైతే యెమరెక్కి నడచి ఉత్తరింత్తురు, కాబట్టి ప్రభుశక్తిగలదు కాబట్టి బంట్లుబయిదళాలున్ను అంద్దరున్ను పనికివత్తురు అని తెలుపగా వద్దనున్న అమరనాయకంవారలు అంద్దరున్ను ఆలీరున్ను అవునని విన్నపం శేశినారు గనక రాయలవారు ముంద్దువెనకలు జగడాలు జంక్కేలు శేశి జయాపజయములలో వుంద్దినమీాకు లెస్సాయగా తెలుసును గనక తురకలమీాది కార్యం శేయువలసివుంన్నది అంద్దరున్ను తలలుకడుక్కొని పయునముళై వుంద్దుడా అని అంద్దరికింన్ని ప్రత్యేకం ప్రత్యేకంగ్గా ఉడుగర వక్కలాకులు యిచ్చి పంప్పినవారై అప్పాజిమొదలయిన ఆప్తులతో మాటలాడుతావుంద్దగా గజపతులరాజ్యంబు శ్రీపురుషోత్తమాన నుండ్డింద్ది వేగులవాయువేగి హనుమత్తయ్యాను మనోవేగి పురుషా మృగమయ్యాను వచ్చినిలిచి రాయలదేవునితో విం‌న్నపం శేశినారు గనక రాయలవారనిన వివరం విద్యానగరమంద్దునుండ్డి పయనగతుల తలిగా గజపతి రాజ్యంబ్బు శీమభూములున్ను చూస్తూ రాజమహేంద్రంవారు కటకము మొదలైనవి వీక్షించ్చి ముకుంద్ద బాహుబలేంద్రులు జగన్నాధాననుండ్డగా పురుషోత్తమానకుపోతిమి శ్రీకృష్ణదేవుని పట్ణం శృంగారమునకు, పద్యం

సీ. ఏవంకఁజూచిన హేమకుంభప్రభా మండితోజ్జ్వలసభామంటపములు।
నేవీథిఁజూచిన నిక్షురంభాస్తంభ దర్పణాంచితగృహద్వారభూమి।
యేచాయఁజూచిన నిభతురంగానేకరాహుత్త సుభటవిరాజితంబు।
నేదిక్కుచూచిన నేణనేత్రాకుచ ఘనసారమృగమదగంధలహరి।
యెచటఁగనుఁగొన్న నవరత్నఖచితరచిత। హాటకోన్నతవివిధశృంగారవనము
గలిగి చూపట్టు దేదీప్యకలితమగుచు। శుభకరంబుగఁ బట్టనశోభితంబు.

యిట్టిశృంగార శేఖరమైన పట్ణమంద్దు జగన్నాయకులు మహాపూత్సవమునకు దిగ్దేశములనుండ్డి వచ్చి గృహస్తులు యతీశ్వరులు వానప్రస్థులు బ్రంహ్మచారులు బ్రాంహ్మణోత్తములు పుణ్యాంగనలుంన్ను క్షత్రియులు వైశ్యులు శూద్రులు తక్కిన పదునెనిమిదిజాతులవారున్ను వచ్చి స్వామినిదర్శించ్చి స్వామియొక్క ప్రసాదం మీారువారనక స్వామిదేవళములో సృష్టిదోషం దృష్టిదోషం వర్ణాశ్రమ ధర్మానీత శుచి అశుచి కలియుగవైకుంఠమై వొప్పుతావుండ్డే ఆయొక్క శ్రీతారకబ్రంహ్మమైన జగన్నాధుల మహిమాను అస్తలం వర్తమానములున్ను

ప్రసాదప్రభావములున్ను వర్ణింప వెయ్యి శిరస్సులున్ను రెండ్లువేల జింహ్వాలును గల ఆదిశేషునకైన లెక్కింపసలవిగావు అన్నట్టు తోచును ముకుంద్దగజపతి వారు బ్రాంహ్మీముహూర్తాన నిదుర మేల్కాంచిన వారై విప్రవర్యద్వయదర్శనం శేశి షోడశపాత్రులున్ను తామున్ను నిత్యాసారిగా రెండ్దామడ మూడామడ దూరం పోయి తిరుగావచ్చి ముఖమజ్జన నామతీర్థమై గ్రహారాధన శేశి జగన్నాధులకు పూజావిధాన ప్రకారాన షోడశోపచారపూజలుంన్ను సహస్ర నామార్చన నైవేద్యాదులు శేశి దీపారాధన పుష్పాంజలి శేశి ప్రదక్షిణ నమస్కారములు శేశి పురము గృహం వెలువడి వచ్చేసమయాన పరదునేదాల్ల స్థానాపతులయిన అఘుపురంవారి అనంతోజిపంత్తులున్ను మానశింగ్గువారి మాధవయ్యాను చాంపువారి చెంన్నగిరయ్యాను కటకంవారి కరుణాకరయ్యాను వోరగంట్టివారి వోబళయ్యాను ఢిల్లి సురతాణివారి ఫాకోజిపంత్తులున్ను బెడదకోటవారి బేకోజిపంత్తులున్ను గోలకొండ్డవారి గోపాజీపంత్తులున్ను అహముదానగరంపయ్యాపరాజున్ను విజయాపురం వీరమరాజున్ను పురాణపురం పురంద్దరయ్యాను బాగానగరం బాబోజీపంత్తులున్ను మొదలుగాగల ముఖాములైన స్థానాపతులు అంద్దరున్ను ప్రాతఃకాలమంద్దు స్నానసంధ్యావందనాదులు ఆచరించ్చి తెల్లనిపట్టుధోవతులు కట్టుకొని చలువలు భయిరవాసలుగా వేసుకొని శుచిరుచి తోడట్టు దేవతార్చన సమయానకు వచ్చినవారై దేవపూజాగృహాంముద్దర లక్ష్మీచావడిలో కూర్చుండ్డగాను గజపతివారువచ్చి నవరత్నఖచితమైన బంగ్గారుపీటమీాద కూచుండి వారివారి పురాణీకులునున్ను పిలుపించ్చుక పురాణశ్రవణమైనతర్వాత ఆశ్శ్రితులైన విద్వజ్జనులుంన్ను ఆశీర్వచనపూర్వకముగా యిచ్చిన విభూతిగంధాక్షత నారికేళ లకుచఫలాదులు గజపతివారు రెండ్డు చేతులా అంద్దుకొని శిరసావహించి వారలకున్ను స్థానాపతులకున్ను జగన్నాయకప్రసాద పణ్యారములు వక్కలాకులుంన్ను యిప్పించ్చి వాలను విడిదీలకు పంప్పినవారై వేరొఖ్కబ్రాంహ్మని బిలిచి పాదప్రక్షాళనం శేశి గంధాక్షిత పుష్పములచేత లెస్సగా పాదపూజశేశి నూరు ఫొట్లుంన్ను వక్కలాకులుంన్ను యిప్పించ్చి ఆపాద తీర్థమున్ను పుచ్చుకొని ఆపాద రేణువు శిరసావహించి తర్వాత తాము పాదప్రక్షాళనం చేసుకొని ఆచమనం శేశినవారై బంధుజనులతోడట్టు బంగ్గారు పళ్లెరములు వుంచ్చమని ప్రసాపాటుకు కూర్చుం

న్నతావున వఖపదార్థమున్ను కొదవబడకుండ్డా సకలమున్ను వడ్డించ్చుమని ఆపం_క్తిని వొఖతావున తెరగట్టి ఆ తెరలో నవరత్నస్థాపితమైన పీఠమున సుఖాసీనులై కూచుండ్డగా పదివన్నె బంగ్గారున నూరు శేరుల శేయించ్చిన పళ్లెరమున్ను ఆపళ్లెరంమధ్య వెలహెచ్చు గోమేధికముంచ్చి పళ్లెరములో వడ్డించ్చి ప్రసాపదేపట్ల వఖతేప కలుపుకొన్న కూర మరివొఖతేప కలుపుకోకుండ్డా భక్ష్యాలలో వొఖసారి భక్షించ్చినది రెండ్డోతేప భక్షించ్చకుండ్డా శానిశెలు హెచ్చరికలుగా చూస్తూవుండ్డి పరాకున ముట్టినప్పటికిన్ని బెత్తపుకోలచేత హస్తము మీద స్పరిశించ్చి ముట్టవలదు గనక ఆరీతె తిరుగా అంట్టక ఆరోహణం శేశి యీరీతున సకలవస్తువులున్ను భుజియించ్చి లేచినపిమ్మట చేతులు గట్టుకొని శతపదాలు నడుస్తున్న సంక్షేపరామాయణం పారాయణం అయిన తర్వాత వస్త్రాభరణాలంకారులై పేరోలగంబై సకలమైన వారున్ను నగరివాకిట కూర్చుండ్డి వుండ్డగా గజపతివారు వఖఅంతస్తు చావళ్లోనికి వచ్చి కూర్చుండి రెండ్డువిని యోగముల వారున్ను పిలుపించ్చి వారువారు వుండతగిన వునుకులు కూర్చుండ్డనియమించ్చి ప్రస్తావోచితముగా షోడశపాత్రులతోనున్ను పరస్థలవునియ్యోగులతోనున్ను సంభాషణ శేయగా నిజాంశాహువారి నీలాద్రిపంత్తులువారున్ను మెదులశాహు కుతుపనమలక వారి స్థానాపతులున్ను అంప్పించ్చిన కాకితములున్ను కన్నాటకాధీశ్వరులు కార్యముఖానకు నడిచే వారై చతురంగబలమున్ను జతశేసుక బైలుమెరసి సరుదులకువచ్చి కనుపించ్చుకునేవారై వున్నారు యీవరకు ఉత్తరం దక్షిణం దొరలకార్యాలకు హానివృద్ధులకు సహాయం సంపత్తి నడువుదురు. ప్రబలమైన కార్యాలైతే అంద్దరున్ను ఎకగ్రీవమై ఉత్తరం అఘుపురంవారి కార్యాలకున్ను నిర్వహింత్తురుగా యిప్పుడు అంతేశి కార్యాలు యేమి వున్నవి సరుమన వుండ్డేవారు గనక యితరం గాదు గదా మెదులశాహున్ను నిజాంశాహున్ను కుతుపనమలకవారున్ను సరదుస్థలాలు స్థోమశుద్ధిగా యోచనశాయగా పనిలేదు అంద్దుకు మించ్చిన కార్యాలయితె అహాముదు నగరం పర్యంత్తం వత్తురు అని ఘనంగ్గావ్రాశి అంప్పినారు మనుష్యయత్నమున అపజయమని యెంచ్చరాదు కన్నాటకవారికి జయం నిశ్చయం అయినప్పటికిన్ని సరదుల మూడు తెగలవారున్ను విరిగినట్టైతె మీ శీమలన్నిన్ని కోలుబోయి మీకున్ను అవధివచ్చును కాబట్టి దీర్ఘయోచన విచారించ్చుకొని యాదిహెచ్చరికలు గలిగి నడిపించ్చుకోవలెను అని మంత్రాలోచనగా అన్నం

(సశేషము.)

శ్రీ ర స్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తృతీయవార్షిక సభావృత్తాంతము.

ఆంధ్రసాహిత్యపరిషత్తృతీయవార్షికసభ కాకినాడలో ఆ 1914 సంవత్సరము ఏప్రిల్ ది 18-19 తేదులను బహువైభవముగ జరగినది. ది 18 తేది మధ్యాహ్నము రెండుగంటలకుఁ దత్పురపారిశుధ్య సంఘమువారి నూతనవిశాల భవనమునఁ బ్రారంభింపఁబడినది. ఆంధ్రలోకమునం దన్నివైపులనుండి (గోలకొండరాష్ట్రమునుండికూడ) భాషాభిమానులు సభాభవనము క్రిక్కిఱియునట్లు విచ్చేసియుండిరి. అప్పుడు విచ్చేసినవారి సంఖ్య 1500 కుఁ దగ్గియుండదు. కొందఱు స్త్రీలుగూడ వచ్చియుండిరి. సభ నలంకరించిన ప్రముఖులలోఁ గొందఱ పేళ్లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

మ-రా-రా-శ్రీ రాజారావువేంకటకుమారమహీపతిసూర్యరావుబహద్దూర్‌గారు పిఠాపురము రాజాగారు.

,, మొక్కపాటి సుబ్బారాయఁడుగారు. బి. ఎ. దివాన్, పిఠాపురము.

,, గౌరవనీయ, శ్రీ. కె. ఆర్. వి. కృష్ణరావుబహద్దూర్‌గారు బి. ఎ. కాకినాడ.

,, నెమలి పట్టాభిరామరావుపంతులుగారు బి. ఎ. చెన్నపట్టనము.

,, దివాన్‌బహద్దూర్. ముట్నూరి ఆదినారాయణయ్యగారు, చెన్నపట్టనము.

,, చెదలవాడ సుందరరామశాస్త్రిగారు, చెన్నపట్టనము.

,, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.

,, రావుసాహెబు. జి. వి. రామమూర్తిపంతులుగారు, బి. ఎ. విజయనగరము.

,, జి. వి. అప్పరావుపంతులుగారు, బి. ఏ. విజయనగరము.

,, టి. శంకరలింగంపిళ్లెగారు, బి. ఏ. బి. ఎల్. బల్లారి.

,, నాభిరామమూర్తిపంతులుగారు. బి. ఏ. బరహాంపురము.

,, ఆయుర్వేదమార్తాండభిషజ్మణి పండిత, డి. గోపాలాచార్యులుగారు చెన్నపట్టనము.

మ-రా-రా-శ్రీ వావిలికొలను సుబ్బరావుగారు, చెన్నపట్టనము.
,, మేడేపల్లి, వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.
,, కే. వి. లక్ష్మణరావుగారు, ఎం. ఏ. నడిగూడెము.
,, డాక్టరు. ఆచంట, లక్ష్మీపతిగారు. బి. ఎ. ఎం. బి. అండ్. సి. ఎం. చెన్నపట్టనము.
,, పురాణమునాగభూషణంగారు ఎం. ఎ., బి. ఎల్, చెన్నపట్టనము.
,, తెల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, కొవ్వూరు.
,, డి. వి. రమణరావుపంతులుగారు, తణుకు.
,, జి. యేనాదిరెడ్డిగారు. కోత్తూరు.
,, రావుబహద్దూర్, కె. సూర్యనారాయణమూర్తినాయుడుగారు, కాకినాడ.
,, డి. వి. యెస్. ప్రకాశరావుగారు, బి. ఏ. కాకినాడ.
,, రావుబహద్దూర్. కె. రామానుజాచార్యులుగారు ఏం. ఎ., బి. ఏల్. విజయనగరము.
,, పేలమూరి వేంకటసుబ్బరావుగారు. బి. ఏ., బి. ఎల్. పెద్దాపురము.
,, కూచినరసింహముగారు, బి. ఏ. పిఠాపురము.
,, జయంతి రామయ్యపంతులుగారు. బి, ఎ., బి. యెల్. చెన్నపట్టనము.
,, దినవహి హనుమంతరావుగారు. బెజవాడ.
,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, రాజమహేంద్రవరము.
,, పాడి వేంకటస్వామిగారు, కాకినాడ.
,, శొంఠి భద్రాద్రిరామశాస్త్రిగారు, ఉర్లాము.
,, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, పిఠాపురము.
,, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. రాజమహేంద్రవరము.
,, } శ్రీరామకృష్ణకవులు, పిఠాపురము.
,, }
,, దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు, కాకినాడ.
,, దివాన్‌బహద్దూర్, డి. శేషగిరిరావుపంతులుగారు. బి. ఎ., బి. ఏల్. కాకినాడ.
,, న్యాపతి సుబ్బారావుపంతులుగారు. బి. ఏ., బి. ఏల్. రాజమహేంద్రవరము.
,, ఎఱ్ఱమిల్లి, మంగయ్యగారు బి. ఏ., బి. ఎల్. కొవ్వూరు.

మ-రా-రా-శ్రీ శ్రీమునగాలరాజాగారు.

,, గంటిలక్ష్మన్నగారు. బి. ఎ., బి. ఎల్. రాజమహేంద్రవరము.

,, రావుబహద్దూర్, ఆనరబిల్. యం. రామచంద్రరావుపంతులుగారు బి. ఏ, బి. ఎల్. ఏలూరు.

,, శివపురపు వీరభద్రపాకయాజిగారు. హైదరాబాదు.

,, తాడూరి లక్ష్మీనరసింహారావుగారు, పిఠాపురము.



,, పెద్దిభట్ల వీరయ్యగారు. బెజవాడ.

,, వి. విశ్వనాథశర్మగారు. ఏం. ఎ. రాజమండ్రి.

,, శ్రీరాజావిక్రమదేవవర్మబహద్దరుగారు. విశాఖపట్టనము.

,, కే. వి. శ్రీనివాసాచార్యులుగారు బి. ఏ. పెద్దాపురము.

,, వావిలాల వేంకటశివావధానిగారు. బి. ఎ. విశాఖపట్టనము.

,, నోరిరామశాస్త్రిగారు. బెజవాడ.

,, చల్లా వేంకటపేరయ్యశాస్త్రిగారు బి. ఎ. కాకినాడ.

,, జయంతి శ్రీరామమూర్తిగారు. విశాఖపట్టనము,

,, పి. వీరరాఘవులుగారు. తెనాలి.

,, కొంపూరి సుబ్బారావుగారు. తిరుపతి.

,, కే. సాంబశివరావుగారు బి. ఎ. కాకినాడ.

,, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రులుగారు. విజయనగరము. (మొదలైనవారు.)

కార్యారంభమునకు ముందు శ్లోకరూపముగ మ॥ రా॥ నాభిరామమూర్తిపంతులు బి. ఏ. గారు దైవప్రార్థనముంజేసిరి. పిదప గౌరవనీయులు, పోలవరాధిపతులు, నాహ్వానసంఘాధ్యక్షులు నగు శ్రీరాజాకొచ్చెర్లకోట రామచంద్రవేంకటకృష్ణరావు బహదరు బి. ఏ. గారు తమ మృదుమధురవాక్యములతో సభ్యులకు స్వాగతమొసంగిరి. అనంతరము విజయనగరము సర్వకలాశాలా ముఖ్యోపాధ్యాయు లగు రావుబహాదరు కిలాంబి రామానుజాచార్యులు ఎం. ఏ., బి. ఎల్ గా రగ్రాసనాధిపత్యమును వహించిరి. పిమ్మటఁ దాము సభకు రాఁజాలకపోయితిమనియు జయప్రదముగ సభ జరగుఁగాక యనియు శ్రీవేంకటగిరి మహారాజావారును గౌరవనీయులగు శ్రీపానుగంటి రామారాయనింగారు ఎం. ఏ., రావుబహాదరు కందుకూరి వీరేశలింగముపంతులుగారును బంపిన తంత్రీ

వార్తలు చదువఁబడినవి. పిమ్మట నాచార్యులవారు భాషావిషయకోపన్యాసముం జదివిరి. పరిషత్కార్యనిర్వాహక సభాధ్యక్షులగు జయంతి రామయ్య పంతులు బి. ఏ., బి. ఎల్ గారు తృతీయసంవత్సర కార్యనివేదనముం జదివిరి. వావిలికొలను సుబ్బరావుగారు "దాశరథిభ్భరతగుణవర్ణనమును" గుఱించియు, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రులుగారు "మహాపురుషుల చరిత్రములం జదువుట యందలి యావశ్యకతం" గూర్చియు, కాళ్లకూరి సాంబశివరావు బి. ఏ. గారు "విమర్శనాస్వభావము, దాని లాభముం" గూర్చియు వ్యాసములం జదివిరి. సభాధ్యక్షులకు వందనములతో నాఁటిసభ ముగిసెను.

మఱునాఁడు (19-4-14) ఉదయమున నేఁడునరగంటలకుఁ బరిషత్కార్యనిర్వాహకసభ జరగినది. శ్రీ పిఠాపురము రాజాగారగ్రాసనాధిపతిగ నుండిరి. ఈ సభలోఁ బెక్కురు క్రొత్తసభ్యులు చేర్చుకొనఁబడిరి. కాకినాడపురవాసులును రావుసాహేబు బిరుదాంకితులును నగు మ. రా. పైడా వేంకటచలపతిగారు పరిషత్తునకుఁ బోషకులుగా నుండి రు 1000 లిచ్చుటకు వాగ్దాన మొసంగిరి. ఇటీవలఁ గొంతకాలమునుండి యాంధ్రుల మనస్సుల నావరించియున్న గ్రామ్యగ్రాంధికాంధ్రతారతమ్యమును గూర్చిన చర్చ జరగినది. ఈ విషయమునుగూర్చి యాలోచనచేసి తమ యభిప్రాయమును దెలుపవలసినదిగా నొక యుపసంఘము కొంతకాలముక్రిందట నియమింపఁబడి యున్నదనియు నా సంఘములోని సభ్యులు తమ యభిప్రాయమును దెలిపియుండలేదు గనుక వారి యభిప్రాయము తెలియువఱకు నీ చర్చ నిలుపవలయుననియు రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారు, గురుజాడ అప్పారావుపంతులుగారును వాదించిరిగాని సభవారందున కంగీకరింపక 1912 సం. మేనెలలోఁ జెన్నపట్టణమునందు జరగిన పండితగోష్ఠి యొక్క యభిప్రాయమే యీ పరిషదభిప్రాయముగ గ్రహింపవలసిన దనియుఁ దీర్మానించి యీ తీర్మానము విశ్వవిద్యాలయాధికారులకును, విద్యాధికారి గారికిని, దొరతనమువారికిని దెలుపవలయు నని నిర్ణయించిరి. పూర్వోక్త పండితగోష్ఠిలో జరగిన తీర్మానములు పరిషత్పత్రిక ప్రథమసంపుటము ప్రథమసంచికలోఁ బ్రకటింపఁ బడినవి. పాఠకసౌకర్యార్థ మీక్రిందఁ నుదహరింపఁబడినది.

తీర్మానములు.

"1. గ్రామ్యభాషా ప్రయోగము.

గ్రంథరచనయందుఁ బూర్వలాక్షణిక మతానుసార మగు భాషను బ్రయోగింపవలయునుగాని లక్షణవిరుద్ధమగు భాషను బ్రయోగింపఁగూడదు.

గ్రంథములను మృదుమధురశైలిని రచింపవలయుననుట సర్వజనసమ్మతము. అ ట్లొనరించుటకు లక్షణభంగ మవశ్యముకాదు. లక్షణభంగము కాకుండ భాషా వైచిత్ర్య మెంతయైనం గనుపఱుపవచ్చును. అందువలన శైలిభేదము లేర్పడును

2,3, అర్ధానుస్వారము, శకటరేఫము:

అర్ధానుస్వారశకటరేఫములు శబ్దస్వరూపావయవములగుటను శబ్దవ్యుత్పత్తుల నిరూపించుటకు సాధనము లగుటను త్యాజ్యములు కావు.

4. సంధి:—

గద్యరచనయం దచ్చటచ్చట నర్థావబోధనార్థమును, బఠనసౌకర్యార్థము నవశ్యమని తోఁచినపట్టులందు సంధిచేయకున్నను దోషము కాదు, కాని సంధి యెప్పుడును జేయనక్కఱలేదని వాదించువారి వాద మంగీకార్యము గాదు. సంధిచేయుటయుఁ జేయకుంటయుఁ, గొంతవఱకుఁ బాఠకాధికారము ననుసరించియుండును. పసిపిల్లలనిమిత్త ముద్దేశింపఁబడిన పుస్తకములందు శాస్త్రవిరుద్ధము గాకుండ సంధిని తగ్గించుట మంచి దనియే చెప్పవచ్చును. పద్యరచన యందు సర్వథా విసంధి దుష్టమే.

5. అన్యదేశ్య పదప్రయోగము:——

పూర్వకవిమతానుసారముగా రసపోషణమునకై యచ్చటచ్చట యథోచితముగా నన్యదేశ్యపదములం బ్రయోగింపవచ్చును. కాని యథేష్టముగాఁ బ్రయోగింపఁగూడదు. అన్యభాషలలో నుండు భౌతికశాస్త్రాది గ్రంథములఁ దెలుఁగులోఁ బరివర్తనము చేయునపుడు తత్తచ్ఛాస్త్రోచితపారిభాషిక పదంబులు తెనుఁగునఁ గాని సంస్కృతమునఁ గాని సిర్ణయించి వానినే యుపయోగింపవలయును. ఏకపదములు దొరకనిచో నాతిదీర్ఘసమాసపదంబుల నిర్మింపవచ్చును, అట్లొనర్చుటకు సాధ్యముకానిచో నన్యదేశ్యమూలపదంబుల నాంధ్రభాషా సంప్రదాయానుగుణముగా సంస్కరించి గ్రహింపవచ్చును. పారిభాషిక పదములు సంస్కృతమున నుండినచో భరతఖండములోని యన్నిభాషలకును సమానములుగా నుండును గాన నట్టిపదములు బహుశః సంస్కృతములోనే యుండుట మేలు. ఆంధ్రసాహిత్యపరిషత్తువా రట్టిపదముల నిర్ణయించి ప్రకటించిన బాగుండును."

ఇఱువదిమందికంటె నెక్కుడు గల యీసభలో నలుగురుమాత్రము భిన్నాభిప్రాయు లుండిరి. వారిలో ముగ్గురు విజయనగరమునుండి వచ్చినవారే.

ఆనందసంవత్సరమున శ్రీపిఠాపురము రాజావారు సభాపతిగ నుండునట్లు తీర్మానింపఁబడినది.

ఆనాఁడుదయమున నడచిన కార్యవిచారశేషము సాయంకాలమునఁ గూడ నడపఁబడినది. అందు మున్నిటివలెనే యిప్పుడుఁగూడ జయంతిరామయ్యపంతులు బి. ఏ., బి. ఎల్ గారు పరిషత్కార్యనిర్వాహకసభాధ్యక్షులుగను, సెమలిపట్టాభిరామరావు బి. ఏ. గారును, పురాణము నాగభూషణము, ఎం. ఎ., బి. ఎల్ గారును, ఆచంట లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. యమ్‌గారును గార్యదర్శులుగను, దివాన్ బహదరు కంచికృష్ణస్వామిరావు సి. ఐ. ఇ. గారు, రావుబహదరు, గౌరవనీయ, పిట్టి త్యాగరాయసెట్టి బి. ఏ. గారు, కోశాధ్యక్షులుగను నెన్నుకొనఁబడిరి.

ఆనందసంవత్సరాయవ్యయనిర్ణయము చేయఁబడినది. గతసంవత్సరమునందువలెనే పుస్తకసంపాదనమును, నిఘంటు నిర్మాణము జరగునట్లును, లోకములో నచ్చటచ్చట వ్రాఁగూపముగ వ్యాపించియున్న పాటలు, పదములు మొదలగువానిని వ్రాయించునట్లును, ఇంతటినుండి పరిషత్పత్త్రిక మాసమున కొకసారి వెలువడునట్లు నేర్పాటు చేయఁబడినది.

ఈనాఁటి భాషావిషయకసభ మధ్యాహ్నోత్తరము గం. 2-30 మొదలు 5 గంటలవఱకు జరగినది. శ్రీపీఠికాపుర నృపాలుఁడు సభాపతిగ నుండెను. అందు పురాణపండా మల్లయ్యశాస్త్రులుగారు గ్రాంథికవ్యావహారికభాషాపరస్పరసంబంధముం గూర్చియు, ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులుగా రాయుర్వేదీయ యంత్రశస్త్రములం గుఱించియు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు గ్రహణములం గూర్చి జ్యోతిశ్శాస్త్రమునందును బురాణములయందును జెప్పఁబడినదాని సమన్వయమును గూర్చియు, మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు కాశ్మీరరాజచరిత్రముం గుఱించియు వ్యాసములం జదివిరి. వ్యవధి చాలనందున యుద్ధమల్లుని బెజవాడ శాసనముంగూర్చిన యుపన్యాసమును జయంతి రామయ్యపంతులుగారు చదువలేదు. ముట్నూరి కృష్ణారావుగారు సభకు రాఁజాలని కారణమున దేశీయవాఙ్మయప్రపంచవ్యాసము చదువఁబడలేదు. అనేకకవులు పరిషత్తుపైఁ బద్యములు జదివిరి. వానినీ వ్యాసాంతమునఁ జూడనగును. ఈసభ రెండుదినములలోఁ జదువఁబడిన వ్యాసములును గొన్ని యీ పత్రికయందే క్రమక్రమముగఁ బ్రకటింపఁ బడును.

ఆనాఁటి సభ ముగియునపుడు బల్లారిలోని యున్నతన్యాయవాది శిఖామణియు, వేదార్థచంద్రికాపత్రికాధిపతియు నగు టి. శంకరలింగం పిళ్లె. బి. ఏ. బి. ఎల్‌గారు మనోహర మృదువచనరచనతో నాంధ్రభాషాపోషకుఁడైన కృష్ణదేవరాయల రాజధానియగు హంపికిసమీపమందున్న తమబళ్లారిపురమందుఁ బరిషచ్చతుర్థవార్షికసభ కూడవలయు నని కోరిరి. పరిషత్పక్షమునఁ దదాహ్వానము నంగీకరించుచు వారికిని ఘనాదరముఁ జూపిన కాకినాడ పురవాసులకును జయంతి రామయ్యపంతులుగారు వందనముల నర్పించిరి. సభాధ్యక్షులకు, సభ్యులకుఁ, దమకార్యాలయము నీసభకై యొసంగిన పురపారిశుధ్య సంఘాధ్యక్షులకును వందనములతో నాఁటిసభ ముగిసినది.

ఈసభ రెండుదినములు మిగుల నుత్సాహముతో జరపఁబడినది. వాదప్రతివాదములు, వ్యాసపఠనము మున్నగునవియెల్లఁ దెనుఁగుభాషలోఁ గావింపఁబడియెను.

కాకినాడ పౌరవర్యులు, నాహ్వానసంఘమువారు, సభకై వచ్చినవారి నత్యంత భక్తిశ్రద్ధలతో నాదరించిన విషయము శ్లాఘాపాత్రమైనది. ఈసభను గాకినాడ కాహ్వానించి యాదరించి, చక్కని యేర్పాటులతో సభజరపించిన రావుబహాదరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారును, నాళము పద్మనాభము బి.ఏ. గారును మిగుల నభినందనీయులు.

---

## కాకినాడపరిషత్సభలోఁ గవీశ్వరులు చదివినపద్యములు.

---

1. (చివుకుల వేంకటాచలశాస్త్రిగారు- సికింద్రాబాదు.)

ఆంధ్రబ్రాహ్మస్థితి.

చ. చలువలఱేనిఁబోని మెయిచాయయు, గిల్కుగిలుక్కుచప్పుడుం
బలుకుహారంగుమట్టెలును, బల్కులపుల్గు, పసిండివీణెయుం
దలఁపుఁగొలంకుపక్కి నెఱతత్తడి, పొత్తము, తమ్మిగల్గునో
పలుకులలేమ! మాదు తలవాకిట గొండిలిసల్పుమమ్మరో! 1

ఉ. శ్రేష్ఠుఁ డశేషసద్గుణగరిష్ఠుఁడుఁ బ్రేష్ఠుఁడునైన యానుర
జ్యేష్ఠునిచిత్తమందు జనియించి నిరంతరవేదపాఠబృం

దిష్టములొ తదీయముఖ నీరజపాళుల సంచరించుచుస్
స్వేష్టసుఖంబు నీవనుభవించితి వాదిని భారతీసతీ! 2

శా. శాంతంబైన వనాంతరాళమున వాసంబుం దగం జెంది య
త్యంతం బాత్మమహత్త్వబోధ జనితాహ్లాదంబుతోనుండు సు
స్వాంతుల్పూజ్యులు వామలూరుతనయ వ్యాసాదివాచంయముల్
సంతోషమ్మును నీకుఁగూరిచిరి భూషల్వెట్టి యోభారతీ! 3

సీ. కమలకేళీలోలకలహంసకాకలీకలకలవ్యాకులజలసరములుఁ
దరుణారుణాక్షీణ కిరణశోణకిసాలగిళనసుస్వానకోకిలకులములు
మందానిలాందోళితేందీవరస్పందదిందిందిరామందబృందములును
గుంజపుంజగ్రస్తమంజరీసంజాతమంజులశయ్యాశుమాతలములు
గలుగునుపవన మొనఁగుసౌఖ్యంబు నేని, యత్కవిత్వపతితలు దామతకరింతు
రట్టిభాసకకాళిదాసాదికవుల, యాదరమ్మును బడసితివమ్మవాణి! 4

ఉ. అంతఁ దెలుంగుదేశమున కల్లన డిగ్గి త్రిలింగవాణివై
యెంతయు నన్నయాదికవు లిద్ధమతిం గయిసేయ సుంతయుం
జింతయెఱుంగ కాంధ్రధరణీజనులం భ్రమదోర్మిమాలికా
దంతురితాంతరంగసముద్రగులఁ జేసితి వాసరస్వతీ! 5

మ. తరువాతం గవిచాతకంబులకు నూత్నాసారమై మూరురా
యరగండర్బిరుదంపుఁ బెండరము జంఘాగ్రంబునందాల్చి బం
ధురకీర్తింగను కృష్ణరాడ్వరుఁడు నిన్నుం సింగపుంగద్దె న
బ్బురమేపారఁగ నుండఁజేసి దయతోఁబోషించె భాషాసతీ! 6

ఉ. ఆవెనుక న్నినుంగను మహాశయు లెందువసింపకుంటచే
జీవితమందె సంశయముచెంది యొకానొకమూల నీవు చిం
తావికృతాకృతిన్వఱలఁ దత్సమయంబున నాంగ్లరాజు లు
చ్చావచయత్నము ల్మిగులఁ జల్పిరి నీయభివృద్ధికమ్మరో! 7

చ. నకనకలాడుభాసయెలనాఁగకు నీ కిల హూణపాదభృతిర్
గకవిక యీఁగికొండొక సుకంబుతలర్ వెలిపుచ్చుపట్టునం
గొకిబికిక్లైసరు ల్వెడలి గొగ్గికవిత్వముఁ జెప్ప నూల్కొనం
జికమక సెందఁగావలసెఁ జీటికి మాటికి నిద్దపు సత్కవుల్.

సీ. వారియొంకన దోస్తిదారుడా యిందంక యేమనో గాలొల్లియెరక జెయుఁర
వరె యీరనానీకు మరియేంగదా అంటె యినిపిస్తిగదిసాలె మినురబాష
పోదుగాలమాగొల్లపొల్ల బల్రదిపెర్గు పోస్తదిలేదాంతొ నాస్తజేశి
దుకునంకుబెద్దొల్లతొల్కుపోఁయ్ తామాశథాండ్లన్ని జూయించిఅండ్లవొకటి
కొంటబోఁయ్ కుడితిసీల్గుట్టిస్తె దర్జోడు గుడ్డగొట్టేశిందు కొంతదాంళ
అదెపాయె పోనీయుమంటరు మావ్రొల్లు చైసుంద్రిమీకేమిశాతగాదు
అనినేను సాల్లిగాడునుబోయి అడిగితేఅంటమగద దర్జిపెంటుగాడు
నాయంటివ్రాల్లకు నూరతొంబయ్యారు మందికిగుట్టనామాటఅనరు
బడెబుద్దిమంతుడా పదు దున్య లెక్కడింతోడు లేడేహెయినిం కూకె వుందు
అనివాడు పెంటుఁగా డన్నంకకన్గొడ్డి లాతిచ్కొమంట సాల్లుకునునేను
అజ్జూశిసాల్లిగాడప్డ కొఢ్ఘాబోల్కె కర్చుకిచ్చిందు నాగైదు లాస్గ
నాల్గుధప్పాల నానంగ యీనంగ సేరోకాయ్ చిరోకాయ్ చిరుంజికొట్టి
వానిరోగమప్డ బడెబాగతింపితి, గప్పుడంతబట్ట వొప్పజెప్పె
గిల్లగిల్లమాకు కొట్లాటయియ్యాల, పెద్దదైంది యింళపొద్దుమూకె. 9

ఉ. ఇట్టి నికృష్టగ్రామ్యముల నేర్తెలుఁగూర్చి సమస్తగ్రంథముల్
నెట్టనవ్రాయనా ననుమనీషులు కొందఱుఁ, బ్రాసముల్ యతుల్
గిట్టవటంచు వాకొనెడు కృష్టులుకొందఱు, సంధు లూడఁగాఁ
గొట్టుట మంచికార్యమనుకోవిదులు న్మఱికొంద ఱమ్మరో! 10

సీ. రీతులన్నను వంకమూతివెట్టెడువారు వృత్తు లన్నను మోవి విఱుచువారుఁ
శాకద్వయం బన్న నోకిలించెడివారు ధ్వనులన్న దుఃఖుచే కొనెడివారు
శయ్య యన్నను జాలుచాలు లెమ్మనువారునౌచిత్యమన నవ్వునట్టివారు
లసదలంకృతులన్నఁ బసలే దనెడివారు సమసనం బనఁ గేలిసలుపువారు
సంస్కృతంబన్న నింకొకసారి యటులఁ, బలుకఁబోకుఁడటంచును దెలుపువారు
బయలుదేఱిరి కొందఱు ప్రకృతమందు, భారతీనీవు కళవళపాటుఁజెంద. 11

క. నెఱిఁగూరుచు సింగారం, బఱసున్నలు బండిఱాలు నఱిముఱినీకుఁ
జెఱుపని వచియింతురుకొం, దఱు తమకుం దోఁచినట్లు తల్లీ! వాణీ! 12

ఉ. ఒప్పులకుప్పనై తొలుత నుబ్బిననేనిపు డక్కటక్కటా!
తప్పుల కుప్పనై తినిగదా యని డెందము నందు నెంతయుం

డెప్పరమైనపిమ్మట ఘటింపకుమమ్మ! మనీషు లెందు ని
న్నొప్పరికించి యొక్క త్రుటియు న్వసియింపరు నమ్మ మమ్మరో! 13

చ. అలికులముల్ సరోజమునయందునఁ బర్వఁగ నీయకమ్మ! క్రొ
న్నెలనలినంబునందు శయనింపఁగఁ జేయకుమమ్మ! గట్టులం
గలువలనుండి ముత్తెములఁ గారఁగ నీయకుమమ్మ! యింక ని
చ్చలుఁ జెలువారు నాంధ్రపరిషత్తు నినుం గనునమ్మ! భారతీ! 14

శా. నీనేమం బరయంగ నాంధ్రపరిషన్నిర్మాణముం జేసి మ
ద్రాసన్ పట్టణమందు రాజులును విద్వాంసు ల్కవీంద్రు ల్మహో
ల్లాసప్రక్రియఁ జూచుచుండ నిఁక నేలా? చింతిల న్నీవు, సం
త్రాసంబున్విడి నిర్విచారముగ నుండం జెల్లదే? తల్లిరో! 15

క. సురతరుపుష్పరసంబునఁ, గరము రసాలఫలరసము గలిసినసుభవ
త్సురుచిరవాగమృతపుమా, ధురిఁ బెరయదిఁ గిట్టి నిన్నుఁ ద్రోతురె విబుధుల్.

ఉ. ఒక్కొకపట్టనంబునన యుంటివి మున్నతివృద్ధితోడ ని
ప్పెక్కుడఁ గాంచిన న్మిగుల వృద్ధిని జెందుచు నుంటివైననుం
జక్కఁగఁ బూర్వ సూరులకుఁ జాలరు నేటి మనీషు లింక నీ
యొక్కకొఱంత యే, యదియు నొయ్యనఁ దీఱకపోదు భారతీ! 17

చ. కవివరు లెల్లఁ బూర్వమునఁ గావ్యపురాణములన్ రచించుచున్
బ్రవిమలమైన భూషణపరంపరఁ దాల్చిరి నేఁటిసత్కవుల్
నవలలు నాటకంబులును నాణె మెలర్పఁగఁ గూర్పనీవిఁకన్
నవనవభూషణంబుల ఘనంబుగఁ దాల్చుచుఁ గుందనేఁటికిన్. 18

మ. "అతుల ప్రాభవులౌ నృపు ల్మను సముద్యద్దీప్తిమై గొల్వ ను
న్నతిగా వారిసభాంగణంబులను సన్మానంబునుం గాంచు నా
స్థితి నేఁ డీగతినయ్యె" నంచుమదిఁ జింతింపంగఁ బోకమ్మ! యు
ద్ధతులౌ రాజులు నేఁటికిం గలరు నీ దైన్యంబుఁ దప్పింపఁగన్. 19

శా. తల్లీ నీయభివృద్ధికోసమయి ముద్రాయంత్రము ల్వార్తలు
ద్యల్లీలం బ్రకటించు పత్రికలు గ్రంథాగారముల్ గ్రంథముల్
ప్రోల్లాసంబున వృద్ధిసేయుచు సదాంధ్రుల్ గాంచుచుండంగ నీ
యుల్లంబందడలంగ నేల? యిఁక నోహోవాణి మోదిల్లుమా! 20

(2) శ్రీరామకృష్ణకవులు—శతావధానులు—పిఠాపురము.

ఉ. స్వస్తి సమస్తనాగరకసమ్మతపండితదేవరాడుప
న్యస్తమహావిశేషవిషయప్రతిబోధితసర్వలోకసా
ధుస్తుతనన్నయాదికవిధూర్వహసంకలితాంధ్రసాహితీ
విస్తరకార్యదర్శులకు విశ్వజనీనులకున్ భృశమ్ముగన్. 1

సీ. మరలఁజేఁడాదికి మనసమావేశమ్ము దయయుంచుఁడీ యన్నదమ్ములార!
సాహిత్యసభలోని సంగతు ల్మొదలంటమఱచిపోకుఁడి కార్యమహితులార!
ఆంధ్రభాషాయోష కత్యాహితముఁ బాపి యుద్ధరింపుఁడి సూక్ష్మబుద్ధులార!
తాళపత్రగ్రంథతతిఁ బుర్వు దినకుండఁ బాలింపుఁడీ దేశభక్తులార!
నన్నయకుఁ దణ్కులోనఁ దిక్కన్నయజ్వ,కల్లగుంటూరిలోనఁ బోతన్నకొంటి
మెట్టజ్ఞాపకచిహ్నముల్గట్టవేగఁ, దలఁపుఁడీయాంధ్రనాయకాధ్యక్షులార! 2

సీ. పీఠికాపురరాజు పెట్టినభిక్షమక్షయమాంధ్రసాహిత్య సభకునయ్యొ
సూర్యరాయవిభుండు చూపిననిజదీప్తి తెలుఁగువారికి రత్నదీపమయ్యొ
మంగమాంబాపుత్రమణిత్యాగమహిమంబుపలున్నపాలురకొజ్జబంతియయ్యొ
రావువంశాంభోధిరాకేందువేత్తృత్వ మాంధ్రభాషాయోషకమృతమయ్యొ
భయము లేదింక నాంధ్రప్రపంచమునకు,మాతృభాషకుదినములుమంచివయ్యెఁ
దెలుఁగుబాసకువిజయంబుదీటుకొనియె,నాంధ్రసాహిత్యపరిషదమమరమయ్యె.

(3) గాదె శ్రీజగన్నాథస్వామిగారు-కాకినాడ.

ఆంధ్రభాషాప్రశంస.

(ఆంధ్రసాహిత్యపరిషత్కూటసమర్పితము.)

నవరత్నమాల.

మ. తొలుతన్ రాజమహేంద్రుకాలమునఁ బ్రాదుర్భావమున్ జెంది యా
వల నెల్లూరినృపాలముఖ్యులకృపన్ వర్ధిల్లి యామీఁద రా
యలసన్మానమునన్ సమస్తదిశలన్ వ్యాపించి పెంపొందు మా
తెలుఁగున్ బోలెడి సౌమ్యభాష గలదే? దేశీయభాషావళిన్. 1

మ. పరుసన్ ద్రావిడసంభవం బనుచు గీర్వాణోద్భవం బంచు ని
ట్లరయన్ గొందఱు కొంద ఱెంతు ర దసత్యంబౌఁ బునస్సంస్క్రియా
గరిమన్ దైవతభాష యాంధ్రసమభిఖ్యన్ మించెఁ గాకున్నచో
సురభాషన్ దలమీఱునే మృదురసస్ఫూర్తిన్ విజృంభించుచున్. 2

తే. గీ. అల్లద్రవిడభాషలలోనిదయ్యుఁ దెల్గు
సంస్కృతవుమేళనమ్మున సంస్కృతమయి
భ్రమరకీటకన్యాయంబు పట్టెననఁగ
బ్రదిమ మాధుర్యగుణముల మహిమవఱలు. 3

తే. గీ. అలమహేంద్ర వేంకటాద్రి కిష్కింధలన్
ద్రినగములకు నడుమఁ దేజరిల్లు
దేశమునకుఁ దెనుఁగు దేశంబుగా నంద్రు
దీనిబాస తేటతెనుఁగుబాస. 4

సీ. త్రైలింగకాలింగరాష్ట్రీయులకు మాతృభాషగాఁ దొలినుండిపరిఢవిల్లి
యాంధ్రభృత్యులపాల నారంభముననుండియాంధ్రభాషాభిఖ్య నతిశయిల్లి
కృష్ణరాయలవారి కేలూఁత గైకొని విహరించి కర్ణాటవిషయమందు
ద్రవిడభాషలకెల్లఁ దలమానికం బని పాశ్చాత్యబుధులచేఁ బ్రస్తుతిగని
ప్రళయకావేరి చిలుకసరస్సులకును, మధ్యజనపదముల నెందుమలయుచుండు
తెనుఁగుభాషకు సరియైన దేశభాష, క్షితిని వేఱొండు లేదని చెప్పనేల?
సరసమతులార! విద్యాప్రచారులార! 5

మ. నవలల్ నాటకముల్ ప్రబంధములు విన్నాణంబుగా వ్రాయుచున్
నవవిజ్ఞానసుబోధకంబు లగునానాశాస్త్రముల్ దెల్గులోఁ
గవులా వారలు వ్రాయకుంటకతనన్ గా! యాంధ్రభాషామత
ల్లి విచారస్థితిఁ జెంది యూదలను వాల్చెన్ సాటిభాషాళిలోన్. 6

మ. యతియున్ బ్రాసముఁ ద్రోసిపుచ్చి నియమం బావంతయున్ లేని దు
ష్కృతులన్ బన్నిడివారి పోకలను వారింపంగ నుద్యుక్తులై
క్షితి నీరీతి మహానదస్సుల నొగిన్ జేయించుమీబోటి వి
శ్రుతపాండిత్యులు కార్యశూరుల కిదే! జోడింతుహస్తంబులన్. 7

శా. విద్యాభోజులు దానకర్ణులగుచున్ శెక్కింద్రు హిందూప్రభుల్
హృద్యప్రక్రియఁ గ్రాలుచుండిరఁగదా! యొత్తిల్లు దేశంబు మీ
యుద్యత్సంపద, కీర్తిదాయకము లో కోత్కృష్టమైనట్టి మా
యుద్యోగంబులపట్లఁ బొల్పదుటయే యుక్తంబు ముమ్మాటికిన్. 8

ఉ. కొందఱు సత్ప్రబంధములఁ గొందఱు సన్నుతపత్రికాళిచేఁ
గొందఱు గ్రంథమాలలను గొందఱు గ్రంథనికేతనంబులన్

బొందుగ నాంధ్రవాఙ్మనినిఁ బూజలొనర్పఁ గడంగి రింకపై
సందియ మింత లేదు బహుసంపదలన్ మనవారు వర్ధిలన్. 9

(4) కార్యముపూడి రాజమన్నారుకవి—పేరాల.

సీ. పరిష్కృతాపరిష్కృతపద్మాననముఁ బోలు గ్రాంథికగ్రామ్యవాగ్గతులఁ దలఁపఁ
బుష్పితాపుష్పితభూరుహంబునుఁబోలు, గ్రాంథికగ్రామ్యవాగ్గతులఁ దలఁపఁ
పార్థివాపార్థివప్రాభవంబునుఁబోలు గ్రాంథికగ్రామ్యవాగ్గతులఁ దలఁప
స్వరయుతాస్వరయుత సంగీతమునుబోలు గ్రాంథికగ్రామ్యవాగ్గతులఁ దలఁప
గీ. మఱియు సాననుఁదీరినమణిని దీర, కుంఠమణిఁబోలునందురు, కొందఱుధర
నెవ్వరేమన్న నవి యుండి యెప్పటికిని, నుప్పుతప్పు లనంబసు నోలిఁజూడ
నాంధ్రసాహిత్య పరిష న్మహాత్ములార. 1

సీ. షోడశకళలలోఁ జూడనొక్కటి మలినంబైన శశికి దోషంబు గలద
ఘనహవిర్యుతకుండమున ధూమముండిన యాగవహ్నికిఁ బాప మానఁగలద
తాంబూలరసమంట ధవళేక్షణాధరచుంబనంబునకు నశుద్ధిగలద
ఖరముఖభ్రమరయోగముగల్గ సారసపరిమళంబునకు లోపంబుగలద (ము
గీ. యట్లుగ్రామ్యము గ్రాంథికమందొకింత,గలిసిమను గ్రాహ్యమయ్యెను గ్రామజల
గంగలోఁ జేరియోగ్యమాకరణినికను, గలియనీకుఁడు నియమముల్ గలుగఁ జేసి
యాంధ్రసాహిత్యపరిష న్మహాత్ములార. 2

సీ. రాజన్యులెందఱో రహిగ్రాంథికాంధ్రభాషనువృద్ధిఁ జేయుచు సరణిఁ జనుచుఁ
బండితులెందఱో బహువిధంబులుగవ్యాకరణముల్గావించుగతిఁ బడయుచుఁ
గవివర్యులెందఱో గద్యపద్యంబులఁగావ్యముల్ గూర్చుసత్కథలవినుచు
విద్వాంసులెందఱో విశ్రుతంబుగనాటకములఁ దెన్గించుప్రక్రమమరయుచుఁ
గీ. గటకటా ప్రాజ్ఞులగువారె గ్రామ్యమునకుఁ, బరువుగలిగింపఁగా నేఁడు పట్టుఁబట్టు
టరయనవనాగరికపుపెంపార్పుటెగద, యాంధ్రసాహిత్యపరిషన్మహాత్ములార.

గీ. ఆటవికజానపదులాడు మాటలందె గ్రామ్యముండఁగనిండు నాగరులసభలఁ
గవులకృతులసులేఖల నవనవాంధ్ర, పత్రికల గ్రాంథికము తొంటి పగిదినిల్పుఁ
డాంధ్రసాహిత్యపరిష న్మహాత్ములార. 4

గీ. ఆంధ్రసాహిత్యపరిషత్తు నతులగతుల,నిలను వెలయించునధికారు లలఘుకీర్తి
మంతులయ్యెదరంచున మంచితముగ, రాజమన్నారు కవిపల్కె రసికులలర. 5

(5) పిసుపాటి చిదంబరశాస్త్రిగారు—శతావధాని.

సామాజికులారా !

నే నాంధ్రసాహిత్యపరిషదవలోకనకుతూహలసమాకలిత మానసుం డనైనను నిప్పటి సింహపురీసభాప్రయత్నాంతరాయమున నివ్వత్తాగమనుండ నగుటం జేసి యీపద్యములఁ బారితోషికముగ నంపుచుఁ బరిషత్సమావేశసమ యంబున సభ్యులకు విన్నవించుట కర్థించుచున్నాఁడను.

మ. సరసగ్రాంథికభాషనిల్పుటయు దేశక్షేమసంధానచా
తురిమైఁ గ్రామ్యమడంగఁ ద్రొక్కుటయు నందుం బెక్కు గ్రంథంబులన్
బరమప్రౌఢిమెయిన్ రచించుటయు వహ్వాయాంధ్రసాహిత్య స
త్పరిషత్కార్యము లన్నియున్ జగతి విద్వచ్ఛ్లాఘ్యముల్ గావుకో. 1

శా. జ్ఞానంబున్ మెరిపించు మించిన యుపన్యాసంబులన్ సన్మత
స్థానంబున్ గెలిపించు శాస్త్రహిత విద్యావృద్ధి యత్నంబులన్
మానంబున్ గలిగించు గ్రామ్యజనసంతానానన శ్రేణికిన్
గానన్ జ్ఞానముగల్గి చూడఁ బరిషత్కార్యంబు లల్పంబులే. 2

సీ. బహువిధంబులనపభ్రంశభాషలునిన్ను బాధించుననుచింత వలదు తల్లి
నీపుత్రులైజనుల్ నీసమాచారంబుతలఁపలేదనువంత వలదు తల్లి
పలుచోట్లనీకు నిచ్చలు నిరంకుశవృద్ధి గలుఁగలేదనుభీతి వలదు తల్లి
నన్నయాదులఁబోలు నన్నయొక్కండైన నిలువలేదనుబుద్ధి వలదుతల్లి

గీ. ఆంధ్రసాహిత్యపరిషన్మహాదరమ్ము, వలననీ పరితాపముల్ తొలఁగిపోయె
నోఁపఁగల వింకనీకేమి లోపమమ్మ, భూమగుణవల్లి యాంధ్రభాషామతల్లి. 3

చ. ఎవనికొ ధాత్రి నొక్కరున కేర్పడనింపుజనింపకున్న చో
నవనిని సత్ప్రియత్నముల కన్నిటి కెన్నటి కైనఁగానిలా
ఘవముదయించునే దివినఖండముగా రవి వెల్గుచుండ ఘూ
కవి కొకదాని కింపుమదిఁ గల్గనిమాత్రన లోపమున్నదే. 4

సీ. అనుపమానప్రథాధనశాలులైనవిద్వత్కవీంద్రులనుతుల్ వడసినావు
దేశభాషాభివృద్ధివిధాన మొనరింపఁ గంకణంబుం గేలఁ గట్టినావు
ఓజమైవెలలేని రాజాధిరాజసన్మానంబులెచ్చుగాఁ బూనినావు
సజ్జనుల్ కొనియాడ ముజ్జగంబులలోన నంచితంబగుఖ్యాతిఁ గాంచినావు

గీ. ఇంకమఱికొన్ని విద్యాభివృద్ధిహేతు,వులగు శాస్త్రీయకార్యముల్ పలువుచుండి
ధారుణీస్థలి నాచంద్ర తారకముగ, వృద్ధినొందుము తల్లి సాహిత్యవల్లి! 5

శతావధాని—దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు.

గీ. చెన్నపురమునఁ గాఁపుర మున్నయట్టి, యాంధ్రపరిషత్తునకు శుభప్రాప్తిరస్తు
ఆంధ్రభాషకువాదంబులాడుచున్న, యుభయపక్షంబులకు నైక్యముండుఁగాక.

సీ. ఆంగ్లేయభాషాంగనానుకూల్యంబున సరిలేని సాహిత్య గరిమవడసి
దేవభాషాంగనాసేవనాబలమునఁ దులలేనిసౌభాగ్య కలనఁగాంచి
నన్నయాదులు కవినాథు లేర్పఱచిన మొనలేనిమార్గంబు ననుసరించి
ప్రతివేశినులనన్యపరిషత్కులస్త్రీల ప్రతిలేని యాచారపటిమఁ గాంచి
ముద్దుబిడ్డలు మాటాడుసుద్దులెల్లఁ, జక్కపఱచుచు నభివృద్ధి కెక్కఁగాక
నాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి, సద్యశోఢక్క దిక్కులఁ జాటుకొనుచు.

సీ. దాతృత్వమందు రాధాతనూజాతున కనలనేడాకు లెక్కువపఠించె
నపరిమితాదృష్టమందు సుదర్శనధరణిజానిని దలదన్ని మించె
బాల్యంబునంద సౌశీల్యాదిగుణముల ధర్మరాజును దలదాఁటి మించెఁ
జిన్నతనంబునం దన్ని దిగంతంబులును తనకీర్తికామినికిఁ జూపె
నాంధ్రభాషనుబోషించె నట్టిఘనుఁడు,రావుకులమణి శ్రీసూర్యరాయనృపతి
నేఁటియగ్రాసనాధిపుండౌటచూడ, నాంధ్రపరిషత్తు చేయుపుణ్యంబు గాదె.

సీ. ఇంగ్లీషుభాషలో ఎం. ఏ. బి. ఎల్. దాఁక ప్యాసుచేసినమహాపండితుండు
సంస్కృతాంధ్రంబుల శతఘంటకవనంబు పచరించినట్టి విద్వత్ప్రభుండు
ఆనందదంతీశ్వరాఖ్యరాజాఖండలున కెంతయును బ్రీతి మనినమేటి
విజయపురీహూణవిద్యామహాశాల ప్రిన్సిపల్ పదవి గాంచినఘనుండు
ధరకిలంబ్యన్వవాయసుధామరీచి, యనఁగ నొప్పారు రామానుజార్యమౌళి
నేఁటియగ్రాసనాధిపుండౌట చూడ, నాంధ్రపరిషత్తుసేయు భాగ్యంబుగాదె.



# విజ్ఞానచంద్రికాగ్రంథమాల.

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులయౌన్నత్యము !! ఆంధ్రులబుద్ధివైభవము !!!

# ఆంధ్రులచరిత్రము.

## రెండవభాగము.

ఇందు క్రీ.శ.1100నుండి 1350 వఱకుఁగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపఁబడినది.

పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయులవ్రాఁతలు, మొదలగువాని, నన్నింటిని శోధించి తెలుఁగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు, ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి, మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములు కలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుఁగులోఁగాని మఱియే యన్యభాషలోఁగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాతలేఖకులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపఁబడినది. 400 పేజీలు గలిగి మంచికాగితములమీఁద చిన్న యక్షరములతో ముద్రింపఁబడి చక్కనిక్యాలికో బైండుచేయఁబడిన యీయమూల్యగ్రంథము మాచందాదారులకు పోస్టేజితో రు 1-0-0 కును, చందాదారులు కాని వారలకు పోస్టేజిగాక రు 1-8-0 లకును ఇయ్యఁబడును.

☞ విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపఁబడును.

చిరునామా:—

ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎం.

మేనేజరు.—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట.—మద్రాసు.



# హిందువుల క్షేత్రగణితములోనఁ

# గొన్నియంశములు.



మనయార్యుల గణితశాస్త్రములగుఱించి సామాన్యముగ విచారించుచు మన మిదివఱకే వారు బీజగణితమునవలె క్షేత్రగణితమున నంతప్రసిద్ధిఁ జెందలేదనియుఁ గొన్నియంశములమాత్రము ప్రశంసార్హమగునట్లు వృద్ధిపఱచిరనియుఁ గనుఁగొంటిమి. ప్రకృతమున నావిషయముల విమర్శించి చూచెదము. అందు నాదిని త్రికోణక్షేత్రవిషయమై కొంతవిచారించెదము.

శ్లో॥ లంబగుణం భూమ్యర్ధం
స్పష్టం త్రిభుజే ఫలం భవతి॥

**(The area of a triangle = $\frac{1}{2}$ base × altitude).**

అను సూత్రముచేఁ ద్రికోణభూఫలవిధానము మనవారలకుఁ దెలియు నని మన మిదివఱకే యెఱుఁగుదుము. ఇచ్చటఁ ద్రికోణభుజములమితి తెలిసినఁ గాని లంబము (altitude) తెలియదు. త్రికోణభుజములనుండి లంబమును గనుఁగొనువిధ మీ క్రింది సూత్రముచే విశద మగును.

సూ॥ త్రిభుజే భుజయోర్యోగ స్తదంతరగుణో భువాహృతో లబ్ధ్యా ।
ద్విస్థాభూరూనయుతా దళితాఽఽబాధే తయోస్స్యాతాం ।
స్వాఽఽబాధా భుజకృత్యో రంతరమూలం ప్రజాయతే లంబః॥

త్రిభుజక్షేత్రమున రెండుభుజముల యోగమును వానియంతరముచే గుణించి యా మొత్తమును భూమిచే (by the base) భాగించిన లబ్ధమును భూమితోఁ జేర్చి యొకచోటను, భూమినుండి తీసి మఱి యొకచోట నుంచవలయును. ఇటుల నుంచినవానిని ద్వైధీకరించిన నాబాధలు (the intercepts of the base made by the altitude) లభించును. భుజవర్గమునుండి తత్సన్నిహితాబాధవర్గమును తీసిన లంబవర్గ మగును.




అనఁగా నాధునికసంకేతమున

$$\frac{1}{2}\left\{a \pm \frac{(c+b)(c-b)}{a}\right\} = BD \text{ or } CD$$

అనియు

$$AB^2 - BD^2 = AD^2.$$

అనియు నర్థము.

ఈ సూత్రార్థము నీ క్రిందివిధముగ నిరూపింపవచ్చును :—

$$(c+b)(c-b) = c^2 - b^2 = (BD^2 + AD^2) - (CD^2 + AD^2) = BD^2 - CD^2.$$

$$\therefore \frac{(c+b)(c-b)}{a} = \frac{BD^2 - CD^2}{BD + CD} = BD - CD.$$

$$\therefore \frac{1}{2}\left\{a \pm \frac{(c+b)(c-b)}{a}\right\} = \frac{1}{2}\left\{(BD + CD) \pm (BD - CD)\right\} = BD \text{ or } CD$$

and $AB^2 - BD^2 = AD^2$.

ఈ విధమున లంబము తెలియును.

త్రికోణక్షేత్ర భూఫలవిషయమై మఱియొకసూత్రము కూడఁ జెప్పఁబడి యున్నది.

సూ॥ సర్వదో ర్యుతిదళం చతుస్స్థితం
బాహుభి ర్విరహితంచ తద్వధాత్ ।
మూల మస్ఫుటఫలం చతుర్భుజే
స్పష్ట మేవ ముదితం త్రిబాహుకే ॥

భుజముల నన్నియుఁ జేర్చి ద్విధీకరించిన సంఖ్యను నాలుగుచోటుల నునిచి వానినుండి వరుసగా భుజములఁ దీసి యవశిష్టములను గుణించి మూలమును గనుఁగొనిన నది త్రిభుజక్షేత్రమున స్ఫుటమైన భూఫల మగును. చతుర్భుజమున నిది స్థూలఫలము (approximate area).

అనఁగా

Area of a triangle $= \sqrt{s(s-a)(s-b)(s-c)}$, where $2s = a + b + c$.

అని యర్థము. చతుర్భుజవిషయమున నిది కొంత దుష్టము. త్రిభుజమునఁ బ్రథమసూత్రమునుండియు ఫలితాంశ మిదియే. ఈ సూత్రములనే యాధునిక శాస్త్రజ్ఞులుకూడ నుపయోగించుచున్నారు.

చతుర్భుజమున భుజములు మాత్రము తెలిసిన భూఫలము లభింపవచ్చునని బ్రహ్మగుప్తాదులు భ్రమించి యీ క్రిందివిధమున ఫలాహారణముఁ జేయుచు వచ్చిరి.

సూ॥ కర్ణాశ్రిత భుజఘాతైక్య ముభయథాఽన్యోన్యభాజితం గుణయేత్
యోగేన భుజప్రతిభుజహత్యోః కర్ణౌ పదే విషమే॥

కర్ణములకు (diagonals) ఇరుప్రక్కలను సమీపమున నున్న భుజముల గుణించి వాని మొత్తములను బరస్పర మొకటితో నొకటిని భాగించిన లబ్ధమును భుజప్రతిభుజహననయోగముచే (the sum of the products of the opposite sides) గుణింపవలయును. ఇట్లు లభించిన మొత్తములు కర్ణముల వర్గములగును, కర్ణము తెలిసినపిదప త్రికోణసూత్రముచేఁ జతుర్భుజఫలము కనుగొనఁబడును.

అనఁగా

$$BD^2 = \frac{ab+cd}{ad+bc} \times (ac+bd)$$

అనియు

$$AC^2 = \frac{ad+bc}{ab+cd} \times (ac+bd)$$

అనియు వర్గము.




ఈ సూత్రార్థము వృత్తక్షేత్రములోని చతుర్భుజవిషయక మని యాధునికగణితముచే నిర్ధరింపఁబడియున్నది. చతుర్భుజమున భుజములుమాత్రము తెలిసిన, కర్ణస్వరూపము లనంత మగు ననియు, వానిని నిర్ధరించుట దుష్కర మనియు భాస్కరాచార్యుఁ డీసూత్రముల నిరసించెనుగాని, దీనికిఁ బ్రతిగా నతను నిర్ధరించిన సూత్రమునుమాత్ర మంత శ్లాఘనీయముకాదు.

వృత్తక్షేత్రమున "పరిధిగుణితం వ్యాసపాదం ఫలం" [area = ¼ (circumference) (diameter)] అని మనము చూచి యుంటిమి కదా. ఈభాస్కరాచార్యుని సూత్రమును గణేశుఁడను వ్యాఖ్యాత యిట్లు నిరూపించుచున్నాఁడని "కోల్బ్రూక్" మహాశయుఁడు వ్రాయుచున్నాఁడు:—వృత్తమును రెండు సమభాగములుగ విభజించి, ప్రతిభాగపు కేంద్రమున ననేక సమకోణములు నిర్మింపవలయు. (ఇట్లు నిర్మించి విడదీసిన నొక్కొక్కభాగము క్రకచాకృతిగ నుండును.) పిదప నొకటితో నొకటిఁ గలియఁజేసిన యెడల విషమచతురశ్రమగును (a rectangle). దీని ఫలమే వృత్తక్షేత్రఫలము.

పంచ, సప్త, నవాస్రములకుమాత్రము ఈవిధముగ నిర్ణయించుట దుష్కరమని చెప్పియున్నాఁడు. ఆధునిక గణితమున నివి యన్నియుఁ త్రికోణమితి సాహాయ్యముచే సులభముగఁ గనుఁగొనఁబడుచున్నవి. (The side of a regular polygon of $n$ sides inscribed in a circle of radius $r$ is $= 2r \sin\frac{\pi}{n}$ ) పంచాస్రమున కీ క్రిందివిధమున భుజముఁ గనుఁగొనవచ్చును.




BD = పంచాస్రభుజము

BC = దశాస్రభుజము

ఇచ్చట $BC = \frac{r}{2}(\sqrt{5} - 1)$

{ School Geometry: Hall and Stevens; Ex. 4 page 243 }

మఱియు

$AB^2 - AE^2 = BC^2 - CE^2 = \frac{r^2}{4} (\sqrt{5} - 1)^2 - (r - AE)^2$

$\therefore\ AE = \frac{r(\sqrt{5} + 1)}{4}$

మఱియును

$BE^2 = AB^2 - AE^2 = r^2 - \frac{r^2}{16}(\sqrt{5} + 1)^2 = \frac{r^2}{16}(10 - 2\sqrt{5})$

$\therefore\ 2BE = \frac{r}{2}\sqrt{10 - 2\sqrt{5}}$

అని పంచాస్రభుజముఁ గనుఁగొననగును

పంచ, సప్త, నవాస్రవిషయమై భాస్కరాచార్యునిచే నిర్ధరింపఁబడిన భుజమానములకును, ఆధునిక గణితములచే నిర్ధరింపఁబడిన భుజమానములకును స్వల్పవ్యత్యాసము లున్నవి.

వృత్తమున (in the circle ధనుస్సును (the arc) వ్యాసమును దెలిసిన జీవమును (the chord) కనుఁగొనుట కీ సూత్రమున్నది.

సూ॥ చాపోన నిఘ్న పరిధిః ప్రథమాహ్వయఃస్యాత్
పంచాహతః పరిధివర్గ చతుర్థభాగః।
ఆద్యోనితేనఖలుతేనభజేచ్చతుర్ఘ్న
వ్యాసాహతం ప్రథమమాప్తమిహజ్యకాస్యాత్ ॥

పరిధినుండి ధనుస్సునుదీసి యవశిష్టమును ధనుస్సుతో గుణించి యొక చోట నుంచవలయును. ఈ సంఖ్యను అయిదింతల పరిధివర్గచతుర్థభాగము

నుండి తీసి మఱియొకచోట నుంచవలయును. మొదటి మొత్తమును నాలుగింతల వ్యాసముచే గుణించి రెండవమొత్తముచే భాగించిన యెడల జీవము లభించును.

అనగా

$$\text{Chord AB} = \frac{\text{Arc ACB} \times \text{arc AB} \times 8r}{\frac{5}{4}(\text{circumference})^2 - \text{Arc ACB} \times \text{arc AB}}$$

అనియర్థము.




ఈ సూత్రమును హరణ చంద్ర బనర్జిగారు తమచేఁ బ్రచురింపఁబడిన "లీలావతి"లో నీవిధమున నిర్ధరించుచున్నారు.

BC = వ్యాసము = $2r$; $c$ = circumference; $\theta$ = AOC.

$$\frac{\text{Arc ACB} \times \text{arc AB} \times 8r}{\frac{5}{4}c^2 - \text{Arc ACB} \times \text{arc AB}} = \frac{8r\left\{(\frac{1}{2}c)^2 - (\text{arc AC})^2\right\}}{\frac{5}{4}c^2 - (\frac{1}{2}c)^2 + (\text{arc AC})^2}$$

$$= \frac{8r\{\pi^2 - \theta^2\}}{c^2 + \theta^2} = \frac{2r(4\pi^2 - 4\theta^2)}{4\pi^2 + \theta^2} = 2r. \frac{1 - \left(\frac{\theta}{\pi}\right)^2}{1 + \left(\frac{\theta}{2\pi}\right)^2}$$

$$= 2r\left\{1 - \left(\frac{\theta}{\pi}\right)^2\right\}\left\{1 + \left(\frac{\theta}{2\pi}\right)^2\right\} = 2r.\left(1 - \frac{5\theta^2}{4\pi^2}\right) \text{ సుమారు.}$$

ఇక్కడ $\pi = \frac{22}{7}$ అయిన

$$2r.\left(1 - \frac{5\theta^2}{4\pi^2}\right) = 2r.\left[1 - \frac{5 \times 49}{4 \times 22 \times 22}\cdot\theta^2\right]$$

$$= 2r\left\{1 - (\tfrac{1}{8} + \text{something})\,\theta^2\right\}$$

$$= 2r\left[1 - \frac{\theta^2}{8} + \ldots\ldots\right] = 2r\cos.\frac{\theta}{2} \text{ సుమారుగా,} = \text{chord AB.}$$

(ఈ పటములోని D ని $\theta$ గాను, E ని O గాను చదువవలయును).

ఛాయాప్రకరణమున శంకుప్రమాణమును (the length of the pole) శంకుదీపతలాంతరమును (the distance between the foot of the pole and that of the lamp) తెలిసిన, ఛాయాప్రమాణ మీక్రిందిసూత్రముచేఁ గనుఁగొనఁబడును.

సూ॥ శంకుః ప్రదీపతల శంకుతలాంతరఘ్నః
ఛాయాభవేత్ వినరదీప శిఖౌచ్చ్యభక్తః॥

(ఇచ్చట శంకుస్థానమున మనుష్యుఁడే నిలిచియున్నట్లు గణింపఁబడియున్నది.)

దీపౌన్నత్యమునుండి శంకుప్రమాణమును దీసి యవశిష్టముచే శంకు, శంకుదీపతలాంతరహననమును (the product of the pole and the distance between the foot of the pole and that of the lamp) విభజించిన, ఛాయాప్రమాణము లభించును.

ఇచ్చట

AB = శంకువు

D = దీపము

E = దీపతలము.

B = శంకుతలము

EB = శంకుదీపతలాంతరము

BC = ఛాయయు నయిన,




ప్రకృతసూత్రముచే

$$BC = \frac{AB \times EB}{DE - AB} = \frac{AB \times EB}{DE - DF}$$

అనియర్థము.

ఇది యూక్లీడు 6-వ పుస్తకములోని 4-వ తత్వముచే నిట్లు నిరూపింపనగును.

FEB, ABC త్రికోణములలో

$$\frac{FE}{EB} = \frac{AB}{BC}$$

$$\therefore \ BC = \frac{AB \times EB}{FE} = \frac{AB \times EB}{DE - DF} = \frac{AB \times EB}{DE - AB}$$

ఇటు లనేకవిషయములు బహుచమత్కారముతో నిర్ణయింపఁబడి యున్నవి. మొత్తమున క్షేత్రగణితములోఁ గొన్నిచోటుల మనయార్యుల యుద్యమము లంత విశ్వసనీయముగ లేక యుండినను, మఱి కొన్నిచోటుల మాత్రము మిక్కిలి ప్రశంసనీయములుగనేయున్నవి. అవిచ్ఛిన్నముగ నీగణితశాస్త్రములు పాశ్చాత్యదేశమునవలె మనదేశమునఁగూడ వృద్ధి పఱుపఁబడి యుండెనేని యనేకవిషయములు మనకు ననన్యసహాయమై తెలిసియుండును. ఇప్పుడైన మనశాస్త్రములను లుప్తముగాకుండఁ జూచుచు సాధ్యమైనంత వఱకు వానిపారిభాషిక సంజ్ఞలనైనఁ బ్రచారముచేయుట మన ప్రథమకర్తవ్యము.

ఉదాహ. } కపిస్థలం - కృష్ణమాచార్యులు.

Printed by Srinivasa Varadachari & Co., Mount Road, Madras.

# ప్రాఁదెనుఁగుఁగమ్మపై నంపగమి.



" ఏల బొంకులువల్కి నిక్కి నీల్గుటలు;
ఏల రిత్తలుసెప్పి విఱ్ఱవీగుటలు? "

ప్రాఁదెనుఁగుఁగమ్మ.

శబరవాగనుశాసను లగు రావుసాహేబ్ గిడుగు రామమూర్తిపంతులు గారిని గాని, యాంధ్రవాగనుశాసనమునకు వారు చేయుచుండు ప్రయత్నములను గాని, నేఁ డాంధ్రలోకమున నెఱుంగనివా రెవ్వరు నుండరు. సలక్షణాంధ్రభాష దుర్గ్రాహ్య మనియు, గ్రామ్యభాషయే సుగ్రాహ్య మనియుఁ, గావున గ్రామ్యభాషయే గ్రాంథికభాష కావలయు ననియు, ఋజువుచేయుచు, వారిచేఁ బ్రచురింపఁబడిన " ప్రాఁదెనుఁగుఁగమ్మ " యాంధ్రులలోఁ గొందఱకు భ్రమను గల్గించినది. కావున నాభ్రమను దొలఁగించుటకై యావ్యాసమును విమర్శింపవలసియున్నది.

ఈవ్యాసము భాషాసంస్కరణముం గూర్చి కావునఁ దొలుదొల్త " సంస్కరణము " వలని ప్రయోజనములను మనము తెలిసికొనవలయును.

లోకమున మానవులు సంఘములు గా నేర్పడుటకుఁ బూర్వము వివాహాదినియమము లేర్పడి యుండలేదు. సంఘ మభివృద్ధి నొందుటకై యాయానియమము లేర్పడినవి. ఎట్లన దుర్బలసంతానములు లేకుండుట, స్త్రీలను గూర్చి పురుషు లొండొరులతోఁ గయ్య మాడుకొనకుండుట, మొదలగు నెన్ని యోలాభములఁ బరికించి, వివాహనియమము లేర్పఱుపఁ బడినవి. వివాహవిధుల ననుసరించి ప్రవర్తించుట జనసామాన్యమునకుఁ గష్ట మనుమాట నిజము కాని, సంఘ మల్లకల్లోలము కాకుండ నుండనెంచిన చో నానియమముల ననుసరించియే తీరవలెను. లోకములో నెందెందలో వివాహనియమములను మీఱుచున్నారు కావున నా నియమములను దీసివైచినచో లెస్సగా నుండు నని యెవ్వరైన వాదించినచో నది యవివేకమును సూచించును.

వివాహాదిసంస్కరణము లెట్లో భాషాసంస్కరణము కూడ నట్లే సంఘాభివృద్ధికై యే పుట్టినది. కాలము గతించిన కొలఁదియును, నియమములు లేని

యంశములలో మనుష్యుల యభిప్రాయము లెట్లు మాఱుచుండునో, నియమరహిత మగుభాషయు నట్లే మాఱుచుండును. దానంజేసి పూర్వుల యభిప్రాయములను మనము తెలిసికొనుటకును మనయభిప్రాయములను మన తరువాతివారు తెలిసికొనుటకును గష్ట మగుచుండును. ఈ యంశములు పాశ్చాత్య దేశములలో స్పష్టముగాఁ గన్పట్టుచున్నవి. పదుమూఁడు పదునాల్గవ శతాబ్దములలో రచింపఁబడిన యాంగ్లేయభాషాగ్రంథములు నేఁడు పఠించువారు గాని, పఠించినదానిని దెలిసికొనఁగల్గువారుఁ గాని, మిక్కిలి యరుదు. మనదేశములో నాకాలమునందలి గ్రంథముల నించుమించుగాఁ జదువనేర్చినవా రందఱును దెలిసికొనఁగలరు. దానికిఁ గారణ మాంగ్లేయదేశమున భాషాసంస్కరణము తొంటినుండియు లేక, మొన్నమొన్న నే యారంభ మగుటయు, మనదేశమున భాషాసంస్కరణము పెక్కుశతాబ్దములకు ముందే యారంభ మగుటయు నై యున్నది. భాషాసంస్కరణమున నిన్నగాక మొన్న నే కనుదెఱచిన యర్వాచీనుల భాషలతో బహుశతాబ్దములకు ముందే సంస్కరింపఁబడిన ప్రాచీనభాషలను దులదూఁచుట వెడఁగుఁదనము.

## ఆంధ్రభాషాసంస్కరణము.

ఆంధ్రభాష తమిళ కర్ణాటభాషలకన్న నధునాతన మనియు, నాంధ్రభాషాసంస్కరణము వేయియేండ్లకు ముందుమాత్రమే జరిగినదనియు ననేకులయభిప్రాయము. కాని, యది వాస్తవమునకు దూరము. తమిళ కర్ణాటభాష లెంత పురాతనములో యాంధ్రభాషయు నంత పురాతన మైనదే. తమిళకర్ణాటభాషలు సంస్కరింపఁబడిన కాలముననే యదియును సంస్కరింపఁబడినది. త్రైలింగ్యభాషను తొలుదొల్త సంస్కరించినవారు కణ్వబృహస్పతులు. కణ్వుని సంస్కరణగ్రంథమునకు "కాణ్వవ్యాకరణ" మనియు, బృహస్పతి సంస్కరణగ్రంథమునకు "బార్హస్పత్యసూత్రము" లనియుఁ బేరు. ఈగ్రంథము లిప్పుడు నామావశిష్టములై యున్న వని యనేకుల యుద్దేశము కాని, యది వాస్తవము కాదు. బార్హస్పత్య సూత్రములే యిప్పు డాంధ్రశబ్దచింతామణి (నన్నయభట్టీయము) అను పేరునఁ బరఁగుచున్నది. ఇఁకఁ గణ్వవ్యాకరణ మథర్వణకారికావళియే గాని వేఱుగాదు. ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతముగాని బాలసరస్వతికృతము గాని కాదనియు, నన్నయకాలమునకు వేయియేండ్లకుముందే యది వాడుకలో నుండెననియు, నాచే రచింపఁబడుచున్న త్రైలింగ్యసారస్వతమను గ్రంథమున

సహేతుకముగా ఋజువు చేయఁబడును. అథర్వణకారికలుగూడ నట్లే యథర్వణకృతములు గాని యహోబలపతికృతములు గాని కావనియు నథర్వణునకు వేయియేండ్లకు ముందే వ్రాయఁబడియున్న వనియుఁ బైగ్రంథమున ఋజువు చేయఁబడుచున్నది. ఏది యెట్లున్నను, ఆంధ్రభాషాప్రథమసంస్కరణము క్రీస్తుశకారంభములోనే జరిగినదనియు, దానికిఁ గారకులు కణ్వబృహస్పతులే యనియు స్పష్టమే.

ఈ ప్రథమ సంస్కరణ మాదిగా వేయియేండ్లు భాష నిరాఘాటముగా వృద్ధినొందినది. ఈకాలమునఁ గవిత్వము కూడ నెంతయో వృద్ధినొందినది. కాని, యీకవిత్వ మిప్పటి కావ్యఫక్కికాక ద్విపద, రగడ, సీసము, గీతము, అక్కఱ, కళిక, ఉత్కళిక మొదలగు దేశీయవృత్తములు, సూర్యగణములు, ఇంద్రగణములు, చంద్రగణములు మొదలగుగణములతో వ్రాయఁబడినదిగా నుండెను. వేయియేండ్లుగా నీరీతి నభివృద్ధి నొందుచున్న భాషకు మరల సంస్కరణ మావశ్యక మయ్యెను. ఈద్వితీయసంస్కరణ మొనర్చినవారు నన్నయయును దిక్కనయును. వీరు ప్రథమసంస్కరణకర్తలవలె లక్షణములను వ్రాసి భాషాసంస్కరణమును జేసినవారు కారు గాని, లక్ష్యములను వ్రాసి చేసినవారు. నన్నయకాలమున గీర్వాణ, తమిళ, కర్ణాటభాషలు ప్రముఖములై యుండెను. వివిధము లగు వృత్తములతోఁ గావ్యకన్యక సహృదయుల హృదయముల నాకర్షించుచుండెను. దానిం జూచి నన్నయ యాయాభాషలలోని వృత్తముల ఫక్కిని దెనుఁగులోఁ జొన్పి, తనకు ముందున్న ద్విపద, (తరువోజ) రగడ, అక్కఱాదులను విడువక, కణ్వబృహస్పతుల నియమముల ననుసరించుచు మనోహరముగ నూతనకావ్యనిర్మాణ మొనర్చెను. దానియందలి మాధుర్యమును జూచి, యాతని కాలములోనివారును, దర్వాతికాలమువారును గూడ నామార్గమునే యవలంబించి యాతనినే ప్రథమకవిగా నెన్నసాగిరి. రంగనాథాదులు కొందఱు నూతనమార్గము ననుసరింపక, తొంటిమార్గమునే యవలంబించినను, జనసామాన్యమునకును విపశ్చిద్వర్యులకును గూడ నానూతనమార్గమే రుచించుటచే నదియే యభివృద్ధి కాఁజొచ్చినది.

తిక్కన సంస్కరణము నన్నయసంస్కరణము కన్న భిన్నమైనది. నన్నయవ్రాసినది యాంధ్రభాషయే యయ్యును నది నియమములందు మాత్రము

యాంధ్రభాషయై పదబాహుళ్యమున గీర్వాణభాషయైయేయుండెను. కావున, జనసామాన్యమునకు దుర్గ్రాహ్యమై యుండెను. కావ్యము జనసామాన్యము నకు సుగ్రాహ్యము చేయుటకు నితరమార్గము లావశ్యకము లయ్యెను. అమా ర్గములను దిక్కన కనిపెట్టి తనకావ్యరచనయందు వాని ననుసరించెను. తిక్క న చేసిన సంస్కారములలో నీక్రిందివి ముఖ్యమైనవి.

(1) ప్రాఁతమాటలను విడచుట.

లోక మభివృద్ధి నొందినకొలఁదియును బదములయర్థములు మాఱుచుం డును. కావునఁ దనకాలమున నేపద మేయర్థమున జనులచే నుపయోగింపఁ బడునో, యాపద మాయర్థముననే యుపయోగింపవలయును.

(2) నూతనపదములను జేర్చుట.

లోకమున వివిధవృత్తులు గల వివిధజాతులలో వారివారి వృత్తులతో సంబంధించిన వ్యావహారికపదము లుండును. అట్టివానిని దెలిసికొని, యాయా శబ్దముల నాయాసందర్భములలోఁ బ్రయోగించుట కవినైపుణ్యమును దెలియఁ జేయును.

(3) సామెతలు.

సామాన్యజనులసంభాషణములో సామెత లెన్నియో యుండును. అయ్యవి యేకాలమున నేకారణమున వాడుకలోనికి వచ్చినను, జనసామాన్యముచే మి క్కిలి యాదరింపఁబడుచుండును. కవి యాయాసామెతలను జాగ్రత్తతోఁ దెలిసి కొని తనకావ్యమున నుపయోగింపవలయును.

తిక్కన తనకు ముందున్న యాంధ్రకవిత్వమునఁ గల యిట్టిలోపముల నన్నిటిని గ్రహించి,తనకావ్యములను సకలజనాదరణీయములుగా రచించెను.కాని తాను నూతనాంశముల నెన్నిటిని జేర్చినను, గణ్వాబృహస్పతుల నియమములను గాని, నన్నయభట్టారకుని మార్గమునుగాని, విడువక వాని ననుసరించియే పో యెను. తిక్కన యొనర్చిన యీసంస్కరణముం గాంచి యధునాతనసంస్కర్తలు భ్రమించి, సామాన్యజనుల సంభాషణలోఁ గలభాషతోనే తనభారతమును వ్రాసె ననుచున్నారు. అదియసత్యము. సామాన్యజనులపదజాలమును లోకోక్తులను గ్రహించి, కణ్వాబృహస్పతుల నియమములచే వానిని బరిశుద్ధిచేసి, యట్టిపరిశుద్ధి చేయఁబడిన బంగారముననే తిక్కన తన కావ్యభూషణమును నిర్మిం

చెను గాని, గనిలోనుండి తీయఁబడిన యపరిశుభ్ర మగుబంగారముతోఁ జేయ లేరు. ఇఁకఁ దృతీయసంస్కరణము నేఁడారంభ మైనది. ఈసంస్కరణము పైఁ జెప్పఁబడిన రెండుసంస్కరణములకన్నఁ జిత్రతమమైనది. లక్షణ మెఱుంగనియొకా నొక కన్యకను దెచ్చి పెంచి, లక్షణముల దిద్ది, కణ్వబృహస్పతులు కలభాషి ణిగా నొనర్చిరి. కలభాషిణి యగునాబాలికకు సరసకావ్యపాఠన మొనర్చి, సన్నయతిక్కనలు దానిని విదుషిగఁ జేసిరి. ఇప్పటివారన్ననో, కలభాషిణీసాంగ త్యము తమకవసరములే దని చెప్పి, యవలక్షణ యగు నొకసామాన్యను దెచ్చి దానినే యందఱును వరింపవలయు నని సిద్ధాంతీకరించుచున్నారు. ఇట్టి సంస్కర్తలలోఁ బ్రముఖులు మ-రా-రా. గురుజాడ అప్పారావు పంతులు గారును, రావుసాహేబ్ గిడుగు రామమూర్తి పంతులుగారును.

ఈ తృతీయసంస్కరణమును గూర్చి వ్రాయఁబడిన వ్యాసములలో విమ ర్శనమున నున్న ప్రాఁదెనుఁగుఁగమ్మ ప్రధానమైనదిగా నున్నది. ఇది సలక్షణ భాష యని పంతులుగారు భ్రమించుచున్న యొకానొకభాషలో వ్రాయఁబడి నది. ఈ వ్యాసమును విమర్శించుటకుఁ బూర్వము దాని యాముఖమున వ్రాయఁ బడిన రెండంశములు విచారింపవలసియున్నది.

(1) "పద్దెంబు లివి యని పేర్కొవ్వ నేను,
పద్దెంబు లని పల్కి-ప్రాఁబడి పఠకించి,
కీడని దూరఁగఁ డగదేరి కేని."

(2) "గద్దెకూర్చునకు నై కట్టడి లేద.
గద్దెయకా దీని గడియింపనురదె ?"

ఈవాక్యద్వయమున మొదటివాక్యమును విమర్శింతము. ఇందుఁ "బ్రాఁబ డి" యనుశబ్దమునకు నర్థమేమి ? సందర్భమును బట్టి "యతి" యనికదా యర్థ ము కావలసియున్నది. అది యే నిజమైనచో, "ప్రావడి" అనునది సరియైనశబ్ద ము కాని, "ప్రాఁబడి" అను నది కాదు. ప్రాఁబడి" యనుశబ్దమునకు "యతి" యనునర్థమునఁ బ్రయోగము లేవైనఁ బంతులుగారు చూపఁగలరేమో ? కాక, తచ్ఛబ్దమునకు సందర్భానుసారముగా మఱియొకయర్థ మైనచో నాయర్థమున్నై న వివరింతురుగాక. ఇఁక వాక్యమునందలి యాశయమును జూడుఁడు. తాను వ్రాసినది పద్యముకాదు. కావున నందు యతిదోషములను వెదకవలదని దాని తాత్పర్యము. ఇది చూచ "దొంగవాఁడా, చేయిమాత్రము కఱవకుమా" అను

లోకో_క్తి జ్ఞప్తికి వచ్చుచున్నది. తాను వ్రాసినది పద్యమని పాఠకు లనుకొనుటకుఁ దగినకారణము లున్నప్పుడే కదా ఈవాక్యము సార్థకమగును. అట్టికారణములే యున్నచోఁ బద్యము కాదని తా నెంతచెప్పినను, లోకము వినదు కదా. కావున నట్టికారణము కలదో లేదో చూతము. గణనియమమున వ్రాయఁబడిన వాక్యసముదాయమే పద్య మని యందఱకును దెలియును. ఈకమ్మ యంతయును గణనియమము తోనే వ్రాయఁబడినది. చూడుఁడు.

(1) "సిరిఁదాల్చి జేఁడొగిఁ జిన్నిచూడ్కులఁ జూచు
తెనుఁగుఁజదువుల రచ్చతీర్పరులార.

(2) "తెనుఁగునాఁటను గలరు తొల్లింటి పెద్దలు
నేలదయ్యాలు నానాపాటువారు.

ఇందు గణనియమము లేదని పంతులుగా రనఁగలరా ? ఇఁక నివి పద్యములే యనుటకు నేమి సందేహము. ఒకవేళ నివి శార్దూలాదివృ_త్తములలో వేనిలోను జేరవు కావునఁ బద్యములు కావందు రేమో. అట్టివృ_త్తములలో వేనిలోను జేరకున్నను, ఇది పద్యమగుటకు ననుమానములేదు. ఏలయన శార్దూలాది వృ_త్తములు నన్నయకాలముననే వచ్చినవి గాని నన్నయకుఁ బూర్వ మిట్టి పద్యములే వాడుకలో నుండెడివి. చూడుఁడు.

(1) హరిహరీనారాయ ణాదినారాయణా
కరుణించురా మమ్ముఁ గమలలోచనుఁడ.

(2) బళిబళి మీతాత బల్లెంబు చేపట్టి
పులియాకు తూటుగాఁ బొడిచేసినాఁడు.

ఈవాక్యములయందలి గణనియమమునకును, ప్రాఁదెనుఁగుఁగమ్మలోని పైవాక్యద్వయమున గల నియమమునకును భేద మేమైనఁ గలదా ? లేదు. కావునఁ బ్రాఁదెనుఁగుఁగమ్మ యంతయును బద్యమే యని యనక తప్పదు. పంతులుగా రీపద్యముతోనే కమ్మయంతయును వ్రాయుటకుఁ గారణము లేకపోలేదు. తాము వ్రాయుచున్నది ప్రాఁదెనుఁగు గావునను, ప్రాఁదెనుఁగున శార్దూలాది వృ_త్తములు లేవు కావునను, అప్పటికి వాడుకలోనుండె ననుకొనుచున్న యీ తందనపద్యముననే కమ్మయంతయు వ్రాయఁబడినది. వారి మొదటియుద్దేశ మిదియే యయ్యును, ఏకారణముననో తాము వ్రాసినది పద్యమే కాదని పంతులవా

రససాహసించిరి. "సత్యవాణీసరస్వతీ" యనునట్లు, "తాను పద్యముసే" యని కమ్మమాత్రమే సహస్రముఖముల నుద్ఘోషించుచునేయున్నది.

ఇఁక రెండవవాక్యమునకుఁ బోవుదము. గద్యకు నియమ మవసరము లేదనియుఁ గావున దీనిని గద్యగా నెన్నవలయు ననియు దీనియర్థము. ఇందు, "కట్టడి" యన వీరిభావ మేమి? ఛందోనియమమా లేక వ్యాకరణనియమమా? గద్యకు ఛందోనియమ మవసరములే దనుట నిజమే కాని వ్యాకరణాది నియమ మవసరములే దనుట యసత్యము కదా. అయినను, పంతులుగా రిట్లు వ్రాయుటకుఁ గారణ మొకటిగా నూహింపవలసియున్నది. ఏది యన; నన్నయాదులు గద్యరచనలో నవలంబించిన కర్తృకర్మాదినియమములు రామమూర్తి పంతులుగా రీకమ్మలో నెన్నియోచోట్ల మీఱిరి. తాము వానిని దెలిసియో తెలియకయో మీఱిరి కావున, గద్యకు నియమమే యక్కఱలే దని లోకము కూడ భ్రమింప వలె నని యుద్దేశించి రిట్లు వ్రాసియుందురు. ఇఁక నీయంశమును విడచి ముందు కథకుఁ బోవుదము.

ఈవ్యాసమునకుఁ బ్రాఁదెనుఁగుఁగమ్మ యనిపే రిడఁబడినది. దీనికిఁ గారణము, "తొలితెనుఁగునుడులను" దీనిని వ్రాయుటయే. పంతులుగా రీవ్యాసమును దొలితెనుఁగున వ్రాసితి మని చెప్పుచున్నారు కావునఁ "దొలితెనుఁ" గన నేమియో తొలుదొల్త తెలుపవలసిన భారము వారిపైఁ గలదు కదా. తొలితెనుఁగన నేకాలమునాఁటి తెనుఁగు? ఆంధ్రభాషలో గీర్వాణ శబ్దములు కలియకమున్ను దేశమునఁ గలతెనుఁగా? లేక కలసినతరువాతి తెనుఁగా? సంస్కృతము కలియకమున్నున్న తెనుఁగే యైనచోఁ దద్భవము లేల చేర్పఁబడినవి? సంస్కృతము కలియకమున్ను దానివికార మగు "వికృతు" లు కూడఁ జేరి యుండవు కదా. ఇఁక, సంస్కృతము కలిసినతరువాతి భాషయే యైనచోఁ దత్సమము లేలవిడువఁబడినవి? తత్సమము లాంధ్రభాషలోనివి కావా? శుద్ధాంధ్రగ్రంథకారులు తత్సమములను విడచి తద్భవములను మాత్రమే గ్రహించి రన భాషాతత్త్వము వారికిఁ దెలియకపోవుటచేతను, ఆంధ్రము సంస్కృత ప్రాకృతముల వికృతి యని వారుదురభిప్రాయపడి యుండుటచేతను, వా రట్లు చేసిరి కాని భాషాతత్త్వము పూర్తిగా నెఱుంగుదు మని యనుకొనుచున్న పంతులుగారు నట్లు వ్రాయవచ్చునా? కానిండు, ఏదియో యొకభాషలో వ్రాసిరి.

దాని నిప్పుడు మార్పలేరుకావున నున్నదానికి గతివిచారింపవలయును. దీనికిఁ "ప్రాఁదెనుఁ"గని యేలపేరిడిరి? ఈభాష యేయేయాధారములనుండి కైకొనఁబడినది? ఇది యేకాలమునాఁటిది? ౧౧వ శతాబ్దముదా? ౧౩వ శతాబ్దముదా? ౧౫వ శతాబ్దముదా? "తిక్కఁడు పెద్దన లోకక-బాసాదిరె, పాఱుచుఁ జదివిన వాసియగపడునకు:కలయంగఁ జూచిన: నన్నయ తిక్కనల నుడులను నొక్కింత గానఁ నగున" అని తామే వ్రాయుచున్నారుకదా. భాష వేర్వేఱుకాలములలో వేర్వేఱుగా నున్నప్పుడును, తాను ప్రాచీనభాషను వ్రాయుచున్నప్పుడును, ఏకాలమునందలి భాషను దాను వ్రాయుచున్నాఁడో, ఆకాలమును నాభాషను గ్రహించుటకుఁ గల కావ్యశాసనాదికము లగు నాధారములనుగూడఁ దెలియఁజేయవలసిన పని లేఖకునిది గదా. అట్లు చేయక, "ఇది ప్రాఁదెనుఁగు" అనునంతమాత్రమునఁ బామరులు భ్రమించునట్లు పండితులును భ్రమింతురా? పంతులువారిది యేకాలమునాఁటి భాషయో తెలుపకపోయినను, గొండొక యాధారము మాత్రము లేఖయందుఁ గన్పట్టుచున్నది.

"ఈ కమ్మలో నున్న వెన్నియో మాటలు నన్నయనుడులేని, తెలియంగఁబడునె యిప్పు డీ రాజేంద్రవరమున వారు."

(ఇందలి యనర్థము మున్మున్ను వివరింపఁబడును.)

ఈలేఖలోని మాట లెన్నియో నన్నయనుడులే యైనను రాజమహేంద్రవరమున నున్న యిప్పటివారి కవియర్థము కావని దీని తాత్పర్యము. దీనిని బట్టి ఈవ్యాసమునందలి పదము లనేకములు నన్నయనాఁటివని తేలుచున్నది. ఇదియే నిజమైనచో, నేయేపదములు నన్నయనాఁటివి? ఎయ్యేపదములు తరువాతివి? ఈయంశ మొకటి తెలియవలయును గదా. ఇది తెలిసిననే కదా, యిందలి సందర్భాసందర్భములు మనము విమర్శింపనగును. అట్టి యాధారము లేవియు విమర్శకుల కొసంగక, తమ యిచ్చకు వచ్చినట్లు వ్రాయుట యన్యాయము కదా. కాననే కాఁబోలు "ఈ కమ్మనుడులను నా యిచ్చమై నేను గూర్చితి" నని పంతులుగారు మొదటనే ప్రతిజ్ఞ చేసికొనియున్నారు. ఈవ్యాసమునందలి భాష యేకాలమునాఁటిదో పంతులువారు చెప్పకపోవుటచేతను, ఇందలి పదము లనేకములు నన్నయనాఁటి వని యనుటచేతను, పంతులు గారు భారతమునఁ గల యాంధ్రభాషాస్వరూపమును దెలిసికొనుటకై బహుకాలము

నుండి శ్రమపడుచుండుట వాస్తవ మగుటచేతను, ఇది కవిత్రయమువారిభాషను వ్రాయఁబడిన దని మొత్తమున మన మనుకొనవచ్చును. అదియే నిజమైనచో, నాంధ్రభాషాస్వరూపము వీరికి బాగుగాఁ బట్టువడలేదని, యీవ్యాసమే చాటుచున్నది. నన్నయ తిక్కనల నియమములను మీఱి పలుతావుల నడుచుటచేఁ బ్రాచీనాంధ్రభాషాస్వరూపమును దెలియఁజేయుట కీవ్యాస మెంతమాత్రమును జాలదు. ఇందున కుదాహరణముగ శతాధికము లగు ప్రయోగముల నీవ్యాసమునుండి యెత్తిచూపవచ్చును గాని, గ్రంథవిస్తరభీతిచేఁ గొన్నిమాత్రమే చూపెదను.

(1) "మీ మెచ్చుతెనుఁ గది కను గరిడిబిద్దె" (*a*) ఇందు గరిడియను శబ్దము సందర్భానుసారముగ "వీటి హాంద్రు" అనునర్థమునఁ బ్రయోగింపఁబడినది. గరిడి, గరిడీ శబ్దములు తొలుదొల్త "చోటు" అను సామాన్యార్థమునఁ బ్రయోగింపఁబడుచుండెను. తరువాత నవి "సాముచేసెడి చోటు" అనునర్థమునఁ బ్రయోగింపఁబడినవి. ఆపిమ్మట, "సాము" అనునర్థమునసే ప్రయోగింపఁబడినవి. కాని, వీటివాం డ్రనునర్థమున నెవ్వరును బ్రయోగించి యుండ లేదు. భారతమునఁ బ్రయోగము లేమైనఁ గలవా?

(*b*) బిద్దె ఇది విద్యాశబ్దమునకు వికృతిగా గ్రహింపఁబడినది. "విద్దె" యనురూపము కలదు గాని, "బిద్దె" యను రూపము కనఁబడదు. ప్రయోగములు కలవా?

(2) "మొదలేని తుదయేని మొగపడ దరయ" ఇందు, మొగపడు అనునది "అగపడు" అనునర్థమునఁ బ్రయోగింపఁబడినది. కాని, యాశబ్దమునకు "చూచు" అనునర్థమున సకర్మకక్రియగా మాత్రమే పూర్వకావ్యములలోఁ బ్రయోగములు కలవు. "అగపడు" అనునర్థమునకు బూర్వకావ్య ప్రయోగములు చూపఁగలరా?

(3) "ఉచ్చమల్లిని నందొలు గొల్వ"

ఇందు, "ఉచ్చమల్లి" యనుశబ్దమేయర్థమునఁ బ్రయోగింపఁబడినది? ఈ శబ్దమునకు నగ్న (వస్త్రహీన) అనియర్థము. ఈయర్థ మీవాక్యమున ననర్థకము.

(4) "కయితమ్ము గారడి బిద్దె గా దిద్ది"

ఇందు గారడి యనునది పైఁజెప్పఁబడిన "గరిడి" యనుపద మేయర్థమునఁ బ్రయోగింపఁబడినదో యాయర్థమునసే ప్రయోగింపఁబడినది. ఈశబ్దము

కూడఁ బూర్వకావ్యములలో నాయర్థమున నుపయోగింపఁబడక పాములవాఁ డనునర్థమునఁ బ్రయోగింపఁ బడుచుండెను.

(5) కనువిచ్చి చుండు.

ఇందు, చుండు అనునది, "చూడుఁడు" అనుదానికి మాఱురూపముగాఁ గన్పట్టుచున్నది. "చేయును జుండు" "కొట్టును జుండు" అనునిట్టి తావులను మాత్రమే "చూడుఁడు" అనునర్థమున "చుండు" అని యుపయోగింపఁబడుచున్నది కాని, ప్రత్యేకక్రియగాఁ బ్రయోగింపఁబడుట యిందనుక నెందును జూడలేదు.

(6) "కండ్లు తప్పనఁగఁ గన్నులు బాసకు"

ఇందుఁ "గండ్లు అనునది కన్ను లనునర్థమునఁ బ్రయోగింపఁబడినది. ఇది యపరూపము.

(7) (a) వేసవేల్ విల్లలచేత

(b) మీరలు ప్రాఁబొత్తముల

ఇత్యాదిస్థలములలోఁ బరుసాక్షర మగుపకారము వకారముగా మార్చుటకుఁ గలయాధారమేమి? ప్రథమమీఁది పరుషములు గసడదవలుగా మాఱుట బహుళముగా నగుచుండును గావున, శ్రుతిహితము కానిచోట్ల నవి మార్ప వీలులేదు. ఇట్లు మార్చుటకు మహాకవిప్రయోగములు కలవా?

(8) (a) కఱవుచేఁ బసి గొని చానున్నవారు

(b) దాన నతఁగుల పసి యాఱునయ్యె

ఇందుఁ బసి యనుశబ్ద మాఁకలి యనునర్థమునఁ బ్రయోగింపఁబడినట్లు తోఁచుచున్నది. కాని, పసి యనునది కుక్కలు మొదలగునవి గ్రహించుచుండు పశ్వాదులమీఁది యొకానొకగాలి (వాసన) అనునర్థమున మాత్రమే యుపయోగింపఁబడుచుండుట యెఱుంగుదుము. "ఆఁకలి" యను నర్థమునకుఁ బ్రయోగములు కలవా?

(9) "బోడులు దక్కఁగ నేరట్టి రుండ్రె"

ఇందు బోడులు అనునది సన్న్యాసులు అనునర్థమునఁ బ్రయోగింపఁబడినట్లు కన్పట్టుచున్నది. అదియే నిజమైనచో, బోడులు అనునది యపరూపము. బోడలు అను రూపము సాధువు. వితంతువు లని యర్థమైనచో నదియనర్థకము.

(10) (a) పాటించర్రైరి. (b) చాలించకునిక

ఇందు, ఇంచుక్బ్రకారమునకుఁ బకార మేల రాలేదు? ఇందునకు భారతమునఁ బ్రయోగములు కలవా?

(11) (a) వారుచెప్పంగా నాలించితయ్యా
(b) నాసెప్పఁగలయది చెప్పితయ్యా
ఆలించితిఁ + అయ్యా=ఆలించితయ్యా
చెప్పితిఁ + అయ్యా=చెప్పితయ్యా

ఈ సంధి వ్యాకరణవిరుద్ధము. పూర్వకావ్యములలోఁ బ్రయోగములు లేవు. పంతులుగారు భారతమునఁ బ్రయోగమును గన్పెట్టిరా?

(12) వాని నేమి సేతుము

"చేయుదుము" అనుదానికిఁ జేతుము అనునది గ్రామ్యరూపము. భారతమున నిట్టి ప్రయోగములు కలవా?

(13) భారతకత సదివి.

భారతకథ యను సంస్కృతరూపమునకు నిది వికృతియని యిందనుక నెఱుఁగము. భారతమునకత యనునది వైయాకరణరూపము. కొందఱు పండితులు భారతపుఁగత యనునది సురూపమని యెంచుచున్నారు. భారతకత యనురూపమునకుఁ బ్రయోగములు కలవా?

(14) నీ నారె పెఱవారు.

ఇందు, నారె అనునది అనరె అనుదానికి రూపాంతరమఁట! అనుధాతువున జనించురూపములలో, అనన్=నాన్; అనక=నాక. ఇత్యాద్యసమాపక క్రియారూపములలోఁ బ్రథమాక్షర మగు అకారము ద్వితీయాక్షర మగు నకారముతోఁ గలియును గాని, సమాపకక్రియలలోఁ గలిసినట్లు కన్పట్టదు. భారతమున నిట్టిప్రయోగము లున్నవేమో!

(15) మీాకు వలచిన యట్లు.

ఇది యసాధువు. వలచిన యనుక్రియ సకర్మక మగుటచే, మీావలచిన అనిగాని మీాకువలచిన అనిగాని యుండవలయును.

(16) ఈ కమ్మలో నున్న వెన్నియో మాటలు, నన్నయ నుడులేని, తెలియంగఁబడునె యిప్పు డీరాజేంద్రవరమునవారు.

ఈవాక్యమునఁగల సంపూర్ణ క్రియాపద మగు తెలియంగఁబడునె యనునది మాటలు అను కర్తృవాచకముతో నన్వయించుచున్నది. ఇఁక "రాజేంద్ర వరమునవారు" అనునది దేనితో నన్వయించును? అదియును, పైక్రియతోనే యన్వయింపవలసినచో, వారికి అనుషష్ఠీవిభక్తిరూపము గదా యుండవల యును. ఇట్టి యసందర్భపు టన్వయములకుఁ గూడఁ బంతులువారికి భారతమునఁ బ్రయోగములు కన్పడెను గాఁబోలు.

రామమూర్తిపంతులుగారికి నాంధ్రభాషాస్వరూపము చక్కఁగాఁ దెలి యనేలేదని ఋజువుచేయుట కీప్రయోగములు చాలును. కవిత్రయకృతగ్రంథ ములలోనుండి ప్రయోగములను జూపుచుఁ దమ ప్రయోగములను సమర్థించు కొని నప్పుడే, వారు తమభాషాజ్ఞానమును సమర్థించుకొనఁగలుగుదురు. కాకున్న నది యసాధ్యము.

పైయంశములను బట్టి విచారించినచో, సలక్షణాంధ్రభాషాస్వరూపము యథార్థముగాఁ దెలియఁజేయుటకు నీవ్యాసము చాలదనియు, సలక్షణాంధ్ర భాష దుర్గ్రాహ్య మెన్నఁడును గాదనియు, నీవ్యాసము సామాన్యజనులకు దుర్గ్రాహ్యమే యయ్యెను, దానికిఁ గారణము దానిసలక్షణత్వము కాక, వేఱొకఁ డేదైన నుండియుండు ననియు స్పష్ట మగుచున్నది. ఇఁక నీవ్యాసమున సందర్భానుసారముగాఁ దెలియఁ జేయఁబడిన యంశములం గొన్నిటిని బరి శీలింతము.

(a) నన్నయఁ దిక్కనఁ గేతనం దొట్టి తొలిక్రైతకా ఱెల్ల రానాటఁగోలె దారును దమవార లొండొరులతోడ నిచ్చ లెయ్యెయినుడులు నొడివెడు వార లానుడులఁ గైతంబు గూర్చుదు నదియుఁ గమ్మగాఁ దనరెను గావలయుఁ జూరె." అనునొక వాక్యరాజ మీవ్యాసమునఁ గన్పట్టుచున్నది. నన్నయతిక్కన కేతనల గ్రంథములలో జనసామాన్యముల భాష యున్నదియున్నట్టుగా వ్రాసి రని పంతులుగా రేయేయాధారములనుబట్టి సిద్ధాంతము చేయఁగలరు? వా రెన్నఁడు నట్లు వ్రాసియుండలే దని వారిక్రైలియే వేనోళ్లఁ జాటుచున్నది. వారి గ్రంథములఁ గలభాషలోఁ "గావులమాటచొప్పు" కన్పడుచుండ లేదాయున,

లేదని మన మనలేము ; కాని, గనిలోనుండి యెత్తి తీయఁబడిన బంగారమును
బరిశుద్ధిచేసి యాభరణములను జేయురీతి, కాఁవులశబ్దములును, నానుడులును,
కణ్వాబృహస్పతుల నియమముల చొప్పునఁ బరిశుద్ధిచేసి, వారు తమకబ్యములఁ
జొన్పిరి కాని, యవి యున్నవి యున్నట్టు గానే చెప్పలేదు.

(b) “వారిపిదపటివార లంతకంతకును, గైతంబు గారడిబిద్దెగా దిద్ది,
కైతంబు బాసను గకవికలుసేసి, సింగారమునకునై సిగ్గుడిగ ద్రావి, రోఁతయిం
చుకలేక, పాడిగడిమివిలి, బూతులు రంకులు వొందించి చొన్పి, లంజెలమైజిగి
మెఱమెచ్చి యాడి, రాజుల రెడ్లను బెల్లించి వుచ్చి, కూర్మియు నెయ్యమ్ము గల
రట్లు తోఁతేర, వేనవేల్ బొంకులు బొల్లిపాడియును, నిచ్చకమ్ములు సెప్పి, తమక
రువుఁ గూడుఁగొనుటకునుండెను, గాసుకు నొండెఁ దమకయితకన్నల వారికిఁ
దార్చి, బాసవెలందిని వెలయాలిఁజేసి, వెలయాలి మటుమాయయాకెకు మరపి,
మిఱుదిట్లు గొల్పఁగా గద్దెనెక్కించి, నేలకు సానిగా దానినెలకొల్ప అంకులాడి
యె మేటి నాడెమగు మిన్నయని, యుచ్చమల్లిని నందొఱు గొల్పఁ దొంటిబాస
వెలంది కటకటా క్రుళ్లి తెవులుగదిరిన చివుకులంజె యయ్యెత్తెల్లె.”

పండితులారా, ఈవాక్యముం జిత్తగింపుఁడు. ఆంధ్రకవిత్వమునఁ బంతు
లుగారికిఁ గల యసహ్యమంతయు నీవాక్యమున వెల్వరింపఁబడినది. కటకటా! పదు
నాఱవశతాబ్దము నందలి యాంధ్రకవిత్వమునకు నెట్టిపాట్లువచ్చినవి! ఈవాక్య
మునందలి ప్రతిశబ్దమును విమర్శించుచు, భారతమంతగ్రంథ మొకటి వ్రాయవ
చ్చును గాని, యట్లు వ్రాయుటయు, వ్రాసినది చదువుటయుఁ గూడ వ్యర్థప్ర
యాసములే యని మానివేసితిని. ఆంధ్రకవిత్వ మనుకల్పవృక్షమునకుఁ బదునొ
కండవశతాబ్దమునందలి కవిత్వము చిగురువంటిది. 12వ శతాబ్దమునందలి కవి
త్వము మొగ్గవంటిది. 13వ శతాబ్దమునందలి కవిత్వము పూవువంటిది. 14వ శతా
బ్దమునందలి కవిత్వము పిందెవంటిది. 15వ శతాబ్దమునందలి కవిత్వము కాయవం
టిది. 16వ శతాబ్దమునందలి కవిత్వము పండువంటిది. కావున, నాంధ్రకవిత్వ
మంతలోఁ బదునాఱవశతాబ్దముకవిత్వమే శ్రేష్ఠతమ మైనది. అట్టియుత్తమ
కవిత్వమును బంతులుగా రీరీతిగా సేవగించుటకుఁ గారణ మగపడదు. తమయు
ద్దేశముల నన్నిటిని విపులముగాఁ జర్చించుచుఁ బంతులుగారు ప్రత్యేకగ్రంథ
మొకటి వ్రాసినచోఁ బండితు లంగీకరింతురుకాని, లోకమును భ్రమింపఁజేయు
నుద్దేశమున సోదాహరణములు కాని యిట్టివాక్యములు వ్రాసినలాభము లేదు.

పంతులుగారు ముక్తం దాపని చేయుదురుగాక. (c] "పెద్దలీ-చొప్పున లంజెను నాడెంపురాణిగా నెన్నుచు, మగనాలిఁ దెగడి, యెబ్బెరాసిది యని యేవగింప, నట్టిపెద్దల నడయు మేల్ పాడిగాఁ దలఁచి, పజ లదె కొనియాడ నయ్యెఁగా వలయు."

ఈవాక్యముం దిలకింపుఁడు, ఇందలి "లంజె" గ్రాంథకభాష, "మగనాలు" గ్రామ్యభాష. మనలెన్నబాసయకాదె మగనాలు" అనువాక్యము దీనిని బలపఱచుచున్నది. కావున, బంతులుగారియుద్దేశమున లంజె యన నేమియో, మగనాలన నేమియో, మనము తెలిసికొనవలసి యున్నది. లంజె, మగనాలు, అను రెండుశబ్దములకు నిర్వచనములను బంతులుగారీవ్యాసముననే యిచ్చియున్నారు. చూడుఁడు, "ఇచ్ఛపై దిరిగిన, నిలువాడు మగనాలు సాంజపు మేరలు మీరదెన్నఁడును. బొల్లిమఱియాదల నెడ్డెల నేమర్చి, లంజియ కదె దాటుమేరలెల్ల," ఈనిర్వచనమున నసత్య మెంతమాత్రమును లేదు కాని, యదిభాషావిషయమున వారి యుద్దేశమున కెట్లుసరిపడునో పరీక్షింపవలయును. మూఢు లగు భర్తల నేమర్చి, మేరలు (నియమములు) దాఁట నది లంజె. ఇందు రెండుసంగతులుగలవు.

(1) భర్తలు మూఢు లగుట,

(2) మగనినేమఱచి, నియమరహితముగఁ బ్రవర్తించుట.

ఈరెండును గ్రామ్యవిషయమై యథార్థములోఁ గ్రాంథిక విషయమున యథార్థములో తెలిసికొనుఁడు. ఇఁక, సాజంపు మేరలు (నియమములు) మీరనిది మగనాలు. అనఁగాఁ, దా నేనియమముల ననుసరింప వలసియున్నదో యవి యనుసరించియే ప్రవర్తించునది. ఈనిర్వచనము నియమరహిత యగు గ్రామ్యభాషకుఁజెందునో, నియమ సహిత యగు గ్రాంథికభాషకుఁ జెందునో, పంతులుగారే యాలోచింతురుగాక. రామమూర్తిపంతులుగారు గ్రాంథికభాష లంజెగాను, గ్రామ్యభాష మగనాలుగాను, కన్పట్టునట్టు చేయవలెనని యెంతయో శ్రమపడినారు. కాని, వారిశ్రమయంతయును వారినిర్వచనములవలననే వ్యర్థము చేయఁబడినది. ధర్మమునకే యెప్పుడును జయము కలుగుచుండును గదా. పంతులుగారు తమయుక్తిలో నీలోపమును గనిపెట్టియే కాఁబోలు, "మొఱటు మొఱటని దాస(గ్రామ్యమును)దెగడుటయేకాని, యేరుదిద్దిరి మెఱుఁగులు దానికయ్యె." అనుకొండొకవాక్యము నతికి యున్నారు. ఈవాక్యమును బట్టి వీరియుద్దేశము,

నియమరహిత మగుటచేతనే గ్రామ్యభాష మొఱటుగానున్నదనియు, దానిని నియమసహితముగాఁ జేసినచో, దాని మొఱటుఁదనము వీడుననియుఁ, దేలుచున్నది. నియమసహితమై, యభివృద్ధిలో నున్న యొకానొకభాషను విడచి, నియమరహితమైన మఱియొకభాషను జేపట్టి, నియమముల నేర్చి, నూతనముగ నభివృద్ధిలోనికిఁ దెచ్చుటకు శ్రమపడినచో, నేమిప్రయోజనమో తెలియకున్నది. ఈశ్రమమంతయును, రామమూర్తిపంతులుగారివంటి సంస్కర్తలకు వాగనుశాసనాభిధానము నొసంగుటకుఁ బనికివచ్చునేమోగాని, వేఱుప్రయోజనము మాకు గోచరింపలేదు. లక్షణవతియై, గుణవతియై, విదుషియై తన్ను నమ్మియున్న యొక భార్యను విడచి, లక్షణమెఱుంగక, విద్యాగంధములేక, సుగుణసంపత్తిలేక, యొక్కొక్కని యొద్ద నొక్కొక్కరీతిగా మెలంగుచున్న యొకానొక సామాన్యను వివేకముగలవాఁ డెవ్వఁడైనఁ జేపట్టునా? ఇంతశ్రమపడి, గ్రామ్యభాషకు నియమముల నేర్పఱచినచో లాభమేమి? ఈకాలమున గ్రామ్యగ్రాంథికభాషలొక్కరీతిగా నుండుటకు సరిపోవును గాని, మున్ముం దట్టిప్రయోజనము కన్పట్టదు కదా. నియమసహిత మగుభాష మాఱకుండుటయు, నియమరహిత మగుభాష మాఱిపోవుచుండుటయు, ననుభవైకవేద్యము కదా. కావున, ఇప్పుడు నియమము లేర్పఱచి, గ్రాంథికముగాఁ జేయఁబడిన గ్రామ్యభాష మఱియిన్నూరేండ్లకుఁ దరువాతఁ గూడనిట్లే యుండును గదా. ఇఁక నప్పటిగ్రామ్యభాష యిట్లేయుండక, యెంతయో మాఱిపోవునుగదా. అప్పుడు మరల గ్రామ్యగ్రాంథికభాషలకు భేదము కన్పడి క్రొత్తచిక్కును గల్గించునే! అప్పు డేమిచేయవలయును? అప్పుడు మరల భాషకుఁ గ్రొత్తనియమముల నేర్పఱుపవలెనా? అట్లయిన, నిన్నూరేండ్ల కొక్కొక్కతూరి భాషకు నూతననియమముల నేర్పఱచుచు వచ్చినచో నిఁక భాషగతి యేమి కావలయునో! కావున, గ్రామ్యభాషకు నూతననియమముల నేర్పఱచుట వ్యర్థప్రయాసము. (d) "తొంటిపెద్దల బాస సాజపుబాస, సొంపుమై నింపుమైఁ జదువ నొనఁగూడు." అని పంతులుగారు చెప్పుచున్నారు. ఇది కాదని మేమెంతమాత్ర మనము. కాని, తరువాతివారు కవిత్వమును భాషను బాడుచేసి రని చెప్పుచు వారు, "సంధులాదేశాలు, నాగమమ్ములను లోలును, నెఱసున్న లఱసున్నలునిచ్చి, యన్నియు నేర్పుమైఁ గలియంగ దంచి" రని పంతులుగారు చెప్పుచున్నారు. దీనిఁబట్టి, తొంటికవులు, నన్నయ తిక్కనాదులు, సంధినియమములును, శకటరేఫనియమములును, నను

స్వారనియమములును, పాటింపక కవిత్వము చెప్పుటచే వారిగ్రంథములు సుగ్రాహ్యము లైనట్లును, దరువాతివా రానియమములను పాటించుటచేఁ వారిగ్రంథములు దుర్గ్రాహ్యములైనట్లును, స్పష్టమగుచున్నది కదా. భాషావిషయమున నెంతయో పరిశ్రమచేయుచు, భాషాచరిత్రమును బూర్తిగాఁ దెలిసికొనఁజాలి రని మనమనుకొనుచున్న రామమూర్తిపంతులుగారే యిట్టివాక్యమును వ్రాయుట కన్న మఱియొకవింత కలదా ? నన్నయ తిక్కనకవిత్వములో సంధులును, శకటరేఫాధ్రానుస్వారనియమములును లేవా ? వాస్తవమున వారికవిత్వముననే కదా యువియొక్కువశ్రద్ధతోఁ బాటింపఁబడినవి! ఇఁకఁ దరువాతివారు నన్నయాదుల సంధినియమములను బాటించినను. శకటరేఫాధ్రాను స్వారనియమములనంతగాఁ బాటింపనే లేదుగదా. నియమముల నెంతయో శ్రద్ధతో నవలంబించిన నన్నయాదుల కవిత్వమే సుగ్రాహ్య మగునప్పు డానియమములలోఁ గొన్నిటిని విడచినవారి కవిత్వము దుర్గ్రాహ్య మని చెప్పుట కేమి కారణము ? కావున నీవాక్యము పెద్దనాదులకవిత్వము దుర్గ్రాహ్య మని చెప్పుటకుఁ జాలదు కాని, 16వ శతాబ్దమునందలి కవిత్వమునఁ బంతులుగారికిఁ గల యసహ్యమును మాత్రము బలపఱచుటకుఁ జాలియున్నది.

(e) "బాపలుమున్నగా మాటలు పుట్టించి కమ్మపై గివ్వఁగా దెలుఁగయ్యెనయ్యె ? బాపలకంటెను ముందరఁ గాఁపులు వల్కరె ప్రాతఁలు దెనుఁగులు నుడులు తొంటిపెద్దల కట్టియరమరలున్న ? తొంటికాఁపుల పలుకె కొనియాడరైరె? ఏనాటిపెద్దల నుడుల నానాఁడు మేలుగ నెన్నుటయు పాడి యెల్లెడల?" ఇందలి యర్థవిశేషముం జిత్తగింపుఁడు. "బ్రాహ్మణులు తొలుదొల్త ఆంధ్రభాషను సృష్టిచేయలేదు. తమకాలమునందలి కాఁపులమాటలను గ్రహించి వానిని మేలుగనెన్నిరి. ఏనాటిపెద్దలనుడులను నాఁడు మేలుగా నెన్నుట పాడిగదా." అని గదా పంతులుగారి యుద్దేశము. ఇందు రెండంశములున్నవి.

(1) పూర్వబ్రాహ్మణులు తమకాలమునందలి కాఁపుల మాటలను మేలుగ నెన్నిరి.

(ఇదివిశేషాంశము.)

(2) ఏనాఁటి పెద్దలమడుల నానాఁడు మేలుగ నెన్నుట పాడి.

(ఇదిసామాన్యాంశము.)

ఈసామాన్యవిశేషాంశములను రెంటిని సమన్వయించినచోఁ, బూర్వకాలమునందలి బ్రాహ్మణులకన్న నాకాలమునందలి కాఁపులు పెద్ద లని ఫలితార్థము తేలుచున్నదిగదా? ఇది యే వాస్తవ మైనచోఁ బూర్వకాలమునందలి కాఁపుల భాషను శాసించిన బ్రాహ్మణులకన్న నాభాషను మాటలాడినకాఁపులే పెద్దలని కదా చెప్పవలయును? అట్లు చెప్పినచో నీకాలమునందలి శబరభాషను శాసించిన రామమూర్తిపంతులుగారికన్న నాశబరభాషను మాటలాడుచున్న పార్వతీయులే పెద్దవారని చెప్పవలసివచ్చును గదా? కటకటా ఈమాటను గలలోనైన మన మనఁగలమా!

రామమూర్తిపంతులుగారి వ్యాసమును దఱచిన కొలఁదియు నిట్టిసొగసులు బయలుదేఱుచునే యుండును. ఒక్కొక్కయంశమును గూర్చి యొక్కొక్కగ్రంథము వ్రాయుటకు వీలగును గావున నిది యింక విడచివేయుదము.

గ్రామ్యభాషయే గ్రాంథికభాష కావలయు నని ఋజువుచేయుటకుఁ బంతులుగారిచే నీవ్యాసమునఁ గొన్నియుక్తులు చూపఁబడినవి. అవి సాధారణముగా నాపక్షమువా రందఱును సభలలో నుపన్యాసరూపముగఁ జెప్పుచున్నవియును, బత్రికలలో వ్యాసరూపమున వ్రాయుచున్నవియునే గాని క్రొత్తవి కావు. ఇవికాక, వేఱుయుక్తులు వారికి లేవని కూడఁ జెప్పవచ్చును. ఈయుక్తులన్నియును మ-రా-గా-శ్రీ, జయంతి రామయ్యపంతులుగారు, వావిలికొలను సుబ్బారావుపంతులుగారు, మున్నగు మహనీయులచే నిదివఱకే ఖండింపఁబడినవి. వారి విమర్శనములకు సమాధానములను జెప్పుచుఁ, దమయుక్తులను బ్రతిపక్షులు నిలిపికొనినప్పుడే మరల వ్రాయుట యవసరముకాని, లేకున్న నది చర్వితచర్వణమే కావున నాయుక్తులను మరల నిందు విమర్శింప లేదు.

## ఉపసంహారము.

ప్రకృతమున నాంధ్రభాషకు సంస్కరణ మావశ్యక మని అప్పారావుపంతులుగారును, దత్పక్షమువారును, నెట్లు తలంచుచున్నారో, మేము నట్లే తలంచుచున్నాము. కాని, వారును మేమును ద్రొక్కుచున్న త్రోవలు మాత్రము భిన్నములైనవి. ప్రాచీనాంధ్రసంస్కర్తలలో మనకు మార్గదర్శి కానున్నవాఁడు కవిబ్రహ్మ. అతని సంస్కరణవిధమును దొలుదొల్తనే వివరించితిమి. ఇప్పుడు మనము చేయవలసినసంస్కరణ మిట్టిదియే కాని, కాలానుసరణముగా

మాత్ర ముండవలయును. విజ్ఞానచంద్రికయును, విజ్ఞానసర్వస్వమును, శాస్త్రములవిషయమున నీమార్గము ననుసరించి పనిచేయుచున్నవి. సాహిత్యపరిషత్తు మిగిలిన యంశములలోఁ బనిచేయవలసియున్నది. వారు కొంతవఱకుఁ జేయుచునున్నారు. అప్పారావుపంతులుగారును, రామమూర్తి పంతులుగారును, శేషగిరిరావు పంతులుగారును, అవలక్షణవతిని లక్షణవతిగాఁ జేయుటయందుఁ దమప్రతిభావిశేషమును వ్యర్థము సేయక, పైవారికిఁ దోడ్పడినచో, భాష యెంతయో వృద్ధినొందును. అట్లుకాక, తమనూతనమార్గమును దాము విడువ మని పట్టుపట్టినచో, వారు ముఖ్యముగాఁ జేయవలసినపని యొకటి కలదు. ప్రస్తుతమున గ్రామ్యవాదులు తమయభిప్రాయములలో నొండొరులతో నేకీభవింపకయున్నారు కావున, వారందఱు నేకీభవించి, తొలుదొల్త నొకమార్గ మేర్పాటుచేసికొనవలయును. తరువాత నామార్గమును బండితులకుఁ జూపిన, నందలి మంచిచెడ్డలను వారు పరీక్షించి, యదియంగీకరింపఁ దగునో తగదో నిర్ధారణ చేయుదురు. అట్లుకాక, యెవ్వరికిఁ దోఁచినరీతిని వారు వ్యాసములను వ్రాయుచున్నంతమాత్రమునఁ గాని, యట్లువ్రాసినవ్యాసములు పాశ్చాత్యులచే నభినందింపఁబడినంతమాత్రమునఁగాని, యాంధ్రభాషాసంస్కరణము తామనుకొనినట్లు జరుగనేరదు.

మం. పార్వతీశ్వరశాస్త్రి.



శ్రీకృష్ణాయనమః.

# పురాణపఠనావశ్యకత.

చేతనసృష్టిలో నెల్ల నరులు సర్వాధికు లగుటకుఁ గారణము జ్ఞానైక సాధన మగుమానవదేహమును దాల్చి యుండుటంబట్టియే. జ్ఞాన మైహికము నాముష్మికము, నని రెండువిధములు. ఐహిక మన నిహమున మనుజుఁడు తన జీవితకాలమును గౌరవానందములతోఁ గడపుటకుఁ దగిన తెలివి. ఆముష్మిక మన జీవుఁడు పరమున శాశ్వతానందమును బడయుటకుఁ దగు తెలివి.

ఇందు మొదటి తెలివి నభివృద్ధిచేయుటకుఁ జతుష్షష్టికళలు, వ్యాకరణాదిశాస్త్రములు, లోనగునవి ప్రధానములు. రెండవ తెలివి నభివృద్ధిచేయుట కుపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు లోనగునవి ముఖ్యములు. పూర్వజ్ఞానమునకంటె నుత్తరజ్ఞాన ముత్కృష్టమైనది. కాని యుత్తరజ్ఞానసౌధారోహణమునకుఁ బూర్వజ్ఞానము సోపానపరంపరవంటిది.

ఈలౌకికాలౌకికజ్ఞానములు రెండును నొకదానితో నొకటి సమ్మిళితమై యంగాంగీభావమును బొందినపుడే మానవునకుఁ బరిపూర్ణలాభమును గలిగించుచున్నయవి. అందువలననే మనపూర్వు లీరెంటిని గలిపియే బోధింపఁదొడఁగిరి. కావుననే సనాతనధర్మము లన్నియు నిహపరముల రెంటిని సంపాదింపఁదగినవిగ నున్నవి కాని వేఱుపడి యుండలేదు.

కాని మానవు లీజ్ఞానద్వయమును సంపాదించుటలోఁ జాలశ్రమపడవలసి యున్నది. జ్ఞానసాధకము లగునసంఖ్యేయగ్రంథముల జదువుటకుఁ బరిమితకాల జీవు లగుమర్త్యులు శక్తులు కాఁజాలరు. చదువుటలో నొకకొందఱు కృతార్థులైనను, వానియందలి గంభీరభావము, నాత్మానుభవమునకుఁ దెచ్చికొని యుత్తీర్ణుఁ డగువాఁడు వేయింటి కొకఁ డుండునో యుండఁడో తెలియదు.

కావుననే దయామయు లగుమహర్షులు కేవలశాస్త్రములచే విషయమును బోధించి స్త్రీపురుషాది సకలమానవసంఘము నుభయజ్ఞానానుభవసంపన్న మగుదానినిగాఁ జేయుట యత్యంతదుష్కర మని తెలిసికొని, యొకగ్రంథము చదువుటచేతనే జ్ఞానద్వయమును సనుభవములోనికిఁ దెచ్చి, యాచరణోప

యుక్త మగునట్లు చేయుటకు శాస్త్రీయవిషయములఁ జక్కనికథలతోఁ జేర్చి బోధించిన సుబోధ మగు నని తలఁచి యసంఖ్యేయామూల్యోపాఖ్యానము లచే నొప్పుచున్న పురాణముల శ్రోతృజనచిత్తరంజక మగునటుల విరచించి యున్నారు.

ఈపురాణనాయకపావనజీవచరితలు చదువరుల కత్యంతానందసంధాయ కము లగుటయే కాక, కామాదిదుర్గుణదూషితములైన మానవహృదయములఁ జక్కఁబఱచి, శీలసంపన్న మగునటుల చేయుచున్నవి. కావుననే మహర్షులకుఁ బిమ్మటఁ గాళిదాసాదికవివరు లెల్లరును సామాన్యముగాఁబురాణపురుషులనే నాయ కులనుగాఁ దీసికొని, రసభరితము లగునుత్తమకావ్యముల విరచించి యున్నారు. పరమపావనచరితు లగుపుణ్యపురుషుల జీవితములఁ జదువుటచేఁ గలుగులాభము నకు మేర లేదు. "జాతీయ వీరచరితములఁ దెల్పు గ్రంథసముదాయము, సమ స్తకాలమునందును, సమస్తదేశములందును, నిక్కమైన విద్యకును, సౌశీల్య మునకును, మూలాధారము" అని కుమారస్వామి పండితుఁడు, జాతీయవిద్యా వ్యాసమున వ్రాసియున్నాఁడు.

పురాణవర్ణితము లగుగజేంద్రాదితిర్యగ్జంతువులయు, ధ్రువప్రహ్లాదాది బాలభాగవతోత్తములయు, నభిమన్యుప్రభృతియౌవనవీరులయుఁ, గర్ణార్జునాది ప్రౌఢవీరులయు, శిబిదధీచ్యాది దానవీరులయు, హరిశ్చంద్రాదిసత్యవీరులయు, శ్రీరామాది పితృవాక్యపరిపాలకులయు, నలప్రభృత్యేకపత్నీవ్రతశోభితులయు, విదురాదినీతిధురీయులు, భీష్మాదిస్వార్థత్యాగగరిష్ఠులు, శ్రీశుకాదిపరమవైరాగ్య సంపన్నులు, జనకాదిజ్ఞానిసార్వభౌములు,వసిష్ఠాదిబ్రహ్మర్షులు మున్నగువారివియు, లోకపావనచరిత లగు సావిత్రి, సీత, దమయన్తి, చంద్రమతి, ద్రౌపది లోనగు సాధ్వీలలామలయొక్కయుఁ బవిత్రనామములు విన్నమాత్రముననే శరీరములు పులకరించుచుండ, నిఁక వీరిపావనదివ్యజీవచారిత్రములఁ జదువునపు డేయార్యుని చిత్తము ద్రవింపకుండును? ఏభారతీయుని నేత్రములనుండి యానందాశ్రువు లొలుకకుండును? ఏహైందవునిదేహము పరవశము కాకుండును?

ఈపావనచరితములఁ జదువునపుడు, కేవలస్వలాభములకొఱకుఁ బేరాస తోఁ బరుగిడువారుకూడ నిశ్చేష్టితులై స్థాణువులవలె నిలుచుటయే కాక,

తాముచేయుచున్న కుత్సితకృత్యముల స్మరించి, లజ్జితులై దేహత్యాగమునకైనను, లేదా తమనడతను జక్కచేసికొనుటకైనను ద్వరపడుచుందురు.

ఈశ్రీవపావనపురాణవైరాగ్యమే యాచరణకాలమువఱకును మానవహృదయముల నిలిచియున్నచో నీలోకమున నింద్యము లగునీర్ష్యానూయాదిదుర్గుణము లెచట నిలువఁగలవు? దుఃఖమునకుఁ దా వెయ్యది? పురాణపఠనోదితజ్ఞానచంద్రచంద్రికలు హృదాకాశమునఁ బ్రకాశించుచున్నపుడు, నరుఁడు కామాదిదుర్గుణాంధకారవిముక్తుఁడై కేవలప్రేమామృతసిక్తమానసుఁడై సమబుద్ధితో సోదరజాతినాదరింపఁ గోరుచుండును.

కావున మానవమనస్సీమను సదా యీజ్ఞానకళలు ప్రసరించుటకుఁ దఱచు పురాణపుణ్యకథలు చదువుచుండవలయును. కొందఱు పురాణములయందు విరుద్ధకార్యములతో నిండియున్న పిచ్చికథలు కల వని యుఁ, గావున నట్టియసంభవవిషయములఁ జదువుటవలన జనులకు మూఢవిశ్వాసములు హెచ్చుచున్న వనియు, నొకవిరోధమును జూపుచున్నారు. కాని యిది యొకవిరోధాభాసము. ఇది పురాణసాంప్రదాయ మెఱుఁగనివారి కుదయించుచుండును.

పురాణవర్ణితము లగువిషయములు యథావృత్తము లనియు నర్థవాదము లనియు, రెండువిధములు. యథావృత్తము లన, నిజముగా జరగినవిషయములు. పురాణముల వర్ణింపఁబడిన యథావృత్తము లగువిమానవిహారాదులును, శాపానుగ్రహములును, గాలత్రయపరిజ్ఞానములును, మొదలగునద్భుతవిషయములు నేఁటికి బహుపురాతనము లగుటచే నప్పటి తపోమహిమలును, అప్పటియాధ్యాత్మికజ్ఞానసంపదలును, అప్పటియింద్రియనిగ్రహములును, అప్పటిభౌతికశాస్త్రజ్ఞానములును, లోనగుశక్తిసామర్థ్యములు లేనియిక్కాలపునవనాగరకుల కవి విరుద్ధములుగాఁ దోఁపవచ్చును గాని యంతమాత్రమున నవి యసంభవములు కాఁజాలవు. శాస్త్రజ్ఞుల కట్టివి విపరీతములుగఁ దోఁపవు.

దినమునకు మూఁడుసారులు భోజనమును బదిసారులు ఫలాహారము నుండినఁగాని నిలువలేని దుర్బలమానవునకు, నేకాదశియుపవాస మన్న నసంభవకార్య మనితోఁపవచ్చును. అంతమాత్రమున నేకాదశీవ్రతగరిష్ఠుల కది యసంభవకార్య మగునా? నాగరకాగ్రేసరులును భౌతికశాస్త్రనిపుణులు నగుపాశ్చాత్యపండితులు మనపూర్వులు పురాణముల వర్ణించిన యద్భుతవిషయముల విప్ల

దు శాస్త్రప్రమాణములచే స్థిరపఱచుచున్న వారు. వీని నన్నిటి నిటఁ జర్చించిన వ్యాసము విపుల మగు నని విడచితిని.

అర్థవాద మన నొకప్రధానవిషయమును బోధింపఁదలఁచి, దాని నొకకల్పితకథతోఁ జేర్చి బోధించుట. ఎట్లన నెంతటిసహజశత్రువులైనను వైరమును వీడి యేకీభావమును బొంది, పట్టుదలతోఁ బనిచేసినపక్షమున మృత్యువునుగూడ సాధింపనగు నుపాయముల సంపాదింపవచ్చు ననియు, నట్టిపూనిక కల కార్యశూరులకు భగవంతుఁడు కూడఁ దోడ్పడు ననియు, గాని కామాంధత ఫలసిద్ధికి భంగకారి యదియు నీలోనగునీతిని బోధింపఁదలఁచి, యావిషయమే క్షీరసాగరమథన మని యొకకథగా వర్ణింపఁబడినది.

ఇటఁ గథ యథార్థమా? అయథార్థమా? అనువిషయము ముఖ్యము కాదు. మఱేమన సంఘీభావము సకలకార్యసాధక మనెడి యిందలి నీతియే ముఖ్యము. ఇట్టి యర్థవాదము లనేకములు పురాణములయందుఁ గలవు. ఈరీతిగా నర్థవాదములద్వారా విషయముల బోధించుట వేదములనాటినుండియు వ్యవహారములో నున్నది. కావునఁ బురాణములు బోధించు విరుద్ధవిషయము లెవ్వియును లేవు. కొందఱాధునికులు పురాణములు బహుపురాతనము లగుటచే నాధునికనాగరకులు గ్రహింపఁదగిన జ్ఞానము కలవిగా నుండ లేదని, పలుకుచున్నారు. కాని యిది యొకతప్పుటూహ. ప్రాఁతదైనంతమాత్రమున నగ్రాహ్యము కాకపోదు. అట్లు కాదందురా బహుపురాతనము లగురత్నకాంచనాదు లెల్లఁ ద్యాజ్యములు కావలసివచ్చును. గ్రాహ్యతాగ్రాహ్యతలు, గుణాగుణముల నాధారముచేసికొని యున్నవి కాని నూతనానూతనముల నాధారముచేసికొని యుండ లేదు.

ఇట్లనుటచే మనోహరార్థసంపాదకము లగునూతనగ్రంథములు గ్రాహ్యములు కావని నాతంపు కాదు. మఱేమనఁ బ్రాఁతవన్నమాత్రమున బురాణముల నవమానించి క్రొత్తవన్నమాత్రమున నూతనగ్రంథములే ముక్తిహేతువు లని తలఁపరాదు. నూతనముగాఁ దనపాణిగ్రహణ మొనర్చినమోహనాంగిఁ జూచిన మాత్రమున సర్వమునకును నామెయె గతి యని తలఁచి, సదా తన శ్రేయస్సును గోరుమాతృదేవతను వృద్ధాంగన యని పూజింపకుండుట నీతికి దూరము కదా!

మనోహరము లగు ప్రియయొక్క ప్రియోక్తుల నాదరింపవలయును, శ్రేయస్కరము లగుమాతృదేవతయొక్క హితబోధలను మన్నింపవలయును.

అదిగాక భూతమునకును వర్తమానమునకును సంబంధము విడిపోరాదు. అట్టికలయిక పురాణపఠనమునం గాని నిలువదు. జపానుదేశముయొక్క ప్రస్తుతపునునత యంతయు దానిపురాతనచారిత్రమునంను, గౌరవముంచుటచేతనే కలిగిన దని చరిత్రాభిజ్ఞులు తెలుపుచున్నారు. అంతగాఁ బ్రాచీనముగాని జపానుదేశచరిత్రమే యిట్లుండ బహుపురాతన మగుమనదేశచారిత్రమును గూర్చి తెలుపవలసిన దేమున్నది. హిందూదేశమునందలి ప్రస్తుతవిద్యాభ్యాసపద్ధతికంటె జపానుదేశమందలి స్వదేశచరిత్రబోధతోఁ గూడిన మార్గము చాల బాగుగా నున్న దని, ఫ్రెడరిక్ హారిసన్ దొరవారు తెల్పియున్నారు.

శాకాహారమునకు నలవాటుపడిన జీర్ణాశయమునకు శాకాహార మిచ్చినపుడే యది దానిని సుఖముగ జీర్ణముచేసి, దేహపోషకము లగుసప్తధాతువులను బుట్టించును గాని, అనభ్యస్త మగుమాంసాహారము నిచ్చిన దానిని సుకరముగ జీర్ణముచేయఁజాలకపోవుటయే కాక దుర్బల మైనవ్యాధిని గూడఁబుట్టించునటులఁ జిరకాలమునుండి భారతభాగవతాది పావనపురాణవిషయముల వినియానందించి బాగుపడుటకు నలవాటుపడియున్న భారతీయుల కంతగా నితరపురాణవిషయములు సుగ్రాహ్యములు కాఁజాలవు కావుననే—

"గృహోపకరణము లొకయింటినుండి మఱియొకయింటికి మార్చినట్లుగా, జాతీయపరమావధు లొకజాతినుండి వేఱొకజాతికి మార్పఁదగినవి కా" వని కుమారస్వామిపండితుఁడు తెలిపియున్నాఁడు.

ఇట్లు ప్రాజ్ఞు లగువా రనేకులు తలఁచియున్నారు. కావున ముందు మనదేశీయులకు స్వపురాణవిషయముల బోధించి, పిమ్మట దేశాన్తరపురాణచరితములఁ దెల్పినఁ దెల్పుదుముగాక. కొందఱకు గోక్షీరములయ్యును జక్కెర చేర్చినఁ గాని రుచింపనట్లు కేవలపురాణశైలి రుచింపకున్నచో, నట్టివారికి సుబోధ మగునటుల లక్షణానుసారముగ గ్రంథములు వ్రాయుట యవసర మనియే నాతలంపు.

ప్రస్తుతము మనయాంధ్రకవిసోదరులు కొందఱు వ్రాయుచున్న నవలలు పాఠకుల కంతగా నుపయుక్తము లగుచున్నటుల వాకొనదొఁపదు. మనపూర్వు

లు గ్రంథముల రచించుటలో నధికారి, సంబంధ, విషయప్రయోజనముల ముఖ్యముగ నేర్పఱచి గ్రంథసమాప్తిం జేయువారు. ప్రస్తుతమీ ప్రయోజన శూన్య మగువిషయమును (కేవలకథను) ప్రధానముచేసికొని గ్రంథసమాప్తిని జేయుచున్నవారు. ప్రయోజనము నంతగాఁ బాటించుట లేదు.

కావుననే యీనవీననవలలు కాలము గడుపుటకుఁ దగుకథను గలిగియున్నవి కాని, కథ ముగిసినకడపటఁ బాఠకులు గ్రహింపఁ దగిన ప్రయోజనమును (నీతిని) గలిగి యుండ లేదు. ప్రాజ్ఞు లగుపాఠకులు కేవలకథామాత్రపాఠములచే నమూల్య మగుకాలమును వృథాచేయక, నీతిదాయకము లగుగ్రంథరాజములఁ జదివి తమజీవితముల సార్థకము చేసికొనవలయును.

ఆర్యులపురాతనౌన్నత్యమును మనము తెలియఁ గోరుదుమేని తప్పక యీపురాణరాజములఁ జదివి తీరవలెను. వీనియందు వర్ణింపఁబడిన పట్టణముల యొక్కయు, నుద్యానవనములు, కోటలు, సౌధవీథులు, వాహనాదులు, నితరసంపదలయొక్కయు వైభవములఁ, జదువునపుడు భారతీయపురాతనౌన్నత్యము స్మృతికివచ్చి వెంటనే పాఠకునినేత్రములు మూఁతవడి, చేతనస్మృతి దక్కి చేతనున్న పుస్తకము క్రిందికి జాఱునంతటి దేహపారవశ్యత సంభవ మగును.

పురాణనాయకుల యసమానఘనభావములు తెలియుటకు నిట నొకటి రెండువిషయములఁ దెల్పెదను. సంస్కృతవాఙ్మయమున నాదికావ్య మని పేరు వడసిన శ్రీమద్రామాయణమునకుఁ గథానాయకులైనసీతారాముల పావనగంభీర భాషణముల నాలింపుఁడు. మీ రపుడు విస్మయానందభరితమానసులై పురాణ సంపదలఁ దెలిసికొనఁగలరు.

శ్రీరామచంద్రుఁడు రావణసంహారముకొఱకుఁ గపిసేనలతో నేగి సముద్రముకడ దిగియుండ, రావణానుజుఁ డగువిభీషణుఁడు మంత్రులతో వచ్చి యాకసమునుండి శ్రీరాముని శరణు వేఁడెను. వీరాగ్రేసరుఁ డగుశ్రీరాముఁడును మాఱుమాటాడక వెంటనే వానికభయ మిచ్చెను. అపు డచట రాజనీతికోవిదు లగువానరవీరు లెల్లరును, నీతిశాస్త్రప్రమాణములచేతను యుక్తివాదములచేతను విభీషణుఁడు క్రూరరాక్షసుఁ డనియును, దేవరకుఁ బ్రబలశత్రు వగురావణున కనుజుఁ డనియుఁ గావున వీనిఁ జేరఁదీయరా దనియు బహువిధముల బోధించిరి. వారికి రాముఁడు తెలిపినదేమనఁ—

శ్లో. సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ
మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన
దోషో యద్యపి తస్యస్యా త్సతామేత దగర్హితమ్.

అనఁగా "నొక్కసారి నాకుఁ బ్రపన్నుఁడై నీవాఁడ ననిన వెంటనేవాని సర్వభూతములనుండియుఁ గాపాడెదను. ఇట్లుచేయుటనాకు వ్రతము, పైకి మిత్రభావమును వెల్లడించుచు నాయొద్దకుఁ జేరినవాని నెట్టియిక్కటులు వచ్చినను నరకుసేయక కాపాడువాఁడ నే కాని విడచువాఁడను గాను. ఒకచో వాఁడు లోఁ గపటియైన నాదోషము వానిదే. దాన సత్పురుషుల కెంతమాత్రము లోపము లేదు"

ఇట్టి స్వసుఖనిరభిలాషులును, బరసుఖఘటనాపటిష్ఠులు నగుపురాణపుణ్యపురుషుల చరితములఁ జదివిన గుణసంపద కలుగకున్న మఱేమార్గమునఁ గలుగఁ గలదు?

ఇఁక నీవీరనాయకుని యిల్లా లగు సీతయొక్క పావనగంభీరభావమును వినుఁడు. రావణసంహారానంతరము రామునియాజ్ఞానుసారము హనుమంతుఁడు సీతకడ కేగి శ్రీరాముని విజయవార్తను దెలిపి, యచటఁ గావలియున్న రాక్షసాంగనలఁ గడతేర్చుటకు సెలవొసంగు మని కోరెను. అప్పు డాసాధ్వి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

శ్లో. రాజసంశ్రయవశ్యానాం కుర్వతీనాం పరాజ్ఞయా
విధేయానాంచ దాసీనాం కఃకుప్యేద్వానరోత్తమ
ప్రాప్తవ్యంతు దశాయోగా న్మయైత దితి నిశ్చితం
దాసీనాం రావణస్యాహం మర్షయామీహా దుర్బలా.

అనఁగా "వానరోత్తముఁడా! ఒకరాజు నాశ్రయించి యతనియాజ్ఞానుసారము కార్యములఁజేయుచుఁ దమయేలికకడ వినయముగ సంచరించుచుఁ బరాధీనులై యున్న దాసీజనులపైఁ గోపమేల? నాదుర్దశయే నన్నిటు బాధించినది కాని వీరుకారు, వీరు తమయేలికయాజ్ఞానుసారము నన్ను బెట్టినబాధల సహించుచునే గాని వీరిఁబాధించుటకు నిష్టపడునంతటి కఠినాత్మురాలను గాను" అని.

అయ్యలారా! యింతకంటె నుదారాశయములు కలవా? ఈమెకంటె ను బావనచరితలు కలరా? ఈక్రూరరాక్షసాంగనలు క్షణమైనను దనసౌభాగ్యదైవత మగుప్రాణేశ్వరుని స్మరించుటకైన నవకాశమీయక, తుచ్ఛబోధల చేతను, క్రూరకృత్యములచేతను, అహర్నిశ మొక్కరీతిని బాధించిరే? యట్టి కఠినాత్మల సీతయేకాక మఱెవరైనను ముక్కలక్రిందఁ గోయింపక విడతురా?

ఇట్టి యద్భుతచరితము కలసాధ్వీమతల్లు లెందఱో మనపురాణములయందుఁ గలరు. మానవులఁ జైతన్యకళాపూర్ణులను గాఁ జేయుట కీవీరమాతలచరితములకంటె వేఱేమి కావలయును? లోకముల నన్నిటి నానందపరవశములుగను, శీలవంతములుగను, జేయుట కీవాల్మీకిరామాయణ మొక్కటి చాలదా? సంస్కృతవాఙ్మయమున నున్న యిట్టిఘనవిషయముల సర్వజనగ్రాహ్య మగునటులు మృదుశైలిని పుస్తకముల వ్రాయుటకంటెను, వ్రాయించుటకంటెను, మన మాంధ్రభాషకుఁ జేయుశాశ్వతోపకార మెయ్యది?

ఆర్షకులప్రసూతు లగుభారతీయులు స్వగ్రంథముల నొక్కప్పుడైనఁ జదువక, యలనుల్లై చెప్పుదుమాటలను విని, యమూల్యార్థసంపన్నము లగుపురాణములయెడ నీరసభావమును జూపుట కడుశోచనీయము. ఘనహృదయులారా! మన మీయార్యావర్తము నందలి సోదరీసోదరులనెల్ల క్షేమంకర మగు నుకేగమ్యస్థానమునకు నడుపఁదలఁచినచోఁ బురాణపుణ్యకథల బోధించినఁగాని, మనమనోరథ మీడేఱ నేరదు.

మఱియు నీపురాణములు, దేశచారిత్రముల దర్పణములకరణిఁ బ్రతిఫలింపఁ జేయుచున్నయవి. మానవు లెంతవఱకు స్వదేశచరిత్రను దెలియకుందురో యంతవఱకుఁ దమయుద్యమముల ధైర్యోత్సాహములతో నుపయుక్త మార్గముల నడుపఁజాలరు. మఱియు నట్టివారు స్వదేశీయు లనిపిలుచుటకుఁ గూడ నర్హులు కారు. కావున స్వదేశచరిత్రాభిమాను లెల్లరును బురాణముల నామూలాగ్రము పఠింపవలయును.

కొందఱు మనమిప్పు డిరువదియవశతాబ్దమున నున్నవార మనియు నందుమూలముగ మనపూర్వు లిట్టినాగరకతలేక మృగప్రాయులుగా నున్నపుడు వ్రాసినపురాణములఁ జదువుట తెలివితక్కువ యని వ్రాతలయందును బ్రసంగములయందును గూడ నిర్లజ్జముగాఁ దెలుపుచున్నవారు.

కాని యిది యొకపిచ్చితలంపు. ఏలయనఁ బూర్వమెవరిపూర్వులు జ్ఞానశూన్యులై మృగములవలె మెలఁగుచుండెడివారో, అట్టినంతతివా రొకశతాబ్దమునకంటె వేఱొక శతాబ్దమునందుఁ గ్రమాభివృద్ధి నందుచున్నపుడు, అట్లుతలఁచుట యుక్తమే కాని భారతీయుల స్థితి యట్టిది కాదు. ప్రస్తుతఖండాన్తరవాసుల పూర్వులు గృహవస్త్రాదినిర్మాణముల నెఱుఁగనపుడే యెవరిపూర్వులు గృహాదినిర్మాణములఁ బ్రావీణ్యమును గాంచియుండిరో, ఇతరదేశీయుల పూర్వులు, అక్షరములఁ గూడ నెఱుంగనియపుడు, ఎవరిపూర్వులు రసభరితము లగుగంభీరకావ్యరచనలయందె వన్నెకెక్కిరో, పెక్కెల దేశాన్తరములెల్ల నవిద్యాముద్రితములై యుండ, నెవరిదేశమున సకలకలాపూర్ణుఁ డగుప్రబోధపూర్ణచంద్రుఁడు ప్రకాశించుచుండెనో, అట్టియార్షకులప్రసూతు లగుభారతీయులపైయట్లుతలఁచుట యెట్లుపొసఁగును? వీరిపుడు ఖండాన్తరవాసు లగుశాస్త్రవేత్తలు, ఆర్షపురాణములఁ జదివి యందలియమూల్యవిషయముల శ్లాఘించుచుండుటను గని, విన్నఁబోయి మిన్ను చూచుచున్నవారు.

కొందఱు నవమేధావులు తాముకోరు లౌకికానందము లేవియొ కొన్ని పురాణములయందు లేవని పావనచరితములగు పురాణములఁ ద్వేషించుచున్నవారు. వీరియవస్థఁ జూచ నీ క్రిందిశ్లోకము స్మరణకు వచ్చుచున్నది.

శ్లో. కేఽమీ లోహితలోచనాస్యచరణా హంసాః కుతో మానసాత్
కింతత్రాస్తి సువర్ణపంకజదళాన్యంభ స్సుధాసన్నిభం
తత్తీరం కిము రత్నఖండరచితం కల్పద్రుమావేష్టితం శంబూకాః
కిమునస్తి నేతిచ బకై రాకర్ణ్య హీహీకృతమ్.

మఱికొందఱు మేమీపురాణములు సంఘోపయోగము లగునేమొ యని పరిశీలించితిమి కాని యట్టి యుపయోగ మేదియుఁ గానరాదు సరియే కదా, యివి యింద్రియానందములు తుచ్ఛము లనియు, సంసారము దుఃఖభాజన మనియు, నిస్సంగమే ముక్తిహేతు వనియు,నిట్లువిచ్చివైరాగ్యములబోధించి మానవుల సంఘమునుండి తొలఁగింపఁ జూచుచున్నవి. కాని సాంఘికాభివృద్ధికి ననువగుతోవ లిందుఁ గానరావని పలుకుచున్నవారు. కాని నేర్పుతోఁ బరిశీలించిన నివి సేమ తమమనోరథము తీర్చుటకు వలయుమార్గములఁ గలిగియున్నవని తెలియఁ జాలకున్నవారు. ఇదిచూడ నీ శ్లోకము జ్ఞప్తికివచ్చుచున్నది.

శ్లో. హరినఖరవిముక్తా రక్తసిక్తాహి ముక్తాః
పరిణతబదరాణీ త్యాదరే ణోపగృహ్యా
సపది సరసి ధౌతాః ప్రత్యభిజ్ఞాయ ముక్తాః
పరికిరతి కిరాతీ హస్త కాన్తార ఏవ.

నిక్కమగు వైరాగ్యసంపన్నులై స్వార్థములఁ ద్యజించినవారే సంఘమునకు మేలుచేయఁగలరు కాని, ఈషణాత్రయబద్ధు లగుసాంసారు లంతగా సాంఘికసంపదలకు సహకారులు కాఁజాలరు; పురాణాన్తర్గతము లగుభగవద్గీతాది వేదాన్తబోధలు మానవులు స్వధర్మముల నెఱవేర్పవలయు ననియు, స్వధర్మములఁ ద్యజించువాఁడు సంఘబాహ్యుఁ డగునవియు, బోధించుచున్నవి. కాని, సంఘాభివృద్ధిని నిరసించి దుర్బలము చేయుమని బోధించుటలేదు.

అధికారితారతమ్యమునుబట్టి వైరాగ్యమును బోధించుచున్నను విరాగులు కూడ లోకసంగ్రహార్థము జాతీయధర్మముల నెఱవేర్పవలయు ననియే ఘోషించుచున్నవి. పరమవైరాగ్యసంపన్ను లగుజనకాది సార్వభౌములచరితము లీవిషయమునే ఋజువుచేయుచున్నవి.

మనయార్యసిద్ధాన్తములు లౌకికసుఖములే ముఖ్యములు కావనియు, నాముష్మికభంగకరములు కాకుండులాగున నియమానుసార మనుభవింపవలయు ననియు, బోధించుచున్నమాట యథార్థమే. కాని యీబోధను గాదనుప్రాజ్ఞు లుండ రనియే నాతలంపు. పురాణపఠనమువలన మనుజుల కెట్టిలాభము కలదో మనపూర్వులే తెలిపియున్నవారు.

శ్లో. పఠనా చ్ఛ్రవణా ద్యేషాం నృణాం పాపక్షయో భవేత్
ధర్మాధర్మపరిజ్ఞానం సదాచారప్రవర్తనం,
గతిశ్చపరమా తద్వత్ భక్తిర్భగవతి ప్రభౌ" అని.

ఇటుల మనవారేకాక పాశ్చాత్యవిద్వాంసు లనేకులు పురాణములఁ బ్రశంసించి యున్నవారు. ఇఁక వీనింజదివి కృతార్థులైన వారెవరైనఁ గలరా యనిన వేనవేలు కలరు. పూర్వము వర్ణధర్మములు సంకీర్ణములు కాక యెంత వేఱుపడి యున్నను, అప్పటిభారతీయులు పురాణచరితములఁ దమకు ప్రమాణములుగా నిడికొని మసలుటచేతనే తలలువేఱయ్యును దలఁపులుమాత్రము వేఱుపడక సోదరభావముతో నన్యోన్యసహాయాదులై భారతీయసంఘము నత్యున్న

త్యమునకుఁ దేఁగలిగియుండెరి. ఇందుల కనేకప్రమాణములు కలవు. గ్రంథవిస్త రభీతిచే విడచితిని.

పురాణకథలఁ జిరకాలమునుండి మనము వినుచుండుటచేఁ జర్వితచర్వణము కాదా యుందురేని యట్లనుట తగదు. మనోహరపదార్థము లెన్నిసార్లెంతకాలమునుండి యనుభవించుచున్నను విసుగు పుట్టదు సరియేకదా యందలి సారస్యము తెలిసినకొలఁది వానినే యాస్వాదింపఁ గోరిక లుద్భవించుచుండును. కావుననే రసజ్ఞు లిట్లు తెలిపియున్నవారు.

శ్లో. ఆదిత్యస్యోదయస్తాత సౌవర్ణం భారతీ కథా
ఇష్టా భార్యా సుమిత్రం చాపూర్వాణ్యేవదినేదినే.

ఇట "భారతీకథా" అనునది సర్వపురాణోపలక్షణము కావున నాంధ్రకవిపుంగవు లెల్లరును బురాణేక్షుకాండములనుండి సువిమర్శయంత్రములచే రసమునుదీసి, సువర్ణకాంస్యపాత్రల నింపి యాంధ్రజాతికి సుఖాస్వాద్య మగునట్లు చేయుదురుగాక.

ఇట్లుచేయక సన్మార్గబోధకము లగుపురాణముల నిరసింతురేని, ప్రస్తుతము కావలసినసోదరభావమును సౌశీల్యమును గేవల ముపన్యాసపీఠములయందే స్థావరమై యుండునుగాని పరస్పరవైషమ్యదూషితము లగుమానవహృదయములఁ నాటుకొని కార్యాచరణమునకుఁ దోడ్పడఁజాలదు.

ప్రస్తుత మాంధ్రవాఙ్మయము నెక్కపెట్టునఁ దలక్రిందుఁ చేయఁగోరువారును, అట్లు చేయరాదు సనాతననియనుములనే నిలుపవలయు ననువారును గూడ భాష యెటు లుండవలయునా యనివిమర్శించుచున్నవారే కాని విషయ మెటు లుండవలయునా యనివిమర్శించుచున్నట్లు గానరాదు.

ముందు నిర్ధారణ చేయఁదగినది విషయము కాని భాష కాదు. విషయము ఘనమైన దగుచో నేభాషలో వ్రాసిన నేమి. మధురాహారమును బర్ణములలోఁ బెట్టిననేమి, వెండిగిన్నెలలోఁ బెట్టిననేమి. దానిఘనత యెప్పుడునొక్క రీతినే యుండును గాని, వ్యత్యస్తము కాఁజాలదు. కటుపదార్థము కాంచనపాత్రలలోఁ బెట్టినను దానికి మాధుర్యము కలుగఁజాలదు.

మఱియు స్వర్ణములు సువర్ణఘటితము లైనపుడే యమూల్యాలంకారములై ఘంటమ్ములచే నాదరింపఁబడునట్లు ఘనవిషయములు సలక్షణ

సువాక్యఘటితములై నవ్యులే యార్యులచే నభినుతింపఁబడును. సత్తగుల్లలును, గులకరాళ్లను సీసముతోఁ బొదిగిననేమి" సీనారేకుతోఁ గట్టిననేమి? అట్లి నీరసవిషయముల గ్రామ్యభాషలో వ్రాసినను వ్రాయవచ్చును గాని యిపుడు నే నీభాషాశైలింగూర్చి ముచ్చటింపఁ దలఁచికొనలేదు.

ఓయాంధ్రమహాశయులారా! మీరు నిజముగా నిష్కళంక మగు పితృభక్తిని, దైవభక్తిని, గురుభక్తిని, దేశభక్తిని, రాజభక్తిని గోరువా రగుచో నట్టి భక్తిపంచకము పురాణపఠనమునఁగాని వేఱుమార్గమున మనకు లభింపఁజాల దని నిశ్చయముగ గ్రహింపుఁడు. మానవహృదయముల నట్టిపావనభక్తినదీప్ర వాహములఁ బ్రవహింపఁజేయు ఘనోపాఖ్యానములు వేనవేలు పురాణముల యందు విరాజిల్లుచున్న వని తెలిసికొనుఁడు.

ఆర్యులారా! మరల మీకు నేఁజేయు నీవినయపూర్వక విజ్ఞప్తిని సావధానులరై విన వేడుచున్నవాఁడను.

శ్రేయస్కాము లగునోయాంధ్రమహాజనులారా! కేవలస్వలాభపూరణపరాగపటలముచే నాచ్ఛాదిత మగుచున్నట్టియు, జాతిద్వేషదావానలముచే దగ్ధమగుచున్నట్టియు, నిరంతరక్షామప్రచండగ్రీష్మముచే నీరస మగుచున్నట్టియు నీపుణ్యభూమిని, ఈభారతమాతను, జీవకళాసనాథ మగునటుల చేయఁగోరుదురేని శ్రీరామాద్యుత్తమనాయకులనెడిగంభీరగర్జనముల తోడను, పాతివ్రత్యకళావిరాజిత లగుసీతాద్యుత్తమనాయిక లనెడితటిల్లతికలతోడను, తేజరిల్లుచున్న పురాణకథాజీవనభరితము లగునవీనాంధ్ర కావ్యనీరదములు తిరుగ నీయార్యావర్తనభోవీధిని గ్రమ్మి, సుబోధామృతవర్షధారలఁ గురియునటుల భగవంతునిఁ బ్రార్థింపుఁడు. దీనిని మించిన దేశోపయోగకార్యము వేఱొండు లేదనియు, దీని మించిన పావనకృత్యము వేఱొకటి లేదనియుఁ దెలిసికొనుఁడు.

కావున మనయాంధ్రభాషయందు వ్రాయఁబడు నవలలును, నాటకములును, మున్నగునవి ప్రాయికముగా మనపురాణములనుండి తీయఁబడిన యుత్తమనాయక జీవచరిత్రలు కలవిగా నుండవలయును.

ఓకరుణాకరా! పరమేశ్వరా! మాయాంధ్రహృదయపుండరీకములు వికసించి శ్రీమంతము లగునటుల నీపూర్వదేశమునఁ బురాణజ్ఞానసూర్యోదయ మగునటుల బ్రసాదింపుము.

ఓమ్ తత్సత్

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి

శ్రీరామచంద్ర.

# సంశయము.



ఎవనిగతిభేదమునఁ జేసి • యీజగంబు
వివిధపరిణామములతోడ • వెలయుచుండు
నట్టికాలాత్మకునకు ని • రంతరునకు
ననితరాధీనగతికి వం • దనశతంబు.

---

నిత్యమై యద్వయంబయి • నెగడుదాని
నాకృతిగుణాహ్వయాభావ • మైనదాని
నాదిమధ్యాంతరహితమై • యలరుదాని
నఖిలకర్మంబులకు సాక్షి • యైనదాని
నఖిలశక్తులకును మూల • మైనదాని
నఖిలపరిణామకారణ • మైనదాని
నఖిలమును జూచి చూడని • యట్టిదాని
నఖిలమును జేసి చేయని • యట్టిదాని
నఖిలమునునంటి యంటని • యట్టిదాని
నఖిల మగుదాని నవ్యయ • మైనదాని
విమలవిజ్ఞానధను లైన • విబుధు లెల్ల
నైకకంఠ్యంబుగాఁ బర • మాత్మ యనిరి;—
కాని యామూర్తి నేరీతిఁ • గాంచ నగును
తెలిపి చూపఁగ లేక య • దృష్టమనిరి;
పలికి బోధింపలే కని • ర్వాచ్య మనిరి
అతితరానుభవంబున • నామహాత్ము
లేది పరమాత్మ యని నిశ్చ • యించినారో
యావిశేషంబు లెల్ల నీ • యంమఁ గూడ
నగవడుచునుండె నిది యేమి • యద్భుతంబో

కాలమా! శాశ్వతత్వంబు • గలదె నీకు?—
దైవమునకును నీకు భే • దంబు గలదొ,
నీవె దైవంబొ తెలియంగ • నేరకుంటి
నుగము గ్రుంగుచునుండె నే • మున్న దింక?
నాత్మనిర్వృతి కెవ్వారి • నాశ్రయింతు?
నెవరి నడుగుదు సంశయం • బెట్లుతీఱుఁ
గాలమా! యించు కాగుము • కరుణతోడ
నాదుసంశయమును దీర్చి • పోదుగాని—

అధికలోకానుభవయుక్తు • లైనవారు
అనుభవంబున విజ్ఞాను • లైనవారు
తెలిసికొన్నంత యడిగినఁ • దెలుపువారు
ప్రకృతిలో ముందు నీకంటెఁ • బడినవారు
పేరుగలవారు, నాకంటెఁ • బెద్దవారు
పుడమి విడనాడి యెచటికో • పోయినారు;
ఉన్నవారెల్ల నాకంటెఁ • జిన్నవారె
యెవరి నడుగుదు? సంశయం • బెట్లుతీఱుఁ?
గాలమా! యించుకాగుము • కరుణతోడ
నాదుసంశయమును దీర్చి • పోదుగాని:—

తల నరసియుండె; మేనిర • క్తము హరించె;
చూపులు నశించె; బలుగమి • శూన్య మయ్యె;
నడుము లేవదు; కాళ్లకు • నడక లేదు;
శల్యములు సంధులను బాయు • సమయ మయ్యె.
నేను నీతోడఁ బరువెత్త • లేను గాన
నేను గన్నార నినుఁ గాన • లేను గాన
నాదువిన్నప మొక్కటు • న్నయదిగానఁ
గరుణ నీదీనమానవు • మొఱ వినంగఁ
గాలమా! నీవొకించుక • కాలమాఁగు!
నాదుసంశయమును దీర్చి • పోదుగాని:—

తల్లియొడిలోనఁ జేరి తా • తాయటంచుఁ
గాలుసేతులు గదవుచుఁ • జాలు ద్రావి
చిన్నిచిఱునవ్వు వెన్నెలల్ • చిందువారఁ
గన్ను లరమోడ్చి నిద్దురఁ • గనుట కాని
నీవు తారుట యేఁ జూడ • నేరనైతి
నాఁటియవ్యక్తశోభికాం • తరమునుండి
నేఁటివఱకును మేలుకో • నేరనైతి
నిపుడు నీవొందు గాక నా • కేమి కలదు?
కాలమా! యించుకాగుము • కరుణతోడ
నాదుసంశయమును దీర్చి • పోదుగాని;—
వనవిహారంబులను జేయు • వాంఛతోడఁ
గుసుమసౌరభములఁ గాంచు • కులుకుతోడ
మలయమారుతముల మెచ్చు • మమతతోడఁ
గోకిలాలాపముల విను • కోర్కెతోడఁ
దమిఁ బ్రియాన్వేషణము చేయు • తలఁపుతోన
తెలిసి తెలియనిరీతిని • దిరిగితిరిగి
నావసంతంబు కడచని • పోవుచుండఁ
జోద్యముగ నంతయును జూచి • చూడనైతిఁ
గాలమా! యించుకాగుము • కరుణతోడ
నాదుసంశయమును దీర్చి • పోదుగాని:—
మోహమృగతృష్ణ యొకవంక • ముసరుచుండ,
విరహపరితాప మొకవంకఁ • గెరలుచుండ,
వేఁడినిట్టూర్పు లొకవంక • వెడలుచుండ,
నుష్ణసంకల్పరుచిరారు • ణోదయములు,
నప్రసన్ననిదాఘసా • యంతనములు,
జాగరీకృతయామినీ • సముదయములు
[illegible]న్నియు నాగ్రీష్మ • సమయమందుఁ,
[illegible]ని నాకవ్వి డీయూహ • కలుగలేదు

కాలమా! యించుకాగుము ♦ కరుణతోడ
నాదుసంశయమును దీర్చి ♦ పోదుగాని:—
కైరవశ్యామసుందరాం ♦ గంబుతోడఁ
జారువిద్యుద్విలాసహా ♦ సంబుతోడ
మేలిచూపుల నర్ధాంగి♦లీల వచ్చి
సమధికానందబాష్పవ♦ర్షంబు గురిసి
చల్లగా మేను మఱపించి ♦ సాగిపోయె
నతిచమత్కృతి నాదువ♦ర్షావసరము.
పోవువేళను దుఃఖాశ్రు ♦ పూరమయ్యె
నింక నితరంబు నామది ♦ కెట్లు తోఁచు?
తోఁచి యిప్పుడు ప్రశ్నింపఁ ♦ జూచుచుంటిఁ
గాలమా! యించుకాగుము ♦ కరుణతోడ
నాదుసంశయమును ♦ దీర్చిపోదుగాని:—
జీవనకళంకమంతయుఁ ♦ బోవఁ జేసి
మానసాకాశవీథి ని♦ర్మలము చేసి
కలుషపంకంబు నెల్లనిం♦కంగఁ జేసి
హృదయకమలంబు నలరించి ♦ పొదలఁ జేసి
నాశరద్వాసరంబులు ♦ నడచునాఁడు
వివృతవేణిక యగునదీ ♦ విలసనంబు
వెలువడుచునున్న యిసుకతి♦న్నెల తెఱంగు
కలసియాడెడురాయంచ ♦ కవ బెడంగు
తనివిదీఱక నిరతంబుఁ ♦ గనుటకొఱకె
మరగి నీమాటఁ దలపోయ ♦ నెఱుఁగనైతిఁ
గాలమా! యించుకాగుము ♦ కరుణతోడ
నాదుసంశయమును దీర్చి ♦ పోదుగాని:—
నలుఁగడల మంచుకావిరు ♦ లొలయువేళ
హింపసంస్ఫూర్తి యత్యల్ప ♦ మైనవేళ
దడదడంగూర్చి కంపంబు ♦ దొడరువేళ

వనలసాన్నిధ్యమును గోరు • నట్టివేళఁ
దమివిశేషించి యసుఖంబుఁ • దార్చువేళ
మదిఁ గలంగించు నాదుప్రే • మంతవేళ
ముడుచుకొని కన్నులను మూసి • గడపినాడఁ
గాని యావేళ నాముందు • గతిని గూర్చి
క్షణమునైనైన నూహింపఁ • జాలనైతి;
నుగము గ్రుంగుచునుండె; నే • మున్న దింకఁ?
గాలమా! యించుకాగుము • కరుణతోడ
నాదు సంశయమును దీర్చి • పోదుగాని:—
నామనోరథగతికి భి • న్నత ఘటిల్ల
శైశిరము వచ్చెఁ, బ్రకృతి య • సారమయ్యెఁ;
జీవితలతాలవాలంబు • జీర్ణమయ్యెఁ;
పాటవము తగ్గె నాకుల • పాటు దోఁచెఁ;
నాశ కింకను చిగిరించు • నాశ కలిగెఁ;—
బతనశీలంబు లగుజీర్ణ • పత్త్రవితతు
లెల్లఁ దలపోయ మున్ను చి • గుళ్లెకావె?
ముందుఁ దలనూపఁబోవు నా • మోసు లెల్లఁ
బండుటాకులు గాకుండ • నుండఁగలవె?
బెండువడి రాలి పడకుండ • నుండఁగలవె?
ఇట్టిచర్విత చర్వణ • మెందుకొఱకు?
ఇంతమాత్రాన కాసించు • టెందుకొఱకు?
అట్టె తలనూపుచుండెడు • నాచిగుళ్ళు
పండి రాలెదు నీజీర్ణ • పత్త్రములును
నెచటికో? యెటకేగునో! • యెఱుఁగరాదు
కాన నామార్గ మంతయుఁ • గట్టిపెట్టి
పుట్టుటయుఁ గిట్టుటయు లేని • పట్టుకొఱకు
సుఖము దుఃఖంబు నెఱుఁగని • చోటుకొఱకు
బంధమును ఘాతమును లేని • పదముకొఱకు

వెదకుకొనుచుంటి; దానికై • వెడలనుంటి
నుగము గ్రుంగుచునుండె; నేమున్నదింక!
నాత్మనిర్వృతి కెవ్వారి • నాశ్రయింతు?
నెవరి నడుగుదు; సంశయం బెట్లుతీఱు?
గాలమా! యించుకాగుము • కరుణతోడ
నాదుసంశయమును దీర్చి • పోదుగాని.

వేంకటపార్వతీశ్వరకవులు.

---

# రాయవాచకము.

(గతమాసశేషము)

ద్దులకు గజపతివారుఅంన్నిటికింన్ని మనపాలిట జగన్నాయకులు వున్నారు అని మంద్దలించ్చినంద్దులకు మూడు తెగలవారి నియ్యోగులున్ను మీకు జగన్నాయకులున్ను తమదొరలకు కర్తరున్ను వున్నారుకా కర్నాటకంవారు యేరుదాటి రాకుండా తమమూడుతెగల కలిమిబలుములున్ను కృష్ణదాటిరాకుండా పాళ్యం దిగి వుండ్డేటట్టు అంపుతున్నారు. మీతెగ నామజాదులుంన్ను సరదు స్థలాలబలవంత్తులై యుండేటట్టు కట్టడశేయుండా అని తెలుపగా గజపతివారున్ను అరీతి అమరిక శేశేమని కొండ్డవీడు, ఉదయగిరి, బెల్లంకొండ్డ, నాగార్జునంకొండ్డ, కందూరు మొదలైన స్థలాములకు యాది హెచ్చరికలు కలిగివుండ్డ తగ్గదనేటట్టుగా నామజాదులు పంపినవారై షోడశపాత్రులతోనున్ను వారిదుర్గాలున్ను శీమభూములయంద్దున్ను యాది హెచ్చరికలు గలిగి వుండ్డమని మంద్దలించ్చగా వారు వాల్లూ సరదులకున్ను దుర్గాలకున్ను రస్తుసామగ్రీలు అంప్పినారు. యిదిగాక ముకుంద్దగజపతివారు షోడశపాత్రలుంన్ను తామున్ను దినప్రతింన్ని గోదావరీ స్నానానకుపోయి నదీస్నానంజేశి జగన్నాయకులకు పూజానమస్కారములు శేశి బైలు మెరశి పట్ణానకువచ్చేటందుకు రెండుఝాములు చెల్లునుగనక తాముదిగిన స్థాన ఘట్టానకు చుట్టున్ను ఘడియ త్రోవకు మనిషిసంచారము లేకుండ్డా శేశి శబ్దమున్నువినరాకుండ్డా శేయుడా అని షోడశపాత్రులతో చెప్పి దిట్టపరచి వుంద్దురుగనక కాపుకడలు ఆయాప్రాంత్యాదులున్ను సద్దుశేయక వున్న తావులన వుంద్దురు. గోదావరీనదికి వుత్తరవుభాగానకు యెనిమిది గుర్రాలవారున్ను గొండ్డారణ్యం సమీపం గనక ఆదిక్కులనుండి మొగలాయిగుర్రాలువచ్చి వీరువారని యెరుగరు గనక వఖకార్యంవస్తే మోసంవచ్చునని యెంచి అనిమొనలు నాలుగు గుర్రాలవారున్ను చుట్టురెండ్డుఘడియల మేరకు మనిషి సంచారములేక తిరుగాడుతా వుండేటంద్దులకు రెండ్డుగుర్రాలవారున్ను గజపతివారి సమీపాన యేటిగట్టున రెండుగుర్రాలవారున్ను యీరీతున పదహారు గుర్రాలవారున్ను జాగ్రతగా కాచుకవుంద్దురు గనక గజపతివారి స్నానసంధ్యావంద్దనాది కృత్యములున్ను

జగన్నాయకుల పూజానమస్కారములున్ను అఖిన తోడుతోనె పూరికి వత్తురు యీరీతిని వుండగా వఖనాడు గజపతివారు స్థానానకువచ్చి షోడశపాత్రులను మొప్పటిక్రమం చుట్టుపట్ల జాగ్రతగా కాచివుండమని పలుకరించి తాము స్నానముశేశి తమకృత్యముతోవుండ్డిరి. యీపదహారు గుఱ్ఱాలవారున్ను నాటిదినం మొప్పటివలనె స్నానఘట్టానకు రెండు గుఱ్ఱాలవారున్ను గొండ్డారణ్యం చాయల నాలుగు గుఱ్ఱాలవారున్ను యీరీతున తిరుగుతావుండ్డగా అట్టిపట్ల కొండ్డలో వున్న దొరలు గజపతివారు గుఱ్ఱాలతోడట్టు గోదావరీస్నానానకు వచ్చినాడని వేగంగ్గాయీసమయమంద్దలితురకలు నాలుగువేల గుఱ్ఱాలవారున్ను చుట్టుకొండ్దామని యోచనచేశి నాలుగు దొరతనాలవారున్ను డాలుపమూమి టోకించ్చగా తప్పుమార్గములుగాను గుఱ్ఱాలున్ను యేనుగులున్ను రవుతులున్ను మావుతులున్ను వచ్చేరథసంవిని షోడశపాత్రలలో ఆదిక్కున తిరుగుతావుండ్డే నాలుగు గుఱ్ఱాలవారున్ను యెదురుగావోయి సమరమిచ్చినారు గనక నాలుగు తెగలవారున్ను నాలుగువేల గుఱ్ఱాలవారున్ను యీనాలుగు గుఱ్ఱాలవారికిన్ని చుట్టుకొని వుండ్డగా ఆనలుగురున్ను తమతమగుఱ్ఱాలతోడట్టు నాలుగువేల గుఱ్ఱాలతోడట్టున్ను తారశిల్లి నాలుగుతోవలా తరుమగా రెండ్డుతులా నరుకుతాపోగా వేటారుతునకలుగా గుఱ్ఱాలున్ను రవుతులున్ను వీధికి నన్నూరు యేనూరు లెఖ్ఖపడ సారి యీరీతి నాలుగు వీధులను వేయిగుఱ్ఱాలున్ను అన్నిరౌతులుంన్ను చాపకట్టుగా బడగా యథాయుధలుగా చెడి విరిగి పారిపోయి వఖతట్టు నిలిచి వుండ్డగా నాలుగు గుఱ్ఱాలవారున్ను అలశి నిలిచిరి గనక యీలోగా సరాళము పోయినయెనిమిది గుఱ్ఱాలవారున్ను తిరుగా వచ్చేవేళ తురకలు గుఱ్ఱాలనుగని సమరమియ్యాగా నిలువలేక పటాపంచ్చలై పారిపోయినవారున్ను రణమంద్దు మడిశిపోయిన వారున్ను యీరీతున బహుగుఱ్ఱాలవారు మడిశిపారిపోయిరి. అని అలశి నిలిచి నాలుగు గుఱ్ఱాలవారున్ను సరాళంపోయివచ్చి యెనిమిదిగుఱ్ఱాలవారున్ను అంత్తు పండ్రెండ్డు గుఱ్ఱాలవారుంన్ను గూడి గజపతివారివద్దికి రాగా తురకలు తిరుగా శేఖరించ్చుకొని పెంట్టాడిరి గవక చుట్టు సరాళముపోయిన రెండ్డు గుఱ్ఱాలున్ను తూర్పు దిక్కున వుండ్డి వచ్చేను. అంత్తలో ఆమొగలాయిగుఱ్ఱాలు అమట్టున నిలువక పెంటతించ్చుక రాంగా గజపతివారు జూచి గుఱ్ఱాలు మించివచ్చేను యీఖను

ఇక్కడవుంట్టే మోసంవచ్చును అని యెంచి గుఱ్ఱాలమీది దృష్టిచేత జగన్నా యకులను మరచి బహువేగాన గుఱ్ఱాంన్ని యెక్కుకొని షోడశపాత్రులతో డట్టు యేరుదాటి కొంత్తతడవువచ్చి జగన్నాయకులనుమరచి యెత్తకవస్తిమి గదా అని తలంచుకొని తిరిగి జూచే యడల గుఱ్ఱాలవారు ఉత్తరవుగట్టుకు వచ్చి సమురమంద్దు అలశినగుఱ్ఱాలు గనక నీళ్లుజూవుతావుండ్డగా వారల జూచి దేవ పూజ పెట్ట్యంత్తిలో స్వామిని వేంచ్చేపు శేయమరచి వుత్తపెట్ట్య యెత్తుక వచ్చినారము అని అచ్చట నిల్వబడి గజపతివారు చాలావిచారబడగా షోడశపా త్రులలో వొకడు చూచి యింత్తమాత్రానకు దేవరవారు విచారపడ పనిలేదు తానుపోయి యెత్తుకో వచ్చేనని చెప్పి అప్పించుకొని వచ్చి నదిలో దేవ తార్చ్చనశేశినదిక్కున చూడంగా అచ్చట జగంన్నాయకులు వేంచ్చేశివుం డ్డగా జూచి యెప్పటివలెనే దేవపూజపెట్ట్యలో వేంచ్చేపు చేసుకొని రాగా గుఱ్ఱాల రాతుగని వెంట్టాడిరాంగా వార్లను తెగవేశి యేరుదాంటి గజపతి వారి వద్దికి తెచ్చి యియ్యగా గజపతివారు చాలాసంతోషబడి నేడునిదుర లేచిన వ్యాళ యెటువంట్టిదో వృథాకలహ మాయను అనింన్ని జగడము శేశినవారు తమతో యెరుక శేయక నయ్యేకయ్యమునుంచి బహుగుఱ్ఱాలున్ను రాతుల నున్ను నొప్పిస్తిమి అని సమర మిచ్చిన పంద్రెండ్డుగుఱ్ఱాలవారికింన్ని జగన్నాయ కులు వేంచ్చేపు శేసుక వచ్చినరవుతులకున్ను ఉమగర వక్కలాకులు యిచ్చి నారు గనక తక్కినముగ్గురుంన్ను తమకు జగడం యెత్తుకపాయనని విచారమున వస్తావుండ్డగా అంద్దులో నొఖపాత్రుడు గజపతివారి ముంద్దర రాంగా వఖవనప్రదేశ మున వచ్చేటప్పుడు వొకమానికొంమ్మ గుఱ్ఱంమీద వుండ్డే రాతుకు అడ్డబడివుండ్డె గనక ఆమానికొమ్మను తనచేతి మర్త్యాఖండాన తెగవేశే గనక గజపతివారు జూచి సంతోషబడి ఆపాత్రునికింన్ని వుడుగరలుయిచ్చెను. కడమ రెంఢ్డుగుఱ్ఱాలవా రుంన్ను తమకుయేమిన్ని లేకపాయనని రాంగామార్గంమధ్యేనాలుగుమనుష్యుల నిలువుగ వొఖచింత్తమానికొంమ్మ అడ్డముగావుండ్డగా తనగుఱ్ఱాంన్ని కాలాడించ్చి గుఱ్ఱమున్ను తానున్ను హరిణవుటంగ్గా యెగశి చింత్తమానుకొమ్మ రెండ్డుచేతులా పట్టుకొని నిండ్డుసంజ్జోకం గుఱ్ఱాని తొడలనిదుకొని గుఱ్ఱమున్ను తానున్ను అంత్తరి క్షమున వేలాడుతావుండ్డగా ఆవర్తమానం గజపతివారుజూచి చాలాసంతోషబడి ఆసమయాన కత్తికట్టలాలు యిరువై ముప్పై తెప్పించి వేశి గుఱ్ఱమున్ను రాతు

న్ను దించ్చి వారికిన్ని ఉడుగరలు యిచ్చిరి. వకగుఱ్రం పాత్రునికి బహుమానం
లేకవుండ్డగా గోదావరిగట్టున వకకాలువ రెండ్డుమనిషినిలువున అరువైనాలుగు
అడుగుల వెడల్పున అడ్డమైవుండ్డగా తనగుఱ్ఱాంన్ని చబుకునవేశి కాలువదాటిం
చ్చగా గజపతివారు జూచి ఆరౌతునకున్ను వుడుగరలు యిచ్చి అందరికిన్ని యేక
ముగా సంతోషపడశేశి మరివేడుకగా పట్ణానకుపోయిరి గనక యివి యిల్లా
మేమున్ను జూచినవారమై పట్ణములోనికివచ్చి గజపతివారినగళ్లున్ను షోడశపా
త్రుయిండ్లున్ను వాల్లగరిడిన్ని ఆగరిడిలో సాధనశేశేవాల్లనున్ను చూస్తిమి
వారుశేశే సాధన మెరవళ్లు దేవదానవులునహా శేయలేరు. శీమాంత్తరం జగ
జెట్లు జేసేసాధన మెరవళ్లు చూచివుండ్దురు. ఆతీరుగాదు. భారలెయెత్తవలెను
అటువంట్టి సంగ్గడాలు యెత్తేదిగాక అడ్డముగా యెత్తుతునారు తొంమ్మిదివడ్డాల
గోతాం మానిసి చెయ్యెత్తుపొడుగు వాడిని యెత్తేదిన్ని పైబడ తోసుకొనేదిన్ని
గాక గోతాం తొడల నిడుము యెత్తుకొని అడ్డదూలానను వేలాడుతావున్నారు
అదియేలాగంట్టేను జగడములో రౌతురౌతున చంక్కనిడుకొని అమాంత్యము
గా కొంచ్చుపోదురు. అదిగాక గుఱ్ఱాలు విడువక పోరాడితె శక్యముగా దని
విడిచిపోదురు. జీరానంజ్జోకం గుఱ్ఱాలవారికి పోటువాటు తాకిన అంద్దుకు వెర
వరు. అటువంట్టిరవుతును చంక్క వేసుకబొయ్యేమని చూతురు. ఆసమయానకు
తెలివిగలిగి కడకతోడ బలిమిగలిగి వుండ్డేటంద్దుకు యీరీతు సాధనలు శేతురు.
రుమ్మిముత్తెఖండం వకమనిషి. తలమోపుకద్దు. ఆమర్త్యాఖండం తీసుక నూరుగ
జాలు గోడలు యేమిన్ని లేకుండా నరకుతావున్నారు. చింత్తచేవకంభాలు ఆఖ
డ్గంచేత అరిటిబొంద్దె నరికినట్టు నరకుతావున్నారు. గెడ్డపారలు రెండొకటికానాటి
తెగపోనరకుతావున్నారు. వారలు లాలావుబిల్లలు గెంపనిండ్డా తెచ్చిపెట్టుక
నాలుగు అయిదు తాళాలు వకటిగా మెలిపెట్టి వేస్తె కరమల వాండ్లు వాటిని
విడిపించ్చలేక సమ్మెటలోగట్టి విడిపించ్చి చక్కగా కొట్టి మరుచునాటికి తెచ్చి
యిస్తావున్నారు. మరిన్ని యినుపగుదియలు గురిపెట్టి విరువమన్న దిక్కుంన్కె
విరుస్తావున్నారు. యీశీమజెట్లు ఆడకువచ్చిజూచి సాధనమెరవళ్లు తమకు అసా
ధ్యమని వత్తురు. అచ్చట కలిమి బలములున్ను యెక్కడా జూచిందిలేదు. అదిగాక
గజపతివారి యెవ్వరికి త్యాగమిచ్చినా యేనుగ,గుఱ్రం, తాళిచాకట్లు,దట్టి, కుళ్లాయి,
కబాయి,వక్కలాకులు యిచ్చేదింతెగాని యీదేశంవలె వుడుగరలువక్కలాకులు

మాత్రంయిచ్చిఅంపేదిలేదు అనిన్ని మరిన్ని కన్నవిన్న వార్తలుఆలోచనలు మొదలుగా విన్నపంశాయగా రాయలవారితోను అప్పాజిగారు పలుకరించ్చిన వివరం. గజపతి వారనంగ్గా పుణ్యశ్లోకుండ్డు తురకలవలెగాదు దేవబ్రాంహ్మణ విశ్వాసం కద్దు. అదెట్లాంటేను ముకుంద్దబాహుబలేంద్రగజపతివారలకు శత్రువులైనవారు జగన్నాయకులను పూజించ్చె అర్చకులకు వెయ్యారులు లంచ్చ

గజపతివారికి విరోధులు విష ప్రయోగము చేయించుట.

మిచ్చి వొద్దికశేసుక నిత్యకృత్యమున్ను జగన్నాయకులను శేవించ్చి తీర్థప్రసాదములున్ను పుచ్చుకొనిగాని ప్రసాబడేది లేదు గనక వకనాటికి తీర్థములో వత్సనాభము కలిపి యిమ్మని నియమించ్చగా ఆఅర్చకులు ఆద్రోహానకులోనై ఆతీరున తీర్థములో వత్సనాభము కలిపి స్వామి సన్నిధిని గజపతివారికి తీర్థప్రసాదించ్చేవ్యేళ నంబివానికి చేతులు వణకసాగెను. అప్పుడు గజపతివారుచూచి చెయ్యివణక నిమిత్త్యమేమి అని అడుగగా భయస్థుడై చెప్ప వెరచి వుండ్డె గనక గజపతివారు జూచి యేలవెరచేరు కలిగిన అర్థం నిలువరముగా చెప్పమనంగా అరినృపాలులు శేయించ్చిన కార్యం సవిస్తరముగా చెప్పెను. గనక ఆవిషోదకము తెమ్మని చేతతీసుకొని అప్పుడు చెప్పిన శ్లోకం—

అరి ర్మిత్రం విషం పథ్యం అధర్మో ధర్మతాంవ్రజేత్
అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయాత్.

అనే శ్లోకం చదివి తీర్థం పుచ్చుకోగ్గా ఆవిషం జీన్నానకువచ్చెను. ఆవార్త లోకప్రసిద్ధమాయను. వారు అటువంట్టి దైవజ్ఞులని గజపతివారి గుణాతిశయములు మెచ్చినవారై వేగులకు వుడుగర వక్కలాకులున్ను వెయ్యేశిఘట్లున్ను యిచ్చి యింకా ఆయాదేశములకు బోయి నానాటివార్తలు దెలిసి వచ్చి చెప్పుమని వాయువేగి హనుమంతయ్యను మనోవేగి పురుషామృగయ్యనున్ను అంపించ్చి రాయలవారున్ను అప్పాజివారున్ను ఆప్తాలోచనగా దిక్కులవార్తలు విన్నారికా ముంద్దర తురకలమీదికి కదలి పొయ్యేకార్యములకు ఆలోచన మెంచ్చి అని అడుగగా అప్పుడు అమరవుదొరలనున్ను అయిత్తపాటుతో వున్నారు. దండ్డుయాత్రలకు లగ్నంవుంచ్చేటంద్దుకు జోశ్యులను పిలుపించ్చి ముహూర్తం వుంచ్చమని ఆనతియ్యగా ఆతీరునన అప్పాజిగారు జోశ్యుల రప్పించ్చి సుదినం సుముహూర్తం సులగ్నం కూడినవేళ వెలిగుడారము వేశేటట్టుగానున్ను పాళ్యం కదలి పొయ్యేటంద్దులకున్ను ప్రవేశానకున్ను లగ్నం నిశ్చయించ్చారు

రాయలుతురకలమీదికి దండయాత్ర సాగుట.

రాయలవారికి మొదల శేయగా ఆతీరువన వెలిగుడారం వేయించ్చ మని ఆనతిచ్చినారు. గనక ఆదేరీతికి అప్పాజి రాయలవారితోను తురకాణ్యాం మీాద దళము త్తేటప్పుడు బోయదొరలందరినిన్ని రప్పించ్చి పదునెనిమిది కప్ప ణాలవారినిన్ని నగరపిందు బెట్టించ్చి హరిబాణం కొమాళ్లతోను కార్యముఖా నకు తురకాణ్యాం శీమలోను మునకలుగా బోయి దిగి మూడేశి ఆమడదూరం సారివరాళం పోయి మనుష్యుల, పసలం,ప్రాయలు, గొర్రెలు, మేకల, గుర్రాల వుండకుండా కొళ్ళబెట్టమనిన్ని మొదిరితోడట్టు సకలసన్నాహములతోడట్టు బయలుమెరళి వెలిగుడారమునకు వచ్చి నిలిచి దొరమన్నీలనున్ను, రవుతుల, మావత్తులనున్ను, వినియోగం పైకంవాల్లనున్ను, మునుపటివారు వెనకటి వారు, మొడవంక్కంవారలనున్ను అందరినిన్ని రప్పించుక వారివాల్లతో మాట పలుకులు ఆడి మీామీాస్తోమములతో ఆయత్తపాటుతో రమ్మని బల వంక్కం అమరనాయకం వాల్లతోనున్ను నగరికై జీతంవారితోనున్ను నగరితొంమ్మిదిసంప్రతులవారితోనున్ను నగరిలెఖ్కప్రకారానకు యేనుగ, గుర్రాలు, రాతురాణువ, బంట్లుపైదళం వారినిన్ని గణితి తీసుకొని కన్నాటట కానగల స్వతంత్రస్వామ్యం కావలికట్లు గుంపులవారినిన్ని పాళ్యగాల్లనుంన్ను నగరిలెక్కప్రకారానకు అంద్దరినిన్ని రప్పించ్చి పయనం తెర్లడా అని కరణీకుల తోనుంన్ను, రాయసం, కటికం, దినసరి, అవసరం, వినియోగపైకం వాల్లతో నున్ను ఆనతిచ్చికొంత్తగుర్రం రాణువనున్ను విజయనగర పట్టణమునకు రక్షు ణియ్యముగా సాళువ తిమ్మరసయ్యగారినిన్ని పట్ణమంద్దువుంచ్చి దండ్డుయాత్రకు జయధ్వనిగా దిక్కులు పిక్కటిల్లెటంద్దుకు భేరితాడనము శేశి డమామిటోకించ మని ఉత్తరవు శేశి రాతులకు మావుత్తులకు అమరనాయకంవార్లను, అల్లుం డ్లు, కొమాళ్ళకు, రాజులకు, జట్లకు, కంమ్మనాయకులకు అందరినిన్ని పయనం జెప్పి రంమ్మని కటికాలవారికి వుత్తరవుయిచ్చి తాముంన్ను భోజనంజేసుకొని మూడో నగరా టోకించ్చమని ఆనతిచ్చి గుర్రం యెక్కుకొని పయనంగతుల కదలి వుమ్మత్తూరు శివనసముద్రానకు వచ్చి గంగారావు వూడెమువిాంద కార్య ముశేశి వుదరదోలి ఆస్థలాలు పక్కనాటన సాధించ్చి అక్కడ వూడిగాల వాల్లకు వుంచ్చి అంద్దుకుండ్డి శ్రీరంగపట్ణం కోటకై చీని కోటకొత్తళములు జూచి మీాద ఆదిరంగనాయకుల సేవించ్చి యిక్కేరి ఆరంగ్గావకువచ్చి యుక్కేరి నాయునికి [illegible] జూచి విజయాపురం సరుదుల [illegible] నరుకు

స్థలాలవుండ్డి గురిమనుష్యులనున్ను దుర్గాలవుండ్డే రాణువనున్ను నిర్వ హించ్చలేక విడిచి పారిపోసాగిరి. గనక అంద్దుడ్డి రాచూచి ముదికల్లు,అద్దంకి, ఆద వని ఇవి మొదలైన స్థలాదులకు తాణ్యాములు వుంచ్చి దినమొక్కటిగా సారినద వగా స్థలముల వుండ్డేవారు మునకలుగాన వచ్చేదళాన్నిజూచి పారిపోయిరి గనక సాధించ్చినస్థలములకు తాణ్యామువుంచ్చి గోలకొండ్డనారి పరదుస్థలాలకై నడవంగా అక్కడ మూడు తెగల రాతులుంన్ను యెమరించ్చి యేరుదాటి వచ్చి మోర్భావేశిపాళ్యముదిగినారు గనక ఆవర్తమానం తెలిశిన వేగర్లువచ్చి రాయల దేవునితోను తురకలు లక్షుగుర్రాలుతోడట్టున్ను వెయ్యియేనుగులతోడ ట్టున్ను కృష్ణదాటివచ్చి పాళ్యందిగినారని వారికలిమి బలములున్ను వారిపృధు తలున్ను పలుకరించ్చి వారిశీమలో మనతెగలవార్లు లోజొచ్చి మూడుమడకు మూడామడ వుండ్డే గ్రామాములు కొల్లబెట్టేదింన్ని పాతరలు శోధించి ధాన్య దవసములు యెత్తేదింన్ని గ్రహస్థుల ఇండ్లలోజొచ్చిపోయి ముంద్దువెనక దాంచి యుంచ్చిన చంద్దాన నిక్షేపములు యెత్తేదింన్ని వూళ్లు పల్లెలు కాల్చేదింన్ని పస లం, ప్రాయలు, మేకలు, గొర్రెలు, గుర్రాలున్ను పట్టుకవచ్చి కానుకు వకటిగా అమ్మేదిన్ని యీరీతిగా నిర్నామం శేశేదింన్ని దుర్గములలోవుండ్డే వాల్లెల్లా జతనమైవున్నారనిన్ని విన్నపం శేయంగా రాయలవారు విని తురకలు కృష్ణ వేణిదాంటి వచ్చి డెరిజావేశి దిగేట్టా అని ఆగ్రహించుకొని అమరనాయకం వారలలో పెంమ్మసాని రామలింగ్గమనాయణ్ణి బిలిచి తురకలు కృష్ణవేణి దాంటి వచ్చి డెరిజావేశి పాళ్యందిగినారట యిందులకు యేరీతున నడవవలెనో అని అడిగినంద్దులకు తురకల కార్యమనంగా యెంత్తమాత్రం దేవరవారిప్రతా పమువల్ల డెరిజాతాళ్లు తెగకోశను. అప్పుడు భేరితాడనంశేశి నడిస్తేను తురకలు మూడుతెగలవారున్ను పటాపంచ్చలై విరిగి యధాయధలై తమతమస్థలాదులుకు పొయ్యేటట్టు శేశెను. యిదిగాక యీగ్రీష్మకాలాన దగదప్పులకు తాళి వాండ్లు నిలువలేరు. అని విన్నపంశాయగా తనకు శెలవులకు యిమ్మనగా రాయలవారు ఛాలా సంతోషబడి రామలింగ్గమనాయునికి పట్టీలు ఇచ్చి అంప్పగా రామలిం గ్గమనాయుడు వెలువడిని వచ్చి తనతెగకమ్మదొరతనాలవారి సంద్దరినింన్ని రప్పిం చుక వారలకున్ను చెప్యొత్తిగ్రొమ్కి యిన్నాళ్లును రాయలవారిసంబ్బళములు ప్రసాబడి బ్రతికితిమి. యేలినవారికి యిప్పుడు కార్యపరవిశలిగి అనిమొనకువచ్చి తొంటవారిమీాడికి తమతమని ఖానుమానం తక్కులాకులు ఇచ్చి పంప్పగా

వస్తిమి. యీబిళాలుమానం మీాది గనక మిమ్మునవుండ్డి మానుమయులున్ను ముంద్దరికి కంమ్మకులంవారికి బ్రతుకలున్ను ప్రతిష్టలున్ను కీ_ర్తిమాటవాసులు కలుగకేకే టంద్దులకున్ను స్వర్గాదిభోగములు అనుభవించ్చేటంద్దులకున్ను తన తోకూడా నడచేవారెల్లా నడువంద్దా తక్కినవారెల్లా వారులో నిలువుడా అని తొక్కినడువగా ఆయన సంత్తరించ్చిన యెనభై వేల చివ్వలవారున్ను రణపెండ్లి కొడుకులై యిక్కడి ఆశపాశలు విడిచి కయ్యామంద్దేదే వియ్యామంద్దేదిగా యెంచ్చి అనిమిాదిదృష్టిచేత రామలింగ్గమనాయని వెంబ్బడిని నడువంగా తురకలు యీవార్తలువిని డేరిజావద్ద జీరానఁజ్జోగంత్తో విత్సుకత్తుల రాతులు అరవై వేలున్ను వారిని చుట్టుక నిండునంజ్జోకం గుర్రాలుపదివేలకున్ను వాల్లగ ను అనుభవింమ్చుక యుండ్డె మదహత్తులు వెయ్యింటికిన్ని యీరీతిని డేరిజావద్ద వుంచ్చి మూాడుతెగల తురకలున్ను తమతమపాళ్యములో ఆయత్తపాటుతో జాగ్రతగలిగి యుండ్డగా రామలింగ్గమనాయుడు తురకలపాళ్యంవారి సమీాపా నకు పోగానే గుర్రాన్ని కత్తి కేడం తీసుకొని యేనుగలభారుమీాద శైలతట మునకు లంఘించ్చు సింహ్వావుపిల్లలచాందాన తొక్కినడిచి మదహత్తీల తొండ ముల ఖండములుగా నరికి మావటీలను యీటెలచేత కుమ్మి తోయగా యేను గలవారిమీాందికి నడవగలవారు గుర్రాల పక్కారలెత్తి కురచ యీటెలతో నున్ను పిడియీాటలతోనున్ను పంద్దిబల్లెములతోనున్ను గుచ్చి తోశేదిన్ని దోసకాయలచంద్దాన వేటారుతునకలుగా నరికేదిన్ని యీరీతు నొప్పించగా గుర్రాలవారు వెనుకముందై పాగసాగెను. అప్పుడు నాలుగువేల గుర్రాలు చాప కట్టుగా బడగా అటువెనక విచ్చుకత్తుల రవుతులమీాద నడిచి జగడమియ్యాగా పరిచావులుగా ఆరువేలకు నాలుగువేలరవుతులు పడిరి. అంత్తట రామలింగమ నాయుడు జీరీజుతాళ్లు తెగకోయించ్చగా డేరిజానేల కూలినక్షణాన్ని కృష్ణరాయల వారు భేరితాడనంశేయించి మదహత్తినెక్కికొని ఉభయచ్ఛత్రములతోనున్ను ముకలటెక్కెములతో నూటయిరువై ఘట్టముల యేనుగలున్ను అరవై వేల గుర్రాలున్ను అయిదులక్షల పాయదళమున్ను పొట్లముగా నడిచిరి. గనక ఆక్షణాన్ని కృష్ణవేణి వుభయ తీరాలున్ను ప్రవాహాం నిండి రాసాగెను. జగడ ముఖానను తురకల యేనుగల మొనచేస్తె గ్రీష్మకాలం, యెండ్డచేతను డస్సిన యేనుగలు గనక దగడప్పిపుట్టి చల్లగాలిచేత కాలుజారి కృష్ణవేణిలో పోయి పడెను. గుర్రాల రాతులు యేరు నీళ్ళువచ్చెను యీతరులుండ్డి కార్యం కాదని

గుఱ్ఱాలవారు యేనుగులవెంబ్బడిని తిరిగి మొదటి దొరలు ముగ్గురున్ను దైవీకంగా పెడతలపోటుగా ప్రవాహంవచ్చె గనక యిక్కడను పాళ్యందిగి జగడమిచ్చేమంట్టే రస్తుసామగ్రీలున్ను అమరదు. అని దొరలు ముగ్గురున్ను నియ్యోగులతో ఆలోచనగా వారి అన్నిటికిన్ని యేరుదాంటి ఆవలనిల్చి నరిపోయినట్టు నడిపించ్చుకొంద్దాము శీమకు తిరుగగానె యేరు నిండ్డారుగా వచ్చెను రాయలవారున్ను వెంబ్బడించ్చి నడిచి జగడం శేయుగా అందరున్ను విరిగి పారిపోయిరి. కొంద్దరుయేట్లోబడిరి గనక సగం రెండ్డుపాళ్లు యేటివరదపోఇరి. వఖపాలుదక్షిణపుగట్టున నిలిచెను. ఏనుగ లన్నింన్ని నీళ్ళునిడిచి గట్టుకు రాకపాయను. గనక మావటీలు యిఖను నిలువకూడదని దిగి ప్రాణాలతోడట్టు తప్పి పారిపోయిరి. మూడు తెగలతురకలున్ను అంత్తట యేనుగులమీాదనుంచ్చి వోడలమీాదికి దిగి వుత్తరపుగెట్టు యెక్కి ఆలోచనపరులై యీానమయీాన నిలిచేది కార్యం కాదని తమతమస్థలాదులకు హతశేషు లైనవారి గూర్చుక గట్టెక్కినగుఱ్ఱాలతోడట్టు విజయాపురం, గోలకొండ్డ, అహముదానగరం చెగబోయినారు. గనక కృష్ణరాయలవారు కృష్ణవేణి వృద్దుకువచ్చి మూడు తెగలతురకల యేనుగ గుఱ్ఱాలున్ను నగర కట్టిపెట్టుమనిన్ని గుడారాలు నిశానులు నగారా మొదలైనది మొదట జగడాన దొరికింద్ది గనక అదంత్తా నగరకట్టమని అప్పాజి మొదలయిన నియ్యోగులతోనున్ను ముక్కుతిమ్మన్న మొదలైన కవీశ్వరులదిక్కుజూచి నేటి జయం యీారీతు అని అడిగినంద్దులకు ముక్కు తిమ్మన్న చెప్పినపద్యం-

క. నరసింహాకృష్ణరాయా, దురమున నీపేరుపేరఁ దురకలఁ ద్రుంచెఁ
గరిరాజవరదుఁడవనీఁ కరిఘటలును నిన్నుఁజూచి గ్రక్కునఁ దిరిగెఁ.

అని ముక్కు తిమ్మయ అలసాని పెద్దన్న మాడనగారి మల్లయ్య మొదలైనవారు విన్నపం శేశినంద్దులకు అప్పాజి,అయ్యమరసు, కొండమరసు,బాచరసు గారున్ను అనేక స్తుత్యములుగా విన్నపంజేసి కృష్ణవేణి యీానమయీాన నిండ్డేతు వచ్చినంద్దువల్ల మ్లేచ్ఛులకు అపజయమై నిలువలేక తమతమస్థలాలకు పోఇనట్లాయను. యేరునీళ్లు వడిసి కాలివడ అయినతోడుతోనే ముంద్దరకార్యముఖానకు నడవవలెను. యీాఆషాఢ శ్రావణాలు రెండు నెలలున్ను యేటికి దక్షిణముగానున్న తురకల దుర్గాలున్ను కోటస్థలాలున్ను గజపతిదుర్గాములున్ను స్థలములున్ను చేకూర్చుక అతర్వాత అహముదానగరం పర్యంతమున్ను పోవలెను. అని విన్నపంజేసినంద్దులకు కృష్ణరాయలవారు మీారు చెప్పినది కా

ర్యసరవి అవును. మునుకలుగా యేరుదాటి మ్లేచ్ఛులరాజ్యానకు కదలిపొయ్యి నట్టాయనా గజపతివారిశీమలోనుంన్ను ఉదయగిరి, కంద్దూరు, కొండ్డవీడు, బెల్లంకొండ్డ, నాగార్జునంకొండ్డ, వినుకొండ్డ మొదలైన దుర్గాలలో వున్నవారు మనదండుకు రస్తుసామ్రగీలు రానీకుండ్డా అరికట్టుదురు. ఆరీతిగాకుండ్డా మునకలుగా ఆయాస్థలాలు సాధించ్చి ఆయాదుర్గాలను మనతెగ తాంణ్యములు వుంస్తె రస్తుసామ్రగీలు నడుచును. అని ఆనతిచ్చినారు గనక వద్దనున్న పిన్నపెద్దలు కార్యముగాయోంచి ముంద్దరతరలే యత్నం గనవలె నన్నారు. కాబట్టి రాయలవారు రవుతు రాణువ దొరమన్నీలకు అంద్దరికిన్ని పయనం చెప్పించ్చి భేరీఘమాయి కాహాళాలవారిని రప్పించ్చి నగారా కూచి శేయించ్చమని వారలా భేరిపూజ సేయించ్చి టోకించ్చిన జయధ్వనికి పద్యం—

క. ధాత్రీశుఁడంత దిగ్జయ, యాత్రాసంరంభజృంభితాటోపగతిన్
శత్రువుల గుండెలవియఁగ, జైత్రప్రస్థానభేరి సేయించుటయున్.

ఉ. భూకంపంబుజనింప గొప్పఁగ మహాంభోరాసులుప్పొంగఁగాఁ
లోకాలోకములెల్లఁ బెల్లగిల ముల్లోకంబు ఘూర్ణిల్లన
స్తోకవ్యాప్తి నజాండగోళదళనాద్భూతధ్వనిం బోలె వ
ర్షాకాలాంబుదగర్జితధ్వనిసమారంభంబులై మీఱఁగన్.

రాయలవారు ఉదయగిరి మొదలయిన దుర్గములమీఁదికి దండెత్తుట

వారలున్ను పయనమని దెలిశి ఆయత్తపాటున కాచివుండగా రాయలవారు బయలుమెరశి గుర్రంయెక్కి సకలసన్నాహములతోడట్టు సకలదళసమేతుడై గుత్తికండ్డికోటమార్గముగా ఉదయగిరికి వచ్చిన హురత్తు అనే దుర్గముపై లగ్గయెక్కగా దుర్గములలోని వారు తమచేతనైనట్టు సమరంజేశి మంద్దుగుండ్లు శిలవై నిర్వహించ్చలేక కొలిచినారు గనక కాలున దించ్చి శత్రుజనాలు వెళ్లిపోయిన తర్వాత రాయలవారు దుర్గంపై నెక్కి జూచి యింతరస్తు వుండ్డగా యేమని కొలిచ్చి వెళ్లిపోయిరి అని ఆశ్చర్యబడి కంప్పన్నను దుర్గమంద్దు తాణ్యంవుంచ్చి కందూర్కిపోగా డమామిధ్వని విన్నతుణాన్నె ఆస్థలంవారు వెళ్లిపోయిరి. గనక ఆస్థలం తొక్కిచూచి అచ్చట తాణ్యం వుంచ్చి కొండ్డవీటికి కదలిపోగా దుర్గములలోనున్న వూడెములవారు సముద్రం పొంగి వచ్చేరీతిని సేనాసముద్రం కదలివచ్చేదిగని కాలుధూళి మిన్నుముట్టి సూర్యరశ్మిగప్పిన గని స్థలములు విడిచి పొయ్యేవారున్ను కాహళధ్వనివిని

పారేవారున్ను యీరీతున కొండవీడుశీమకోటలు దుర్గాలలోనున్నవారలు సరాళభ్రష్టులై తమతమ దొరలున్న తావుకు పోసాగిరి. బోయదొరలు పదునెనిమిది కప్పణాలవారున్ను మూడులక్షల పాయదళమున్ను కొండవీడు, కొండపల్లె, బెల్లంకొండ, వినికొండ, నాగార్జునంకొండ మొదలైనదుర్గాలకు యేలుబడియైన శీమలాద్యంత్తం నిపాతం శేస్తావున్నారు గనక ఆయాశీమలోగల ప్రజలందరున్ను సకలమును కొల్లయిచ్చి మిక్కిలి అంద్దుపడి అయినదుర్గాలు జేరినారు అని వేగల్లుగా అక్కడగ్గడ నడుచు యోగక్షేమములు క్షణక్షణకె వచ్చివిన్నపంశాయంగా విన్నవారై తిరుగావాల్లను అయాతావులకు అంప్పించ్చి కొండవీటికిపోయి జగడమియ్యాగా కొనమూకలవారు విరిగిన మాత్రాన్న కొండవీండు కోటలోనివారు తీశిబోయినారు గనక ఆదుర్గంమీద సమరం శేయంగా దుర్గంలోవున్నవారు తమచాత అఇనమట్టు వఖటెన్నరదినం పోరాడి రాత్రి దుర్గంవిడిచి పోగా మరుచున్నాడు దుర్గమెక్కి జూచి ఆదుర్గమంద్దు కొండయ్యాను తాళ్యంవుంచ్చి వినికొండకై నడువంగా వారు యీవార్తలు విని స్థలం నిర్వహింప్పనేరమని యెంచ్చి మునకలుగా వెళ్ళిపోయిరి. అక్కడ భాస్కరయ్యాను వుంచ్చి బెల్లంకొండకై నడవగా వారు పిరంగ్గినాదంవిని బెల్లంకొండవారు పారిపోయిరి. యిచ్చట వీరభద్రయ్యాను తాణ్యముంచ్చి నాగార్జునకొండకై నడవగా వారు నానాప్రయత్నముల నాట మన్నాటట పోరాడి చేతగాక తమనాటికి పోయిరి. గనక అచ్చట అయ్యలయ్యాగారిని వుంచ్చి అహముదానగరానకు నడవగా కొనమూకలువారు వెలిపాళ్యాలు చొరబడి చెరజోరాబట్టి చాలా కంపోలం శేయాగా కోటలోనిగుర్రాలువారువెళ్లివచ్చి యెదుటనిలిచి జగడమియ్యాగా మూడుంముక్కాలు ఘడియలలోగా రెండువేలుంన్నెనమంన్నూరుగుర్రాలున్ను అంన్నియు రౌతులున్ను చాపకట్టుగా మృతంబొంద్దిరి. గనక యీసమాచారం కోటలోవున్న మొదటి దొరలఇనవారు విని ఇఖను మనం కోటలో నిలిచి వున్నట్టఇతే చేపట్టుగా పట్టుకబోదురు. అంద్దునుంచ్చిచాలా అవమర్యాద అని యెంచ్చి యేమి బోయినా బోని అని కోటవిడిచి పారిపోయిరి. గనక రాయలవారు ఆకోట యిడియకొట్టించ్చి ఆపట్ణం యెంత్తమేరో అంత్తమేరా నున్ను వెలిపాళ్యాలుంన్ను మంన్నించ్చి ఆమిదాలు జిల్లేళ్లు విత్తించ్చి అంద్దుండ్డి గజపతి రాజ్యానకై నడవగా అప్పాజిరాయలవారితో మూడుతెగల తురకలరాజ్యమంత్రా కపోలంశేశి వారిదుర్గాలున్ను స్థలాలున్ను కట్టుకొని అహముదా

నగరం ఆమిద్యాలు వి_త్తించ్చి గజపతివారి గిరిదుగ్గఃం జలదుగ్గఃం స్థలదుగ్గఃం వనదుగ్గఃం యివి అన్నియు ఆక్రమించ్చినట్టాయను ముంద్దర కదలి పొయ్యేది కార్యంకాదు. కనమలు దాటిపోవలెను, కనమలలోనున్న గజపతివారి తెగవారు సామ్మగ్రీలు రానియ్యరు. అనిమంత్రాలోచనగా విన్నపం శేశినంద్దులకు ఆవిశదం రాయలవారు చిత్తానవుంచ్చుక ముందర కదిలిపోవలెననే దృష్టిని తమను యెదురులేదని యెంచ్చి అప్పాజిగారు విాన్నపం శేశినంద్దులకు అవుగాములు ఉత్తర వియ్యక కదలిపోగా గజపతివారి కనమల నడమ పొయ్యేటప్పుడు చిత్రాప్రఖాను డనేవాడు అరవై వేల శింగ్గాణి రాతులతోడట్టు కనుమమాగ్గఃమున పొయ్యే రాతురాణువమీాద చిత్తవాన గురిశినరీతి అమ్ముల గురియించ్చగా అంమ్ములనుండ్డి తప్పించుకొనువారున్ను ఆయంమ్ములకు యెదురై నిలిచినవారున్ను ముంద్దు వెనక తెలియక నిలిచినవారున్ను ఆడాడ దిగ్భ్రిమపడివున్నవారున్ను యీారీతిని వుండ్డగా చిత్రాప్రఖానునికి యెదురులేను గనక జగడంశేయగా ఆసమయాన కన్నాఃటకం కైజీతం రాతులు చిత్రాప్రఖానునికి పెడతలపోటుగా యిరు పార్శ్వాల కనమల పొడుప్రన నెక్కి చిత్రాప్రఖానుని వెనకదిక్కులకై వచ్చి శింగ్గాణులచేతనున్ను ఖడ్గములచేతనున్ను బరిజీలచేతనున్ను వేటాడు తున కలుగా నరకగా చిత్రాప్రఖానునితెగలకు కనుమలో నిలువకూడక విరిగిపారగా వెంబ్బడించ్చి తరముకబోయి వారిని దుగ్గంచొరదోలి తిరుగావచ్చిరి. గనక అప్పుడు చిత్రాప్రఖానునితెగలలోయిరువైమూాడువేల స్తోమమున్ను నాల్గువేల గుఱ్రమున్ను వఖతావున్నమడిసి అటుతర్వాత సమదళం ఆద్యంత్తమున్ను ముం ద్దరకదలిపోయిరి. గనక ఆకనుమల్లో ముప్పైవేల స్తోమాన్ని తాణ్యావుంచ్చి అవతల గజపతిగారి శీమాద్యాంత్తం నిపాతం శేసుకపోయి పోట్లూరి సింహాద్రివద్ద పాళ్యం దిగిరి. గనక యీావత్తమాసం గజపతివారు విని యేదులసాహు, కుతుపనమలక, నిజాంశాహు వారుముగ్గురున్ను నిలువలేక తిరిగి స్థలాలువచ్చిరి. గనక ముగ్గురు దునేదార్లఃనున్ను వీగతోలిన బలవంత్తులతో తాము ఏకదేశాన పోరాడేది యేరీతు అని ఆప్తులతో ఆలోచనశేయగా వారు గజపతివారితోను మనసింహాసనానకు షోడశపాత్రులయొక్క భుజబలపరాాక్రమాన యీాక్షోణీ చక్రం యేలుబడికి వచ్చెను. యీావరకు కన్నాఃటకంవారు మనశీమలోనికి వచ్చినవారుకాదు. పెద్దగజపతివారు వుండ్డేటప్పుడు వారుసేతుయాత్రకొరకై కచ్చి, కాళహాస్తి, అరుణాచలం, చిదంబ్బరం, జంబ్బుకేశ్వరం, (సశేషము)

# గ్రామ్యవాదవిమర్శనము.

మనభాషకు మంచిదినములు సంప్రాప్తమయినవి. దేశప్రముఖు లిదివఱలో వలె నాంధ్రభాషను నిరసింపక దానికిఁ బ్రాముఖ్యము నిచ్చి చర్చించుటకును, పరిశోధించుటకును, బ్రోత్సాహపఱచుటకును వృద్ధి నొందించుటకును విపులమయిన ప్రయత్నములను జేయుచుండు టెంతయు శుభోదర్కంబుగా నున్నయది. ప్రస్తుతకాలము సంస్కరణయుగమై విరాజిల్లుచున్నయది. మతసంస్కారములు, సంఘసంస్కారములు, రాజకీయసంస్కారములు మొదలగున వెక్కడఁ జూచినను మనదేశమున ననేకములు బయలుదేఱి పనిచేయుచున్నవి. వీని కన్నింటికిని బ్రధానోద్దేశము దేశాభివృద్ధి. ఈయన్ని సంస్కారములయందును గూడ మొదట సంస్కారోద్యమముల నారంభించి సంఘమును మేల్కొల్పిన వారు ప్రజలకృతజ్ఞతకు మిగులఁ బాత్రులు. మతసంస్కారములు బయలుదేఱి హిందూమత మంతయు స్వార్థపరులయిన కొందఱు బ్రాహ్మణనామధారులచేఁ గల్పింపఁబడిన కొన్ని నిర్జీవకర్మముల సముదాయము మాత్రమే గాని యంతకంటె నిం దేదియు సారములే దని పురాతనమతమయిన హిందూమతమును దదాచారములను నిరసించుటయు నంతటితో నాగక దూషించుటయు మొదటపెట్టిరి. పిమ్మట విద్యాధికు లయినవారు వెనుక తిరిగి చూచి దేశ మెన్ని మార్పులకు లోనైనను ఎన్ని దేశములవారు వచ్చి మనలను లోఁబఱచుకొని మనపై నిరంకుశాధికారములను జెల్లించినను, ఎందఱెందఱకో మనము దాసుల మయినను, రూపుమాయక సంపూర్ణప్రభావముతో నిలిచియున్న మనమత మింతటి నిస్సార మయినదియా యని యెంచి ప్రాఁతపుస్తకములను దులిపి పరిశీలింప నారంభించిరి. అం దనేకవిషయములు బయలువెడలి హిందూమతమునం దుత్తమధర్మము లెన్నియో కల వనియు, నవి నిరర్థక మయినమూఢ విశ్వాసములమూట యనుమాట బూటక మనియుఁ బ్రజలు కనిపెట్టుటయే కాక ఖండాంతరములకుఁగూడ హిందూమత ముపాస్యమై వెలయుచున్నది.

---

ఈయుపన్యాసము కాకినాడలో "లిటరరీ అసోసియేషను" భవనమున జరిగిన భాషావిషయకసభలలో నొకనాఁడు చదువఁబడినది.

ఇట్లే రాజకీయసంస్కారమునందును బ్రథమమునఁ గొంద అతివాదు లనియుఁ గొందఱు మితవాదు లనియు గలహములు ప్రారంభమై మొదట నొకకోలాహలము పుట్టి హాలాహలమువలెఁ గొంతవఱకు దేశశాంతికి భంగము కలిగించినను శాంతిపరులు దూరదృష్టిగలవారలు రాజనీతివిశారదులు నగుమహనీయుల సత్ప్రయత్నములవలనఁ బ్రజలవాంఛలు దొరతనమువారును దొరతనమువారి యాదర్శములు ప్రజలును గ్రహించి ప్రజల కుచితవరప్రదానములతో శాంతి నెలకొల్పఁబడి తద్విషయమున మనదేశ మొకమెట్టెక్కిన దైనది. అట్లే మనప్రస్తుతవక్తవ్యాంశ మగుభాషాసంస్కరణముకూడ బయలుదేఱినది. దీనియందును అతివాదులును మితవాదులును నున్నారు. ఉభయవాదులును గూడ దేశమునందలి జనసామాన్యముయొక్క సంపూర్ణకృతజ్ఞతకుఁ బాత్రు లని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. ఒకవంక నాంధ్రసాహిత్యపరిషత్తువారు నిఘంటునిర్మాణము, భాషాపరిశోధనము, సత్కావ్యరచనము మున్నగుభాషోద్ధరణమునకు వలయు సత్కార్యముల నొనర్చి భాషాసేవఁ జేయుచున్నారు. వేఱొకవంక నాంధ్రసాహిత్యసంఘమువా రాంధ్రభాషయొక్క వ్యుత్పత్తి, స్వరశాస్త్రము, వ్యాకరణము మొదలగువాని పునాదులను గనిపెట్టి వానికి నితరభాషలకును గలసంబంధములను దెలిసికొని భాషకుఁ గావలసినయభివృద్ధి యెద్దియో నిర్ణయించి దానింబట్టి భాషను సంస్కరింపఁ బ్రయత్నములను జేయుచున్నవారు. అందుఁ బనిచేయు మ॥ రా॥ జయంతి రామయ్య పంతులవారును ఇందుఁ బాటుపడు శ్రీయుత గిడుగు రామమూర్తిపంతులవారును గూడ నాంధ్రభాషాశ్రేయోభిలాషు లయినవారియత్యంతకృతజ్ఞతకు సమానముగాఁ బాత్రు లయియున్నారు. మనకు వారివాదమును వీరివాదమునుగూడ సమానగ్రాహ్యములు. వారియుక్తులను వీరియుక్తులనుగూడ సమానగౌరవాదరములతో వినవలసినవారమై యున్నవారము. విని పిమ్మట విమర్శించుకొని శాంత చిత్తులమై మంచిచెడ్డలను దెలిసికొని యం దుత్తమమని తెలిసినమార్గము ననుగమించుట మనకు విధి. ఇం దేవాదము స్థిరపడినను రెండవవా రోడిపోయిరి మనువ్యసనమును బొంద నవసరము లేదు. ఏమంటి రేని ఉభయవాదులకును గావలసినది భాషయొక్కమేలు. దానింబట్టి దేశమునకుమేలు. మేలు దేనింబట్టి కలుగును ? ధర్మమునుబట్టి కలుగును. కావున సూక్ష్మముగ విభజించుకొని మూలమునకుఁ

బోయి చూచినయెడల ధర్మజయమునకే యుభయవాదులును వాదములను జేయుచున్నవా రని యేర్పడుచున్నది. తుదకు జయించున దెప్పుడును ధర్మము గాని యధర్మము కాదు. కావున నేవాదము జయించినను జయించినదే ధర్మమగును. ఓడిపోవువారు లేరు. అట్లనుటంబట్టి వారు జయింతు రను భయము వీరికిఁగాని వీరు జయింతు రనుభయము వారికిఁగాని గలుగ నవసరము లేదు. భయమునకును భక్తికిని సమావేశము పొసఁగదు. జనులకు నిక్కమయినభక్తి భాషయం దున్నయెడల నిట్టిభయములు వారిఁ జేరఁజాలవు. ధర్మసంస్థాపనము కొఱకుఁ జర్చించుచున్నారమే కాని యిది యెవరో కొందఱు పురుషులస్వార్థమునకుఁ గాని వారిఖ్యాతికిఁ గాని పోరాడుచున్నా మను నల్పపుటూహలను దూరముగఁ ద్రోసి విశాలహృదయములతో నుభయవాదులవాదములను విమర్శించుకొనుట మన కవశ్యకర్తవ్యము. ఈవిషయమై విపులముగను గూలంకషముగను జర్చించుటకు నాకుఁ దగినపాండిత్యము గాని స్వరశబ్దవ్యాకరణాది శాస్త్రజ్ఞానము గాని వలయునంత లేకున్నను ఆంధ్రుఁడనై యాంధ్రభాషయందు భక్తి కలవాఁడ నగుటచే నీపదిదినములనుండి యీమందిరమునఁ జరగుచున్న మహత్తరోపన్యాసమువలన నే గ్రహియింపఁగలిగిన దానింబట్టియు నాకుఁ దెలిసియున్న కొలఁదివిషయములంబట్టియు నాబుద్ధి కిప్పటికి సమంజసము లనితోఁచిన మాటలను గొన్నింటిని నివేదించుచున్నాను.

ప్రతిసంస్కరణమునకును బ్రతిశాసననిర్మాణమునకును మనకుఁ బ్రభువులగు పాశ్చాత్యుల కార్యములు మన కాదర్శములై యున్నవి. ఇపుడు మనము పూనినకార్యము భాషాసంస్కారము లేక భాషాశాసనసంస్కారము లేక తన్నిర్మాణము నైయున్నది. ఈవిషయమున నాంధ్రవిబుధులు రెండుతెగలయియున్నవారు. అనగా నీవిషయమునఁ బరిశ్రమ చేయుచున్నవారు రెండుతెగలుగ విభజింపఁబడియున్నారు. అం దొకతెగవారు గ్రాంథిక వాదులు, రెండవతెగవారు గ్రామ్యవాదులు. మనము గ్రాంథికవాదులమత మేమి? గ్రామ్యవాదులమత మేమి? ఏది యెంతవఱకు సమంజసము? అనువిషయములను విమర్శించుకొనవలసియున్నది. మొదటివారి మతము భాషయను గ్రంథములు వ్రాయుభాష ఛందోవ్యాకరణాదినియమబద్ధమయి యుండవలయు, నందుల కిప్పుడు గ్రాంథికభాషయందుఁ బ్రమాణములుగాఁ బరిగణంపఁబడుచున్న వ్యాకరణాదిశాస్త్రములే ప్రమాణములుగా నుండవలయు నని తెలుపుచుఁ గాలోచితసంస్కారములను సంధియందున్న

అన్యభాషాస్వీకరణమునందును నియమబద్ధముగఁ జేసికొనవలయు ననియు గ్రాంథికభాషావాదులు తమమతమును వ్యక్తీకరించి యున్న వారని నాయాశయము. జయంతిరామయ్యపంతులవారు వ్రాసియుంచిన 'Defence of Literary Telugu' అనుగ్రంథమును జదువఁగ వారిమత మిది యని నే గ్రహింపఁగలిగితిని. సంధివిషయమున వా రంగీకరించినసంస్కారమున, "సంధియుండుటచే శ్రుతికటువుగనుండుటగాని పదముల యర్థము దుర్గ్రాహ మగుటగాని లేక యశ్లీలమగుటగాని సంధివిరామము లేకుండఁ గలువుటవలనఁ బదము లూపిరియాపలేక పోవునంతటి దీర్ఘము లగునప్పుడు గాని విసంధి నంగీకరింపవచ్చు" నని కనఁబడుచున్నది. ఇంకఁ బరభాషాపదములను స్వీకరించుటలోఁ గ్రొత్తమాటలను నిర్మాణముచేయుట యవసర మైనయప్పుడు మూఁడుమార్గములను వారు గమనించియున్నారు. (1) ఇదివఱకు భాషలో నున్నపదముల సహాయముచేతనే సమస్తపదములను సృష్టించుట (2) ఇదివఱకున్నపదములను బారిభాషికపదములుగ మార్చి కొన్ని యర్థములయందు వానినిరూఢిచేయుట (3) పరభాషాపదముల నర్థసహితముగ మనభాషామర్యాదలకు లోఁబఱచి స్వీకరించుట. ఇం దితరభాషాసహాయ మపేక్షింపక వీలయినయెడల స్వభాషయందలి పదముల మార్పుచేతనే క్రొత్తపదములను గల్పించుకొను టుత్తమ మని వారి యభిప్రాయము, కాని యన్నిభాషలకు సృష్టిశక్తి సమానముగా నుండదు కావునఁ దెలుఁగుభాషయం దాశక్తి వలయునంత లేమింజేసియుఁ దెలుఁగునకు సంస్కృతమునకును జిరకాలమునుండి సంపర్కము మిక్కిలిగా నుండుట నిర్వివాదాంశ మగుటచేతను బరభాషాసహాయము పదనిర్మాణమున కవసర మైనపుడు సంస్కృతభాషను బ్రథమముగాఁ బరిగణింపుఁడనియుఁ దాని సహాయము వలనఁ గూడ మనకుఁ బని సుకరముగ నెఱవేఱనిచోఁ నితరభాషలనుండి సహాయమును బొందవచ్చు ననియు నేమము నేర్పఱచి యున్నారు. స్వభాషవలనను సంస్కృతమువలనను నిర్మించుటకు వీలున్నపుడును నిరంకుశముగ నన్యభాషాపదముల ననవసరముగ గుప్పించుటను నిరసించుచున్నారు. ఇందుకుఁ దార్కాణముగ Angle, point, figure మొదలగు తెలుఁగులో వ్రాయుటకు వీలులేని పదములనుగూడ ననవసరముగఁ దెచ్చిపెట్టరా దని నిషేధించిరి. ఇవి సంధివిషయమునను బరపదస్వీకరణమునను గ్రాంథికవాదుల యభిప్రాయములు. ఇవి భాషాభివృద్ధిని గోరి వారిచే నియమింపఁబడినట్లు గాన్పించుచున్న శ్రీ పిల్లవాంగ్రను

భాషను దుర్బోధము దుర్గ్రాహముచేసి వారినోళ్లను జేతులను గట్టిపెట్టి వారికి స్వభాష రాకుండఁ జేసి న్యాయవాదులకడను నుద్యోగీయులకడను వర్తకులకడను బండితులకు వృత్తిగల్పించి పండితుల పంటపండించుట కేర్పాటుచేసినవో సవిమర్శముగాఁ బాఠకులు తమతమ యావేశమును విడిచి యోజించి చిత్తము వచ్చిన తీర్మానమునకు వచ్చెదరుగాక! ఈనియమములవలన మనభాషకు మేలు కలుఁగు ననియు హానియేమియు లేదనియు నానమ్మకము.

ఇఁక గ్రామ్యవాదులమతమునకుఁ బోయి విచారింతము. ఈసందర్భముల గ్రామ్యవాదు లనుశబ్దప్రయోగముంగూర్చి యించుక ముచ్చటింపవలసియున్నది. గ్రామ్యవాదు లని పిలుచుట మా కగౌరవ మనియును వ్యావహారికవాదు లని పిలువవలసియుండు ననియు వారు సెలవిచ్చియుండిరి. ఇప్పటివఱ కేర్పడియున్న శబ్దశాస్త్రనియమముల ననుసరించి లక్షణవిరుద్ధమగుభాష గ్రామ్య మని గ్రహించుచున్నాము. వస్తాడు, పోతాడు, వచ్చాడు, మొదలగు రూపములు గ్రామ్యము లని యిప్పటి మనము రూఢముగా వాడుచున్నాము. దానియర్థము సుకరముగా నందఱకు గ్రాహ్యామే. గ్రామ్యవాదులనఁగనే ప్రజలు రామమూర్తి పంతులు వారు వారియనుగాములు నని గ్రహించుచున్నారు. ఈపదమున కట్టియర్థము సుప్రసిద్ధమయినది. పదమూ లలితమై శ్రమలేకుండఁ బలుకఁ దగినదై యున్నది. దీనిం బలుకుటకంటె వ్యావహారికభాషావాదులని యింతపొడుగుపేరు నుచ్చరించుట యీవాదమువారి యాశయములనుబట్టియే కష్టతరముగా నున్న దనుట వాస్తవము. అట్టివిషయమున గ్రామ్యవాదు లనుటమాని వ్యావహారికభాషావాదు లని పిలువుఁడని కోరుచున్నారు. ఎందుచేత? అది యగౌరవ మైనపదముగా వారికిఁ దోఁచినదఁట. అందఱకును దెలిసినదైనను సులభతరోచ్చారణ గలదైనను గ్రామ్యపదమును ద్యజించి యంతసులభముగఁ దెలియరానిదియుఁ గష్టతరముగాఁ గాని యుచ్చరింప నసాధ్యమైనదియు నగు "వ్యావహారికభాషావాదు' లను పదమును వారు స్వీకరింతు రఁట. దేనినపేక్షించి? వారిగౌరవము నపేక్షించి. మనకు వారిని గౌరవించుటే కావలసినది గాన నించుక యుచ్చారణము నందాయాసము గలిగినను వారుకోరినరీతిని వ్యావహారికభాషావాదు లనియే వాడుదముగాక! వారిగౌరవమును గాపాడుకొనుటకు వారికి గౌరవమైన పదమును వా రపేక్షించినరీతినే భాషాగౌరవము కొఱకు భాషకూడ గౌరవము గలిగిన పదములనపేక్షించుచున్నది. ఆగౌరవపదప్రయోగమే గ్రాంథికవాదుల

గోరుచున్నది. ఇది యిట్లుండనిచ్చి వ్యావహారికభాషావాదులమత మేది? తద్ధర్మము లెవ్వి? యని విమర్శించుట మనకుఁ బ్రధానకర్తవ్యము. వారి మత మిది యని నిర్ణయముగ వారు వక్కాణించి యుండలేదు. ఉన్నంతవఱ కది విస్పష్టముగను నిస్సంశయముగను నుండక సందిగ్ధముగ నున్నయది. వారువిరచించిన పాత్రములనుబట్టి వారిమతమును గ్రహింతమంటిమా యాగ్రంథముల నువ్రాసినపిమ్మట మాయూహలను మార్చుకొంటిమి కావున మేము రచించి లోకమునఁ బ్రవేశపెట్టిన మాగ్రంథములు గాని యందలిపీఠికలయందలియాశయములుగాని మామతమునకుఁ బ్రమాణములుగాఁ దీసికొని ఖండింపవల దని వారొకరితోఁ జెప్పఁగా మేము వినియున్నామని కొందఱు న్యాయశీలురు సెలవిచ్చుచున్నారు. ఇదివఱకు రచియించినగ్రంథములను బ్రమాణముగాఁ దీసికొనవలదని పత్రికాముఖంబునఁ గాని సభాముఖంబునఁగాని వారు ప్రచురించి యుండలేదు. నిన్నగాక మొన్న నీకాకినాడలోఁ జేసిన సభలయందుఁ దద్గ్రంథకర్త లుపన్యాసము లిచ్చియు వారికి సమాధానములు నిచ్చుటకిచటిపండితు లుద్దేశించి యుండిరని యెఱిఁగియుఁ గూడ మామతమునకు మాగ్రంథములు ప్రమాణములు కావని వారు వాక్రుచ్చి యుండలేదు. వారిమతమునకు వారిగ్రంథములే విరుద్ధములుగా నున్నవని ఖండనము ప్రారంభము కాఁగానే యాగ్రంథము రచించునాఁటి కాగ్రంథకర్తల కున్నయూహ లిటీవల మాఱినవి కావున నాగ్రంథమును వారిమతముగా నెంచి ఖండింపరా దని ప్రతివాదు లుపన్యాసమధ్యమున నడ్డము వచ్చుచున్నారు. కూలంకషముగా నీమతమువారి యాశయము లన్నియు బయల్పడలేదు. అన్నింటి విననఁ గాని ప్రత్యుత్తర మొసంగుటకు వీలులేదని కొందఱు ప్రభువులు జనాంతికముగాఁ బల్కుచున్నారు. ఇట్టివారి మతము నాలుగైదేండ్లయి జన్మించిన దయ్యుఁ బరీక్షకులు పరీక్షలయందుఁ దెలిసియో తెలియకయో యామత ప్రకార ముత్తరపత్రములను వ్రాయవచ్చునని విద్యార్థులకు స్వేచ్ఛనిచ్చియును ఆమత మిద్ది యని చెప్పి దేశక్షేమమునకై సత్యపరిశీలనము కొఱకు విమర్శింత మనిన “నేతి, నేతి” యను పరబ్రహ్మస్వరూపనిర్వచనమువలె నేదియును గాదను స్థితిలో నున్నది. వాస్తవముగా నిప్పటికి విచారింప వారిమత మేదియో వారికిని స్ఫుటముగఁ దెలియ దని శంకింపవలసివచ్చుచున్నది. అయినను ముఖ్యముగా వా రీనడుమ నిచ్చట (కాకినాడలో) నొసంగినయుపన్యాసములను

బట్టియు నిదివఱలో నొకసారి రామమూర్తిపంతులవారీపురమునకు విచ్చేసి యొసంగిన యుపన్యాసములనుబట్టియుఁ బత్రికాముఖంబుల నప్పుడప్పు డీమత స్థులు వ్రాయుచున్న వ్యాసాదికములను బట్టియు నేగ్రహింపఁగలిగినంతవఱకు వీరిమతముంగూర్చి నాయభిప్రాయములను నివేదించుచున్నాఁడను. ధారాళ ముగా వారియూహలను దెల్పుటకు రామమూర్తి పంతులుగారికిని వారియా శయములను బ్రచురించుటకు అప్పారావుపంతులుగారికిని వారిమతమును బోధిం చుటకు శేషగిరిరావుగారికిని వారిజ్ఞానమును వ్యక్తీకరించుటకు సీతారామయ్య శాస్త్రిలవారికిని ఎట్టిస్వాతంత్ర్యము గలదో యట్టి స్వాతంత్ర్యము వారివలెనే యాంధ్రుఁడనై యాంధ్రభాషాభిమానము గలిగి యాంధ్రభాషం జదువుకొని దానియందుఁ బాండిత్య మంతగా లేకున్న నభిరుచి మిక్కుటముగాఁ గలిగి దాని మేలు కోరినవాఁడ నగుటచేత నాయభిప్రాయములను బ్రచురించుటకు నాకును సోదరభావముతో స్వాతంత్ర్యమును వా రొసంగుదు రని నమ్ముచున్నాఁడను. వారికిని నాకు నొక్క భేదము కలదు. ఏది యనిన బడిపిల్లలు వారిచేతులలోఁ జిక్కియున్నారు. అందుచే వారియభిప్రాయములు వారికిఁ దోఁచిన తత్క్షణము ననే యెవరితోఁడను జెప్పనక్కఱలేకయే కార్యరూపముగ నెలకొల్పఁగలరు. నా కది సాధ్యము కాదు. నాపిల్లలవిషయమున నైన నాయభిప్రాయముల ననుగ మింపఁజేయుటకు వీలులేదు. అనఁగ నీవిషయమున వారున్నతావు వారికెక్కుడు బలిమి నిచ్చునదై యున్నది. మనది తదితరమై యున్నది. ఇందుచే నివి వ్యాప్త మగుట కష్టము. అవి విస్తరిల్లుట సుకరము. కాని యట్లని యుదాసీనభావము పురుషకారము గాదు. మనము మంచి దని నమ్మినదానికొఱకై పూనికతోఁ బాటుపడవలయును.

ప్రజాసమూహ మంతటికిని సంబంధించినవిషయములయందు మార్పును గలుగఁజేయునప్పుడు తొందరపాటు కూడదు. అట్టిచోట్ల నెంతయో దూరదృష్టి విశాలహృదయము నిశితమైన సూక్ష్మబుద్ధి పౌర్వాపర్యవిమర్శనమును గలిగి నిదానముగా శాంతముగా నావేశమునకు నుద్రేకమునకుఁ దావీక ప్రజాభిప్రా యమును గుర్తెఱింగి వారికిఁ గలుగు లాభనష్టముల వారికిఁ జక్కఁగఁ దెలి యునటుల బోధించి ప్రజలు వానిపైఁ జేయుఖండనమండనములను దారతమ్యవి చక్షణచేసి చూచి పిమ్మట వీని నన్నింటిని బట్టి ప్రజాక్షేమకర మని యేది ప్రముఖులచే నిర్ధారణము చేయఁబడునో యట్టిమార్పులను గ్రమముగా నాచర

ణములోఁ బెట్టవలయును. ఆంధ్రుల కందఱకును సంబంధించిన భాషావిషయమున నీవ్యావహారికభాషావాదులు మార్పులను బెట్టినారు. అవి దిక్ప్రదర్శనముగ మనకుఁ దెలిసినంతవఱ కివ్వి యనిన:-భాషవలన వ్యాకరణము పుట్టును గాని వ్యాకరణమునుండి భాష పుట్టదు కావునను, జిరకాలము క్రిందట రచియింపఁబడిన మనవ్యాకరణశాస్త్రము లానాఁటిభాషయందుఁ గల ప్రయోగములకు లక్షణములం గనిపెట్టి సూత్రముల నేర్పఱచిన వనియు, నప్పటికి నిప్పటికిని భాష యితరభాషలతోడి సంపర్కమువలనను నూతనవాంఛలు జనులహృదయక్షేత్రములయందు నాటుకొనుటవలనను నూతనాదర్శములు బయలు వెడలుటచేతను బలువితములుగ మాఱి యభివృద్ధి చెందియున్న దనియును అందుచేత వృద్ధిచెందిన యీభాషకు మన మిప్పుడు వ్యాకరణమును రచియించుకొనవలెను గాని పూర్వపు వ్యాకరణములనుబట్టి యిప్పటి భాషను శాసించుట న్యాయము కాదనియు నూతనమతమువారియభిప్రాయ మైనట్లు తోఁచుచున్నది. నూతనవ్యాకరణసూత్రములను నిర్ణయించుకొనక ప్రాఁతవ్యాకరణములచేతనే భాషను బంధింప సమకట్టితిమేని దానియభివృద్ధికిని స్వేచ్ఛకును భంగము గలుగుననికూడ వారు చెప్పుచున్నారు. ఈవాదమును మనము ముందు విమర్శించుకొందము. భాషనుండి వ్యాకరణము కలుగుననుట సత్యమే. వెనుకటివ్యాకరణనిర్మాణమునాఁటికి నిప్పటికిని గ్రాంథికభాష యైన నేమి మాటలాడుటలో వాడఁబడుచున్న గ్రామ్యభాష యైననేమి మాఱిన దని యే యంగీకరింతము. న్యాయశాస్త్రము (Civil law) శిక్షాస్మృతి (Criminal law) మొదలగునవి ప్రజాక్షేమమున కెట్లవసరమో యట్లే భాషాక్షేమమునకు వ్యాకరణాదిశాస్త్రము లావశ్యకములనుట నిర్వివాదాంశము. ఏదియయిన నొకకార్యము న్యాయమా యన్యాయమా లేక నేరమగునా కాదా యనినిర్ణయము చేయవలసివచ్చునప్పుడు న్యాయశాస్త్రమునో శిక్షాస్మృతినో తీసికొని దాని నియమములప్రకార మీకార్యము చేయుటకు వీనికి స్వాతంత్ర్యము కలదు. ఈకార్యము చేయుట కీతనికి స్వాతంత్ర్యము లేదు. ఇదియాచరించుటచేత నీతఁడు వంద్యుఁడు. ఇది యాచరించినందున నీతఁడు దండ్యుఁడు. అని యాయాశాస్త్రమర్యాదల ననుసరించి నిర్ణయము చేయఁబడుచున్నది. అట్లే భాషవిషయమున నీశబ్ద మీసంధి యీప్రయోగ మగునా కాదా గ్రాహ్యమా లేక గ్రామ్యమా సాధువా లేక యసాధువా యని నిర్ణయించికొనుటకుఁ బ్రమాణమయిన గ్రంథ మొకటి యవసరము. దానికి వ్యాకరణ

మని యిదివఱకున్న నామమునె యంగీకరించినను లేక గ్రామ్యకరణ మని క్రొత్తపేరు పెట్టుకొనినను నట్టి ప్రమాణగ్రంథ మొకటి యవసరము. అట్టి ప్రమాణగ్రంథము నూతనమతస్థుల కిప్పటివఱ కేర్పడి యుండలేదు. ఇఁక నేర్పాటుకావలెను. అందుల కేమిచేయవలయునో యోజించుకొందము. ఇట్టి నూతనసంస్కారముల లేక నూతనశాసనముల నేర్పఱచుకొనవలసివచ్చినప్పుడు మనకుఁ బ్రభువు లగుపాశ్చాత్త్యులు మార్గదర్శకులుగా నున్నా రని పైనఁ జెప్పియున్నాఁడను. నూతనశాసననిర్మాణము గావలసి వచ్చినప్పుడు వా రేమిచేయుచున్నారో యించుక మనము విమర్శించి చూచుకొందము. ఇందు కొకయుదాహరణము నిచ్చుచున్నాఁడను. జమీందారులకును వారిరైతుల కును గలసంబంధములు మొదట 1866 సం॥ రపు ఏడవశాసనముచే శాసింపఁ బడినవి. అందలి విధులకు జమీందారులును రయితులును విధేయులై ప్రవ ర్తింపవలసిన వా రయి యుండిరి. కాలక్రమమున నుభయులస్థితిగతులయందు ననేకమయిన మార్పులు కలిగినవి. రైతులకుఁ గొన్నిహక్కు లెక్కువ కావలసి వచ్చినవి. జమీందారులకుఁ గొన్నిసౌకర్యములు గావలసి వచ్చినవి. ఇవి యన్నియుఁ బత్రికాముఖంబునను సభలయందును జక్కఁగఁ జిరకాలము విమ ర్శింపఁబడినవి. పిమ్మట ప్రముఖులు బహుశాస్త్రపరిజ్ఞానపారంగతులు విశాల హృదయులు నగువారిచే నదివఱకున్న శాసనము (Rent recovery Act) లోఁ గావలసినమార్పు లివ్వి యని నిర్ణయింపఁబడినది. వానిని దొరతనమువా రికి నివేదించిరి. అంతట బిల్లొకటి శాసననిర్మాణసభలోఁ బ్రవేశపెట్టఁబడినది. రైతులపక్షమునను జమీందారులపక్షమునను జక్కనివాదప్రతివాదములు జరుపఁబడినవి. అవి యన్నియును జనసామాన్యమునకై ప్రచురింపఁబడినవి. క్రొత్తశాసనము నేర్పాటుచేయుటకు సభ్యు లంగీకరించిన పిదపఁ దమబిల్లును బ్రకటించి దానిపైఁ బ్రజలు చేయునాక్షేపణముల నాలోచనలోనికిఁ దీసికొని చర్చించి పిమ్మట శాసనము నేర్పఱచి 1908వ సంవత్సరము జూలై నెల 1వ తేది మొద లీనూతనశాసనము ప్రచారములోనికి వచ్చెను. ఇది యీయాప్రదేశ ములందు వర్తించును. ఇంతటినుండి యిదివఱకువాడుకలోనున్న 1865వ సంవ త్సరమునాఁటి శాసనమునకుఁ బ్రవర్తనముఁ దీసివేసితి మని శాసించిరి. అప్పటి నుండి జమీందారులకును రైతులకును సంబంధములను నిర్ణయించుటకు 1908 వ సంవత్సరపు మొదటిశాసనమునకుఁ బ్రవర్తనము కలిగినది. దొరతనమువా

రీతిని జేయక 1865 వ సంవత్సరపుశాసనమునందుఁ గొన్నిలోపములు చూప ట్టఁగనే యాశాసనమును దీసివేసి క్రొత్తశాసనమును నిర్మించి దానికిఁ బ్రచారము నీయక జమీందారులు విద్యావంతులు, ఘనులు, బుద్ధిమంతులు, ప్రజలఁ బరిపాలింపఁ దగినవారలు, న్యాయాన్యాయముల నెఱింగినవారు కావున రైతులువారి కీవిషయము లన్నింటియందును దీసిపోవువారై యున్నారు కావున నుభయపక్షములవారిలో నాగరికులైనజమీందారులకు న్యాయమని తోఁచిన రీతిని వ్యవహారములను బ్రస్తుతము వాడుకలో నున్నపద్ధతులనుబట్టి జనుపుకొమ్మని యుత్తరువు చేసియుండినచో నిప్పటికి జమీందారులకును రైతులకును నెట్టిచక్కనిసంబంధ ముఁడి యెంతకల్లోముపుట్టి యుండునో ప్రతివారికిని దేటతెల్లముగాఁ దెలియఁదగినవిషయమై యున్నది. ముందుకాలు మోపుటకుఁ దావునుజూచుకొనక వెనుక పాదము నెత్తితిమేని గూలఁబడి కాళ్లువిఱుగఁగొట్టుకొను నవస్థ తటస్థ మగురీతిని నూతనశాసనము నేర్పఱచుకొనక ప్రచారమందున్న ప్రస్తుతశాసనమును దీసివేసినచో నశాంతి బయలువెడలి యల్లకల్లోలమై ప్రజాక్షేమమునకు భంగము కలుగును. అట్లే భాషావిషయమునను నూతనప్రమాణముల నేర్పఱచుకొనకుండఁ బ్రస్తుతప్రమాణములను ద్రోసివేసితి మేని నియమరహితమై భాష వినాశమునొందును. అందఱకు నంగీకారమైన సామాన్యప్రమాణ మొకటిలేకుండిన యెడలఁ బ్రతివానికిని స్వప్రతిభయె ప్రమాణ మగును. అట్లయినపుడు నన్నయ కొకవ్యాకరణము తిక్కన కొకవ్యాకరణము నీరీతిగా మేము వ్రాయఁబోవుచున్నా మని నూతనమతస్థులు సెలవిచ్చి యున్నరీతిని సామాన్యప్రమాణగ్రంథములు లేకుండు నెడలఁ దెలుఁగు వ్రాయఁగలవా రెందఱుందురో యందఱికి నన్ని వ్యాకరణములు సాహిత్యసంఘమువారు శ్రమపడి వ్రాయవలసి వచ్చును. అట్లుచేయుట సాధ్యమగునా? కాదు. కానియెడల నీక గ్రంథము వ్రాయుటకు ముందు గ్రంథకారుఁడు తనవ్యాకరణమును బ్రకటింపవలసివచ్చుచుండును గావున వ్యావహారికభాషావాదులారా! వినుండు. మీరును భాషాక్షేమమును దేశక్షేమమును గోరియే పాటుపడుచున్నా రని మేమెఱుఁగుదుము. అందులకు మీకు వందనశతంబులు. మీరు గొప్పప్రమాదపుఁబని నొకదానిఁ జేసినారు. దావ హాని కలిగినది. భాషను సంస్కరింపవలసినదే. గ్రాంథికభాషాస్థానమున వాడుకభాషను బెట్టఁగోరుచున్నారు. మీరు వాడుకభాషయన నందఱును వాడునది కా దని మరల మీరే సెలవిచ్చుచున్నారు. అందుకు మీరొవక్క

వలసిన దేది యనిన;—ఇదివఱకున్న వ్యాకరణసూత్రములలో వేనిని దీసివేయు దురు, వేని నంగీకరించెదరు, వేనిని గ్రొత్తగాఁ జేర్చెదరు, వాడుకయందుండెడు క్రొత్తరూపములను వేనిని గ్రహించెదరు లేక యిదివఱకున్న వ్యాకరణమును బూర్ణముగాఁ ద్యజించి నూతనసృష్టి చేయఁదలఁచితిరా? లేక రామమూర్తిపం తులవారు సెలవిచ్చిన 18 జాతులరూపములను గ్రంథస్థములనుగా జేయుటతో డనే మీరు తృప్తినొందువారా ? ఈవిషయములకు విస్పష్టముగా మీయభి ప్రాయముల నాడంబరము లేకుండ ప్రజలకు నివేదింపుఁడు. అంతియేగాని మేము చెప్పునది శాస్త్రసమ్మతము మేము పూర్వగ్రంథములనే ప్రమాణముగాఁ బెట్టు కొని యున్నాము. వ్యాకరణములు మేము బహుశాస్త్రసందర్భములతోఁగలిపి చదివినాము. అందుచేత మాకుఁ దెలియునన్ని విషయములు మీ రెఱుంగరు. అందుచే మేముచెప్పునది మీరంగీకరించి తీరవలెను. మేమువిద్యార్థులకొఱకుఁ బాటుపడుచున్నాము. వారియెడ మా కున్న బాధ్యత మీకు లేదు. మీకుఁ జీమకుట్టుటలేదు. మాకొడలెల్లఁ గుట్టిచంపుచున్నవి యని యావేశముతోఁ బలికినలాభము లేదు. లోకమునందుఁ బ్రతిమార్పును బ్రకృతిశాస్త్రానుగుణ్యము గానే జరుగును 'వచ్చినవాఁడ' నను రూపము "వచ్చినాఁడను, వచ్చినా" నని శాస్త్రసిద్ధముగా నయినరీతినే తక్కినరూపములుకూడ వచ్చాను, వచ్చా, ఒచ్చా ను, ఒచ్చా యనియెడు రూపములుకూడ నుచ్చారణ సౌకర్యాపేక్షచేతను నాయావక్తల వక్త్రనిర్మాణవైలక్షణ్యముచేతను వారివారిశ్రద్ధనుబట్టియు నేర్పా టయినట్లు శాస్త్రీయముగానే నిరూపింపవచ్చును. కారణము లేనికార్య మెచ్చ టను నుండదు. వెళ్లినవాఁడు వెళ్లినాఁడు అయినట్లు వెళ్లాడు యెల్లినాడు యెల్లా డు మొదలగునవికూడ స్వరశాస్త్రమునుండి సాధింపఁదగినవే యగును. అందుఁ గొన్నిటికి మీపరిశోధనలయందుఁ గారణములు తెలిసి యుండవచ్చును గొన్ని టికిఁ దెలియకపోవచ్చును. అంతియ భేదముగాని ప్రతిదానికిని గారణ ముండక పోదు. స్వరశాస్త్రసాధ్యమయిన వన్నియు మనకు భాషలోనికి గ్రాహ్యము లగునా? కాదని మీరే చెప్పుచున్నారు. "వస్తాడు" అనునది యంగీకార్యమను చున్నారు. 'వచ్చా' అనురూపము పనికిరాదనుచున్నారు. కావున శబ్దసౌష్ఠవము నకు శబ్దశాస్త్రము ప్రమాణము కానేఱదు. దీని కొకతార్కాణమును దీసికొ నుఁడు. రసవాదశాస్త్రము మనశరీరమున కనుకూలము లయినను గాకున్నను సన్ని రసపదార్థములను గూర్చియును బోధించును. అందు (Potassium Cynide)

అను నొకపదార్థము కలదు. అది రసవాదశాస్త్రప్రకార మేర్పడిన చక్కని పమష్టిపదార్థముగదా యని మనము లోపలికిఁ బుచ్చుకొంటిమేని ప్రాణహాని వాటిల్లుచున్నది. మనము లోపలకుఁ బుచ్చుకొనవలసి వచ్చినపుడు వైద్య శాస్త్రము ననుసరించి యిది మనకు గ్రాహ్యా మగునా కాదా యను విష యమును జర్చించుకొనవలెను. అట్లే మనము మాటలాడునట్టి యు హీనజాతు లవారు మాటలాడునట్టియు మాటలన్నియు ను గూడ స్వరశాస్త్రములేక (Phonetics) ను బట్టి సహేతుకములె యనుచు వానిని గ్రంథస్థము చేయు నప్పుడు మనకు నికషోపములగా నుపయోగింపవలసినది వ్యాకరణశాస్త్రము. ఆ శాస్త్రప్రకార మది సాధువైనచో గ్రహింపవలెను. లేకున్న గర్హింపవలయును. కనుక యేనియమముల ననుసరించి ప్రస్తుతము జనబాహుళ్యమునందు మాట లాడుభాషలో వాడుకలో నున్న పదములను గ్రహింపుమందురో ముందు విస్ప ష్టముగఁ జెప్పవలసియున్నది. నాగరకగ్రామ్యమును వాడుమనుట సందిగ్ధాంశ ముగా నున్నది. 'ఎప్పుడొచ్చావ్' 'ఏంజేశావ్' మొదలగునవి నాగరకుల యినవారు సర్వసామాన్యముగా వాడుచున్నారు. మఱియును బ్రాహ్మణేతరు లయిననాగరకులు పట్టపరీక్షొత్తీర్ణులైనవారు గొప్పపదవులయందున్నవారును 'అవృద్ధి' 'లెగిసినాడు' మొదలగు పదములను వాడుచున్నారు. ఒకయధికారి యొకకాగితము త్వరలో వ్రాయు మని యుత్తరువుచేయఁ దలఁచి 'హే ॥ గు ॥ కొంపమునుగుద్ది' అని కాగితముపై నుత్తరువు వ్రాసినారఁట! వీరిని నాగర కులు గారందురా? అట్లనుటకువీలులేదు. నాగరకులభాష యనినారము గాని కేవలబ్రాహ్మణులభాషయని మేమనలేదని యీమతమువారు సమాధానము చెప్పుచున్నారు. దానింబట్టిచూచిన నీచిక్కు తటస్థమగుచున్నది. దీని కింకొక రీతి ననుకొందు మందురేమో! ఎవరో యొక రట్లు వాడిన నది ప్రమాణమగునా? సర్వసామాన్యముగా నందఱును వాడెడిమాటలు గ్రాహ్యము లంటిమి కాని యట్టిమోటుమాట లాడువారిని మేముగ్రహింప మందురా వ్యవస్థ నెక్కడ నేర్పఱచెదరు? నాగరకశబ్దము మరలఁ గొందఱియందు రూఢము చేయవలసి వచ్చుచున్నది. నన్నయభట్టాదులు మఱికొందఱు కవులును 'వస్తి' 'వస్తాడు' మొదలగు పదముల నెక్కడెక్కడనో వాడినారనియు నందుచేత నాపదములు గ్రాహ్యములయు నాపదప్రయోగములకొఱకు వెదకి వెదకి తపస్సు ధారవోసి పట్టికలు వ్రాయుచున్నారు కదా! అప్పుడుమాత్ర మీవాద మేమయినది?

వారు సర్వసామాన్యముగా వాడిన 'వచ్చితిని' 'వచ్చును' మొదలగు రూపములను తీసికొనవలెను. నూఱుపదములకొ వేయిపదములకో యెక్కడ నైన నొకచోట వాడిన 'వస్తి' 'వస్తాడు' అనురూపములను గ్రహింపుమనుట యెట్టిన్యాయము? వారు వాడినను వైయాకరణులు వానిని దోషములుగాఁ బరిగణించి దోషప్రకరణములందుఁ జేర్చియుంచినారే కాని యవి సుశబ్దము లని చెప్పియుండ రైరి. క్షంతవ్యము లని వాని విడిచిరి. క్షమింపఁదగినవని వాని నుదాసీనభావముతో విడనాడిరి. అట్లుగాక వారు వాడిరి కావున నాయపశబ్దములను మనమును వాడుదమందురేని మీనాగరకులు మాటలాడుభాషవ్రాయునపుడు పైనిజెప్పిన 'తెగిసినాడు' 'ములుగుద్ది' 'అయితిలోకి' మొదలగునవి కూడ సాధువులును బ్రయోగార్హములు నగుచున్నవి. కావున మనుజునకుఁ బరిపూర్ణత్వము లేదనుహేతువుచే మనమెన్నఁడును ధర్మలక్ష్యమును గ్రిందికి దింపఁ బ్రయత్నింపరాదు. లక్ష్య (Ideal) ముత్తమ మైనదిగా నుండవలెను. దానిం బొందుటకు మనజుఁడు ప్రయత్నముచేయవలెను. దానిని బూర్ణముగాఁ గొంద అందవచ్చును లేదా దానికి సమీపముగానైనను జేరవచ్చును. అట్లుగాక లక్ష్యమును గ్రిందికి దింపఁ బ్రారంభించితిమేని రానురాను పశుసనుజున కామనుజుఁడే లక్ష్య మనుస్థితికి వచ్చును. అపుడు భాషనీతి చెడిపోవును. భాషానీతియును దక్కినసీతులవంటిదే. అందుచేత నూతనశాసన మేర్పడువఱకును బ్రస్తుతశాసనమునందలి మర్యాదలకు బద్ధులమై యుండవలసినదే. అట్లుచేయక యున్నదానిం దీసివేసి క్రొత్తదాని నేర్పఱుపక విద్యార్థులకు స్వాతంత్ర్యమిచ్చితిమని ప్రకటించుటచే విద్యార్థులకును దద్బోధకులకును గూడఁ జిక్కులు కలిగినవి. అట్లు చేయుట క్రొత్తమతమువారిత ప్పయి యున్నది.

ఇఁక సంధివిషయమై యోజింతము. సంధిసూత్రములను బాటించుటవలన బాలురకుఁ బదములు తెలియుటలే దనియు వానిని విడనాడుమనియుఁ గ్రొత్తమతమువారి యుద్దేశమయి కాన్పించుచున్నది. ఈయుద్దేశము సరియయినయెడల మాటలాడుటయందు వాడుకలో నుండుభాషను గ్రాంథికము చేయుట మా యుద్దేశ మనుమూలవాదమునకే ముప్పువచ్చుచున్నది. ఏమన, సంధులు వాడుకభాషలో విశేషముగా నున్నవి కాని వాడుకభాషలో లేనిదే యిదివఱకు గ్రాంథికభాషలోఁ బ్రత్యేకముగా నిర్మింపఁబడినవి కావు. ప్రతిచోటను సంధిని విఱుచుచు వ్రాయుట యన వాడుకభాషనుండి వేఱుచేయుట యని యర్థ

మగును. మనము మాటలాడునపుడు ‘ నేజూశాను ’ ‘ వాడడిగాడు ’ ‘ ఏమంటావు’ ‘ వాణ్ణిగలుసుకొన్నాను ’ అని యీ రీతిగా మనము సంధులును గలిపి మాటలాడుచున్నాము. కాని సంధులువిఱిచి మాటలాడుట లేదు. సంధులు వ్రాసినయెడలనే బాలుర కలవాటుపడినరూపములను వారికిఁ జెప్పినవారమగుదుము; కాని విడఁదీసి వ్రాసిన వారికెక్కువ లాభమును గలుగఁజేసినవారము కానేరము. ఏసంధిరూప మయినను దురవగాహము గా నుండు నని తోఁచునెడల దానిని విడువవచ్చును. అందునను నేను బైని మనవిచేసియున్న ప్రకారము గ్రాంథికభాషావాదులు వలసినంతయవకాశము నొసంగియే యున్నారు. ఆవిషయమున నుభయవాదులకు నభిప్రాయభేదమున కవసరము లేనట్లు తోఁచుచున్నయది. ఇది నిక్కమైనయెడల నావిషయమునఁ జర్చలను మానుకొందురుగాక యని యుభయపక్షములవారిని బ్రార్థించుచున్నాఁడను. ఇంకొక్కవిషయ మీసందర్భమునఁ జెప్పవలసియున్నది. క్రిందితరగతులయందలి బాలురకుఁ బాఠకగ్రంథములను వ్రాయుటలోఁ బదములను సులభమయిన వానిని వాడుట వలన సుబోధత్వము గలుగును గాని కఠినపదములను గ్రిక్కుమిత్తులలోవలె వాడి సంధులు పనిఁబూని తప్పని సరిగా మానుటవలన సౌకర్య మేర్పడదు. ‘చీమ అక్కడ ఉన్నది ’ అని బాలునకుఁ జెప్పి చదివించుటకంటె ‘ చీమ యక్కడ నున్నది ’ యని చెప్పి చదివించుట కష్టతరము కాదు కాని ‘ పిపీలికము ఆస్థలమున స్థితమై ఉన్నది ’ యని చెప్పి చదివించుట దుష్కరముగా నుండును. సులభమైన పదములతో సుకరమైన సంధులతోఁ గ్రిందితరగతి బాలురకుఁ బొత్తములు వ్రాయింపవచ్చును. కొంతజ్ఞానము కుదిరి విద్యార్థి తగినస్థితికి వచ్చినపుడు వ్యాకరణమును జెప్పి యాయాసంధిరూపము లేల కలిగినవో వాని హేతువులను బిమ్మట బోధించెదరుగాక. మొదటనే రూపము నిష్పత్తిచేసి చెప్పుమని యెవ్వరును నిర్బంధించుట లేదు! మొన్నను వారు వ్యాకరణవిషయమై ముచ్చటించుచు వర్తమానకాలమునఁ జిన్నయసూరి వ్యాకరణములో రెండు మూరల పొడవుగల నిర్వచనము నిచ్చియున్నాఁడు. అది యంతయు నెవరికిఁ గావలెను. ‘ గుంటళ్లకి Present tense అని చెప్పేస్తే తెలిసిపోతుంది ’ అని కాలమును బోధించుట కొక యతిసులభమైనరాజమార్గమును సయుక్తికముగా సెల వొసంగియున్నవారు. మహనీయులారా! ఎంతసమంజసమయినయూహనూ చూచితిరా? వారందఱుఁ బిల్లలకు భాష సుబోధముగా నొనరించుటకై పాటు

పదుమహాసీయులుగా నున్నారు. అన్నిటను బరమపూజ్యులము, భాషారహస్యములును మర్మములును గనిపెట్టిన కుశాగ్రబుద్ధులము, మామతమును విడిచి వెట్టులయి యేలచెడిపోయెదరు. అని మేఘగంభీరవాక్యములతో ముచ్చటించియున్నారే! పీ రేబాలునికి వర్తమానకాల మనిన 'Present tense' అని బోధించి వర్తమానకాల మిది యని తెలుపఁగలిగిరో కదా! అట్లయిన 'నీరు' అనిన మనకుఱ్ఱవాండ్రకుఁ దెలియనిచో Aqua అనియో 'పానీ' అనియో 'వాట' రనియో తెలిపిన సుకరముగాఁ దెలియు ననినం దప్పేమి? ఇట్టివి గదా వీరు కనిపెట్టిన నూతనసుకరమార్గములు! వీనివలనఁ గదా మనబాలు రేకసంథాగ్రాహులు గాఁగలుగుట! ఈమార్గములవలననే కాదా మనతెలుంగుదేశమువారందఱుఁగూడ నొక్కుమ్మడి గురుబోధఁగూడ నపేక్షింపక గ్రంథకర్తలు గాఁగలుగుట! ఇది వెట్టి గాని సహేతుక మైనవాద మగునా? ఇట నొకప్రశ్న వేయవచ్చును. 'Present tense' అని చెప్పినఁ దెలియదని హేళనము చేయుచున్నావే, చిన్నయసూరి యిచ్చిననిర్ణయమును బట్టి వర్తమానకాల మిట్టిది యని బాలురకు నీవు బోధింపఁ గలుగుదువా?" యనినఁ జిన్నయసూరివ్యాకరణమునందలి నిర్వచనము మన మక్షరములు చెప్పినప్పుడే పిల్లవానికిఁ జెప్పుట కేర్పడియుండలేదు. దానిం గ్రహింపఁ గలిగినస్థితికి వచ్చినపుడే దానిం జెప్పవలెను. అప్పుడే యందలి సారస్యము నాతఁడు గ్రహించి యానందించును. నిర్వచనము కావలసినప్పు డట్టి కష్ట మవసర మగును. అందు నది పారిభాషికపదనిర్వచనము రూపములచేతను బ్రయోగములచేతను వర్తమానకాల మన నిట్టిది యని తెలియవచ్చును గాని దాని స్వరూపమును నిర్వచింపవలసివచ్చినపుడు కష్టముతప్పక కలుగును. ఇందుకుఁ దార్కాణముగా హూణభాషనుండి యొకయుదాహరణమును దీసికొందము. 'Matter' అనుపద మొకటి మనగు హూణవిద్యాభ్యాసము ప్రారంభించిన కొన్ని నాళ్లనుండియు వినుచుందుము. వ్రాయుచుందుము. మనకర్థ మగుచునే యుండును. పైతరగతు లనఁగ Matriculation తరగతిలోనికిఁ బోయినపుడు 'Matter' అనుదాని నొకవిధముగ నిర్వచించుదురు. పిమ్మట బి. యే. తరగతిలోనికిఁ బోయినపు డొక్కొక్క రొక్కొక్కరీతిని 'Matter' ను నిర్వచించియున్నారు. నానాఁటికి దానినిర్వచనము మాఱుచున్నది. చిట్టచివరకు 'Matter' అనఁగా 'చలనము' అని నిర్వచించెడు స్థితికిఁ బదార్థవిజ్ఞానశాస్త్రములు వచ్చియున్నవి. ఇన్ని పాళ్లల 'Matter' అంటే బొట్టెల్లిట్టే గట్టక్కుతారు. అని Scientists

శాస్త్రవేత్తల శ్రమ లన్నియుఁ గ్రుదటికాలములో నిరసించి త్రోసిరా జనవచ్చును గదా! సోదరులారా! జనభాషాబాహుళ్యముతో సంబంధించినవిషయములను జర్చించునపుడు కడు మెలఁకువ గలిగి వర్తింపవలెఁ గాని వినోదకథనముగా యోజింపరాదు. ఈపదిదినములనుండియుఁ జరగినచర్చలలో ననేకవిధములయిన వాదములును బ్రతివాదములును జరగినవి. ఒకరినొకరు సమానముగా నన్నిరసములలోను నధిక్షేపించుకొనినారు. తేలినపర్యవసాన మేమనిన వ్యావహారిక భాషావాదు లిప్పటివఱకు శాంతనిద్రయం దున్న యాంధ్రభాషాభిమానులను బెద్దధ్వనులుచేసి మేలుకొల్పినారే కాని యంతకంటెఁ జేసిన దేదియును లేదు. వారిక్రొత్తమత మిదమిత్థ మని చెప్పుటకు వారిప్రమాణ మేదియో ప్రజలకు సుస్పష్టముగఁ దెలిపియుండలేదు. వాడుకభాష యనఁగఁ గొన్నిజాతులవారి వాడుకనే యంగీకరించి యితరులను విడనాడుట కేమిహేతువో నిర్ధారణము చేయలేదు. తాము పెట్టఁబోవు క్రొత్తమతమువలన భాషకుఁ గలుగు లాభములను బ్రస్ఫుటముగా వాకొని యుండలేదు. Phonetics వలనఁ గలిగినరూపమెల్ల వ్యాకరణసిద్ధమే యనుకొను ప్రమాదమునకు లోనయినారు. దానివలన రసవాదశాస్త్రమును వైద్యశాస్త్రమునుగా భ్రమించినట్లును జరిత్రమును ధర్మశాస్త్రముగా భ్రమించినట్లును హానికలుగుచున్నదని తోఁచుచున్నది. వారి కధికారసాహాయ్యముండుటచే ననాలోచితముగా వేగిరపడి బడిపిల్లలకు హానికరమైన స్వేచ్ఛ నొసంగినారు. ఇందుకు వారికిఁ గలిగిన దురభిప్రాయమున కొక కారణము గోచరించుచున్నది. ఇప్పుడు బి. యే. పరీక్ష Pass అయినవారు హూణభాషను వ్రాసినంత సుకరముగను నిర్దుష్టముగను స్వభాషయయిన తెలుఁగు భాషను వ్రాయలేరనునభిప్రాయ మని తోఁచుచున్నది. దీనికిఁ గారణ మేమనిన:—హూణభాష రాజభాషయై జీవనోపాధిని గల్పించునదై యుండుటచేత దానియందు మన మెక్కువ కృషిచేయుచున్నాము. పాఠశాలలయందు హూణభాష కెక్కువ ప్రాముఖ్యమును మాతృభాషకుఁ దక్కువప్రాముఖ్యము నీయఁబడి యున్నది. చరిత్రము, భూగోళము, క్షేత్రగణితము, బీజగణితము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసవాదశాస్త్రము, మున్నగువాని నెన్నింటినో చదువుచున్నాము. భాషాగ్రంథము లనేకములను బ్రతిభాశాలులయిన విమర్శకులు రచియించిన విమర్శనముల సహాయముతోఁ జదువుచున్నాము. ఈరీతిని సూలంకషముగా హూణభాష నభ్యసించుచున్నాము. ఇఁక మన తెలుఁగుభాష నెట్లుచ

దుపుచున్నా మనిన వ్యాకరణము చెప్పుట లేదు. 4,3 పాత్రములలోఁ గొన్ని యాశ్వాసములో ప్రకరణములో పరీక్షకుఁ బఠనీయములు. వానిని మనము శ్రద్ధగానైనఁ జదువుట లేదు. తెలుఁగున కేర్పడిన కాలమును విశ్రాంతికాలముగా నుపయోగించుకొనుచున్నాము. ఉపాధ్యాయులు నంతశ్రద్ధతోడనే చెప్పుచున్నారు. వారు చెప్పుచున్నదాని నైనను మనము శ్రద్ధతో వినము. అట్లయినను దెలుఁగు మనస్వభాష గనుక దానియందుఁ దప్పిపోయినవా రత్యల్పసంఖ్యాకులుగాఁ గాన్పించుచున్నారు. ఏమాత్రము శ్రద్ధతో నయిన నుపాధ్యాయులు చెప్పినపాఠమును వినినవారు మొదటితరగతియందుఁ గృతార్థు లగుటయు నుండును. మొదటివారుగా నుండఁగలుగుటయును మనము చూచుచున్నాము. అట్టివారు గ్రంథములను రచియించుచున్నారు. చక్కనినాటకములను వ్రాయుచున్నారు. భాషాంతరీకరణములను గావించుచున్నారు. ఒకవంక బయలుదేఱిన విజ్ఞానచంద్రికాగ్రంథమాలను, వేఱొకకడ బయలువెడలిన యాంధ్రప్రచారిణీగ్రంథమాలను, బందరుపురమున నున్నయాంధ్రభాషాభివర్ధనీగ్రంథమాలను, దూర్పున నుదయించుచున్న వేగుఁజుక్కగ్రంథమాలను వ్రాయుచున్నవా రెవ్వరు? తెలుఁగు వ్రాయలేనివారా? వేనవేలు గ్రంథము లమ్ముడుపోవుచున్నవి. కొనువారికిఁ దెలియకున్న గ్రంథము లేల యమ్ముడువడును. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నాటకములలోఁ గొన్ని పదునాలువేలప్రతు లమ్మకమయినవఁట. ఇది యెంత యుత్సాహకరము! వారు గ్రాంథికశైలిలో వ్రాసిరా గ్రామ్యభాషలో వ్రాసిరా? ఇది యంతయును భాష కుత్సాహకరముగా నుండలేదా! కృష్ణదేవరాయలకాలమును స్మరణకుఁ దెచ్చుటలేదా? కృష్ణదేవరాయల కాల మనిన మననూతనమతమువారిలో నొకరైన శేషగిరిరావుపంతులు M. A. గారు సెలవిచ్చిన యొకమనోహరవాక్యము జ్ఞప్తికివచ్చినది. "ఆకాలములో శత్రుభయ మెక్కువగా నుండి యెఁకనో యిప్పుడో శత్రువులు వచ్చి పయిఁబడ నున్నారు. జీవనము క్షణభంగురము గావున నింతలోనే సంతోషమును వీలయినంతవఱకు ననుభవింపవలె నని రసభూయిష్ఠము లయినప్రబంధము లప్పటికవులు వ్రాసినా" రని వారిశాస్త్రజన్యజ్ఞానమును జరిత్రాభిజ్ఞతయుఁ దేటపడ నొకవాక్యరాజమును సెలవిచ్చి యున్నారు. ఎంత చక్కనియుక్తియో యెంత రసవంతమైన యోజనయో చిత్తగింపుఁడు. శత్రువు వచ్చి శిరస్సు ఖండింపనున్నపు డలసాని పెద్దన్నగారు "ప్రాంచద్భూషణబాహుమూలరుచితో" నని శృంగారరసభూయిష్ఠముగాఁ బద్యములను వర్ణింపఁ బ్రారంభించినా రఁట! అహా! కవిత్వము చెప్పుట కెట్టి తరుణముండవలయునో పంతులవారు చక్కఁగాఁ గని పెట్టఁగలిగిరి కాని యాయలసాని పెద్దనమాత్ర మట్టియాపత్సమయము కవితారచనకుఁ దగినసమయ మని చెప్పియుండలేదు. "నిరుపహతిస్థలంబు రమణీ

ప్రియదూతిక దెచ్చియిచ్చుక। ప్పురవిడె మాత్ర కింపయినభోజన ముయ్యాలమంచ మొప్పుతి। ప్పరయురసజ్ఞు లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్" అనియీ రీతిని మనస్సు వికాసమునొంది మిక్కిలియుల్లాసముగా నున్నసమయము కవిత్వమునకుఁ దరుణ మని చెప్పినాఁడు కాని ప్రాణోత్క్రమణకాలమును గవితారచనకు సుముహూర్తముగా సేర్పఱచుకొని యుండలేదు. ఇఁక నిప్పుడు గ్రామ్యభాషయందు గ్రంథములు రచియించు పెద్దన్నలకుఁ గత్తి నత్తిని బెట్టినప్పుడే కాని రస ముప్పతిల్లదేమో! Phonetics శాస్త్ర మీవిషయమై యిట్లు చెప్పనేమో. ఆశాస్త్రము నాకుఁ దెలియదు. కావున వారివాక్యరాజముయొక్క ప్రాశస్త్యమును నేను గ్రహింపఁజాలకుండుటయే కాక యిది వట్టి తప్పుటూహ యనియు నేవో పెద్దపెద్దమాటలు చెప్పి భాషయొక్క చరిత్రమును మేము పరిశోధించుచున్నా మనియు నూతనమార్గములను గనిపెట్టుచున్నా మనియు శ్రోతలను బరిభ్రమింపఁజేయుటకుఁ జెప్పిన నిరర్థకవాక్య మని చెప్పవలసి వచ్చినందులకుఁ జింతిల్లుచున్నాను. "ప్రమాదోధీమతామపి" యని యున్నది గదా! ఇట్టిస్వల్పవిషయములలోనే వీరిశోధన లిట్టివిపరీతఫలప్రదములుగా నున్నవే? వీరిని బ్రమాణముగాఁ బెట్టుకొని వీరియాజ్ఞకాఁగానే కోట్లకొలఁది యాంధ్రజనులక్షేమముతోడను గౌరవముతోడను సంబంధించియున్న భాషాశాసనములను జర్చింపకుండ విమర్శింపకుండ మార్చివేసికొనవలయునా? ఈరీతి దుడుకుఁజేతలు సేయుచు నిదివఱలో నొకవక్త తెలిపియున్నరీతిని భాషాభవనమున కనలమంటించి, పైఁగా గ్రాంథికవాదులు మమ్ముఁ జేరనిచ్చుటలేదు, మామాటలను వినుటలేదు, మావాదమును వినకుండనే మామీఁద నపనిందలు వేసినారు, అని లేనిపోని కల్లబొల్లి మాటలచేఁ బ్రజల కుద్రేకము గలిగింప యత్నించుచున్నారు. తమవాదమును గ్రాంథికవాదులు వినుటలే దనునది కల్ల. గ్రాంథికవాదుల పరిషత్పత్రికలలోనే యించుమించు ప్రతిదానియందును వ్యావహారికభాషావాదులు తమవాదమున కనుకూలమైన వ్యాసములను బ్రకటించుచున్నారు. ఒకదానియందు గిడుగు రామమూర్తిగారు ప్రాఁదెనుఁగుఁగమ్మను వ్రాసినారు. ఒకదానియందు రాయఁడుశాస్త్రులుగారు వ్యాసము వ్రాసినారు. ఇంకొకదానియందు మొన్నటియుపన్యాసకులలో నొక రగు సీతారామశాస్త్రులవారు వ్రాసియున్నారు. ఇది గ్రాంథికవాదుల యుదారబుద్ధిని నిష్పక్షపాతబుద్ధిని దెలుపుచుండఁగా మాయభిప్రాయములను వారు తెలుపుకొనిచ్చుటలే దని యసత్యవాక్యములు సభాముఖంబునఁ బల్కుట సమంజస మగునా? పరిషదుత్సవము జరిగినదినములలో గ్రామ్య గ్రాంథికచర్చ జరిగి యందు 'వోట్లు' తీసికొనఁబడి యొక్కపక్షమున నేబదికంటె నెక్కువగను రెండవపక్షమున నాలుగైదును వచ్చియుండఁగాఁ దమవాదమునకు జయము కలుగలేదని పైని జెప్పినరీతి నప

నిందలను గ్రాంథికవాదులపైఁ బ్రకటించుట యేశాస్త్రసమ్మతమో తెలియరా కున్నది. ఆస్వరము లట్లు పలికిన వని స్వరశాస్త్రమునే శరణు పొందవలయును. ఇంకొక పరిహాసపాత్రమైన వాక్యమును గూడఁ గళానాథులయిన శేషగిరిరావు పంతులవారు నిరాఘాటముగా సభాముఖమునఁ జెప్ప సాహసించి యున్నారు. అది యేది యనిన: పరీక్షాధికారులు బాలుర నెట్లయినఁ దెలుఁగులోఁ గడ తేర్ప వలయు నని వారు ప్రశ్నలకు సరియయినయుత్తరములను వ్రాయఁజాలకున్నను బరీక్షయందుఁ దప్పిపోవుదురేమో యనుభీతిచే సరిగ pass అగుటకుఁ గావలసి నన్ని మార్కులను మాత్రము దయ దలఁచి యిచ్చుచున్నా రనియు నందుచేతనే తెలుఁగునఁ దేఱినవారి కందఱకు నలువది ప్రాంతముననే మార్కులుగాన్పించు చున్న వనియును. ఇది యెంత తప్పుమాట! అన్నివిధములచేతను బ్రమాదపూరి తమైయున్నది. ఏ మనిన:— మొత్తముమార్కులలో నెన్నిమార్కులను సామాన్య విద్యార్థి తెచ్చుకొనఁగలిగి యుండునో యాసంఖ్య కృతార్థతకుఁ గావలసిన యత్యల్పసంఖ్యగా నియమము చేయుదురు. అందుకుఁ దక్కువసంఖ్య మార్కులు వచ్చినవారలు తప్పినవారుగాను ఆసంఖ్యను నంతకంటె నధికముగను దెచ్చు కొనఁగలిగిన వారలు కృతార్థులుగాను బరిగణింపఁబడుదురు. నూటి కఱువది డెబ్బది తెచ్చుకొనఁగలవారిని మొదటితరగతియందుఁ జేర్చిన ట్లెంచెదరు. సామా న్యవిద్యార్థి కెప్పుడును Minimum number నియమింపఁబడిన యత్యల్పసంఖ్యకు సమీపించినమార్కులే వచ్చుట తెలుఁగునందే కాక యన్నివిషయములయం దునుగూడనట్లే యుండును. పంతులుగారికిఁ బ్రస్తుతపుఁ దెలుఁగునందు సవతితల్లి ప్రేమగనుక యట్టి సారాంశమును దానింబట్టితీసిరి. తక్కినవిషయములందు మా ర్కులెట్లు వచ్చినవో యవి కూడ నిచ్చి తారతమ్యవిచక్షణ చేసి చూపించిన నొక విధముగ న్యాయముగా నుండునేమో. అదియు నుఁజేయ నొల్లరైరి. పైగాఁ బరీక్ష కులయందుఁ గూడని నిందను గూడ నారోపించిరి. కొంచెమించుమించు వారికం తరాత్మ లేదనునట్లు సూచించిరి. సరియైన సమాధానములు వ్రాయకున్నను బాలురకు మార్కు లిచ్చుటకు వారియంతరాత్మ యంగీకరించునా? లేక యొక్కొ క్కవిషయమును దిద్దునప్పుడొక్కొక్కరీతి యంతరాత్మ యుండు నని Phonetic conscienceస్వరాంతరాత్మవంటి క్రొత్తయంతరాత్మ యేదయిన నూతనపరిశో ధనలవలన నేర్పడినదా! ఈసంశయము తీరవలసియున్నది. లేనియెడలఁ దమవంటి పరీక్షకులపై నిట్టినిందారోపణము చేయుట పంతులవారివంటి నాగరకులకుఁద గదు. వారు ప్రతివ్యాసమునందును 'నాయనుభవమును మీకు బోధించుచు న్నాను. దానింజూచి బాలురారా! మీరు బాగుపడుఁడు' అని తమయనుభవ లాభమును విద్యార్థులపై శ్రోతలపై వెదఁజల్లుచున్నారు. ఇట్టి యంతరాత్మల యనుభవమువలన మనబాలురకుఁ గలుగనున్న మేలు చెప్పనక్కఱలేకయే తెలి

యుచున్నది. ఆత్మస్తవము పరనిందయు లేని మహానుభావు లనిన వీరలే కదా! నిష్పాక్షికబుద్ధియన నిట్లుండవలెనుగదా! వీరింబట్టి యాంధ్రభాష సంస్కరింపఁ బడవలసినదా! పాఠకులార, యోజింపుఁడు! కర్తవ్యము నాచరింపుఁడు!

ఈయంతరాత్మసందర్భముననే నిన్న నాచార్యులవారు సెలవిచ్చిన Phonetic conscience స్వరాంతరాత్మ విషయమై యొకమాట చెప్పకొందము. 'చేత + ఉన్నది' యనునప్పుడు వక్తయొక్క Phonetic conscienceలో 'న' కారమున్న 'చేతనున్నది' యని యగు ననియు, లేకున్న యెడల 'చేతయున్నది' యని యగుననియు, నందులో నకారము యకారముకూడ లేకున్నచో 'చేతున్నది' యని యగుననియు నూహింపవలసియున్నది. దీనింబట్టి వక్తనుబట్టి యంతరాత్మ మాఱునట్లు తోఁచుచున్నది. అందుచే వక్త కొకరీతి నాగమములు రావచ్చును. కొందఱ Conscience లో నగాగమము, కొందఱయందువగాగమము, కొందఱయందు 'య', కొందఱయందు 'ల' యీప్రకార ముండవచ్చును. కాఁబట్టి వక్త కొకరీతి వ్యాకరణసూత్రములను వ్రాయవలయును. ఇంక నందఱకును దెలియుటకై యేర్పర్పఁబోవు సులభమార్గమనిన గ్రామ్యభాష క్రమముగా నెట్టిరంగులోనికిఁ దిగుచున్నదో చూడుఁడు. Phonetic conscience కలదనుట తప్పుకాదు. దానింబట్టి యాగమములును మాఱవచ్చును. అందే యాగమములను మనము గ్రహింపవలెను? నియము మేర్పఱచుకొనని యెడల వ్యవస్థయుండునా? సామాన్యబోధకు సాధ్యమగునా? నీతితో సంబంధించిన Conscience కుఁగూడ భేద ముండును గాని లేకపోదు. అందుచేతనే నీతిశాస్త్రజ్ఞు లెవరి యంతరాత్మ వారికిఁ బ్రమాణ మనక సంఘధర్మముల కనువుపడుటకై యొక నీతిశాస్త్రము నేర్పఱచి యుంచినారు. లేనియెడల నాయంతరాత్మ యిట్లుచెప్పుచున్న దని మనుజుఁ డేమిచేసినను జేయవచ్చునే! అట్టిస్వేచ్ఛ సాంఘికశాంతికి హానికరమగునే! అట్లె యెవరి Phonetic Conscience వారి దనీ, ఎవరి Phonetic Conscience వారికిఁ బ్రమాణముగా నంగీకరించు నెడల భాషానీతి చెడి భాషకు ముప్పు గలుగును గాన మీరు సెలవిచ్చెడు Phonetic Conscience లన్నియు విమర్శించి గ్రాహ్యములయిన Consciences ఏవో నిర్ణయించి నేమము నేర్పఱచి చూపుఁడు. ఊరక పెద్దమాటలు చెప్పి వ్యామోహమును గలిగింపఁ బూనినఁ బ్రయోజనము లేదు. సారాంశముల నేర్పఱచుకొని విషయములను జర్చించి పూర్వపక్ష సిద్ధాంతములను జేయుఁడు. కాని మనపక్షమువారు మాటలాడునపు డెదుటిపక్షమువారు నిశ్శబ్దముగాఁ జెవియిచ్చి వినియున్నను నెదుటివారు మాటలాడుట ప్రారంభింపఁగనే వక్తలను గలవరపెట్టి మనస్తిమితము చెఱుపుటకై వానిం గలఁతఁజెందుటకై యావేశముతోఁ బామరులవలె వర్తించుట ధర్మము

కా దని తెలిసికొనుఁడు. ఇది నేనాచార్యులవారి నుద్దేశించి చెప్పినమాట గా భావింపవల దని వారిని వేఁడుచున్నాఁడను.

ఈరీతిగా యుక్తులపై యుక్తు లుండుచునే యుండును. వీనితోఁ బనిలేదు. శ్రేయస్కరమైన వాదమునకు జయము కలుగవలెను. అది కాని దపజయము నొందవలయును. అని యుద్దేశించియే మనము చర్చచేయవలయును గాని వారు గెల్తురా మనము గెల్తుమా యను పట్టుదల లనవసరము.

వ్యావహారికభాషావాదులు మనల నందఱను మేలుకొల్పినా రని పైని చెల్పి యుంటిని. మేల్కొని మన మేమిచేయవలయును? మరలఁ బ్రక్కలు సవరించుకొని శయ్యఁ జేరవలసినదా లేక మేల్కొనినందుల కేమయినఁ బ్రయోజనకరమైన కార్యమును జేయవలసినదా? మనముగాక తక్కిన యన్ని పట్టణములవారును భాషాసేవ చేయుచున్నారు. భాషాసేవకై సమాజము లేనిపత్తనము మనదొక్కటియే యని చెప్పుటకు సిగ్గగుచున్నది. Literary Association అని మనసమాజమునకుఁ బేరు పెట్టుకొని యున్నాము. దీనిని సార్థకముచేసికొనియో లేక వేఱుగాఁ నొకసమాజము నేర్పఱచుకొనియో మనమును భాషాసేవకై నడుములు కట్టనియెడలఁ దోడివారిలో హాస్యాస్పదుల మగుదుము. పనిచేయఁ బ్రారంభించిన మనకు సౌకర్యము లనేకము లీపురమునఁ గలవు. విద్యలను బోషించుటకుఁ గంకణముకట్టుకొని దేశదేశంబులఁ దన యౌదార్యరసప్రవాహముచే ముంచివేయుచున్న శ్రీపీఠికాపురాధీశ్వరుఁడు మనకుఁ బ్రక్కనున్నవాఁడు. విద్యలభోజుఁ డనఁదగి చిరకాలమునుండి సరస్వతీపోషణమును మహాకవిపోషణమును జేయుచున్న శ్రీపోలవరసంస్థానాధిపతి మన నడుమనున్నాఁడు. దిగంతవిశ్రాంతకీర్తిమంతుఁడు తిరుపతికవీశ్వరుఁడు మన చెంగట నున్నాఁడు. హూణవిద్యావిశారదు లయ్యును దెలుఁగుభాషయందుఁ బ్రజ్ఞానిధు లయినప్రకాశరావుగారు నాగభూషణముగారు మున్నగు మహనీయు లున్నారు. బ్రహ్మయ్యశాస్త్రిలుగారు మున్నగు విమర్శకులు వక్తలు నున్నారు. ఔదార్యమునకు వన్నె కెక్కిన శేషగిరిరావుపంతులుగారు, సూర్యనారాయణమూర్తిగారు ప్రభృతిపౌరజనులు గలరు. ఇట్టి వీరందఱును స్వభాషాభివృద్ధివిషయమునఁ బనిచేయుట కొకమార్గము నేర్పఱచి కాకినాడకుఁ దోడిపట్టణములయం దున్నతస్థానము నొసంగఁ బ్రయత్నించెదరు గాక యని ప్రార్థించుచు విలువగలిగిన మీకాలము నింతవఱ కాక్రమించుకొని శ్రమకలిగించినందులకు మన్నింపవేఁడుకొనుచు నింతటితో విరమించుచున్నాను.

ఓంతత్సత్.

నండూరి మూర్తిరాజు.

# హిందువుల జ్యోతిశ్శాస్త్రము.

మనయార్యులగణితశాస్త్రముల గుఱించి విచారించునప్పుడు వారు కర్మానుష్ఠానపరాయణు లనియుఁ, గర్మానుష్ఠానమునకు సంకల్పాదులును గాలనిర్ణయములు నావశ్యక ములనియు, నందుచే వారుజ్యోతిశ్శాస్త్రమునఁ(Asteonomy) బరిశ్రమ పడుచుండి రనియు నితఃపూర్వపు వ్యాసములలోఁ జూచియుంటిమి. ప్రకృతము వారు జ్యోతిశ్శాస్త్రమున నెంతపరిశ్రమపడి రనియు, వారిపరిశ్రమ యెంతవిశ్వసనీయ మనునదియు విచారించెదము.

"ఆర్యభటీయ" మునకు మునుపే మనదేశమున సప్తాదశసిద్ధాంతగ్రంథము లుండిన వనియు, వానిలో "పారాశర్య" ము ప్రాచీనతమ మనియుఁ గొన్నిగ్రంథములచేఁ దెలియుచున్నను, వానిలో నెక్కటియు సాంగముగ నిప్పుడు దొరకకున్నది. "సూర్యసిద్ధాంత" మని యిప్పుడు ముద్రితముగు యున్నగ్రంథము ప్రాచీనాష్టాదశ గ్రంథములలోని "సూర్యసిద్ధాంత" ము కా దనియుఁ, గొన్నిశ్లోకములు మాత్రమాగ్రంథమునుండి యిచటఁ జేరియున్న వనియు విమర్శకులయభిప్రాయము. ఏది యెటు లున్నను, మనయార్యులు ఋగ్వేదకాలము నుండియు జ్యోతిశ్శాస్త్రమును వృద్ధిపఱుప నారంభించి రని మాత్రము నొక్కి చెప్పవచ్చును. ప్రస్తుత మీవ్యాసమున నచ్చటచ్చట నుదహరింపఁబడు శ్లోకములు ప్రాయికముగ "సూర్యసిద్ధాంత" మునుండియుఁ "నార్యభటీయ" మునుండియుఁ గైకొనఁబడినవి.

మనము నివసించియుండు భూమిని గుఱించి విచారించియే పిదప నితర గ్రహముల గుఱించి విచారింపవలయుఁ గాన, ప్రథమమున భూవిషయకచర్చను స్వీకరించెదము. భూమి గోళాకృతిగ నున్న దని యిక్కాలమున నెల్లరకుఁ దెలిసినదియే. అయినను బ్రథమమున నీయంశమును గనుఁగొనుట మిగుల శ్లాఘనీయము. "సూర్యసిద్ధాన్త" మున నీవిషయమై

అల్పకాలతయా లోకాః స్వస్థానాత్ సర్వతోముఖం।
పశ్యన్తి వృత్తామప్యేతాం చక్రాకారాం వసుంధరామ్॥

[అల్పశరీరు లగుటచే జనులు సర్వతోముఖవృత్తమైన (Spherical) భూమిని జక్రాకారముగ నుండునట్లుచూచెదరు] అనియున్నది.

భూమి యాదిశేషుని శిరస్సుపైని, దిగ్గజములభుజములమీఁద నున్న దనుపౌరాణికులవాక్యముల నిరాకరించుచు-

మధ్యే సమంతా దండస్య భూగోళో వ్యోమ్ని తిష్ఠతి ।
బిభ్రాణః పరమాంశక్తిం బ్రహ్మణో ధారణాత్మికామ్ ॥

అని వ్రాసియుండుటచే భూమి నిరాధారమయి యాకాశమున నిలుచుచున్నట్లు గ్రంథకర్త దృఢముగ నమ్మియుండెనని చెప్పవచ్చును. భూమి యచలము కాదనియుఁ దనంతట దాను భ్రమణము చేయుచున్న దనియు నార్యభటుఁడే ప్రథమమునఁ గనుఁగొనెను. ఈయంశము నీతఁడు సదృష్టాంతముగ నిటుల నిరూపించుచున్నాఁడు.

అనులోమగతిః నౌస్థః పశ్యత్యచలం విలోమగం యద్వత్ ।
అచలాని భాని తద్వత్ సమపశ్చిమగాని లంకాయామ్ ॥

(ఒకనావలో నొకనైపునఁ బోవునాఁడు తీరమున నుండు వృక్షాదుల నెట్లు మఱియొకవైపునఁ బోవురీతిగఁ జూచునో, ఆవిధముననే లంకలోని జనులు స్థిరమగు నక్షత్రాదులను బశ్చిమముఖముగఁ బోవునట్లు చూచెదరు)

ఇచ్చట స్థలనిర్దేశమునకై 'లంక' యని యున్నది కాని, భూమండలము నెచ్చోటఁ జూచిన నిటులే యుండు నని భావము. ఇంతకంటె భూభ్రమణమునకు వేఱునిర్ధారణ మావశ్యకమా ?

బ్రహ్మాండమధ్యమున భూమి యుండునటులును, దానిచుట్టుఁగ్రమముగఁ జంద్ర, బుధ, శుక్ర, సూర్య, కుజ, బృహస్పతి, శనైశ్చరులు తిరుగుచుండునటులును, మనయార్యు లభిప్రాయపడి యుండిరి. అర్యభటుఁడు నీయభిప్రాయమునే కలిగియుండెను. వానివ్యాఖ్యాతయయిన కేరళవర్మమాత్రము "అర్కాచ్చమండలార్ధే భ్రమతిహి తస్మిన్ క్షితిచ్ఛాయా" అనియు "కుజగురుకోణాశ్చైవం శీఘ్రోచ్చేనాపి బుధశుక్రౌ" అనియు నాతనిశ్లోకములఁబట్టి భూమి సూర్యునిచుట్టుఁ దిరుగుచున్న దనియు, బుధశుక్రులకక్ష్యలు (Orbits) భూకక్ష్యలోపల నున్న వనియు నార్యభటునికిఁ దెలిసియుండె నని వ్యాఖ్యానముచేసి యుండునట్లు శ్రీయుత రామలింగపిళ్లెగారు కొన్ని సంవత్సరములక్రిందట "ఇండియన్ రెవ్యూ"(Indian Review)పత్రికలోఁ బ్రచురించిరి. బాగుగఁ బరిశీలించిచో నార్యభటుని కీయభిప్రాయములు లేవనియే తెలియుచున్నది. కేరళవర్మ

యభిప్రాయములే యార్యభటునివాక్యమునఁ బ్రతిబింబితములై వెలువడిన వని చెప్పవలసియున్నది. ఆర్యభటున కీవిషయము తెలిసియుండిన దని చెప్ప నలవి కాకున్నను, అర్వాచీనసిద్ధాంతులకుఁ దెలియు ననియే చెప్పవచ్చును.

భూవ్యాసమును (The diameter of the Earth) గుఱించి యార్యభటుఁడు "ఖిలాభూవ్యాసః" అని వ్రాసియున్నాఁడు. అనఁగా భూవ్యాసము 1050 యోజనములు కల దని యభిప్రాయము.

[ఇచట "ఖిల" యనుసంకేతముచే 1050 అని తెలియఁజేయఁబడి యున్నది. ఆర్యభటుఁడు గణితశాస్త్రజ్ఞులు సాధారణముగ నుపయోగించెడు సాంకేతికాక్షరములఁ గైకొనక స్వయముగ నొకసంకేతమును నిర్మించి దానినే కైకొని యున్నాఁడు. క, చ, ట, త, పాదివర్గాక్షరము లిరువదియైదును క్రమముగ 1, 2, 3...25లను దెలియఁజేయుననియు; య, ర, ల, వాద్యష్టాక్షరములు 30, 40...100లను దెలియఁజేయు ననియు; అ, ఇ, ఉ, మొదలగునవ స్వరములలోఁ బూర్వపూర్వముకంటెఁ బరము నూరింత లధికమనియు నేర్పఱచుకొనెను. అనగా, క=1, కి=100, కు=10000..., ఖ=2, ఖి=200, ఖు=20000... అని క్రమముగనూహించునది. ప్రస్తుతము "ఖిల"=ఖి + ల=1000 + 50=1050 అని యర్థము. ఇటులే చతుర్యుగమున సంవత్సరసంఖ్యలను "ఖ్యుఘృ" అను సంకేతముచేఁ దెలియఁజేసియున్నాఁడు. "ఖ్యుఘృ"=ఖు + యు + ఘృ=200,00 + 30,00,00 + 400,00,00=432,0000 (కృతయుగము=1,728,000; త్రేతాయుగము=1,296,000; ద్వాపరముగము=864,000; కలియుగము=432,000; మొత్తము=432,00,00)]

భూవ్యాసము 1050 యోజనము లనఁగా $1050 + \frac{15}{2}$ మైళ్లు అని యర్థము. ఆధునికులచే నిర్ధరింపఁబడియున్న, భూవ్యాసము 7912 మైళ్లు. దీనికి నార్యభటునిచే నిర్ధారితమయినదానికిఁ గలస్వల్పవ్యత్యాసమును దలంచినయెడల నెవ్వరికైన నాశ్చర్యము కలుగకుండునా?

భూమియొక్క యుత్తరభాగమున దేవత లుందు రనియు, దక్షిణభాగమున నసురు లుందు రనియుఁ జెప్పి, వారిపరస్పరదినమాన విషయమయి "సూర్యసిద్ధాన్త" గ్రంథకర్త యిటులు వ్రాసియున్నవాఁడు.

మేషాదౌ దేవభాగస్థో దేవానాం యాతి దర్శనమ్।
అసురాణాం తులాదౌతు సూర్య స్తద్భాగసంచరః॥

మేషాదా వుదిత స్సూర్యః త్రీన్ రాశీన్ ఉదగుత్తరమ్ ।
సంచరన్ ప్రాగహర్మధ్యం పూరయే న్మేరువాసినామ్ ॥
కర్కాదీన్ సంచరన్ తద్వత్ అహ్నః పశ్చార్ధమేవ సః ।
తులాదీం స్త్రీన్ మృగాదీంశ్చ తద్వదేవ సురద్విషామ్ ॥

[మేషరాశిమొదలు సూర్యుఁడు విషువద్వృత్తమునకు (The equator) నుత్తరమున సంచరించుచు దేవతలకు గోచరుఁడై యుండును. తులారాశిమొదలు దక్షిణమున సంచరించుచు నసురులకు గోచరుఁడై యుండును. దేవతలదినముయొక్క పూర్వాపరభాగములను క్రమముగ మేషాదిమూఁడురాసులలోను, కర్కటకాదిమూఁడురాసులలోను జరించుచుఁ బూర్తిచేయును. ఇటులే యసురులదినముయొక్క పూర్వాపరభాగములను తులాదిమూఁడురాసులలోను, మకరాదిమూఁడురాసులలోను జరించుచుఁ బూర్తిచేయును]

సురాసురులు భూమిలో నున్నను లేకున్నను సూర్యగతివిషయమయి యీయంశములు నిరాక్షేపణీయములు.

ఈక్రిందిశ్లోకములచే మేరుపర్వతము ప్రస్తుతము (North Pole) అనిపిలువఁబడుస్థాన మని యూహింపఁదగి యున్నది.

భూవృత్తపాదే పూర్వస్యాం యవకోటీతి విశ్రుతా ।
యామ్యాయాం భారతేవర్షే లంకా తద్వన్మహాపురీ ॥
పశ్చిమే కేతుమాలాఖ్యే రోమకాఖ్యా ప్రకీర్తితా ।
ఉదక్సిద్ధపురీనామ కురువర్షే ప్రకీర్తితా ॥
భూవృత్తపాదవివరాః తా శ్చాన్యోన్యం ప్రతిష్ఠితాః ।
తాభ్య శ్చోత్తరగో మేరు స్తావానేవ సురాశ్రయః ॥
తాసా ముపరిగో యాతి విషువస్థో దివాకరః ।
నతాసు విషువచ్ఛాయా నాక్షస్యోన్నతి రిష్యతే ॥

[భూవృత్తమునఁ బూర్వ, దక్షిణ, పశ్చిమోత్తరదిశలయందు యథాక్రమముగ యవకోటి, లంక, రోమక, సిద్ధపురి యనునాలుగునగరము లున్నవి. అవి పరస్పరము భూవృత్తములో నాలవభాగదూరమున నున్నవి. (at a distanee of 90° from each.) వానికుత్తరమున మేరుపర్వతము వానినన్నిటినుండియు నదే దూరమున నున్నది. సూర్యుఁడు విషువద్వృత్తములో నున్నపుడు

వానిపైగాఁ బోవును. వానినుండి అక్షోన్నతియు (the elevation of the Earth's axis) దెలియదు.]

ఇచ్చట 'లంక' 'రోమక' యనుపట్టణములు ఆధునిక 'లంక' 'రోమ్' అనుపట్టణములే యని చెప్పుట విచారణీయము.

సురాలయ మనిన (North Pole) అని యెట్లు తెలియునో అటులే యసురాలయ మనిన (South Pole) అని తెలియునది.

భూమికి నాకర్షణశక్తి (the Power of attracting bodies) యున్నదని యు నందుచేతనే భూమిపైఁ బడువస్తువులు భూమిచే నాకృష్టములై యటులు పడుచున్న వనియు భాస్కరాచార్యులు "సిద్ధాంతశిరోమణి"లో వ్రాసియుండినట్లు శ్రీయుత రామలింగపిళ్లైగారు తమవ్యాసమున వెల్లడించియున్నవారు.

కాలమానవిషయమై కొంతవిచారించి మనయార్యులు దిన, మాస, ఋతు, వత్సరాదుల నెటు లేర్పఱచిరో చూచెదము. ఋగ్వేదకాలముననే శని, గురు, కుజ, సూర్య, శుక్ర, బుధ, చంద్రాదులను గనుఁగొని యుండిరి. మఱియుఁ జంద్రునిగతిచే మాసములఁ గొలుచుచుండిరి. సూర్యచంద్రులయోగము (అమావాస్య) చాంద్రమానరీతిగ మాసాంతము. పున్నమచందురుఁ డేనక్షత్రసమీపమున నుండెనో యానక్షత్రముచే నామాసమును బిలుచుచుండిరి. ('చిత్త' నక్షత్రసమీపమునఁ బున్నమచందురుఁ డుండినమాసము 'చైత్ర' మనియు, 'విశాఖ' నక్షత్రసమీపమునఁ బున్నమచందురుఁ డుండినమాసము 'వైశాఖ' మనియు నీలాగున నూహించునది). వారు షడృతువులకును మధు, మాధవ, శుక్ర, శుచి, నభ, నభస్యము లని పేరులిడిరి. చాంద్రమానముమాత్రము మనయార్యులు స్వయముగ నిర్ధరించిన దనియు, సౌరమానము గ్రీక్కుదేశీయుల సంపర్కముచే వారలకుఁ దెలిసిన దనియు విమర్శకులయాశయము. మేషాది ద్వాదశనామములే దీనికి నిదర్శనము.

భాను, సోమ, మంగళేత్యాదివాసరనామములకుఁ గారణము నార్యభటుఁ డీవిధమునఁ దెలుపుచున్నాఁడు.

సప్తైతే హోరేశాః శనైశ్చరాద్యాః యథాక్రమం శీఘ్రాః।
శీఘ్రక్రమాత్ చతుర్థా భవన్తి సూర్యాదయో దినపాః॥

[శీఘ్రక్రమమున (In the descending order of their times of revolution) శని, గురు, కుజ, సూర్య, శుక్ర, బుధ, చంద్రులొక్కొక్కరును దినమున నొక హోరకు (Hour) ప్రభువులు. శీఘ్రక్రమమున నాల్గవవారు వాసరాధిపతులు.]

ఉదాహరణమునకై శనివాసరమును గైకొందము. శీఘ్రక్రమమున శనైశ్చరాదు లొక్కొక్క హోరకు నధిపతులైనయెడల, 22, 23, 24,వ హోరలకు శని, గురు, కుజులు ప్రభువులైరి. 25 వ హోరకు (అనఁగా మఱునాఁడు ప్రథమహోరకు) సూర్యుఁడు ప్రభువు. ఏదినమున మొదటి హోరకు నేగ్రహము ప్రభువో యాదిన మాగ్రహనామముచేఁ బిలువఁబడును. కావున నిచట శనివాసరమును వెంబడించిన వాసరము సూర్యుని నామంబుచేఁ బిలువఁబడును. ఇటులే యన్నిదినములకుఁ బ్రభువు లేర్పడిరి. (మనయాచార్యులు సూర్యచంద్రులను గ్రహములలోఁ జేర్చిరి.)

ఆర్యభటుఁ డొకచోట "షష్ట్యా సూర్యాబ్దానాం ప్రపూరయన్తి గ్రహాభపరిణాహం" అని వ్రాసియున్నవాఁడు. అనఁగా అఱువదిసంవత్సరములలో గ్రహము లన్నియుఁ బూర్ణభ్రమణములు చేయుచున్నవి (All of them make a certain number of *complete* revolutions in 60 years which is the *least* possible time for such a purpose) ఈవాక్యమే మనప్రభవాది షష్టిసంవత్సరములకారణమును దెలియపఱచుచున్నట్లు తోఁచుచున్నది.

"సూర్యసిద్ధాంత" మున,

సకృదుద్గత మబ్దార్థం పశ్యన్త్యర్కం సురాసురాః।
పితర శ్శశిగాః పక్షం స్వదినంచ నరా భువి॥

[ఒకప్పు డుదయించిన సూర్యుని సురాసురులు ఆఱునెలలవఱకుఁ జూచుచుందురు. చంద్రమండలములోని పితృదేవత లొకపక్షమువఱకుఁ జూచుచుందురు. భూమిలోని మనుజులు మాత్ర మొకదినమే చూతురు]

అనియుండుటచే(North Pole, South Pole) వీనిసమీపమున సూర్యుఁడాఱునెలలు ప్రకాశించుననియు, చంద్రమండలము సుమారు రెండుపక్షములలో స్వాక్షభ్రమణము Rotation round its axis)చేయు ననియుఁ దేలుచున్నది. ఇప్పటిశాస్త్రజ్ఞుల యభిప్రాయములు నివియే.

భూమండలమున స్వదేశపరిధిజ్ఞానము (the knowledge of the longitude of ones own place) నీవిధమున సంపాదింపవచ్చు నని "సూర్యసిద్ధాంత" మునయున్నది.

అతీతోఽస్మిలనా దిందోః దృక్సిద్ధం గణితాగతాత్।
యదా భవే త్తదా ప్రాచ్యాం స్వస్థానం మధ్యతో భవేత్॥
అప్రాప్యచ భవేత్పశ్చా దేవం వాపి నీమిాలనాత్॥
తయోరంతరనాడీభి ర్హన్యాద్భూపరిధిం స్ఫుటం।
షష్ట్యా విభజ్య లబ్ధైస్తు యోజనైః ప్రాగథా పరైః।
స్వదేశపరిధి ర్జ్ఞేయః॥

[ఒకచోట నక్షత్రశాలలో నిర్ధరింపఁబడిన చంద్రగ్రహణస్పర్శకాలమును దాఁటి యాగ్రహణము కనఁబడెనేని (If observed after the calculated time) యా చోటు నక్షత్రశాలకుఁ బూర్వదిశనుండును (the place will be to the east of the Observatory) నిర్ధరింపఁబడినకాలమునకు మునుపే కనఁబడెనేని, యా చోటు నక్షత్రశాలకుఁ బశ్చిమదిశనుండును. గణితాగతకాలమునకును దృక్సిద్ధకాలమునకునుగలయంతరమును (the difference between the calculated time and the time of observation) స్ఫుటమైన భూపరిధిచే గుణించి యఱువదితో భాగించిన నది యాదేశపుపరిధియగును.]

ఈవిషయము నీక్రిందివిధమున నిరూపింపవచ్చును.

Let $x$ Nadikas be the difference of time.
A difference of 60 Nadikas is due to the circumference of the Earth or to 360.

$\therefore$ A dif. of $x$ Nakikas is due to $= \frac{360 \times x^{0}}{60}$

$\therefore$ the longitude of the place Eastro west $= \frac{360 \times x^{0}}{60}$ ans.

ఏచోటునకైన దక్షిణోత్తరరేఖను (the meridian of any place) కనుఁగొనుట కీవిధానముచెప్పఁబడి యున్నది.

శిలాతలేఽంబుసంశుద్ధే వజ్రలేపేఽపి వా సమే।
తత్ర శంక్వంగులై రిష్టైః సమం మండల మాలిఖేత్॥
తన్మధ్యే స్థాపయే చ్ఛంకుం కల్పనా ద్వాదశాంగుళం।
తచ్ఛాయాగ్రం స్పృశే ద్యత్ర వృత్తే పూర్వాపరార్ధయోః॥
తత్ర బిందూవిధాయోభౌ వృత్తే పూర్వాపరాభిధౌ।
తన్మధ్యే తిమినా రేఖా కర్తవ్యా దక్షిణోత్తరా॥

[శుద్ధమైన శిలాతలమున నొకసమమండలమును (a circle) లిఖించి, దానిమధ్యమున నొకశంకును స్థాపింపవలయును. దినము యొక్క పూర్వాపరార్ధములలో నాశంకుచ్ఛాయయెచ్చోట నావృత్తపరిధిని(the circumference) స్పృశించుచున్నదో యారెండుచోటులలో బిందువుల నేర్పఱచవలయును. (mark the Points) ఈబిందువులమధ్య 'తిమి'* విధానముచే దక్షిణోత్తరరేఖను వ్రాయవలయును(Bisect the line joining the two points by describing two circles, and this draw the perpendicular bisector which is the meridian required)

సూర్యచంద్రగ్రహణవిషయమై "ఛాదయతి శశీ సూర్యం శశినం మహతీచ భూఛ్ఛాయా" అని యార్యభటుఁడు చెప్పియున్నాఁడు. రాహుకేతువు లను నామంబులే లేవు. వానికి బదులు "ఆద్యపాతము" (the ascending node) "ద్వితీయపాతము" (the descending node) అనియు మాత్రమే ప్రాచీనసిద్ధాంతులు వ్యవహరించుచుండినట్లు తెలియుచున్నది. రాహుకేతువు లను సర్పములు సూర్యచంద్రులను మ్రింగుటచే వారిగ్రహణములు కలుగుచున్న వనుట పౌరాణికుల యపవాదము. చంద్రగ్రహణము చంద్రుని పూర్వభాగమున నారంభించు ననియు, సూర్యగ్రహణము సూర్యునిపశ్చిమభాగమున నారంభించు ననియు "సూర్యసిద్ధాంత" మునఁ జెప్పఁబడియున్నది.

[ప్రాగ్ఇందోర్గ్రహణం పశ్చాన్నోష్ణో ర్కస్య విపర్యయాత్]

ఆర్యభటుఁడు గ్రహములు స్వయముగఁ బ్రకాశహీనము లనియు, నవి సూర్యునిప్రకాశముచేతనె వెలుఁగుచున్న వనియుఁ జెప్పియున్నాఁడు. అయినను నక్షత్రములఁగూడ నీగోష్ఠిని జేర్చి యుండుటచే నక్షత్రస్వరూపములు మనవారలకుఁ దెలియవనియే విశద మగుచున్నది.

[భూగ్రహభానాం గోళార్ధాని స్వచ్ఛాయయా వివర్ణాని।
అర్ధాని యథాసారం సూర్యాభిముఖాని దీప్యంతే]

ఇది కాక మనయార్యులకు రశ్మివక్రతయు (the atmospheric refraction of the sun's rays) అయనచలనముఁ గూడ (the precession of the

---

* రెండువృత్తములు the two circles పరస్పరము సంధించెడి తిమింగలాకృతిగ నొకభాగ మేర్పడును. ఇటు లేర్పడునటులు చేయుటయే 'తిమి' విధాన మని సైవాక్యములో నన్వయించునది.

equinoses) తెలిసియుండె నని కొందఱు విమర్శకులు చెప్పుచున్నారు. విషువ ద్వృత్తమునకును (the equator) అపక్రమమండలమునకును (the ecliptic–also called అపమండలము) మధ్య చిన్నకోణ మేర్పడుచున్న దనియు, గ్రహములకక్ష్యలు (the orbits) సమవృత్తము (the circle) కాక, ఉచ్చనీచవృత్తాకృతి (elliptical)గనున్న వనియు, గ్రహములకక్ష్యలలో నొకప్రదేశము 'ఉచ్చ' మనునదియు (aphelion) మఱియొకప్రదేశము 'నీచ' మనునదియు (perihelion) మనపూర్వికులకు బాగుగఁ దెలియును.

ఈశాస్త్రము మనదేశమున సుమారు ఋగ్వేదకాలమున జన్మించి క్రమక్రమముగ వృద్ధియగుచుఁ దుదకు, ఆర్యభట, వరాహమిహిర, బ్రహ్మగుప్త, భాస్కరాదిగణితశాస్త్రధౌరేయుల హస్తములఁ బ్రసిద్ధిఁ గాంచెను. ప్రకృతమీసిద్ధాంతుల గ్రంథముల నైనఁ బరిశీలించునంత జ్ఞానసంపన్ను లరుదని చెప్పుటకుఁ జింతిలుచున్నారము.

తిరుపతి. కపిస్థళం- కృష్ణమాచార్యులు.

యథాశిఖామయూరాణాం నాగానాంమణయోయథా ।
తద్వద్వేదాంగశాస్త్రాణాం గణితం మూర్ధనిస్థితమ్ ॥

---

# గ్రామ్యమా - గ్రాంథికమా?



"పదుగు రాడుమాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁ డాడుమాట యెక్క దెందు" (వేమన)

ఇప్పటికి మూఁడుసంవత్సరములనుండి యెడ తెగకుండ గ్రామ్యగ్రాంథిక వాదము బహువిధముల జరుగుచుండుట లోక మంతయు నెఱింగినదే. మేము భాషాసర్వజ్ఞుల మని చెప్పికొను మనవారిని బోలువా రితరభాషల నెఱింగిన వారిలో లేకపోలేదు. కాని యీప్రచండవాద మొక్క మనభాషకే యేల రావలయునో తెలియకున్నది. కానిందు పైని జెప్పిన రెంటిలో దేనియం దెంత వఱకు జనసామాన్యమున కనురాగము గలుగుచున్నదో భాషాభిమాను లెఱుంగకపోలేదు. అయినను, ఆడినమాట తప్పరా దనునియమముచేతనో తాము చెప్పినదే మంచి దనునభిమానముచేతనో తమకంటెఁ దెలిసినవారెవ రనునహంకారముచేతనో యేదో యొకవిధముగాఁ బ్రతిష్ఠ సంపాదింపవలయు ననుతలంపుచేతనో లేక నిజముగా భాషనుద్ధరించు నుద్దేశముచేతనో కాని యీవివాదము మాత్రము దినదినాభివృద్ధిని జెందుచునేయున్నది. కావున గ్రామ్య మన నేమి? గ్రాంథిక మన నేమి? ఇం దేది గ్రహింపఁదగినది? అనువిషయములం గూర్చి యెందఱెన్ని విధముల వ్రాసినను జర్వితచర్వణము గాదు కావునఁ గొంచెము ప్రసంగింతము. ఈసందర్భమున గ్రామ్యవాదులు తా మనునది వ్యావహారిక భాష గాని గ్రామ్యభాష గా దని మాటలచేతను వ్రాఁతలచేతను దెలియఁ జేయుటనుగూర్చి ముందుగాఁ గొంత విమర్శింతము.

వివాదమూల మైనప్రతివాగులభాషకు మొదట గ్రామ్య మని తరువాత నుత్తమజనవ్యావహారిక మని పిదప వ్యావహారిక మని యిపుడే మూఁడుపేర్లు వచ్చినవి. తుద కేదో యొకనామము పెట్టువఱకును మనము గ్రామ్యమనియే పిలిచెదము.

గ్రామ్యమే వ్యావహారికము. వ్యావహారికమే గ్రామ్యము. ఈరెంటికిని భేద మేమియు లేదు. ఎట్లనఁగా? శబ్దసంస్కారముకొఱకు నియమ మేర్పడినది అది లేనిది గ్రామ్యము. అట్టిభాష గ్రామ్యభాష. అంతియకాక మాలవాండ్రు

మొదలుగాఁగల గ్రామ్యులభాష యగుటచే దీని కీపేరు వచ్చిన దని చెప్పఁ దగదు. నియమరహితంబు లగుమాటలను మాలలే కాదు పండితులు, పాము రులు, పంతులు, రావులు, సాహేబులు, బహదరులు మఱియెవ్వ రుచ్చరించినను నవి గ్రామ్యములే. గ్రామ్యభాష యనుపేరు వ్యాకరణవిరుద్ధ మయినదానికే కాని మఱి యొకదానికిఁ గాదు. రోఁతపుట్టించునది యగుటచే గ్రామ్యులభాష గ్రామ్యభాష యగుచున్న దనెడినిర్వచనము ప్రకృతోపయోగి కాదు. అట్టి భాష మాలలేకాదు బ్రాహ్మణు లుచ్చరించినను గ్రామ్యమే. అది వ్యాకరణ సిద్ధ మయినను గ్రామ్యమే. దానికి విరుద్ధ మైనను గ్రామ్యమే. గ్రంథములలో నున్నను గ్రామ్యమే. ఆగ్రామ్య మాలంకారికులు నిర్ణయించినది. అది శబ్దా ర్థములు రెంటికిని సంబంధించినది. మనప్రకృతగ్రామ్యమో వ్యాకరణకర్తలు నిర్ణయించినది. ఇది శబ్దములకు మాత్రమే సంబంధించినది. ఈరెండువిధము లైనగ్రామ్యమును జక్కఁగా నెఱింగి దానిని గావ్యంబులఁ జొరనీక రచింపవ లయు నని కావ్యలక్షణకర్తలయభిప్రాయము. ఈసందర్భమున, "నట్లయిన వ్యాక రణము నుల్లంఘించి ప్రాచీనకావ్యములలో గ్రామ్యములు ప్రవేశించినవి కావా! అట్లే మఱికొన్ని యేలకలియరా" దని యందు రేమో? సత్యమే. ఏవో లెక్క కుఁగొన్ని గ్రామ్యములు పూర్వగ్రంథములలో లేక పోలేదు. కాని, "నంబిశబ్దో నముంచతి" యనునట్లు వానిముఖమున నింద్యగ్రామ్యమనియో, అనింద్యగ్రామ మనియో యేదోయొకవిధముగా గ్రామ్యపదము కనుపడుచు నేయున్నదిగానివిడిచి యుండలేదు. ఇదియే యెన్నిపేలసంవత్సరము లైనను గ్రామ్యము గ్రాంథికనామ మునువహింపఁజాల దనుటకుఁ బ్రబలనిదర్శనము. ఇఁక మనమేల కలుపరా దనెడి మాట యవ్యవస్థావిషయకము. అసంగతము, అప్రకృతము. ఇది యటుండ నింపు. మఱియు, "చులుకఁగాగ్రామ్యజనములు వలుకునట్టి తెనుఁగుమాటలు గ్రామ్యంబు లనఁగఁబడియె," అనుదానింబట్టి గ్రామ్యులగ్రామ్యభాషయగుచున్న దందురేమో యని యూహింతము. సరియే కాని యట్లు కాదు. ఆవచనమున లై ననునియమరహితంబు లగుమాటలు గ్రామ్యము లనఁబడుచున్న వని తెలుపుట యందే యభిప్రాయము గాని వాని నుచ్చరించువారియందుఁ గాదు. ఈయభి ప్రాయమును దానివెంటనే యున్న "వర్ణలోపంబు నొంది కావ్యములఁజొరవు" "అక్షరవిలోపమై యుండునట్టి పలుకు, గ్రామ్యమననొప్పునిది యపభ్రంశకంబు" అనువాక్యములే తెలుపుచున్నవి. దానిసే దానికి మూలమైన "అనియమా

గ్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః" అనునార్యోక్తియే స్థిరపఱుచుచున్నది. కావునఁ గర్మధారయసమాససిద్ధం బైనయీగ్రామ్యభాషాపదమునకు షష్ఠీత త్పురుషసమాసము కల్పించుట మందహాసపదంబునకుఁ గల్పించుట వంటిదే యగును.

తొలుతఁ బలువురు పలుతెఱంగుల వ్యవహరించుచుండుటచేనిజరూపము సెడి యపభ్రంశమై కర్ణకఠోరమై తుద కర్థము గాని స్థితికి వచ్చుచున్న పదజాలమును బూర్వలాక్షణికులు సంస్కరించి వ్రాయుటకు నుచ్చరించుటకుఁ గూడ ననుకూలంబుగ నొక్కస్వరూపముతో నుండునట్లు నియమము లేర్పఱచి యిది గ్రాంథికభాష యని నిర్ణయించి దానికంటె మిగిలినది గ్రామ్యము, అపభ్రంశము నని నిరూపించిరి. ఈవిభజనము భాషామాత్ర సామాన్యముగా నున్నదే. అట్లు గ్రామ్యమని నిరూపింపఁబడిన శబ్దజాలమునే బ్రాహ్మణులాదిగా మాలల వఱకును గల నాగరకులు గ్రామ్యులుగూడ భిన్నభిన్నరూపములతో వ్యవహరించుకొనుచుండుటచే నదియే వ్యావహారిక మగుచున్నది. కావున గ్రామ్యవ్యావహారికముల కిసుమంతయు భేదము లేదు.

ఇఁక, "నెప్పుడో పుట్టిన వ్యాకరణ మిప్పటిభాషకుఁ జెంద"దని చెప్పుటను గూర్చి విమర్శింపవలసియున్నది. ఇప్పటిభాష యనఁగా గ్రామ్యమా? లేక గ్రాంథికమా? గ్రాంథిక మైనచోఁ జెందుచునే యున్నది. గ్రామ్యమే యైనచో మున్నట్లు చెందలేదో యిప్పుడు నట్లే చెందదు. దీనికీసిద్ధాంతమేల? పవిత్రమైన భాషయొక్క స్వరూప మిదియని తెలిపి యది యెప్పుడును మాఱిపోకుండఁగ శాసించునట్టి వ్యాకరణమెప్పుడు పుట్టిన నేమి? అది ప్రతిగ్రామము, ప్రతిపురము, ప్రతిమండలము, ప్రతిజాతి, ప్రతికాలమును వ్యవస్థ లేకుండఁగ ననేకవిధముల వ్యవహారమున మార్పునెందెడి యొకభాషాభాగ మైనగ్రామ్యమునకుఁ జెల్ల దనుట యాశ్చర్యకరముగాదు. దీనికిఁ గూడ నావ్యాకరణమే చెల్లె నేని యిది గ్రామ్యము గానేల? గ్రాంథికమే యగును. ఇఁకనొ ప్రతిక్షణమును మాఱుచుండెడి యీగ్రామ్యము స్థిరపడియున్న గ్రాంథికములోఁ జేరకుండఁగఁ జేయుట యావ్యాకరణము యొక్క పని. సరియే పోనిండు. వ్యాకరణము పూర్వముపుట్టియుండ లే దనియే భావించి కొంచెము ముచ్చటింతము. వ్యావహారికమెప్పుడును మాఱుచుండుననియే కదా ప్రతివాదులయభిప్రాయము అట్లయినచో నన్నయభట్టు మొదలుగా నిప్పటి వఱకును భాష యెన్నియోమార్పులు చెందియే యుండునుగదా? సరియే. తొల్లి

యిప్పటి వ్యావహారికభాషలోనే గ్రంథములుపుట్టినచో నప్పటినుండి యిప్పటివఱకును బలుమాఱు పల్లటులు గొట్టుచు వచ్చియున్న యిప్పటివ్యావహారిక భాషలో నున్న మన కావ్యగ్రంథములయర్థము తెలియునా? మన మాకవులహృదయములను గాంచఁగలమా ? అప్పటి దేశనాగరకత గ్రహింపఁగలమా ? చూచితిరా ? గ్రామ్యమే వ్రాయుట కుపకరించినచో వచ్చుదురవస్థ యిది యే. ఒకవేళ యప్పటి కావ్యములతోఁ గూడ నిఘంటువులు మాత్రము వెడలకుండునా? వానిని బట్టి తెలియకపోవునా యందురేమో. సరియే యెట్లయిన నేమి? ఇప్పటివ్యావహారికమునుండి యప్పటి వ్యావహారికము వేఱు కావలసినదియే కదా ? అది యిపుడు గ్రాంథిక మనఁ దగియుండును గదా ! అట్లే యిపుడు గ్రామ్యభాషలో గ్రంథములు వ్రాసినను ముందైన నీబాధ గలుగునదే కదా ? ఇట్లనినచో నొకవేళ ' పూర్వగ్రంథముల నిప్పటిపండితులు కష్టపడి చదివి బోధించుచున్నట్లే యిపుడు వ్యవహారభాషలో వ్రాయు గ్రంథములను ముందు బయలుదేఱు పండితులు బోధింపఁగల ” రని పండితనిందాగర్భముగాఁ బలుకుదురు కాఁబోలు ? కానిండు. అపుడు గూడఁ బండితులే మరల బోధించు దురవస్థ తమ భాషకు సంభవించుట సిద్ధము గాఁదగనేని యీమూఁడునాళ్ల ముచ్చటకీవృథా గ్రామ్యవాద మేల ? పండితులు నేర్పినఁగాని భాష తెలియకపోవుచున్న దను దోషము భాషదా ? పండితులదా? లేక చదువుకొనువారిదా ? భాషదేయయ్యెనేని పండితుల కెట్లు తెలియుచున్నది. పండితులదే యయ్యెనేని వారు చదువరుల కెట్లు తెలుపఁ గలరు ? కావున నెందైన నెప్పుడైన భాష రాని దోషము చదువువారి ప్రయత్నమును బట్టి యున్నది గాని వేఱు గాదు. ఎంత తెలియరాకున్న దని మనము తలంచినను మాతృభాష ఖండాంతరములనుండి వచ్చినభాషలకంటె జదువుట కెక్కువకష్టము గలిగించునా ? కావున దీనిం బట్టి కూడ గ్రంథములలో నున్నదానికిని లోకములో వ్యవహరింపఁబడుదానికిని భేద మెప్పుడును విధిగానుండు నని వారివాదంబుననే తెలియుచుండఁగా నిఁక గ్రామ్యవాదులకు వ్యాకరణము చేసినహాని యేమో తెలియకున్నది. లోకహితమును గోరు నుభయభాషాధురంధరు లగుపూర్వపండితులు లోకమును భాషను జక్కగా నెఱింగి భాషాభివృద్ధి కనుకూలంబుగ శబ్దములను శాసించి వ్యాకరణ మను పేర నుత్తమప్రమాణగ్రంథములను నిర్మించిరి. కావుననే భాష యన నేమో దాని నిజమైనసాంప్రదాయ మేమో మనకుఁ దెలియుచున్నది గాని లేకున్నమన భాషయు మనవాదములు నేమైయుండునో యూహింపరాదు.

పైచర్చనుబట్టి గ్రామ్యమే వ్యావహారిక మనియు గ్రామ్య గ్రాంథికముల నిజస్థితియు గొంతవఱకుఁ దెలిసియున్నది గావున నిఁక గ్రంథవిస్తరము గాకుండఁగఁ బ్రతివాదులు సెప్పువ్యావహారికము గ్రాంథికముగాఁ దగ దనుటను గూర్చి కొంచెము ముచ్చటించి యీవ్యాసము ముగింతము.

వ్యావహారిక మనఁగా లోకులవ్యవహారమున నున్నది యని యర్థము. వ్యవహార మనఁగా మాటలాడుకొనుట; జాబులు, కవులుకదపాలు, క్రయదాన ప్రతిభూపత్రములు అభియోగపత్రములు మొదలగునవి వ్రాసికొనుట. వీనియందు నిరంకుశముగా గ్రామ్యమునకు వినియోగము కలుగుచునేయున్నది. కావుననే యిది వ్యావహారిక మగుచున్నది. మంచిదే. కాని, పురాతనమహాత్ముల చరిత్రలను దేశచరిత్రలను దెల్పునవియు, సరసములై హృద్యములై చక్కని కల్పనవర్ణనలతో నిండునవియు భక్తి నీతి వైరాగ్యములను బోధించు నవియుఁ బ్రకృతిజ్ఞానంబున కాకరములు భాషాభివృద్ధికి నిదానంబులునై శాశ్వతంబుగ లోకంబున జీవింపఁదగినవియు నగు నుత్తమ కావ్యములను, అవ్యవస్థము, అపభ్రంశము, అనభిమతము, అనేకవిధము, అస్థిరము నగు నీవ్యావహారికములో వ్రాయుట యెట్లుసమంజస మగును? ఎట్లు భాషాభిజ్ఞులచే నాదరింపఁ బడును? గ్రామ్య మనఁబడెడి యీవ్యావహారికము జనసామాన్యముయొక్క నిత్య వ్యవహారమునకే యుపయోగింపఁదగిన దనియుఁ బవిత్రమై హృద్యమై శాశ్వత మైన యాగ్రాంథికము గ్రంథనిర్మాణమునకే యుపయోగింపఁ దగిన దనియు వాని నామములే చాటుచున్నవి. కావున నాంధ్రలోక మంతయు నాబాలగోపాల మేకగ్రీవముగా దేనిని గోరుచుండెనో పూర్వ మహాకవులు దేనిని మహాదరములోఁ బెంచుచువచ్చిరో, మనపూర్వు లతిశ్రమ కోర్చి యు వ్రాసికొనుచు మొన్నటివఱకును దేనిని సంరక్షించుకొనుచు వచ్చిరో యేది లోకంబునందు స్థిరవసతి నేర్పఱుచుకొనెనో యేది సర్వజనహృదయము రంజింపఁ జేయఁజాలునో యట్టిగ్రాంథిక భాషయే సర్వథా ప్రశంసనీయము. అదియే గ్రాహ్యము. అదియే గ్రంథరచన యోగ్యము. అదియే పఠనీయము. అదియే వందనీయము. భగవంతుఁడును దొరతనమువారును సత్సాంప్రదాయసిద్ధమైన మనగ్రాంథికభాషను సంరక్షించుదురుగాక!

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# కృతివిమర్శనము.



ఇందుమతీపరిణయము— ఇది యాఱాశ్వాసముల యాంధ్రప్రబంధము. దీని రచించినకవి కుమారధూర్జటి ఇతఁడు కృష్ణరాయవిజయం బనునిం కొక కావ్యముఁ గూడ రచించినవాఁడు. కాళహస్తిమాహాత్మ్యమును రచించిన ధూర్జటి కవికిఁ దమ్ముఁడని మనుమఁడు. ఈకావ్యము నూజవీడు పురాధీశ్వరుండగు నరసింహా ప్పరాయభూపాలున కంకిత మొనర్పఁబడినది. ఈకృతిపతివంశస్థులును శ్రీరామ చంద్రాప్పరాయవిభునకుఁ బుత్రులు నగు శ్రీరాజా నారయప్పారాయసింహా ద్ర్యప్పారాయవిభు లీగ్రంథమును బ్రకటించి భాషాభివృద్ధికి సాహాయ్యమును లోకంబున కానందమును గలిగించిరనుట సిక్కము.

రచన:— ఈకవి కాళిదాసురఘువంశకావ్యము నుండి యజమహా రాజు జన్మించుట యాదిగా నిందుమతీస్వయంవరము తుదివఱకును గలకథా భాగ మంతయుఁ దీసికొని కొన్నిచోట్ల సంగ్రహించి మఱికొన్నిచోట్లఁ బెంచి యీ ప్రబంధమును నిర్మించినట్లు కనుపడుచున్నది.

అజునిబాల్యయౌవనాదులు రఘువంశమున నొకటి రెండు శ్లోకముల లోఁ జెప్పఁబడినవి. ఇందు విశేషంబుగ విస్తరింపఁబడినవి. రఘువంశంబున నిం దుమతీ జననబాల్య యౌవనాది వర్ణనమును, ఇందుమతి ముందుగా నజమహా రాజుసౌందర్యాది గుణంబుల విని యాతని యెడ ననురాగము గలిగియుండుట యు నను కథాభాగములు లేవు. ఇందవి ప్రబంధానుకూలంబుగఁ జక్కని కల్పనలతో వివరింపఁబడినవి. రఘువంశంబున విస్తరింపఁబడిన స్వయంవరవర్ణ న మిందు సంగ్రహింపఁబడినది. ఇట్లే కొన్ని మార్పులు గలవు.

ఇది సంస్కృతాంధ్రములయందుఁ గవికిఁగల యసమానపాండిత్య మును వెల్లడించుచు మృదుశైలిచే మనోహరముగా నున్నది. అక్కడక్కడ నతిదీర్ఘసమాసము లుపయోగింపఁబడినవికాని యవియైనను మృదుపదలలితంబు లగుటచే విశేషించి యర్థకఠినములు గావని చదువరులు తెలిసికొనఁగలరు. మఱియుఁ గొంచెమో గొప్పో ప్రాచీనకవిపరంపరలో నొకని జూచి యొకఁడు తనకావ్యంబునఁ గల్పనావర్ణనాదికంబు నొనర్చుట యాచారముగా నితఁడు

గూడఁ బుర స్త్రీ విప్రలంభ శృంగారాది వర్ణనంబుల విశేషముగా వసుచరిత్ర కారు ననుకరించినట్లు కనుపడుచున్నది. ఇంకను, చెంచువాండ్ర సంభాషణంబును సాహిణి గుఱ్ఱమును దెచ్చుటయు వేఁటయు సరిగా మనుచరిత్రమును స్మరింపఁ జేయుచున్నవి. మను వసుచరిత్రలతోఁ బాటు దీనిం గూడఁ జదువువారికిఁ బై యంశము లెల్లఁ దేటపడఁగలవు గావున గ్రంథవిస్తరభీతిచేఁ బోలికపద్యముల నిం దుదాహరింపలేదు. అయినను గవిజాతిసామాన్యమైన యీ యనుకరణ మొక దోషముగా నిం దెన్నఁదగినది గాదు.

కవిత్వము:— ఈతని కవిత్వము సంస్కృతాంధ్రపదగుంఫనంబున సమాన ముగా ధారాళమై తఱచుగా యమకానుప్రాసాలంకారప్రియంబై యొప్పును. ఇందులకు—

శా. అంతం గాంతపకుంతసంతతినితాంతాక్రాంతభూమీజశా
ఖాంతభ్రాంతశకుంతసంతతవిరావాత్యంతసంతాపభృ
త్కాంత స్త్రైణదురంత మంతకదిశాతంతన్యమానానిలా
త్యంతంబై తనరెన్ దనంతన వసంతంబెంతయున్ వింతగన్. ఆ. 2. 33

మ. తళుకుందంతపుమెట్లసంతనల వింతల్ గుల్కు చెంగల్వరా
యలరాచల్వలు చల్లుతిన్నియల యొయ్యారంపుఁ దోరంపుఁ బ
చ్చలకంబంపుఁ గడానిదూలముల మెచ్చన్వచ్చు కోమ్మ్యాలరా
బెళుకుంగోడల నిండుచిత్తరువగల్ పెంపొందు పెన్మేడలన్. ఆ. 5-3

మఱియు సత్కావ్యలక్షణంబు లగుసరసశబ్దార్థసంఘటనము, మాధుర్యము, ధ్వని, యలంకారములు మొదలగు వాని కీకవిత్వమాకరముగానున్న దనుట కిందుమతీగుణవర్ణనసందర్భంబుననున్న యీక్రిందిపద్యమే సూచకమగుచున్నది.

చ. రుచిరతరార్థగుంఫనము రూఢిఁదగన్ మకరందమాధురీ
విచికలసౌరభప్రతిభవిస్తరిలన్ ధ్వనియానలంక్రియా
ప్రచయమెలర్ప నింపుమతి బంధురధార చెలంగ సాహితీ
రచనయొనర్చు నాశుకవిరాజమణుల్ తనవాక్కు లెన్నఁగన్.

కల్పనలు, వర్ణనలు:— ఈయంశంబులం దీకావ్యము ప్రాచీనప్రబంధ ములందు సాంప్రదాయసిద్ధముగాఁ గనుపడుచున్నమార్గమునే యనుసరించినను గొన్ని మెఱుఁగులు చూపకపోలేదు—ఒకటిరెండు—

గీ. ఓర! వృశ్చికరాశియం దతుగుఁ బెట్టి
యులరుదీవును విషమూర్తి వగుదువేమొ?
కాకయుండిన శివుఁ డటకాలఁ దన్నఁ
జెలఁగి వేవేగఁ దలకెక్కి నిలువఁ గలవె?

క. సమదేంద్రజాలికుఁడు పూ
ర్వమహీభృన్నికటమున నవంబుగ నగురం
గమురుద్వీథిఁ గ్రైచిన
సుమనఃకందుకమనంగ సోముఁడుదనరెన్.

వ్యాకరణాదులు:—లోఁతుకు, నెమలీఁకలు మొదలగు కొన్ని వ్యాకరణవిరుద్ధప్రయోగంబులును, బంట్రోతుతనము మొదలగు నొకటి రెండనర్థప్రయోగంబులును, అందందు శేషళకటరేఫయతిప్రాసంబులును, జంబుఖానా మొదలగు పన్యదేశ్యంబులును గనుపడుచున్నవి. కాని యింతటిపెద్దగ్రంథంబునం దిట్టియత్యల్పదోషంబులు గణనీయంబులు గావు.

ప్రశస్తి:—పవిత్రమైన కథయు, సరసమై మనోహరమైన శైలియు, నిర్దుష్టమైన రచనయుఁ గలిగి యుత్తమకావ్యంబునాఁ బరఁగు నీయిందుమతీపరిణయమ్మెల్లవిధంబులఁ జదువరుల కానందదాయకమగు నని మాయభిప్రాయము.—

మ. సూ.



చిన్నాదేవి.      శ్రీకృష్ణదేవరాయలు.      తిరుమలదేవి.

# శ్రీకృష్ణదేవరాయల ప్రతిమ.



ఆంధ్రభాషాపోషకుండును, గవిరాజకంఠీరవుండును గర్ణాటరాజ్యధురంధరుండునగు కృష్ణరాయనియొక్కయు నాతని ధర్మపత్నులయొక్కయుఁ బ్రతిమాప్రతిబింబముల నీసంచికలోఁ బ్రకటించుచున్నారము. ఈప్రతిబింబములకు మాతృకలగు లోహమయప్రతిమలు తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామియాలయములో బహిర్ద్వారము దాటఁగానే కుడిప్రక్కనుండు మండపమునందు స్వామి కభిముఖముగా స్థాపింపఁబడియున్నవి. కృష్ణరాయని విగ్రహమునకుఁ గుడివైపునఁ జిన్నాదేవిప్రతిమయు నెడమప్రక్కఁ దిరుమలదేవిప్రతిబింబము నున్నవి. ఈవిగ్రహములకుఁ గుడిబుజములమీఁద "చిన్నాదేవియరు, కృష్ణరాయమహారాయరు, తిరుమలదేవియరు" అనునామములు కన్నడమునఁ జెక్కఁబడియున్నవి. ఈప్రతిమలు శిల్పసమయానురూపములుగాని యథారూపములు గావని కొందఱియాశయము. ఇవి యథారూపములని నొక్కి వక్కాణించుట కాధారములు లేవుగాని కృష్ణరాయఁడు జీవించియుండఁగనే నిర్మింపఁబడియుండునని యూహించుట కభ్యంతరమేమియు నుండదు. కృష్ణదేవరాయఁడు శ్రీవేంకటేశ్వరస్వామికిఁ బరమభక్తుఁడని యాముక్తమాల్యద చదివినవారలకు సువ్యక్తము. రాయలయొక్కయుఁ దద్దేవులయొక్కయుఁ బ్రతిమలని పేరుపడినవి యివి తక్క మఱియేవియుఁ గనుపడవు. కృష్ణరాయని బ్రతిబింబమని యిటీవలఁ గొన్నిచరిత్రపుస్తకములలోఁ బ్రకటింపఁబడిన రూపము కల్పితమని యూహింపఁదగియున్నది. తిరుమలలోని ప్రతిమలు సర్వవిధముల యథారూపములు గాకున్నను మూలవ్యక్తుల జీవితకాలమునందే పుట్టియుండుటను వారిపేళ్లు ధరించియుండుటను మనకెంతయు విశ్వసనీయములే. మఱియు నీప్రతిమలవలన నాకాలమందలి విగ్రహనిర్మాణకౌశలమును రాజవేషవైఖరియును దెలిసికొనవచ్చును.

ప్రతిమాస్థానములంబట్టి చిన్నాదేవి శ్రీకృష్ణరాయని యగ్రమహిషియనియుఁ దిరుమలదేవి రెండవభార్యయనియు నూహింపఁదగియున్నది. ఈయూహకు సాధనాంతరముగూడఁ గలదు. శ్రీవేంకటేశ్వరస్వామి యాలయములోపలి ప్రాకారముపై 1484 వ శకాబ్దమునకు సరియయిన యాంగిరసనంవత్సరఫాల్గుణ

శుద్ధపంచమినాఁడు కృష్ణరాయలదేవి "చిన్నాజియమ్మవారు తిరువేంగళనాథుని అనవాలనైవేద్యమునకు 328 తూకాలపైడిగిన్నె సమర్పించె" ననియు, ఆదిన మననే తిరుమలదేవమ్మవారుకూడ నంతియే తూనికగల వేఱొకగిన్నియ సమర్పించెననియు నిట్లు రెండుశాసనములున్నవి. వీనిలోఁ జిన్నాదేవి శాసనము మీఁదుగాను, తిరుమలదేవి శాసనము క్రిందుగాను నున్నవి. దీనిచేఁగూడఁ జిన్నాదేవియే యగ్రమహిషియని యూహింపవలసియున్నది.

ఈ యిద్దఱుభార్యలను మాత్రమేకాక గజపతికూఁతు నొక్కతెనుగూడఁ గృష్ణరాయఁడు వరించినట్లు *రాయవాచకమునందును, కృష్ణరాయవిజయము నందును జెప్పఁబడియున్నది. ఈరెండుగ్రంథములును గృష్ణరాయని యనంతరము పుట్టినవగుటచే బలవత్ప్రమాణములుగా గ్రహింపఁదగినవి గాకపోయినను, ఆతని ప్రధానమంత్రియగు సాళువతిమ్మరసు మేనల్లుఁడు నాదెళ్ల గోపమంత్రిచే రచింపఁబడిన ప్రబోధచంద్రోదయవ్యాఖ్య పీఠికలోని—

శ్లో. ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య పుత్రీం పవిత్రీకృతభూతధాత్రీం
ప్రత్యగ్రహీద్యః ప్రకటప్రతాపో భద్రాం సుభద్రామివ పాండవేయః

అనుశ్లోక మీపైయంశమును దృఢపఱచుచుఁ గృష్ణరాయని తృతీయపత్ని పేరు భద్రయనికూడఁ దెలుపుచుండుటచే రాయలకు మూఁడవభార్యకూడఁ గలదని విశ్వసింపవచ్చును.

భద్రాదేవి ప్రతిమ లేకుండుటకుఁ గారణము ధర్మపత్నులలో నామె పరిగణింపఁబడకుండుటయో యామెను వరించుటకుఁ బూర్వమే యీప్రతిమలు నిర్మింపఁబడియుండుటయో కాక యన్యమో విచారణీయము.

జ. రామయ్య.

---

* ఇందు గజపతి యిచ్చినకన్యపేరు జగన్మోహినియని కన్పట్టుచున్నది. భద్రకే యిది నామాంతరమని తోఁచుచున్నది.

కుంభకోణం మార్గముగా శేతువుకు పొయ్యేటప్పుడు వెంట్టవచ్చిన రాతులు రాణువవారు రాయలవారి శీమలోగల శివస్థలాదులున్ను విష్ణుస్థలాదులున్ను తటాకాలున్ను అగ్రహారాలున్ను పల్లెలున్ను వనములున్ను హానిశేశివచ్చివుం దురు అదిగాక వారిశీమలోకొన్ని స్థలాదులున్ను ఆక్రమించి మన్ననమర్యాదలు తప్పించ్చి వుండ్డురుగనక అవి మనస్సునన్నుంచ్చి కృష్ణరాయలవారు కారణీకజన్ము లైనవారుకాబట్టి సూడువిప్పేకొగకు మ్లేఛ్ఛులైనతురకలను వీగతోలి మనశీమ లోనికి వచ్చి గిరిదుర్గ్గ స్థలదుర్గ్గ జలదుర్గ్గ వనదుర్గ్గములను యెండ్లపరువల్లు పోరాడినసాధ్యంకాదు అట్టిమార్గ్గాలను కోటకొత్తళాలు దినమొక్కటిగాసారి మార్గముచేత ఆక్రమించ్చి తక్కనకోటలు ధూళికోటలుగా సాధించ్చినవారైరి గనక మనిషిమాత్రంవారుగారు విష్ణు అంశ అన్నందులకు గజపతివారు ఆరీతి అవును తమపెద్దలు కన్నాటకానకు అపరాధం తలంచ్చి నంద్దువల్ల వారుబల వంత్తులై మనరాజ్యంమీద దండెత్తివచ్చినారు వారినిజయించేటందులకు జయా పజయంకనవలెనని షోడశపాత్రులను పిలువనంప్పగా బలభద్రపాత్రుడు, దుర్గ్గా పాత్రుడు, భీమాపాత్రుడు, ముకుందపాత్రుడు, భీకరపాత్రుడు, భైరవపాత్రుడు, రణరంగ్గపాత్రుడు, అఖండపాత్రుడు, మురారిపాత్రుడు, వజ్రముష్టిపాత్రుడు, తురగరేళంపాత్రుడు, అశనీపాత్రుడు, అసహాయపాత్రుడు, గజాంకుశపాత్రుడు, మృగేంద్రపాత్రుడు మొదలైనవారు పదారుపాత్రులువచ్చి గజపతివారిని పొడ గనగా వారలను కూచ్చుండనియమించ్చి వారలతో ఇదివరకున్ను నడచిన కార్యాలన్నింన్ని విన్నారేకా కన్నాటకంవారు కనములదాంటి అహముదా నగరానకువచ్చి నిపాతంశేశి పోట్నూరి సింహ్యాద్రివద్ద శిబిరందిగినారు యిక్కడికి నాలుగుక్రోశములమేరవచ్చివున్నారు రేవుమర్నాట దాటిమార్గ్గంగా గుర్రం రాణువవచ్చును అప్పుడైనా కనుపించుకోవలెగాని మొదటిస్థళంవిడువరాదు ఆలోచనగా అడిగినంద్దులకు షోడశపాత్రులు యీ ఆలోచన మునుపు మ్హాదు తెగ లదునేదాన్లున్ను కర్నాటకంవారికి వెముఖాసరించ్చి నిలువలేక తమతమ స్థలాదు లకు పోయినంద్దువల్ల యెవ్వరినిన్ని యొచ్చక తురకాణ్యం శీమలుదాంటి మన గడికనమలుంన్ను జొచ్చి పట్ణంసమీపానకు వచ్చినారు యీసమయాన వహం ఆమాదు తెగలవారికిన్ని చెప్పి అంప్పించ్చి వారు సరుదులుంన్ను బలవంతముగా వుండ్డమని మనమున్ను యిక్కడను కనుపించ్చుకొంటేను యెంద్దుబోనున్నారు కాళహస్తి ఆరభ్యాం జగంన్నాధంపర్యంత్తం మనశీమ అట్టిపట్ల యెదురు వెం

చ్చుక లోతుమెరుగరుగనక లోజొచ్చి వచ్చినారు మంత్రాలోచనమీద వచ్చినకార్యంకాదు హామికమీదికార్యం గనక వారికేముప్పు మనకార్యం జఃజమానూ వారు యాయులు మనం స్థాయులు. మనశీమప్రజలకు వారలవీరగతోలి స్థలాలున్ను నిలుపవలెనని ఉత్సాహవృష్టి గనక ఇట్టిపట్ల మనం కనుపించుకొంట్టేను కన్నాఽటకంవారు నిలువలేక తమశీమకుపొయ్యేమనిబోదురు రేవుఉదయాంన్నె స్వామివారు రాతురాణువకు పక్కలాకులిప్పించ్చి అంద్దరినిన్ని ఆయత్తపడి రమ్మనడా మీరువక్షప్రదేశాన రాజచిహ్నాలు పట్టించ్చుక ఉన్నతస్థలానవుండ్డి వేడుకచూస్తేచాలును. తాముపదాగురముంన్ను జగడమిచ్చిన కర్నాటకంవారిని పారదోలి వారిబొక్కసభండారములున్ను యేనుగుగుర్రాలున్ను మొదటిదోరలనున్ను హస్తగతం చేసుకవచ్చి సముఖానవుంచ్చేమని వారువారులు తమతమకు తోచినట్లుసాహసపరాక్రమములున్ను యుద్ధరంగ్గమంద్దు వేఃగారుతునకలుగా నరికేమనింన్ని మదహత్తుల తోండ్డములఃతోకూడా కొంమ్ములుఖండ్డించ్చేమనింన్ని చెరుకుల నరికినట్లు కాల్బలములనున్ను వాల్లఽచేఖండ్డములనుంన్ను ఖండ్డించేమనింన్ని వింగ్గి శీమపట్టితే అంద్దరినింన్ని చెరలుతోలుకవచ్చేమనింన్ని శపథపూర్వకముగా చెప్పినారు గనక గజపతివారు చాలాసంతోషబడి మీరువొక్కక్కరేవొక్కక్కశానను భీభత్సు శాయగలరు మీరుపదార్గురున్ను పదిదిక్కులు కనిపించ్చుక కార్యంశేస్తే ఘాలివానాను వురుములున్ను పిడుగులున్ను బడినట్లు భీభత్సుగా పోరుదుసు. యిదిగాక పూర్వమంద్దు అర్జనుండ్డు ఉత్తరగోగ్రహణమందు దుర్యోధనాదులమీదనడచి యుద్ధం శేశి ఆవుల త్రిప్పుకవచ్చేటప్పుడు అంద్దరిపోగులున్ను శిరోవేష్టనలున్ను వొడశివచ్చినట్టుగా గలరు మీరు రణభీకరానకు కర్నాటకంవారు రణభీతిసి వణకెత్తి యెవ్వరికింస్ని శరీరాలుతెలియక విస్మృతిబొంద్ది కాళ్లుచేతులాడక యెక్కడివారక్కడనె నిలిచివుండ్దురు మీరు అంత్తకార్యం శేయవలెను తాము పయదు బియ్యమువారు మిగిలిన బొక్కసభండారానవుండ్డె రొఖ్ఖరోజనాలు శీమభూములు మొదలుగాగల భాగ్యం మీదింన్ని రవుతులురాణువ వారిదింన్ని. అటుగనక కీర్తిఅపకీర్తులు విచారించుక అనిమొనను యేరీతున నడిపించ్చుకోవలనో ఆరీతిశేయుడా అసిషోడశపాత్రులకు ఉచితవస్త్రాంగ్గంబ్బులున్ను శిరోవేష్టి తాళి చౌకట్లు కశాయి దట్టి కస్తూరి వక్కలాకులు యిచ్చిప్రియపూర్వకముగా యీవరకు తమవల్ల నేర్పునేరములున్ను ఆగ్రహానిగ్రహములున్ను వాగ్దోషములున్ను యేమికలిగినా అవియెల్ల మనసున

వుంచ్చక యీరీతున జయానికి ఉపాయంకనవలెనో ఆరీతున కర్నాటకం వారిని విముఖులజేశి గజపతి అనేపేరున్ను రాజ్యమున్ను నిలువవలెను అని అన్నందు లకు షోడశపాత్రులు అంన్నిటికిన్ని జగన్నాయకులువున్నారు రేపుఉదయాన్న అన్నిన్ని జూచేరు అని సంబుద్ధిగా చెప్పి ఉదయాన్న మేమున్ను ఆయుత్తబడి వస్తున్నారము మీరున్ను ఆయత్తబడి రావలెను అని అన్నందులకు అందరున్ను యేకవాక్యముగా పలుకరించ్చిరి గనక ఆవివరం ఆద్యంత్తం కర్నాటకంవారి సానాపతి కమలనాభయ్య కృష్ణరాయలవారి సమక్షమానకు సత్యప్రథముగా కాకితములు వ్రాయించి ముద్రబడజేశి అతిగోప్యముగా రాయలవారు అంత్తః పురాన వుంన్నప్పటికిన్ని ఆయనచేతనే కాకితములు యిమ్మనిచెప్పి అంప్పగా పొద్దుచేర నాలుగుఘడియలప్పుడువేగుర్లువచ్చి కాకితములు యిచ్చినారు రాయలు వారు తామె కాకితములుచదివి జూచుకొని కార్యం బిసతప్పి తబ్బిబ్బాయను అని చాలా చింత్తనొంద్దినవారై అప్పుడు అప్పాజిమాటలు వినకవచ్చినందులకు ఇంత్తకార్యం వచ్చెను అని తమలోతామే చింత్తచేసుక అందరికిన్ని ప్రాణ హానులువచ్చెను షోడశపాత్రులు చెప్పేదొఖటిన్ని శేశేదొఖటిన్ని కాదు యెంత్తవెళ్లనాడినా అంత్తానడిపించ్చగలవారు వారలపరాక్రమానకు యెవరుం నిలువలేరు అనినిలిచినదిక్కున నిలువక వున్నదిక్కున వుండ్డక ఆరిజాలపడి అందరి కిన్ని యింత్తకార్యం వచ్చనని ప్రజలుచింత్త పడుతావుండ్డంగ్గ పాళ్యములో ఆడాడ గలిబిలి అయ్యేదిన్ని మూకలు గమిగూడి గుసగుసలుగా మాటలాడే దిన్ని అందువల్ల కొందరికిభయోత్పాతముగా తోచేదిన్ని యీరీతిని వుండ్డగా రాయలవారు దీవటికొలువై విచ్చేశినట్టుగా నడిపించ్చి నగరశోధనగా పాళ్యాలు చూస్తారాగా వారువార్లు ఆడుకొనెవార్త్తలు ఉదయమైతె గజపతివారి పాళ్యం మనపాళ్యంమీద పడుతావున్నారనిన్ని ఆరీతే అయితె కర్నాటకంవారి బలం నిలువదనిన్ని రాయలవారు అప్పాజిమాటలువినక లోజొచ్చి వచ్చినందు వల్ల అపాయం వచ్చెననిన్ని యిందుకు యిప్పుడైనా అప్పాజి చెప్పినట్టు వింట్టె ఆయన అపాయానకు తగ్గ ఉపాయంచింత్తించ్చగలడనిన్ని అక్కడక్కడ పిన్న పెద్దలు కాతులు రాణువవారు ఆసకలమున్ను ఉత్సాహమగ్నులై ఆడుకొనే మాటలున్ను వార్లుభీతిజెంద్దిన వార్లునున్ను చూచినవారై రాయలవారు అప్పాజి గుడారము నకు పోయినారు గనక అప్పాజి రాయలవారు వచ్చేది జూచి తనవద్ద నున్నవార్లు యెరుగకుండ్డ అంద్దరినిన్ని పటకుటీరములకు పొమ్మని అంప్పించ్చి

తాము నగళ్లోనికి పోయినట్లు పోయెగనక అంతస్తుగుడారములో రాయలవారిని విచ్చేశి కూర్చుండ్డమని రాయలవారితోను ఏకదేశానవిచ్చేశేటం త్తకార్యం యెంద్ది అనిన్ని పిలువనంపిస్తే నేనువచ్చి విన్నపంశేయనా అని అన్నంద్దులకు రాయలవారు తాము ఏకదేశాన రాతగ్గ కార్యంగనక వస్తిమి అదియేమంట్టె గజపతి దగ్గరనున్న కమలనాభయ్య అంప్పించ్చిన కాకితం చదువుకొంమ్మని చేతికి యియ్యాగా అప్పాజి కాకితం చదువుక రాయలవారితోను అదియెంద్ది స్వామి వారి పాదపద్మములకు కానంబడ విన్నపంచే స్తిని నావిన్నపము చిత్తానకు తేక కదలివస్తిరి గజపతిశీమలో జొచ్చిరాగానే కనమల్లో వచ్చిన అపకీర్తి చాలదా అవిన్ని విచారించుకోక ముప్పై యామడదూరం గజపతిశీమలో చొచ్చి మొదటిస్థలం వద్ద దిగినంద్దువల్ల వారికిన్ని ఆలోచనబుట్టి యింత్తకార్యాలకు తెగవేశినారు యీరాత్రి అంద్దుకైన కార్యాం కంట్టె కంన్నట్టు కానవప్పటికి అంద్దరికిన్ని యుగంత్యంగ్గినట్టు అవును అనివిన్నపంశేశినంద్దులకు రాయలవారు పలుకరించ్చిననీతిపద్యం—

క. ముట్టినకార్యముఁజక్కం, బెట్టెడుమంత్రియును బోరబెదరనిబంటుం
బుట్టరుగా దేవతలకుఁ, బుట్టరె నానావిధైక భోగసహాయుల్.

అనినీతిచదివి మీరుండగా కొదవ బడనీరేగదా. గతానమీమాటవినకవచ్చినందు వల్ల ఇంత్త ఆలోచనకు ఆస్పదమాయను. మాగుణదోషములు యెంచ్చేటంద్దువల్ల అయ్యేకార్యం యేమివున్నది యీాయపాయానకు తగిన ఉపాయంయేరీతు అని అడిగినంద్దులకు అప్పాజి స్వామివారి హృదయమున్ను ఆలోచనాను యేతీరో అని అడిగినంద్దులకు రాయలవారు షోడశపాత్రులుంన్ను గజపతివారు శేశిన ఆలోచనవల్ల తమకు ప్రాణహానింన్ని మానభంగ్గమున్ను అయిన అవని ప్రజలకు అవధింన్ని వచ్చును అనింన్ని అష్టైశ్వర్యములుంన్ను ఆక్రమింత్తురు అనింన్ని మనస్సు నిశ్చయముగా తోంచివుంన్నవా అని ఆనతిచ్చి మరింన్ని అప్పాజి తోను యీాసమయమంద్దు యేమి వెచ్చబెట్టినా ఉత్తరవు మాకు యీాతీరు బుద్ధిమార్గముగా జెప్పిన ఆతీరునె విని నడిచేము యింత్తకువచ్చినకార్యం ప్రయ ప్రయాసములకు నిలుచునా అని అంన్నంద్దులకు అప్పాజి రాయలవారితో మంత్రనీతులుగా పలుకరింపు శేశినపద్యం.—

గీ. దండసాధనకృతుల సాధ్యుండుగాక, మ్రింగఁబడ తెంచు శత్రువుమిత్రుఁ జేయు
దానమున నాత్మవశగులు గానివార, లెవరులెవ్వార లీజగత్రితయమునను.

క. శత్రులమిత్రులఁజేయును, మిత్రులభృత్యులనుజేయు భృత్యులనిజస
త్పుత్రులుగఁజేయు నండఱ, ధాత్రీపతి కన్ని యెడలదానమువలదే.

క. ఆయాసదుర్లభమ్మున, నాయాసమునన్ ఘటించ్చు నరయ నభీష్టో
పాయంబు పతికి భేదో, పాయము కడునిష్టమగునుపాయము గాదే.

అని నీతులువిన్నవించ్చి యీసమయాన భేదోపాయము సంఘటించ్చి జయించ్చేయత్నంగనవలెనని గనక అనర్ఘ్యమైన భూషణములు బహువుగా వెచ్చబెట్టిహాని కార్యమురాకుండ్డా నడిపించ్చవలెను అన్నంట్టులకు రాయలవారు సప్తోపాయమ్ములచేతనున్ను యీసారి గడిపిస్తే చాలును అని అప్పాజితో ఆనతిచ్చి తామున్ను బొక్కసభండ్డారములున్ను యేనుగగుఱ్ఱాలున్ను గాణువరాష్ట్రములున్ను కోటకొత్తళాలున్ను గ్రామభూములున్నుసకలమున్ను మీయొక్క ఆధీనం గనక మీకునరిపాయినట్టు నడిపించ్చుకొండ్డా అని త్రికరణత్రివాచకముగా పలకరించ్చి నగరికివచ్చిరిగనక అప్పాజివారు తోడుతోనె నగరిగుడారమునకు వచ్చి తమకు ఆప్తులైన అయ్యమరసు కొండమరసు రాయసఁ వీరమరసు అవసరం లక్ష్మీపతి మొదలైన నియ్యోగులున్ను రాయకిరణీకం తొంమ్మిదిసంప్రతులవారున్ను బొక్కసంగొల్ల కొమారస్వామినింన్ని రప్పించ్చుక యేకాంత్తమని వదంత్తి పుట్టించ్చుక వాకిటిగొల్లులతోను గజపతివారి తెగ సుబుద్ధి మొదలైన నియ్యోగులు యెవరువచ్చినా యేకాంత్తమనిచెప్పి లోనికి రానియ్యక తిరుగా వెలి వెళ్లి పోనియ్యక నిలుపకవుండ్డమని తాకీతుగా పలకరించ్చిరాయసంవారితోను షోడశ పాత్రులకున్ను పేరువరుసలకున్ను వరుసలాను మేముపలుకరించ్చినక్రమం రాయలదేవునివారి సమీపములుగా వ్రాయమని పలుకరించ్చి నిరూపవక్కణ చెప్పిన క్రమం—మీరు అంప్పించ్చిన కాకితములు చూచుకొంట్టిమి గనక అంద్దలి వయనం గజపతివారు ఆదియంద్దు మమ్మునాడిన మాటలున్ను నడపించ్చుమర్యాదలున్ను రాష్ట్రదుర్గబహుమానముల కొరకు వారివారితో ఆడుకొన్నవార్తలున్ను జన్మజన్మాకిన్ని మరవతగ్గది లేదనింన్ని అంద్దుకు ఉపమానముగా నీతికార్యమునకు పద్యం—

క. తనువునవాటినయలుగుల, ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్
మనమునవాటినమాటలు,వినుమెన్నియుపాయములను వెడలునె యధిపా.

అని నీతిసహితముగావ్రాసి యీరాత్రి గజపతివారితో వార్తలాడివస్తిమి రేపు ఉదయానకు పాళ్యంమీదికి సాంమార్గముగా వచ్చేటట్టు తోడకవచ్చి చేపట్టు

గాపట్టి ఇచ్చేము తాము రాయలవారు ధరియించు వెంన్నముద్దకంఠమాల నవరత్నపుచిలుకతాళి వైడూర్యతాళి వజ్రాలసరిపెణ మరకతకంకణం హురుమంజి ముత్యాలపచ్చసరం ఇంద్రనీలమకటం వజ్రవుబిళ్లలమొలతాడు కెంప్పులజముదాడి ముత్యాలకావిపెంద్ద్యం వజ్రాలబాహుపురీ దొడ్డముత్యాల అడ్డకత్తి నవరత్నఖేడం నవరత్నవుసింహ్మాలలాటం ముత్యాలముంగ్గరంబ్బు యివి మొదలైన పదారునగలుంన్ను అరువైనాలుగులక్షుల ఘట్లక్రయం తాము అంప్పిస్తేను తిమ మనస్సుపద్ధతికి అనుకూలతగానే నడిపించ్చేము అని మాకువ్రాసి అంప్పించిన క్రమం యీపదారునగలుంన్ను అరువైనాలుగులక్షుల క్రయంగనక కనుగొంన్న నగలు అంప్పితిమిగనక తమతమకుకావలశిన నగలు తీసుకొని మాకు కావలశిన ప్రయోజనం వునగూర్చి అంప్పించ్చేది అని వివరముగా షోడశపాత్రులకున్ను ప్రత్యేకప్రత్యేకముగా నిరుపములు వ్రాఇంచ్చి మరిన్ని భూషణములున్ను ఉడుగరలున్ను పదారుపెటెలు గట్టించి పదాగ్గురు నియ్యోగులకున్ను పయనం శేశి పదారుగురు మనుష్యుల వశాల పెట్టెల యిచ్చి షోడశపాత్రులున్నగడకు పోయి యిచ్చి రమ్మనేట్టుగా అంప్పించ్చి నియ్యోగులకు వుడుగర వక్కలాకులు ఇచ్చి పొయ్యేటప్పుడు మార్గాన యెవరైన అడ్డగించ్చి రమ్మంట్టె అవుగాములనంగ మొదటిదొర వద్దికైనా పోయి వారితోను కలర్ధంకానుపడ తెలుపమనంగా గజపతివారు యేమని ఆనతిచ్చినా విని రమ్మనేటట్టుగా బుద్ధిమార్గములుగా చెప్పి అంప్పినపర్యాయములువిని గజపతివారికి సుబుద్ధిఅనేనియ్యోగి వ్రాశి అంప్పినది మీరు కన్నాటకంవారిమీద కార్యంశేశేవారై షోడశపాత్రులను బిలువనంప్పించ్చి వారితో యీసంస్థానం ఆదినుండ్డిన్ని మీవల్లగదా నిర్వాహకానకు వచ్చినది. మేము పయిడుబియ్యాముువారము. కడమభాగ్యమంత్తామీదిన్ని రవుతురాణువమీదిన్ని అని ఉపచారోక్తులుగానున్న గతము మేము నేర్చి నేరక ఆడిన మాటలు యేమైనాగలిగితే మరచి నిర్వాహమునకు తెవలెను అని మంద్దలించ్చగా వారు రేపు ఉదయాంన్నె అంన్నికార్యములుంన్ను చూచేరు అనివిన్నపంశాయగా మీరు వారిమాటమీద కార్యముఖానకు వస్తావున్నారు గనక కన్నాటకం పాళ్యానుండ్డి మనపాళ్యానకు వచ్చేమార్గాన ఆవుప్రలయిన వాల్లనుంచ్చి నియ్యోగులున్ను పెట్టియున్ను సముఖానకు తెప్పించ్చ్యక జూడగా నిదర్శనమై తేను అంద్దుకుతగిన ఆలోచనక నేదని వ్రాసి అంప్పగా ఆకాకితం గజపతివారు చదువుకొని ఆతీరుననే యిక్కడివారికి వోళవియ్యాగా షోడశపాత్రులకు అనర్ఘ్యశ్రీ

మైన భూషణములు పెట్యాల కట్టించ్చి నియ్యోగులనున్ను పదారు పెట్యెలున్ను
చేపట్టుగా పట్టుకపోయి గజపతివారి ముంద్దర విడిచినారు గనక గజపతివారు
పెట్టలవిడిపించ్చి వారివారిపేరట వ్రాసిన నిరూపములున్ను చదివించ్చుకొని వక్క-
ణలువిని ఆదియంద్దు తాము ఆగ్రహబడిన కార్యములుంన్ను వుటంగ్గించి అంద్దుకు
ప్రత్యుత్తరమున్ను అనర్ఘ్యమైన భూషణములున్ను నిదర్శనంగ్గాచూచి షోడశ
పాత్రులను నమ్మి జగడాలకు పోతావుంట్టిమి వాస్లు ఇంత్తద్రోహానకు లోనైగి
మనపాలింట్టి జగన్నాథులకృపవల్ల మునుకలుగా హెచ్చరిక పడితి. ఇఖను యెవ్వ
రిని నమ్మరాదు అని వచ్చిన పదారునియ్యోగులనుంన్ను పట్ణంవిడిచి యెకదేశాన
అవ్వాలపిడతోలి గజపతివారు యేడెనిమిది ఆమడపొడువు ఉత్తరంగ్గా పారిపో
యిరి గనక మరుచునాడు ఉదయాన షోడశపాత్రులు ఆజ్ఞత్తపడివచ్చి నగరివాకిట
నిలిచి గజపతివారిని బయలుమెరశిరమ్మని ఫణిహారులతో చెప్పి అంప్పగా గజపతి
వారు నగరివాకిట పిన్నపెద్దలతో చెప్పిపోయినారు గనక వారు వాకిలి వెళ్లి
వచ్చి గజపతివాడు నడిపించ్చిన కార్యమున్ను ప్రఛన్నవేషముగా పోయిన మా
ర్గాలున్ను తెలుపంగా షోడశపాత్రులువిని ఉత్సాహమున్నులై ఆలోచనకులోనై
గజపతివారు వున్నతావుకు పోయినాను అపవాదం కార్యముఖానకు పోయి
నప్పటికిన్ని వారు నడపించ్చినకార్యాం మంత్రభిన్నం ఆయగనక తెంపుగా నడి
పించ్చి రింత్తైగా నగరికి హితవాచరించ్చిన వారుకారు అని అంద్దుకు తామె తెలు
సుకొనేరు అనివారువాల్లూ తమతమమార్గాలకు సాగిపోయినారు కాబట్టి కృష్ణ
రాయలవారు యీవర్తమానములువిని జయభేరిశాయంగా మొదటిస్థలానకు
వచ్చి నిలిచి యెవ్వరున్ను నగరు చెరకుండ సుబుద్ధిగారి మనుష్యుల కోటవాకిళ్ల
నుంన్ను పట్టణములోనున్ను నగరిమహలులోనున్ను జతనంగా మనుష్యుల
వుండ్డమని నియమించ్చి పోట్లూరిసింహాద్రివద్ద జయస్తంభము శేయించ్చి సుబుద్ధిని
బిలువనంప్పి ఆయనతోను మేము ప్రతాపముకొరకు వచ్చినవారమింత్తేకాని
రాజ్యాపేక్షకొరకు వచ్చినవారముగాము గజపతివారి రాజ్యం గజపతికే నడిపిం
చ్చేము మేమున్ను మాశీమకుసాగిపొయ్యేము అని ఆనతియ్యాగా సుబుద్ధి ఆవివర
ములకు గజపతివారికి ఆనుపూర్వ్యకముగా కాకితంవ్రాసి పంప్పినారు గనక బుద్ధి
శాలియైనటువంట్టి గజపతివారు ఆకాకితము చదువుక చాలాసంతోషపరులై
తిరుగాపట్నానకువచ్చి షోడశపాత్రులవల్ల తప్పితంలేదని విచారించ్చుక చారుల
చాత పిలువనంప్పించ్చగా వారులున్ను వచ్చి కని కొలిచిరి గనక మీావల్ల కపట

మున్ను లేదు ద్రోహచింతనాను లేదు అనిపలుకరించ్చి వారలకుబహుమాన ములు శేశి వారలకూర్చుక రాయలవారిని సందేహించ్చక మాటపలుకులాడే టప్పుడు గజపతివారు రాయలదేవునితోను సమయోచితములుగా పలుకరించ్చి సందులకు—

శ్లో. నష్టంకులం భిన్నతటాకకూపాః విభ్రష్టరాజ్యం శరణాగతంచ
గోబ్రాహ్మణాః దేవగణాలయాంశ్చ యమద్ధరే త్పూర్వచతుర్గుణంతత్.

అని శ్లోకం చదివి మరిన్ని ఉచితమైనట్టు మాటపలుకులాడంగ్గా రాయ లవారు గజపతివారితోను మీరనిన్ని మేమనిన్ని భేదము ఉన్నదా అని ఉప చారములుగా మాటలాడి గజపతివారికి చాలాబహుమానసన్మానములు శేశి నాలుగు నగల కోకతాకలున్ను యిచ్చినారు గనక గజపతివారు తమకొమార్తె అయిన జగన్మోహినీ అనేకన్యకను దారపోశి యిచ్చేసమయాన చెప్పినపద్యం

క. హాటకపేటీ శాటీ, ఘోటీశకటీ మదేభకోటీపీటీ
పేటీభృచ్చేటీ...మయూరికలు...వేడ్కన్.

అని నీతిచదివి ఆవలమరిన్ని అల్లునికిన్ని ఆడుబిడ్డకున్ను యియ్యతగిన బహు మానోచిత క్రమభూషణాలనిన్ని అంప్పించ్చి మరిన్ని తమకొమార్తెకు పట్టుపరి మెళ పసుపులకని కృష్ణవేణికిదక్షిణపుదిక్కు నడిచేరాజ్యాలున్ను కోటకొత్తళ ములున్ను దుర్గాలున్ను ఇచ్చి యేనుగగుఱ్ఱములు బంటుపరివారం దాసానుదా సులు ఆందోలిక హేయలుబంఢ్డి పసలంప్రాయంబు పాత్రసామగ్రిలు పగడపు కాళ్లమంచము హంసతూలికా యివిమొదలైనవిగా ఆడబిడ్యాకు యియ్యతగ్గ వరుసలన్నియిచ్చి అల్లునికిన్ని శాయతగ్గ వరిశలు అన్నిన్ని తప్పకుండ్డా వఖసారి గానె సకలపదార్థములున్నుయిప్పించ్చి తమ నగరగల భూషణములలో అపూ ర్వమైన హెచ్చుబడిన నవరత్నభూషణాదులు అపరిమితముగాయిచ్చి అప్పాజి షోడశపాత్రులకు అంప్పించ్చిన పదారునగల నవరత్నపొడి సొమ్ములుయిచ్చి చీని చీనాంబరమైన పట్టుపతావళ్లు పీతాంబరాదిగాగల సకలమైన కోకతాకలున్ను యిచ్చి యేనుగగుఱ్ఱం కత్తికెడం మొదలుగాగల రాజోపచారమైన బహుమాన ములున్ను యిచ్చి విందుపీడుకళ్లు ప్రసాబడశేయించ్చి సుబుద్ధినిన్ని వెంబ్బడి కూర్చి అంప్పగా రాయలవారు అత్యంతసంతోషయుక్తులై నగారాశేయమని గజారోహులై అప్పాజిసుబుద్ధిని కూడా చోడోలున వుంచ్చుకొని బయలుదేరిరాగా యీపర్యాయములన్నిన్ని గోలకొండ్డ విజయాపురం అహముదానగరం యేలే

(సశేషము.)

# ఆంధ్రభాషాసంస్కారము.



లోక మెప్పుడును నూతనాంశములం గోరుచుండును. అయ్యది యభివృద్ధికి మూలమై యున్నది. కాని దేశకాలపాత్రముల ననుసరించి దానినెంతవఱకెట్లు గ్రహింపవలెనో వివేకులు పరిశీలింతురు. విద్యాధికులశక్తులు రాజకీయసాంఘికవిద్యావిషయంబుల నెక్కుడుగ మనదేశమునం బ్రస్తుతము పనిచేయుచున్నవి. ఈవిషయంబులలో మనకుం బ్రస్తుతసంపర్కము గలపాశ్చాత్యుల పద్ధతు లాదర్శములుగం గొని వానిని వా రక్కడ వాడుచున్నట్లె మన మిక్కడ వాడవలయు నని యభిలషించువారు కొందఱును మనపూర్వప్రధానమార్గము లాదర్శములుగం గొని యుత్తమ మగు పాశ్చాత్యపద్ధతులమాత్రమే దేశీయమార్గానుసరణములుగ మార్చుకొని వాడవలయు నని యభిలషించువారు మఱికొందఱును ద్వివిధంబులై విద్యాధికులలోం గానవచ్చుచున్నారు. ఏవిషయంబునకైన నాదర్శంబులు ఘనమైనవి గాను శాశ్వతమైనవి గా నుండవలెను. వానిని సాధించుటకై మానవులు చేయుయత్నమును ఘనమైనదిగా నుండవలెను. సౌకర్యము కొఱకు నుత్తమమార్గమును విడిచి నీచమార్గము నవలంబించుటకంటెం గష్టతరమైనను నీచమార్గమును విడిచి యుత్తమమార్గము నవలంబించుట యభివృద్ధికి మూలము. సాంఘికవిషయంబుల నిమ్నజాత్యుద్ధరణమునకు యత్నించుచున్నారు గాని యుత్తమజాతిపతనమునకుం గాదుగదా! రాజకీయవిషయంబుల ఘనమైన ప్రజానుకూలపరిపాలనమునకు యత్నించుచున్నారు గాని నీచమైన స్వేచ్ఛాపరిపాలనమునకుం గాదుగదా! అట్లె విద్యావిషయంబులంగూడ యత్నింపవలసియున్నది. ఇట్టియత్నంబులం గొండొకనియమ మవసరమై యున్నది. నియమపద్ధతులు నాగరకధర్మములు. స్వేచ్ఛాపద్ధతు లాటవికధర్మములు. అడవులలోం బూవులమొక్కలు, ముండ్లపొదలు, ఫలవృక్షములు, బ్రహ్మదండి, మంచిగంధపుంజెట్లు మున్నగున వన్నియు స్వేచ్ఛగాం బెరింగి క్రమరహితమై యొకదానిప్రక్క వేఱొకటి పెరుగుచుండును. జంతువులును విచ్చలవిడిగా సంచరించుచు బలమైనవి బలహీన మగువానిని జంపుచు మాత్స్యన్యాయముననుండును. వీనినే నగరమం దున్నప్పుడు గనుఁడు. వృక్షము లొక్కొక్కజాతి నొక్కొక్క

తోఁటగను లేకతోఁటలో నొకభాగమందును క్రమముగా నాటఁబడి బ్రహ్మాదండితోఁట చుట్టును గంచెగా వేయఁబడి యుండుట మనము చూచుచున్నాము. ఉద్యానవనములు కృత్రిమము లయ్యు సహజ మగునడవులకంటె సుందరములు కావా? అటులే నాగరకధర్మంబులు నాటవికులవానికంటె మనోహరంబులుగ లేవా? ఉండినచో నీవ్యత్యాసమునకుఁ గారణమేమి? మొదటివానియందుఁ గల నియమము రెండవవానియందు లేకుండుటయే కదా!

ఇట్టినియమము కేవలసౌందర్యముకొఱకును మనోహరత్వము కొఱకు మాత్ర ముపయోగించునా లేక యితరప్రయోజనములు గలిగించునా యనిన లోకమందలి నీతివర్తనమునకును జ్ఞానసాధనమునకు ముఖ్యకారణ మని తెల్పవలసియున్నది. నియమము లేకున్న నీతియే లేదు. అందుచే జ్ఞానదూరుఁడు నగును. ఏవిషయంబునన్నైన నియమము నవలంబించి పనిచేయువారి కావిషయంబున నభిరుచి కలుగును. అయ్యది జ్ఞానహేతువు. సృష్టిలో మనుజుఁడు జ్ఞానాధికుఁడై జ్ఞానాభివృద్ధికై యత్నించువాఁడు గావున లోకమందు నియమము సహజముగ వచ్చినదే కాని యకస్మాత్తుగఁ గొందఱు తెచ్చిపెట్టినది కాదు. ఒకఁడొకదుర్బలునిసొత్తును హరించినచో వానికంటె బలవంతుఁడు వానిసొత్తును హరించును. అందుచే సంఘమునందుఁ గలఁతలు పుట్టి సౌఖ్యము లేశమునులేక యుండును. కావున సంఘసౌఖ్యముకొఱకై సొత్తునుహరించినవానికి శిక్షయేర్పడవలసిన యవసరము కలుగుచున్నది. ఇట్టిసౌఖ్యములు పెక్కులు గూర్చుటకే శిక్షాస్మృతి మొదలగు రాజశాసనములు సహజముగ నిర్మింపఁబడుచున్నవి. అట్టి శాసననిబంధనలు ప్రత్యేకమానవునిస్వేచ్ఛకుఁ గొంత యభ్యంతరముఁ గలిగించుచున్నను సంఘసౌఖ్యమును గూర్చునవియై యున్నవి గాన వానికి సంఘమునం దుండుప్రతిమనుజుఁడును విధేయుఁడై యుండి య ట్లాచరించుకొనవలసియున్నది. ఈనిబంధనలయం దసూయతఁగలిగినచో వానిని దీసివేయుటకు యత్నింపక తాను సంఘమును విడిచి యడవులకుఁ బోయి సుఖింపవచ్చునుగాని వానిని మీఱి సంచరించి సంఘమున కపకారముఁ జేయరాదు. సాంఘికవిషయమందు జెప్పఁబడిన యీసంగతు లన్నియు భాషావిషయంబునఁ గూడ నన్వయించును. ఆటవికాభివృద్ధివలె స్వేచ్ఛావర్తనముతోఁ బరఁగినది గ్రామ్యభాష. ఉద్యానవనాదులవలె నియమప్రవర్తనతోఁ జెలఁగినది సాహిత్యభాష. రెండవదానియందుఁ గలరమ్యత్వము మొదటిదానియందు లేదు. ఆటవికస్థితినుండి నాగరకస్థితి సహ

జముగ జ్ఞానాభివృద్ధిచే మనుజులకుఁ గలిగినట్లు వ్యావహారికస్థితినుండి భాషాగౌరవమునకై రమ్య మగుపదములు సాహిత్యభాషయందు సహజముగఁ జొరఁబడినవి. గ్రామ్యభాషయు నెదుటివారికి మనము చూపుగౌరవమునుబట్టియు మనకుఁ గలభాషాపాండిత్యమునుబట్టియు గ్రాంథికభాషాశైలికి నించుమించు సమీపించుచుండును. మనము సమానులతో మాటలాడునపుడు విచ్చలవిడిగా మాటలాడుదుము. మనకంటె గొప్పవారితోఁ బ్రయత్నపూర్వకముగ మంచిమాటలఁ బ్రయోగింతుము. ఈమాటలశైలి యించుమించు గ్రాంథికశైలిని సమీపించుచుండును. ఇందువలన నెదుటివారిని గౌరవించినట్లు మన మనుకొనుటయే గాక వినువారునట్లు గ్రహింతురు. కావున గ్రామ్యభాష మనుజులస్థిత్యంతరములఁబట్టి వాడఁబడునపుడు గ్రాంథికభాషతో సమీపింపఁజేయవలె ననుకోరికి సహజముగ నెల్ల జాతివారియందుఁ గలుగుచుండుట చూచుచున్నాము.

సంఘపురోవృద్ధికి శిక్షాస్మృతు లెట్లట్లు భాషాపురోవృద్ధికి వ్యాకరణంబులు ముఖ్యములు. అవి స్వేచ్ఛయగు భాషారచనకుఁ గొంత ప్రతిబంధకముగానున్నను భాషారమ్యతఁ గోరువారు వానికి విధేయులై యుండవలెను. భాషారమ్యతను బాటించియే వ్యాకరణసూత్రంబులు చేయఁబడినవా యందు రేని ఆసూత్రంబుల ననుసరించి వ్రాయువారల కది గలుగవచ్చు నని చెప్పవలసియున్నది. ఏ మనఁగా భారతాదియుద్గ్రంథములఁ గల పదప్రయోగబాహుళ్యము ననుసరించి వ్యాకరణంబులు వ్రాయఁబడినపుడు తత్పదప్రయోగములు రమ్యము లగుచో నీ వ్యాకరణనియమితప్రయోగంబు లేల రమ్యములు గాకుండును. అర్థరమ్యత ప్రధానము గాని శబ్దరమ్యత ప్రధానమా యని కొందఱు సందేహించుచున్నారు. ఉభయములును ముఖ్యమే యని యెంచవలసియున్నది. రెండును జేరినఁ గాని మంచిరచన కాఁజాలదు. ఉన్నతభావంబులు పేలవ మగుమాటలతోఁ దెల్పిన నర్థవంతుఁడు చింకిరిగుడ్డలఁ గట్టుకొని నట్లుండును. నీరసభావంబులు పెద్దమాటలతోఁ దెల్పిన నీరసుఁ డమాల్యవస్త్రంబుల ధరించిన ట్లుండును. సంఘ మీ యుభయమానవులను జూచి నవ్వునట్లే భాషారమ్యత్వవిదు లీయుభయరచనలఁ జూచి నవ్వుదురు. అనఁగా నట్టిరచనల కిష్టపడరు. సంపూర్ణోపమలకుఁ బ్రసిద్ధి కెక్కిన సంస్కృతకవితల్లజుఁ డగుకాళిదాసు వాగర్థములవలె జగత్తునకుఁ దల్లిదండ్రు లగుపార్వతీపరమేశ్వరులు భాసిల్లుచున్నా రని తనకావ్యాదిని బల్కియున్నాఁడు. ఇందలియుపమానోపమేయముల సారస్యముం జూచినపుడు వాగ

ర్థంబులు భాషాప్రపంచమునకుఁ దల్లిదండ్రులవలె నున్న వనుభావము కన్పట్టక పోదు. వాక్కు తల్లి. భావము తండ్రి. తండ్రి గొప్పవాఁడుగను దల్లి నీరసురాలుగ నున్నఁ గుటుంబపుశోభ వేఱుగ జెప్పవలయునా? అది కుటుంబమే కాదు. ఐకమత్య మున్నచో నిద్దఱు గొప్పవారుగఁ గాని యిద్దఱుఁ గొలఁదివారుగఁ గాని యుందురు. అటులే భావమునకును బదమునకు సమానగౌరవ ముండినచో భాషారమ్యత గన్పట్టును. ఇట్టి భాషారమ్యత్వము పూర్వపుటాంధ్రకవులందఱును భాటించెడివారు. వాగనుశాసనుఁడు తనభారతరచనను గూర్చి-

" ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్."

అని వ్రాసికొనియె. ఇందు దాహరింపఁబడిన యక్షరరమ్యత్వము రుచిరార్థసూక్తిత్వము పైదాని యర్థమును వెల్లడిచేయుచున్నవి. నన్నపార్యుఁడు భాషారమ్యత్వమును బాగుగా నెఱిఁగినవాఁ డని యాతనిశైలిఁ జూచినవారి కెల్లరకు విశదమే. అట్టిభాషారమ్యత చెడునేమో యనుభయంబునఁ గాఁబోలు నప్పటికి వ్యాకరణంబు లేమియు రచింపఁబడకపోవుటచేఁ గవిరాక్షసుఁడు శబ్దశాసనుఁడు ప్రయోగించిన పదములఁ దక్క నన్యముల గ్రహింప రా దని చెప్పిన ట్లీక్రిందిపద్యంబునఁ గానవచ్చుచున్నది.

" ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెంతును దానినె కాని సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగుఁబల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రా దని దక్షవాటి కవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్."

ఏల కవిరాక్షసుఁ డీనియమంబు చేసెను? నన్నపార్యుఁడు మనోహర మగు శైలిని భారత మారంభించి యుండెను. మంచిపదములను జెడ్డపదములను సూత్రించెడు వ్యాకరణంబులు గానరావయ్యెను. అందుచే భాషారమ్యత చెడునేమో యనుభయంబునను, దానియందలి పూర్ణమైన యభిమానముచేతను గవిరాక్షసుఁ డట్లు చెప్పె ననియే యెంచవలసి యున్నది గాని యందుచే భాషాభివృద్ధి కాఁజాల దనుశాలునికైనను దెలియువిషయ మాతనికిఁ దెలియ దనుట న్యాయము కాదు. భాషారమ్యతఁ గోరియే తర్వాతిలాక్షణికు లెల్లరును వ్యాకరణంబు

లను లక్షణగ్రంథములను నిర్మించి యుండిరి. ఇట్టి నియమపూర్వక మగు రమ్యత్వము చేతనే "దేశభాషలలో నెల్లఁ దెలుఁగు లెస్స" యని యాంధ్రభాషకు ఖ్యాతివచ్చినది గాని భావగౌరవమును బట్టి కాదు. భాషారమ్యత చెడినచో నీ బిరుదమునకు మనభాష పాత్రము కాఁజాలదు. కర్ణాటకప్రభుఁ డగుశ్రీ కృష్ణదేవరాయ లాంధ్రమునం దభిమానము కలిగి తత్కవులను గౌరవించుటకుఁగల కారణము భాషారమ్యతయే. ఇతరభాషలకన్న మనభాషకుఁ గలప్రత్యేకాధిక్యతయు నియ్యదియే. కావున నీభాషారమ్యత చెడకుండ భావికవులును ముందు గ్రంథములు వ్రాయువారును జూచుకొనవలసియున్నది.

ఇప్పుడు మనలో గ్రాంథికవాదు లనియు, గ్రామ్యవాదు లనియు భాషాభిమాను లిరుదెఱఁగుల నున్నారు. గ్రాంథికవాదులు వ్యాకరణశాస్త్రమును మీఱరా దనియుఁ గ్రొత్తవిషయంబులఁ దెల్పుటకు భాషయందుఁ బదంబులు లేనిచో నితరభాషాపదంబుల మనభాష కనువగురీతి మార్చుకొని వాడుకొనవచ్చు ననియు గ్రామ్యపదముల వాడుట కవసరము లే దనియు నెంతమాత్రము వాడరా దనియుఁ దెల్పుచున్నారు. గ్రామ్యభాషావాదులు నాగరకులు వాడుగ్రామ్యపదంబుల స్వీకరింపవచ్చు ననియుఁ బద్యకావ్యంబులు గ్రాంథికభాషను వ్రాయవచ్చుననియు గద్యగ్రంథముల మాత్రము గ్రామ్యముననే వ్రాసిన సౌకర్య మనియు నట్టిగద్యగ్రంథములలోఁ బ్రజలకు విషయబోధక మగునవి ముఖ్యముగా గ్రామ్యముననే యుండవలె ననియు వాదించుచున్నారు. మొదటిపక్షమువారి వాదము పూర్వము నుండియు వచ్చుచున్నమార్గము ననుసరించి యున్నది గాన నిప్పుడు మనము క్రొత్తగా విమర్శించుకొన నక్కఱ లేదు. కావున రెండవపక్షమువారి గ్రామ్యవాదము నూతనమార్గ మగుటచే ముందు విమర్శించుకొనవలసియున్నది. ఈవాదము బాగుగా నాలోచించి చూచిన నాంగ్లోభాషాక్రమమును గూర్చి పాశ్చాత్యశబ్దశాస్త్రజ్ఞులు చెప్పిన సూత్రముల భాషాంతరీకరణముగాఁ గాన్పించుచున్నది. ఆభాష ప్రాచీనాంగ్లము, మధ్యమాంగ్లము, నవీనాంగ్లము (Old English, Middle English & New English) నని మూఁడువిధంబుల నున్నది. అందు మధ్యమాంగ్లపదములకును నవీనాంగ్లపదములకును రూపభేదము లంతగాఁ గానరావు. కాని ప్రాచీనాంగ్లమునకును మధ్యమాంగ్లమునకును విశేషభేదము కలదు. ప్రాచీనాంగ్లమునకుఁ బెక్కు విభక్తు లుండుట సంస్కృతమునకువలె శబ్దములకు లింగము లుండుట మొదలగు విశేషములెన్ని

యో నవీనాంగ్లమునకంటె భిన్న మగునవి కలవు. ఈవిశేషము లన్నియు మధ్యమాంగ్లమునందును నవీనాంగ్లమునందును క్రమముగా నెట్లు మాఱుచుండెడివో కొన్ని సూత్రముల శబ్దశాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. ఈవిధముననే గ్రామ్యవాదులును మనభాషను మూఁడువిధంబుల విభజించుచున్నారు. మొదటిది కావ్యభాష, రెండవది కావ్యానురూప మగుగద్యభాష, మూఁడవది నవీనాంధ్రము. మొదటిది నన్నయభట్టారకుఁడు మొదలుకొని నేఁటివఱకుఁ బద్యరూపమున నున్నభాష యనియు, రెండవది చిన్నయసూరిగారు, వీరేశలింగముగారు మున్నగు నాధునికులు వ్రాసినగద్యములందుఁ గలభాష యనియు, మూఁడవది తాము వ్రాయుచున్న గ్రామ్యభాష యనియు వారు తెల్పుచున్నారు. ఇఁక నొకవిశేషము గాన్పించుచున్నది. తాము వాడుచున్న భాషను గ్రామ్యభాష యనినఁ గినియుచు దానిని నాగరకులు వ్యవహారమం దుపయోగింతురు గాన వ్యావహారికభాష యనవలె నని బోధించుచున్నారు. అట్లు వ్యవహారమం దుపయోగించుచున్నారని వీరుచెప్పు క్రొత్తపదముల నే లాక్షణికు లిదివఱలో గ్రామ్యము లని వ్యవహరించి యుండుటచేత నట్లు మేమును జెప్పుచున్నా మని గ్రాంథికు లనుచున్నారు. ఇందుఁ దప్పేమియుఁ గాన్పింపదు. కాని నన్నయభట్టారకుఁ డాదిగ నేఁటివఱకుఁ బద్యకావ్యంబులయందును బ్రస్తుతకాలమున నందఱకుఁ దెలియునట్లు వ్రాయఁబడుచున్న నవలలు, వ్యాసములు, విమర్శనములు, పత్రికలు మున్నగువానియందును గలసలక్షణ మైనభాషను బ్రాఁతతెనుఁ గనియు మృతభాష యనియుఁ బిలుచుటకు గ్రామ్యవాదుల కేమిప్రమాణము గలదో తెలియరాకున్నది. పైనిఁ జెప్పిన ఇంగ్లీషుభాషతో ననుకరించుట కీవీరు లుంచిన ట్లూహింపవలసియున్నది. ఆభాషాపదములు రాజకీయ, సాంఘిక వ్యవహారములలోని మార్పులనుబట్టి క్రమక్రమముగ మార్పుఁ జెంది గ్రంథస్థములు కాఁగా వానిని జక్కఁగా విమర్శించి యామార్పు లెట్లు కలిగినవో యామార్గములను గొన్ని సూత్రములుగాఁ బాశ్చాత్యశబ్దశాస్త్రజ్ఞులు మొన్న మొన్న రచించిరే కాని మొదట సూత్రముల నిర్మించికొని వానినిబట్టి పదముల గ్రంథస్థము చేయలేదు. గ్రామ్యవాదు లాసూత్రములఁబట్టి గ్రామ్యపదములు సహజ మగుమార్పులం బొందియున్నవి గాన వానిని గ్రంథస్థము చేయవలె ననుచున్నాడు. ప్రాచీనాంగ్లమందలి క్రియాపదములు మధ్యమాంగ్లమునకు వచ్చునప్పటికిఁ బొందిన మార్పు లేడుతరగతులుగ నాంగ్లశబ్దశాస్త్రజ్ఞులు విభజించిరి. అట్లే గ్రామ్య

మందున్నపదములు కొన్ని పదుమూఁడుతరగతులలో నిమిడ్చి యాపదు మూఁడురూపములనే గ్రంథస్థము చేయవలె నని గ్రామ్యవాదు లనుచున్నారు. శాకర్య ముద్దేశించినవుడు తక్కినపదములుమాత్ర మేల గ్రామ్యములు గావో తెలియరా కున్నది. పాశ్చాత్యశబ్దవిధులు మన గ్రంథస్థపదములకును వర్తించును. గ్రామ్యపదములలో వారు చెప్పినపదుమూఁడురూపములకును మఱి యితర రూపములకును గూడ వర్తించును. ఆకారణముననే యెల్లశబ్దములు గ్రామ్యములగునా? ప్రకృతియం దనేకపదార్థములు ప్రకృతిశాస్త్రానుసారముగనే పుట్టుచున్నవి. ఆకారణంబున మన మన్నిటిని భక్షించుటకుఁ గడంగిన మనపని యేమగును? మన కేవి యారోగ్యకరముగను బలకరముగ నుండునో వానిని మాత్రమే గ్రహించుచున్నాము. అట్లె మన కిదివఱకుఁ గలభాషాస్వరూపము చెడకుండఁ బుష్టిని గలిగించుపదములఁ జేర్చుకొనవలెను గాని భాషాంతరవిధులకు సరిపడుచున్న వనుకారణమున నపశబ్దముల వేనవే లౌక్కసారిగ భాషయందుఁ జొన్పి భాషను గురూపనుగఁ జేయుట కడుహాస్యాస్పద మైయున్నది. భాషాంతరమును జూచి ప్రతికల్పన చేయుటలో గ్రామ్యవాదులకుఁ గలుగుచున్న యిచ్ఛ మఱియొకదానివలనఁ గూడ స్పష్టపడుచున్నది. ఆంగ్లోభాషలో "మిడ్లాండు" మండలమందు వ్యవహరింపఁబడుచున్న భాష గ్రాంథికభాష యైనట్లు మనయాంధ్రదేశమందుఁ బూర్వము ప్రసిద్ధికెక్కిన వేంగిదేశపుప్రాంతముల నిప్పుడు వ్యవహరించుచున్నభాష గ్రాంథికభాషగా వాడవచ్చునఁట! ప్రతికల్పనేచ్ఛ యింతకంటెను హద్దుమీఱి మఱియెచటనైన నుండునా యని సందియము వొడముచున్నది. ఆంగ్లోభాషయందు "మిడ్లాండు" భాష గ్రాంథికభాష యగుటకుఁ గారణ మేమి? తద్దేశమునకు ముఖ్యపట్టణమైన లండనుపట్టణ మామండలమందుండుటచేతను, రాజకీయవ్యవహారంబుల మిగిలినమండలములకన్న నామండలము ప్రాముఖ్యముఁ గాంచుటచేతను దద్భాష గ్రాంథికభాష యయ్యె నని యాంగ్లోభాషాచరిత్రకారులు వ్రాయుచున్నారు. అట్టిస్థితిగతులు మనకేవి? పూర్వపుప్రసిద్ధినిబట్టి యిప్పుడు నామరూపములు లేని వేంగిదేశపుభాష సర్వపరిమాణముగా గ్రహింపఁగలుగు టెట్లు తటస్థించును? అదియును గాక వందలకొలఁది గ్రంథములు భాషలో వ్రాయఁబడి భాషాస్వరూప మిట్టి దని యెల్లమండలములవారికిని బోధపడియున్నవుడు "మిడ్లాండు" భాష గ్రాంథికభాషగా నకస్మాత్తుగ విజృంభించి యుండెనా? లేదు. ఆంగ్లోదేశము పరరాజులచే

జయింపఁబడి ఫ్రెంచి, లాటిను భాషలు రాజకీయ వ్యవహారములందును శాసనములందును నుత్తరములందును మతగ్రంథములందును స్వేచ్ఛగా వ్యవహరింపఁబడుచుండఁగా దేశభాష నశించునంత యుపద్రవము కలుగునేమో యనుభయంబున భాషాభిమానులు క్రమక్రమముగా దాని నెక్కుడెక్కుడానియందే ప్రవేశపెట్టి యుజ్జీవింపఁజేసిరి. అట్లు చేయుటలో ముఖ్యపట్టణ మగు లండనుభాష ప్రధానభాష యయ్యెను. ఇంతకుఁ బూర్వము నామరూపములు గల గ్రంథము లాంగ్లోభాషలో లే వనవలసియేయున్నది. 1399 సంవత్సరములో "లేడిపెల్హాము" అనునామె తనభర్తకు నాంగ్లోభాషతో నుత్తరమువ్రాసిన దఁట! 1386 సం॥ములో పార్లమెంటువారికి మొట్టమొదట నాంగ్లోభాషతో అర్జీ వ్రాయఁబడెనఁట! ఇట్టివి స్వల్పసంగతు లైనను భాష నుజ్జీవింపఁజేయుటలో బీజప్రాయ మై యుండుకారణమున భాషాభిమానులచే జ్ఞప్తియం దుంచుకొనఁబడి గ్రంథముల నుదాహరింపఁబడుచున్నవి. మఱియు లండను పట్టణమందలి భాష యకస్మాత్తుగాఁ గొండొక ప్రయోజన ముద్దేశింపఁబడి గ్రాంథికభాష గాలే దనియు నది సహజముగ మెల్లమెల్లఁగ దానిప్రయోజన మప్పటినాఁటికిఁ దెలియకుండునట్లుగనే స్థిరపడిన దని "ఎమర్సన్" దొరగారు "ఆంగ్లోభాషాచరిత్ర" (History of the English Language) అనుగ్రంథమున నీక్రిందివిధమునఁ దెల్పియున్నారు. "London English became established as the Standard Language so gradually and naturally that the full significance of it does not seem to have been noticed by contemporaries." ఇంత యప్రయత్నపూర్వకముగను సహజముగను జరుగుమార్పుల నెవ్వ రడ్డగింపఁగలరు? అట్టివి భాషలో నెప్పుడును జరుగుచునే యున్నవి. నన్నయభట్టుమొదలీదినమువఱకును బుట్టిన గ్రంథములఁ బరిశీలించినచోఁ గ్రమక్రమముగా భాషలో నెన్ని క్రొత్తపదము లెప్పుడెప్పుడు వచ్చినవియును భాషావిదులకుఁ గన్పట్టకపోదు. ఇట్లు క్రమముగా వర్ధిల్లుచున్న యాంధ్రభాషను మృతభాష యనియుఁ బ్రాఁతదనుఁ గనియుఁ బిలుచువారల భాషాభిమానశూన్యత్వము వెల్లడించుటయే గాక భాషావజ్ఞతయుఁ దెలియఁజేయును. ప్రతిమనుజుఁడును దాను గొన్నిపదముల వాడుచుండును; మఱికొన్నిటిని దాను వాడకపోయిన నితరులు వాడఁగా గ్రహింపఁగలుగును. తానువాడనిపదములు ప్రాఁతపదము లనియు మృతిఁజెందిన వనియుఁ జెప్పుట న్యాయ మగునా? అట్లె వాడుకలో లేనిభాష మృత యని

చెప్పునప్పుడు వాడుక యన నెట్టిది? సంభాషణమార్గమున నున్నదే వాడుకయా? గ్రాంథికమార్గమున నున్నది వాడుక గాదా ? ఈవిషయమై "ఎమర్సన్" దొరగా రిట్లు చెప్పుచున్నారు.

"Moreover in addition to these linguistic areas representing the words actually used by individuals or by classes of society, there are in the same linguistic area what may be called language strata overlying one another and differing one from another. For example, there may be at least three of these speech strata from which the individual may draw at different times. First is the vocabulary of his colloquial usage, a limited word-stock consisting for the most part of words expressing only the simplest ideas. Next in importance is the vocabulary of his trade, occupation, or profession, consisting of more or less technical terms and phrases, many of which do not occur in his familiar or conversational speech. Lastly the individual may possess a vocabulary which he uses only in more formal address or in literature. This is characterised by words found in books or discourses and seldom used at other times. This literary language has one characteristic difference from the other speech strata mantioned. The colloquial language may be fairly uniform over a small linguistic area, but it will differ widely in widely separate areas. The language of one profession may be fairly uniform but may be almost unintelligible to the members of another profession. But the literary language, while it will differ somewhat as used by various individuals, is the nearest approach to a norm or standard common to several linguistic areas."

తా. ప్రతిమనుజుఁడు నధమపక్షము మూఁడువిధములుగ భాష నుపయోగించుచున్నాఁడు. మొదటిది మిక్కిలి సామాన్య మగునూహలఁ దెలుపు స్వల్పసంఖ్యాకము లగుపదములు గలసంభాషణమార్గము. రెండవది సామాన్యసంభాషణమం దుపయోగింపఁబడక తాను జేయువ్యాపారమందును, నుద్యోగమందును, దనవృత్తియందును మాత్ర ముపయోగించు పారిభాషికపదములు గలవ్యావహారికమార్గము. మూఁడవది యెక్కుడు నియామక మగుపద్ధతుల యందును లేక గ్రాంథికమందును నుపయోగించునది. ఇది గ్రంథములయందును నుపన్యాసములయందును వాడఁబడుచు మిగిలినచోట్ల సాధారణముగా

వాడుక చేయఁబడని పదములఁ గలిగి యుండును. ఈ గ్రాంథిక భాషకును బైనుదాహరించిన మిగిలినభాషలకు ను ముఖ్య మగుభేద మొకటి గలదు. సంభాషణ భాష యొకచిన్న మండలమునమాత్రము సర్వసామాన్యముగ నుండి భిన్న మండలముల మిగుల భేదము గలిగి యుండును. ఒకవిధ మగువ్యావహారిక భాష యావ్యవహారమం దుండువారికి సుగమ మయ్యు భిన్న వ్యాపారములం దుండువారికిఁ జాలభాగము దుర్బోధముగ నుండును. కాని గ్రాంథిక భాష యెవరికి వా రుపయోగించువిధంబునఁ, గొంచెము భేద మున్నను భిన్న మండలముల కన్నిటికి సర్వసామాన్య మగుపరిమాణభాషగఁ జాలభాగము పనికివచ్చును.

దీనినిబట్టి సంభాషణమార్గమున వాడుకలో లేనంతమాత్రమునఁ బదములను మృతప్రాయము లనుట యసంగత మనియుఁ, బలువురకు సుబోధక మగునట్లు గ్రంథము లుండవలె నన్న గ్రామ్యభాషమూలమునఁ గాక గ్రాంథిక భాషమూలముననె యట్లయ్యెడు ననియు స్పష్టపడుచున్నది.

ఇఁకఁ బద్యకావ్యములు గ్రాంథిక భాషలో నుండవలె ననియు గద్యములు గ్రామ్యభాషలో నుండవలె ననియు ననునంశమును గూర్చి విచారింతము. గ్రామ్యము నియమరహితము గదా. కావునఁ గృతులలో వచనములు నియమరహితముగను బద్యములు నియమసహితముగ ను నుండవలె నని దీనివలనఁ గన్పడుచున్నది. ఇదియు నాంగ్లో భాషను జూచి తేఁబోవు వికారమే. ఆంగ్లోభాషలోఁ బద్యముల వాడుపదముల గద్యములలోనికి రానీయరు. పద్యపరిభాష వేఱుగ నుండును. పద్యములందలి పదములలోఁ గొన్ని యక్షరములు గణము కుదురుటకై లోపింపవచ్చును. కాని గద్యంబుల నట్లు లోపింపరాదు. మన యాంధ్రమునఁ బద్యగద్యరచనలవిషయములోఁ బదములు భిన్నములుగ నుండవలె నని లాక్షణికు లిదివఱలో నెవ్వరుఁ జెప్పియుండలేదు. ప్రస్తుతకాలంబున ననేకగద్యగ్రంథములు వెలువడుచున్నవి. వానికిని బద్యకావ్యములందలిభాషకు నెంతమాత్రమును భేదములేదు. జనులకు గ్రామ్యము గాకపోవుట లేదు. రసభరితములును గాకపోవుట లేదు. ఆంగ్లోభాషయందైనను బదములు వేఱుగ నుండవలె ననుచున్నారు గాని గద్యకావ్యములఁ జూపవలసిన జాగ్రత్తయు నియమములును బద్యకావ్యముల నక్కఱలేదనియే తద్భాషావిదులు తలంచుచున్నారు. ఆంగ్లో భాషలో విమర్శకాగ్రగణ్యుఁ డగు "మేథ్యూ ఆర్నాల్డు" (Mathew Arnold) అను పండితుఁ డీక్రిందివిధంబున వ్రాసియున్నాఁడు.

"The form, the method of evolution, the precision, the proportions, the relations of the parts to the whole in an intellectual work depend mainly upon them. And these are the elements of an intellectual work which are really most communicable from it, which can not be learned and adopted from it, which have therefore the greatest effect upon the intellectual performance of others. Even in poetry these requisites are very important· .........In poetry, however, they are after all secondary and energy is the first thing; but in prose they are of first rate importance. In its prose literature, therefore, and in the routine of intellectual work generally, a nation with no particular gifts for these will not be so successful."

అనఁగా "గద్యరచనకు నాకృతి, విషయము, పెంపుచేయుక్రమము, సంక్షేపము, అంతర్విషయములపరిమితి, అంతర్విషయములకు విషయమునకుఁ గలపరస్పరసంబంధము మిగుల ముఖ్యము లగుగుణము లనియుఁ, బద్యరచనకివి యంతప్రధానములు గా వనియు, నేజాతివారిగద్యరచనయం దీగుణములు లోపించునో వారిగద్య ప్రసిద్ధికి రాఁజాల" దనియు దీనిభావము. (పైపదములలోఁ గ్రిందిగీటులు మావి.) కావున ఛందశ్శాస్త్రాదినియమములు పద్యకావ్యముల కున్నను రచనవిషయములో నెక్కుడుశ్రద్ధను గద్యకుఁ బూనవలసియున్నది. కవి ప్రతిభావంతుఁడు. "ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా" యని మనశాస్త్రకారులు వక్కాణించిరి. క్రొత్తక్రొత్తకల్పనలఁ జేయుబుద్ధివికాసము కవి కుండవలెను. ఇది మిగుల ముఖ్యము. యుక్త మగుపదముల నెన్నికొనుటయు నుండవలెను. కాని మొదటిదానియంత ముఖ్యము రెండవది కాదు. అయినను రెండవది కొంతహద్దునకు లోఁబడియుండి భావము ననుసరించి యుండిననే మంచిరచన యని యనిపించుకొనఁజాలి భాషారమ్యతఁ జెడకుండఁ గాపాడును. గద్యకారునికిఁ దెలివియు శ్రద్ధయు ముఖ్యములు. మంచి విషయముల నెన్నుకొని వ్రాయుటకుఁ దెలివియు యథార్థస్థితి విడనాడకుండుటకై శ్రద్ధయు నుండవలెను. గద్యకారులు ధీమంతులు. ఈవిభాగములో నవలలు గద్యరూపమున నున్నను బ్రతిభాకల్పనము లగుటచే మొదటిదానిలోఁ జేరును గాని రెండవదానిలోఁ జేరవు. అట్లే కొన్నిలక్షణగ్రంథములు వ్యాకరణములు పద్యరూపమున నున్నను రెండవదానిలోఁ జేరును. భాషకు ఖ్యాతి

మొదటితరగతిగ్రంథకర్తలవలన వచ్చుచున్నను భాషాపోషణము రెండవతరగతిగ్రంథకర్తలవలననే విస్తారము జరుగవలసియున్నది. వారు విచ్చలవిడిగా వ్రాయుటకు గమకించిన భాషాస్వరూపము నశించు ననుటకు సందియము లేదు. ఒకమాటలోని యక్షరముల మార్చినందులకై "టైమ్సు" పత్రిక నీ క్రిందివిధమున "ఆర్నాల్డు" పండితుఁడు చీవాట్లు పెట్టియున్నాఁడు.

"So again with freaks in dealing with language; certainly all such freaks tend to impair the power & beauty of language and how far more common they are with us than with the French. To take a very familiar instance. Every one has noticed the way in which the Times chooses to spell the word "diocese". It always spells it Diocess deriving it, I suppose, from Zeus & census. The journal 'des Debats' might just as well write "Diocess" instead of "Diocese"; but imagine the journal des Debats doing so! Imagine an educated Frenchman indulging himself in an orthographical antic of this sort in face of the grave respect with while the Academy and its Dictionary invest the French Language! some people will say these are little things; they are not; they are of bad example. They tend to spread the baneful notion that there is no such thing as a high correct standard in intellectual matters; that every one may as well take his own way; they are at variance with the severe discipline necessary for all real culture; they confirm us in habits of wilfulness and eccentricity which hurt our minds and damage our credit with serious people."

ఆహా! ఏమి యీభాషాభిమానము! ఒక్కవార్తాపత్రికలో నొకశబ్దమపశబ్దముగ వాడినందులకై యెంతదూరము వ్రాసినాఁడు. అట్లు వాడుట పిచ్చిధోరణి యఁట. అది భాషాసౌందర్యమును భాషాసామర్థ్యమును నశింపఁజేయుటకు వలఁతి యఁట! సాహిత్యపరిషత్తుచేతను తన్నిఘంటువుచేతను ఘనగౌరవముఁ గాంచినఫ్రెంచిభాషలో నట్టిపిచ్చివ్రాఁత బయలువెడల దఁట. కొందఱివి స్వల్పసంగతు లనుకొందురు గాని యట్టివి కావఁట. ఇవి కుమార్గానుసరణము లఁట. వీనివలన విద్యావిషయంబుల నున్నతమైన సరియైన పరిమాణములు తమకు లేవనియు నెవరికిఁ దోఁచినట్లు వారు వ్రాయవచ్చు ననియు, సత్యమగు పాండిత్య మబ్బుటకై యవసర మగుకఠినసియమములకు విరుద్ధముగా నుందు ననియుఁ, దమకు మూర్ఖత్వము పిచ్చి సహజగుణంబులుగ స్థిరపఱుపఁబడి తమ

మనస్సుల నొవ్వఁజేసి ఋజుమార్గానుసారు లగునితరులు తమయెడలఁ జూపు చున్న గౌరవమునకు నాశనహేతు వగు ననియు వ్రాసియున్నాఁడు. ఒక్కశబ్ద మపశబ్దముగ వాడినందుల కింతదూరము వ్రాసినవాఁడు భాషయంతయు నపశబ్ద మయముఁ గావించుయత్నమును గూర్చి యెన్నిగ్రంథములు వ్రాయునో! మఱియు భాషాభిమానము గలచోట నిట్టిసర్వమర్యాద లెందఱు బయలుదేఱుదురో!

ఈవిషయము ముగించుటకుఁ బూర్వ మొకసంగతి తెలుపవలసియున్నది. ఈదినములలో నేదైన నొకక్రొత్తపద్ధతి నవలంబింపఁ గోరువారు తాము క్రొత్తగ దానిని దెచ్చిపెట్టి రనినఁ బ్రజ కనాదరభావ ముండ దని కాఁబోలుఁ బూర్వులనుగూడఁ దమయాశయములతో లంకెవేయుదురు. వ్యాకరణదూష్య పదంబులు తమ కొక్కరికే నేఁడు రుచించుట గా దనియుఁ బూర్వకవులును దత్పదమాధుర్యమునకు లోనై గ్రంథంబులఁ బ్రయోగించియున్నా రని తెలుపుటకుఁ బూర్వగ్రంథంబులనుండి కొన్నివ్యాకరణదుష్టప్రయోగంబుల గ్రామ్యవాదు లొసంగుచున్నారు. ఇది మిగులఁ జిత్రము!

వీరు వ్యాకరణదుష్టము లని చూపించెడుప్రయోగములలోఁ బెక్కింటికి సలక్షణము లగుపాఠాంతరము లున్నవి. కొన్నిప్రతులయం దివి యున్నవి. మఱి కొన్నిప్రతులయందు వీరు చూపించునవి యుఁ గలవు. ముద్రాయంత్రములు లేనికాలమున భారత రామాయణాది యుద్గ్రంథముల కనేకప్రతులు వ్రాయుటచో లేఖకప్రమాదజనితదోషంబులు గలుగుట మిక్కిలిసహజము. ఈమాట యీగ్రామ్యవాదము బయలుదేఱినతరువాత వచ్చినది కాదు. అచ్చు లేనికాలమున వ్రాఁతప్రతు లెన్నిటినో చూచి మంచిలక్షణగ్రంథమును వ్రాసిన కూచిమంచి తిమ్మకవి-

"ఉ. నన్నయముఖ్యసత్కవిజనంబులకావ్యము లందు లేఖకుల్
కొన్నియుఁ బాఠకాధములు కొన్నియుఁ బోకడవెట్టి తక్కువై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దిన తప్పుత్రోవ లె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన లక్షణవేత్తలు నమ్మతింతురే"

అని తెల్పియున్నాఁడు. అన్నియును లేఖకపాఠక ప్రమాదములేనా యనినఁ గొన్ని కవిప్రమాదములు నుండి యుండవచ్చును. కాని యివి బహు స్వల్పములును లాక్షణికులచే క్షంతవ్యములుగ నెంచఁబడినవియు నై యున్నవి. "ప్రబంధమునా జలరాశి దానిలోపల నెఱసుల్ గణింతురె యపారము లౌ మణు

లుల్లసిల్లఁగా" అని యొకకవి చెప్పినట్లు ప్రబంధజలరాశియం దున్న నెఱసులై యున్నవి గాని యట్టిపదప్రయోగమందలి మాధుర్యమును వదలఁజాలక కవులు ప్రయోగించినవి కావు. బుద్ధిపూర్వకముగఁ బ్రయోగించిరేనిఁ బ్రయోగబాహుళ్య మేల కానరాదు? కోటి కొక్కప్రయోగము గన్పట్టుటకుఁ గతం బేమి? పదునేనుపర్వములు భారతము రచించిన తిక్కనసోమయాజి "వబ" లకుఁ బ్రాస మెచ్చుటను గూర్పక యొక్కకందపద్యమునందు మాత్రము "కవ దొనలును గాండీవము, నవల నిడంబనుపు ముందు నరదము డిగు మే, ను బిదప డిగియెద" నని కూర్చిన ట్లగుపడినచో న్యాయ మగుసిద్ధాంత మేమైయుండును. సోమయాజికి "వబ"ల ప్రాస మంగీకార మని యెంచవచ్చునా? గ్రంథాంతర మున "మేనువెనుక డిగియెద" ననుపాఠము గాన్పించుచున్నదఁట. ఇది యవలంబనీయము గాదా! కవిమత మనుట తగదా! ఇట్లు విమర్శించి చూచిన వ్యాకరణదుష్టము లనుకొనుప్రయోగములు పెక్కులు సమర్థనీయములుగఁ గాన్పించుచున్నవి. కావునఁ బూర్వకవు లట్టిపదప్రయోగముల మాధుర్యము నకు లోనై వానిఁ బ్రయోగించి రనుట యసంగతము. గ్రామ్యభాషతో వ్రాయఁబడుచున్న కరపత్రములందును గొన్నిగ్రంథములందును గ్రాంథికభాషా నుసరణముగఁ గొన్నిశబ్దములు కన్పట్టుచున్నవి. అంతమాత్రముచే గ్రాంథిక భాషాప్రయోగమాధుర్యమునకు లోనై వానిని గ్రామ్యవాదులు ప్రయోగించి రనిన నంగీకరింతురా! కావునఁ బూర్వకవులమీఁదఁ గూడఁ గొంతయాభారము త్రోసి గ్రామ్యవాదమును బలపఱుచుటకంటె నిది నూతనమార్గ మని నిష్కప టముగఁ బల్కి లాభనష్టములఁ బ్రజలకుఁ జూపి వారియనుమతివెంబడిని భాషా సంస్కారముచేయుటన్యాయము. విషయబోధక మగుగ్రంథములు గ్రామ్య భాషతోనుండిన నెక్కుడుసుకర మనిగ్రామ్యవాదులు తెలుపుచున్నారు. ఇది యనాఘ్రాతగ్రాంథికభాషు లగువిషయబోధకులకు వ్రాయుట సుకరముగానుండు నేమో గాని చదువరుల కెంతమాత్రమును గాదు. ఏలనఁ బైఁజెప్పిన రీతిగా నన్ని మండలముల వారికిని సమానపరిమాణముగనుండునది గ్రాంథికభాషగాని గ్రామ్య భాషగాదు. కావున సులభశైలినుండు గ్రాంథికభాషయే విషయబోధక మగుగ్రంథ ములకు మిగుల ననువైనది. ఏభాషయందైన విషయబోధకములగు గ్రంథముల యందలిభాష వేఱుగను సాహిత్యగ్రంథములందలిభాష వేఱుగను నున్నదా? లేనిచో మనభాషకుమాత్ర మేల యుండవలెను? శైలీభేద ముండిన నుండుఁగాక.

అది వేఱుసంగతి. శైలీభేదమును గూడఁ బాటింపక కథలవలెఁ జదువరులు చదివి విషయము జ్ఞప్తియందుంచుకొనుటకై సాహిత్యభాషాశైలిని వ్రాయఁబడిన విషయబోధకగ్రంథములును కొన్ని యాంగ్లోభాషలోఁ గన్పట్టుచున్నవి. భాషాగౌరవమును బాగుగా నెఱింగినవార లేభాషయందేని నేవిషయమును లోకులకుఁ దెల్పినను దద్గౌరవము చెడకుండునట్లు తెల్పుచున్నారు గాని స్వేచ్ఛామార్గమున కంగీకరించినట్లు గాన్పింపదు. కావున మనభాషయందును భాషాగౌరవమును భాషాసౌందర్యమును జెడకుండ సులభశైలిని విషయబోధకగ్రంథములు వ్రాయుటకు యత్నింపవచ్చును.

ఈయంశములఁబట్టి చూచిన నిన్నిపద్యకావ్యములును నింకెన్నియో గద్యగ్రంథములును వెలువడినపిమ్మటఁ బదములరూపములు మార్పవలె నని యత్నించు నీసంస్కార మనవసరముగను ననపేక్షణీయముగను గాన్పించుచున్నది.

పప్పు, మల్లికార్జునుఁడు.

---

# కాశ్మీరదేశచరిత్ర.

మహామహిమ గలమనభరతఖండ మాసియాఖండ మను విపులభూభాగమం దేకదేశమై యున్నను దీనినైసర్గికస్వరూపములఁ బట్టియు, మహోన్నతము లగుపర్వతపంక్తులు, సదాతనజలభరితములయి నావ్యము లగు మహానదులు, అదత్తసూర్యకిరణావకాశము లగుమహారణ్యములు, భూమికివసుంధరాభిధానము నన్వర్థముగా నొనర్పఁగల సర్వసస్యాఢ్యము లగుపంటనేలలు, నత్యంతవిభిన్నము లగుమతములు, మతాచారములు, వేషములు, భాషలుఁ గలిగి పలుతెగలవా రయినమనుష్యులచే నివసింపఁబడు ననేకావాన్తర స్వల్పదేశములను వే అయిన వానివానిరాజ్యతంత్రములను గలిగియుండుటచే నిదియు నొకమహాపృథ్వీఖండప్రసిద్ధిని గాంచిన దనుటకు సందియమా ?

## —* కాశ్మీర దేశ వర్ణన. *—

అంగవంగకళింగసౌరాష్ట్రాది ప్రాచీననామములచే వ్యవహరింపఁబడి ప్రత్యేకముగా నొక్కొక్కరాజు పరిపాలనమునకు లోఁబడియుండెడు నీభరతఖండపుదేశము లన్నిటిలో నెద్ది పూర్వకాలమందుఁ జతుర్దశవిద్యాస్థానంబులకుఁ జతుష్షష్టికలాసంఘాతమునకు నాచార్యగృహంబై కల్హణ బిల్హణ మంఖకాది మహాకవులకు జన్మభూమియయి తదితరదేశీయవిద్వజ్జనవైదుష్యస్వర్ణపరీక్షానికషోపలాయమానంబై రాజిల్లెనో యట్టికాశ్మీరదేశము నిచట సంగ్రహముగానైన వర్ణించి చెప్పుట యౌచిత్యవిరహితముగా నుండదని తలంచి యద్దేశపువిశేషంబులఁ గొన్నింటి వక్కాణించెద.

హిమవత్పర్వతమున కడుగున నుండుభూమి యాఱుమన్వంతరములకాలము వఱకు జలావృతమయి యుండెను. దానికే సతీసర స్సని పేరు. తరువాత వైవస్వతమన్వంతరకాలమునందుఁ గశ్యపప్రజాపతి బ్రహ్మోపేంద్రరుద్రులఁ బ్రార్థించి యాసరఃప్రదేశమునకుఁ బంపఁగా వారు మువ్వురు నాసరస్సునందు నివసించియున్న లోకకంటకుఁ డగుజలోద్భవుఁ డనురాక్షసుని సంహరించి యాసరఃప్రదేశముననే యిపుడు కాశ్మీర మనునామముచే వ్యవహరింపఁబడుదేశముగాఁ జేసి రనియు నిచటనే గౌరి వితస్తానదీరూపముగాఁ బరిణమించి యిప్పటికిఁ బ్రవ

హించుచున్న దనియు, సర్వనాగాధిపతి యయిననీలుఁ డనునాగుఁ డీదేశముఁ బాలించు ననియుఁ దార్క్ష్యభీతిచే నుపద్రుతు లయిననాగు లీదేశముఁ జేరి యకుతోభయజీవను లయి నివసించెద రనియు గంగానరస్వత్యాది నదులకు జన్మశైల మగుభేదగిరి యీదేశమునందే యున్న దనియు 'స్వయంభు' వనుమహాగ్ని యిచటనే భూగర్భమునుండి పుట్టె ననియు, ననేకపుణ్యతీర్థములచే నీదేశము పవిత్రీకృత మనియు శీతకాలమునందు జనులు సుఖముగా స్నానముచేయుట కుష్ణోదకకుండము లున్న వనియు, వేసవిలో సయితఁ ముష్ణరశ్మి యనుష్ణరశ్మియై యుండు ననియు దేవతలకుఁగూడ దుర్లభము లయిన ద్రాక్ష, కుంకుమము, మంచునీరు మొదలగు భోగ్యపదార్థము లిచట సర్వజనసామాన్యము లనియు, గల్హణ మంఖకులు తమగ్రంథములందు వ్రాసియున్నారు. (విద్యావేశ్మాని తుంగాని కుంకుమం సహిమం పయః, ద్రాక్షేతి యత్ర సామాన్యమస్తి త్రిదివదుర్లభమ్).

—* వాస్తవచరిత్రాభావసమర్థనము. *—

ఈదేశముకంటె నధికతరవిస్తీర్ణత గలయితరదేశము లనేకము లున్నను దీనికివలె మఱియేదేశమునకు నవిస్తరమయిన పాలకరాజచరిత్రము పూర్వగ్రంథకర్తలచే వ్రాయఁబడి యుండనందున నీదేశము తొల్లి చిరకాలము సకలవిషయములయందు నిరుత్తరమయిన గొప్పతనమును వహించి యుండె నని మన మూహించుకొనవచ్చును.

మన తొల్లిటిభారతవర్షీయులు సర్వాంశములయందుఁ బూర్ణప్రజ్ఞగలవారై యున్నను "ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" అను కాళిదాసోక్త్యనుగుణముగా నొకవిషయములో వీరికిఁ బెద్ద లోపము గలదు. ఇదియే సర్వానర్థబీజము. దీనివలననే వీరిప్రాచీనచరిత్ర వజ్రలేపఘటితం బగుపేటికవలె నిప్పటికి ననుద్ఘాటనదుర్జ్ఞేయము. అది యెద్ది యన నీ భారతభూమియం దవతరించిన లోకోపకర్త లగుమహాపురుషులు, మహారాజులు, శాస్త్రకర్తలు, మహాకవులు మొదలగువారి యథార్థస్థితిని బోధించు చరిత్రము లేకపోవుటయే. ఆదిపురుషు లగురామకృష్ణాదిమహావీరులు, మంత్రద్రష్ట లగుమహర్షులు, మహారాజులు మొదలగువారి చారిత్రములు పురాణేతిహాసాదులయందు వర్ణింపంబడియున్న నవి ప్రకృతితత్త్వవిరుద్ధము లనియు వానిలో వర్ణింపఁబడుకథానాయకుల కాయాయి గ్రంథకారులు మహత్త్వము నాపాదింపఁగోరి యింత లంతలు చేసి కేవలప్రభావపరములుగా వ్రాసి

యుండుటచే నవి యంతగా విశ్వసనీయములు గా వనియు నాంగ్లేయవిద్యాప్రబోధసంస్కృతమనస్కులై నయిప్పటిమనవా రాక్షేపించుచున్నారు. ఇది నిజమే. ప్రపంచకశైశవావస్థయందుఁ బ్రతిజాతివారును దమలో జనించినగొప్ప వీరు లొనర్చిన పరాక్రమచేష్టల నతిశయోక్త్యత్యుక్తులచే వర్ణించి వారితలపై దైవమహిమల నారోపించి గ్రంథములు వ్రాయు నలవాటుపడినవారు. ఈ విషయములో రాజ్య మేలెడురాజును, బహుగ్రంథకర్తయగు కవిని, మతకర్తను భగవదంశావతీర్ణులఁగా నెంచి వారిమాట జవదాఁటక భక్తితోఁ బూజగావించిరి. ఇది పూర్వకాలమం దనఁగాఁ బ్రపంచకవాస్తవచరిత్ర ప్రారంభసమయమునకు ముందు ఐరోపాజాతు లన్నిటిలోఁ బ్రచురముగా నుండెను. ప్రబలనూతన విద్యాసంస్కారవశమున నాప్రాచీనాభిప్రాయములు మార్చుకొని వా రట్టిశూర పూజనమును (Hero worship) మానినను మన హిందూజాతివా రిప్పటికిని దదవస్థులయి యుండి యభిప్రాయములు మాఱకపోవుటచే భూమినేలిన రాజును శ్రీమహావిష్ణు వనియు, కవిని ఋషి యనియు భావించి తాము వ్రాసిన గ్రంథములయందు వారికి లేనిమహిమల నారోపించి యున్నారు. ఇట్టిగ్రంథములవలన యథార్థస్థితిఁ దెలిసికొనుట కవకాశము లేదు. ఇప్పటికిని మనపండితోత్తములలోఁ గొందఱు ప్రాచీనగ్రంథోక్తాంశముల నకలుషితవిశ్వాసముతో యథావస్థితముగా గ్రహించెదరు గాని యందలితత్త్వముఁ గనిపెట్టుట కభిలాషఁజూపరు. నరేకదా యెవ్వరైన నాయాగ్రంథములఁ బరిశీలించి దానియాథార్థ్య మిది నుండీ యసి సత్యవృత్తాంతమును జెప్పినచో వెంటనే మనములోఁ బొడముదు రాగ్రహమును గొంతవడి యాఁపుకొని "ఓహో! ఇన్ని నాళ్లకెట్టివిశేషముఁ గనుఁగొంటిరి ? కాళిదాసుని యన్నప్రాశనముహూర్తము, బాణుని మృతితిథి, భవభూతి వివాహము, నెప్పుడైనవో తెలిసికొనుటవలన మన కేమిలాభము. ఇట్టి విమర్శము కేవలకాకదంతపరీక్షాసదృశ" మని పరిహాసింతురు. వీరికి రుచిఁ బుట్టించి పాశ్చాత్యపండితవర్యులచే బ్రహితమయిన విమర్శనపద్ధతియందు వీరిచేఁ బదన్యాసముచేయించుట శశవిషాణాసాదనతుల్య మని తలంచెద.

కాని యెవరెట్లున్నను మనపుణ్యపరిపాకవశమున మనదేశముఁ బాలించునాంగ్లేయప్రభుజాతిలో మాక్సుమూలరు. (Max Muller)సర్ విలియమ్జోన్సు (Sir William Jones)విల్సన్(Wilson)మోనియర్ విలియమ్(Monier Williams)కోల్ బ్రూక్(Cole Brook)లాసను (Lassen) గోల్డుస్టకరు, (Goldstucker)

బుహులరు (Buhler) మొదలగు బుధశ్రేష్ఠు లనేకు లీభరతవర్షమును జూచినది మొదలుకొని దీనివిద్యామాహాత్మ్యమును బ్రాచీనగ్రంథపౌష్కల్యమును, నాగరకతను గనిపెట్టి తత్త్వావబోధనమాత్ర సఫలాయాసంమాన్యమాను లయి, అహమహమికతో వ్యయప్రయాసముల కోర్చి యూరూరుఁ దిరిగి తిరిగి యచ్చట నున్నగృహస్థుల పుస్తకాలయములనుండియు, మఠాధిపతులనుండియుఁ బ్రాచీనగ్రంథసమితిని సంపాదించి వానిని సమగ్రముగాఁ జదివి తాము సంపాదించిన జ్ఞానముచేతను దేశమం దక్కడక్కడఁ గానవచ్చు శిలాశాసనముల సహాయముచేతను బ్రాఁతనాణెములవలనను గ్రీకులు మొదలగు విదేశీయు లీదేశస్థులఁగూర్చి వ్రాసిన వ్రాఁతలనుబట్టియు నితరసమకాలిక సాక్ష్యమునుబట్టియు, వశమయినంతమట్టుకు మనపూర్వుల వాస్తవచరిత్రమును మనకు వెల్లడిచేయుచున్నారు. మనము, మనతాతముత్తాతలుఁ గూడ నెన్నఁ డెఱుంగని సర్వజ్ఞానవిషయకాపూర్వగ్రంథజాలమును బైకిఁ దీసి యచ్చొత్తించి సర్వజనసులభముగాఁ బ్రకాశింపఁజేయుచున్నారు. 'రాజా కాలస్య కారణమ్' అను భారతవచనానుసారముగా నిక్కాలమును సంస్కృతవాఙ్మయపునరుజ్జీవనకాలముగాఁ జేసి రని నమ్ముఁడు.

ఇట్లు మన పాశ్చాత్యవిద్వద్వర్యులచే నుద్ధరింపఁబడిన సంస్కృతవాఙ్మయగ్రంథములలోఁ బూర్వరాజచరిత్రములను బోధించుగ్రంథములు కొన్ని కలవు. అవియును గావ్యరూపముగా నుండుటచే నవాస్తవవర్ణనరూపాక్షేపముల కాస్పదమయి యున్నను గొంతమట్టుకు వాస్తవచారిత్రాంశములను గలిగి యుండుటచేఁ బ్రాచీనచరిత్రములను దెలిసికొనఁగోరువారి కవశ్యాపేక్షితములు నుపాదేయము లగుచున్నవి. అవి యెవ్వి యన; 1. బిల్హణకవికృతముఁ జాళుక్య వంశపు రాజులచరిత్రమును దెల్పునదియు నగు విక్రమాఙ్కదేవచరిత్రము. 2. కీర్తికౌముది. 3. హర్షవర్ధనుని చరిత్రమును బ్రతిపాదించు బాణకృతహర్షచరిత్రము. 4. ప్రకృతప్రతిపాద్యముతో సంబంధించిన కల్హణకృతరాజతరంగిణి. ఇది పూర్వకాలమందుఁ గాశ్మీరదేశము నేలినరాజుల వృత్తాంతమును సవిస్తరముగాఁ దెలియఁజేయుచున్నది. దీనిని రచించినకవి కల్హణుఁడు.

—* కల్హణుని వృత్తాంతము. *—

తక్కిన యందఱి హిందూదేశపుగ్రంథకర్తల వృత్తాంతమువలె నీకల్హణునివృత్తాంతము నితనిగ్రంథమువలననే తెలిసికొనవలయును గాని యితరాధారము లెవ్వియు లేవు. ప్రతితరంగాంతమందును "ఇతి శ్రీ కాశ్మీరికమహా

మాత్య చమ్పకప్రభుసూనోః కల్హణస్యకృతౌ రాజతరంగిణ్యామ్ ” అని చెప్పు గద్యము (Colophon) ను నితఁడీరాజతరఙ్గిణి నెనిమిదితరంగములవఱకు ననఁగా జయసింహుఁ డనురాజుచరిత్రమువఱకు వ్రాసి మృతినొందిన పిదప మిగిలిన గ్రంథమును బూర్తిచేసిన “జోనరాజప్రాజ్యభట్టు” స్వగ్రంథారంభమందు (రసమయ్యాగిరా వృద్ధాం నిత్యతారుణ్య మాపిపత్ । అథ శ్రీజయసింహాన్తత త్కీర్తిం కల్హణద్విజః) అని వ్రాసినశ్లోకమును నీరెండింటివలన నీగ్రంథము రచించినవాఁడితఁడే యని మనకుఁ దెలియవచ్చుచున్నది. క్రీస్తువెనుక 1148–49 సంవత్సరములకు సమమయిన లౌకికశకము 4224 సంవత్సములో నీకవి యీ గ్రంథమును రచించినట్లు (లౌకికేబ్దే చతుర్వింశే శకకాలస్య సాంప్రతమ్ । సప్త త్యాభ్యధికం యాతం సహస్రం పరివత్సరాః) I. 52. అనుశ్లోకమువలన స్పష్ట మగుచున్నది. ఇతని తండ్రిపేరు చంపకుఁడు. ఈ చంపకుఁడు 1089–1110 సంవ త్సరములలో కాన్యకుబ్జదేశము నేలినహర్షవర్ధనమహారాజు ప్రధానోద్యోగి యనియుఁ గాశ్మీరములో నుండు దరదదేశాంతపాలకుని దుర్గఘాత మనుదుర్గము పై హర్షుఁడు దండెత్తినపు డాదుర్గరక్షకు లయిన శత్రువుల నోడించి తనరాజున కాదుర్గము వశమగునట్లు చేసె ననియు నితనికి ద్వారపతి యనుబిరుద మున్న దనియు నతిశ్లాఘాపూర్వకముగా నితనిగూర్చి తనగ్రంథమం దనేకస్థలములలోఁ జెప్పియున్నాఁడు. (7–1177 దుర్గఘాతాభిధం దుర్గం గ్రహీతుం త మచూచు దత్ । చంపకో ద్వారకార్యస్థ మభిసంధాతు మైహత। జనకే ద్వారపతినాహతేఽ నన్తనృపాజ్ఞయా) ఈచంపకునితమ్ముఁడు కనకుఁడు (గానవిద్యా విశారదుఁడు) ఈతఁడు హర్షనృపాలుని యాస్థానమందు గాయకుఁడై యుండెను. ఒకప్పు డితఁడు మనఃఖేదము నొందియుండఁగా హర్షుఁ డాఖేదమును బాపుటకు బహుమతు లొసంగినట్లు గానవచ్చుచున్నది. (తస్యాసీ ద్గాయనః కనకోఽధసః । చంపకా వరజః ఖేదా ద్గీతాభ్యాసకృతోద్యమః। ప్రసాదీకృతమస్మైచ ఖేదచ్ఛేదనమిచ్ఛతా తేనకాంచనదీనారలక్ష మక్షతచేతసా VII. 1117.) ఆకాలమందు భరతఖండపు నితరదేశములందువలెనే కాశ్మీరమందును బ్రాహ్మణులే సంస్కృతభాష నభ్యసించి గొప్పపండితు లగుట వాడుకయై యుండెను. కాన నీగ్రంథమందుఁ గానవచ్చు నిరర్గళకవితాధోరణికి మూల మగునితనినిస్తులపాండిత్యమునుబట్టి విచారింపఁగా నీకల్హణకవి బ్రాహ్మణకులజాతుఁ డనుట కొంతమాత్రము సందేహము లేదు. అవంతివర్మకాలమునందు శైవసిద్ధాంతప్రవర్తకు లగుభట్టకల్లటాదులను నగార

వముగాఁ బ్రశంసించుటవలనను, శివభక్తాగ్రగణ్యుఁ డగుశివతండ్రి చంపకుఁడు కాశ్మీరమం దున్న పుణ్యతీర్థముల నన్నిటని బలుమాఱేగి సేవించె నని భక్తితోఁ జెప్పుటవలన నితఁడు శైవమతావలంబియని సులభముగాఁ జెప్పనగు.(అనుగ్రహాయ లోకానాం భట్ట శ్రీకల్లటాదయః। అవంతివర్మణః కాలే సిద్ధా భువ మవాతరన్) కాని బోధిసత్త్వులహింసాపరు లనియుఁ బరమధార్మికు లనియు స్వగ్రంథమందుఁ బలుమాఱు స్తుతించుటచే నితనికి బౌద్ధమందుఁగూడఁ గొంతయాభిముఖ్య మున్నట్టు తోఁచును. ఈచరిత్రకారుఁడు తనగ్రంథమం దెచటను దన శైశవ చరిత్రమును దనవిద్యాభ్యాసదశను జెప్పియుండకపోయినను (వంద్యః కోపి సుధాస్యందాస్కందీ స సుకవే ర్గుణః। యేనాయాతి యశఃకాయః స్థైర్యం స్వస్య పరస్యచ। కోయం కాల మతిక్రాంతం నేతుం ప్రత్యక్షతాం క్షమః। కవిప్రజాపతీం స్త్యక్త్వా రమ్యనిర్మాణశాలినః) అనుగ్రంథాదిశ్లోకద్వయమువలన దానుబూను కొన్న దుష్కరగ్రంథరచనయందుఁ దనసామర్థ్యమును వెల్లడిచేయుటచే నసాధారణప్రతిభ గలవాఁడని యూహించునది. ఇతఁడు వ్రాసినయీగ్రంథమును బట్టి విమర్శింపఁగాఁ దర్కము, వ్యాకరణము, అలంకారశాస్త్రము, పురాణములు, కావ్యములు మొదలగు వానియందుఁ బూర్ణప్రజ్ఞ గలవాఁడని యనుమేయింప నగు. ఇంతియకాక మఱియొకవిశేషము కలదు. పదునొకండవవత్సర శతకాంత మందు జీవించిన కాశ్మీరదేశపుకవీశ్వరుఁ డగువిద్యాపతి బిల్హణుఁడు రచించిన విక్రమాంకదేవచరిత్రము నీతఁ డామూలాగ్రముగఁ జదివి యున్నాఁ డని తెల్పుటకు (VII. 735, 737 శ్లో. కాశ్మీరేభ్యో వినిర్యాంతం రాజ్యే కలశభూపతేః। విద్యాపతిం యం కర్ణాటశ్చక్రే పర్మాడిభూపతిః। త్యాగినం హర్షదేవం స శ్రుత్వా సుకవిబాంధవం। బిల్హణో వంచనాం మేనే విభూతిం తావతీమపి) అనుశ్లోకములే నిదర్శనములు. ఇతఁడు బాగుగఁ గృషిచేసిన మఱియొకగ్రంథము బాణుని హర్షచరిత్రము. రాజతరంగిణీ హర్షచరిత్రములకుఁ గ్రియాపద ప్రయోగములయందు సమానములయందు మఱికొన్ని యభిప్రాయములందుఁ గలపరస్పరసాదృశ్యము పూర్వోక్తాంశమును దృఢపఱచుచున్నది.

---

| హర్షచరిత్రము. | రాజతరంగిణి. |
|---|---|
| (1) సంఫుల్లమల్లికాధవళాట్టహాసో మహాకాలః. | (1) ఉత్ఫుల్లవకుళచ్ఛవిః అట్టహాసః కృతాంతస్య. IV. 450. |
| (2) కల్యాణాభినివేశీ. | (2) కల్యాణాభినివేశినా IV. 467. |
| (3) సవినయ మభాషత ఆగచ్ఛత ప్రవిశతేతి | (3) ఆగచ్ఛత ప్రవిశతే త్యుచ్యమానః III. 332. |
| (4) తేజసః పరమాణుభి రివ కేవలై ర్నిర్మితః | (4) తైజసై రివ ససృజే పరమాణుభిః VII. 874. |
| (5) భాస్వద్బింబాధరేణ ప్రసన్నావలోకితేన చంద్రముఖేన కృష్ణకేశేన వపుషా సర్వదేవతావతార మివ. | (5) భాస్వద్బింబాధరాం కృష్ణకేశీం సితకరాననాం హరిమధ్యాం శివాకారాం సర్వదేవమయీ మివ. III. 416. |
| (6) చతురుదధికేదారకుటుంబీ. | (6) ఈశో నృపాణాం నిశ్శేషక్ష్మాకేదారకుటుంబినం III. 101. |
| (7) నమంతు శిరాంసి ధనూంషి చ. | (7) ధనూంషి శిరాం స్యద్య నమయంతః 8. 924. |
| (8) సుభటభుజజయస్తంభ విలాస సాలభంజికామ్. | (8) యద్భుజస్తంభోజయశ్రీః. II. IV. 14. |

ఇందువలన మహాకవి శబ్దబ్రహ్మనిష్ణాతుఁడు నగుబిల్హణుఁడు తనకంటెఁ బ్రాచీనుఁ డయినయొకమహాకవియొక్క శబ్దసమూహమును గల్పనలను శక్తిహీనుఁ డయిన సామాన్యునివలెఁ జౌర్యవృత్తిచేఁ దనగ్రంథములో వాడుక చేసె నని మనము తలంపవచ్చునా ? దీని కుపపత్తి మఱి యేమై యుండవచ్చు ననఁగా:—రాజచరిత్రమును బోధించుగ్రంథ మిది యొకటియే యతనికాలమందు సర్వజనపాఠ్యమానమయి దేశమంతట వ్యాపించియుండుటచే దానియందుఁ దనకుఁ గలగౌరవముఁ జూపుటకే శ్లాఘించె నని చెప్పనగు. యశోవర్మయాస్థానము నలంకరించిన గౌడవధమహాకావ్యకర్త వాక్పతిరాజు భవభూతిమొదలగు మహాకవులను, జంద్రుఁడు, భర్తృమెంఠుఁడు, వరాహమిహిరుఁడు మొదలగు శాస్త్రకర్తలను నాయాయి రాజచరిత్రప్రసంగమునం దుదాహరించి యుండు

టచే నీకవికి సంస్కృతవాఙ్మయమందుఁగూడఁ బ్రావీణ్యము కల దని చెప్ప వచ్చును.

—* కవికాలనిర్ణయము. *—

శ్రీకంఠచరిత్ర మనుమహాకావ్యమును రచించిన మంఖకుఁడు కాశ్మీరదేశస్థుఁడు. కల్హణునికి సమకాలికుఁడు. కల్హణుఁడు రాజతరంగిణిని వ్రాయుటకుఁ గొలఁదికాలము ముందుగా మంఖుఁడు తనకావ్యమును రచించినట్లు మంఖకావ్య రాజతరంగిణీ తారతమ్యవిమర్శనము వలనఁ గానవచ్చుచున్నది. మంఖుఁడు తాను వ్రాసిన శ్రీకంఠచరిత్రము నాకాలమందుఁ గాశ్మీరములోఁ బ్రసిద్ధిఁజెందియున్న పండితులకుఁ జూపి దానిని గూర్చి వారియభిప్రాయములను దెలిసికొనఁగోరిక కలవాఁడై యాసమయమందు జయసింహ మహారాజు ప్రధానామాత్యపదవి నలంకరించి నిరంకుశాధికారము గలిగియున్న లంఖకుఁ డనుతనజ్యేష్ఠసోదరుని యింటికిఁబోయి యచట నాక్షణమందుఁగూడియున్న ముప్పదిమందిపండితులకుఁ జదివి వినిపించె నని శ్రీకంఠచరిత్రములోని యిరువదియైదవసర్గములో నున్నది. (మదగ్రజన్మన శ్శ్రీమల్లంఖకస్య సభాగృహం। తేఽధ్యాస తేచ విస్రబ్ధా స్సారసా ఇవ మానసమ్) ఈలంఖకునికి అలంకారుఁ డనునామాంతర మున్నట్లు శ్రీకంఠ చరిత్రమువలనను తెలియఁబడుచున్నది. (య స్సామంతశిఖామణేఽత్రభవతా లంకారనిత్యం సతా। మేకం శ్రీజయసింహపార్థివపతిం కాశ్మీరమీనధ్వజం తస్యోపాసితసంధివిగ్రహ మలంకారం ద్వితీయం స్తుమః) రాజామాత్యుఁ డగునీయలంకారునియింట విందారగించుటకు విచ్చేసిన పండితమండలిలోఁ గాన్యకుబ్జేశ్వరుఁడైనగోవిందచంద్రుని రాయబారి యగుసుహలుఁ డొకఁ డని మంఖుఁడు చెప్పియున్నాఁడు. (అన్య స్స సుహల స్తేన తతోఽవంద్యత పండితః। దూతో గోవిందచంద్రస్య కాన్యకుబ్జస్యభూభుజః) ఈగోవిందచంద్రుఁడు క్రీస్తుశకము ద్వాదశ శతకముయొక్క పూర్వార్ధమందుఁ గాన్యకుబ్జము నేలినట్లు చరిత్రకారుఁడైన "విన్సెంటుస్మిత్తు" మహాశయునియొక్క వచనప్రామాణ్యముంబట్టి నిశ్చయింపఁ బడుచున్నయది. ఇంతియకాక 1144 వ సంవత్సరములో జరగిన రాజకార్యముల వర్ణించుసందర్భములోఁ గల్హణుఁడు అలంకారునిగుఱించి తనగ్రంథమం దిట్లు వ్రాయుచున్నాఁడు. (VIII. 2557-2618-2423 అలంకారాభిధో బాహ్యా రాజస్థానాధికారభాక్। అధృష్యో మానుషై ర్వృద్ధై ర్విరుద్ధా స్సహభూధాఽవధీత్।

ప్రాప్యాలాఽథ రాజస్థానీయోఽలంకారస్సాహసోన్ముఖః। డామరం కోట్ట మారుహ్య నిస్యైనయథమై ర్వశం। స్నానకోష్ఠమథబ్రహ్మపురీసేత్వాదికర్మణా। సోలం చకారాలంకారో బృహద్గంజాధిపో ధరామ్) కాని మంఖుఁ డీయలంకారుని దనగ్రంథమందు "ఉపాసితసంధివిగ్రహమ్" అని చెప్పుటచే నితఁడు మొదట "విదేశరాజ్యకార్యదర్శి ( Foreign Secretary ) గా నుండె నని యూహింపవచ్చును. శ్రీకంఠచరిత్రము మూఁడవసర్గ యిరువదిరెండవశ్లోకములో 'సుస్సల నృపాలుఁ డీతని కీసంధివిగ్రహాధికారము నిచ్చినట్లు వ్రాసియున్నాఁడు. "నివేశితే సుస్సలభూభిడ్రాజసా స్వయం గరీయస్యపి సంధివిగ్రహే" ఇతనియనంతరమం దీమంఖకుఁడే యాయుద్యోగములో నియుక్తుఁ డైనట్లు తనగ్రంథమందుఁ గల్హణుఁడు వ్రాసియున్నాఁడు. "సాంధివిగ్రహికో మంఖకాఖ్యో లంకారసోదరః। సమత స్యా భవత్ప్రిష్ఠః శ్రీకంఠ స్యప్రతిష్ఠయా" శ్రీకంఠ-చ-3 సర్గ-66 శ్లో. అనంతరం సుస్సలదేవనందనో యమాదరాచ్ఛ్రీజయసింహభూపతిః। వ్యధాత్ప్రజాపాలనకార్యపూరుషం" సుస్సలరాజకుమారుఁ డైనజయసింహభూపతి మంఖకుఁడు జీవించియున్నకాలమందు రాజ్యము చేసిన ట్లిందువలన స్పష్ట మగుచున్నది. ఈజయసింహునిరాజ్యపరిపాలనకాలము క్రీస్తుశకము 1128-1149 వత్సరము లని ప్రమాణాంతరములచే నిర్ణయింపఁబడినది. కావున మంఖకవి యీసమయమందే తనకావ్యమును రచించి యుండవలయును. పైని వ్రాయఁబడిన రాజతరంగిణీ శ్లోకములనుబట్టి యాలోచింపఁగాఁ గల్హణుఁడు మంఖకవితోను వానికుటుంబము వారితోను బూర్ణపరిచయము గలవాఁ డని చెప్పుటకు లేశము సందేహము లేదు. కావునఁ గల్హణుఁడు జయసింహ మంఖులకు సమకాలికుఁ డని పైనివ్రాసిన శ్లోకములచే బుజువు చేయఁబడియున్నందున నాకవివరుఁడును ద్వాదశాబ్దశతకమువాఁ డని నిరాక్షేపముగాఁ జెప్పవచ్చును. ఇది కాక మఱియొకవిశేషము—

మంఖుఁడు తనయన్నయగునలంకారునిగృహమందుఁ గూడినవిద్వాంసుల సభలోఁ దనకావ్యమును జదివి వినిపించె నని యిదివఱకే చెప్పియున్నాను. ఆసభలో నప్పటికి సమవేతు లయియున్న యందఱుపండితుల పేర్లను దనకావ్యమం దిరువదియయిదవసర్గములోఁ బూర్ణముగాఁ జెప్పియున్నాఁడు. ఈపేర్లలోఁ గొనవాఁడు కల్యాణుఁ డనువాఁడు. ఇతనివిషయమయి శ్లాఘాపరము లయినమూఁడు శ్లోకముల వ్రాసియున్నాఁడు. 1. శ్రీమా నలకదత్తో౽య మనల్పం కావ్యశిల్పిషు। స్వపరశ్రమసర్వస్వ న్యాససభ్య మమన్యత. 2. తథోపచస్కరే యేన నిజవాఙ్మయ

(సశేషము)

ముగ్గురుదుసేదార్లున్ను విని యిభను మనం రాయలదేవునితో మొదిరించ్చి క త్తి కట్టేది కార్యంకాదు అనియోచనచేసి భేటిశేసుకోవలెనని నిశ్చయించ్చి అంద్దుకు అయిన సంవిధాన పురస్సరముగావచ్చి నిలిచి సవినయంబ్బుగా కుర్నీసులు శేశి రాయలవారి భేటిశేశుకొని కానుక నదురుదెచ్చి అపరిమితముగా పాదముల సమర్పించ్చి భయబుద్ధిగలిగి రాయలవారియొక్క దానకీర్తిత్రములు తెలుసుకొని పలుకరింప్ప శేశిన నీతిపద్యం—

చ. మలకలు మాప్రచారములు మాముఖము ల్విమవహ్ని ఘోరముల్
ఖలులము రోషజాతులము గర్వుల మేమొకమంచివారమే
నలినదళాక్ష ప్రాణులకు నైజగుణంబులు మాన్పవచ్చునే
వెలయఁగ మావికారములు వేయును నెంచఁగనేల భూవరా!

అనినీతిపద్యం చదివి అన్యోన్యమైన మాట పలుకులు నడిపించ్చి తమతమ దేశాలకు సరుదులు యేర్పాటుశేశుకొని కనమని కొలిచేవారై రాయలవారిచేత అంప్పించ్చక వారివారి స్థలాదులకు పోయినారు గనక కృష్ణరాయలవారు ఉత్తరాతురకల కార్యంజయం చేసుకొని శీమకై తిరిగి తిరుపతికిరాంగా కల్యాణ కలుబరిగె కోటలవారు గర్వితులై కోటమీాదనుండి కూతలీంగ్గా ఆవార్తలు రాయలవారువిని యెదిరితెగవారిని అడుగగా మ్లేచ్చులతెగవారు వున్నారు గనక కోటమీాదికై అంద్దుల ముగుడించ్చుమని కలుబలి ేగకోట లగ్గబెట్టించ్చి మూాడుముక్కాలు ఘడియలలో కోటసాధించి ఆకోటలోవుంన్న యజమానుంణ్ణి చేపట్టుగా పట్టుకొని ఆరువేలగుఱ్ఱాలవారినిన్ని గుఱ్ఱాలనున్ను ఏకవాౘగా బట్టుకొని ఆకోటకుతాణ్యాం గుజ్జరికల్యాణరావును వుంచ్చి తిరుపతికివచ్చి ఆలమేలుమంగా సమేతులైన కల్యాణవెంక్కటేశ్వరుల దర్శనంబుశేశి రొఖ్ఖరూపాయలుకానుకవేశి సకలభూషణములున్ను స్వామికిసమర్పించ్చి ఆస్థలాన షోడశమహాదానాలున్ను శేసి సంన్నిధిని నిత్యశేవగా అంజలిపుటులై పూర్వద్వారమందలి వుభయపార్శ్వములా తిరుమలదేవీ చిన్నాదేవీ సహితంగా వుండేటట్టుగా తాంమ్రాన ప్రతిబింబమున శేయించ్చి స్వామినియెదురుగానిలిపి అంద్దుండ్డి కాళహస్తికివచ్చి స్వామినిదర్శించి కానుకలున్ను నవరత్నాభరణములున్ను సమర్పించి శ్రీముఖసంవత్సరం అశ్వీజ శుద్ధ ౧౨ దినములు రాదిగాగల వస్త్రములున్ను గ్రామాదులున్ను సమర్పించి స్వామిసంన్నిధిని షోడశమహా దానాలున్ను

శేశి అవ్వారిగా సత్రములున్ను కలుగశేశి అంద్దుండ్డి త్రిపురులచేత పూజ కొన్న మూడుస్థలాలకున్ను పోయిన స్వామిదర్శనం శేశి వంద్దీశ్వరదర్శనం శేశి అళగరుగుడ్కివచ్చి శేవించ్చికానుకలున్ను ముత్యాలకిరీటం పచ్చలపతకం సమర్పించ్చి మధురకువచ్చి మీనాక్షిదేవినిన్ని చొక్కనాధస్వామినిన్ని త్రిసంధ్యల యంద్దున్ను సేవించ్చి కానుకలువేశి అనేకభూషణములు సమర్పించ్చి అంమ్మ నార్కి వజ్రాలకంమ్మలున్ను వైడూర్యపుపతకములున్ను పచ్చలకంమ్మలున్ను ముత్యపుముక్కరానున్ను సమర్పించి త్రిరాత్రుళ్ళు వాసముజేశి శ్రీవల్లిపుత్తూరికి వచ్చి చూడుకొడుత్తు నాచ్చ్యారుసమేతముగా సంప్పెంగ్గి మంన్నారు స్వామిని సేవించ్చి తిరుముక్కు కెంప్పుల వోడ్యాణాం బంగ్గారు నూపురములున్ను నవ రత్న కీతమైన సింహ్మాముఖం ప్రభలున్ను సమర్పించ్చి గుంట్టత్రొవ్వించ్చి రాతి కట్టానకున్ను నడిమిమంట్టపానకున్ను లక్ష మాళ్లు యిప్పించ్చి కరువనల్లూరికి వచ్చి క్షీరవర్ణస్వామిని దర్శించ్చుక శంకరనారాయణదేవళానకువచ్చి నాగతీర్ధ మున స్థానం శేశి గోమేతీసమేతముగా శంకరనారాయణస్వామిని దర్శించ్చి దక్షిణ కాశికిపోయి త్రికూటాచలమంద్దు ఆకాశగంగయంద్దలి స్నానం శేశి చిత్రసభ శేవించ్చుక అగస్త్యపర్వతానకువచ్చి కల్యాణతీర్థమంద్దలిస్నానం శేశి అగస్తేశ్వ రుని గోపురంగట్టించ్చి గజేంద్రమోక్షానకువచ్చి స్వామినిసేవించ్చుక శాలివట పురానకువచ్చి కాంత్తమతీసమేతముగా వేణువనేశ్వరస్వామిని దర్శనం శేశి తామ్ర సభకట్టించ్చేటంద్దుకు కొంత్తహూకయిచ్చి కృష్ణరాయసముద్రమని తనపేర అగ్ర హారముగావించ్చి తోతాద్రిస్వామిని శేవించ్చుక కురుంగ్గుడికి పోయి పంచ్చ నంబ్బులనుంన్ను శేవించ్చి కన్యాకుమారికిజని అమ్మవారికి సేవించ్చుక శ్రీకంద్దూ రికివచ్చి వల్లిదేవయానసమేతముగా సుబ్రంహ్మణ్యస్వామిని శేవించ్చి నవతిరుపతు లకువచ్చి ఆయాస్థలాదులకు దగిన నవరత్నపొడి భూషణాదులు యిచ్చి ఆది సేతువుకుపోయి రఘునాయకుల సేవించ్చి కాళములమీదసముద్రతరణమై ధను ష్కోటిలో ఖడ్గంగడిగి సేతుస్నానం తులాపురుషదానం మొదలైన దానాలాచ రించ్చి కాశివిశ్వేశ్వరులనుంన్ను రామలింగ్గస్వామినిన్ని సేతుమాధవస్వామినిన్ని పర్వతవర్ధనఅమ్మవారినిన్ని సేవించ్చుకొని చతుర్వింశతితీర్థములయంద్దు స్నానం శేశి కోటిదానం కోటిబ్రాంహ్మణులకు అన్నదానముశేశి స్వామిసంన్నిధిని మూడుతులలుతూంగి అంమ్మవార్కి సకలాభరణములున్ను నవరత్నపొడిగా యిచ్చి త్రిరాత్రివసిఇంచి కోటితీర్థస్నానంశేశి స్వామిచేత అంప్పించ్చుకొని మర

లిసవారై గోకర్ణస్థలమునకువచ్చి బృహదంబ్బాసమేతముగా గోకర్ణేశ్వరుని సేవించి వకుళవనప్రదక్షిణము శేశి గోకర్ణతీర్థమందున్ను మంకణతీర్థమందున్ను స్నానం శేశి అంమ్మవారికి సకలాభరణములుంన్ను సమర్పించ్చి శ్రీరంగపట్ణానికివచ్చి ఆదిరంగ్గనాయకుల సేవించ్చి సుముహూర్తమంద్దలి విద్యానగరప్రవేశమై విఠలవిరూపాక్షుల సేవించ్చి కానుకలున్ను అనర్ఘ్యమైనటువంట్టి భూషణాదులున్ను సమర్పించ్చి నగరుప్రవేశమై పెద్దలకుమ్రొక్కి సుముహూర్తమున హజారమునకు విజయం శేశి అప్పాజి మొదలైన సకలసామాజికులనున్ను అల్లుడికొమాళ్లనున్ను రప్పించ్చుక సింహ్వాసకొలువిచ్చి అప్పాజిని రత్నకంబ్బలియందు కూర్చుండ్డబెట్టి రత్నాభిషేకం స్వర్ణాభిషేకం శేశి నాలుగునగల కోకతాకలున్ను యిచ్చి పైసరాలున్ను పచ్చలకడియాలు తాళిచాకట్లు పచ్చలవొంట్లు ముత్యాలతురాయి వజ్రాలకంఠసరం కెంప్పులవుంగ్గరములు యివి మొదలైన భూషణములున్ను యిచ్చి గంధ కస్తూరి తట్టుపునుగు జవ్వాజి మొదలైన పరిమళములచాతలెస్సాయిగా బహుమానములు శేశి తక్కినవార్లకెల్ల తగుపాటి బహుమానములు శేశి సకలవాద్యఘోషములతోడట్టి గజాధిరోహుల శేశి యింట్లకు అంప్పించ్చి అటుపిమ్మట దొరమన్నెవార్లు రాతురాణువ ప్రభుపాళ్యగార్లు అమరనాయకంవార్లు బోయనాయకంవార్లు కైవీతంవార్లను నియ్యోగులను కరణీకులను రాయసాలవార్లను దినసరివార్లను విద్వజ్జనులను కవిజనులను నాటకాలంకారులను దైవజ్ఞులు భేషజులు రవుతులు స్థానాపతులు ఆశ్రితులు భాగవతులు మొదలఇన శ్రేఖైరెంద్దు వినియోగాలవారికిన్ని వుడుగరవక్కలాకులున్ను యిచ్చి ఆదరణగా ఆనతిచ్చి అంప్పించ్చినవారై మరుచునాడు కొలువులోపల యిష్టకథావినోదమైన నగరి నియ్యోగులున్ను కవీశ్వరులు విద్వాంసులు మొదలైన నిండుసభలో సాళువ తిమ్మరసయ్యగారున్ను రాయసం కొండమరసయ్య మొదలైనవాల్లున్ను ప్రసంగ్గంవెంబ్బడిని అంద్దరున్ను మొచ్చినట్లు కవితాచాతుర్యము గలవార్లుంన్ను రాయలవారిని జూచి ప్రసంగ్గంవెంబ్బడిని నీదుకీర్తి శాశ్వతముగా నిలిచేటంద్దులకు ఆదియంద్దు అవనీపతులు కృతులంద్దు రాంగా వాల్లప్రతాపములున్ను కీర్తిన్ని అంద్దరుంన్ను యొంచ్చినట్లు స్వామివారున్ను కృతులంద్దుకొంట్టె కీర్తిప్రతాపములు శాశ్వతముగా నిలుచును గనక తిమ్మరసయ్య అయ్యమరసయ్య కొండ్డమరసయ్య బాచరసు తిప్పరసు అయ్యమరసు మొదలైనవార్లు దెలుపగా రాయలవారుంన్ను చాలాసంతోషబడి

ముక్కుతింమ్మయ్య అల్లసానిపెద్దయ్య మాదనగారి మల్లయ్య మొదలైన కవీశ్వ
రులతో కృతులంద్దుకోవలెనని కవితానాయకులతో పలుకరించ్చి ఆతీరున
అయ్యీని అనంగా కుళ్ళాయి కబ్బాయి తాళి చౌకట్లు చేసరిపేరులు కోకతాక
లుయిచ్చి పారిజాతాపహరణమున్ను మనుచరిత్రాను చెప్పుమని ఆనతిచ్చినారు
గనక స్వామివారికి యీవరకు నడుచు సమాచారములకు వ్రాశి అంప్పించ్చినారు
తర్వాత నడుచునమాచారములకు వెంబ్బడిగావిన్నపించ్చి అంప్పుతునాను కనక
స్వామివారి పాదారవింద్దములయంద్దు సిరంత్తరభక్తియిచ్చి రక్షింప్పగలది.
యీరాయవాచకం చదివినవార్లకు విన్నవార్లకున్ను బుద్ధివివేక విచక్షుణ
ములుగలిగి భాగ్యవంత్తులై యోగశాలులై ఆచంద్రార్కస్థాయిగా సుఖాన
వుంద్దురు. శ్రీరామార్పణమస్తు. శ్రీరామజయం.

రాయవాచకము సమాప్తము.

---

# శాస్త్ర పరిభాష

## గణితశాస్త్రము.* Mathematics.

---

| | |
|---|---|
| మానము, మితి | Measurement |
| ఆయామము | Length |
| విస్తారము | Width |
| సంక్రమణము | The process of halving the sum and the difference of two quantities. |
| ప్రక్షేపకము | Proportional distribution |
| అపవర్తము | The common measure |
| నిరుద్ధము | Lowest Common Multiple |
| వ్యుత్కలితము | The sum of a series diminished by the sum of its first $n$ terms |
| స్థూలఫలము | Approximate result |
| సూక్ష్మఫలము, స్ఫుటఫలము | Accurate result |
| బిందువు | A point |
| సమత్రిభుజము | An equilateral triangle |
| ద్విసమత్రిభుజము | An isosceles triangle |
| విషమత్రిభుజము | A scalene triangle |
| సమచతుర్భుజము | A square or a rhombus |
| త్ర్యస్రము | A right angled triangle |
| చతురస్రము | A square |

[Though Mahaviracharya and others use the above two terms to denote any triangle and any quadrilateral, we find Bhaskara using the same, in most cases, to denote respectively a right-angled triangle and a square. In my humble opinion it is better to follow Bhaskara, because by doing so we may not be in want of terms to express the particular figures in question. We may in that case restrict సమచతుర్భుజము only to a rhombus.]

---

* ప్రమాదీచ ఆషాఢసంచికలోఁ జూడుఁడు.

ఆయతచతురశ్రము, విషమచతురశ్రము An oblong

| | |
|---|---|
| ముఖము | The top side of a quadrilateral |
| ప్రతిభుజము | The opposite side |
| తలము | The foot |
| లంబతలము | The foot of the perpendicular |
| పరిధి, పరిక్షేపము | The circumference |
| త్రిజ్య, వ్యాసార్ధము | The radius |
| దళనరేఖ | The bisector |
| ఆయతవృత్తము, ఉచ్చనీచవృత్తము | An ellipse |
| నిమ్నవృత్తము | A concave spherical surface |
| ఉన్నతవృత్తము | A convex spherical surface |
| ధనురాకృతిక్షేత్రము | A segment of a circle |
| తిమిక్షేత్రము | The area common to two intersecting circles |

[The form, perhaps, suggested the name]

| | |
|---|---|
| గ్రాసము | The greatest width of a *Timi kshetra* |
| బీజము | Data |
| జన్యము | Quaesita |

[These are the terms used by Mahaviracharya in connection with the constructions of triangles and quadrilateral out of given measurements. For our purpose, I think we can extend their sense from the particular to the general]

| | |
|---|---|
| ఇష్టము | A given quantity |

కపిస్థలం - కృష్ణమాచార్యులు.



## II

| | |
|---|---|
| శాస్త్రము | Theory |
| ప్రయోగము | Practice |
| అభ్యాసము | Practice, training |
| కళలు | Arts or fine arts |
| గీతము | Singing or Vocal music |
| వాద్యము | Instrumental music |
| నృత్యము | Dancing |
| ఆలేఖ్యము | Painting |
| పుష్పాస్తరణము | (Making) flower beds |
| ఇంద్రజాలము | Jugglery, conjuring |
| హస్తలాఘవము | Slight of hand |
| సూచీవానము | Needle work |
| సీవనము | Stitching |
| ఊతనము | Patch work or patching |
| విరచనము | Embroidery |
| పుస్తకవాచనము | Recitation |
| తక్షకుడు | Carpenter |
| తక్షణము | Carpentry |
| వాస్తువిద్య | Architecture |
| రత్నపరీక్షా | Testing precious stones |
| ధాతువాదము | Metalurgy, Minerology |
| వృక్షాయుర్వేదము | Botany |
| వర్తిక | Paint brush |
| కలాసమస్య | Problems in art |
| ఏకదేశము | A part |
| ఐకదేశికము | Partial |

| | |
|---|---|
| ప్రకృతము | Relevent, pertinent |
| సమయము | Principle of any science, dogma |
| నిబంధనము | Rule |
| అధికరణము | Subject (of a book &c.), topic |
| దురధ్యేయము | Unreadable |
| అధ్యేయము | Readable |
| ప్రకరణము | Introduction, topic |
| సముద్దేశము | Summary, synopsis |
| సంగ్రహము | Abridgement |
| ప్రవృత్తి | Action, activity |
| నివృత్తి | Abstinence from action, passiveness. |
| సమవాయము | Combination, close union |
| అభిధాయకము | Treating of (as a book) |
| ప్రతిపత్తి | Knowledge, attainment |
| సాంశయికము | Doubtful |
| అభిశంకనీయము | Questionable |
| అనభిశంకనీయము | Unquestionable, certain |
| పురుషకారము, పౌరుషము | Individual or human effort |
| దైవము | Destiny, fate |
| మర్యాద | Standard (of right and wrong in any thing) |

జయంతి రామయ్య.

---

# ప్రకటన

## ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజారావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ - వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీపిఠాపురము రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం ఏ., బి. ఎల్.

,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

,, నెమలి పట్టాభిరామారావు పంతులుగారు బి. ఏ.,

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు. సి. ఐ. ఇ.,

రావుబహదూర్ పిట్టిత్యాగరాయసెట్టిగారు, బి. ఏ.

కార్యస్థానము.

2/7 హారిస్ రోడ్డు, పుదుపేట.

<u>పరిషదుద్దేశము:</u>—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించుట, శాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణపూర్వకముగా నిరూపించులక్షణ శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్య మొనర్చుట, భాషావిషయములఁజర్చించుటకుఁ బత్త్రికనొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

చందానిర్ణయము.

| | | |
|---|---|---|
| 1. ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. పోషకులకు | ,, | 1000. |
| 3. యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. సాధారణసభ్యులకు <u>సంవత్సరమునకు</u> | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్త్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు <u>కార్యదర్శుల</u> పేరవ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# విజ్ఞాపనము.

ఆర్యులారా!

ప్రాచీనంబు నముద్రితంబు నగు విప్రనారాయణచరిత్ర మనెడి యీయాంధ్రప్రబంధము మాపరిషత్పుస్తకాలయమునకు లభించినది. దీనిరచించిన యతఁడు చెదలవాడ మల్లయకవి. ఇతఁడు కవిత్రయములోనివాఁడైన యెఱ్ఱాప్రెగడవంశములోనివాఁడు. లోకంబున వన్నె కెక్కిన శృంగారప్రబంధములలో నొకటి యగుసారంగు తమ్మయ్య రచించిన వైజయంతీవిలాస మనెడి విప్రనారాయణచరిత్రకంటెఁ బ్రాచీన మయినయీగ్రంథమును గవిని గూర్చి విపులమైన పీఠిక ముందుసంచికలోఁ బ్రకటింపఁబడును.

మఱియుఁ బరిషత్తునకు లభించిన పుస్తకమునందు మూఁడునాలుగుచోట్లనైదాఱుపద్యములు లోపించినవి. మఱికొన్నిచోట్లఁ గొన్ని యక్షరములు పోయినవి. అందందు వ్రాఁతతప్పులు మెండుగఁ గలవు. కావున నీవిజ్ఞాపనముం జదివినయే భాషాభిమానులైనఁ దమయొద్దనున్న చెదలవాడ మల్లయకవి రచించిన విప్రనారాయణచరిత్రమును దయతో మాపరిషత్తున కంపినేని వందనములతో నందికొని లుప్తభాగములను వ్రాసికొన్నపిదప వారిపుస్తకమును మరలఁబంపుచుఁ గృతజ్ఞుల మయ్యెదము.

ఆంధ్రసాహిత్యపరిషత్తు
చెన్నపురి. } పత్త్రికాధిపతి.

శ్రీ ర స్తు.

# విప్రనారాయణచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

—* ఇష్టదేవతాదిప్రార్థనము *—

ఉ. శ్రీముకురంబులై ననునుఁజెక్కులఁ బర్వెడుమందహాసరే
ఖామధురాధరప్రభలు గన్నులహైమకరార్కకాంతులుం
దామును వియ్యమంద భువనత్రయ మేలెడురంగశాయి కాం
తామకరాంకు మాకనరనాథునితిమ్మనృపాలుఁ బ్రోవుతన్. 1

మ. తన కాఖేటకసారమేయములు గంధర్వంబు లిచ్ఛావిహా
రనిశాంతంబులు వందిమాగధులు గాఁ బ్రామిన్కులం జేసి ని
త్యనవోన్నత్యముఁ గన్న దేవుఁ డవనీధారేయబాహాభుజం
గునకున్ మాకయతిమ్మశౌరికి నొసంగున్ శాశ్వతైశ్వర్యముల్. 2

చ. గరిమ హిరణ్యగర్భుఁ డయి కావలి గా నిడికొన్నయామికో
త్కరముగతిం గెలంకులను గ్రమ్ముచుఁ దుమ్మెద లుల్లసిల్లఁగా
సరవిని దమ్మిక్రొవ్విరిహజారమునం గొలువుండుభారతీ
శ్వరుఁడు చిరాయురున్నతు లొసంగును మాకయతిమ్మశౌరికిన్. 3

మ. నిను మాయాతరుణి న్వరించునెడ నానెయ్యంపుఁ దోఁబుట్టు విం
దునవోత్తంసుఁడు గట్టఁబోలు గళమందుం దాల్చఁగా ట్టంచు నా
త్మనవీనద్యుతిఁ బొల్చుకౌస్తుభమునుద్యద్భానువుం జూపి వి
ష్ణుని నర్మోక్తులఁ దేల్చుపెద్ద* దయఁ బ్రోచున్ సాళ్వతిమ్మాధిపున్. 4

ఉ. క్రొన్నెలబాసికంబు నెఱికొప్పున వెన్నెల గాయఁ గేలుఁద
మ్మిన్నవరత్నదర్వి నునుమించులు మించఁగ సామజంబుమో
మన్నను గన్నతల్లి తుహినాచలకన్యక యన్నపూర్ణ య
ర్థి న్నిరతంబు మాకవిభుతిమ్మనయింట వసించుఁగావుతన్. 5

శా. తాయిం బద్మభవాపదానములపాటల్ తేట లుప్పొంగఁ జం
దోయిం గచ్ఛపిఁ జేర్చి గోర్మొనలకాంతుల్వింతలై వెన్నెలల్
గాయం దంతులు మీటి ఱాలు గరఁగంగా గానముం జేయుభా
షాయోషామణి తత్కృతీశ్వరునకున్ సంధించు వాగ్వైఖరుల్. 6

* పెద్ద యనుపదము లక్ష్మీదేవి యనునర్థమున నుపయోగింపఁబడెను.

ఉ. తల్లికిఁ బ్రీతిగా సవతితల్లి యటంచును మంచుగట్టురా
యల్లుని శేఖరంబు గుదియు న్నది యింక జలంబు లన్నియుం
జల్లఁ దలంచి శైశవమిషంబున నందఱుఁ బట్టఁబట్టన
ల్లల్లనఁ దొండ మెత్తు గిరిజాత్మజు దంతిముఖుల్ భజించెదన్. 7

గీ. భక్తకోటికిముంగొంగుపసిఁడియగుచు, గరిమఁబురుషార్థసిద్ధులుగలుగఁజేయు
మామకాన్వయదేశికస్వామి యైన, శంకరస్వామిసంయమీశ్వరు భజింతు. 8

క. తవిలి నుతించెద విద్వ, త్కవులన్ వాల్మీకిఁ గాళిదాసు మయూరున్
శివభద్రు బాణు మల్హణు, భవభూతిం జోరు మాఘు భారవి దండిన్ 9

ఉ. ధారఁ జెలంగి నిత్యపరితర్పితరాజరసజ్ఞమై యసా
ధారణభారతాదృతపదంబులు మించి నిరంతరక్షణా
ధారమహామహత్త్వసహితం బగునన్నయభట్టభారతీ
సారసుధారసంబు బుధసంస్తవనీయము గాకయుండునే. 10

క. ప్రాకటనవరసకలనా, సాకల్యము మెఱయుమధురసమధుద్రాక్షా
పాకప్రబంధరచనన్, జోకందగు తిక్కయాయజూకుం దలఁతున్. 11

గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప, నేర్తునే యైన నేను వర్ణింతు నతని
చిన్నిమనుమఁడఁగావునఁజెఱుతవాంధ్ర,కొదలుపలుకులుముద్దుసేయుదురుగాదె?

సీ. ప్రతిభతోనారణ్యపర్వశేషముఁ జెప్పెఁ గవులకుఁ జెవులపండువులుగాఁగ
వల్మీకభవువచోవైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె
నారసింహునిపురాణ మొసర్చి హరిమెచ్చినన్ను నెన్నఁడుచూచినాఁడవనఁగఁ
బ్రౌఢిమై హరివంశభాగముల్ (రెండును) రచియించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న

ఆ. దురితహరుఁ బ్రబంధపరమేశ్వరుని జెద, ల్వాడనిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ, డను నుతింప బ్రహ్మకును దరంబె!

ఉ. ఒచ్చెము లేనిచో వెదకు నొచ్చెము లచ్చటు రాన్యునేనియున్
మెచ్చఁడు విద్యలం గలుగుమేలిమియుం గడువట్టి ప్రజ్ఞచే
నిచ్చకు వచ్చినట్లు చరియించును దుష్కవి తచ్చరిత్ర మే
యచ్చున నెన్ని చూచిన నహా నగుఁబాటుగదా గణింపఁగన్. 14

—* అవతారిక *—

వ. అని యిష్టదేవతా నమస్కరణంబును గురుచరణస్మరణంబును బురాతన మహాకవిస్తుతియునుం గుకవినిరాకృతియునుం గావించి వంశపరంపరాను బంధప్రబంధనిర్మాణహేలాధురీణుండనగుటఁ బద్యగద్యానవద్యంబునుహృద్యం బును సకలసభాసేవ్యంబును గా నొకకావ్యంబు రచియింపంబూని యున్న

యవసరంబున విశ్వవిశ్వంభరాభారధౌరేయనిజభుజాదండుండును మేదినీమీసరగండుండును నిరాఘాటఘాటీమరుజ్జవనకంఖాణరింఖావంఘాత సముద్ధూతధూళీపటలచటులాంధకారఖద్యోతాయమానద్యోతితాదిత్యుండును నిజయశశ్చంద్రచంద్రికాధవళితాశాకటాహుండును విలాసవతీమనోహరరూపరేఖాహల్లకభల్లుండును జౌహత్తమల్లుండును, సకలజనస్తూయమానాసమానదానధారాతరంగిణీమోహితవాహినీకళత్రుండును గఠోరధారావముద్దండదోర్దండకరవాలఖండితాహితసమూహుండును ధరణీవరాహుండును ముఖరితపటుపటహభేరీభూరిభాంకార ప్రతిభయపలాయితప్రతిభట(పట)లావసథాయమాన గిరిగహనగుహాముఖవిముఖశరభసింహశార్దూల వరాహాచ్ఛభల్లుండును జాణూరమల్లుండును నిజచరణశరణాగతవిమత(ధరణీ)పాలబాలికాకరధృతకనత్కనకకలాచికనకాలుకాకర్పూరపేటీవీటీకరండుండును నైవరగండుండును మాకరాజన్యగర్భాబ్ధిరాకాచంద్రుండును నగుతిరుమలరాజేంద్రుండు. 15

మహాస్రగ్ధర. కర్ణాటాధీశదత్తోత్కటవివిధమణీకంకణానర్ఘరోచి
స్స్వర్ణగ్రైవేయభూషాచకచకరుచిరాస్థాన మెల్లం జెలంగన్
నిర్ణిద్రాశేషవిద్యానిపుణకవిసుధీనీతివిద్యాసమాసా
భ్యర్ణుండై భద్రపీఠిం బ్రకటితవిభవప్రౌఢిఁ గొల్వుండి వేడ్కన్. 16

క. వినయోన్నతుఁ గామాక్షీ, జననీనందనుని సరససాహిత్యజనీ
జనకుని నాశ్వేలాన్వయ, జనితుని శ్రీవత్సగోత్రు శైవాచార్యున్. 17

గీ. నన్నుఁ బిలిపించి యర్ధాసనమున నునిచి, యాదరోక్తుల ని ట్లని యానతిచ్చెఁ
జెక్కుదెలుఁగులఁగృతులు చెప్పించుకొంటి, నైననాకొక్క పద్యకావ్యంబువలయు.

ఉ. శాతకృపాణనిర్దళితశత్రుఁడు సాళువనారసింహధా
త్రీతలభర్తయు న్గజపతిప్రముఖుల్ చతురంతయాన భూ
పాతపనీయవస్తువు లొసంగఁ దనర్చిరి నీయనుంగుమ
త్తాతయుఁ దాతయు న్భువి వి(ధా)తలు మల్లనయొజ్జనాహ్వయుల్. 19

శా. రాజుల్ మెచ్చఁగఁ జెప్పి కావ్యములు హేరాళంబుగా నద్రిక
న్యాజాని న్భజియించు నిత్యనియతిం దత్కాలపూజాక్రియా
భ్రాజిష్ణుత్వమునన్ జపించు దినముం బంచాక్షరీమంత్రముం
దేజోవంతుఁడు లింగనార్యుఁడు గుణోత్కృష్టుండు మాతండ్రియున్. 20

క. అనుపమరచనం ద్విపదగ, మును రుక్మాంగదచరిత్రమును మహిమనొన
ర్చినకృతి పెత్తాపెగ్గడ, మనుమఁడ వనఘుఁడవు నీవు మల్లనసుకవీ. 21

వ. కావున విష్ణుభక్తిపరాయణుం డగు విప్రనారాయణుచరిత్రంబొనరించి మదీ యమనోరథంబు సఫలంబు సేయు మని కర్పూరతాంబూలజాంబూనదాంబ రాభరణంబు లొసంగినం బరిగ్రహించి కృతిముఖాలంకారంబుగాఁ దదీయ వంశావతారం బభివర్ణించెద. 22

—* కృతిపతివంశావతారము *—

ఉ. అం(చల) తేరుఁ బల్కుజవరాలును బొక్కిటితమ్మిరచ్చ క్రొ
మ్మించులనీనుమేను నునుమిన్కుపొగడ్తయుఁ (జివ్వ)బోన మా
సించినకాన్పు ముజ్జగముఁ జేసిననేర్పును జన్నిదంబుఁ దీ
వంచమొగంబులుం గలుగువాఁడు చెలంగును వేల్పుఁబెద్ద యై. 23

క. అతఁ డత్రిఁ గనియె నతనికి, సుతుఁడయ్యెను జంద్రుఁ డతనిసుతుఁ డయ్యెబుధుం
డతనికిఁ బుట్టెఁ బురూరవుఁ, డతఁడాయువుఁ గాంచె నహుషుఁ డతనికిఁ గల్గెన్.

ఉ. ఆకమనీయమూర్తికి యయాతి జనించెను దత్కులంబునం
బాకమురాచిరా జనునృపాలుఁడు పుట్టె బలంబు శత్రులుం
టాకముగాఁగ లోకము ననారతనైజభుజాపదానజ
ల్పాకముగాఁగ మించెను దపఃపరిపాకమహత్త్వసంపదన్. 25

క. ఆజనపాలుఁడు గాంచెను, రాజకరాంభోజుఁ దిప్పరాజు నతం డు
ద్వేజితశరణ్యాశరణాం, భోజుం గనె భానుతేజు ముమ్మడిరాజున్. 26

ఉ. ఆపృథివీశరత్నమున కాత్మజులుం బెదమాకరాజు శౌ
ర్యాపరబాహులేయుఁడు గుణాభరణుం జెఱమాకరాజు ల
క్ష్మీపతిరాజు దానగుణశీలుఁడు ముమ్మడిరాజు నెట్టిధా
త్రీపురుహూతుఁ డర్థిసురధేనువు తిమ్మనృపాలచంద్రుఁడున్. 27

క. అందు నెఱమాకమహీపసం, క్రందనుఁ డు కుమారమాకఘనుఁ గాంచె నతం
డిందుముఖీకందర్ప న, రిందము శ్రీరంగనృపవరేణ్యునిఁ గాంచెన్. 28

ఉ. వారలలోన దానగుణవంతుఁడు ముమ్మడిరాజచంద్రుఁ డం
భోరుహబంధుతేజుఁ డతిపుణ్యుఁడు వైరిమదాపహారి దే
వేరులుగా వరించె జనవిశ్రుతరాచమదేవి నంచితో
దారగుణాన్వితం దిరుమలాంబను సౌఖ్యరసైకలోలుఁడై. 29

సీ. ఆపురంధ్రులయందు నగ్రపత్నికి ధైర్యమంథానగిరి యెఱ్ఱమాకరాజు
వెంగళక్షితిపాలపుంగవుండును(1)బట్టుమాకరాకన్న రఘుపతిరాజు
ఘనుఁడు లక్ష్మీపతిక్ష్మాపతి తిప్పరాజేంద్రుఁడుఁ గలిగిరి యితరసాధ్వి
వలనఁ దిమ్మఘనుండు నలరామచంద్రుండు వరదరాజెఱమాకధరణిధవుఁడు

(1) యతిభంగమైనది. నిజమైనపేరు తెలియక దిద్దలేదు.

గీ. జననమును బొంది శాశ్వతైశ్వర్యమహిమఁ, జక్రవర్తులభాతిని షడ్గుణముల
సరణిఁ బురుషార్థములకేవఁజతురుపాయ, ములవిధంబునఁ బ్రఖ్యాతి వెలసిరందు.

క. మానధనుల్ దానస్వ, ర్ధేనుసమానులును నైనతిరుమలదేవీ
సూనులలోఁ దిమ్మమహీ, జాని ఘనుం డయ్యె రామచంద్రునిరీతిన్. 31

తరలము. అతఁడు సంగరరంగమందుఁ గరాసిభిన్నవపుఃపర
క్ష్మితవిరోధికళక్షతక్షతజంపుటేఱులు విక్రమో
న్నతగతిం గలిగించి పేర్చె ననారతంబు మహీతలం
బతులభంగి ననేకశోణనదావృతం బన మించఁగన్. 32

గీ. ఆనృపాలుఁడు తనకు సద్ధాంగలక్ష్మి, యైనబొమ్మలదేవియం దాత్మజులను
గనియె లక్ష్మిపతీంద్రు మాకక్షితీశుఁ, బాపవిభునిం ద్రిమూర్తులపగిదివారి.

వ. అందగ్రజుండు. 34

క. పరమపతిభక్తిగుణసం, భరిత సుజనవినుత మల్లమాంబాదేవిం
బరిణయమై చినతిరుమల, నరపతిఁ గనె విష్ణుకీర్తనప్రవణాత్మున్. 35

శా. ఆలక్ష్మిపతిసోదరుండు నయవిద్యాశాలి మాకావనీ
పాలుం డాదిమదానవర్తనమునం బ్రఖ్యాతుఁడై వైభవ
శ్రీల న్మించెను బంధుజాలమును బ్రోచె న్నీతిచే భూతలం
బేలెన్ వైరులఁ దోలె వింధ్యగిరిమధ్యేకాననశ్రేణికిన్. 36

మ. నృపచూడామణి యావదాన్యగుణశాలీనుండు జన్యక్రియా
నిపుణుల్ డెబ్బదియేడుపాళెములమన్నీ లేకమై బైచగుం
డ్లపయి న్వచ్చినఁ గోట వెల్వడియె లీలన్ గోట(మా)కక్షమా
ధిపుఁ డంచు న్నుతియింప వారి భుజశక్తిన్ గెల్చె సామాన్యుఁడే! 37

మ. అలఘుప్రాభవుఁ డానృపాలుఁ డనసూయారుంధతీతుల్యఁ ది
ప్పలదేవి న్వరియించి కాంచె సుతులం బ్రత్యర్థిధాత్రీధరేం
ద్రులఁ దిమ్మక్షితిజాని బొమ్మనరనాథున్ భీమబాహాబలో
జ్జ్వలు లక్ష్మీపతిరాజుఁ బ్రాక్తనతపస్సంపత్ప్రభావంబునన్. 38

క. ఆభూపాలకులందుం, బ్రాభవశౌర్యప్రతాపభాగ్యోన్నతులన్
శోభిల్లెఁ దిరుమలేంద్రుఁడు, నాభాగదిలీపరంతినహుషులరీతిన్. 39

సీ. విమతగర్వావంధ్యవింధ్యాద్రి కెవ్వానిభీమకరాసి కుంభీభవుండు
త(రుణీజనమ్ముల) తలఁపునెత్తమ్ముల కెవ్వానిసౌందర్య మి(నకరంబు)
సర్వసర్వంసహాశారిక కెవ్వానిబాహుపీఠిక వజ్రపంజరంబు
మినుకుబల్ జెట్టిసాదనకును నెవ్వానిలాలిత(రసన విలాస)ఖురళి

గీ. యతఁడు ప్రెగడోందుజన్యక్రియానుకూల, సకలసన్నాహనదనన్యసాధ్యదుర్గ
గిరివిభేదనమార్గజాంఘికబలుండు, ధీరగుణహారి మాకయతిమ్మశౌరి. 40

మ. హలిబాహాబలశాలి మాకవిభుతిమ్మాధీశుఁ డుద్యద్గుణా
కలితుం డభ్యుదయంబుఁ బొందుట మొదల్గా నర్థివిద్వత్కవీం
ద్రులసద్మంబుల మిత్రమందిరములందున్ బాంధవాచార్యమా
న్యులగేహంబులనుం దడంబడుచు నుండు న్వాంఛియుం బైఁడియున్. 41

ఉ. ఇందిర నంబుజాక్షుఁడు శచీందుముఖిం బురుహూతుఁ డద్రిక
న్యం దరుణేందుమౌళి (యుఁ బ్రియం) బెనఁగ న్వరియించినట్లు గో
విందమదేవి నుజ్జ్వలనవీనగుణాభరణ న్వివాహమ
య్యెం దగ సాళ్వమాకధరణీశ్వరుతిమ్మనృపాలుఁ డిమ్ముగన్. 42

ఉ. ధాక నరాతు లెల్లను వడంకుచుఁ గప్పములీక యానతుల్
గాక నిరంతరంబు నుడిగంబులు సేసెద మంచు నెందొరుల్
రాక భయంబు లేక సమరస్థలిలో నెదిరింప శక్తులే
మాకయతిమ్మభూవరుసమక్షమునన్ శరచాపహస్తులై. 43

గీ. అతులసాహసగుణవిక్రమార్కనిభుఁడుఁ, జండకోదండవిద్యాధికుండు నైన
మాకభూవరుజాలబొమ్మక్షితీశ, వరుఁడు తిప్పమదేవి నుద్వాహమయ్యె. 44

సీ. సత్పాత్రదానప్రశస్తికి శిఖరప్రతిష్ఠగా వినయంబు తేజరిల్ల
నంగనాజనమనోహరలీలకును మేలుబంతిగా నవికారభావ మొప్ప
ధైర్యశౌర్యవివర్ధతకుఁ దలకట్టుగా సాహంక్రియావృత్తి యతిశయిల్ల
సరసమాధుర్యవాక్సరణికి వన్నెగా నతులితసత్యసంధత చెలంగ

గీ. దర్పితాహితధారణీధవమహాప్రతాప, ధానమర్పితవస్తుసాదరకటాక్ష
వీక్షణుండైనమాకభూవిభుకుమార, వరుఁడులక్ష్మీపతిక్షితీశ్వరుఁడు వెలయు.

గీ. పెక్కుమాఱులుపార్వతీప్రియురమాధి, పులకుఁ జేయించెనవలక్షపూజనములు
వరుసఁ జెప్పించికొనియె సంవరణచరిత, మెలమి మాకయలక్ష్మీపతీశ్వరుండు.

క. (చండ)జ్యోత్స్నాపతి ధరణీ, మండితనిజభుజుఁడు గండమండలవిచల
త్కుండలుఁ డహితారుంతుద, కాండుఁడుమాకవిభుతిమ్మ ఘనుఁడు చెలంగున్.

చ. కదనమునందుఁ దిమ్మవిభుఖడ్గముచే హతులైనవారిఁ దా
మెదురుకొనంగ నేసలు వయింబడఁ జల్లఁగ సంభ్రమంబునం
బొదువ సుధారసంబుఁ దమి బువ్వముపెట్టుచు నుండఁగాఁ జుమీ
నిదుర యొకప్పుడుం గలుగనేరదు వేలుపుఁ బేరఁటాండ్రకున్. 48

మ. మహిళానూనశరుండు మాకవిభుతిమ్మక్షోణిపాలుండు పూ
ని హరిప్రీతిగ నర్థితోడ నొసఁగున్ హేమాద్రికల్పోక్తహే
మహయగ్రామమదేభధేనుకధరామాణిక్యముఖ్యంబుగా
సహిరణ్యోదకదానపూర్వముగ నిచ్చల్ భూసురశ్రేణికిన్. 49

చ. అరుదుగ మారుతాశనగళాకృతికిన్ భయమంది ధారణీ
ధరకటకస్థలీకఠినత న్వొలఁగంది దిశామదేభరా
ట్కరపుటభేదనక్రియలు గా వని రోసి ధరిత్రి నిల్చె సు
స్థిరముగ మాకభూవిభునితిమ్మనబాహుపురింధ్రియంబునన్. 50

చ. ఇల నెలకోఁటలందుఁ జరియింపఁగ సౌధము లెక్కఁ జిత్రప
ఙ్క్తులమృగరాజిఁజూడ సమకొల్పుదురౌఁ దమహూర్పు నెయ్యపుం
జెలులకు సాళ్వమాకనృపశేఖరుతిమ్మ నృపాలచంద్రుతోఁ
గలసను మాఱ్కొనంగడఁగు గబ్బివిరోధు లదేమిచిత్రమో! 51

—* షష్ఠ్యంతములు. *—

క. ఈదృగ్గుణగణపేటికిఁ, గోదండకళావహాసితకుంజరరక్షో
భేదికి(సమ)ధికరణయువ, సాదవిధేయునకు విక్రమాజేయునకున్. 52

క. అతులితనుతవితరణయుత, చతురకరోదగ్రునకును సమరా(హూత)
ప్రతిపక్షక్షితిపక్ష, త్యతివక్షఃక్షతజలక్షితాస(హను)నకున్. 53

క దోర్గర్వదళితరిపుకట, కార్గళవర్గునకు శాశ్వతైశ్వర్యకళా
భర్గునకు సాధితాహిత, దుర్గాధ్యక్షునకు శ్రీవధూవక్షునకున్. 54

క. వేదండ...నవకర్ణున, కాదినృపాలప్రతాపహాసదఖలదిశా
మేదురషడ్గుణరేఖా, ప్రాదుర్భవదతులకీర్తిపరిపూర్ణునకున్. 55

క. ఇలరాజదిలీపునకును, సలలితరూపునకు సత్యసల్లాపునకున్
బలవద్విరోధిపార్థివ, కులసంతాపునకు సోమకులదీపునకున్. 56

క. నరనుతకఠారిసాళువ, వరబిరుదాంకునకుఁ గాంతివంచితరాకా
హరిణాంకునకును మాకయ, తిరుమలనరపతికి సారధీగీష్పతికిన్. 57

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన విప్రనారాయణచరి
త్రం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 58

—* కథాప్రారంభము. *—

సీ. ప్రాచీనకంటకప్రకటకుట్టనగళత్పుండ్రేక్షురసఝరాపూరితంబు
సకలజాంతవపిపాసాహారినార్ద్రికేళాంబుసంభృతతటాకావృతంబు
గారుత్మతాశ్మశంకామిళత్ఖేచరపాటలక్రముకశలాటుకంబు
తనుమరుచ్ఛ్యతమహీతలబహుధాభిదేళిమపాంథనాగవల్లీదళంబు
గీ. రంగదురుగోష్ఠరింఖత్కడంగరీయ, జిగమిషాత్వరఖురహతజీర్ణచూర్ణి
తోధమారీచరేణుసంయుక్తదశది, శాప్రదేశంబు చోళదేశంబు వెలయు. 59

క. తిరునాళ్లను దేవులు నన, వరతంబును నంగరంగవైభవములునుం
దిరమగును దేవళంబులఁ, బరఁగఁగ నెఁకకోటి గూయుపల్లియనైనన్. 60

క. అంద మగు భరతఖండం, బందును గాశ్మీరఖండ మనఁ దద్దేశం
బెందును మహిమను రాజ్యము, లందున్ శ్రీరామరాజ్యమనఁగా వెలయున్.

క. ధారణి మండంగుడి యను, పేరం దద్రాజ్యమందుఁ బెంపు దలిర్పన్
వైరించిపురప్రత్యా, హారంబై యొక్క యగ్రహారము వెలయున్. 62

సీ. హుతహావిశ్చర్వణోద్యుక్తులై గీర్వాణపుంగవుల్ గ్రుక్కిళ్లు మ్రింగుచుండ
హవ్యముల్ భుజియింపనలవిగా*కొరులగ్నిసప్తజిహ్వాలకుముచ్చటలుమునుఁగ
మఱవునఁదాఁబితామహుఁడుప్రాఁజదువులుచదువసంధ్యలుసొచ్చిమొదిఁగివినఁగ
సతతాహ్నికక్రియానంశయంబులు దీఱ నందంద బ్రహ్మర్షు లధివసింపఁ
గీ. బరఁగు పరిపక్వఫలభారభరితవిటపి, లసితసురభిళకిసలయప్రసవభసల
విసరలసదుపవనతీర విబుధ......నియవ్విప్ర... 63

క. సాదులనందగు నానా, వేదులు నాగమపురాణవేదాంతకళా
వాదులుఁ జెలఁగుదు రప్పురి, వేదులపై సోమసూర్యవీథులయందున్. 64

క. స్వస్తి యననొల్ల రప్పురి, వాస్తవ్యద్విజులు వస్తువాంఛల ధనదున్
స్వస్తి యనుమాట విన్నను, నాస్తియు నన నొల్ల రందునం గలవిప్రుల్. 65

శా. ఖ్యాతి న్మించి సదక్షిణాకముగ నాహారంబు ధాత్రీసుర
వ్రాతం బందుఁ బసిండిపళ్లెముల ధారాదత్తముల్సేయ న
య్యో తారాధిపమౌళి యేమిటికి రాకున్నాఁడు వే రాఁగ న
య్యాతిథ్యం బొనరింప నీక్షణమె భిక్షాన్నంబు వారింపఁడే. 66

ఉ. ఆనగరంబునం బ్రతిగృహంబున నధ్వరకర్తలైనతే
జోనిధు లెందఱో యెఱుఁగఁ జోద్యము లెప్పుడు చూత మంచు స్వా
హానినదంబులు స్మృతి యజాంచితఘోషము యాయజూకహే
స్వానములుం జెలంగు జితసంజనితాన్యతరస్వనంబులై. 67

* అర్థము సందిగ్ధముగ నున్నది.

# కృష్ణదేవరాయలనాఁటి మూఁడుశాసనములు.



ఆషాఢమాస పరిషత్పత్రికలో "శ్రీకృష్ణదేవరాయలప్రతిమ" యను శీర్షిక గలవ్యాసములోఁ గృష్ణరాయని దేవులగు చిన్నాదేవియు, తిరుమలదేవియు శ్రీవేంకటేశ్వరస్వామికి బంగారుగిన్నెలు సమర్పించినట్లు తెలుపు రెండుశాసనము లున్నట్లు వ్రాసియుంటిమి. ఆశాసనములరెంటి నీక్రింద యథామూలముగఁ బ్రకటించుచున్నారము. ఈశాసనములు రెండుఁను దిరుమలలో శ్రీవేంకటేశ్వరుని యాలయము లోపలిప్రాకారముయొక్క యుత్తరపుగోడమీఁదఁ దూరుపు చివరను జెక్కఁబడియున్నవి. ముందు చిన్నాదేవిశాసనమును దానివెంటనేక్రింద తిరుమలదేవిశాసనమును గలవు. ఈరెంటికిని బ్రత్యంతరములు కన్నడమున నాగోడమీఁదనే పడమటివైపునఁ జెక్కఁబడియున్నవి. బహిర్ద్వారసమీపము నందుఁ గూడ మఱియొకప్రతి గలదు.

ధర్మములు శకవర్షము ౧౪౩౪ టి మీఁద నడచు నాంగిరస సంవత్సరమందు జరగినవి కావున ౧౪౩౫ వ వర్తమాన శకవర్షంబునఁ బుట్టినట్లు గ్రహింపవలయును. రెండవశాసనము చివరభాగములోని వాక్యరచన కొంచెము వ్యత్యస్తముగానున్నది. శాసనములలోని మాఱుమూలపదముల యర్థమువిచారింతము.

<u>ఆనవాలు</u>:-(ఆన + పాలు) ఈశబ్దము దక్షిణదేశమం దధికముగ వ్యవహరింపఁబడుచుండిన ట్లగపడుచున్నది.

"పాలఁబోల్ వయసు నీపాలుసేయుట కిదె యానవాలన్నట్టు లానవాలు'

అనితారాశశాంకవిజయము (ఆ. ౩) ప్రయోగము. దీనికి సీతారామాచార్యులుగారు "ఇవురఁగాఁచినపాలు" అని యర్థము వ్రాసినారు. కన్నడశాసనములో దీనికి "చీలపాల్" అనియున్నది. "చీలపాల్" అనఁగా నప్పుడు పిదికినపాలు. గుమ్మపాలని వ్యావహారికార్థము తెలియుచున్నది. ఆనవాలుశబ్ద మిప్పుడు వ్యవహారములో నెచ్చటనైన నున్నచో నచ్చటివ్యావహారికార్థమును జదువరులు తెలుపుదురుగాక. ఈశబ్దమునకు "ఆనాలు" అనురూపాంతర మున్నట్లు సీతారామాచార్యులుగారు ప్రమాణముఁ గనఁబఱచినారు.

తూకాలు:—ఇది తూఁచుధాతువువలనఁ బుట్టిన విశేష్యవాచక మను ట నిస్సంశయము. భారవిశేషమర్థము. కానియాకాలమునఁ దూకమనివాడఁబడు చుండినభార మీకాలమందు దేనికి సమాన మగునో సాధనాంతరములఁబట్టి నిర్ణయింపవలసి యున్నది.

తట్ట:—అనఁగాఁ బళ్లెరము.

ఉభయము:—అనఁగా సేవ, అర్చనావిశేషము. అనియర్థము. ఈశబ్ద మీయర్థమునందు, తిరుపతి, కాళహస్తి ప్రాంతములందు సాధారణముగా వ్యవహరింపఁబడుచున్నది.

కృష్ణరాయలు శ్రీవేంకటేశ్వరునకు "శాలివాహన శకవరుషాలు ౧౪౩౫ టి మీద నడచే శ్రీముఖసంవత్సర వైశాఖ బ ౧౨ సోమవారాన" అనఁగా ౧౪౩౬-వ వర్తమానశకవర్షమునందుఁ గొన్నియాభరణములు సమర్పించినట్లు తెలుపువేఱొకశాసనముఁగూడ క్రిందఁ బ్రకటించుచున్నారము. ఈ శాసనము పైరెండుశాసనములు గలగోడమీఁదనే కొట్టకొనను దూర్పునుండి పదమటకుఁ బెద్దయక్షరములతో రెండుపఙ్క్తులుగాఁ జెక్కఁబడియున్నవి. రెండవబంతిమాత్రము గోడచివరకుఁబోలేదు. ఎత్తుగానుండుటచే సాధించుటకుఁ గొంత దూరదర్శకయంత్ర (Binoculars) సాహాయ్యముగూడఁ గావలసివచ్చినది. కొన్ని యక్షరములు సున్నములోఁ గప్పువడియుండుటచే నస్పష్టముగా నున్నవి. వ్రాసినంతవఱకుఁ బాఠము సరియైనదియే యని నిస్సంశయముగా గ్రహింపవచ్చును. శాసనములలో నుదాహరింపఁబడిన యాభరణములయొక్కయు మఱికొన్ని యాభరణములయొక్కయుఁ బేళ్లను గుఱించియు స్వరూపములను గుఱించియు ముందు వ్రాయఁదలఁచినారము.

ఒక్కవిశేషము. శాసనము వ్రాయకపూర్వము గోడమీఁద జేగుఱుతో నూళ్లువేసి యానూళ్ల నడుమ నక్షరములు చెక్కిరి. ఆనూళ్లిప్పుడు సైతము కానవచ్చును. నన్నూఱుసంవత్సరములక్రిందట వేసిన జేగుఱునూళ్లు నేఁటివఱకు నిలిచియున్నవా యని సంశయించి యిప్పుడు కనఁబడుచున్న నూళ్లిటీవల వేయఁబడి యుండవలె నని కొంద ఱూహింపవచ్చును. ఈయూహ సహేతుకమైనచో శాసనమే యిటీవలఁ జెక్కఁబడియుండవలెను. లేదా పూర్వము చెక్కఁబడియున్న శాసనపుఁబఙ్క్తులనడుమ నిటీవల నెవ్వరో నూళ్లువేసియుండవలెను. ఈ

రెండు యోజనలును నిరాధారములు నసంగతములును. శాసన మిప్పుడు వ్రాయఁబడినట్లు కన్పడుచున్నచో యప్పుడే వేయఁబడియుండవలెను. వ్రాయుటకుఁ బూర్వమే నూళ్లు వేయఁబడియుండవలెను. శాసనము చెక్కిన స్థాన ముత్తరపుగోడ చిట్టచివర నవఁగాఁ జూరుతాళ్లక్రింద నుండుటచే వర్షాతపముల కంతగా లోను గాకుండెను. ఇదియునుగాక, చూరుతాళ్లవఱకు నాలయము మీఁదిభాగమున బంగారుపూఁతపూసిన రాగిరేకు కప్పఁబడియున్నది. ఈరేకు పూర్వము గోడల పైని మాత్రమేకాక ప్రాకారమధ్యస్థమగు భూభాగమునఁగూడఁ గప్పియుండినట్లు తీర్థవాసులు కొందఱు చెప్పుదురు. దీనికిఁ దార్కాణముగ నడుగునఁ బఱచిన తాతిపలకలు కూడినచోటుల నచ్చటచ్చట రాగిమేకుల తలలు కననగును. ఈరేకులు శాసనములు పుట్టినపిదప వేయఁబడి మఱికొంతకాలమునకుఁ దీసివేయఁబడినట్లు తోఁచుచున్నది. ఈహేతువులనుబట్టిచూడ జేగుఱునూళ్లు 400 సంవత్సరములనాఁటివే యని నిశ్చయింపఁదగియున్నవి.

రమారమి యీకాలమునందేపుట్టి దేవాలయమందు భద్రపఱుపఁబడియున్న కొన్ని రాగిపత్త్రములమీఁద సయితమిట్టి జేగుఱునూళ్లు కానఁబడుచున్నవి. ఈపత్త్రములఁగూర్చి ముందు వ్రాయఁబడును.

జయంతి రామయ్య.

మూలము

శుభమస్తు.—స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషాలు ౧౪౩౪టి విూదనడచే అంగిర సంవత్సర పాగ్గుణ (ఫాల్గున) శు ౧౪లు శ్రీమంన్మహారాజాధిరాజరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర కృష్ణరాయ మహారాయలదేవులు చిన్నాజి అమ్మవారు తిరువేంగళనాధదేవునికి ఆనవాలనైవేద్యం అవసరానకు గింన్నె ౧ కి తూకాలు ౩౭౪ పైడిగింన్నె సమర్పించ నవధరించిరి.

౨.

శుభమస్తు.—స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషాలు ౧౪౩౪ టి విూద నడచే అంగిరసంవత్సర పాగ్గుణ (ఫాల్గున) శుధ౧౪లు శ్రీమంన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణరాయ మహారాయలదేవులు తిరుమలంమదేవులు తిరువేంగళనాధదేవునికి అవవాల నైవేద్యం అవసరానకు పైడిగింన్నె ౧టికి తూకాలు ౩౭౪ పరిమాణాలు అవధరించను సమర్పించిన పైడితట్ట ౧టికి తూకాలు ౧౦౦న్ని తమవుభయముగాను సమర్పించ నవధరించిరి.

3.

శుభమస్తు.—స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహనశక వరుషాలు ౧౪౩౯ టి మీాద నడచే శ్రీముఖసంవత్సరవైశాఖ బ ౧౨ సోమవారాన శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణరాయ మహారాయలు శ్రీతిరువేంగళనాధ దేవునికి సమర్పించిన తిరువాభరణాల స్వరూపాలు..........ప...వింవుదు ధార ౧కి అడ్డిగలు ౫ పిన్నఅడ్డిగలు ౪ కీడ అడ్డిగలు ౮ అంతుఅడ్డిగలు ౧౭టికి పచ్చలు ౧౭౮ ...వజ్రాలు ౫౦౮ కెంపులు ౧౮౮ పడల్లిప్పెడిధార ౧ సహా తూకాలు ౬౬౨ కి వుదుధార ౧ కఠారివ్రెఅ ౧కి పాతవజ్రాలు ౧౩౧ కెంపులు ౩౩౧ నీల ౨ సహాతూకాలు ౧౭౮ యీాక శారికుచ్చు ౧కి ముత్యాలు ౩౨౦౦౦ కుచ్చులమీాది దొడ్డముత్యాలు ౧౭ ఇకుచ్చుమీాది కుప్పి బట్టువకెంపులు ౨౮ సహాతూకాలు ౧౨౮ వుభయం కుచ్చు సహాతూకాలు ౩౨౬ కి కఠారి ౧ నిచ్చళం వుదుధార ౧ కి అడ్డిగలు ౮టికి కెంపులు ౪౩ పచ్చలు ౧౫ వజ్రాలు ౨౦ సహాతూకాలు ౧౬౫ కి వుదుధార ౧ నిచ్చళం కఠారివోఅ ౧కి తూకాలు ౧౩౨ యికఠారి పరజుమీాదికెంపులు ౨౪ సన్నవుముత్యాలకుచ్చు ౧టి సహా కఠారి ౧ మరిని కఠారివోఅ ౧ట్కి కెంపులు ౫౫ పచ్చ ౧ వజ్రాలు ౩౬ట్కి తూకాలు ౮ పట ... ౧ట్కి ముత్యాలు ౪ కుచ్చులు ... వజ్రాలు ౧౧౭.

(౨ వ పంక్తి) కితూకాలు ౮౭। భుజకీర్తిజోటు ౧ కి ముత్యాలు ౩౨౨ కెంపులు ౩౬౦ నీలాలు ౪ పాతవజ్రాలు ౨౪౭ సహాతూకాలు ౫ ౭ ౩ ట్కి భుజకీర్తి జోడు ౧టి నిచ్చళం భుజకీర్తి జోడు ౧ట్కి తూకాలు ౧౮౮ వుభయం భుజకీర్తిజోళు ౨ పట ౧ట్కి అడ్డిగలు ౧౭ రావి ఆకు అడ్డిగలు ౩౦కి ముత్యాలు ౩౦ కెంపులు ౨౧౦ వజ్రాలు ౫౮ పచ్చలు ౫ సహాతూకాలు౨౦౫కి ...౧కి ముత్యాలు ౧౨౨ కెంపులు ౧౮౩ వజ్రాలు ౧౦౪రావిఆకు వెండిముత్యాలు ౩౩ట్కి తూకాలు...తూకాలు ౨౭౬ట్కి పట్టు ౧టి వుభయంపట్టాలు౨। ఉత్సహాదేవళకిరీటాలు ౩కి ముత్యాలు ౪౦౫ పాతవజ్రాలు ౨౮౪ కెంపులు ౮౨౨ వైడూర్య ౧నీలాలు ౬ సహాతూకాలు ౩౮౦ కిరీటాలు యింతవట్టున్ను తమసేవగాను సమర్పించ సవధరించ్చిరి.

# రాయలప్రతిమలు.

గతసంచికలో కృష్ణరాయలయొక్కయుఁ దద్దేవులయొక్కయు విగ్రహముల ప్రతిబింబములఁ బ్రకటించియుంటిమి. ఆవిగ్రహముల కనతిదూరముననే శ్రీవేంకటేశ్వరుని యాలయమందుఁగల మఱిమూఁడువిగ్రహముల ప్రతిబింబముల నిప్పుడు ప్రకటించుచున్నారము. వీనిలో విడిగా నున్నపురుషవిగ్రహము వేంకటపతిరాయలది యని బొమ్మమీఁదఁ జెక్కఁబడియున్న పేరు తెలుపుచున్నది. ఈ ప్రతిమ లోహమయము. ఈవేంకటపతిరాయలు చంద్రగిరి రాజధానిగాఁ జేసికొనినవేంకటపతిరాయలయి యుండును. కడమ స్త్రీపురుష విగ్రహములు రెండు నుశిలామయములు. పేళ్లు లేనందున నవి యెవరిప్రతిమలో తెలియకున్నదిగాని సామాన్యులవి కావని యూహింపవచ్చును. ఇదివఱలోఁ బ్రకటించినట్టియు నిప్పుడు ప్రకటించుచున్నట్టియుఁ బ్రతిమలరూపములను విమర్శించినచో నివి కేవల శిల్పసమయానుసారములుమాత్రమే కావనియు నంతయుఁ గాకపోయినఁ గొంత వఱకైన మూలములఁ బోలియుండవచ్చుననియు నిస్సంశయముగాఁ దోఁపక మానదు.

జయంతి రామయ్య.



# విజ్ఞానచంద్రికాగ్రంథమాల.

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులయౌన్నత్యము!! ఆంధ్రులబుద్ధివైభవము!!

## ఆంధ్రులచరిత్రము.

### రెండవభాగము.

ఇందు క్రీ.శ. 1100 నుండి 1350 వఱకుఁగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపఁబడినది. పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయులవ్రాఁతలు, మొదలగువాని నన్నింటిని శోధించి తెలుఁగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు, ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి, మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములు కలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుఁగులోగాని మఱియే యన్యభాషలోఁగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాత లేఖకులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపఁబడినది. 400 పేజీలు గలిగి మంచికాగితములమీఁదచిన్న యక్షరములతో ముద్రింపఁబడి చక్కనిక్యాలికో బైండు చేయఁబడినయీయమూల్యగ్రంథము మాచందాదారులకు పోస్టేజితో రు. 1—0—0 కును, చందాదారులు కానివారలకు పోస్టేజిగాక రు. 1—8—0 లకును ఇయ్యఁబడును.

**☛ విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపఁబడును.**

చిరునామా:—

ఆ. లక్ష్మీపతి, బి ఏ., ఎం. బి. సి. ఎం.

మేనేజరు.—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట—మద్రాసు.

(గతమాసశేషము. 2.)

దర్పణః । బిల్హణప్రౌఢిసంక్రాంతౌ యథాయోగ్యత్వ మగ్రహీత్ ॥ 3. తత్త్వబ్ర హుకథాకేళిపరిశ్రమనిరంకుశం । తం ప్రశ్రయ ప్రయత్నేన కల్యాణం సమ మీమనత్. (దీనియర్థము, కావ్యరచనయం దతినైపుణ్యము గలవాఁ డని అలకదత్తుఁ డెవ్వని శ్లాఘించుచుండునో, దర్పణమందుఁ బ్రతిబింబమువలె నెవ్వనికవిత్వమందు బిల్హణకవియొక్క వాఙ్మాధుర్యము కానవచ్చునో యెవఁ డనేకవిధము లయినకథల నితిహాసములను గృషిచేయుటలో శ్రద్ధగలవాఁడో యట్టికల్యాణుని మంఖుఁడు సమ్మానించెను.) మఱియొకరీతిగా నప్రసిద్ధుఁ డయినయీయలకదత్తుఁ డనువాఁడు సాంధివిగ్రహికుఁ డనియు నితఁడే కల్యా ణునికిఁ బోషకుఁ డనియు, "బహుకథాకేళిపరిశ్రమనిరకుంశః" అనుదానికి మహాభారతాదికథలయం దభిరుచిగలవాఁ డనియు శ్రీకంఠచరిత్రవ్యాఖ్యాత యగుజోనరాజు వ్యాఖ్యానముఁ జేసియున్నాఁడు. కాని పైని వ్రాయఁబడిన రాజతరంగిణీశ్లోకముల ప్రామాణ్యముంబట్టియుఁ దమతమగ్రంథములయందు మంఖకల్హణులు పరస్పరానుసంధానపరులయి యుండుటంబట్టి యుఁ బూర్వోక్త శ్లోకములయందు వర్ణితుఁ డయినకల్యాణుఁ డనుకవి కల్హణుఁడే యని నాయభి ప్రాయము. ఈకల్యాణశబ్దము ప్రాకృతభాషలో "అధో మనయాం (సం యుక్త స్యాధోవర్తమానానాం లు గ్భవతి। అనాదౌ వర్తమానానాం శేషాణాం ద్విత్వం చ" అను సూత్రప్రకారము-కుల్యా అనునది కుల్లా అనియు, మా ల్యం- మల్ల అని యు నగును. అట్లే కల్యాణశబ్దము కల్లాణ యని యు నగును. ఇదియే యపభ్రంశము మొదలగు మఱికొన్ని ప్రాకృతభాషలలో ల్హా అని యగును. ఇందుకుఁ బ్రమాణము స. పర్యస్యతి—ప్రా. పల్లత్తై లేక పల్హత్తై. ఆచార్యహేమచంద్రుని దేశినామమాల iv అ. 20 శ్లోకము. సం॥ సిల్ల=(Kite)—ప్రా. సిల్లు-బిహారీ. సిల్హ. కావున నిందువలన మంఖుఁడు తనగ్రంథమం దుదాహరించిన కల్యాణుఁడు కల్హణుఁడై యుండుటలో నావం తయు సందేహము లేదు.

కల్హణునికంటెఁ బ్రాచీను లయినచరిత్రకారులు.

కల్హణుఁడు తనతోడికవులవలెఁ దనకవిత్వచాతుర్యమును జూపుటకు స్వక పోలకల్పిత మగుకావ్యమును వ్రాసినయెడల మన మితఁడు చెప్పినచరిత్రమును దెలిసికొనుట కింతగాఁ జర్చింప నవసరము లేదు. కాని తా నేదేశమందు జనించి యామరణాంతము జీవించెనో యట్టిదేశముయొక్క రాజకీయసాంఘిక

స్థితులను రాజ్యతంత్రమందుఁ బలుమాఱు సంభవించుమార్పులను దాఁ గన్నులారఁ జూచి వ్రాసినవాఁ డగుటచే నితనివాక్యము మన కెక్కువ ప్రమాణమయ్యె. తనకంటె ముందు కాశ్మీరదేశచరిత్రమును వ్రాసినగ్రంథకర్తలు పదునొకండుగు రున్నట్లు తా నాగ్రంథముల నన్నిటిని బరిశీలించినట్టు గ్రంథాదియందు వ్రాసియున్నాఁడు. (దృగ్గోచరం పూర్వసూరిగ్రంథా రాజకథాశ్రయాః। మమ త్వేకాదశ గతా మతం నీలమునే రపి) ఈప్రాచీనగ్రంథములన్నిటిలో నీలమతపురాణము ముఖ్య మయినది. పూర్వగ్రంథకర్తలకంటె నితనికొకలాభ మధికముగా నున్నది. వారు తమకు సమకాలికు లయినరాజుల వృత్తాంతము మట్టుకు వ్రాయఁగలిగిరి. వారి కర్వాచీనుఁడయిన యితఁడన్ననో యాయాయి పూర్వరాజచరిత్రమును సంగ్రహించి దేవాలయముల పయి నుండుశాసనములు దానపత్రములు మఱికొన్ని యాధారములవలనను లుప్త మయినచరిత్రభాగములను బూర్తిగా వ్రాసి మధ్యవిచ్ఛేదము లేకుండ రాజకథ నానుపూర్వీసంబద్ధ మయినదానినిగా రచించియున్నాఁడు.

బహుగ్రంథనిర్మాత యగుక్షేమేంద్రుఁడు పదిరెండువేలశ్లోకములతో 'నృపావళి' యను నొకగ్రంథమును రచించెను గాని యాకవి తగినజాగరూకతఁ జూపకపోవుటచే దానియం దనేకస్ఖాలిత్యములు సంభవించెను. దాని వలన నది ప్రమాణము కా దయ్యె. సువ్రతుఁ డనుగ్రంథకర్త 'రాజకథావళి' యను నొకగ్రంథమును వ్రాసెను గాని సులభముగా జ్ఞాపకముంచుకొనుట కతిసంగ్రహముగా వ్రాయుటవలన నదియు నుపయోగింప దయ్యె. సత్య మయినచరిత్ర లేకపోవుటచేఁ గాశ్మీరదేశము నేలినప్రాచీను లయినముప్పదు గురురాజులచరిత్రము బొత్తిగా లోపించినది. (ఆమ్నాయభంగా న్నిర్నష్ట నామకృత్యా స్తతఃపరం। పంచత్రింశన్మహీపాలా మగ్నా విస్మృతిసాగరే) కల్హణుఁడు నీలమతపురాణమునుండి గోవిందుని తరువాత మఱిముగ్గురురాజులను దనగ్రంథమం దమర్చియున్నాఁడు. పాశుపతబ్రాహ్మణుఁ డయినహేలారాజు రచించిన 'పార్థివావళి' యనుగ్రంథమును జదివి పద్మమిహిరుఁ డనుచరిత్ర కారుఁడు అశోకునికి ముందువాఁ డైన లవుఁడుమొదలుగాఁ గలయెనమండ్రు రాజులను దనగ్రంథమందుఁ జేర్చెను.

రాజచరిత్రప్రారంభము.

మొదటిగోనందుఁడు వానితరువాతి రాజులుఁ గలియుగమందు 2268 వత్సరములు కాశ్మీరదేశముఁ బాలించిరి. (అష్టషష్ట్యధికా మబ్దశత ద్వావింశతిం

నృపాః। అపీపలం స్తే కాశ్మీరాన్ గోనందాద్యాః కలౌయుగే) భారతం ద్వాపరాంతేఽభూ ద్వార్తయేతి విమోహితాః। కేచి దేతాం మృషా తేషాం కాలసంఖ్యాం ప్రచక్రిరే। లబ్ధాధిపత్యసంఖ్యానాం వర్షా న్సంఖ్యాయ భూభుజామ్। భుక్తా త్కాలా త్కలే శ్శేషో నాస్త్యేవం తద్వివర్జితాత్। శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే కలే ర్గతేషు వర్షాణా మభూవన్ కురుపాండవాః లౌకికేఽబ్దే చతుర్వింశే శకకాలస్య సాంప్రతమ్। సప్తత్యాఽభ్యధికం యాతం సహస్రం పరివత్సరాః। ప్రాయ స్తృతీయగోనందా దారభ్య శరదా తదా ద్వే సహస్రే గతే త్రింశ దధికం చ శతత్రయం। వర్షాణాం ద్వాదశశతీ షష్టిః షడ్భిశ్చ సంయుతా। భూభుజాం కాలసంఖ్యాయాం తద్వా పంచాశతో మతా। ఋక్షాదృక్షం శతేనాబ్దై ర్యాత్సు చిత్రశిఖండిషు। తచ్చారే సంహితాకారై రేవం దత్తోఽత్ర నిర్ణయః। ఆస న్మఘాసు మునయ శ్శాసతి పృథ్వీం యుధిష్ఠిరే నృపతౌ। షడ్ ద్వికపంచ ద్వియుతః శకకాల స్తస్య రాజ్యస్య. (I. 48-56 శ్లో) భారతయుద్ధము ద్వాపరయుగాంతమందు జరిగిన దని భ్రమఁజెంది కొందఱు గ్రంథకర్తలు గణించిన యేఁబదియిద్దఱురాజుల కాలగణన తప్పని యభిప్రాయపడిరి. కాని యది సరికాదు. రెండవతరంగము మొదలుకొని యెనిమిదవతరంగాంతమువఱకు వర్ణింపఁబడిన రాజులకాలము (అనఁగా రెండవ తరంగమందుఁ జెప్పఁబడిన మొదటియుధిష్ఠిరుఁ డనురాజు రాజ్యభ్రంశకాల మారంభించి కల్హణునిగ్రంథరచనకాలమువఱకు స్థూలదృష్టితో గణించిన యెడల 1328 సంవత్సరములు తేలును. ఈవత్సరసంఖ్యను గణించిన యేఁబదియిద్దఱు రాజులకాలము 2268 ను గలిపినమొత్తమును కల్హణుఁడు తనగ్రంథమును వ్రాసిననాఁటికిఁ గడచినకలియుగాదివత్సరములు 4249 లో నుండి కొట్టివేసిన యెడల 653 శేషము వచ్చును. ఇదియే కురుపాండవులు జీవించిన కాలము. ఇదియే కాశ్మీరదేశచరిత్ర మారంభ మైనకాలము. కల్హణుఁడు తన గ్రంథమును శాలివాహనశకము 1070 కాఁగా లౌకికశకముయొక్క 26 సం॥ లో వ్రాసెను. శకకాలమునకు ముందుగా నున్న 2526 కలియుగాది 653 తో సంవదించును. ఇదియే యుధిష్ఠిరునిపట్టాభిషేకవత్సరము.

యుధిష్ఠిరుఁడు రాజ్యము చేయుచున్నకాలమందు ప్రథమగోనందుఁడు లోకోత్తరప్రతాపముతోఁ గాశ్మీరము నేలుచుండెను. కృష్ణునిశత్రు వైనజరాసంధుఁ డితనియొద్దకు వచ్చి తనకుఁ దోడ్పాటు గావింపు మని ప్రార్థింపఁగా యుద్ధమునకుఁ జని బలరామునిచేఁ జంపఁబడెను. ఇతనితరువాత నీతని

పుత్త్రుఁడు దామోదరుఁ డనువాఁడు రాజ్యము నేలెను. యాదవులు తిన తండ్రిని జంపి రని కోపమ్ముగలవాఁ డైయుండఁగా సింధునదీతీరమం దున్నగాంధారులచే యాదవులు కన్యాస్వయంవరమున కాహూతులై వచ్చి యున్నారని విని వారిపైకి దండెత్తి వెళ్లి కృష్ణునిచక్రవాతిచే మృతి నొందెను. కృష్ణుఁడు వానియందు దయ దలఁచి యాసమయమందు గర్భవతిగా నున్నవానిభార్యకుఁ బట్టము గట్టించెను. కాలక్రమమున నామె గర్భమం దుదయించిన కుమారునికి గోనందుఁ డనునామ మిడి మంత్రులు వానిని రాజుఁ జేసిరి. ఈతనిశైశవమందే కురుపాండవయుద్ధము జరిగెను. ఆనాఁటి కీతఁడు యుద్ధయోగ్యత లేని బాలుఁడై యుండుటచే వీనిని గౌరవులు గాని పాండవులు గాని సహాయము సేయు మని కోరలేదు. లిఖితచరిత్ర మెచ్చటను లేకుండుటచే వీనితరువాత రాజులు ముప్పదియయిదుగురు నష్టనాములై విస్మృతిసాగరనిమగ్నులయిరి. పిమ్మట లవుఁ డనువాఁడు రాజ్యధురము వహించెను. వీఁడు లోలోర మను నగరమును నిర్మించెను. వీనియనంతరము వీనికుమారుఁడు కుశుఁడు రాజ్యభారమును ధరించెను. వీనికొడుకు ఖగేంద్రుఁడు; వీనిపుత్త్రుఁడు సురేంద్రుఁడు. ఈ సురేంద్రుఁ డపుత్త్రుఁడై చనుటచే నన్యగోత్రజాతుఁ డొకఁడు సింహాసన మెక్కెను. వాని పేరు గోధరుఁడు. వీనిసుతుఁడు సువర్ణుఁడు. వీనికి శశీనరుఁడు పుట్టెను. ఈశశీనరునికిఁ బుత్త్రులు లేకపోవుటచే వీనిపితృవ్యపుత్త్రుఁ డశోకుఁ డనువాఁడు సింహాసన మలంకరించెను. వీఁడు జైనమతావలంబి. కాశ్మీరదేశపు రాజధాని యైనశ్రీనగరము గట్టించినప్రభు వితండె. ఇతనిరాజ్యపాలనకాలమందు దేశము మ్లేచ్ఛోపద్రుతము కాఁగా శివు నారాధించి సకలశత్రుసంహారకుఁ డైనతనయుఁ బడసెను. అతనిపేరు జలౌకుఁడు. ఇఁతడు తనదేశము నుండి మహమ్మదీయులఁ బాఱఁదోలి దేశమునకు స్వాస్థ్యము నాపాదించెను. కాన్యకుబ్జము లోనగు ననేకదేశములను జయించెను. వీనివిషయమయి కల్హణుఁడు స్తావకములుఁ గల్పితములు నగు ననేకకథలఁ జెప్పెను గాని యవి యంత విశ్వసనీయములు కావు.

ఈజలౌకునియనంతరము హుష్క జుష్క కనిష్క లనుముప్పురు రాజులు రాజ్యమునకు వచ్చిరి. వీరు ముప్పురు జాతిచేఁ దురుష్కు లయినను బరమధార్మికు లయి ప్రజలఁ బాలించిరి. ఈముప్పురు స్వనామాంకితము లగు మూఁడుపట్టణములఁ గట్టించిరి. ఇంతకు ముందు చెప్పఁబడిన కాశ్మీరదేశపు చరిత్ర పురాణకథలవలెఁ గేవలవిశ్వాసైకనిబంధన మైయుండుట తప్ప సత్య

మయినచరిత్ర యని ఋజువుచేయుటకుఁ దగినలేఖనప్రమాణములు గాని, నాణెములు శాసనములు మొదలగు నితరవిజాతీయప్రమాణములు గాని లేక యుండెను. కాని పైనిఁ జెప్పఁబడిన ముగ్గురురాజులతో వాస్తవ మయిన దేశచరిత్ర ప్రారంభ మయినది. వారిలోఁ గడపటివాఁ డైనకనిష్కుఁ డను వాఁడే పూర్వకాలమందుఁ బశ్చిమోత్తరహిందూస్థానము నేలిన హిందూసిధి యనుప్రభు వగుకుసనుఁ డని బౌద్ధులగ్రంథములవలనను నాణెములవలనను శిలాశాసనములవలనను జిరకాలముక్రిందటనే ఋజువుచేయఁబడినది. హు ష్కునికి హువిష్కుఁ డనునామాంతర మున్నట్లు కొన్నినాణెములవలనను శాసనములవలనను దేలినది. వీరు మువ్వు రేకకాలమందే రాజ్యముఁ జేసి రనియుఁ దురుష్కజాత్యుత్పన్ను లనియు మహాప్రభావసంపన్ను లనియు బౌద్ధ మతసంవర్ధకు లనియుఁ గల్హణుఁడు చెప్పుచున్నాఁడు. ఈయంశము లన్నియుఁ జరిత్రతో సంబద్ధమయినలేఖనప్రమాణములసాక్ష్యమువలన యథార్థ మని సమర్థింపఁబడినవి. కాశ్మీరదేశము కుసనవంశపువారిచేఁ బాలింపఁబడిన పెద్ద రాజ్యములో నేకదేశ మయి యుండె ననునంశము బౌద్ధగ్రంథములవలనను గాశ్మీరదేశములో నచ్చటచ్చటఁ బాడువడిన స్థలములయం దిప్పటికిఁ గనుపడు కనిష్క హువిష్క నామాంకితము లయిన రాగినాణెములవలనను, తామ్ర శాసనములవలనను స్పష్ట మగుచున్నది. ఈతురుష్కప్రభువులకాలమందుఁ గాశ్మీరములో బౌద్ధమత ముచ్చదశ నొందెను. చీనాదేశపు యాత్రికుఁ డైన హుయాన్‌థసాంగు కాశ్మీరమునకుఁ బోయినపు డీకనిష్కుఁడు రాజ్యముఁ జేయుచున్నట్లు కల్హణుఁడు వ్రాసెను. ఈరాజులకాలము బుద్ధుఁడు నిర్వాణము నొందినసమయ మని బౌద్ధులగ్రంథములవలనఁ గనుపడుచున్నది.

## మొదటి అభిమన్యుఁడు.

తురుష్కరాజులతరువాత నభిమన్యుఁడు ప్రజాపాలనభారమును వహించెను. ఇతఁడు బౌద్ధమతద్వేషి. చాంద్రీవ్యాకర్త యగుచంద్రుఁ డనుపండితునిఁ దనయాస్థానమం దుంచుకొని తనరాజ్యమందుఁ బతంజలిమహాభాష్యప్రవచన ముఁ బ్రవర్తింపఁజేసెను. ఇతనినాఁడు దుష్టబౌద్ధులు ప్రబలి నాగార్జునుఁ డను వానిని దమకు నాయకునిఁగా నేర్పఱచుకొని దేశమం దున్నవైదికాచారము లను నశింపఁజేయఁ దొడఁగిరి. అందుపైని దేశాధిదేవత లయిననాగులు కుపితులయి యాఱుమాసము లెడతెగని మంచువానఁ గురిపించి బౌద్ధుల నందఱ రూపుమాపిరి. అభిమన్యుఁ డాయాఱుమాసములు శీతబాధ నోర్వ

లేక యొకపర్వతగుహలో దాఁగియుండెను. కాశ్మీరదేశపునాగుల కధిపతి యయిననీలాంగునిసహాయముచే నొకభూసురోత్తముఁడు భ్రంశము నొందిన వైదికాచారముల మరలఁ బ్రతిష్ఠింపఁజేసి దేశమునకు హిమపాతభీతిఁ దొలఁగించెను.

## మూఁడవగోనందుఁడు.

కాశ్మీరదేశము నేలినరాజులయవిచ్ఛిన్నవంశావళి యీమూఁడవగోనందునితో నారబ్ధ మగుచున్నది. ఇతఁడే గోనందీయవంశప్రతిష్ఠాపకుండు. ఇతని తరువాత రాజులు మొదటివిభీషణుఁడు ఇంద్రజిత్తు రావణుఁడు ద్వితీయవిభీషణుఁ డని నలుగురు అత్యల్పకాలమే భూమిఁ బాలించిన ట్లున్నది. పిమ్మట కింనరుఁ డనునామాంతరముగల నరుఁ డనువాఁడు రా జయ్యెను. ఇతనిని గూర్చి యొకకల్పితకథ కల్హణుఁడు వ్రాసెను. కాని యది చరిత్రోపయోగి కానందున నిచట విడువఁబడినది. ఇతనిపుత్త్రుఁడు సిద్ధుఁ డనువాఁడు మహాతపశ్శాలి యనియు సశరీరస్వర్గగమనశక్తుఁ డనియుఁ జెప్పఁబడియున్నది. ఇతని తరువాతివారు ఉత్పలాక్షుఁడు, హిరణ్యాక్షుఁడు, హిరణ్యకుఁడు, వసుకులుఁడు ననువారు నలుగురు క్రమముగా రాజ్యముఁ జేసి కీర్తిశేషు లయిరి.

## మిహిరకులుఁడు.

ఇతఁడు వసుకులునితనయుఁడు. ఇతనివృత్తాంతము కొంతమట్టుకుఁ జరిత్రముతో సంబంధించియున్నది. ఇతఁడు క్రీస్తు వెనుక 515 సంవత్సరములో పిత్ర్య మయిన ప్రాజ్యరాజ్యమున కధిపుఁ డయ్యెను. అప్పు డితని రాజ్యము మధ్యహిందూస్థానము మొదలుకొని కాబూలుపర్యంతము వ్యాపించియుండెను. ఇతఁ డనేకదేశములపయి దండెత్తి వెళ్లి వానిని జయించుచు వచ్చెను గాని క్రీస్తువెనుక 530 సంవత్సరములో మగధదేశపురాజగు బాలాదిత్యునిచేతను యశోధర్మునిచేతను బరాజితుఁడై స్వదేశమునకుఁ బఱచెను. వీఁడు బహుక్రూరుఁడు. వీఁడు మూఁడుకోట్లమందిని వధించె నని కల్హణుఁడు, నరహత్యాపరుఁ డని చీనయాత్రికుఁడుఁ జెప్పుచున్నారు. దారదులు, భాట్టులు, మ్లేచ్ఛులు దేశము నాక్రమించి యార్యాచారములఁ బాడుచేయఁగా నీమిహిరకులుఁడు తనప్రతాపముచే వారిని దేశమునుండి వెడలఁగొట్టి పూర్వాచారముల మరల స్థాపించెను. బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నొసంగెను. ఇట్టివాఁడు తుదకు రోగార్దితుఁడై రోగపీడ సహింపలేక తనదేహము నగ్నికాహుతి యొనర్చెను. ఇతఁడు డెబ్బదివత్సరము లేలెను.

తరువాత నితనిపుత్త్రుఁడు బాకుఁడనువాఁడు రాజ్యపాలకుఁ డాయెను. ఇతఁడు మిక్కిలి సజ్జనుఁడు. అఱువదిమూఁడుసంవత్సరముల పదుమూఁడుదినములు రాజ్యము చేసి కొంత కొక యోగీశ్వరిచేఁ జంపఁబడెను.

వీనికుమారుఁడు క్షితినందుఁడు తండ్రియనంతరము పట్టాభిషిక్తుఁ డయ్యెను. ముప్పదిసంవత్సరములు రాజ్యముఁ బాలించి యమరత్వము నొందఁగాఁ దత్పుత్త్రుఁడు వసునందుఁడు రాజ్యధూర్వహుఁ డాయెను. ఇతఁ డేఁబదిరెండువత్సరములు రెండుమాసములు రాజుగా నుండెను. వీనికొడుకు ద్వితీయనరుఁ డఱువదిసంవత్సరములు వానికుమారుఁ డక్షుఁ డఱువదివత్సరములుఁ బాలించిరి. ఈనలుగురికాలమందుఁ జెప్పఁదగినవిశేషము లెవ్వియు లేవు. అనంతరము గోపాదిత్యుఁడు రా జయ్యెను. ఇతఁ డెన్నియో మంచిపనులఁ జేసెను. యజ్ఞములయందుఁ దప్ప నితరసమయములయందు జంతువిశసనముఁ జేయఁగూడ దని తనరాజ్యమందుఁ జాటించెను. అఱువదివత్సరముల యాఱు దివసములు భూమిని బాలించి యితఁడు లోకాంతరగతుఁ డాయెను. వీనిపుత్త్రుఁడు గోకర్ణుఁడు. ఇతఁ డేఁబదియేడువత్సరముల పదునొకండుమాసములు రాజయి యుండి దేవభూయము నొందెను. తరువాత వీనికుమారుఁడు భింభిలుఁ డనునామాంతరము గలనరేంద్రాదిత్యుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు ముప్పదియాఱువత్సరముల మూఁడుమాసముల పదిదినములు రాజ్య మేలెను. వీనితరువాత రాజయినవాఁడు యుధిష్ఠిరుఁ డనువీనిపుత్త్రుఁడు. వీఁడు చిన్నకన్నులుగలవాఁ డగుటచే లోకులు వీనిని అంధయుధిష్ఠిరుఁ డని వాడుకచేసిరి. కొంతకాలము పూర్వభూపాలపద్ధతి ననుసరించి రాజ్యముచేసి తుద కభాగ్యవశమున దుర్బుద్ధిగలవాఁడయి దుష్టసహవాసమునకు లోపడి యపథప్రవృత్తిగలవాఁ డయ్యెను. అది చూచి కొందఱు బుధులు యోగ్యులయినమంత్రులు వానిని విడిచిరి. రాజద్రోహతత్పరు లగుదుర్మంత్రు లిదియే మంచియదన నని రంధ్రాన్వేషు లగుభూమ్యనంతరులతోఁ గలిసి కుట్రచేసి రాజ్య మపహరించుటకుఁ బ్రయత్నించిరి. ఇంతలో నీరాజు రాజ్యశైథిల్యమును జూచి ప్రాణభీతి గలవాఁ డయి శ్రీనగరమును విడిచి దూరముగాఁ బోయెను. ఇతనితో గోనందవంశ మంత మయ్యెను.

ద్వితీయతరంగమందుఁ జెప్పఁబడినరాజులలో నార్గురు, గతించిన గోనందవంశముతో లేశము సంబంధము లేనివారు నితరవంశములయందుఁ బుట్టినవారు నై యున్నారు. వారిలో మొదటివాఁ డైనప్రథమప్రతాపాదిత్యుఁడు

విక్రమాదిత్యునిసంబంధి యనియు రాజమంత్రులచేఁ బైదేశమునుండి కాశ్మీర
మునకుఁ దేఁబడె ననియుఁ బ్రాచీను లయినకాశ్మీరచరిత్రకారులచేఁ జెప్పఁబడి
యున్నది. శకజాతివారిని సంహరించి శకారి యనుపేరుఁ బొందినవిక్రమాది
త్యుఁడే యీప్రతాపాదిత్యునిబంధు వగువిక్రమాదిత్యుఁ డని చెప్పు నాప్రాచీ
నులయభిప్రాయమును గల్హణుఁడు ఖండించియున్నాఁడు గాని హిందూదేశ
చరిత్రతో సంబంధించియున్న యనేకవిక్రమార్కులలో నితఁ డెవ్వఁడో నిర్ధా
రణ చేసి వ్రాయ లేదు. ప్రతాపాదిత్యునిసంబంధి యగునీవిక్రమాదిత్యుఁడు
ప్రతాపాదిత్యుఁడు క్రొత్తగా రాజ్యమునకు వచ్చుసమయమందుఁ గ్రీస్తు వెనుక
నాఱవశతకముయొక్క పూర్వార్థమం దుజ్జయినీదేశముఁ బాలించిన హర్షవర్ధన
విక్రమాదిత్యుఁ డై యుండవచ్చు నని మన మూహింపవచ్చును. ఈప్రతాపా
దిత్యుఁడు నీతనికుమారుఁడు జలౌకుండును జెఱిముప్పదిరెండువత్సరములు
న్యాయోత్తరముగా భూమిఁ బాలించిరి. వీరితరువాత రాజ్యమునకు వచ్చిన
వాఁడు తుంజీనుఁడు. ఇతనిరాజ్యపరిపాలనకాలమందు సంభవించినమహా
క్షామము తప్ప వ్రేలు మడఁచి చెప్పఁదగినగొప్పసంగతి మఱేదియు లేదు.
ఇతఁడు రాజ్యముఁ జేయుచుండఁగా నొకసంవత్సరము భాద్రపదమాసములో
నమితమయిన మంచుపడి సస్యము లన్నియుఁ జెడుటవలన దేశమం దంతట
ఘోరదుర్భిక్షము వాటిల్లెను. జనులు క్షుధార్తులయి తల్లిదండ్రులు, అన్న
దమ్ములు. అక్కసెల్లెండ్రు, ఆలుబిడ్డలు ననుసంబంధమును బ్రేమను విడిచి
యొకరినొకరు జంపి భక్షింపసాగిరి. పాపము సధర్ముఁ డగునీతుంజీనుఁడు తనకు
ద్రవ్య మున్నంతవఱకుఁ బ్రజల కన్న మిడి రక్షించెను. తనయొద్ద నున్నధన
మంతయు వ్యయము కాఁగా నేమి చేయుటకుఁదోఁపక యాత్మహత్య చేసికొనుట
కుద్యతుఁడై యున్నతఱి నితనిభార్య భర్తృదురవస్థ నెఱింగి దేవతలను బ్రా
ర్థించి ప్రతిగృహమందు మృతకపోతసంఘములు పడునట్లు చేయించెను. ప్రజలు
వానిని భక్షించి ప్రాణములను నిలువరించుకొనఁగాఁ దుహినవర్షము శాం
తించి వర్షములు కురిసి దేశము సుభిక్ష మాయెను. తుంజీనుఁడు నాత్మవధ
నుండి విరమించెను. ఇతఁ డిరువదియాఱువత్సరములు భూమి నేలెను. నాట్య
శాస్త్రకోవిదుఁ డగుచందుఁ డనుమహాకవి యితనియాస్థానము నలంకరించి
యుండెను. ఇతనితరువాత నితనివంశస్థుఁడు గానివిజయుఁ డనువాఁడు రా
జాయెను. వీనిపుత్త్రుఁడు జయేంద్రుఁడు. వీనిమంత్రి సంధిమతి. ఆర్యరాజు.
క్రూరుఁ డగుజయేంద్రునిచేఁ జంపఁబడిన వీనిని యోగినులు తమయోగ

ప్రభావముచేఁ బునరుజ్జీవితునిఁ జేసి రనియు రాజు మృతినొందినపిమ్మట నారా జ్యముం జేకొని నలువదిసంవత్సరము లవిశ్రాంతముగా నేలి రనియు నొకకథ కలదు. ఇతఁడు రాజనీతినిపుణుఁడు. కుశాగ్రీయబుద్ధి. ఇట్టిబుద్ధిమంతునివలన నీ కెన్నఁడయిన నపాయము గలుగు నని కొందఱు దుర్జనులు బోధింపఁగా రా జామంత్రిని నిష్కారణముగాఁ దనసమ్ముఖమునకు రావల దని యాజ్ఞాపించెను. దానివలన రాజసేవకుల కందఱకు నితనిపై ద్వేషము బల మయ్యెను. ఇట్లుండఁగాఁ దుంజీనునినగరములో స్వల్పకాలములో సంధిమతి యీరాజ్యపరి పాలకుఁ డగు నని యొకయశరీరవాక్కు ప్రతిగృహమందుఁ బ్రతిమనుజునికి విన వచ్చెను. రాజాప్తులవలన నామాట విని భయపడి సంధిమతిని జెఱసాలయం దుంచెను. పదియేండ్లు గడచినపిమ్మట నారాజునకు మృత్యు వాసన్న మా యెను. అపుడు మరణవేదనచే బాధ నొందుచున్నను రాజు సంధిమతిని జంపి నఁగాని తనప్రాణములు సుఖముగఁ బో వని నిశ్చయించి వానిని శూలమం దుంచు మని యుత్తరు వొసఁగెను. వధకర్త్రాధికారులు నృపాజ్ఞానుసారముగా సంధిమతిని వధ్యస్థానమునకుఁ గొనిపోయి శూలమం దెక్కించి చంపిరి. అంత నతనిగురు వైనయీశానుఁ డనువాఁ డీదుర్వార్తను విని విషణ్ణుఁడై వానిశవ మును జూచుటకు శ్మశానమునకుఁ బోయి యచటఁ గాక, కంక, గృధ్రాదులచే భక్షింపఁబడుచున్న యస్థికంకాళమును జూచెను. అతనిఫాలాస్థియందు విధాతృ లిఖిత మయిన "యావజ్జీవం దరిద్రత్వం దశవర్షాణి బంధనం। శూలస్య పృష్ఠే మరణం పునా రాజ్యస్య పాలనం" అనుశ్లోకమును జదివి యాశ్చర్యపడి శ్లోక ముయొక్క మూఁడుపాదములయం దున్నసంగతులు వాస్తవము లగుటఁ జూచి యితఁడు తిరుగ రాజ్య మనుభవించుట గూడ యథార్థ మగు నని నమ్మి యే మగునో చూచెద నని కుతూహలముతో నచటనే వేచి యుండెను. అంతట నర్ధరాత్రమందు దివ్యమయిన ధూపగంధ మాఘ్రాణింపఁబడెను. మఱికొంత వేళకుఁ గొందఱు దివ్యస్త్రీ లచటికి వచ్చి యాసంధిమతిశరీరము నొకచెట్టు నొద్దకుఁ గొనిపోయి వానియవయవముల నతుకుట యీశానుఁడు చూచెను. ఇట్లు ముహూర్తమాత్రములో సంధిమతి దివ్యయోగినీప్రభావముచేఁ బూర్ణ సర్వాంగుఁడై నిద్రనుండి లేచినవానివలె దిగ్గున లేచెను.

మూఁడవతరంగములోఁ బ్రతిపాదింపఁబడినరాజులలో మొదటివాఁడు మేఘవాహనుఁడు. ఇతఁడు గోనందవంశస్థుఁడు. ఇతనితోఁ గాశ్మీరదేశము తిరుగ గోనందవంశస్థులయేలుబడిలోనికి వచ్చెను. ఈమేఘవాహనుఁ డంధ

యుధిష్ఠిరునిమనుమఁడు. గోపాదిత్యునికుమారుఁడు మంత్రులచే నాహూతుఁడై తాతముత్తాతలచేఁ జిరకాల ముపభుక్త మయినకాశ్మీరరాజ్యముఁ దిరుగ స్వాధీన పర్చుకొనెను. ఇతఁడు ప్రాణిహింసాపరాఙ్ముఖుఁడు బౌద్ధమతపక్షపాతియు ననుటకు సాక్ష్యముగా యజ్ఞములయందుఁగూడఁ బశుహింసను మాన్పినట్లు ననేక బౌద్ధవిహారములను స్వదేశమందుఁ గట్టించినట్లును జెప్పఁబడియున్నది. ఇతని భార్య అమృతభవ. వీనిపుత్త్రుఁడు ప్రవరసేనుఁడు, తుంజీనుఁడు ననునామాంతరములుగల శ్రేష్ఠసేనుఁడు. వీనికి హిరణ్యుఁడు తోరమాణుఁ డని యిద్దఱుపుత్త్రులుద్భవించిరి. వీరిలో మొదటివాఁడు హిరణ్యుఁడు తండ్రితరువాత రాజ్యమేలెను. యువరాజగుతోరమాణుఁడు తనపేరుతో నాణెములను ముద్రించుటచే నపరాద్ధుఁ డయి జ్యేష్ఠసోదరునిచే జీవితకాల మంతయుఁ జెఱసాలలో నుంపఁబడెను. ఈసమయమందు వాని కొకపుత్త్రుఁడు పుట్టెను. ఈ బాలుఁడు రహస్యముగాఁ బెంచఁబడి ద్వితీయప్రవరసేనుఁ డనునామముతో సింహాసన మెక్కెను. హిరణ్యుని గుఱించి వాస్తవచరిత్రమును దెలిపెడుప్రమాణము లెవ్వియును మనకుఁ గానరావు. కాని తోరమాణనామాంకితములయినతామ్రనిష్కములు కాశ్మీరములో నిప్పటికిని విస్తారముగా దొరకుచున్నవి. ఇట్టినాణెములు హిందూదేశచరిత్రముయొక్క యాథార్థ్యమును గనుఁగొనుటకు ముఖ్యాధారములుగా నున్నవి. ఈనాణెములతో సంబంధించిన తోరమాణునే మిహిరకులునితండ్రి యగుతోరమాణుఁ డనియు నతఁడు పంచమశతకాంతమందు పాంచాలదేశమును కాశ్మీరము నేలినాఁ డని బుజువు చేయనగు నని కొందఱు చరిత్రకారు లూహించుచున్నారు. కాని యీ సంగతి నిజ మయినయెడలఁ గుమారుని కేడువందలసంవత్సరములు తరువాతఁ దండ్రి యుండె ననునసందర్భపువ్రాఁత వ్రాసినాఁ డని కల్హణునిపై మనము నింద మోపవలసినచ్చును. కాశ్మీరదేశము నేలిన రాజులకోవలో నాపేరుమోసినవాఁడు మఱియొకతోరమాణుఁ డై యుండఁబోలును. ఇది తురుష్కశబ్ద మయినను దశమశతకాంతమువఱకును గాంధారరాజు తోరమాణుఁ డనుపేరు పెట్టుకొన్నట్లు కల్హణుఁడు వ్రాసియున్నాఁడు. తుద కీతోరమాణుఁడు చెఱలో నుండియే కాలము చేసెను. ఆసమయమునకు యుక్త వయస్సు వచ్చిన వీనికుమారుఁడు ద్వితీయప్రవరసేనుఁడు కాశ్మీరమును విడిచి తీర్థయాత్రాసక్తిచే దేశాటనము సల్పెను. వీనిజ్యేష్ఠపితృవ్యుఁడు హిరణ్యుఁడు ముప్పదిసంవత్సరములు రాజ్యముచేసి సంతతిలేనివాఁడై స్వస్థినితి నొందెను.

హిరణ్యునిమరణము ద్వితీయప్రవరసేనుఁడు రాజ్యమునకు వచ్చుట యనునీరెంటికిని మధ్యకాలమందు మాతృగుప్తుఁ డనుకవీశ్వరుఁ డొకఁడు కాశ్మీరము నేలినట్లు కల్హణుఁడు చెప్పియున్నాఁడు. ఈమాతృగుప్తునివృత్తాంతము వాస్తవచరిత్రానేకాంశముల ననుమేయించుటకు ముఖ్యాధారముగా నున్నది. కాశ్మీరమందు హిరణ్యుఁడు మృతి నొందినకాలములో (తత్రానేహ స్యుజ్జయిన్యాం శ్రీమాన్ హర్షాపరాభిధః। ఏకచ్ఛత్ర శ్చక్రవర్తీ విక్రమాదిత్య ఇ త్యభూత్) ఉజ్జయినియందు హర్షుఁ డనుమఱియొకపేరు గలవిక్రమాదిత్యుఁ డేకచ్ఛత్రాధిపత్యముతో రాజ్యము నేలుచుండె. ఈసమయమందు మాతృగుప్తుఁ డనునొకదరిద్రభూసురుఁ డుజ్జయిని కేతెంచి హర్షనృపతివిద్వత్పక్షపాతమును, బరగుణగ్రహణచాతుర్యమును విని చిరకాల మాశ్రయించెను. తన సామర్థ్య మాతఁడు గ్రహించునట్లు చేసినప్రయత్నము లన్నియు విఫలము లయినను నాశాబద్ధుఁడై విడువక యాతనికటాక్షమును సంపాదించుట కహర్నిశములు వేచియుండెను. శీతకాలములో నొకనాఁటిరాత్రి నిశీథసమయమందు హర్షుఁడు నిద్రమేల్కాంచి నిద్రాభవనమందు శీతానిలముచేఁ గంపించుచు నాఱిపోవుటకు సిద్ధముగా నున్నదీపములను జూచి వానిఁ బ్రజ్వలింపఁ జేయుటకు "ఎవరచ్చట"నని తనభృత్యులఁ జీరఁగా వారందఱు నిద్రాపరవశులయి యుండుటచే నెవ్వరు మాఱు వలుకలేదు. అపుడీమాతృగుప్తుఁడు "ఏమియాజ్ఞ? దేవరయానతిం డిదిగో వచ్చుచున్నాఁడ" నని (ప్రత్యుత్తర మొసఁగెను.) ద్రుతగతితో రాజసమ్ముఖమున కేగెను. రాజు చూచి రాత్రి యింక నెంత మిగిలి యున్న దని ప్రశ్నించెను. అందుపై మాతృగుప్తుఁడు వెలుపలికి వచ్చి యంతరిక్షమం దున్న నక్షత్రములగతిఁ గనిపెట్టి సార్ధయామ మున్న దని నుడివెను. రాజు వీని శ్రద్ధకుఁ బట్టుదలకు రాజభక్తికి మిగుల సంతసిల్లి నీ వేల నిద్రింపలే దని యడిగెను. దాని కప్పుడే యాకవి యాశుధారగా రచించి యొకశ్లోకమును జదివెను. (శీతే నోద్ధృషితస్య మాషశిమివ చ్చింతార్ణవే మజ్జత శ్శాన్తాగ్నిం స్ఫుటితాధరస్య ధమతః క్షుత్ క్షామకంఠస్య మే। నిద్రా క్వా ప్యవమానితేవ దయితా సంత్యజ్య దూరం గతా సత్పాత్రప్రతిపాదితేవ వసుధా న క్షీయతే శర్వరీ॥ (చలిచేత మినుపకాయవలె గగుర్పాటుగల శరీరము గలవాఁడ నయి యాఁకలిచే నెండినకంఠము గలిగి చింతాసముద్రమందు మునిఁగియుండి యాఱిపోయిన యగ్నినిఁ బగిలినపెదవితోఁ బలుమాఱు ఊఁదెడు నానిద్ర యవమానింపఁబడిన ప్రియురాలివలె నెచటికో దూరముగాఁ

బోయినది. సత్పాత్రమందు దాన మివ్వఁబడినభూమివలె రాత్రి యక్షయ మగుచున్నది.) రా జీశ్లోకమును విని దీనిసారస్యమును గ్రహించి యిన్నాళ్లనుండి తోడినీడవలె న న్నాశ్రయించిన వీని కెద్దియు నుపకార మొనర్పలేక పోయితి నని మనములోఁ గొంతవడి చింతిల్లి యానాఁటి వేకువను "ఈమాతృగుప్తుని మీకాశ్మీరరాజ్యసింహాసనమం దభిషేకముచేయనలయు నని యాదేశపుమంత్రివరులకు కొక లేఖ నంపి మఱియొక లేఖ నీమాతృగుప్తునిచేతి కిచ్చి "యీరాజాబుఁ గొనిపోయి కాశ్మీరమునం దున్నమంత్రివర్గమునకుఁ జూపుము. త్రోవలో దీనిని నీవు విప్పి చూడవలదు" నని యాజ్ఞాపించెను. "ధన్యోఽస్మి" యని మాతృగుప్తుఁ డాలేఖఁ బుచ్చుకొని కాశ్మీరమునకుఁ జనఁగా ఘట్టకుటీసమీపమం దెదురుచూచుచున్న ప్రధానామాత్యు లితనిని సగౌరవముగా శ్రీనగరమునకుఁ దోడితెచ్చి మహావిభవముతో నచటఁ బట్టాభిషిక్తునిఁ గావించిరి. మాతృగుప్తుఁ డయిదుసంవత్సరములు రాజ్య మేలి తనపోషకప్రభు వయిన హర్షునిమరణవార్త విని దుఃఖితుఁడై విరక్తిఁ జెంది తోరమాణునికుమారుఁ డైన ద్వితీయప్రవరసేనునికి రాజ్య మొప్పగించి చనెను. ఇతఁడు కొంతకాలము రాజ్యమేలి కడపట సన్న్యసియై కాశికిఁ బోయి దేహత్యాగముఁ జేసెను. విచిత్రమయిన యీహర్షవర్ధనునిచరిత్ర మనేకవ్యాసచరిత్రాంశములఁ గనుఁగొనుటకు ముఖ్యసాధన మయి యున్నది. ఈహర్షవర్ధనవిక్రమాదిత్యుఁడే శిలాదిత్యప్రతాపశీలుని తండ్రి చీనయాత్రికుఁడైన హుయాన్ ధసాంగు ఏశిలాదిత్యుఁడు 580 వత్సరములో మాళవదేశమునకు రాజైయున్నట్లు తా నెఱుంగుదు నని చెప్పెనో యతఁడే హర్షునికుమారుఁ డైనశిలాదిత్యప్రతాపశీలుఁ డనుట కిసుమంతయు సందియము లేదు. కల్హణునిచేఁ జెప్పఁబడిన విక్రమాదిత్యహర్షుఁడును శిలాదిత్యునికి ముం దున్నరా జని హుయాన్ ధసాంగుచేఁ జెప్పఁబడిన జగత్ప్రసిద్ధుఁ డైనవిక్రమార్కుఁడును నొక్కటియే యని నిశ్చయించుటకు నతఁ డాఱవశతకపూర్వార్ధమందు రాజ్యముచేసినాఁ డని సమర్థించుటకును బైని చెప్పఁబడిన సంగతియే ముఖ్యాధారముగా నున్నది.

పైమాతృగుప్తుఁడే కాళిదాసుఁడనియు నితనియనంతరము కాశ్మీరమునకు రా జైన ద్వితీయప్రవరసేనునిప్రార్థనపై నితఁడు రావణవధాపరనామక సేతుకావ్య మనునొక ప్రాకృతకావ్యమును రచించి యాప్రవరసేనునిపేరు పెట్టె ననియు గ్రంథనిదర్శనములు గనఁబఱిచి కొందఱు పాశ్చాత్యపండితులు, భావుదాజీపండితుఁడు సిద్ధాంతీకరించియున్నారు. మాతృగుప్తశబ్దము (మాతృ=

కాళీ, గుప్త = దాస) కాళిదాసశబ్దమునకుఁ బర్యాయపద మని బౌవుదాజీ సమర్థించెను. ఏకాదశశతాంతమం దున్నకాశ్మీరికకవిశిఖామణి యగుక్షేమేంద్రుఁడు రచించిన ఔచిత్యవిచారచర్చలోను వల్లభదేవసంకలిత మగుసుభాషితావళియందును మాతృగుప్తుని శ్లోకము లని కొన్ని యుదాహరింపఁబడినవి. కాని యీసిద్ధాంతముతో సంబంధించిన వికల్పములను గాని యుపపత్తులను గాని యిచటఁ జర్చించుట యనావశ్యకము సస్థానము గ్రంథవిస్తరము నని విరమించుచున్నాను.

ఈమాతృగుప్తునికాలమందు మేంఠుఁ డనుమహాకవి హయగ్రీవవధ మనుమహాకావ్యమును రచించి యితనికడకుఁ దెచ్చి చదువ సంపూర్ణముగా విని యూరకుండి, కవి పుస్తకము సూత్రముచేఁ గట్టివేయుచున్నపుడు "గ్రంథరసము క్రిందఁ జాలిపోవు ననుభీతిచే నొక బంగారుపళ్లెరమును దాని క్రిందఁ బెట్టె నఁట. (హయగ్రీవవధం మేణ్ఠ స్తదగ్రే దర్శయ న్నవం। ఆసమాప్తి తతో నాప త్సా ధ్వసా ధ్వితి వా వచః। అథ గ్రథయితుం తస్మిన్ పుస్తకం ప్రస్తుతే న్యధాత్। లావణ్యనిర్యాణభియా తదధః స్వర్ణభాజనమ్.) తండ్రి యగుతోరమాణుఁడు చెఱసాలలో నున్నసమయమం దీతనికుమారుఁడు ద్వితీయప్రవరసేనుఁడు తీర్థయాత్రాటనము సల్పుచుండె నని చెప్పియుంటిని. ఇతఁ డన్యాక్రాంత మయిన తనపూర్వులరాజ్యమును దిరుగ సంపాదించుబుద్ధితోఁ గాశ్మీరముపైకి దండెత్తి పోవుచు విక్రమాదిత్యుఁడు దేవసదనమున కేగెననియు, మాతృగుప్తుఁడు రాజ్యమును బరిత్యజించె ననియుఁ ద్రిగర్తదేశమునం దుండఁగా విని శీఘ్రముగా నచటికిఁ జని యాదేశమును స్వాధీనపఱచుకొనెను. నిజముగా నీప్రవరసేనునిరాజ్యపరిపాలనము సప్రమాణానేకచరిత్రాంశముల కాకర మైనది. ఇతఁడు విక్రమాదిత్యహర్షునికుమారుఁడు శిలాదిత్యప్రతాపశీలునిపక్షము నవలంబించి సౌరాష్ట్రదేశముపైకి దండెత్తి వెళ్లి యాదేశస్థుల నోడించి శిలాదిత్యప్రతాపశీలునికి నాతనితండ్రిరాజ్యముఁ దిరుగ నిప్పించె నని కల్హణుఁడు వ్రాయుచున్నాఁడు. కల్హణచీనదేశయాత్రికుల వాక్యప్రామాణ్యమువలన శిలాదిత్యప్రవరసేనులు సమకాలికు లని దృఢపఱుపఁబడుచున్నది. ఈశిలాదిత్యుఁడు 580 సం॥ లో మాలవరాజ్యసింహాసనము నధిష్ఠించె నని చీనయాత్రికుఁడు చెప్పుటచేఁ బ్రవరసేనునికాలము గూడ నదియె యని సులభముగాఁ జెప్పవచ్చును. ఇంతియకాక దీనికి మఱియొక నిదర్శన మున్నది. ఈప్రవరసేనుఁడు ప్రవరసేనపుర మనునొకపట్టనముఁ గట్టించెను.

ఈనగరము పాడయిన స్థానమందే ప్రకృతరాజధాని యయినశ్రీనగరము నిర్మింపఁబడె ననియు నిప్పటికిని నాదేశములోఁ బండితు లాశ్రీనగరమును ప్రనరపుర మని వ్యవహరించుచున్నా రనియు కల్హణుఁడు వ్రాసియున్నాఁడు. ఇప్పటికిఁ గాశ్మీరమం దసుదుగాఁ గనఁబడుప్రవరసేననామాంకితము లగునాణె ములు గూడఁ బ్రవరసేనునిరాజ్యపరిపాలనకాలమును నిర్ణయించుటకు ముఖ్యాధారములుగా నున్నవి.

ఇతనితరువాత ద్వితీయయుధిష్ఠిరుఁడు రా జయ్యెను. ఇతఁడు కొన్ని బౌద్ధవిహారములను గట్టించె నని చెప్పుట తప్ప చెప్పఁదగిన దేమియు లేదు. ఇతనికుమారుఁడు లక్ష్మణనరేంద్రాదిత్యుఁడు. అప్రసిద్ధుఁడు. ఇతనితమ్ముఁడు రణాదిత్యుఁ డితనియనంతరము రా జయ్యెను. కల్హణుఁడు వ్రాసినచరిత్రలో వాస్తవచరిత్రప్రారంభ మిది యయినను గ్రంథకర్త చెప్పిన సంఖ్యావళీనామము లను మనము విశ్వసింపలేనంత కలఁతగా నున్నది. రణాదిత్యునిఁగూర్చి యనేకకల్పితకథలు గలవు. ఇతఁడు నితనిభార్య రణరంభయు దేవాంశావ తీర్ణు లనియు వీరిరువు రనేకాద్భుతచేష్ట లొనర్చి రనియు నీరాజు మున్నూ ఱేండ్లు రాజ్య మేలెననియు నమ్మఁదగనికీర్తిగాఁ గల్హణుఁడు వ్రాసియున్నాఁడు. ఇతనిపుత్త్రుఁడు విక్రమాదిత్యుఁడు నలువదిరెండుసంవత్సరములు రాజ్య మేలినను గణనీయ మగుచరిత్రాంశ మేదియు లేదు. ఇతనితమ్ముఁడు బాలాదిత్యా ఖ్యుఁడు పిమ్మట సింహాసనమునకు వచ్చెను.

కాశ్మీరరాజ్యము చిరకాలము గోనందవంశులయేలుబడిలో నుండి చివ రకుఁ గర్కోటకవంశరాజన్యుల కెట్లు వశ మాయెనో దానినిగూర్చి కల్హణ కవి యొకచిత్రకథను వ్రాసియున్నాఁడు.

గోనందవంశములోఁ గొనవాఁ డైనబాలాదిత్యున కొకదైవజ్ఞుఁడు "నీ యనంతరము నీయల్లుఁ డీరాజ్యము నాక్రమించుకొనఁగలఁ" డనిభావికార్య మును సూచింప, దానిని నివారించుట కనంగలేఖ యనుతనపుత్త్రిక ననా మికుఁ డైనదుర్లభవర్ధనుఁ డనుచిన్నయుద్యోగస్థునకు వివాహము చేసెను. కాని దుర్లభవర్ధనుఁడు కాశ్మీరదేశములోని సర్వజనులచేఁ బూజింపఁబడు కర్కోటక నాగునివంశజుఁ డగుటచేఁ గొంతయభిజాతఖ్యాతిఁ గాంచినవాఁడు. సత్ప్రవృత్తి గలవాఁ డగుటచే మామదయకుఁ బాత్రుఁడయి తుద కతనిమరణోత్తరము నందు ఖంఖనుఁ డనుమంత్రిచే రాజ్యమం దభిషిక్తుఁ డయ్యె.

## కర్కోటకవంశోత్పత్తి.

ఈకల్పితకథ నొకమూలకుఁ ద్రోసిపుచ్చుఁడు. దీనినుండి మనము గ్రహింపఁదగిన సారాంశ మే మనఁగా కర్కోటకవంశస్థాపకుఁడు మొదటి సామాన్యకులమందుఁ బుట్టినవాఁ డనియుఁ గాశ్మీరరాజకుటుంబముతో వివాహ సంబంధము గలవాఁ డయి ప్రసిద్ధుఁ డయ్యె ననియు. ఈవంశస్థులకుఁ గర్కోటకాఖ్య యె ట్లబ్బెనో తెలిసికొనుటకుఁ జరిత్రప్రమాణ మెద్దియు నగపడదు. ఈదుర్లభవర్ధనుఁడు కాశ్మీరమునకు రా జగుట నిజముగా నారాజవంశములోఁ బురుషసంతతి యుత్పన్న మగుటనో మఱికొన్నికారణములనో యాసంగతిని మన కిపు డున్నచరిత్రవస్తుసామగ్రినిఁబట్టి నిష్కర్ష చేయనేరము.

## కర్కోటకవంశము.

నాణెములఁబట్టియు విదేశీయులు వ్రాసినవృత్తాంతములఁబట్టియు నిటుపైని వచ్చురాజులకాలమును జరిత్రమును, మనము నిశ్చయముగాఁ జెప్పఁగలము. ఈదుర్లభవర్ధనుఁడు స్వవంశజుల కంకితమును ముఖ్యచిహ్నముగా నేర్పడిన మోటునాణెములను దుర్లభదేవుఁ డనుపేరుచే నంకిత మయినవానిని ముద్రింపించెను. చీనాదేశచరిత్రమందుఁగూడ నీదుర్లభదేవునివృత్తాంతము వ్రాయఁబడియున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇతనికుమారుఁడు దుర్లభకుఁడు లేక ద్వితీయప్రతాపాదిత్యుఁ డితనితరువాత రాజ్య మేలెను. "శ్రీప్రతాప" అను పేరుతో నున్ననాణెములవలన నితఁడు తెలియఁబడుచున్నాఁడు. ఇతఁ డేఁబది వత్సరములకాలము రాజైయుండెను. పరదేశమునుండి వచ్చి కాశ్మీరములో స్థిరపడిన యొకవణిజునిభార్య నరేంద్రప్రభ నితఁడు వివాహమాడి చంద్రాపీడఁ తారాపీడ, ముక్తాపీడు లనుముగ్గురు సుతులఁ గాంచెను. వీరికి యథాక్రమముగా విజయాదిత్యుఁడు, ఉదయాదిత్యుఁడు, లలితాదిత్యుఁడునను నామాంతరములు కలవు. వీరిలోఁ జంద్రాపీడుఁడు తండ్రియనంతరము రాజ్యమునకు వచ్చెను. క్రీస్తు వెనుక 713-720 సంవత్సరములలో కాశ్మీరదేశము నేలుచున్నట్లు చీనాదేశచరిత్రములోఁ జెప్పఁబడిన "చెంటోలోపిలి" యనువాఁడీచంద్రాపీడుఁడే యని ఋజువుచేయఁబడినది. ఇతఁడు మిగుల ధార్మికుఁడు, న్యాయబుద్ధిగలవాడు నని ప్రసిద్ధిఁ జెందెను. తొమ్మిదిసంవత్సరములు రాజ్యము చేసి తనతమ్ముఁడు తారాపీడుఁడు చేయించిన యాభిచారికకర్మముచేఁ గడ తేఱెను. ఇతని సోదరుఁడుఁ గ్రూరుఁడునైన తారాపీడుఁడు నాల్గువత్సరములుమాత్రము రాజుగా నుండి బ్రాహ్మణవిద్వేషియై వారిచేఁ జంపఁబడెను. అనంతరము

వీరిలోఁ గనిష్ఠుఁడు లలితాదిత్యముక్తాపీడుఁడు రాజత్వము వహించెను. వాస్తవచరిత్రమున కుపయోగించెడు ననేకాంశము లితనినిగూర్చి వ్రాయఁబడియున్నవి. ఏలుబడికాలమం దితఁ డధికప్రతాపము గలవాఁ డనిపించుకొని తన రాజ్యమునుమిగుల విరివిచేసెను. అదేమి చిత్రమో యింత గొప్పవాఁ డైనను వీనిపేరుమోసిననాణెము లిదివఱకు నెచ్చటను వెల్లడి కాలేదు. అయినను విదేశీయు లితనిఁగూర్చి వ్రాసినవ్రాఁతలు నితఁడు కట్టించిన కట్టడములుఁ గీర్తిశాలి యని తెల్పుటకుఁ జాలినంత సాక్ష్య మిచ్చుచున్నవి. ఈలలితాదిత్యముక్తాపీడుఁడు క్రీస్తు వెనుక 713-755 సంవత్సరములలో చీనాదేశపుచక్రవర్తి హుయన్‌జంగు కాలములో టిబెటుదేశస్థులతోఁ దనకు యుద్ధము తటస్థించినపు డాచక్రవర్తిని సహాయము గోరినట్లును జక్రవర్తి సహాయార్థము రెండు లక్షలపదాతిసైన్యముఁ బంపినట్లును చీనాదేశచరిత్రములో వ్రాయఁబడియున్న దని చరిత్రకారుఁ డైన ఆల్బ్యార్ని వ్రాసియున్నాఁడు. ఇతనిచరిత్రమును బట్టి చూడఁగా రాజ్యపరిపాలనకాలము సంతను విదేశీయులతోఁ బోరాడుటలోఁ గడపినట్లు కానవచ్చుచున్నది. ఇతనిదండయాత్రావర్ణన కొంత కల్పితముగాను మఱికొంత వాస్తవముగాను గానవచ్చును. ఇతఁడు మొట్టమొదట కాన్యకుబ్జేశ్వరుఁ డైన యశోవర్మపై దండెత్తెను. వివేకి యగుయశోవర్మ వినయము నభినయించుచు నితనికిలోఁబడి సంధి సేసికొనుట కొప్పుకొనెను. లలితాదిత్యుని మంత్రి సాంధివిగ్రహకుఁడు నగుమిత్రశర్మ సంధిపత్రిక వ్రాయునెడ "లలితాదిత్యునికి యశోవర్మకు జరిగినసంధి" యని వ్రాయుట విహిత మయి యుండఁగాఁ దనరాజుపేరు యశోవర్మపేరుతోఁ గలిపివ్రాసినయెడ నది తనరాజున కవమానహేతు వని రాజుపేరును విడిచి యశోవర్మనామమునే లిఖించెను. ఇందుపై నతఁడు కోపించి సంధి కొప్పుకొనలేదు. శత్రువుతోఁ బోరాడి రాజ్యముఁ గోలుపోయెను. యశోవర్మ గౌడదేశపురాజును జయించుటను గుఱించి గౌడవధ యనుప్రాకృత కావ్యమును రచించినవాక్పతిమిశ్రుఁడు, వీనిగురు వగుభవభూతి యీయశోవర్మ యాస్థానమందుండిరి. కాశ్మీరదేశరాజుల కతిదూరమందున్నకాన్యకుబ్జముతో నెందు కింతవైర ముత్పన్న మైనదో యాసంగతి యెనిమిదవవత్సరశతకమందుఁ బశ్చిమోత్తరహిందూస్థానరాజ్యాంగస్థితులవలనఁ దెలిసికొనుటకు శక్యము కాదు గాని లలితాదిత్యుఁడు కన్యాకుబ్జముపై దండెత్తి వెళ్లుటనుబట్టి కాశ్మీరమునకుఁ జుట్టుపట్ల నున్నదేశములు గూడ నితనికి స్వాధీనమయిన ట్టిందువలన స్పష్టమగుచున్నది. ఇపుడు కంగ్ర, పంబి యను

(సశేషము)

# శ్రీకృష్ణభూపతి దేవమహారాజుగారిజీవితము.

ఈమహారాజుగారివంశమువారు విశాఖపట్టణమండలాంతర్గత మగు "మాడుగులు" రాజులు. మాడుగులు జమీందారిలో నచ్చటచ్చటఁ బంచ పాండవులవిగ్రహము లుండుటచేతను ఒడ్డాదిదగ్గఱ "సింహబలునిమెట్ట" యుండుటచేతను మాడుగులు విరాటునిదేశ మనియును "సింహబలునిమెట్ట" కీచకుని గృహ మనియు వాడుక కలదు. పూర్వము "మాడుగులు"కు నొడ్డాది రాజధానిగానుండెను. ఆకారణముచేతనే మాడుగులు రాజులకు "వడ్డాది" యనుగృహనామము కలిగెను. వీరు క్షత్రియులు. కాశ్యపగోత్రజులు. వ్యాసమహర్షితల్లి మత్స్యగంధియును మత్స్యవల్లభుఁడు నొకచేపకడుపునఁ బుట్టుట పురాణప్రసిద్ధము గదా! ఆమత్స్యవల్లభునిసంతతివా రగుటచేతనే వీరిది మత్స్యవంశము. వీరిజెండాయందుఁ జేప యుండుటయే కాక వీరుచేవ్రాలు చేయునపుడు ముందు చేఁపను వ్రాయుదురు. వీరినామములకు భూపతి యనునది చేరుచుండును.

కృష్ణభూపతిగారి పితామహుఁడు కృష్ణభూపతి. ఈభూపతికాలము సరిగాఁ దెలియదు. ఈతండు మాడుగులను బాలించెను. తర్వాతఁ దత్పుత్త్రుఁడు జగన్నాథభూపతి రాజ్యమునకువచ్చెను. ఈరాజుకాలమును జక్కఁగఁ దెలియరాదు. ఈభూపతికిరువురు భార్యలు. పెద్దభార్యపుత్త్రుండు లింగభూపతి (క్రీ. శ. 1816). ధాతృనామసంవత్సరమున రాజ్యపరిపాలన మారంభించి (1813) ఖరనామసంవత్సరమున మృతినొందెను. ఈనృపునకుఁ బుత్త్రసంతానము లేదు. రెండవ భార్యయగు జోగిమణిదేవి జ్యేష్ఠపుత్త్రుఁడు హరిహరభూపతి రాజ్యమునకు వచ్చి (1833) విజయసంవత్సరమునం దవివాహితుఁడుగనే మృతిచెందెను. తరువాత నీభూపతితమ్ముఁడు కృష్ణభూపతి (1834) జయసంవత్సరమునందు రాజ్యపాలనమారంభించెను. ఈయన (1813) శ్రీముఖసంవత్సరమున జ్యేష్ఠమాసమున జన్మించి 22-వయేఁట రాజ్యమునకువచ్చి 41 సంవత్సరములు పాలించి (1875 సం॥ డిసెంబరు ది 25 తేది) యువసంవత్సర మార్గశిరబ ౧3 శనివారము రాత్రి కాలధర్మము నొందెను. ఈప్రభుని శరీరము నలుపుగాఁ గప్పుచ్చునఁ దీసినట్లు దృఢముగా నుండెను. మిగుల బలశాలి. ఆంధ్రగీర్వాణములయందుఁ బాండిత్యము కలిగియుండెను. ఓఢ్రమును హిందూస్థానియును దెలిసియుండెను.

శిల్పము మొదలగు కొన్నికళలయందు నేర్పరి. వీణయు మృదంగముఁ గుడి యెడమ లనుభేదములేకుండ వాయించుటంజేసి సవ్యసాచి యనిచెప్ప నొప్పి యుండెను. మహాదాత. ధనదానములు గాక యీయనఘుఁడు చేసిన భూదానములు పెక్కు గలవు. మొదట నీభూపతికి సుందరమణిదేవి, వెంకయ్యమ్మ యను నిద్దఱు దేవేరు లుండిరి. వారిరువురును గతించుటచే సీతాపట్టమహాదేవి, నలమణి పట్టమహాదేవి యనునిద్దఱ మరలఁ బెండ్లిగావించుకొనియెను. పుత్త్రసంతానములేకుండెను. ఈయన యాస్థానమున నుండినపండితాదులు:—

(1) వైయాకరణులు
1. ఇంద్రకంటి గోపాలశాస్త్రిగారు.
2. మంత్రవాది లక్ష్మణశాస్త్రిగారు.
3. గొరావర్ఝుల సుబ్బయ్యశాస్త్రిగారు.
4. జయంతి గౌరీపతిశాస్త్రిగారు.
5. దేవరకొండ రామస్వామిశాస్త్రిగారు.

(2) తార్కికులు
1. బులుసు మృత్యుంజయశాస్త్రిగారు.
2. వింజమూరి పార్వతీశ్వరశాస్త్రిగారు.

(3) కవీశ్వరులు
1. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు.
2. మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవిగారు.
3. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారు.
4. తాడూరి కృష్ణయ్యగారు.
5. మంత్రిప్రెగడ కామరాజుగారు.
6. నిష్ఠల పేరకవిగారు.

(4) పౌరాణికులు
1. కోట నృసింహశాస్త్రిగారు.
2. కోట పద్మనాభశాస్త్రిగారు.
3. చల్లా సుబ్బయ్యశాస్త్రిగారు
4. మోడేకుర్తి మల్లయ్యశాస్త్రిగారు.

(5) వైణికులు
1. వాసా అప్పయ్యగారు.
2. జల్లేపల్లి కామేశముగారు.

(6) గాయకులు
1. తాంజావూరి రామయ్యగారు.
2. ఈ కృష్ణయ్యగారు.
3. ధార్వాడ మాధవరావుగారు.
4. వరదాచార్యులుగారు.

| | |
|---|---|
| | 5. పొట్లచెర్ల రామయ్యగారు. |
| (7) సిద్ధాంతులు | 1. ముత్యము అరుణాచలసిద్ధాంతిగారు. |
| | 2. ఎల్లాజోస్యుల సీతారామయ్యగారు. |
| | 3. బలభద్రసిద్ధాంతిగారు. |
| (8) వైద్యులు | 1. దూర్వాసుల సీతారామయ్యగారు. |
| | 2. పిల్లా రామన్నపాత్రుఁడుగారు. |
| (9) విదూషకులు | 1. సరస్వతుల సుబ్బయ్యగారు. |
| | 2. పారుపూడి సుందరప్పగారు. |

వర్షాశనమును గొనెడి పండితాదులు:—

| | |
|---|---|
| (1) షట్ఛాస్త్రపండితులు | 1. బులుసు పాపయ్యశాస్త్రిగారు. |
| (2) వేదవిదులు | 1. బులుసు వెంకప్పసోమయాజిగారు. |
| | 2. చిఱవూరి పెద్దావధానులుగారు. |
| | 3. గోర్తి సుబ్బావధానులుగారు. |
| | 4. వడలి రామకృష్ణశాస్త్రిగారు. |
| | 5. గరిమెళ్ల పుల్లయ్యగారు. |
| (3) వ్యాకరణశాస్త్రజ్ఞులు | 1. ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రిగారు. |
| | 2. కొవ్వూరి గోపాలశాస్త్రిగారు. |
| (4) కవీశ్వరులు | 1. అడిదము భాస్కరకవిగారు. |
| | 2. నిట్టల రాయలుకవిగారు. |
| (5) వైణికులు | 1. వీణా గురురాయాచార్యులుగారు. |
| | 2. దూర్వాసుల సూర్యనారాయణసోమ యాజిగారు. |
| | 3. శిష్టు సర్వశాస్త్రిగారు. |
| (6) సిద్ధాంతులు | 1. పిడప్రర్తి దక్షిణామూర్తిసిద్ధాంతిగారు. |
| | 2. సరిపల్లి అమ్మన్నసిద్ధాంతిగారు. |

వీరలుగాక, విద్యావంతు లనేకు లనేకబహుమానములను బొంది యున్నారు.

ఈయననుగూర్చి కొందఱుకవులు రచించిన కొన్నిపద్యములుమాత్రము లభించుటవలన వాని నిందుఁ జేర్చితిని.

శ్రీవిక్రమదేవవర్మగారు.

## చాటుపద్యములు

శా. శ్రీరాధామధురాధరాధరసుధా సేవంబలెన్ దివ్యశృం
గారుండై విబుధాశ్వనిర్జితసుమాక్రాంతోరు రాసక్రియా
భీరస్త్రీయుతుఁ డైనకృష్ణుఁడు మనోభీష్టంబు మీకిచ్చు వి
స్ఫారప్రౌఢిమఁ గృష్ణభూపతిబిడౌజా రాజరాజాగ్రణీ. 1

మ. రమ వేణీకుసుమద్విరేఫరణితప్రాగల్భ్య ముద్వేలగీ
తముగా నూపురరత్నకంకణఝణాత్కారంబులుం దాళవి
భ్రమముం దెల్పఁగ వాణి దానును భవద్రాజత్సభావేది లా
స్యము గావింతురు కృష్ణభూపతిబిడౌజా రాజరాజాగ్రణీ. 2

మ. ప్రకటవ్యాప్తి విభూతిచే నచలధర్మ...చే దానవ్యయ్యాశా
రికనత్ప్రౌఢిని రాజశేఖరత మీ స్వైశ్వర్యకళ శాస్త్రిగారు
త్రికదానేయగు మేటి శంకరుఁడు మీకిప్పించు సార్వస్వామిశా
జయశాస్త్రి
సకలైశ్వర్యముకృష్ణ . . . 3

మ. గుణ మీశాను మణీమణీహృదయ సంశ్లిష్టోరుహారాశ్వరశా
రణిత్వైయె మీకుసుచర్ణమార్గణ గణప్రాప్తి ప్రాగ్జా శాస్త్రిగారు
హిణిత్వైయె పర్వపూర్వవేగురుఁడు మీ కీర్తివిద్యా...
ప్రసవిచ
క్షణతం దెల్పెను గృష్ణ. . . . 4

మ. దయకృత్తావకకీర్తి సింహబహుళప్రత్యర్థి హృన్నోద పి
ష్టయుము లేసియుచుఁ బుండరీకములు నాశాకుంభినీనాయకో
చ్చయముం ద్రోచి నిశ్శేషన మృగశిరస్పర్ధన్ సమర్థించి ది
గ్జయముం జేయును గృష్ణ. . . . . 5

మ. రమణం గచ్ఛపనీలపద్మ మకరవ్రాతంబు కుందంబు శం
ఖమహాపద్మము లగ్రపాద కచదృగ్జంఘా రదగ్రీవహ
స్యముగా సేవధిరూపశ్రీవరముకుందాసక్తునిం జేయు ని
స్సమభావార్ద్రతఁ గృష్ణ. 6

శా. తీరై మీయుధనాసరీవతమహాతీసైజిరాకెంపుటం
బారీ నెక్కి సవారి మీరు పురి ప్రేమన్ రాఁ బిచాడీనగా
డీరాహుత్తులయేపునర్వను గడీన్ డీలైరిపుల్ చూచి బే
జారైపోదురు కృష్ణ. . . . . 7

మ. తమకీర్తిన్ హిమదీప్తి నల్వ తుల సందర్భించి తూఁచంగ సా
మ్యము రాఁజాలఁగలేమి "తస్యతు విధాత్రాకారి మప్యానపు
ష్యమితే బిందు రిందంహి చిహ్నా"మనుచుం బ్రాజ్ఞుల్ విమర్శించి పూ
జ్యమతిన్ జూతురు కృష్ణ. . . . . . . 8

మ. ఇనవంశాగ్రణి రామమూర్తి స్వపదశ్రేష్ఠత్వరాగాప్తి రా
తను నాతిన్ ఘటియించు టెంతని భవద్దానాబ్జ పారుష్యలాం
ఛనభూభృత్తులరాజరాజుల మఱిన్ సర్వజ్ఞులం జక్రశా
సనులం జేయును గృష్ణ. . . . . . 9

మ. తమి జవ్వాది హవాసవాదులవలెం దాజాగులాబీవిరు
ల్గమిఁ జేర్చెత్తినఁ గేనఁ గస్తురి మలాకాగంధముం గూర్చుచం
దమునం బ్రేమ ఘను ల్నుతింపఁ దమమీఁదం గూర్తుఁదారావళీ
సమతారావళిఁ గృష్ణ. . . . . . . 10

శా. పూజీటంగుమెఱుంగుఁజుంగులు రికాబుల్చార్జిమా భేషుక
మ్చా జేర్చందు జరాతురా గలుగు తేజీనెక్కి కావాకదం
బాజీగాజును మిమ్ముఁజూతురు పురీభామల్ తలం పుబ్బరా
జాజీహాకము కృష్ణ. . . . . . . 11

* * * *

మ. సతతజ్ఞానసనాథనిష్ఠ వసుధాసమ్రాడ్జగన్నాథ భూ
పతి శ్రీజోగిమణీసతీమణియు రూపవ్యక్తమీనాంకునిన్
సుతుఁగాఁగాంచిరి చక్రపాణి రమయున్ సూనాస్త్రుఁ గన్నట్లు శా
శ్వతపుణ్యోన్నతిఁ గృష్ణ' . . . . . 23

మ. హరిపీఠిన్ సిరి మీఱ మీరు గయిసేయ న్మంత్రిసామంతమి
త్రరసానాయకులం ద్వరావళతతారస్వర్ణవేత్రప్రభా
స్ఫురణల్ సూపుచుఁ జోపుదారులు నకీబు ల్మీకచేరీకి హా
జరుగావింతురు కృష్ణ. . . . . 24

మ. అనిమేషస్థితిఁ గామిను ల్పురపూర్వాభాద్రవాస్తీనకే
తను నిన్నున్నిజమీనకేతను దమిం దర్శింప యుష్మత్సభా
కనకస్తంభసహస్ర. . . . . క్పాంచాలికావ్యాజసూ
చనదీపింతురు కృష్ణ. . . . . . 25

మ. జృంభత్తావకవిక్రమప్రహిత నాశీరోత్తరాభాద్రవ
ద్దంభారుల్ దమమేనితోన నచలస్థానంబులంజోద్యమా
రంభావాటినిలింప యానతపరీరంభక్రియారంభులై
సంభోగింతురు కృష్ణభూ. . . . . 26

మ. నరవక్త్రామరవార్ధి రేవతిరుచిఁ వ్యాపించి హంసాభియా
నరుచింబొల్చి యనంతకాంతివిలసన్నక్షత్రమాలావిక
స్వరమై యక్షరమూర్తియై యమర భాషాదేవి మీకీర్తి పూ
జ్యరమం బొల్చును గృష్ణభూపతి బిడౌజా రాజరాజాగ్రణీ. 27

మ. అమరజ్యేష్ఠుఁడు వాణి, శౌరి రమఁ, గామారాతిశర్వాణి యా
మ్యముఖోరస్థలవామభాగములఁ బ్రేమం దాల్తు రెన్నాళ్లు ని
త్యము నన్నాళ్లును మీకుఁ గల్గు విజయౌదార్యంబు సామ్రాజ్యపూ
జ్యమహాభోగముకృష్ణ. . . . . 28

మ. ధృతిఁ బద్మాదికులాబ్ధిపూర్ణశశి ... ంజయశాస్త్రి
పతిరాణ్మౌళిసమ్మాన్య కీర్తి తకు ... తీశ్వరశా
శ్రితహీరాళి ... రీతిని రచిం ... శాస్త్రిగార
కృతి శ్రీనిట్టల ...యు లాయతకవీ ... . 29

శా. శ్రీఁజెన్నొందు పురాలు మేడలు వరాలె సింహాసనస్థానముల్
తేజీ లందలముల్ కరుల్ బిరుదు లెంతే సంపద ల్గల్గుత
ద్రాజుల్ నీసరికీర్తి నొందరు గదా రాజన్యరామండలీ
రాజా కృష్ణమహీపతీ శుభగతీ రాజన్మనోజాకృతీ. 1

శా. తాజాసంపద లిచ్చి యాచకులకుఁ ధాత్రీసురశ్రేణికిఁ
బేజారై ధన మీయఁజాలని మదాంధీభూతు లాలోభులఁ
జేఁజాచంబని నాకుఁ దోఁచదు గదా శ్రీరమ్యభూమండలీ
రాజా కృష్ణమహీపతీ శుభగతీ రాజన్మనోజాకృతీ. 2

శా. భూజాను ల్భవదీయ కీర్తి విభవంబుం గాంచి దావవ్వులఁ
దాజీమిచ్చి మతిన్నతిం బొగడుచుం గైవారముం జేతురా
జేజేశబ్దముల న్నినాదంబు లగుచుఁ శ్రీరమ్యభూమండలీ
రాజా కృష్ణమహీపతీ శుభగతీ రాజన్మనోజాకృతీ. 3

క. ధరఁ గృష్ణభూపతీంద్రుని
యురువైభవమునకు హరిహయోద్ధతి యోడెన్
మురసి నలువపతి యోడెను
నరనుతగాంభీర్యమునకు నదియే యోడెన్. 4

క. శారదనీరదపారద
నారదనీహారహార నలినాహిత భృ
త్తారాపటీరకీర్తి
స్ఫారా శ్రీకృష్ణభూప భావజరూపా. 5

# ఆగిరిపల్లి శిలాశాసనము.

[“ఆగిరిపల్లిలో యెగువతిరుమలను శ్రీవేంకటాచలస్వామివారికోయిలకు చప్పటా కట్టించేటప్పుడు భూమితవ్వుచుండగా దొరికిన శిలాస్తంభమందు వ్రాసియున్న క్రమము” అని శాలివాహనశకము ౧౭౭౭ సరియయిన ధాతృ నామసంవత్సరమునందు శ్రీనూజివీడు సంస్థానాధిపతు లగుశ్రీరాజా నారయప్పారావుబహాదరువారీక్రిందిశాసనము ప్రతిని వ్రాయించిరి. దీనిని శ్రీవారి పౌత్రు లగునిప్పటి శ్రీరాజా నారయప్పారావు బహాదరువారు పరిషత్పత్రికలోఁ బ్రకటింప దయచేసిరి.]

శ్రీమచ్చంద్రాంశుమాళే రవనివరకులాలంకృతేః కన్యకాయా మంబాయాం త్ర్యంబకాంశా త్సమభవ దిహ ముగ్గండ కోపెద్దినామా బాలాంశు శ్చోడభూపాగ్రిమ దుహితృపతి ర్జహ్నుకన్యాజలౌఘే స్నాత్వా సప్తాగ్రహారా నదద దతులితేభ్యో ఽంధ్ర దేశ ద్విజేభ్యః। ౧.

తస్యాన్వయే మండలికాగ్రగణ్యో విభాతి నారాయణదేవరూపః స్వకీర్తి చంద్రాతపపూరితాశో రిపూన్ విజి త్యావనిపాలకో ఽ భూత్। ౨.

ఏతత్సూను రినోపమో వితరణే విత్తేశ్వరో ఽ రిక్షయే రామ స్సత్యపరాక్రమే తదుదయాదిత్యోర్వరాం పాలయత్ ఎతస్మా దుదయక్షితీశ్వరవరాత్ శ్రీభీమదేవాధిపః పుత్రో నల్లనదేవనామని పురే జాత శ్చిరం రాజతే। ౩.

దుష్టై రాక్రాంతధాత్రీం గణపకుపతినా సింహాళాశ్వాదికాద్రైర్య రాత్మీయై ర్బుట్టచోక్క ప్రముఖనృపగణై ర్జన్యమానో సమస్తాం ఆదాయస్వం గదాఢ్యే వహాతి నృపసుతో దక్షిణే బాహుదండే లోకప్రఖ్యాతకీర్తి ర్భువిస విజయ తే భీమదేవ క్షితీశః। ౪.

శాకాబ్దే నవతీ శాంకే కార్తిక్యాం గ్రహణే విధోః దేవ్యై నిడ్డల గంగాయై విధత్తేఽఖండదీపకం। ౫.

నల్లభీమదేవుండు నిలుమలగంగాదేవికిం బెట్టిన అఖండదీపానకు నిత్యం మానెండు నేతికిం బెట్టిన మాదాలు ౨॥ వినిచేకినిముత్తనబోయుండు పుత్రపౌత్రానుక్రమాన నడుపువాండు.

(ప్రతిలోనున్నట్లుగా ముద్రింపఁబడినది.)

సీ. చందురులో నున్నకందుఁ దామణఁగించు తేవఁ *జెందలలకొండియలు చెలఁగ
జిగిమీఱ మడుఁగుఁగుచ్చెళ్లు దుత్తూరపుష్పముల కైవడిఁ గటిస్థలుల మెఱయ
మేచాయకోడి క్రొమ్మెఱుఁగులు చరణానతములైనగతిహంసకములు మొరయ
మొలకచన్నులతోడిముచ్చట కట్టాడుచెలువునఁ దడఁబాటుచెవులు వ్రేలఁ

గీ. గలిత మంజులమం(జరీగాఢ)వికచ, చకచకద్యుతి గండపాళికల నెసఁగఁ
బావనశ్రోణిసురబాలికావరేణ్య, లమరుచుండుదు రయ్యగ్రహారభూమి. 68

మ. నటదలోర్ధ్వశిఖాభిరాములు సువర్ణగ్రంథిభూషాపరి
స్ఫుటకర్ణద్వయరంధ్రదర్శితనిజాంసుల్ దర్భముద్రాంగుళీ
ఘటితాలంకరణుల్ జలస్నపనరాగద్యోతధౌతాంబరుల్
నిటలాలంకృతగోపిచందనులు వర్ణింపం బురీభూసురుల్. 69

మ. గొనబై దండములందుఁ గ్రొంబసుపునిగ్గుల్ దేఱుకౌపీనబం
ధనము ల్మంజులు వ్రేల్మిబొట్లుఁ గడు నందం బొందఁ గృష్ణాజినం
బునఁ గీలించినజన్నిదంబులు మనోమోదంబు సంధింపఁగా
ఘనతం బొల్చు సమిత్కుశాహరణరింఖద్బ్రహ్మచార్యౌఘముల్. 70

—* విప్రనారాయణునిజన్మము *—

క. హరివనమాలికయంశము, ధరలోపల నవతరింపఁ దలఁచిన దై యు
ప్పురి నొక్కవిప్రకాంతయు, దరముఁ బ్రవేశింప సతికిఁ దగ నెల మసలెన్.

సీ. ఇతరమానవకాంత లెన గారు తన కనియుమియు కైవడినిఁ జిట్టుములు బలిసె
హరి త్రివిక్రమమూర్తియయ్యెనీక్రియనన్నగతిఁ గ్రమక్రమమునఁ గానువొదలె
నర్భకుకీర్తి పై కావిర్భవించెనో యన మోముపాండిమ యతిశయిల్లె
విశ్వంభరుని మనోవీథి నిల్పినపుత్త్రుఁ దాల్చుట నన సోలుఁదనము మించెఁ

గీ. బ్రకటదౌహృదకుంభసంభవవిభూతి, యౌవనారంభఘనవిలాసార్ణవంబు
నింకఁ జేసినచోఁ దిరోహితము లైన, తత్తరంగంబు లన నింతితఱులు విరిసె.

ఉ. అంతట జిష్ణుతారను ధరామరతామరసాక్షి వేదవే
దాంతరహస్యవేది సుగుణైకశరణ్యు నగణ్యశేముషీ
మంతుని భూరితేజు సుకుమారుఁ గుమారునిఁ గాంచె దేవకీ
కాంత సరోరుహాక్షుని జగన్నుతు వెన్నునిఁ గన్నకైవడిన్. 73

* చెన్నుశబ్దమిందు వృత్తియందుఁగూడ సుందరార్థమునఁ బ్రయోగింపఁబడినది. ఉ. చెం
గావి. ఇట్టివి కన్నడమున నధికముగాఁ గలవు.

క. ఘుమఘుమ యనునెత్తావుల, గొమరమరె న్విరులసోన గురిసెన్ న్మొరసెన్
ధిమిధిమిని దివ్యదుందుభు, లమరమనోహర్షహేతు వగునవ్వేళన్. 74

చ. అలఘుమణిప్రదీపనికరాకర మై తగుసూతికాగృహ
స్థలమున నూత్నరత్నఖచితం బగునుయ్యెలతొట్లలోనఁ బొ
త్తుల వసియించి మించెను సుతుండు సవిభ్రమ మైనవార్ధిఁ జి
ల్వలదొరకుప్పసంపుఁబొరలం బవళించుమురారియో యనన్. 75

మ. జననీదుర్భరగర్భగోళముననే సర్వజ్ఞుఁ డై ప్రజ్ఞచే
ఘనతం బొల్చెను దత్పరాశరునిరేఖన్ భూరివైరాగ్యబో
ధనిరూఢిన్ శుకయోగిచందమున నందం బందెఁ దా నెన్నఁడే
జననం బొందె నతం డదే మొదలుగా సర్వంసహామండలిన్. 76

క. కూరిమిసుతునకు మాఅట,నారాయణునకును విప్రనారాయణుఁ డ
న్పే రిడి జననీజనకులు, గారవమునఁ బెనుప నతఁడు గడు వర్ధితుఁ డై. 77

క. అపు డఖిలవేదవిద్యా, నిపుణుం డగుతండ్రిచేత నిర్మలతేజోఽ
నుపమానమూర్తి యాసుతుఁ, డుపనీతుం డయ్యె శుభముహూర్తమునందున్.

గీ. శౌనకుని భీష్ము శుకు విభీషణునిఁ బుండ, రీకు రుక్మాంగదుని నంబరీషు దాల్భ్య
నరుని నారదునిం బరాశరు వసిష్ఠు,వ్యాసుఁ బ్రహ్లాదుమించె నవైష్ణవుండు.

ఉ. ఆసమయంబునందు సొబగయ్యెను నంగభవాంగరేఖ, మి
థ్యాసఖ మయ్యెఁ గౌను, వదనైందవబింబరుచుల్ నితంబినీ
భాసురదృక్చకోరములపండువు లయ్యెను, జెన్నుమీఱె భూ
మీసురసూతికి న్మొలకమీసము, ప్రాయము డాయనచ్చినన్. 80

—* విప్రనారాయణుని వైరాగ్యము *—

ఉ. అవ్వసుధాసుధాశనకులాభరణం బతిరమ్య మైనయా
జవ్వన మాజవంజవవిశాలసుఖానుభవైకయోగ్య మై
నివ్వటిలన్ విరక్తిసరణిం (దిగె) నిందుముఖుల్ రతీచ్ఛచే
నువ్విళు లూరుడెందముల నోలిఁ జివుక్కు రటంచు నుండఁగన్. 81

క. వానికి ఘటికాచమక, స్థానోదక మనఁగఁ బొదలసాగెను దినముల్
దా నసమాననవీన, జ్ఞానానూనప్రధానుసంధానంబుల్. 82

క. అంతంతకు వైరాగ్యం, బింతిం తనరాక యెలమి నిగుడొత్త నతం
డెంతయు నొకనాఁ డిట్లని, చింతింపందొడఁగె నేకచిత్తుం డగుచున్. 83

సీ. అనఘశుభమాగుణంబునకుఁ బెట్టనికోట యీషణత్రయమున కెదురుఁజుక్క
చింతామహాంబురాశికిని జెల్లెలికట్ట రాగంబునకుఁ జేరరానిచోటు
బలవదంతర్విరోధులకును వేర్విత్తు శ్రేయోవధూటికి జీవగఱ్ఱ
చిత్తనైర్మల్యసంస్థితికిని విడిమట్టు ప్రహ్లాదమునకును బట్టుఁగొమ్మ

గీ. చారుగుణరత్నములకు విదూరభూమి, శమదమాదికములకును సంశ్రయంబు
దైన్యరసమున కెడదవ్వు హైన్యమునకు, నప్రదేశంబు వైరాగ్య మరసిచూడ.

వ. అని వితర్కించి వెండియు నఖండజ్ఞానలీలావిహారుం డగునవ్విప్రనారాయ ణుండు నితంబవతీగేయం బగునెలప్రాయంబు క్షణభంగురం బనియును గుటిలకుంతలప్రభాజితమదన(దిందిందిరమందిరేం)దీవరమందిర యగునిం దిర కెందమ్మికెందలిరుఁటాకునం జెందినసలిలబిందువుచందం బనియును సుకు మారంబు లగుశరీరంబులు చలదళస్పందంబు లనియును గృతార్థీకృతభోగి భవంబు లగుస్రక్చందనవనితాద్యనుభవంబులు నశ్వరంబు లనియును ననేక జన్మపరంపరాసంపాదిత పుణ్యపరిపాకవ్యయప్రభవంబు లగుసితచ్ఛత్రచామ రాందోళికాదివిభవంబులు నీరుబుగ్గలుంబోలెఁ దగ్గు ననియును నాజవంజ వప్రమదాపాదు లగుసుతకళత్రాదులు మాయారూపంబు లనియును మా సర్తుసంవత్సరమయం బగుసమయం బమేయం బనియును శైశవాదికదశా ప్రవణం (బగునా)యుఃప్రమాణంబు (భిన్నఘటీపయఃప్రమాణంబున) కుప మానం బనియును నభిజాతం బగుజాతంబు శంపాకంపమానం బనియును సకలజనస్తుత్యం బగుమిత్రసాంగత్యంబు మతంగజ(కర్ణచపలం బ)నియు నిజ నిర్మాణ విచక్షణవిరించం బగుఘటపటాదికవస్తువిస్తారితవిశ్వదృశ్యప్రపంచం బు స్వప్నంబు తెఱం గనియును బ్రశస్తం బగుసమస్తంబు నింద్రజాలోపమా నం బనియును నిశ్చయించి భవలతాలవిత్రంబును నవిద్యాజైత్రంబును బవిత్రజ్ఞానకందంబునుం బరమానందసుధానిష్యందంబునుం బురందరబ్ర హ్మాదికృతసపర్యంబును నగువిష్ణుకైంకర్యంబు కార్యం బని యవలంబించి తదనుసంధానపరాయణుం డై వర్తించుచుండె. 85

శా. కద్రూజప్రతిపక్షజిజ్జవన(రంగ)ప్రేయసీగేహ లే
ఖద్రూరీకృతదానఖేలన సమిద్ధాంగేయ సౌభాగ్యజా
గ్రద్రూపప్రియతానుధావదబలాకందర్ప సామ్రాజ్యసం
పద్రూఢానుపమప్రభావ కవిరాడ్బంధుప్రియంభావుకా! 86

క. అంబుధిగభీర మత్త, స్తంబేరమకటమదాంబుధారాలహరీ
జంబాలవద్గృహాంగణ, యంబాళాచార్యపదసమాశ్రయహృదయా! 87

స్రగ్విణి. సర్వసర్వంసహైశ్వర్యదానీకినీ
దుర్వితాత్మద్విషద్భూభృశంకాసమీ
చర్వితద్విట్పుదాంచద్గరుత్మన్మణీ
ధూర్వహాలంక్రియా దూరితాహంక్రియా! 88

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్యధుర్య ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర లింగనమనీషిపుత్ర శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ చెదల్వాడమల్లనామధేయప్రణీతంబైన విప్రనారాయణచరిత్రంబనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

—०००—

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీరంగేశ్వరపదప, ద్మారాధననిరతతత్పమాంబాగర్భ
క్షీరాంభోనిధిచంద్ర సు, ధీరక్షణ మాకరాజుతిమ్మనృపాలా. 1

గీ. అవధరింపుము విప్రనారాయణుండు, విష్ణుకైంకర్య మిట్లు గావింపఁ బూని
నైజగమనోచితప్రయత్నమునఁగదలి,కతిపయ గ్రామములులీలఁగడచియెదుట.

—* శ్రీరంగపురవర్ణనము *—

ఉ. అంగభవాహితప్రియపదాంబుజభృంగ మతండు గాంచె శ్రీ
రంగము గారుడాశ్మగృహరాజివిభాయవసాగతేందుసా
రంగము రక్షికీకృతవిరాజతురంగము ముక్తినర్తకీ
రంగము సంతికోపవనరమ్యకవేరసుతాతరంగముల్. 3

శా. నాళీకాక్షులు చూతు రప్పురమున న్నాబిల్లిలోకందు గుం
డేలో వార్నిధిపంకమో హరిణమో నిక్కం బెఱుంగంగఁ ద
త్కేళీసౌధము లెక్కి నెక్కొనిన సందేహంబు వో బింబముం
గేలుందమ్ములఁ బట్టిపట్టి యనురక్తిం గ్రమ్మఱం గ్రమ్మఱన్. 4

మ. పురి నింద్రోపలగోపురోపరిసముద్భూతప్రభల్ భూనభోఽం
తరము ల్నిండ నకాలసంజనితకృష్ణవ్యంజనచ్ఛాయలా
హరిదశ్వాశ్వకమత్థలీనవిపృతాస్యవ్యక్తదంతంబులం
దరుదారం *గనుఁ దా ననూరుఁడు తదీయాయుఃపరిజ్ఞానముల్. 5

శా. భూరిప్రాక్తనవర్తమాననృపు లంభోజేక్షణప్రీతిగా
సారద్రావిడవేదవేత్తలబుభుక్షుల్ దీర నానావిధా
హారోదారములై తిరంబులుగఁ జేయం బొల్చు నచ్చోట న
చ్చో రామానుజకూటము ల్సకలవస్తుశ్రీనిరాఘాటముల్. 6

చ. అతులితభంగి నున్నతి నహంకృతినిం దమతోడ నీడు గా
వితరమతంగజంబులు మహీస్థలిలో ననుమాట నందు న
ప్రతిమమదాంబులోలదుదరంభరిబంభరగంధసింధుర
ప్రతతి నిజంబు సేయును గరంబుల విష్ణుపదంబు ముట్టుచున్. 7

---

* దరియం దనూరుఁడు-అని పాఠాంతరము.

మ. లలితోత్సాహములై సువర్ణమణిమా*లాకంధరాస్ఫూర్తి రం
జిలఁ గందంబులు గల్గి మంగళమహాశ్రీలం బ్రకాశించి కాం
తిలసత్కేసరబంధురంబు లయి పృథ్వీవర్తితఖ్యాతి ని
చ్చలుఁ గావ్యంబు లనం జెలంగు బురి నాజానేయగంధర్వముల్. 8

సీ. పుణ్యజనాధారపురభేది యగుభూతపతికి నశ్వంబులఁ బట్టెఁగాక
ధీవరులకు డాఁగి తిరుగుజంతువుచేత నరయ విద్యావంతుఁ డయ్యెఁగాక
పద్మినీరతుఁడు రేపటివేళఁ దాన నై యసురులతోడఁ బోరాడెఁగాక
తనగాడు విబుధసంతోషసంపద నసియింప మహి నిమ్ము లేకుండ మసలెఁగాక

గీ. కాకయుండిన విధికృతక్రతువిశేష, హుతసమాహూతపురుహూతహితసమస్త
దివిజతత్పురిధారణీదివిజవరుల, సాటిగాకున్నె పంకజసంభవుండు. 9

ఉ. హైమకరార్కవంశభవు లప్పురి రాకొమరు ల్పరాక్రమో
ద్దాములు వారు బాహుబలదర్పమునం బగఁ బూని రేని సు
(త్రాముని నైన హే)ల సమరంబునఁ బిల్తురు దానవైఖరిన్
హేమనగేంద్ర మొక్కనికి యిత్తురు కైసను మై చెలంగినన్. 10

క. పటుబుద్ధిని నేర్చెను ద, త్కటకస్థకిరాటవరులకట్టెడ ధనదుం
డెటువలె నయ్యెను యక్షుం, డట తాను మనుష్యధర్ముఁ డటు గాకున్నన్

ఆ. వైరివిజయ మగ్రవర్ణత్రయీసేవ, ప్రకటితాచ్యుతైకభక్తివిరతి †
సత్త్వగుణముఁ బోలెసన్న్యాసులును బోలెఁబురముశూద్రవరులుపొలుతురందు.

చ. లలితపదాబ్జసంపద కలాపవిభూతి సువర్ణసప్రభా
విలసనముం బయోధరనవీనరుచుల్ జితనాగయానముల్
దలిమభుజంగభోగకలనంబు సువర్ణపటాభిలాషముం
గలిగి తనర్తు రప్పురముకాంతలు విష్ణునిమూర్తులో యనన్. 13

వ. మఱియు నప్పురంబునం (గవేరకన్యాలలామం బభిరామం బగుచు) వివిధ సమీప మహీరుహాచ్ఛాదిత శ్యామాయమానకూలంకషలహరీముహుర్ముహుర్విహారమాణస్వాయంభువసైంధవగరుత్ప్రవమాన పరంపరాసముద్ధూతంబులై ఘుమఘుమాయమానంబు లగు నెత్తావులఁ గ్రేవలంగప్పుపుష్పొళ్లదుమారంబులఁ దోరంబు లగు కెందమ్మితేకులఁ దొరంగుమధురమధురసంబులు గ్రోలి సోలి వ్రాలి మత్తంబు లగు నెలదేఁటిమొత్తంబులపైఁ బడి పతితంబు లగుచు సింధురాజదత్తంబులై నిజధమ్మిల్లబంధంబునఁ గనుపట్టు తలఁబ్రాల

* లోరస్థ్సల-అని మాతృక. † కలిగి, అధ్యాహార్యము.

చందంబున నందంబు లగుశీకరబృందంబులును, నతిత్వరితనిరంతరజగజ్జగమి షావధానుం డగుపవమానుం డంచెలంచెలం బెట్టినఁ గట్టాయితంబులై కను పట్టు హాయధట్టంబులచందంబున నందంబుఁ దుటుములై పరిత్యక్తయవస గ్రసనమంథరారోమంథ పరిపతత్పాండుడిండీరభంగంబు లగుకురంగంబుల కర్ణరసాయనాయమానంబు లగుసామగానంబులనుం బరిపరివిధఖండితేతర మతభేదంబు లగుశాస్త్రవాదంబులను గుశసమిత్పలాశప్రదేశంబులను హరి ణవాంఛాచరితప్రత్యుటజపరస్పరగవేషణంబు లగుపటువటుకభాషణంబులను బొలిచి బహువిధసంచారభరితాధరకౌశలంబు లగుయాగపూజాప్రదేశం బులును, హుతహుతాశనముఖంబుల మిగులం బుగులుకొను హవిఃపరిమ ళంబులతోడం బరిమిళితంబులై పొడమి పుడమి నెల్లెడల నిండి మెండుకొని జగదండఖండంబునఁ గార్కొని తార్కొన్నతమకంబుల ఋత్విగాహ్వానంబు లకుఁ జనుదెంచునిర్జరుల వెంట నంటి తానును నాతిథ్యంబునకు వచ్చియున్న యన్నింగితెఱంగునఁ గనుపట్టు హోమధూమంబులకు జన్మస్థానంబు లగు రోదోఽవనివితానంబులును, నక్రగ్రాహఝషఘులీకుళీరంబులు పరస్పర వైరంబులఁ బోరాడు సమ్మర్దంబునకోర్వక బహిర్గతంబు లగుజటిమానుషక దంబంబులపయిం గనుపట్టుమేల్ముసుంగుల తెఱంగున రంగుమిగిలి ఖరకరుం డురుకిరణనికరంబులు వఱపి తెఱపిఁ గని పయఃపూరంబు లపనయింపఁ జల పట్టి పట్టినజలంబులు మరలఁ గ్రక్కించెద మని దండయాత్రాకుతూహల మానసంబులగు జలదేవతాసంచయంబులు వెలి విడియించిన భటభవనం బుల చందంబున రంగత్తరంగఘట్టనం బుచ్చి కెట్టువలు గట్టి దరులం దొట్టి చూపట్టు క్రొన్నురువుతండంబులును, నహరహఃపయోరుహవిహరణ పరా యణప్రవిశదధవళేక్షణావక్షోజమంజరీమంజుమంజులసంకలితకుంకుమపంకంబు బుగులుకొన నిగనిగలు మిగుల గగనతరంగిణీతోడి సాపత్న్యదోషంబునం బోలె నెఱ్ఱవాఱి ఘూర్ణిల్లుచు మిన్నుముట్టి మరుల్లోలంబు లగునుల్లోలంబు లును, మృదంగంబులఁ బెల్లెగయు ధింధిమిధ్వానంబులకుఁ జంచరీకగానం బులకును బహువిధావధానంబులఁ గమలహస్తాభినయంబులతోడ నాడు పద్మినీనికరంబులం గని కరం బలరి దిగ్వధూజాలంబులు పొసంగ నొసంగు నొసంగులు నైన దుకూలచేలంబులమాడ్కిఁ జూడ్కిపండువు లై పరితఃప్ర వర్తనంబుల నుత్పతనహేతువు లగురాజమరాళంబులును, సింధునాథావరో ధంబునఁ బొల్చుక్రీడాశైలంబుల విభ్రమంబుల నభ్రంకషంబు లై వెలయు

పులినతలంబుల నెసకమెసఁగ మసకంబులఁ జెలంగుచుఁ దరళతరంగపరం పరం బొంపిరివోవుతుంపురులఁ బోలయు మలయమరుదంకురంబులు మెసవుచు సమగ్రంబు లగునుదగ్రమణిగణచ్ఛాయామండలంబు లీరెండలకు మార్గలయ నుత్పణంబులై యాడుచు భృంగీసంగీతంబులకుఁ జొక్కుచుం జలసమీపంబునం గ్రీడించు చిలువతండంబులుం గలిగి నిరంతరదిగంతరాగంతుకయై దిశోద్ధరణకారణంబై మహామహిమం బ్రవహించుచుండఁ దదీయంబు లగుకృతకతరంగిణీజాలంబులు కటిదఘ్నంబులుఁ బెందొడలబంటులు నై యెగనుబ్బి దిబ్బతీర్థంబు లై పొరలి తెరలెత్తి పల్లంబుల వెల్లివిరిసియుఁ గమలకుముదకల్హారమకరందంబులం దుందిలంబు లగుకెలంకులఁ దొలంకెడుకొలంకులం బడియును ననకట్టలఁ దొట్టియు మొనసి పనసక్రముకనారికేళసహకారజంబీరజంబూ తాంబూలవల్లీమతల్లికాకదంబంబులకుఁ బ్రోది గావించియు నిక్షుదండ మండితంబు లగుపాదులఁ బొదుకొనియుఁ (బొఱు చురలఁ దజ్జల)పూరితంబు లగుచుఁ బెరిఁగి తట్టొఱగి పండి మెండుకొని దుర్వహకణిశభారంబు లగుశాలికేదారంబులును, సుధాలిఖిత శంఖచక్రంబులం గనుపట్టు బహిర్ద్వారకుడ్యప్రదేశంబులం గల వైష్ణవుల తిరుమాళిగెలును, నిరాఘాటఝుంఝూగంధవహారభసంబునకు బెదరి చెదరి పలాయితంబులై పవనభుక్పరివృఢంబులు మఱుంగుచొచ్చిన ఘనాఘనంబుల చందంబున భుజభుజంగంబులం బనమానంబు లగుతిరుగొపుతిత్తులం జెన్నారు తన్నీరుదాసల్లును, నాంజనేయమహోత్సవంబుల కాటకూటంబు లగుసామకూటంబులును, బ్రశిష్యశిష్య పరివేష్టితోపాంతంబు లగునయోమయశంఖచక్రముద్రాదండమండితహసంతికలసమీపంబులం బఱచిన నవరత్నకంబలంబులమీఁదఁ బద్మాసనాసీను లై నానారత్నసంకీర్తనంబు లగు మేరుగిరితటప్రదేశంబులం గనుపట్టు గండశైలంబులలీలఁ బ్రకాశించు నాచార్యపురుషులును, బుణ్యపురుషధామం బగునీ రంగధామంబున వసియించుపురుషులకుఁ బురుషోత్తమతాదాత్మ్యంబు గలుగుటకు సందియంబు లే దని తెలిపెడుపొలుపున జల . . . వెలుంగ శేముషీహారిశయ్యాలగుజియ్యలును, బ్రత్యక్షీకృతమోక్షలక్ష్మీవిశేషంబులంబోని యనశనవ్రత శుష్కీభూతంబు లగుమేనులుం గలకొత్తెమసానులును, జిత్రపటనిర్మితచలద్ధళకదలికాలంకృతంబులై కిసలయసంఘటితప్రగ్రహాగ్రంథిబంధురంబు లగుటవలన నలుదిక్కులం బోలుచుజలరేఖల నంకితంబు లగునంబరంబుడంబు

(సశేషము.)

# రెడ్లనాఁటి రెండుశాసనములు.



కొండవీటిప్రభు వగు పెదకోమటి వేమారెడ్డికాలమందును, ఆయన కుమారుఁడు రాచవేమారెడ్డికాలమునందును మహాకవిశ్రీనాథునిచే రచింపఁబడి ప్రకటింపఁబడినమూఁడుశాసనముల ఎపిగ్రాఫియా ఇండికా (Epigraphia Indica) యను నాంగ్లేయపత్రిక 10-వ సంపుటమున 33-వ సంఖ్యగా నేఁ బ్రకటించియున్నాఁడ. అందు రెండుశాసనము లాంధ్రలోకమునకుఁ దెలియఁగాక యని తిరిగి యిందుఁ బ్రకటించుచున్నాఁడను. ఈరెండును శిలాశాసనములు. మొదటిశాసనము గుంటూరుమండలములో, సత్తెనపల్లి తాలూకా, ఫిరంగిపురగ్రామమున శ్రీవీరభద్రస్వామివారియాలయమున కెదుట నున్న శిలాస్తంభముమీఁదను, రెండవశాసనము ఫిరంగిపురమున కంటియున్న అమీనాబాదుగ్రామమునకుఁ బూర్వోత్తరముగా నున్న "పుల్లరిబోడు" అనుగుట్ట మీఁదను జెక్కఁబడి యున్నవి. 1897 సంవత్సరము ఏప్రిల్ నెలలో నేను ఫిరంగిపురములో జమాబంది చేయుచున్నప్పు డీశాసనములఁ గనిపెట్టి వానికిఁ బ్రతుల వ్రాసి యుంటిని. పిదప నన్మిత్రులును, శాసనాధికారియు నగు రావుసాహెబు హాసకోట కృష్ణశాస్త్రిగా రీశాసనములకు సరియైన ప్రతిబింబములను దీయించి నాకుఁ బంపఁగా వానినిబట్టి మూలమును నిర్ణయించితిని. ఆంగ్లేయపత్రికలో మొదటిశాసనము ప్రతిబింబముకూడఁ బ్రకటింపఁబడి యున్నది. శాసనములు రెండును బద్యాత్మకములుగా నున్నవి. పెద్దశాసనమున 22 సంస్కృతపద్యములును, 3 తెనుఁగు సీసపద్యములును వెరసి 25 గలవు. రెండవదానియం దొక్కసీసపద్యముమాత్ర మున్నది. రెంటి చివరను శాసనకావ్యముల శ్రీనాథుఁడు రచించినట్లున్నది.

శాసనవిషయములఁ జర్చించుటకుఁ బూర్వము లిపినిగుఱించియు వర్ణక్రమమును గుఱించియుఁ గొంత విచారింతము. ఈశాసనముల లిపికిని ప్రమాదీచసంవత్సర చైత్రమాసపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన అనితల్లి శాసనము లిపికిని నంత భేదము లేదు. భ, ఢ, ఫ, యను నొత్తక్షరములు వ్రాయవలసినప్పు డొత్తును దెలియఁజేయుటకుఁ బొక్కిలిలోని నిలుపగీటునకు బదులుగా నక్షరమున కిడుగునఁ గుడిప్రక్కను ౧ అనుగుర్తు వేయఁబడి యున్నది.

కాని భ భా భూలకు మాత్ర మీగుర్తు లేదు. ఈ యక్షరములకుఁ దలకట్టున్న యెడల నొత్తక్షర మనియు, లేనిచో నొత్తులేదనియు గ్రహింపవలయును. వినో దుండ్డు (103) ఇత్యాదిస్థలములం దనుస్వారము పిదప ద్విత్వ మనవసరముగాఁ గన్పట్టుచున్నది.

అర్ధానుస్వారము.

ఒక్కండును (1లో 93) పతియుంగృష్ణవేణ్నా (1లో 102-103) అనుంగుం బుత్రి (1లో 104-105) నారాయణుండు (1లో 105-106) మఖమాసమునంబూ ర్ణిమాదినమున (2లో 2-3) శంకరుండాజి (2లో 4) భుజంగుండు (2లో 5) ఇ త్యాదిస్థలములం దర్ధానుస్వారచిహ్నమునకు బదులు పూర్ణానుస్వారచిహ్నము ప్రయోగింపఁబడినది. ఇదిపొరపా టని భావింపఁగూడదు. పూర్వపుశాసనము లం దేమి, ప్రాఁతప్రతులం దేమి యెక్కడఁ జూచినను నిండుసున్నలే గాని యరసున్న లగపడవు. మిక్కిలి ప్రాఁతశాసనములు కొన్నింటిలో నిండు సున్నకు బదులు అనునాసికాక్షరము ప్రయోగింపఁబడి యున్నది. ఉ. వాణ్ణు* ఈయాధారముంబట్టి నేఁడ నీకాలమున నర్ధానుస్వార ముచ్చరింపఁబడు స్థల ములయందుఁ దొలుతఁ బూర్ణానుస్వారమే యుచ్చరింపఁబడుచుండె ననియు, నాస్వరమును దేల్చిపలుకుచుండుటచేఁ గాలక్రమమున నది యర్ధానుస్వార ముగ మాఱిన దని యు, నుచ్చారణ మిట్లు మాఱినను మొన్న మొన్నటి వఱకు నిండుసున్నయే యుభయోచ్చారణముల కేకచిహ్నముగ వ్యవహరింపఁ బడుచుండె ననియు నూహింపవలసి యున్నది. కావుననే కేతన యాంధ్ర భాషాభూషణమునందు ఊఁదిపలికిన నెఱసున్నయుఁ, దేలిచి పలికిన నరసున్న, యు నగునని విధించెను. ఈసిద్ధాంతమునుబట్టి యరసున్న లన్నియు సాధ్య ములే యనవలసియున్నది. అరసున్నరూప మప్పకవికిఁ బూర్వ ముండినట్లు తోఁపదు.

మున్నూంట యనుశబ్దమునం దనుస్వారౌచిత్యము విచారణీయము.

మొదటిశాసనములోఁ బెదకోమటివేమునివఱకుఁ గొండవీటి రెడ్డి రాజులవంశము వర్ణింపఁబడినది. వంశకర్త ప్రోలయరెడ్డికుమారుఁ డగువేమా రెడ్డి. ఈతఁడే ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునకుఁ గృతిపతి. శ్రీశైలసోపానము

* గుంటూరు, నెల్లూరు, కడపప్రాంతములందుఁ, జెన్నపట్టణమున, దక్షిణదేశమున వాండు, తూంచు, పీంట, తోంట మొదలగుశబ్దములలో దీర్ఘముపైఁ బూర్ణానుస్వార ముచ్చరింపఁ బడుచున్నయది.

నంటిప్రవహించు కృష్ణకుఁ బాతాళగంగ యని పేరు, పాతాళగంగనుండి పర్వతశిఖరమువఱకును యాత్రికుల సౌకర్యార్థమీతఁడు సోపానావళిఁ గట్టించెను. మఱియుఁ బ్రతాపరుద్రునియనంతరము మహమ్మదీయరాజు లాక్రమించుకొన్న బ్రాహ్మణాగ్రహారములఁ బునర్దానము చేసెను. కాకతీయులపిదప వారి రాజ్య మే మయినది, తూర్పుదేశము రెడ్ల కెట్లు స్వాధీనమైనది, అనితల్లి శాసనమువలన స్పష్టపడుచున్నయది.

వేమారెడ్డియన్న యగుమాచారెడ్డి పౌత్త్రుఁడు పెదకోమటివేమారెడ్డి. ఇతనియొద్దను, ఇతనియనంతర మీతనికొడుకు రాచవేమారెడ్డియొద్దను శ్రీనాథుఁడు విద్యాధికారపదము నలంకరించి యుండి రాచవేమునియనంతరము కొండవీటిరాజ్యము క్షీణింపఁగా రాజమహేంద్రవరమున వీరభద్రారెడ్డి నాశ్రయించినట్లును, నదియె యాకవి యంత్యదశ యైనట్లును గనఁబడుచున్నది. మఱియుఁ బార్వతీపరిణయ వేమభూపాలీయ గ్రంథకర్త యగు వామనభట్టనుసంస్కృతకవి కూడ నీరాజునాస్థానమం దుండెడువాఁడు. వేమభూపాలీయ మనుగద్యకావ్యమునకుఁ బెదకోమటివేముఁడే కథానాయకుఁడు. ఈరాజు విద్వత్కవుల నాదరించువాఁడుమాత్రమేగాక విద్వాంసుఁడుఁగూడ నైయున్నట్లు కన్పట్టుచున్నది. అమరుక మనుసంస్కృతశృంగారకావ్యమునకు శృంగారదీపిక యనువ్యాఖ్యాన మీయన యొనరించెను. వామనభట్టును శ్రీనాథుఁడు నిప్పనికిఁ దోడ్పడి యుండవచ్చును. ప్రథమశాసనములోని 6-7 పద్యములు శృంగారదీపికయందును గలవు.

ధాన్యవాటి యనునామాంతరము గలధరణికోట (ఇదిసత్తెనపల్లి తాలూకాలో అమరావతినిఁ జేరియున్నది) ప్రభు వగుగన్నమనాయనికూఁతురు సూరాంబను బెదకోమటి వేముఁడు పెండ్లియాడెను. ఆమె సంతానసాగర మనుపెద్దచెఱు వొకటి త్రవ్వించి దానికి 1331 వ శకవత్సరమునకు సరి యైన విరోధిసంవత్సరఫాల్గున బ ౨ శుక్రవారమునఁ బ్రతిష్ఠ యొనర్చె నని మొదటి శాసనమును, ఆచెఱువునకు నీరు వచ్చుటకై 1337 వ శకవర్షమునకు సరియైన మన్మథసంవత్సర మాఘశు ౧౫ దినమున నానూరాంబకొడుకు రాచవేమారెడ్డి జగనొబ్బగండకాలువ యను నొకకాలువఁ ద్రవ్వించెనని రెండవశాసనమును దెలుపుచున్నవి. కొండవీటిరెడ్లకు జగనొబ్బగండఁ (జగదేకవీరుఁ) డను బిరుదు కలదు గావునఁ గాలువ కాపేరు పెట్టఁబడినది. క్రైస్తవమానముచే సంతానసాగరప్రతిష్ఠాతిథి 1410వ సంవత్సరము ఫిబ్రేవరి 21 తేది శుక్రవార

మునకును, జగనొబ్బగండకాలువ త్రవ్వించినతిథి 1416-వ సం॥ జనవరి 14 తేది మంగళవారమునకును సరి యగు నని దివాన్ బహద్దరు స్వామికణ్ణు పిళ్లెగారు స్థిరపఱచినారు.

ఒకచిత్రవార్త:—పుల్లరిబోడుమీఁద రెండవశాసన మున్న దని నాకుఁ దొలుతఁ జెప్పినది ఫిరంగిపురనివాసి చిలకా వేంకటకృష్ణయ్యగారు. ఆయన ఇంగ్లీషు రానివాఁ డయ్యును దేశచరిత్రము గ్రహింపవలె ననుకుతూహలము గలవాఁడు. శాసన మున్న దని చెప్పుచు నందు డిల్లీ సూరంబాఘాకును గొండవీటిరెడ్లకును జరగినయుద్ధము వర్ణింపఁబడి యున్న దని కూడఁ జెప్పెను. డిల్లీలో సూరంబాఘా యున్నట్లుగాని యతనికిని రెడ్లకును యుద్ధము జరిగి నట్లుగాని చదివికాని విని కాని యుండనందున వేంకటకృష్ణయ్యగారి మాట యందు విశ్వాసము గలుగకున్నను శాసనముఁ జూడవలయు నను నభిలాష ముతో రెండుమూఁడుదినములు అమీన్ బాదాలోని గుట్ట లన్నియు వెదకినను గనఁబడ లేదు. చిట్టచివరకు నాల్గవదినమునఁ గానంబడినది. అందు డిల్లీసూ రంబాఘాసంగతి యేమియు లే దనియు, గీతపద్యప్రథమచరణమందలి “దల్లి సూరాంబచే” ననుపదములను వేంకటకృష్ణయ్యగారు “డిల్లి సూరంబాఘా” యని చదువుకొని తదనుగుణ్యముగాఁ బద్యమునంతను సమన్వయించుకొని రనియుఁ బాఠకులకు స్పష్టపడఁగలదు. పూర్వలిపిని బాగుగఁ జదువలేకపోవుట చేతఁ గాని శాసనములఁ గ్రమముగ సమన్వయించుకొనలేకపోవుటచేతఁ గాని కొంద ఱపార్థములు చేసికొని వానిని సిద్ధాంతములనుగాఁ బ్రకటింతు రనుట కిది యొకదృష్టాంతముగా గ్రహింపవచ్చును.

జయంతి రామయ్య.

1 వ శాసనము. మూలము.

పడమటివైపు.

1. కల్యాణం జగతాం తనోతు
2. స విభుః కాదంబినీమేచకః క్రీడా-
3. [క్రో] డతనుః పయోధిపయసో విశ్వ-
4. ంభరాముద్వహన్। భారాపేతఫణా-
5. వివర్తనవశాన్మోదాయ యస్యా-
6. భవన్నిర్యత్నా భుజగేంద్రమౌళిమణి-
7. భిర్నీరాజనప్రక్రియా। [1*] తమో హరే-

8. తాం తవ పుష్యవంతౌ రాకాసు
9. పూర్వాపరశైలభాజౌ। రథాంగలీ-
10. లామివ దర్శయంతౌ పురా పురా-
11. రేః పృథివీరథస్య। [2*] మానుషాకారకిమ్మీ-
12. రస్తంబేరమవపుర్ధహాః। ఉన్నిద్రయ-
13. తు భద్రాణి రుద్రాణీ యేన సుప్రజా [ః] [3*]
14. యస్మాళౌ నిహితం చిరాయ నిగమై ర్ధ్యే-
15. యంచ యద్యోగిభి ర్యల్లక్ష్మీమృదుపా-
16. ణిపద్మయుగళీసంవాహనై ర్లాలితం
17. జాతా యత్ర వియన్నదీ త్రిజగతీసంతా-
18. పనివాపణీ(1) తస్మాత్కంసభిదః పదాదు-
19. దభవద్వర్ణో గుణార్ణోనిధిః। [4*] తత్రా-
20. భవత్సప్తమచక్రవర్తి వేమక్షితీశో జగ-
21. రక్షపాలః। ఏకాదశీతి ప్రతిభాతి శంకా-
22. యేనావతారాః పరమస్య పుంసః। [5*] రా-
23. జ్యం వేమః స చిర మకరో త్ప్రాజ్యదానైక-
24. తానో భూమీదేవై ర్భువ మురుభుజో-
25. భుక్తశేషా మభుజ్త(2)। శ్రీశైలాగ్రాత్ప్రభ-
26. వతి పథి ప్రాప్తపాతాళగంగే సోపానాని
27. ప్రమథ(3)పదవీ మారురుక్షుశ్చకార। [6*]
28. మాచక్షోణిపతి ర్మహేంద్రమహిమా
29. వేమక్షితీశాగ్రజో రామాద్రైః(4) సదృశో
30. బభూవ సుగుణై స్తస్య త్రయోనంద-
31. నాః। కిర్త్యా(5)జాగ్రతి రెడ్డిపోతనృపతి [ః*] శ్రీ-
32. కోమటీంద్ర స్తతో నాగక్ష్మాపతి రిత్యుపా-

---

(1) "నిర్వాపణీ"యని చదువుఁడు.

(2) "మభుఙ్క్త" యని చదువుఁడు.

(3) "ప్రమథ" యని చదువుఁడు

(4) శృంగారదీపికలో "హేమాద్రేః" అని కలదు.

(5) "కీర్త్యా" అని చదువుఁడు.

33. త్తవపుషో ధర్మార్థ్య(1)కామా ఇవ। [7*] అసూత
34. పుత్రం పెదకోమటీంద్రో విశ్రాణనైకర్ణ మ-
35. సూత పుత్రం। వేమాభిధానం సుగు-
36. ణైకధానం పాథోనిధిర్నాధ(2) మివా [ప్ర]-
37. ధీనాం। [8*] ధాటి(3)దుందుభిభాంకృతి-
38. ంకలయతో నిర్ఘాతరావం రిపూ-
39. ణా నామాని ద్రుతమర్జునస్య జపతో
40. యస్యాజిగాండీవినః। సంగ్రామోపప-
41. దాని తాని భవాతాం రక్షాకృతే సర్వదా వర్ణ్య-
42. ంతామితి బోధయం త్యధిపతీణా ధీయ-
43. ంత్రిణో మంత్రిణః। [9*] శ్రీశైలే స్థిరమూల-
44. తా ముపగతా వృద్ధిం(4) కుమారాచలే ప-
45. ంచారామతలే ప్రతానసుషమా సింహా-

దక్షిణపువైపు.

46. చలేంద్రే తతః। శ్రీకూర్మే పురుషోత్త-
47. మే కుసుమితా యద్ధర్మకీర్తిర్ల్లతా(5)
48. కాశ్యాం విశ్వపతేః పురః ఫలవతీ నిత్యో-
49. పహారోచితం। [10*] అభిమన్యుకరగ్రాహ్యా-
50. ముత్తరాం ఖడ్గపుత్రికాం। నర్తయ-
51. త్యాహవే రంగే యః సంగ్రామధనం-
52. జయః [11*] అశ్రాంతంగృహరాజసౌధ-
53. నివసల్లక్ష్మీకరాభ్యంతరక్రీడాంభో-
54. రుహతాళవృంతనటనప్రస్తావవిస్తా-
55. రితః। వాయుః కేసరవాసనాసుర-
56. భితోయస్యార్థి(6)చింతామణే ర్ద్రా

(1) ధర్మార్థ” అని చదువుఁడు.

(2) “ధానం పాథోనిధిర్నాథ” అని చదువుఁడు.

(3) “ధాటీ” అని చదువుఁడు.

(4) “వృద్ధిం” అని చదువుఁడు.

(5) “యద్ధర్మకీర్త్యోర్లతా” అని చదువుఁడు.

(6) “యస్యార్థి” అని చదువుఁడు.

57. గాఢామతి దానకేళిజనితం స్వేదా-
58. ంభసాంజాలకం। [12*] సప్తసంతానవ-
59. త్యాసీద్యేన సవర్ణంసహేత్యలం। స్వ ధర్మయే-
60. వ ధృతాః కీర్త్యర్థే లోకాశ్చతుర్దశ। [13*]
61. రాజ్ఞస్తస్య మహాదేవీ రాజమాళేరి-
62. వాంబికా। రత్నసింహాసనస్యార్ధే రాజ-
63. తే సూరమాంబికా। [14*] ××× శాకాబ్దే శశి
64. రామరామధరణీసంఖ్యే విరోధ్యాహ్వ-
65. యే వర్షే ఫాల్గుననామ్ని మాసి బహ (హు)ళే
66. పక్షే ద్వితీయాతిథౌ(1) దేవీ సా పెదకోమ-
67. టీశ్వరభువ [ః] శ్రీవేమపృథ్వీపతే [ః] శ్రీసం
68. తానపయోనిధేః కృతవతీ సమ్యక్ ప్రతి-
69. ష్ఠావిధిం। [15*] లీలాలీఢతరంగశీకరకణ-
70. ంరాకావిధౌ రంకుణా హేరంబేణ
71. మదోష్మశాంతివిధయే హేలావగా-
72. ఢం ముహుః। రాజీవాసనరథ్యహ-
73. ంసపరిషచ్చంచూపుటీచర్వితస్వచ్ఛాంభం(2)
74. భోజమృణాళికాకిసలయచ్ఛేదం(3) య-
75. దీయం పయః। [16*] ఘంటాకంఠకఠోరగ-
76. ర్భకుహాళీపాళీమధూళీరస స్రోతః సౌ(4)
77. రభటీకమానమధులిడ్ఝంకారకో-
78. లాహలైః। వాచాలాని వనాని యస్య
79. సవిధే సోయం సుధానిర్మల శ్రీసంతా
80. నసముద్ర ఏష పయసాం రాశి ర్జయ-
81. త్యష్టమః [17*] వైడూర్యరత్న శకలామల-
82. వారిపూరే మజ్జుం(5) కిమత్ర భగవాన్మధ(6)

(1) "తిథౌ" అని చదువుఁడు.
(2) "స్వచ్ఛాం" అని చదువుఁడు.
(3) "చ్ఛేదం" అని చదువుఁడు.
(4) "తస్సౌ" అని చదువుఁడు.
(5) "మజ్జుం" అని చదువుఁడు. (6) "న్మధు" అని చదువుఁడు.

83. కేటభారిః(1) అంగీచకారజగతామవన-
84. ఛ్ఛలేన(2) పాఠీనకఛ్ఛప(3) వరాహమహో-
85. వతారాన్। [18*] ✕✕ శ్రీమహాభారతే॥.
86. దేవా మనుష్యాః పితరో గంధర్వో-
87. రగరాక్షసాః। స్థావరాణి చ భూతా-
88. ని సంశ్రయంతి జలాశయం। [19*] తటాకేయ-
89. స్య గావస్తు పిబంతి తృషితా జలం। [మృ]-
90. గపక్షిమనుష్యాశ్చ సోశ్వమేధఫలం-
91. లభేత్। [20*] ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్య-
92. ంతి పితామహాః। అపి నః సకులే జాతో
93. యస్తటాకం కరిష్యతి। [21*] విద్యాధికారీ శ్రీ-
94. నాథో వీరశ్రీవేమభూపతేః। [అ] కరోదా-
95. కరో వాచాం నిర్మలం ధర్మశాసనం। [22*] శ్రీ.

తూర్పువైపు.

96. శాకాబ్దములు సహస్రము-
97. ను మున్నూంట ముప్పది యొ-
98. క్కండును నైన భవ్యసంఖ్య। వఱలు
99. విరోధి సంవత్సరంబున ఫాల్గు-
100. నంబున బహు(హు)ళపక్షంబు విదియ। *.
101. శుక్రవారంబున శుభముహూ-
102. ర్తంబున శ్రీధాన్యవాటీపురాధిప-
103. తియు। ం గ్రిష్ణవేన్నా (4)జలక్రీడావినో-
104. దుండు నగుగన్నభూపాలునను-
105. ంగుం బుత్రి। వీరనారాయణుం-
106. డు వేమవిభునిదేవి। భూరిసద్గుణ-
107. నికురుంబ సూరమాంబ। జగము
108. వినుతింప సంతానసాగరాఖ్య వర-

(1) "కైటభారిః" అని చదువుఁడు.

(2) "చ్ఛలేన" అని చదువుఁడు.

(3) "కచ్ఛప" అని చదువుఁడు.

(4) "గృష్ణవేణ్ణా" అని చదువుఁడు.

109. తటాక ప్రతిష్ఠోత్సవం బొనర్చ(1) [23] జాహ్న-
110. వీయమునాది సకలపావననదీ-
111. విమలతీర్థాంభః(2) పవిత్రితంబు। 
112. సవిధదేశస్థాయి శివమౌళి బాలేందు-
113. కౌముదీ సంపుల్ల(3) కైరవంబు। బ-
114. హుమహాపరివాహాపాథోభరద్ఘ-
115. నఘుమఘుమాయితదిశాగో-
116. శకంబు। జలసారణీసేక సంవర్ధి-
117. తానేకవనివినీతాధ్వగాధ్వశ్రమంబు।
118. బలవదురుమత్స్యకచ్ఛపఘుళికుళీర।
119. తిమితిమింగిళవిక్రమక్రమవిహార।
120. తరళతరతుంగభంగకదంబచుంబి।
121. తాభ్రవీధి(4) సంతానమహాపయోధి॥ [24*]
122. కపటసూకరమైనకైటభాసురవైరి-
123. ఖురపుటంబులం బరితొన్న మ-
124. య్యె। రఘుకులోద్వహధనుర్యం-
125. త్రముక్తములైన చిచ్చుటమ్ములవే-
126. ండిం జేవదఱగె। ంగుంభసంభవు-
127. నిహస్తాంభోరుహంబున నాపో-
128. సనంబయిఘ్రాస మొందె। ం బాషా-
129. ణముల నచ్ఛభల్లగోలాంగూలక-
130. పియూథముల చేతం గట్టువడియె।
131. వనధి యేభంగి సరివచ్చు ననంగ వచ్చు।
132. నారసాతలగంభీరవారి యగుచు। నప-
133. గతాపాయమగుచు శోభాఢ్య వగు(5)-
134. చు। ననుపమం బైన సంతానవనధితోడ॥ [25*]

---

(1) "బొనచేఁ" అని చదువుఁడు.
(2) "తీర్థాంభః" అని చదువుఁడు.
(3) "సంఫుల్ల" అని చదువుఁడు.
(4) "వీథి" అని చదువుఁడు.
(5) "మగు" అని చదువుఁడు.

## రెండవ శాసనము: మూలము.

1. శాకాబ్దములు సహస్రంబును మున్నూంటముప్పది [యేడును]
2. యొప్ప(1) మిగుల। మహనీయమైనమన్మథవత్సరంబునమఖ(2)మాస-
3. మునం బూర్ణిమాదినమున। హేమాద్రిదాన చింతామణియ-
4. రిరాయబసువ(3) శంకరుండాజిఫల్గునుండ్డు(4)। సమదారిరాయవే-
5. శ్యాభుజంగుండ్డు(4) వేమయరాచ వేమనత్మావరుండ్డు।(4) దల్లి-
6. నూరాంబచే సముత్పన్నమగుచుం। బరగు సంతాన వా-
7. ర్ధికి వరువగాంగ। [నొ] లయు గిరివాహినుల జగనొబ్బగండ। కా-
8. లువఘటించె నాతారకంబు గాంగ॥

"శ్రీనాథకృతి"

---

(1) "నొప్ప" అని చదువుఁడు.

(2) "మఘు" అని చదువుఁడు.

(3) "బసవ" అని చదువుఁడు.

(4) డ్డు "ఇందు" ద్విత్వ మక్కఱలేదు.

# ములుగు పాపయ్యకవి.

ఈకవి శైవుఁడు. సంస్కృతాంధ్రములయం దసమానపాండితి గల వాఁడు. పెక్కుగ్రంథముల రచించినవాఁడు. ఈయనకు వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యు లనునామాంతరము గలదు. ఈనామముచేతనే రావు బహదర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు దమకవిజీవితమున నీతనిం జేర్కొనిరి. కాని యీకవి నుడివిన కబ్బంబుల నన్నింటి నేలొకో వ్రాయలేదు. అహల్యాసంక్రందనవిలాసమును మాత్రమే రచించె ననియు, దానిని సుప్రసిద్ధు లగువాసిరెడ్డివేంకటాద్రినాయనిసోదరపుత్త్రు లగుచంద్రమౌళిగారి కంకిత మిచ్చె ననియుఁ బంతులవారు వ్రాసిరి. ఈయహల్యాసంక్రందనవిలాసము నాకులభింపలేదు. ఈచంద్రమౌళిగారు వేంకటాద్రినాయనిసోదరపుత్త్రు లని కవీశ్వరుఁడు అహల్యాసంక్రందనవిలాసమున వ్రాసియుండె నని నేను నమ్మను. ఏకారణమునఁ బంతులవా రట్లు వ్రాసిరో యూహింపఁ జాలను. వాసిరెడ్డి వారి వంశవృక్షమువలనను, ఇతరగ్రంథములవలనను విచారింపఁగా వేంకటాద్రినాయనికి సోదరులే లేనట్లు కనంబడుచున్నది. వేంకటాద్రినాయని తండ్రులు ముగ్గు రన్నదమ్ములు. పెద్దవాఁడు రామన్న, రెండవవాఁడు జగ్గన్న, మూఁడవవాఁడు నాయఁడమ్మ. ఇందు జగ్గన్నకుమారుఁడే వేంకటాద్రినాయఁడు. నాయఁడమ్మకుఁ జంద్రమౌళి యనునొకకుమారుఁడు గలఁడు. అతఁడే యహల్యాసంక్రందనకృతిభర్తయేమో యని సందియము వొడముచున్నది. అయినచో నతఁడు వేంకటాద్రినాయనిపితృవ్యపుత్త్రుఁడు. మనకవివ్రాసిన పుస్తకములయందు సయితము వాసిరెడ్డివారివంశమున నిట్లేవ్రాయఁబడి యున్నది. ఈకవివ్రాసినగ్రంథములలో 1 దేవీభాగవతము, 2 వేమనారాధ్యచరిత్ర, 3 సర్వమధురము, 4 సరసహృదయానురంజనము, 5 కల్యాణచంపువు. ఈగ్రంథములు మాప్రభువులగు శ్రీవాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద్ బహాదర్ మన్నెసుల్తాన్‌వారి పుస్తకాలయమున నున్నవి. వీనిలోఁ గల్యాణచంపువు సంస్కృతము. దేవీభాగవత మసంపూర్ణము. సంస్కృతమున నేకాదశీమాహాత్మ్యచంపువును రచియించె నని వినికి గలదు. మఱియుఁ గయిసరి వేమనారాధ్యచరిత్రయందు వ్రాసికొనిన-

సీ. పదపదార్థనిబంధబంధురంబుగ ధరాతలమెల్ల నెఱుఁగు శంతనుచరిత్ర
సరసశృంగారానుషంగముల్ శవణిఁ జూపఁగ నహల్యావధూపరిణయంబు
ధీమజ్జనస్తవ్యధీమజ్జనోక్షేమకరముగా నలరు ఘూర్జరచరిత్ర
లసదలంకారలా లసవిశంకటముగాఁ బరఁగు నింద్రాత్మజాపరిణయంబు
తే. శతకపూజాస్తవంబు లసంఖ్యసంఖ్య, మీఱ నీవు పొసంగించు సారకావ్య
రచనమాకెల్లసమ్ముదార్ద్రతవొసెంగె,సరసరుచిసాంద్రసంగమేశ్వరకవీంద్ర.

అనుపద్దెముంబట్టి శంతనుచరిత్ర, అహల్యావధూపరిణయము, ఘూర్జర చరిత్ర, ఇంద్రాత్మజాపరిణయము, శతకస్తవాదులు రచియింపఁబడె నని తెలియు చున్నది. ఇం దుదాహరింపఁబడిన యహల్యావధూపరిణయమే కవిచరిత్ర యందుఁ బేర్కొనంబడిన యహల్యాసంక్రందనవిలాస మయియుండును. మిగి లిన శంతనుచరిత్ర, ఘూర్జరచరిత్ర, ఇంద్రాత్మజాపరిణయము కనంబడుటలేదు. స్తోత్రములు కొన్ని శైవులలో మిక్కిలి యభివ్యాప్తి నంది యున్నవి. సమగ్ర ముగా నున్న దేవీభాగవతము నాంధ్రీకరించినవారిలో మొదటివాఁడే ములుగు పాపయ్యకవి; రెండవవారు తిరుపతివేంకటకవులు. మూఁడవవారు దాసు శ్రీరాములుగారు.

మనకవి దేవీభాగవతము మొదటనే రచియింపఁబడిన దయ్యును నింత వఱకు ముద్రితము గాకుంట యత్యంతశోచనీయము. ఈకొఱంతను ముక్త్యేశ్వర పురాధినేతలు కొలఁదికాలముననే తీర్తు రని నానమ్మకము. ఈ దేవీభాగవత మును వాసిరెడ్డి జగన్నాథబాబుగారును దత్పత్ని యగునచ్చమ్మగారును గోరఁ గా రచియించెను. కాని స్వప్నమందు సాక్షాత్కరించి సెల విచ్చుటంజేసి యన్నపూర్ణావిశ్వేశ్వరుల కంకిత మిచ్చుచు నాప్రభుదంపతులఁ బ్రేరకులఁగాఁ జేసి వారి వంశము నిందుఁ బొందుపఱచెను. మఱియు-

క. దేవీభాగవతస్కం, ధావళిలోఁ బ్రథమ మచ్చమాంబాజగ
న్నాథవరులకభీష్టార్థ, శ్రీవెలయంజేసి సుప్రసిద్ధింజెందుర్.

అని స్కంధాంతముల వ్రాసె. ఈపద్దెమున నున్నజగన్నాథవరుఁడు జగన్నా థబా బనియే కవియాశయము. వేంకటాద్రిసాయని తల్లిదండ్రు లచ్చమ్మ జగ్గన్నగారు లగుటచే నీపద్దెము వారి కన్వయింతు రేమో యని యిట్లు వ్రాయుచున్నాను. దేవీభాగవతమున వ్రాసిన వాసిరెడ్డివారివంశము నిట వ్రాయుటకు గ్రంథవిస్తరభీతిచే వలనుపడలేదు. ఆచరిత్ర యంతయుం జదివిన చో నిచ్చుటస్కంధాంతపద్యమున కాసందియము దగులదు. "ఇత్తెఱఁగున జగ

త్ప్రకాశంబై వెలుంగు వల్లుట్లగోత్రంబునకు నుత్తేజులై గుణమణులు వెదచల్లు జగన్నాథధరావరుండును దత్కళత్రావతంసం బగునచ్చమాంబయు నొక్క నాఁ డేకాంతంబునఁ గొంతతడవు పారమార్థికోదంతంబులఁ గాలంబు గడపుచు" అని కవి వ్రాసియున్నాఁడు. ఈజగన్నాథబాబు సుప్రసిద్ధు లగు వేంకటాద్రినాయనిదత్తపుత్రు లిద్దఱిలో జ్యేష్ఠుఁడు. ఈయనకు అచ్చమ్మ, రంగమ్మ యను నిద్దఱుభార్యలు గలరు. "ఇదిశ్రీపరమశివాద్వైతభావనాసాధ్యసిద్ధసారస్వతవిద్యాసాన్నిధ్యవేమనారాధ్యవంశార్ణవకళానిధానపాపయారాధ్యాభిధానప్రణీతం బైనదేవీభాగవతమహాపురాణంబునందు" అని యీగ్రంథమున గద్యము వ్రాయఁబడియున్నది. వేమనారాధ్యచరిత్ర యెనిమిది యాశ్వాసములుగా రచియింపఁబడి గురున కంకిత మీయఁబడినది. ఇందు "ఇది శ్రీమదుభయ భాషారసజ్ఞరసజ్ఞాగ్రనృత్యన్నాటకాలంకారగ్రంథాంధ్ర ప్రబంధబంధురకవితా నిబంధన శివానుభవసూత్రసంధాన నిరర్గళమానసావధాన శ్రీమద్వేమనారాధ్యవంశపయఃపారావారరాకాసుధాకర శ్రీవీరనారాధ్యార్ధాంగలక్ష్మీశోభావిభాసుర భ్రమరాంబికాగర్భశుక్తిముక్తాఫల శ్రీసంగమేశ్వరారాధ్యవిరచితం బగువేమనారాధ్యచరిత్రంబునందు" అని గద్యవ్రాయఁబడి యున్నది. సర్వమధుర మచ్చతెలుఁగుఁబ్రబంధము. మూఁడాశ్వాసములు గలది. కవి శైవుఁడైనను విష్ణువు స్వప్నమునఁ దనకుఁ బ్రత్యక్షుఁడై శ్రీమతీపరిణయమును రచియింపుమన్న ట్లీపద్యములఁ వ్రాసెను.

సీ. మించుతోమొయిలునా మేలిమియొల్లియె
యొఱపుటొయ్యారంపుటొడలు దనరఁ
బొడుపుఁగూఁకుడుగట్ల ప్రొద్దుజాబిల్లులో
నాఁ జుట్టువాలుఁ జిందంబు లలర
వెలిదమ్మిమిన్నేటి యెలయంచ వెలఁది నా
ఱొమ్ముమానికముపైఁ గొమ్మ నిలువఁ
గెంపుపై మగఱాలగుంపునింపులువోలెఁ,
గెమ్మోవిఁ జిఱునవ్వు క్రేళ్లువాఱ
తే. నన్నుఁ గనుఁగొనుచూడ్కితో నాదునుడులె
వినెడు వీనులతో బయల్ వెడలిపొరలు
నెనరుమదితోడ నెవ్వాని గనరొ యెవ్వ
రట్టిసిరిమగఁ డెదురఁ గన్పట్టినంత.

క. మే మొకతఱిఁ దమిఁ బెనఁగొన, శ్రీమతి నారాచపట్టిఁ జేకొంటిమి య
చ్చామకు మా కగుపెండిలి, సేమంబుగఁ గబ్బముగను జేయఁగ వలయున్.

ఈగ్రంథము నరునకుఁ గృతి యీయఁబడలేదు. ఇందు-

చ. ఇదియపరంజిసొమ్ముపయి నింపుగఁ గెంపులు చెక్కినట్టు లొ
ప్పిదముగ మింటితేర్వరుల పెద్దల నిద్దఱఁ జెప్పు కబ్బ మై
మొదవులపాలతెమ్మెలన ముచ్చటలం గలముల్లుపాపయా
రదు లొనరించు సర్వసుధురంబునఁ దొల్తటివిన్నపంబగున్.

అని గద్యపద్యములు వ్రాయఁ బడెను. సరసహృదయానురంజన మయిదాశ్వాసముల ప్రబంధము, దీనిని బొత్తూరి కుశలవరామమంత్రిగారికిఁ గృతియిచ్చెను. ఇది ముద్రిత మయి యున్నది. కాని కాలే దని చెప్పిననే బాగుండును. తప్పులతడకగా నున్నది. ప్రయత్నించినను లభించుట దుర్లభము. ఇందు వాసిరెడ్డి వేంకటాద్రినాయనివంశం బభివర్ణింపఁబడినది. అయ్యాది కాళిదాసుగారికోరిక. ఇతఁడు గృతినాథుని కన్నయు వేంకటాద్రినాయనిమంత్రి యుఁగాఁ గనంబడుచున్నాఁడు. ఈవేంకటాద్రినాయఁ డిద్దఱుకుమారుల దత్తత చేసికొనె ననియు, నందుఁ బెద్దవాఁ డగుజగన్నాథబాబున కిద్దఱు పత్నులనియుఁ, జిన్నవాఁ డగురామనాథబాబునకు వెంకమ, పాపమ యను నిద్దఱు భార్యలు, దాశరథినాయఁడు, శివప్రసాదనాయఁడు నను నిద్దఱు కుమారులును గల రనియు వ్రాసి-

ఉ. అయ్యెడ వేంకటాద్రివసుధాధిపుఁ డన్నిఁట వృద్ధుఁడౌట కా
దొయ్యన దేహవృద్ధతయు నొంది నిజప్రకృతిప్రధానులన్
నెయ్యము దియ్యముం గొలిపి నిర్మలనైజ సితాతపత్రసా
హాయ్యముగాఁగ రాజ్యమఖిలాంగముఁ గూర్చెను బుత్రసాత్కృతిన్.

క. అంత జగన్నాథమహీ, కాంతుఁడు సౌందర్యవిజితకంతుం డగుచున్
సంతతసామ్రాజ్యధురా, క్రాంతవిభూతిం దనర్చెఁ గరుణానిధియై.

అనియు వ్రాసెను. ఇచ్చట జగన్నాథబాబునకు సంతాన మున్నట్లు వ్రాయలేదు. ప్రస్తుతము రామనాథబాబుగారిసంతతియే విరాజిల్లుచున్నది. కృతిభర్త లగుపొత్తూరివారిసంతతివా రిప్పుడు గుంటూరిలోనుండినట్లు వినెదను. కల్యాణచంపువు ప్రౌఢముగా నున్నది. అమరత్రికాండములు నెమరునకు వచ్చువాఁ డీచంపువు నన్వయింపవచ్చు నని నాయభిప్రాయము. ఐనను వ్యాఖ్య యుండఁదగినగ్రంథము. ఈకవి ఇందుమతీపరిణయమను నొక

యాంధ్రప్రబంధమును రచియించె నని వీరివంశమువారు చెప్పుచుఁ గొన్ని పద్యములఁ జదివెదరు. ఆపద్దెములు మఱియొకగ్రంథమునఁ గన్పట్టుచున్నవి. ఏమని వారి నడుగఁగా, ఇందుమతీపరిణయమును మాదగ్గఱ నుండఁగాఁ దీసికొని వెళ్లి తిరిగి యీయక పద్దెముల నన్నింటినిఁ దస్కరించి దనగ్రంథమున వేసికొని ముద్రింపించుకొనియె నని చెప్పిరి. ఇం దెంతనిజమో తెలియదు గాని యిందుమతీపరిణయమును మనకవి రచించినట్లు కింవదంతి గలదు. ఈ కవి నూఱుసంవత్సరములకుఁ బూర్వపువాఁడు. తల్లిభ్రమరాంబ, తండ్రి వీరన్నయ్యవారు, పితామహుఁడు సంగయ్య, ప్రపితామహుఁడు వీరన్నయ్యవారు. ఈకవికి సాళ్వపతి, శంభులింగము, రాజలింగము, బసవయ్య, అను నల్గు రనుజులుండిరి. వీరివంశము తామరతంపరగా వీరాజిల్లుచున్నది. ఈకవి మనుమనికుమారులు వీరభద్రయ్యయ్యవా రీకవిచే రచియింపఁబడినసర్వమధురమును దిద్ది ముద్రింపించి ప్రచురించుకొనుటకు సర్వస్వాతంత్ర్యమును నాకిచ్చియున్నారు. నాచే రచియింపఁబడిన టిప్పణితోఁ గొలఁదికాలమున నీగ్రంథము ముద్రితము గాఁగలదు.

పురాణం రామచంద్రశాస్త్రి.

# హైందవచిత్రకలానైపుణము.

మన పూర్వపుచిత్రవిద్య దీర్ఘకాలమునుండి ప్రచారము లేక పోవుటచే ననామకమై పోయినది. కావుననే పాశ్చాత్యులు హిందూదేశమునం దేకాలము ననుఁగూడఁ జిత్రవిద్య యభివృద్ధిపొంది యుండలే దని యభిప్రాయపడి యుండిరి. వారినే యన నేల! మనహైందవులు సయితము వారినే యనుకరింపఁ జొచ్చిరి. అయిన నిప్పటి జాతీయోద్ధరణాభిలాష మనల మరలఁ జిత్రకళాభిముఖులం గావించినది. ఎచ్చటఁ గొన్నిసంవత్సరములకుఁ బూర్వము హిందూదేశము చిత్రవిద్యయందుఁ గూడ సంపూర్ణాభివృద్ధిఁ గాంచియుండెనని మన స్ఫూర్తిగఁ జెప్పఁజాలిన మహానుభావుఁ డొకఁడైన లేకుండెనో యచ్చట నేఁడు వేలకొలఁది హిందువులు మనతొంటిచిత్రకళానైపుణము నేకగ్రీవముగ నొప్పుకొనుచున్నారు. మఱియు వా రిప్పు డీహృదయరంజకమైనవిద్యాభ్యుదయమున కిటాలియాదేశము జన్మస్థాన మని యొప్పుకొనరు. కవితయందును, శిల్పమునందును నప్రతిమానపాండిత్యమును వెలిపుచ్చిన మేధాశక్తి, చిత్రకళానైపుణమునం దేల తీసిపోవును! ఈవిద్యాత్రితయమునకు మిగుల సామీప్యము. ఒకదాని నొకటి సంబంధించియే యుండును. కవితాభివృద్ధికంటె శిల్పము, చిత్రలేఖనమును వృద్ధిఁగాంచుట కెక్కుడుకాలము పట్టినను బట్టవచ్చును గాని వీనిలో నొకటి యభివృద్ధిగాంచి, వే ఱొకటి యడఁగియుండు ననుటమాత్ర మసంభవము. మన దీర్ఘకాలాజాగరూకతచే నామమాత్రావశిష్టమైన యీ విద్యను సన్మానింపవలయు నను నభిలాష మనమనములయం దుదయింపఁ జేసిన యాపరమదయాపరుఁ డైనపరమేశ్వరునకును, మఱియు మనల సుషుప్త్యావస్థనుండి మేలుకొలిపి జాగరూకులం జేసిన కలకత్తానగరమందలి చిత్రకళానిపుణులైన బాబు రూపేంద్రనాథ్ ఠాకుర్ గారికిని మన మెంతయుఁ గృతజ్ఞులము. వీరే ప్రాచీనమార్గమున కాధునికవర్ణము లనెడి మెఱుఁగులను బెట్టి హైందవచిత్రకళ కొకబలమైనపునాదిని స్థాపించి "ఆంగ్లేయచిత్రకారుల చిత్తరువులను దొంగిలించుచున్నా" మని మనమీఁద నాపాదింపఁబడిన కళంకమును రూపుమాపి విద్య నుద్ధరింపఁ జేసిన మహాపురుషులు. వీరిచే స్థాపింపఁబడిన సంఘము నయమార్గమున మిగుల నభివృద్ధి నొందినది. వీరు వ్రాసినచిత్రపటములం

దనేకములు, మతచరిత్రాత్మకము లై యుండెను. కవిశ్రేష్ఠుఁ డగుకాళిదాసుచే వర్ణింపఁబడిన ఋతువర్ణనమును సయితము తమ యపూర్వలేఖనీప్రభావముచే నెన్నెన్నియో పటములులిఖించి, తమచిత్రకళాప్రౌఢిమ లోకమునకు వెల్లడింపఁజేసిరి. వేయేల వారిపటములు నయవిద్యాసంబంధములును, చరిత్రాత్మకములు నై, జాతీయాకర్షణపరిపూరితములుగ నుండు ననుటయె వానియందుఁ గలముఖ్యవిశేషము. ఇట్లే పెక్కండ్రిపుడిపుడు తమప్రతిభ నుపయోగించి మనప్రాచీనవిద్యలయెడ నాదరము గలిగించుచున్నారు. కావున మనప్రాచీనులచేఁ జేయఁబడిన కార్యక్రమమును జూచి వారిప్రజ్ఞావిశేషములం గీర్తించుచు, గౌరవించుచుండవలయు ననెడి జ్ఞానము మన కావశ్యకము ఏమనఁగా? అమెరికా ఐరోపా మున్నగు ఖండాంతరములవారుగూడ మనభారతవర్షమున కేతెంచునప్పు డవకాశముఁ గల్పించుకొని యైనను, అజాంటా, సాంచి మొదలైనగుహా స్తూపముల దర్శింప నాయాస్థలముల కేగుట తమ విధ్యుక్తధర్మ మని తలంచుచుండఁగా మనవృద్ధప్రపితామహులచేఁ జేయఁబడిన యనన్యసామాన్యము లైనకార్యములను గనులపండువుగఁ గాంచుట కైన మన కవకాశము లేకుండు టెంతయు నగుఁబాటు గదా!

హైందవచిత్రవిద్యకుఁ జరిత్రానుసారముగ, మూఁడుకాలము లేర్పఱుప వచ్చును. ఆదిమకాలము క్రీ. పూ. రెండవశతాబ్దము మొదలు క్రీ. శ. ఏడవ శతాబ్దమునఱకుఁ బూర్తియగుచున్నది. ఈకాలమే బౌద్ధు లభివృద్ధియందుండిన కాలము. బౌద్ధులకాలపుఁజిత్రశిల్పకళానిపుణతకు నేడుఁగూడ లోక మంతయు నచ్చెరు వొందుచున్నది. కాని వారికిఁ గలిగిన చిత్రకళాకౌశలమును, మఱియు శిల్పవిద్యాభిరుచియు సాధారణముగఁ బామరజనదురవగాహమైయుండును. అందు నిక్కాలమున వారిచే నిర్మింపఁబడిన చెక్కడపుఁబను లసంఖ్యాకములుగ నుండుటచే వారికళాకుశలత్వమును, హస్తలాఘవమును, సాధారణముగఁ బండితులకే గాని పామరులకు సుబోధకములు గా కున్నవి. ఈయాదిమకాలమం దన్నింటికంటెను సుప్రసిద్ధ మైనట్టియు, నతిగౌర వార్హ మైనట్టియు చిహ్నము లజాంటాగుహాయందలి శిల్పములవలనను, చెక్కడపు పనులవలనను గానవచ్చుచున్నవి. ఇట్టిగుహాలు పందొమ్మిది మాత్రమే యున్నవి. ఇవి యన్నియు రెండవ, యేడవశతాబ్దములకు మధ్యకాలమున నిర్మింపఁబడినట్లు తోఁచెడిని. వానినే బౌద్ధులయొక్క చిత్రాదివిద్యల శైశవ, యౌవనదశాప్రభావసూచకచరిత్ర లని చెప్ప నొప్పును. ఈపేరువడసిన యజాంటాగుహా యించుమిం

చుగ నైజాము రాజ్యదక్షిణభాగమున నున్న దని జను లెఱుంగవచ్చును. ఇక్కాలవుఁ జిత్రకారు లాగుహాయొక్క పైభాగమును, బ్రాకారములను దమప్రవీణత వెల్లడియగున ట్టమర్చి బాగుచేసిరి. అంతర్భాగమందలి విగ్రహములును, మఱియుఁ జెక్కడపుఁబనులును జెక్కుచెదరక యట్లేయున్నవి. అచ్చ టచ్చట విశేషము లైనప్రతిమలు కాలక్రమమున శిథిల మైపోయినను, కొన్నికొన్ని మాత్రము వారి శిల్ప, చిత్రవిద్యాకౌశలమును గీర్తించు చున్నవో యన నిలిచియున్నవి. ఈచిత్రప్రతిమ లక్కాలమందలి యాచారవ్యవహారాదులను జక్కఁగ బోధించుటకై విపులముగ వ్రాయఁబడిన చరిత్రలనలె నున్నవి. పేరెన్నికఁ గాంచిన ఖండాంతరపండితులు సయితము నైకకంఠ్యముగ నీప్రతిమలందలి కుశలత్వమును గొనియాడి యిటాలియాదేశమందలి పదునాల్గవశతాబ్దమునందుఁ గలప్రతిమలతో సరిపోల్చుచున్నారు. ఈప్రతిమల చరిత్ర సాధారణముగ బౌద్ధమతమునే యనుకరించును; కాని యచ్చటచ్చట న ...ఖ్యము లైనచరిత్రాత్మక విషయములును, జక్కఁగఁ జూపఁబడి యున్నవి. ...ణము ...మందలిప్రతిమలలో మఱియొకయద్భుతవిశేషమును గలదు. అది ... మరంజక...; ఈప్రతిమ లెచ్చట నున్నను జూపఱ కీప్రతిమలన్నియు నేకపారశ...కొనరు. ...విద్యాభ్యాస మొనర్చిన చిత్రవిద్యావిశారదులచే నిర్మింపఁబడియ...చ్చిన ...డి భ్రాంతిగలుగును. ఈసమానత్వ మొక్కహిందూదేశమందే కాక సింహళద్వీపమం దున్న నగరియాపట్టనమందును బ్రతిమలయెడఁ గన్పట్టుచున్నది. మఱియు జావాద్వీపమందును నీకాలపుఁబ్రతిమలు కొన్ని కనుఁగొనఁబడినవి. అవియును నట్లేయున్నవి. ఈకాలమందలి ప్రతిమ లేవిషయమందును, నవీనశతాబ్దమందలి యాంగ్లేయచిత్రకళాసమర్థులచేఁ జిత్రింపఁబడిన ప్రతిమ లెంతమాత్రమును దీసిపోవునవి కావని యనేకచిత్రకళాసంస్కారు లభిప్రాయపడి యున్నారు. ఐరోపాదేశమందేకవర్ణాభిరుచియందలిమర్మమును గనుఁగొనుట కనేకాధారములు కానఁబడుచున్నవి. కాని యీకాలమందలి యిట్టియేకాభిరుచియొక్క రహస్య మేయేవిషయములపై నాధారపడియుండెనో, వానిం గనుఁగొను టెంతయుఁ గష్టసాధ్యము. ఏమన? బుద్ధుఁడు శిల్పచిత్రలేఖనాదివిద్యల కాకర మై వెలుంగుచుండెను. "బౌద్ధమతచిత్రకారులు హిందూదేశావకాశము లెల్లఁ దిరిగి చూచి రనియు, నప్పుడు దేశమంతట నీయేకవర్ణముననే ప్రతిమలు వేయునాచారము గలదనియు, నదియే యనేకశతాబ్దములవఱకు దినదినప్రవృద్ధిని గాంచియుండువనియుఁ దలఁచినచో నది యొకయూహావిశేషమే యగును గాని, యట్టియూ

హాను బలపఱుచునట్టి యితఱకారణము లేవియును గానరావు. ఏడవశతాబ్దా నంతరము హైందవచిత్రకళాంగనాముఖచంద్రుఁడు కళలుతగ్గి నానాఁటికి వికాసముచెడి తుదకు నామమాత్రావశిష్టుఁ డయ్యెను. అప్పటినుండి మొగలాయి చక్రవర్తులకాలమువఱకు ననామకుఁడై మఱుఁగునడి యుండెను; బౌద్ధమత వృక్షము సమూలముగఁ బెల్లగించివేయఁబడెను. దానితోఁగూడ శిల్ప, చిత్ర లేఖన, విద్యాశాఖలును నేలవ్రాలెను. దేశముయొక్క యుత్తరభాగముపై మహమ్మదీయులు దాడివెడలి క్రమక్రమముగ దేశమున విశేషభాగము తమ వశముఁ జేసికొనిరి. ఈమార్పులవలననే చిత్రలేఖనాకన్య సగము కృశించెను; ఇస్లాముపున్యాయమార్గ మంతఱును జిత్రలేఖనము పాప మని తలఁచుచుండిరి. ఇట్టిదౌర్భాగ్యస్థితియందు చిత్రలేఖనాకన్యక యభివృద్ధిఁ గాంచు టటుండ సజీవముగ నుండుటయె యసాధ్య మయ్యెను.

అక్బరుచక్రవర్తికాలమువఱకు మన కీచిత్రకళావిషయమును గూర్చిన చరిత్ర తెలియదు. అక్బరుచక్రవర్తి కాలమెల్ల నభ్యుదయముల కాకర మైనది. కావున నీచరిత్రకళాంగనయు మరలఁ జెప్పితిల్లి యాకాలమున సంపూర్ణముగఁ బాలుగొనియె. అక్బరు తాను విద్యాపరిపూర్ణుఁడు కాకపోయినను సకలకళా పరిపూర్ణుఁ డైనయానర్వేశ్వరుఁ డాతని కమితప్రజ్ఞావిశేషముల దయచేసి యున్నాఁడు. గ్రంథస్థమై యుండువిద్యగూడ దానియం దెట్టిమార్పును జేయఁజాల కుండెను. వానికి గానము, చిత్రలేఖనము, శిల్పము, నీతి, చరిత్ర మున్నగునెల్లవిద్యలయందును సమానాపరిభాష ముండెను. ఫతెహపూర్, సిక్రీల యొద్ద నిర్మింపఁబడిన భవనములలోని హిందూ, మహమ్మదీయులచేఁ జేయింపఁబడిన సమ్మిశ్రశిల్పకార్యక్రమ మెంతయు రమణీయమై యాతనిశిల్పవిద్యా వైశద్యమును, గొనియాడుచున్నది. హైందవచిత్రలేఖకు లీకాలమున మిగుల గౌరవదృష్టినిఁ జూడఁబడుచుండిరి. "హైందవచిత్రపటములు మానవుల యూహాపోహలను సయితము మించిపోవుచున్న" వని యాతఁ డొకానొక మాఱు వాక్రుచ్చి యుండెను. హైందవచిత్రకారుల కౌశలమును సూచించుట కీవాక్యమే చాలును. వా రొకవిధ మైనప్రత్యేకవిశేషమును గలిగి యుండకపోయినయెడల, పారసీకచిత్రకళానిపుణుఁడు సూక్ష్మగ్రాహియు నగు నక్బరువంటి మహాత్ముఁ డట్లనునా!! మఱియు నీక్రిందివాక్యములచే నాతనికిఁ గలచిత్రకళాభిరుచియుఁ దదభిమానమును దెలియవచ్చుచున్నది.

"చిత్రకళాభిరుచియం దసహ్యమును జూపువా రెందఱో కలరు; కాని

నాదృష్టియం దట్టివారియెడ గౌరవ ముండఁబోదు. చిత్రకారుఁడు సర్వేశ్వరుని మహిమను గనుఁగొనుట కవకాశముఁ గలిగియుండును. చిత్రకారుఁడు జీవజంతువులపటములను వేయునప్పుడును, మఱియు నాజంతువుల యవయవనిర్మాణముఁ జేయునప్పుడును, 'నేను శరీరమునందు జీవమును బోయఁజాల' నను నంశ మాతనికి మాటిమాటికి జ్ఞప్తికి వచ్చుచుండును. కావున జగత్కర్తయైనసర్వేశ్వరుని శక్తి, సామర్థ్య బీజము లాతనిహృదయక్షేత్రమున దట్టముగ నాటఁబడి, యవి మొలకలెత్తి వృద్ధి యవును; అప్పు డాతఁడు తత్త్వదర్శియొక్క పదవినిఁ బొందు ననుట నిర్వివాదాంశము."

ఫతహపూరు, సిక్రిలయందలి కొన్నికొన్ని దివ్యభవనకుడ్యములపై, నందును ముఖ్యముగ నక్బరుచక్రవర్తి శయనగృహమం దాకాలపుఁజిత్రప్రతిమాచిహ్నములు గానవచ్చుచున్నవి; కాని యవియుఁ గూడఁ గొన్నిమాత్రమే కలవు. బౌద్ధులకాలములోని ప్రతిమలు గోడలపైని శిలలపైనిఁ జెక్కఁబడుచుండె నని మీఁదికథాభాగమువలనఁ జదువరులకుఁ దెలిసియేయుండును. ప్రస్తుతకాలమందలి యమూల్యములైన ప్రతిమ లట్లు గాక గ్రంథస్థములై యుండినవి. కాగితములపైఁ బటములఁ జిత్రించి వానిచే గోడల, ద్వారబంధముల నలంకరించునాచారము ఆదిమకాలమునందేగాక యక్బరుచక్రవర్తికాలమువఱకునుగూడ లేకుండెను; కాని యీయాచార మైరోపాదేశమునుండి వచ్చినది. కొంచె మించుమించుగ మొగలులకాలమువఱకు గోడలపైఁ జిత్రముల వేయునాచార ముండినను, ఆకాలముననే యది క్షీణించుట కారంభించినది. కావుననే యిక్కాలపుఁబ్రతిమ లన్నియు గ్రంథస్థములై యున్నయవి. అయినను హిందూదేశమునం దిప్పటికి నీయాచారము పూర్తిగ నశింపకనామమాత్రావశిష్టమై యచ్చటచ్చటఁ గానవచ్చుచున్నది. ఇప్పటికిని బూర్వాచారవినిర్మితభవనప్రాకారకుడ్యములపై, ఏనుఁగులు, గుఱ్ఱములు, ఒంటెలు, మత్స్యములు, కాల్బలము మున్నగుచిత్రవిచిత్రప్రతిమల మనము చూచుచునే యున్నారము. అట్టి దంతయును మాఱి యిప్పు డీవిద్య మిగుల హీనదశకు వచ్చినది. ప్రస్తుత మీవిద్యను గౌరవించుమహాపురుషు లరుదు. ఐరోపాలోని యొకానొకపరిపూర్ణప్రజ్ఞావంతుఁడైనపరిశోధకుఁడు మొగలులకాలపుఁ జిత్రప్రతిమలఁగూర్చి ప్రస్తావవశమున నిట్లు వ్రాసియున్నాఁడు. "చిత్రకళాస్పష్టావలోకనమందు గోచరము లగుచున్న నవీనకాలచిత్రపటములు, వారి నైసర్గికప్రతిరూపలేఖనమునంగల సంభరితోత్సాహేచ్ఛలను జూపకయే చూపుచుం

డును. ఆతప, చ్ఛాయా, ప్రభావ ప్రతిరూపములనయితము చిత్రింప వారు సమర్థులై యుండిరి. చిత్రకారుఁడు మానవప్రతిరూపమును వేయునపు డెల్లనం దాతనిమానవశరీరగాఢావలోకనమునకుఁ బ్రబలప్రమాణములు గాన్పించుచునే యుండును. వారి సూక్ష్మదృష్టి, అవలోకనచతురత, హస్తలాఘవము, ముఖావలోకనచేఁ గలిగిన మానసికాకర్షణమును, క్రియారూపమున వెల్లడించుట, యిట్టి వీనియొక్క సామర్థ్యసమ్మేళనమే పాశ్చాత్యసంకుచితోత్కృష్టచిత్రప్రతిమలకు వెనుదీయనిప్రతిమలను నిర్మింపఁజాలినది." చిత్రలేఖనాగౌరవమొక్కయక్బరుకాలముననే కాక షహాజహానుకాలమునకుఁగూడ నబ్బి యుండెను. అతఁ డెంతయు సంభరితోత్సాహములతో నీకళాభిమానమును వహించి యుండెను. మొగలువంశ మంతరించినంతనె యీకళాభివృద్ధియు నానాఁటికి సన్నమై తుద కంత మొందెను. మొగలువంశ మంతరించునప్పటికి మరల దేశ మన్యరాజాక్రమణసంక్షోభమునకు గుఱియైనందున నావిషయమును గూర్చి విచారించువా రెవరును లేకపోయిరి. మరలఁ జిత్రకళాకన్యకు వెనుకటిప్రాణావసానకాలమే ప్రాపించి పదునెనిమిదవశతాబ్దాంతము వఱకు మరణవేదనాభరమును సహింపఁజాల కుండెను. తుదకు పందొమ్మిదవశతాబ్దాంతమునఁ బాశ్చాత్యనాగరకత ప్రబలి మనహైందవచిత్రకళాకన్యక చరిత్ర ముగింపునకుఁ దెచ్చినది.

మొగలులకాలపు చిత్రప్రతిమ లెల్లను సాధారణముగ మతసంబంధములు గాకుండెను. వానిలోఁ జరిత్రప్రపంచముయొక్క కాలానుసరణమైన జీవితము, నీతి మున్నగువాని యభిప్రాయములఁ దెల్పు ప్రతిబింబములు గానవచ్చుచున్నవి. ఒకచోఁ జిత్రకారుఁడు మోహప్రేమాతిశయపూరితము లగు గాథలును, మఱెన్నియో దేశీయమహాసభలను, క్షాత్రవంతము లైనరణములను గూర్చినకథానకంబులను వినిపించుచున్నట్టు కానఁబడుచుండును. వేఱొకచో రాజులయొక్కయు మఱియు వారిప్రియాంగనలయొక్కయుఁ బ్రతిబింబములును, వారికిఁ గలపరస్పరస్నేహానురాగప్రభావములను జూపుచుండును. ఒకానొకప్పు డాతనినిరంకుశదృష్టి సాధారణముగఁ జర్మచక్షువుల కగోచరము లగుతావులంగూడఁ బ్రవేశించుచుండును. లాఁగులు బిగియించి యుద్ధమునకు సిద్ధపడి నిలిచినమల్లుల తొడచఱుపుధ్వనులు చెవులఁ బడుచుండునపుడును, గనులపండువుగా నుండునానావిధలతాతరుశోభితంబు లైనవన్యమృగముల వేఁటాడువనములఁ గన్నులఁగట్టినట్టు లెదుటఁ బెట్టునపుడెల్లను,

సర్వదయామయుఁ డైనయూాశ్వరుఁడును మఱియు నాతనిసర్వాంకషప్రతిభావిశేష మును నించుమించుగఁ జూపఁబడుచునే యుండును. వేయేల యీాకాలపుఁ జిత్రవిద్యానైపుణ మంతయు మొదటినుండి చివరవఱకు రాజసభలరూపమునఁ జిత్రింపఁబడినది. రసికజనశిరోమణులు గుణగ్రహణపారీణులు నగురాజుల మనముల కెంతయు నుత్సాహమును, సంతోషమును గలుగఁ జేయుటయే తదు ద్దేశము. ఈచిత్రపటములయందు సాధారణముగ లేఖనాకుశలత్వపరిమావధి చిత్రింపఁబడుచుండును. చిత్రకారుఁడు పరోక్షవిషయములపై రమణీయ మగు మెఱుఁగుఁబూఁతను బూసి యావిషయము ప్రత్యక్షముగ జరుగుచున్నట్టు చూపును. ఒకచో సభాస్తారులమనముల నాకర్షింపఁజేయఁజాలిన మధురస్వర ములు చెవులసోఁకినట్లుండి కర్ణపర్వ మగుచుండును; ఇంద్రలోకమున గంధర్వ స్త్రీలు పలుచనిపట్టుపుట్టంబులచే మేనుల నలంకరించుకొని సితార చేఁబూని మధురగానము సేయుచు నాట్య మాడుచుండినట్టును, నానావిధఫల, పుష్ప, తరు, లతాశోభితంబులై కనులకుఁ విందు గావించుచు, నందనవనమును సైతము ధిక్కరింపఁజాలిన యుద్యానవనమునఁ బసనుఁడు పుష్పముల కస్తూరావులతోఁ గూడి వనవిహారుల మేధాబుద్ధుల రెట్టింపఁజేయఁ జాలినట్లును స్పష్టముగఁ జిత్రపటమును జూచినమాత్రముననే మనసునకు గోచర మగుచుండును.

ఈచిత్రపటసారములు రమణీయమైన నవరత్నస్థగితసంశోభితంబులై యుండుట వానియందుఁ గల మఱియొకవిశేషము. సామాన్యముగ నాకాల మునఁ జలువరాలపైఁ జెక్కఁబడుచుండునట్టి కుసుమలేఖనమును బోలి యానంద దదాయకము లైన చిత్రవర్ణములచే నలంకరింపఁబడిన నానావిధపుష్పము లెన్నియో చిత్రింపఁబడి పటమునకుఁ గలస్వాభావికశోభను ద్విగుణము చేయం జాలి యుండును. ఇక్కాలపుఁ జిత్రకారులకుఁ బటములకు రంగువేయుట యందుఁ జక్కనియనుభవము గలిగి యుండెను. మఱియుఁ బటముల నలంక రింపఁజేయు రంగులు వారు స్వయముగఁ జేయఁగలిగి యుండిరి. పలుమాఱు రంగులను వేయునుపకరణములను గాగితములను, సైతము వారు స్వయముగఁ గృషిచేసి చేసికొనుచు నచ్చిరి. భూప్రతిబింబమును వేయునప్పుడు వారు సాధారణముగఁ జీనాదేశపుమన్ను నుపయోగించుచుండిరి. కాని కొన్ని సమయములయందు సాధారణ మైనమంటిని సైత ముపయోగించి యుండిరి.

మొగలులకాలమందలి మూఁడుచిత్రపటములుగలవు. అందలి మొదటి పటముమాత్రము చరిత్రాత్మకము. ఆపటము జహాంగీరుచక్రవర్తికాలమును

సూచించుచున్నది. పారసీకమునుండి రాయబారము వచ్చియుండెను. అప్పటి యాచారానుసారము రాయబారులు చక్రవర్తికొఱకు వెలలేని గుఱ్ఱములను, మఱి ధనకనకాద్యమూల్యములను, కానుకలను గూడ వెంటఁ గొనివచ్చి యుండిరి. పాదుషాహాగారి దర్శన మింకను గా కుండెను. ఆరాయబారులు రాజసందర్శనార్థము తలయొగ్గి వేచియుండిరి. ఇవ్విధముగా నైజముగా నున్న యాపటమువలన మాతృపటపరిజ్ఞాన విశేషము నూహింపఁ జాలకపోయినను, బటమును జూచినంతనె నయ, వినయ, గంభీరాది, రాజులకీవి యంతయుఁ దలఁపునకు వచ్చుచుండు ననుటమాత్రము నిశ్చయము.

రెండవపటమునం దొకవిలేఖకునిరూపము చిత్రింపఁబడినది. ఆతఁడు జహాంగీరు కాలమందుననో, షాహాజహానుని కాలమునందుననో యుండియుం డును. ఇందుఁ జిత్రకారుఁడు తనయద్భుతప్రజ్ఞావిశేషమును జూపి యున్నాఁడు. ఎండ, నీడల సమ్మేళనచమత్కారముచేఁ నొక యపూర్వలావణ్యము గలిగి, యాతనిముఖవికాస మెంతయుఁ గొనియాడఁదగి యున్నది.

మూఁడవది హిందూమతాత్మకమైనది. అది యగ్బరుకాలమునాఁటి హిందూచరిత్రకారుల ప్రజ్ఞావిశేషమున కొకయాదర్శము. రాత్రికాలము. చిత్రపటము మిగులఁ గాంతివంతమై, మనస్సున కెంతయు సంతోషము నుత్సాహమును, గలుగఁజేయుచున్నది. ఉమ తనయిరువురుసఖులతోఁ గూడి మహేశ్వరుని బూజించుటకై వచ్చియున్నది. కుడిప్రక్క శివునివిగ్రహ మలంక రింపఁబడి యున్నది. పయినుండి యొక సన్ననిసలిలధార మూర్తిపైఁ బడు చున్నది. అదియే మొదట శివుని జటాజూటమునుండి భూమిపై దిగివచ్చిన గంగానది. ఆసమయమునఁ బార్వతీముఖవికాస మించుక మీఱి యవిశ్వస నీయ మైనయలుకను వహించుటను సూచించుచున్నది. వేయేల దానిం జూచు నంతనె చూపఱడెందము నాకర్షించి పవిత్రనంత మైనగాఢానురాగమును నెల కొలుపుచుండును.

పాశ్చాత్యులును, మఱియు హిందువులునుఁ గూడ మొగలులకాలము యొక్కయు, మధ్యకాలముయొక్కయుఁ జిత్రకళ నెట్లు గౌరవింపవలయునో యట్లు గౌరవింపకుండు టెంతయు శోచనీయము గదా! ఆకాలమునాఁటి ప్రతిమ లన్నియు శిథిలములై పోవుటకు, వానినన్నింటి నొకచోఁ జేర్చి యాకళాకౌశల మును లోకమునకు వెల్లడించుట కింతవఱకు సరియైన ప్రయత్నములు సేయ కుండుటయె కారణ మని తలంచుట సరికాదు; ఆప్రతిమాసమూహ మెవరి

పూర్వులయభిప్రాయములును, యశోవిభవమును, నాగరకతను, నైశ్వర్యమును, గౌరవమును, సమస్తసద్గుణపుంజమును సూచించుట కొకదర్పణమువలె నున్నదో, యట్టి వారు తమపురుషకారముచే వానియందమును, వానియావశ్యకతనుఁ గూర్చి తెలిసికొనుటకు దూరు లగుటయే ముఖ్యకారణము. హైందవచిత్ర విద్యను గూర్చిన గ్రంథము లన్నియు, నాంగ్లేయులచేతనే వ్రాయఁబడి యున్నవి. ఇట్టిస్థితియందు హైందవచిత్రకళానైపుణమును, లెక్కసేయక మనవా రూరకుండుట చిత్రముగదా? లోకములోఁ బురుషకారము లేక యేకార్యమును సిద్ధింపదు; ఈవాక్యము చక్కఁగఁ దెలిసి యుండియు, మనము మన తొంటియౌన్నత్యమును వీడి దీనుల మైతి మన్నమాట యెట్టిమందున కైనను స్ఫురించుచుండ విద్యాబలసంపన్ను లయినవారి కీవిషయమును గూర్చి మఱి యొక రేల చెప్పవలయును? పూర్వోక్తవిషయముల నించుక గమనించి చూచి నచో నీస్థితికి మనప్రయత్నలోపమే గాని శక్తిలోపము గాకుండును. మనము శక్తి, సామర్థ్యములు గలిగినవార మయ్యు, మనపూర్వుల తొల్లింటియౌన్నత్యమును దెలిసికొనుట కాధారము గలిగి యుండియు మన మొకరిపై నాధారపడి యుండనేల? ప్రాజ్ఞులు ప్రయత్నము సేయక మౌనముద్రను వహించుట యుచితము గాదు. మనయీదుస్థితికి మనప్రయత్నలోపమే యని తెలియ వచ్చుచున్నందునఁ, బ్రస్తుతము కొంతవఱకు విద్యాధికులు పూనుకొని కార్యోత్సాహమును జూపుచున్నను, నదియుఁ గావలసియున్నదానిలో సహస్రాంశమైన లేకపోవుటచే నంతటితోఁ దృప్తినొంది తటస్థముగ నూరకుండక పురోభివృద్ధికరము లైనయెల్లకార్యములయందును గష్టములకు వెనుదీయక భగీరథప్రయత్నములు సలుపుచుఁ గార్యానుకరణమునకుఁ గడంగి పూర్వుల యశోవిభవము నుద్ధరింపఁజేసి నిలువఁబెట్టుట మనవిధ్యుక్తధర్మము.

మాదిరాజు వేంకటేశ్వరరావు.

---

శ్రీమదుమారమణాయనమః.

# నైవేద్యము.

—∞∞—

చ. కలుములకాటపట్టు; కలికల్మషనాశము; పావనాళిలో
పల నతిపావనంబు; పరపట్టనయాత్రకు దారిబత్తెము;
న్నిలువఁ గవీంద్రవాక్తతికి నీడ; సదాశ్రయ; మంకురంబుధ
ర్మలతకు; రామనామము సమర్థముగావుత మావిభూతికిన్. 1

మ. తనియం గొల్తుము మానసంబులను స్వార్థత్యాగి నిర్గర్వ వా
గనుశాస్త్రిన్ దృణమన్యసంస్తవు జగద్వ్యాప్తాచ్ఛకీర్తిన్ వినం
మ్రనమత్పండితమండలేశ్వరసమగ్రప్రాభవు న్నన్నపా
ర్యుని నిన్నుం బరమోపకారకు స్వతంత్రు న్సర్వభాషావిదున్. 2

ఉ. ఏసుముహూర్తవేళ జనియించితొ యింతటి పండితుండవై
భాసిల; నెట్టిదుర్గ్రహముబాధను దుర్భరణంబు నొందితో
గాసిల నాంధ్రలోకము; జగన్నుత మాపలుసందియంబులం
ద్రోసి చరింతు మెట్టుల విరుద్ధమహాకలికాలవేళలన్. 3

మ. జగదాపూర్ణభవద్యశంబునకు వీసంబేని లోపంబు రా
దుగదా తావకజన్మభూజనకసద్గుర్వాదికోద్ఘాటనం
దగవే యిట్టి యనాదరం బతివిషాదం బబ్బె మాకిప్డు నీ
దగుతత్త్వం బెఱుఁగంగరామిఁ గవులన్యాయ్యార్థము ల్సేయఁగన్. 4

ఉ. కొందఱు దాక్షిణాత్యుఁ డని కొందఱు కన్నడదేశవాసి యం
చందురు రాజరాజునకు నాప్తపురోహితుఁ డంద్రు గొంద ఱ
య్యందఱ మెచ్చు కొక్కఁడను నాంధ్రకవిత్వము నీకు రా దటం
చిందఱు నిన్నిరీతుల గ్రహించుట నీదు నుపేక్షనే గదా! 5

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారక మై వెలుంగుచో
భారతకావ్య మేగతి విపజ్జలముక్తిహితం బొనర్చెనో
వారనికాల మాధియును జైత్యవికారముఁ గూడెనోటు ని
ష్కారణవైరకల్పన లకాలరుజ ల్కలికాలనైజముల్. 6

ఉ. నన్నయ పేరుమాత్రమె జనశ్రుతిరంజకసత్కవిత్వమా
యన్నసఖుం డొనర్చి తనయాప్తునిపే రిడెనంచునందు రి
ట్లున్నెడ నీయనంతర మరయో విరమించె నతం డదేమొకో
తన్నొరు లేమనంగలరు తప్పులు నొప్పులు నీతలంబడున్. 7

గీ. నిన్నుఁ గూఱిచి లోక మెన్నెన్నిగతుల, పోకడలొపోవుచున్నది భూసురేంద్ర
తెలుపవలసిన వెన్ని యోగలవుమేము, చెప్పినట్టులనొరులతోఁ జెప్పఁబోకు.

గీ. పెద్దవాఁ డండ్రు నీకంటె భీమనకవి, గంగలో ముంచెనండ్రు నిక్కంబె నీదు
నాంధ్రశబ్దచింతామణి వ్యాకరణముఁ, బెద్దవానికిఁ బుట్టినబుద్ధియె యిది!

గీ. పరిచితిగలాఁడె నీకథర్వణుఁడు వాని, భారతముఁగూర్చి యిల్లాల్చివైచితట్టె!
కోపగింపకు మమ్మునీకుటిలకృత్య, మునకుఫలమొందితి వకాలమునఁగవీంద్ర!

సీ. నన్నెచోడనృపాలుఁ డెన్నిశతాబ్దము లున్నిటివాఁడు నీవెన్నఁ డేని
వింటివె యెందేని గంటివె యవ్విభుసారవంతంబు కుమారసంభ
వమ్మును నీకవిత్వమ్మునకంటెను బ్రోడతనంబుంట గూడియొక్క
యేగతి నీ కబ్బు వాగనుశాసన బిరుదంబు? తొలికవీశ్వరుల నీదు

కృతినిఁ జెప్పకున్న కతమేమి? యాతఁడే
వ్యాకృతిని బఠించి చేకొనియెను
జ్ఞాన మాంధ్రమునకు దీనియున్న తెఱంగు
నెఱుఁగఁ జెప్పఁగదవె గుఱుతుగాఁగ. 11

గీ. మున్ను లేదఁట లక్షణము తెనుఁగునకుఁ
గేతనవచించెనఁట గదా యే తెఱఁగున
భారతముఁవ్రాసినాఁడవో పార్థుఁడు, వన
ము, తరువు, ననఁగ నెట్లు డుమువులునిల్పె? 12

గీ. ఏమియాధారమీాఫక్కి నెవరుగఱపి
రీవెనేర్చితె మల్లన కెట్లు తెలిసె,
మీారలందఱునొకబడివారె? నియమ
సహితముగవ్రాయ వాగనుశాసనుఁడవె! 13

గీ. ఇంద్రవిజయమనెడు నెయ్యేనినొకకావ్య, మాంధ్రమున రచించితయ్య నీవ
దట్టులైన నేది యది యెందుఁ బొడసూప, దొకటభీమనకుధారకినదోటు.

చ. లలితవచోవిలాస! సకలజ్ఞులమన్నలుగర్వమున్నవా
రలనుడికార మీకలి విరామము లేక విజృంభణంబున
న్వోలువదుచుండె లోకమున వెన్కయు ముందును జూడకుండ; నా
విలసన మింత తెల్పెదము వేఱొకరు న్వినకుండఁ జూడుమా. 15

ఉ. పొల్లుప్రబంధములు్నసిపోవు జగంబున సత్ప్రబంధము
ల్వి ల్లగువ్యాప్తిఁగాంచు నని భీకరలీల నుపన్యసించుచుం
డెల్లము నీదుచిన్నకృతి దీఱె నసారము గాన నందురో
చెల్ల యసారవాణి నివసించునె నీరసన స్థవీశ్వరా. 16

సీ. ఎన్నఁడో దగ్ధమయ్యెను రాష్ట్రమెల్ల నాసమయంబునం బోయె సత్ప్రబంధ
సమితి యందురు దీనిచంద మాలోచింపు భారతంబును నాంధ్రభాష సేయు
టకుముందె యైనచో దక్కనె నన్నెచోడునికావ్య; మివలఁబడునది యైన
భారతాదులు నిల్చువడు వేది యిట్టు లనేకరీతులఁ బోవు నీజగంబు
తనకుఁ బైవాఁడు లేఁడు విదగ్ధుఁ డనుయ
శంబునకుఁ బాటుపడు ధీవిశాలు రకట
గాలిలో హర్మ్యములఁగట్టఁగడఁగుచుంద
రెందు నిట్టిరఁ జూచితివే బుధేంద్ర. 17

చ. సకలకళావిదు ల్మను ప్రశాంతమతి న్విహరించువారు నేఁ
డొకటియురాని మేము సకలోర్విజయింపన చూచుచుందు మే
టికి నిది నిష్ఫలంబగుఁ గడిందివిచారము చాలు నంచు వే
ఱొకనికిఁ జెప్పువాని నతఁ డున్న వినంగలవానిఁ జూడమా! 18

గీ. తనకుఁ దానె పెద్ద తగుదునమ్మాయని, వలదటన్న వినక పలుకఁ జొచ్చు
నీరసంబు; లోకఁడు నేర్చివచించెడు, దానిఁ గాంచి యుఱుకుఁ దప్పఁబట్ట!

గీ. పెద్దలేదేనినొకక్రొత్తవిషయమూహ, చేసివ్రాసిన దానికిఁ జిన్నవాఁడొ
కండు తాఁబుట్టకయమున్నఖండనంబు, వ్రాసిపెట్టితి దీనిపైవ్యాస మనును.

గీ. తలఁప షట్ఛాస్త్రవేత్త శేషజ్యవిదుఁడు, వేదవేదియు మాతృభాషాదరంబు
గలిగితత్త ద్విశేషము ల్వలసినంత, తెల్లముగ స్వచ్ఛభాషలోఁ దెలిపిరి మును.

గీ. వారు వీ రన లేదు సర్వవిషయజ్ఞు, లాత్మభాషను సుష్ఠుగా నరసియుండి;
రిప్పుడభిమానవిద్యలోనేమునొక్క, ముక్కవ్రాసినబహుదోషములకు నెలవు

గీ. వృద్ధకవులయభిప్రాయభేదములను, వాడఁబడిన పదంబులఁబట్టి తప్పు
లనియునట్టిరెతప్పులనరయలేదు, మనకుఁబనియేమనుచుఁగవిజనముప్రబలు

గీ. ఔనుగాక తప్పులందము కలతప్పు, లొకటిరెంటి దిద్ద సుకర మగునొ
మిగులఁ బదులునూర్లు మేమునుగలపిన, సుకరమగునొ తెల్పు సుకవివర్య!

సీ. బాలరామాయణపాఠంబుఁజెప్పుచుఁ"సురలాట"(1) యనిదిద్దు శుద్ధమనుచు
రుక్మిణీకల్యాణరుచిరపాఠముఁ జెప్పు "చంత శా కల్యాణ" (2) మనిపఠించు
అమరపాఠముఁజెప్పునప్పుడుప్రాసాదమన"దేవభూభుజం"(3)బనుచుఁబలుకు
నౌచిత్యమెఱుఁగకయర్థమయ్యెనటంచువ్యాధియంటకు"దేహబాధ"యనును
బాఠశాలపెట్టిబాలురఁ జదివించి, పొట్టపోసికొనెడు నట్టియొజ్జ
లితరు లెట్టులుందు రిద్దాన నరయుమ, యాంధ్రభాషయెట్టులగునొముందు

గీ. తానొనర్చినదియె దానశాసనమట్టు, లుర్వినుండునంచు నొరులచేత
లడుగువట్టునంచు నందఱుఁదలపోయు, దురువిషాదమొదవు నరులచర్య.

చ. ధరగ్రహణంబువట్టె నిలఁదద్దయుఁ జంద్రుఁడుతోఁచె భూమిలో
గర మరుదొప్పుచుండఁ గడు గట్టిగఁ గాఁచిరి వెన్నయంచు వా
గ్వరచనసేయులోక మెఱిఁగించును "నన్నయమానుగ ల్గనుం
డరె" యని మీఱి హస్తిమశకాంతర మున్నది చూడ దద్దిరా. 27

గీ. వచనములతోడ నొడ్డెక్కె భారతంబ, టందురదిమీఁదమీఁదనే యబ్బునేని
తాము నారీతినొక ప్రబంధమ్ముగాదు, నాల్గుబంతులు వ్రాసియనంగరాదె.28

గీ. విద్య స్వల్పంబుగలిగినఁ బెద్దవాఁగు, నిండుకుండ తొలంకదు నేఁటిజనము
తన్నుఁదామెచ్చుకొంచునితరులనింద, సేయుటప్రధానధర్మంబుసేసికొనియె.

క. తనచేయిమీఁదుగావల, యును బ్రతినరునకును దాని కొక్కొకవిషయం
బును జర్చసేయఁ దొడఁగెడు, నెనుమున కెద్దునకు లంకె యిడుగతి సుకృతీ.

(1) బాలరామాయణములో రామవర్ణనమున "సులలాటస్సువిక్రమః" యనుచో నశ్లీల మున్నదని లకారమునకు రేఫముం బఠింపించును.

(2) రుక్మిణీకల్యాణములో "శా॥ కల్యాణాత్మకమైనవిష్ణుకథ" లనుపద్యమునకుఁ బైనున్న వచనము "అంత" యను చిన్నవచనమును శార్దూలపద్యమునకుఁ జిహ్నమైన "శా॥" యును గలిపి చదివించును.

(3) అమరములో "ప్రాసాదో దేవభూభుజాం" అనుదానికి "విష్ణుర్నారాయణఃకృష్ణ" యని సమానార్థకములు చెప్పినట్లె ప్రాసాదమునకు "దేవభూభుజ" ము సమానార్థకమని చెప్పును

గీ. గుడులనిరసించుయతులనువిడుచునున్న, చుట్టుఁగొన్నింటినసుఁదలకట్టులేల
యనుచుఁదనపట్టునెగ్గించుకొనఁగసభలఁ,బలుకుచుడుగఁడుచప్పట్లువైచుచున్న

సీ. నిరతభిక్షాటననిరతుఁ డౌమాతండ్రి యెత్తించె గోపురం బీశున కని
యవిరతాపణరాజిఁగవిలెవ్రాసెడుతండ్రిమానవేంద్రులకెల్లమంత్రియనియు
నాజన్మరోగియా మాజనకుఁడు వ్రాలి యెల్లదేశముల జయించెననియు
సాక్షియీశ్వరుఁడుగానక్షరంబెఱుఁగని మాతండ్రికవిలోకమకుటమనియుఁ
బొగడికొందుములోపములొప్పిదిగిపుచ్చి,యపుడునీతండ్రికాఁడునిరక్షరాస్యుఁ
డని తలంతుము నిన్నెంచి; యతని నేల, యుగ్గడింప వసర్హులమొక్కొ వినఁగ

ఉ. సాంబవరప్రసాదవికచస్థిరవాగ్వి భవుండనంచు, హే
రంబదయానిగూఢజనరంజక సత్కవితావిలాసి నం
చుం, బహుకావ్యనాటకవిశోధనదక్షవచోవినోది నం
చుం, బెడఁగొప్పఁ జెప్పికొనుచు న్రచియింతుము తప్పఁబద్దెముల్. 33

గీ. మూఁడుపద్యములకు మూరెఁడు బారెఁడు, గద్యములను వ్రాసి కనమతృప్తి
యెట్టులొప్పె భారతేతిహాసమునకు, మనసు రెండుముక్కలను లగింప. 34

క. ఎన్నియొ యడుగఁ దలంతుము, నిన్ను సమయమునకుజ్ఞప్తి నిలువదు వరుస
న్నన్నింపు మప్పు డప్పుడు, కొన్నియుఁ గొన్నియుగ నడిగి కొందుము సుకవీ

గీ. ఏమె లోకములోన నికృష్టకవన, మును రచించెడువారమంచును దలంతు
మింతవఱకును; నేఁడు మమ్మించుకంత, మంచివా రనిపించు సన్మతులుగలరు

గీ. పర్వతోరభ్రసంవాదపక్కిఁ గొంద, ఱుభయభాషాచణులమీఁది కొక్కభాష
యైన మిన్నగ నెఱుఁగనియట్టివారు, పఱతురసమర్థనులు వెన్ను చఱచుచుండ

గీ. ఉచితరీతు లెఱుంగక యుఱక రెండు,మూఁడు కావ్యము లసమగ్రముగఁబఠించి
కవులమవధానులమటంచుమివుల మోస,పుచ్చుచున్నారుపల్వురుభూసురేంద్ర.

గీ. కవిబలముతగ్గ వాక్శుద్ధికడల కేగె, నైననిప్పటికిని దిట్టు ననుభయంబు
ప్రజలవిడువదు కొట్టినబాధ సేయ, దేటివెఱుపుట్టెనో కవయిత్రువరేణ్య. 39

గీ. ప్రాణసఖుఁడును బాలసరస్వతియును, గూర్చిగ్రంథములను వారిగొడవయెల్ల
నీతలను వైచి తప్పుకొనినదిచాలు, నీమహత్త్వంబుఁ దెలుపఁగ నిఖిలమునకు

గీ. ఎందఱెన్ని తెఱంగుల నీతఁ డాది, కవి యనఁగఁ జెల్లఁ డనినను గవుల, గ్రంథ
ములనునీముందుఁ బెట్టినబుధవరేణ్య,నిన్నులోకంబుస్తుతి సేయుచున్న దెవుడు

మ. అలసారంగధరుండు శిష్యుఁడని యప్పార్యుండు వాత్రుచ్చు నీ
కు లలిన్వానిగుణంబు తెల్లమకదా! క్రూరాత్మఁ డారాజుతోఁ
దెలుపంజాలవు నేమిహేతు వని చింతిల్లంగ మాకయ్యె శా
స్త్రులు! నీకున్మతిపోయెనో సవనమందుం దీక్షఁగైకొంటివో! 42

మ. క్షమియింపం దగు నీదుశిష్యులము వాత్సల్యంబుమైఁ జూడుమీ
మము లోకంబునఁ గల్గువార్తలను సంపాదించి కొన్నింటి నీ
కు ముదంబో కుముదంబొ చూడకయ లోకుల్దూఱనున్నా రటం
చు మదింపం జన కంటి మీకలిని వాక్ఛూరత్వముం బొందఁగన్. 43

గీ. వారు తోఁచినట్లు వ్రాయంగఁ జెల్లును, వీరలట్లు వ్రాయ వెరవు లేదు
నాఁగనియమమేది నలినగర్భసమాన, యతనికతఁడె పెద్ద యాంధ్రకవుల. 44

గీ. తమకుసంబంధులైన పెద్దలకుఁగల్లు, తెల్ల మగుదోసములఁజూపు ధిషణునోర్వ
దీజగము; వారిపైఁగల్ల లెంచివ్రాయ, సైఁచునే యేమియెఱుఁగనిసరణినుండ.

హనుమత్పూర్వకవులు.

క. "మణిఁ గ్రిందుపఱిచి జడనిధి, తృణముంబైనుంచు దాని దేతప్పనుమీ
మణి మణియె తృణము తృణమే, రణరంగదిలీప! విజయరాఘవ భూపా!"

# పరిషత్పుస్తకభాండాగారము.



ఆంధ్రసాహిత్యపరిషత్తున కింతవఱకు రమారమి 2400 ల పుస్తకములు దొరకినవి. ఇందు ఋగ్యజుస్సామవేద శ్రౌతస్మార్తగ్రంథములును, శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషతర్కమీమాంసాది శాస్త్రగ్రంథములును, కావ్యనాటకాలంకారపురాణాది గ్రంథములును గలసి దాదాఁపు 900 ల వఱకును దెలుఁగులిపిలో వ్రాయఁబడిన సంస్కృతగ్రంథములు గలవు. మిగిలిన వన్నియు నాంధ్రభాషాగ్రంథములు. మఱియు నీమొత్తములో 100 వఱకును సంపుటములు గలవు. ఒక్కొక్కసంపుటమున రెండు మొదలుగా నైదాఱు వఱకును వివిధము లగుచిన్నగ్రంథములు గనుపడుచున్నవి. ఇప్పటి వఱకుఁ జేరి యున్న తెలుఁగుపుస్తకములలో శ్రీనాథుని హరవిలాసము, కేతన దశకుమారచరిత్రము, నన్నెచోడునికుమారసంభవము మొదలుగాఁ గల కొన్ని యుత్తమకావ్యంబులు దక్కఁ దక్కిన ప్రాచీనగ్రంథములు చాలవఱకుఁ గల వని చెప్పవచ్చును.

వీనిలో భారతాది పురాణములకును, మనుచరిత్రాది ప్రబంధములకు నొక్కొక్కదానికి రెండు మూఁడు నాలుగేసిప్రతులవఱకును గలవు. మఱియు నయ్యాకాలంబున ద్రవిడదేశమున కేగి యందే స్థిరపడి యుండిన యాంధ్రులును వారి సంతతివారును రచియించిన పలుతెలుంగుల వచనకావ్యములును యక్షగానములును శతకములును బెక్కు గలవు. ఈ మొత్తము పొత్తములలోఁ జాలవఱకు ముద్రింపఁబడినవి యే యైన నింతవఱ కాంధ్రదేశీయులకంటఁ బడనివి యుఁ జెవిని బడనివి యు నగునముద్రితగ్రంథములు గూడఁ గొన్ని లేకపోలేదు. చదువరు లెఱుంగుటకై యీభాండాగారమందలి ముఖ్యగ్రంథములను గూర్చి యప్పుడప్పుడు పత్రికాముఖంబునఁ దెలుపఁ దలఁచినారము.

---

## (1) శ్రీరంగమాహాత్మ్యము.

ఇది పదియధ్యాయముల వచనకావ్యము. దీనిచివర నున్న "ఇది శ్రీపాండ్యమండలాధీశ్వర విజయరంగ చొక్కనాథ భూపాల ప్రణీతం బైన శ్రీరంగమాహాత్మ్యవచనకావ్యమందు సర్వమును బదియవయధ్యాయార్థము" అను

గద్యముబట్టి దీనిరచించినకవి క్రీ. 1704—1731 నడుమఁ బాండ్యమండల మేలిన విజయరంగ చొక్కనాథుఁ డని తెలియుచున్నది. కవులచరిత్ర మీ కవినిఁ గూర్చికాని కావ్యమునుగూర్చి కాని యేమియుఁ దెలిపి యుండలేదు. దీనింబట్టి యప్పటికి నిప్పటికిఁ గూడ నీకృతి నాంధ్రలోక మెఱుంగ దని చెప్ప వచ్చును.

ఇతఁ డనేకాంధ్రకవుల నాదరించి వారిచేఁ బెక్కుకావ్యములను రచింపఁజేసిన రాజకవి. (ఆయాకవి కావ్యవిషయము ముందుముందు తెలుపఁబడును) ఈ మహారాజకవికిఁ గొంచెము పూర్వమునుండియో లేక యీతని కాలమునుండియో తెలుఁగులో వచనకావ్యములు బయలువెడలి యుండు నని చెప్పవచ్చును. కావునఁ జిన్నయసూరికి మున్ను వచనకావ్యములే లే వను మనవారి కొందఱయభిప్రాయ మీయుత్తమకవిచేఁ బ్రతిహత మైన దనుటకు సందియము లేదు.

గ్రంథవిషయము—ఇందు శ్రీరంగక్షేత్ర మహిమ వర్ణింపఁబడినది. అందందుఁ గొన్ని ప్రామాదికప్రయోగము లున్నను వచనశైలి ధారాళముగా మృదువుగా నున్నది. దీనికిఁ బరిషత్తునందు రెండుప్రతులు గలవు. రెండును సమగ్రముగా నున్నవి. మఱియు నీతఁడు రచించినదే

(2) మాఘమాహాత్మ్యము.

ఇది పదియేనధ్యాయముల వచనకావ్యము. ఇదియు సంపూర్ణముగా నున్నది. శైలినిబట్టి శ్రీరంగమాహాత్మ్యమునకుఁ దరువాత నిది వ్రాయఁబడి యుండు నని తోఁచుచున్నది. దీని మొదల నున్న యీక్రిందిపద్య మీకృతి శ్రీరంగేశున కంకిత మొనర్చినట్లు తెల్పుచున్నది,

క. శ్రీమచ్చంద్రసరోవర, తామరసపరాగ చారుతరపటవాసా
కామారివినుత జగదభి, రామామృతగుణవిలాస రంగనివాసా!

కవి వచనశైలి తెలియుట కీతని రెండుకావ్యములనుండియుఁ గొన్నిపంక్తు లుదాహరించుచున్నాఁడను.

శ్రీరంగమాహాత్మ్యము—“ శతకోటిప్రవిస్తరంబయిన పురాణంబున నేనీ యర్థంబును గని యున్నవాఁడ నెట్లనిన:—శ్రీరంగవిమానరాజంబు తొలుదొలుత బ్రహ్మలోకంబున నుండు; తదనంతరంబున నీవు తపంబు నేసినఁ జతుర్ముఖుండు నీ కీయుంగలండు, అయోధ్యానగరంబున నీవు నీవంశంబున జని

యుంచినరాజులు పెక్కండ్రుం బూజింపంగలరు. అంతట మురాంతకుండు రామ నామధేయంబున భవదీయవంశజాతుండైనదశరథుని గర్భంబునం దవతరించి లోకవిద్రావణుం డైనరావణు సంహరించి వానికి సహోదరుండును బ్రియం కరుండు నగువిభీషణునకు లంకారాజ్యంబును నీకుంగులధనం బైన శ్రీరంగ విమానంబును నీయంగలండు. అందుం జంద్రపుష్కరిణీతీరంబున నచ్చోటం గల్పాంతరం బుండి యీవిమానరత్నంబు క్రమ్మఱ సత్యలోకంబునకు వచ్చు ఇవ్విధంబునం బ్రతికల్పంబున శ్రీరంగవిమానంబు దివంబునకు భూతలంబునకు రాకపోకలు సేయుచుండు. బ్రహ్మదేవుని యాయురంతంబున నిజధామం బైన పరమపదంబునకుం జను. దక్షిణదేశవాసులుం గావేరీతీరసంభవులు నైన సకలజనులయందును దేవదేవుం డైన శ్రీరంగప్రాంతదేశంబున నున్న సకల జంతువులు మోక్షంబుం జెందుటకు సందియంబులేదు. కృతఘ్నులు, నాస్తి కులు, కపటబుద్ధులు, రంగస్థలవాసంబు సేయందొడంగిరేని బ్రహ్మరుద్రాది దేవత లందుకు విఘ్నంబు కల్పింతురు. తద్దేశవాసం బాపాపాత్ములకు లేకుండం జేయుదురు. భక్తవత్సలుం డైనభగవంతునికటాక్షం బెప్పుడు వచ్చునో యప్పుడు గాని రంగవాసంబు గలుగనేరదు. వర్ణాశ్రమధర్మంబులు తప్పని పరమసాత్త్వికులు రంగవాసంబు సేయం దలంచిరేని విఘ్నంబులు రావు. పలుమాట లేల లోకహితార్థంబుగా మాయాశ్రమ సమీపంబున అష్టాక్షరీ మహామంత్రంబు జపంబుసేయుచుం దపంబుం గావింపుము."

మాఘమాహాత్మ్యము—" అమ్మునికుమారుండు కావేరికి వచ్చి కుతిక బంటి నీళ్లలో నిలిచి యాదిత్యునిం దప్పక చూచుచుం జేతులుపొడవుగా నెత్తి యమస్తోత్రంబుం బఠించుచు నుండె నాయవసరంబునం దొలుత వారలం దఱిమినమదగజంబు తుండంబు పొడవుగా నెత్తుకొని యామునికుమారుని సమీపంబునకు వచ్చుటయు మృగశృంగమహాముని మనంబున భయంబులేక చిత్తరుబొమ్మయుం బలెం గదలక యుండుటయు నగ్గజేంద్రంబు నమ్ముని సం దర్శనంబు వలనం దమోగుణంబును గోపంబును మాని తనకరంబుచే మెల్లన నతని నెత్తికొని కుంభస్థలంబున నుంచుకొనుటయు నామునిబాలకుండు దాని యభిప్రాయం బెఱింగి జపంబు చాలించి యేనుంగుకుంభస్థలంబున సుఖా సీనుండయి యందువలనం దనకు శ్రేయస్సు గలుగు నని వార్షించుచు నిందితం బైనదీని గజజన్మంబుం బాపి మంచిగతి నొసంగెద నని మదిలోనం దలంచి

మునిమిదిదినంబులు తానుమాఘస్నానంబు చేసినసుకృతంబు నొసంగెద నని యుదకంబెత్తి దానిశిరంబున ధారవోయుటయు నాయేనుం గెలంగినయట్ల యుప్పొంగి మహామేఘంబునుబోలె గర్జించుటయు మృగశృంగుండు మిగుల సంతోషించి కరుణాకటాక్షంబుచే నవలోకించి తనకరంబుచే దాని శరీరంబు నిమురుటయు నామునీంద్రుహస్తంబు సోఁకుటవలన నప్పు డగ్గజరూపంబు మాని దేవతారూపంబుధరియించి దివ్యభూషణంబులు దివ్యాంబరంబులు దివ్యంబు లైనగంధపుష్పంబులుం బూని నవరత్నఖచితంబైన విమానంబు నెక్కి తేజోవిరాజమానుం డగుచు నమ్మునీంద్రునకుఁ బ్రణమిల్లి మహాత్మా నీదయవలన ధన్యుండ నైతి నని పలుమాఱునుం బలుకుచు బ్రహ్మతేజోనిధీ! దయాంబునిధీ! నాయేనుఁగుజన్మంబు తొలంగె, నేను గృతార్థుండనైతి. నా పూర్వజన్మవృత్తాంతముం దెలిపెద వినుము. నిషధపురంబున విశ్వగుప్తుం డను వైశ్యుండు స్వధర్మంబు దప్పకయుండు. నేనతనికుమారుండ. నాపేరు ధర్మగుప్తుం డందురు. వేదంబులు సదివి యాగాదికర్మంబులఁ జేయుచు మా జాతికిం దగిన జీవనంబున మెలంగుచు ధర్మంబుగా వడ్డి కిచ్చుటయు నావులం బరిపాలించుటయు, బయిరులు పెట్టించుటయు మొదలైన వైశ్యకర్మంబులు నేయుచుఁ గామక్రోధంబులు లేక దబ్బఱలాడక యీర్ష్యాసూయలు మాని కులాంగనలం బూజించుచుఁ గృష్ణాగరు రక్తచందనంబులును, కుంకుమ, కస్తూరి, గోరోజనంబును, నెయ్యి, పెరుఁగు, పాలు, మజ్జిగ, గోమయంబు, గడ్డి, వంటచెఱకు, ఫలంబులు, కందమూలంబులు, లవణంబు,..... ...కూరగాయలు, చక్కెర, జవళియు నగ్గువకాలంబునంగొని తక్కువవెల నమ్ముచు నాదాయంబు గొనుచుఁ గ్రయవిక్రయంబుల నన్యాయంబు సేయక, బాలురు, నవివేకులు, సాధువులు వచ్చిరేనియు బేరంబున వంచన లేక యుందు. అటుగావింపని వైశ్యునకు నరకంబు సిద్ధంబు."

---

(3) జైమినిభారతము.

ఇది యైదాశ్వాసముల తెలుఁగువచనకావ్యము. పరిషత్తునం దీగ్రంథమునకు రెండుప్రతులు గలవు. రెంటియందునుగూడఁ గథాప్రారంభమువఱకును గల మంగళాచరణాది కృత్యాదిభాగము లేక "అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారయొనర్పంబూనిన జైమినిభారతంబునం దశ్వమేధపర్వ వచనకావ్యంబునకు"—అనునది యాదిగాఁ గనఁబడుచున్నది. ఒకప్రతి సంపూర్ణముగా

యున్నది గాని కొంచెము శిథిలమైనది. రెండవది మంచిస్థితిలో నున్నది గాని మొదవయాశ్వాసమునఁ దుదిభాగము కొంత పోయినది. కవులచరిత్రలో "ఇతఁడు జైమినిభారతమును వచనకావ్యముగా రచించిన ట్లహల్యాసంక్రందనములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది" అనియుండుటయే యాంధ్రదేశీయులు దీని నెంతవఱకుఁ జూచియుందురో తెలుపఁగలదు.

కవిప్రసంగము:—దీని రచించినకవి సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు. "ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర విజయరంగ చొక్కనాథ మహీనాథ కరుణాకటాక్షసంపాదిత గజతురంగ మాందోళిక ప్రముఖ నిఖిల సంపత్పరంపరాసమేధమాన సముఖమీనాక్షీతనూభవ మీనాక్షీదేవీ కటాక్షలబ్ధ కవితాసాంప్రదాయక వేంకటకృష్ణప్పనాయక ప్రణీతం బైన" అని దీని యాశ్వాసాంతంబులందును, ఇట్లే యహల్యా సంక్రందనరాధికా సాంత్వనంబులయందును గనుపడు గద్యములంబట్టియు,—

"సీ. నీకె తగు నంచుఁ బాండ్యభూనేత విజయ
రంగచొక్కేంద్రుఁ డంత్యంతరంగసబహు
మానసామాజికత్వ మింపూన నొసఁగె
సముఖ వేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర"

అను నహల్యాసంక్రందనములోని యవతారిక పద్యమును బట్టియు నితఁడు పాండ్యదేశరాజగు విజయరంగ చొక్కభూపాలుని యాప్తసామంతుఁడని యు, మీనాక్షినాయకునిపుత్రుఁ డనియు, పేరునుబట్టి శూద్రకులజుఁ డనియు నహల్యాసంక్రందనాది గ్రంథములను రచించినవాఁ డనియుఁ దెలియుచున్నది. విజయరంగ చొక్కనాథుఁడు క్రీస్తుశకము 1704—1731 నడుమ నున్న వాఁడు కావునఁ గవికాల మదియే. ఇప్పటికి నీతని దౌహిత్ర సంతతివారు జమీందారులై మధురమండలములోని పెరియకుళము (బృహత్తటాకము) లో నున్నట్లు తెలియుచున్నది. ఈ జైమినిభారతము నితఁడు విజయరంగ చొక్కనాథున కంకిత మొనర్చిన ట్లాశ్వాసాద్యంత పద్యములు చాటుచున్నవి. అందొకటి:—

క. శ్రీపాండ్యధరాభరణా, భూపాలకమకుటరత్నపూజితచరణా
యూపజితస్మర! నిర్వ్యాజ, జోపకృతీ! విజయరంగ చొక్కనరపతీ!

ఈ భారతవచనశైలి యెంతయుఁ బ్రౌఢమై మనోహరముగా నున్నది. రుచి చూచుటకై నాలుగుమాట లుదాహరించెదను.

“అమ్మంత్రికుమారిక యక్కాలనిగట్టునఁ దీయమామిడి చెట్లనీడ నిదురించుచున్న చంద్రహాసుం గాంచి యందియలు, మొలనూలు, మువ్వలు, రవలమెట్టెలు, మ్రోయకుండ మెల్ల మెల్లనం జని యక్కుమారవరుని రూపరేఖా సౌందర్య కళావిలాసంబులకుం జొక్కి చక్కరవిలుతు శారికిం జిక్కి చేరం జని యడపసంచి త్రాటఁ గట్టియున్న కమ్మ విడిచి చూచి చెయిమ్రాలుఁ దెలిసి యవ్వక్కాణ లాద్యంతంబును జదువుకొని నిజ జనకుని విషమబుద్ధికిఁ బరితాపంబు నొందుచు రూపరేఖా విజితరమాకుమారుం డైన యీ రాచ కొమరునకు విష మొసంగు మని వ్రాసిన యింత నిర్దయుండు జగంబునఁ గలండె! యని వగచి విష మొసంగు మని వ్రాసిన యక్షరంబుల యకారంబు నేర్చి “తామసింపక నావచ్చు నంతలో విషయ నొసంగు” మని వ్రాసి యెప్పటి ముద్రవైచి యడపసంచి త్రాటం గట్టి పెన్నిధిం జూచి విడువంజాలని పేదవడువున నవలనడుగిడం జాలక కొంతతడవు చూచుచుండి పరాధీన గావున దీనమానసయై యెఱుంగని యట్ల రాజపుత్రికలకడకుం బోయి తదను మతి వడసి నిజగృహంబునకుం జనియె. అంతఁ జంద్రహాసుండు నిదుర మేల్కాంచి సరసీజలంబులఁ బ్రక్షాళిత పాణిపాదవదనుం డై తేజి నెక్కి పురంబునకు వచ్చి యెడనెడ శుభశకునంబులు పొడఁ గనుచుఁ బ్రధాని వాకిటికిం జని ఫణిహారిచేఁ దనరాక మంత్రి కుమారున కెఱింగించుటయు నతండు పుళిందకుని సుతుండు వచ్చినాఁ డని విని ససంభ్రమంబుగా నెదుర్కొని గాఢాలింగనంబుఁ గావించి సంతసంబున నేకాంత ప్రదేశంబునకుం జని పుళిందుని నేమం బడుగుచుఁ దండ్రి ముద్రవైచిన పత్రిక నొసంగినఁ గేలం గొని “శ్రీమత్సకలగుణ సమృద్ధుండయిన దుష్టబుద్ధి కుమారుం డగు మదనుని దీవించి పుత్తెంచిన శుభప్రయోజనంబు. పుళిందుని ముద్దుపట్టి, కులస్థానపౌరుషంబులు గల మేటి, యెల్లప్పుడు మనకు మహాహితుండు. వీనిం గనుంగొనిన యాక్షణంబున సందేహంబు మాని విషయ నొసంగి నావచ్చునంతలో నెల్లకార్యంబులు చక్కఁబెట్టునది యను వక్కాణం జదువుకొని సంతసించి నాసహోదరికిఁ దగిన వరుండు దొరకె మేలు మే లనుచు మౌహూర్తికుల రావించి యారాత్రిశుభలగ్నంబు గలుగుట వలన వివాహంబుఁ గావించి మహేంద్రవైభవంబున సముచిత విధానంబు లాచరించుచు నుండె”.

## (4) అహల్యాసంక్రందనము.

దీనిఁగూడఁ బైకవియే రచించెను. శ్రీరంగస్వామి కంకిత మయిన యిది మూఁడాశ్వాసముల శృంగారపద్య ప్రబంధము.

" (శ్రీరంగనాయకుఁడు) అని యాన తిచ్చుటయు నేనును దోడన మేల్కాంచి.........పురోహిత భృత్యామాత్య సామాజికవర్గంబులు గొలువం గూర్చుండి యుభయభాషా కవితావిశేష శేషు లైన శేషము వేంకటపతి, బుణి శ్రీకృష్ణ కవీంద్రులు మా కాప్తసఖులు గావునం బిలిపించి యా శుభ స్వప్నంబు వినిపించుటయు " అను నవతారికలోని వచనముం బట్టి యికవి తప్పక సామంతరా జనియుఁ దారాశశాంకవిజయకర్త మొదలుగాఁ గల కవుల నితఁ డాదరించుచుండెడివాఁ డనియుఁ దెలియుచున్నది.

గ్రంథవిషయము—ఈ గ్రంథము మిక్కిలి మంచిస్థితిలో నున్నది గాని కృత్యాది పద్యంబులు గొన్నియు, మూఁడవయాశ్వాసము తుదిపద్యంబులు గొన్నియు లేవు. కథాంశమును దీనినామమే తెలుపుచున్నది. వచనరచన యందలి ప్రౌఢిమ పద్యకవిత్వమునఁ గనఁబడదు. కవిత్వ మైన నంతనిర్దుష్టము గాదు. కాని మృదుమధురముగా నుండును. వర్ణనాదులయం దిది చాలవఱకుఁ దారాశశాంకాదుల ననుకరించుచున్నది. శైలి తెలియుటకు నాలుగు పద్యము లుదాహరించెదను.

ఉ. అంబుజగంధిచకోరదన మల్లన గన్గొని విస్మితాత్ముఁ డై
యంబుజనేత్రుఁ డప్పుడు త్రియంబకభావముఁ గోరె నాతఁ డ
ష్టాంబకలీలఁ గోరె మది నాతఁడు గోరె సహస్రలోచన
త్వంబు నతం డనంతనయనత్వముఁ గోరె మ జేమి చెప్పఁగన్!

ఈ ప్రతిలోఁ దుద నున్నపద్యము:—

కం. అందంద చూచికొనుచును, ముందఱ రఘురాముఁ డపుడు పోవుచు నుండన్
గెందమ్మిఁ బోలుపాదము, లందలి రేణువులు జాతి నందినయంతన్.

ఉ. పున్నమచందురుం గెలుచుముద్దుమొగంబును దేటమాటలున్
వన్నెనికొను మేనిజిగిచందము తీయనిమోవియందమున్
గన్నులతీరు నీలములకప్పును మించినకొప్పుసారు నా
యన్నులమిన్న కే తగు నటన్నది విన్నది లేద యెన్నఁడున్.

ఉ. అచ్చట నాయమహల్యయు వియచ్చరవల్లభురూపసంపదల్
మెచ్చుచుఁ బచ్చవింటిమెకమీనిలయోరికి నిచ్చనొచ్చుచున్
నెచ్చెలిచాలు గొల్వ నవనీయమహాతాళ నధూసుమండలా
భ్యచ్ఛయవేష్టితాగముఁ దపోవనభాగముఁ గాంచె నంతటన్!

---

(5) రాధికాసాంత్వనము.

ఇదియు నాతనిదే. కవి యీగ్రంథమున జైమినిభారతాహల్యా సంక్రందనములను గాని వానియందు దీనిని గాని పేర్కొనకపోవుటకుఁ గారణ మేమో తెలియదు. కవులచరిత్రమం దిది పేర్కొనఁబడ లేదు. దీని యాద్యంతపద్యగద్యము లీ వెంకటకృష్ణప్పనాయకుఁడే రచించినట్లు ఘోషించు చున్నవి. ఏకాశ్వాసచాటుప్రబంధ మగునిది ముద్దుపళని రాధికాసాంత్వనము కంటెఁ బ్రాచీన మైనది.

గ్రంథవిషయము—ఇది సంపూర్ణముగా నున్నది. శైలినిబట్టి చూడఁ గాఁ గవి యీగ్రంథమును బాల్యమందు రచించినట్లును గావుననే తన యితర గ్రంథములలో దీని నుదాహరింపకుండినట్లును దోఁచుచున్నది. అందలి దొక్క పద్యము—

ఉ. శౌరిని బిల్వఁగాఁ జనినచక్కనికీర మ దేల రాదొ యే
దారినిఁ జన్నదో నడుమఁ దాఁ జెనో చేరెనో లేదొ గోపికా
జారునిఁ గానదో కనెనొ చక్కఁగ నావెత విన్నవించెనో
సారకు లేక శౌరినుడిచ కేరయుక్కఅ మెకిర చొక్కెనో!

---

(6) సారంగధరచరిత్ర.

మూఁడాశ్వాసముల వచనకావ్య మగునిదియు వేంకటకృష్ణప్పనాయ కుఁడు రచించినదే యని శ్రీరంగనాథుఁడు కలలోఁ గనుపడి తనతోఁ జెప్పినట్లు గా నతఁడు గ్రంథాదియందు వ్రాసికొనిన—

"గీ. పముఖమీనాక్షి నృపగర్భవిమలజలధి
చంద్ర వేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర
మునుపు జైమినిభారత మనఘవచన
కావ్య మొనరించినట్టి సత్కవివిగాన"

......................

రంగధరపతి నేను సారంగధరచ
రిత్ర వచనముచేసి తత్కృతిని మాకు
నంకితము చేయుము శుభంబు లగును నీకు.

అనుపద్యములంబట్టియు యథాపూర్వముగా నున్న యాశ్వాసాంతగద్యమును బట్టియు ధ్రువమగుచున్నది. మఱియు సహాల్యాసంక్రందనములోని మంగళాచరణాది గ్రంథావతారిక యంతయు సరిగా నిం దున్నది. అందలి దొక పద్యము.

ఉ. రంగమహేశుకొమ్మ జగిరంగులబంగరుబొమ్మ సంపదల్
పొంగుచు నిచ్చుగుమ్మ పతిబ్రా ణ్మెడఁబాయనిముద్దుగుమ్మ య
య్యంగజుఁగన్నయమ్మ శరణార్థికి వేలుపుమ్రానికొమ్మ నె
మ్మిం గరుణించి యిచ్చు నెలమిం గలిమిన్ బలిమిం దిరంబుగన్.

గ్రంథవిషయము—ఇదియుఁ గవులచరిత్రలో నుదాహరింపఁబడ లేదు. ఇందలివచనశైలి కొంచె మించుమించుగా జైమినిభారతశైలిని బోలియున్నది. కాని పరిషత్తునకు లభించినప్రతి మిక్కిలి శిథిలమై యున్న దనుట యెంతయు విచారకరముగా నున్నది.

దీనిశైలి దెలుపుటకు రెండుపంక్తు లుదాహరించెదను.

.. అవధరింపు మక్కపోతంబు చిత్రాంగీశాతోదరినగరిలోన వాలుటయుఁ జేరికల నున్న రాకొమరులు సారెసారెకుఁ గేకలువేయ వ్యాకులంబగుమనంబునఁ గలవరపడుచు మత్పారావతంబు పెంటింగానక చిత్రాంగి విచిత్రాంగణంబున నేటికి వాలె, నాబంగరు పావురంబుం దొఱంగి యెబ్భంగి నుండు. పోతుటేఁగ కేనియుం (జొరఁ) గూడని యంతిపురంబునకు నెవ్వరిఁ బనుతు. దీమసంబునఁ దామసంబు సేయరాదు. తక్కొక్కరి నాయమ యింటికిఁ బంపుట నాయముగాదు. ఏనె పోవలయునంచు నెంచి యా...... నగరి కభిముఖంబుగఁ జనుచునుండ మతిమంతుఁ డను మంత్రిసుతుఁడు, తనకు హితుఁడును, వివేకి సుతుండు నగు సుబుద్ధి బుద్ధిమంతుండు గావున సారంగధరుం జేరంగ నేగి, పోవలదు పోవలదు, పరాకు రాకుమార! నన్ను మన్ననచేసి యిన్నివితంబుల నేలు నేలికవు గావునఁ గన్నకార్యంబు విన్నవింపక యుండిన దోషంబు. కనుక తోఁచిన విధంబు విన్నవంబు సేసెద. వివేకివిగాని మఱొకండవుగావు. ఎన్నండు

లేని యోజన సేయుదురె. ఈకార్యం బొనర్చిన హాని వాటిల్లు. ఇక్కార్యంబు సేయందగదు. ఆత్రావునకుం బోయిన నిందలు వచ్చు. ఆత్రావునకుఁ బోవం జనదు. పోరానిచోటులకుఁ బోయిన రారానిమాటలు వచ్చు. ఇంత యెఱుంగవె. ఇంత యేమిటికి కంటివేని ధారణీవల్లభుం డూరలేఁడు. నీవు చక్కరవిలుకాని ధిక్కరించు చక్కఁదనంబును నివ్వటిల్లు జవ్వనంబును విలాసినీ విభ్రమకంబు లైన విభ్రమంబులుం గలవాఁడవు. తిమురుకొమరుఁ బ్రాయంపు గర్వంపుసొంపున నింపుమీఱు నాచంపక గంధి. అటుగావున నీ వొంటిగ నవ్వాలుగంటి యింటికిఁ బోవఁ జనదు. ఆటలా, యేటి మోమోట, నామాట వినుము. రాజుల వృత్తంబును రాజవదనల చిత్తంబు నెఱుంగం గూడదు."

మఱియొక్క విశేష మిట్లరయఁదగి యున్నది. ఆఱువదేశమందలి యెల్ల గ్రంథములయందు నాచ్చికపదంబుల దీర్ఘములమీఁద నరసున్నకు బదులుగా నిండుసున్న యుండునాచార మీగ్రంథములం దెల్లెడఁ దఱచుగాఁ గనుపడుచున్నది. ఇందుల కిందలివి రెండుమాటలు.

"కొండెమునకు ధర్మరాజును నగు ననునెడ మిమ్ముం జెప్ప నేమిటికి. అడియాలంబులు కనుపడంజేసి నీకు నిజం బగునట్లు లాకలికి పలికిన దెంతయు దబ్బఱ సుమీ. మగవాండు బొంకినం దడిగట్టినట్లుండు, ఆండది బొంకినం గోడఁ బెట్టిన యట్లన్నమాట వినమా? మన మఱసి చూడవలయు. చెఱువు మూయుమూకుడు గలదు గాని నోరుమూయ మూకుడు గలదా. ఎవ్వ రేమన్న నేమి సారంగధరుం డట్టివాండు కాండు. నీ తనూజుం డేతన్మాత్రుండా. ఈశ్వరవరజనితుండు, పరనారీసహోదరుండు"

ఇందలి మూకుడు శబ్దమున నిండుసున్న లేదు. దీనింబట్టి యిప్పు డరసున్నతోఁ గన్పడు నీ శబ్ద మాదేశమున నిర్బిందువుగా నే వ్యవహరింపఁ బడుచుండెనని తెలియుచున్నది.

---

(7) సుదంతాపరిణయము.

ఈ కృతినిఁ గాని దీనికవినిఁ గాని కవులచరిత్ర యెఱుఁగదు. ఇది నాలుగాశ్వాసముల పద్యప్రబంధము. దీని రచించిన యతఁడు వెలిదండ్ల, అళఘురి కవి. ఇతనికి ముద్దళగిరియని నామాంతరము. ఈతనితండ్రి పెదరాఘవార్యుఁడు. తల్లి కనకమ్మ. ఇతఁ డార్వేలనియోగి బ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. ఇతఁడు శ్రీరం

గము రాజధానిగాఁ బాండ్యదేశము నేలిన విజయరంగ చొక్కభూపాలుని యాస్థానములోనివాఁ డయినట్లు నాతనియాసతిచేఁ దా నీకృతి శ్రీరంగస్వామి కంకితము గా నొనర్చినట్లును దనతండ్రి యారాజునొద్ద మంత్రిగా నున్నట్లును గ్రంథావతారికలో వ్రాసికొనిన యీ క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. ఆద్యస్వయంవ్యక్త మైనరంగస్థలంబేనృపతికి రాజధాని యయ్యె
నధికచంచల యైన యలమహాలక్ష్మి యేవిభునిపూజల కిలువేలు పయ్యెఁ
బ్రత్యక్షవిరజ యై పరఁగు కావేరి యేప్రభునికోటకు మహాపరిఘ యయ్యె
రాజార్హ మైనచిరత్నరత్నంబు లేదంటసీమకు మిట్టపంట యయ్యె

గీ. నట్టి నృపపాలిత......సమిద్ధ, పంచతిరువట రాజసప్తాంగపాళి
శాత్రవీకంఠసూత్రశాసన...శూలి, శ్రీవిజయరంగ చొక్కధాత్రీపమాళి.

...నింమకోలు వుండి వేడ్క నన్బిలువనంపి.

గీ. నాకు నారోగ్యభాగ్యముల్ నీకుఁ బ్రతిభ, విన్నవారికి హర్షంబు విస్తరిల్లఁ
గృతి యొనర్పుము శ్రీరంగపతికి ననిన, నాఁటి నెమ్మది నొకహాయి నాటి రేయి.

సీ. పాండ్యేశపరమాప్త పారిషద్యవరుండు గోపాలచరణసేవాపరుండు
నిఖిలదిక్తటవర్తి నిజకీర్తివిస్ఫూర్తి షట్సహస్రకులీన చక్రవర్తి
మధురాంధ్రకవనగుంఫనకళాచతురుండు సాధురక్షణవిచక్షణకరుండు
జ్ఞాతిబంధుసుహృన్నిరాతంకశుభకారి సత్సూక్తినూతనాజాతవైరి

గీ. సకలధనికౌఘకర్ణభూషాయమాన, లలితనిరవద్య నిజగుణాకలితపద్య
శతసహస్రుం డనంగ సన్నుతి వహించె, ఘనుఁడు వెలిదండ్ల పెద్దరాఘవవిభుండు.

విజయరంగ చొక్కనాథుఁడు క్రీ. 1704—1731 నడుమవాఁ డగుటచే నీ కవి యు నప్పటివాఁ డై శేషము వేంకటపతి సముఖ వేంకటకృష్ణప్ప నాయకాది కవులకు సమకాలికుఁ డని స్పష్టపడుచున్నది.

మఱియుఁ గవి తన పితామహాదుల నిట్లు వర్ణించె.

చ. అలతిరువేంగళార్యుఁడు మహాద్భుతచర్యుఁడు కీర్తిధుర్యుఁ డై
యలరి ప్రసూనమార్దవ శుభాంగిని గోనమ యన్వధూమణిన్
లలితగతిన్ వరించి కమలాసతిఁ జేకొనినట్టి చుట్టువా
ల్చలియునికై వడిన్ బరఁగె బంధువు లందఱు సంతసింపఁగన్.

సీ. శృంగారరసముఖోచితసితాంధ్రోక్తిపద్ధతిపోషి వేంకటపతిమనీషి
సకలదేశాధీశ సమ్మతపేశలకవనుండు పెద్దరాఘవఘనుండు
జనమనోరంజన సరససల్లాపధారల వన్నె గన్న చిన్నరాఘవుండు
మధురవాక్యప్రౌఢిమ నిరస్తభారతి నఖముఖరితతంత్రి నరసమంత్రి
గీ. లలితవార్తాచమత్కృతి లక్ష్మిపతియు, ననఁగ నేవురు గల్గిరి వినయులైన
తనయులై తిరువేంగళార్యునకు జగతిఁ, దనువు లందినపంచతత్త్వము లనంగ.
కం. అం దగ్రజుఁ డర్చితగో
విందపదుండచ్చతెనుఁగు వేంగన వెలసెన్ ...
సీ. ఆమేరురామేశ్వరావని విఖ్యాత మేనేత శుద్ధాంధ్రకృతిసహస్ర...
గీ. అతఁడు చెలువొందుఁ దిరువేంగళార్యగర్భ, జలధికమలారి దుష్కవి స్మయవిదారి
యనవరతతోషి గానవిద్యాభిలాషి, బంధుపరిపోషి వేంకటపతిమనీషి.

దీనింబట్టి యితని పితామహుఁ డగువేంగళార్యుని కీతనితండ్రి యగు పెదరాఘవార్యుఁడు గాక యింక నలువురు విద్వాంసు లగుపుత్రులు గల రనియు, వారిలోఁ బెద్దవాఁ డయిన వేంకటపతిమనీషి యనేక శుద్ధాంధ్ర గ్రంథములు రచించి యచ్చ తెనుఁగు వెంగన యనుబిరుదు వడసె ననియుఁ దెలియుచున్నది. మఱియు రాధామాధవసంవాదము రచించినట్లు గాఁ గవులచరిత్రలోఁ జేర్కొనఁబడిన వెలిదండ్ల వేంకటపతి యీయచ్చతెనుఁగు వేంగనయే యనియు స్పష్టమగుచున్నది. కాని, యితనికాలనిర్ణయ మందు విస్పష్టముగా లేకపోవుటయే కాక యీతనితండ్రిపేరు తిరువేంగళార్యుఁ డనుటకు బదులుగాఁ దిరువేంగళాచార్యుఁ డని కనుపడుచున్నది. ఇదిట్లుండఁగా దనపెదతండ్రి వేలకొలఁది యచ్చతెలుఁగు కావ్యములు వ్రాసె నని చెప్పుచు వానిలోఁ గొన్నిటినైన మనకవి పేర్కొనకపోవుట యు విచార్యమే.

గ్రంథ విషయము—అష్టమహిషులలో నొక్కతె యగు సుదంతకును శ్రీకృష్ణునకును జరిగిన వివాహము ప్రబంధోచితవర్ణనలతో నిందు విస్తరింపఁబడినది. గ్రంథము సంపూర్ణముగా నున్నది. కవిత్వము చక్కఁగా నున్నది. శైలి తెలియుటకిం కొొకపద్య ముదాహరించెదను.

చ. లలితరసాలసాలతరుపల్లవలంబిమహీతలచుంబివల్లికాం
చలయుగళంబులం బెనచి చయ్యన నుయ్యల లూఁగుచేశలకా
గులుకుమిటారి జవ్వనపుఁగొమ్మలు పొల్చిరి పంచకాండకుం
డలితధనుర్లతాతతకసత్కనకాంబక రేఖలో యనన్.

(8) చంద్రభానుచరిత్ర.

ఇది తరిగొప్పుల మల్లనకవిచే రచింపఁబడిన యైదాశ్వాసముల శృంగార పద్యప్రబంధము. దీని మొదటి 6 పత్రములు పోయినవి. మిగిలిన 78 పత్రముల లో నందందుఁ గొన్నిమాటలు మాత్రమే పోయినవి. నలఁగియున్న 7-8 పత్రము లలో నీ క్రిందిపద్యభాగములు కనుపడుచున్నవి.

గీ. ...అక్షరవిఖ్యాతి నెనసెనో య,ఖండజయమూరురాయరగండబిరుద
వీరతిరుమలరాయపృథ్వీతలేంద్ర, తనయుఁ డగువేంకటక్షమాధవునికీర్తి.

కం. ఆ వేంకటపతినృపతి ద,యావీక్షాగౌరవమున నతిశాశ్వతల
క్ష్మీవైభవంబుఁ గాంచిన, నావంశం బభినుతింతు నవమధురోక్తిన్.

వీనింబట్టి వసుచరిత్ర కృతినాయకుఁడును గర్ణాటాంధ్రదేశపాలకుఁడు నగు తిరుమల రాయనినాల్గవపుత్త్రుఁ డగు వేంకటపతినాథుఁ డీకవిపోషకుఁ డైనట్లు తెలియు చున్నది. ఈ వేంకటపతిరాజు క్రీ. 1585—1614 నడుమ రాజ్యముచేసినవాఁ డని కవులచరిత్ర తెలుపుచున్నది. కావున నీకవియు నప్పటివాఁడే కాని—

"రారాజద్గుణశాలి తిర్మలమహారాయుండు శ్రీ వేంగళాం
బారామామణియందుఁ గాంచె సుతులన్ బ్రఖ్యాతసత్కీర్తిల
క్ష్మీరాములన్ (1) రఘునాథభూమిరమణున్ (2) శ్రీరంగరాయాగ్రణిన్
(3) శ్రీరామావనినాథుఁ బ్రాభవనిధిన్ (4) శ్రీ వేంకటక్ష్మావరున్.

కం. ఆరఘునాథప్రభృతిధ, రారమణేంద్రులకు మువ్వురకు సోదరుఁడై
సారమతి వేంకటపతి, క్ష్మారమణీప్రియుఁడు వెలయు శత్రుఘ్నుఁడనన్.

అని యీ వేంకటపతిరాయలు తిరుమలరాయలకు నాల్గవపుత్త్రుఁ డైనట్లు వసుచరి త్రము తెల్పుచుండఁగాఁ గవులచరిత్రలో నితఁ డాతని మూఁడవపుత్త్రుఁ డయిన ట్లుండుట కాధార మేమో తెలియకున్నది. మఱియు రామరాజభూషణుఁ డీ వేం కటపతిరాయల రాజ్యదాన శౌర్యములను వర్ణించి యుండుటచే నతఁడును జంద్ర భానుకర్తయు సమకాలికు లయినట్లు విశద మగుచున్నది. కాని యట్టిప్రసంగ మేదియు నిందు నందును గూడఁ గానరాదు. కవులచరిత్రలో నుదాహరింపఁబడని యీతనివంశచరిత్ర మిందుఁ గొంత దెల్పెదను.

ఈ కవితాత - తరిగొప్పులమల్లన్న. ఇతఁ డార్వేలనియోగి, ఇతనికి నాగాం బికయందు నరసామాత్యుఁడు పుట్టెను. ఇతనికిఁ దిప్పమాంబయందు, అప్పనా

ర్యుఁడు, దత్తాత్రేయుఁడు మల్లికార్జునుఁడు ననుముగ్గురు పుత్త్రు లుదయించిరి. ఈ మల్లికార్జునుఁడే మనకవి యగు మల్లన. ఈతఁడు తన పెద్దయన్నను గూర్చి—

గీ. అరయఁగఁ బ్రధానమాత్రుండె యఖిలవినుత, మాధ్వదర్శనధౌరేయమాననీయ
పరమహరిగురుచరణాబ్జభజనపరుఁడు, మంత్రినరసయ్య యప్పనామాత్యవరుఁడు

అనియు, రెండవయన్ననుగూర్చి—

......అతం డొప్పు వేంకటేంద్ర, దత్తసామ్రాజ్యవిభవుండు దత్తమంత్రి.

మ. ఘనగోత్రోద్ధరణం బసంఖ్యసుకవిగ్రామప్రధానైకసా
ధనసద్భావధురంధరత్వము మహాదర్పోద్ధతారిప్రధా
ననిరాసోద్భటపాటవంబు నిరవొందన్ దత్తనాఖ్యుంఁడు శ్రీఁ
దనరున్ వేంకటరాయదక్షిణభుజాదండావిశేషోద్ధతిన్.

అనియుఁ, దన్నుఁగూర్చి—

కం. ఆదత్తమంత్రియనుజుఁడ, శ్రీదత్తాత్రేయయోగిశేఖరసేవా
మోదితుఁడ సుధారసధా, మోదితుఁడన్ మాధ్వమునిమతోద్ధారకుఁడన్.

అనియు వ్రాసికొనెను. దీనింబట్టి యీతనివంశమువా రందఱును మంత్రు లనియుఁ, దమ్ము మధ్వమునిమతోద్ధారకులనుగాఁ దెల్పుకొనుటచే ద్వైతమత మవలంబించినవా రనియుఁ దెలియుచున్నది.

గ్రంథవిషయము—ఈ కావ్యము దత్తాత్రేయముని కంకిత మొనర్పఁబడినది. ఇందు సత్యభామా శ్రీకృష్ణులకుఁ జంద్రభానుఁ డనుపుత్త్రుఁ డుదయించుట మొదలుగా నతండు భోజభూనాథుని పుత్త్రియగు కుముదిని యనుకన్యను బరిణయంబగుట యనునంతవఱకును గల కథాభాగము సరసముగా వర్ణింపఁబడినది. అందందు వ్యాకరణ విరుద్ధప్రయోగంబులు నన్యదేశ్యంబులు నుపయోగింపఁబడినవి గాని కవిత్వము మృదుశైలిలో నున్నది. శైలి తెలుపుట కొకటి రెండుపద్యము లుదాహరించెదను.

ఉ. బాలురు పుట్టుభోగులు నృపాలతనూభవు లెండకాఁకచేఁ
దూలినవారు నిద్రతమిఁ దూఁగెదువా రొకతప్పు సేసినన్
దాళక పేల కావరమునన్ కపియించితివోయి యిట్టి నీ
తెం[illegible] [illegible]భర మేల సేయుదుల్ !

చ. అని పొగడఁగ యదుప్రవరుఁ డాత్మకుమారుల నానవాళ్లతో
   చనల గృహప్రవేశశుభసంపద పెంపు వహింపఁజేయ వా
   రును గురుదేవతానుజనరూపమహోచరణం బొనర్చి త
   ద్ఘనతరభద్రసూక్తుల సుఖస్థితిఁ గైకొని రంత నొక్కెడన్.

(9) తపతీసంవరణోపాఖ్యానము.

ఇది కవులచరిత్రలోఁ జేర్పఁబడని యొక మహాప్రబంధము. అద్దంకి, గంగాధరకవి రచించినదాని కిది ప్రాచీనమో యర్వాచీనమో యూహింపరాదు. దీని రచించినయతఁడు నరసింహకవి. ఈతనితండ్రి లక్ష్మీనారాయణార్యుఁడు. వీరి యింటిపేరు కొట్రవారు. ఈ యింటిపేరివారు గోదావరీ విశాఖపట్టణమండలముల లోఁ గలరు. వీరిలోఁ గొందఱు (త్రైలింగ్యులు) తెలగాణ్యులు, కొందఱు (కోసలేయులు) కాసలినాటివారు కూడ గలరు. వారిలో నితఁ డెవఁడో తెలియదు. కాని యీ గ్రంథము దక్షిణదేశమందలి దగుటచే నేతత్కర్త దక్షిణదేశీయుఁ డగు నాంధ్రుఁడని తోఁచుచున్నది.

గ్రంథవిషయము—ఇది శ్రీవేంకటేశ్వరస్వామి కంకిత మయినది. ఇట్టి మహా కావ్య మాంధ్రదేశమున వ్యాపింపక చెదపురుగులపా లగుట యాంధ్రభాషాదుర వస్థ గాని వేఱు గాదు. పరిషత్తునకు లభించినప్రతిలో నాద్యంతపత్రములు చాల వఱకు లేవు. మిగిలినవానిలో నాల్గవయాశ్వాసము తుదిభాగమును, అయిదవయా శ్వాసము మొదటిభాగమును గలవు. ఈ కారణమునఁ గవి యెప్పటివాఁడో యూ హించుటకుఁగాని యిది యెన్ని యాశ్వాసములకావ్యమో చెప్పుటకుఁ గాని తోఁచ కున్నది. పత్రికాపాఠకులు భాషాభిమానముతో దీని సంపూర్ణ మగు ప్రతిని సంపా దింపఁ బ్రయత్నింతురుగాక. కవిత్వరుచి తెలుపుటకు రెండుపద్యము లుదాహ రించెదను.

ఉ. ఓ వనజాక్షి యీతటిని నుగ్రుఁడు నొదల మోచినాఁడు నా
   నావిధదేశవాసులును నమ్రత వచ్చి యిదే వియద్ఝరిన్
   గావడిగట్టి మోచెదరు గావున వారును దత్సమానులే
   కావలెఁ గాక యందఱుఁ గాశికిఁ బోయెడిభాగ్య మబ్బునే.

మ. సతతామోదభరప్రపూర్ణవిశద జ్ఞానప్రసూనోల్లస
ల్లతికావేల్లితకల్పకద్రుమ మహాలాస్యప్రసన్నాళిభా
క్సితఖద్యోతసుధామరంద ద్విజసంసేవ్యస్థిరైశ్వర్య య
చ్ఛతఁ గొల్తున్ నినుఁ గాళహస్తిమృగరాజా కాళహస్తీశ్వరా

## (10) తొండమాన్ రాజశతకములు.

పుదుకోటరాజు లైన యాయాతొండమాన్‌వంశ రాజులపై నపు డపుడు కవులు చెప్పిన శతకములలోని కొన్నికొన్ని పద్యములు గల యొక తాళపత్రగ్రంథము పరిషత్తునకు సంభవించినది. ఇం దొక్కరాజు మీఁద జెప్పిన శతక మైనను సంపూర్ణముగా లేదు. కాని తొండమాన్విజయరఘునాథ, రాజగోపాల, తిరుమలరాయ, రఘునాథరాయలమీఁది పద్యములు కొన్నికొన్ని యిందుఁ గలవు.

ఇది యొకగ్రంథ మని తెల్పుటకుఁ గాదు గాని యిక ముందు తెలుపఁబోవు గ్రంథములను వానికవులనుగూర్చి నిశ్చయ మైన వృత్తాంతము తెల్పుట కీశతక శేషము సహాయపడుచున్నందునఁ జదువరు లెఱుంగుటకై దీనింగూర్చి కొంత వ్రాయవలసి వచ్చినది.

ఇందలి వేఱువేఱు పద్యములను రచించిన కవుల వృత్తాంతము నిక్కముగాఁ దెలియదు గాని మొదటి తొండమాన్విజయరఘునాథునిమీఁదఁ జెప్పినయతఁడు 'కవి శేషయ్య' యని మొదటి పత్రముమీఁదఁ గనుపడుచున్నది. మఱియు—

'రాయరఘునాథ తొండమాన్నృపతనూజ, రమ్యగుణసాంద్ర తిరుమలరాయచంద్ర' అనియు—

'రాజగోపాలనృప' అనియు మకుటములుగాఁ బై విజయ రఘునాథుని తండ్రిమీఁదను దమ్మునిమీఁదను గ్రమముగా నున్నపద్యములు పత్రముల సందర్భమునుబట్టియు, శైలినిబట్టియుఁ బై శేషయ్యయే రచించియుండవచ్చు నని యూహించుట కవకాశము గలుగుచున్నది. మఱియు—

పై విజయరఘునాథుని కుమారుఁ డగు రాయరఘునాథుని మీఁద:—

' విజయరఘునాథమేదినీ విభుతనూజ
రాయరఘునాథ భోజవిక్రమబిడౌజ,"

అనుమకుటముతో శ్రీమన్నారయ్య, సూర్యశేఖరయ్య యను కవులు శతకము చెప్పినట్లుగాఁ బత్రములమీఁది నామములనుబట్టి తెలియుచున్నది.

ఈతని మీఁదనే "రాయబిరుదాంక రఘునాథరాణ్మృగాంక" యను మకుటముతోఁ గవివెంకయ్య శతకము చెప్పినట్లును గనుపడుచున్నది. ఈ కవి యగు సుదురుపాటి వెంకయ్యయే యాంధ్రభాషార్ణవము రఘునాథీయము మొదలగు కృతుల నీ రాజునకే యంకిత మొనర్చినట్లు ముందు వివరింపఁబడును. ఇది యి ట్లుంచి కవిశేషయ్యచే వర్ణింపఁబడిన విజయరఘునాథునిఁ దెల్పుట ప్రకృతము గావున దానింగూర్చి వివరించెదను.

కవిశేషయ్యనుగూర్చి నామమాత్రమే కాక యింకేమియుఁ దెలియదు. ఈవిజయరఘునాథరాజు, ఆంధ్రభాషార్ణవము మొదలుగాఁ గల కృతులకు నాయకుఁడైన రాయరఘునాథ రాజునకుఁ దండ్రి. ఇతఁడు పాండ్యమండలాద్యధీశ్వరులకు సహాయుఁడైనట్లుగా నీతనింగూర్చి యాంధ్రభాషార్ణవములో వెంకనార్యుఁడు వర్ణించిన—

"త్రిశిరఃపురీపరిబృఢమనోనళినికి" యను సీసపద్యమును బోలిన శేషయ్యశతకమందలి యీ క్రిందిపద్యములు చెప్పుచున్నవి.

సీ. పాండ్యభూపాలు దీప్తప్రతాపాగ్నికేశూరునిబలము సమీరణంబు
మధురేశుకీర్తినిర్మలసుధారాశి-కేయున్నిద్రఁజయము చంద్రోదయంబు
త్రిశిరఃపురాధిపతిప్రతిజ్ఞామందరమున కేదారబుద్ధి కమఠరాజు
విశ్వనాథావనీవిభు మనఃస్ఫుభవధూగ్రీవ కేభూపాలు సేన బొట్టు
గీ. అతఁడు నీవే కదా పదానతమహారి, హరి కరుణావిహారి యాహవపురారి
బళిర తిరుమలతొండమాన్పృభుకుమార,విజయరఘునాథతొండమాన్విభువజీర.

సీ. ప్రతిలేనిమైసూరిపతికేతనముమీఁద నెలకొన్న సింగమ్ము నీదుకీర్తి
పాచ్చాయిహు......భాసిల్లుచున్నట్టి నిండుచంద్రజ్యోతి నీదుకీర్తి
గడిచోళభూపతి కంఠదేశంబున నెకొ(ఁ)న్నహారంబు నీదుకీర్తి
కేరళభూపాలు కులఁకుల నేవేళ నెగడువింజామరల్ నీదుకీర్తి
గీ. పరఁగుసామంతనృపతులపాగలందు,నిలుచుమగఱాల జిగితురాల్నీదుకీర్తి, బళిర

వీనింబట్టి యీ విజయ రఘునాథరాజు మధురాధినాథుఁడైన విజయరంగచొక్కనాథునకు సమకాలికుఁడై 1700—1734 నడుమ నవసాలపురమనఁబడెడి పుదుకోటకు రాజై యుండినట్లు తెలియుచున్నది. ఈవిషయ

మును, నుదురుపాటి సాంబశివకవి రచించిన తొండమాన్వంశప్రతాపమాలిక లోని యీక్రిందిపాదము లిట్లు స్థిరపఱుచుచున్నవి.

సీ. దక్షిణసీమకుఁ దగ నవాబైనట్టి మమదల్లిఖానుఁడు మహితబలుఁడు
కుంపిణీవారలఁ గూడి నడచినట్టి యదిమొదల్ జగడము లవధరించి
చలమూన నలచందసాహేబు చెలిమికై యల విజయరఘునాథావనీంద్రు
కడ కేఁగ నాలమఖానునిఁ బంపిన నప్పుడె యలవాఁడు నతిరయమునఁ......

ఇందలి మమ(మహ)దల్లీఖాను, చందాసాహేబులు క్రీ. 1750 ప్రాంతమందలివా రని హిందూదేశచరిత్ర తెల్పుచుండుటచే వీరికి సమకాలికుఁడైన రెండవవిజయ రఘునాథరాజునకుఁ బూర్వుఁడై 1734—1747 నడుమ రాజ్యముచేసిన రాయరఘునాథునకుఁ దండ్రి యైన యీమొదటి విజయరఘునాథరాజు 1700—1734 నడుమ నుండుట యాశ్చర్యకరము గాదు. కావునఁ గవిశేషయ్యకూడ నప్పటివాఁడే యని యూహించునది.

ఇఁక నీతొండమాన్‌రాజు లని పిలువఁబడు కోటివంశసంభూతు లైన పుదుక్కోటరాజులలోఁ దిరుమలరాయ, విజయరఘునాథరాజ, రాయరఘునాథ నామములు గలవారు పెక్కం డ్రుండుటచే ముందు దెలుపఁబోవు కృతుల కాలము చదువరులకు విస్పష్టముగాఁ దెలియ దని తలంచి తొండమాన్రాజ క్రమము చూపుట యుచిత మని సాంబశివకవి బిల్హణీయమునుబట్టి దాని నిందుఁ బొందుపఱుచుచుంటిని.

ఇంద్రాన్వయ మనఁబడెడు కోటివంశరాజులలోఁ గొందఱకుఁ దరువాతి మూలపురుషుఁడు—

(1) రాయతీక్షితి నాథుఁడు.
|
(2) రాయరఘునాథరాజు - 3 తమ్ములు.
| I
(3) తిరుమలరాయరాజు - 3 తమ్ములు.
|
(4) విజయరఘునాథరాజు తిరుమలరాయ వజీరు. 3 తమ్ములు.
| I |
(5) రాయరఘునాథరాజు (6) విజయరఘునాథ తొండమాన్‌రాజు.
II | II
(7) రాజావిజయరఘునాథ తొండమాన్బహదరు. | (8) ఎక్సలెన్సి రాయరఘునాథరాజు
III | III
(9) శ్రీరామచంద్రరాజు.

ఇందు (4) వ, రాజు కవిశేషయ్య శతకమునకు నాయకుఁడు. (5) వ, రాజు, ఆంధ్రభాషార్ణవ రఘునాథీయాదికృతిపతి. (8) వ, రాజు, బిల్హణీయాది కృతి నాయకుఁడు. (9) వ, రాజు చంద్రాననాదండకపతి.

పైనిజూపిన శతకసంపుటమున మిగిలిన రాజులపేర్లతోఁ గూడినపద్యములు గూడఁ గొన్ని గొన్ని కనుపడుచున్నవి గాని వాని రచించినవారినామములు సరిగాఁ దెలియుట లేదు. ఇం దుదాహరించినరాజక్రమములో నంకములచే నిరూపింపఁబడినవారు క్రమక్రమముగా రాజ్యము చేయుచు వచ్చిరి.

---

## (11) మల్లపురాణము.

ఇది నాలుగాశ్వాసముల గ్రంథము. దీని రచించినకవి యాంధ్రభాషార్ణవ మనునాంధ్రపద్యనిఘంటువు వ్రాసిన నుదురుపాటి వెంకనార్యుఁడు. ఇతఁడు వెలనాటి వైదికబ్రాహ్మణుఁడు, మహోద్దండకవిబిరుదాంకితుఁ డగు సీతారామార్యుని పుత్రుఁడు.

కవి విషయము—కవులచరిత్ర యితఁ డాంధ్రభాషార్ణవము మాత్రమే వ్రాసినట్లు తెల్పుచు నితని యింటిపేరు 'కోటి'వా రని చెప్పుచున్నది. కాని దీనికిఁ గారణ మితఁ డాంధ్రభాషార్ణవమునఁ దనయింటిపేరు వ్రాసికొనకపోవుటచే నందలి యాశ్వాసాంతదీర్ఘసంస్కృతగద్యములోని రాజగృహనామపర మయినకోటిశబ్దము భ్రాంతి పెట్టుటయే కాని వేఱుగాదు. రాయరఘునాథుని యింటిపేరు కోటివా రయిన ట్లీ కవియే రచించిన తొండమాన్వంశావళిలోని యీ క్రిందిపద్యము చెప్పుచున్నది.

గీ కోటికులదీప కామినీకుసుమచాప, యమితసచ్చర్య రాయపదాంకధుర్య యార్యజనగేయ తొండమానాభిధేయ, రాయరఘునాథనృపచంద్ర రణమృగేంద్ర, ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ(1) మఱియు నితనియింటిపేరు నుదురుపాటివా రయిన ట్లితని తండ్రి సీతారామ కవి యయిన ట్లీ పురాణములోని యీ క్రిందిపద్యము చాటుచున్నది.

క, బలవైరిగంధసింధుర, గళబంధురఘటిత ఘంటికారావనిర
ర్గళఘాటీపటిమ మనీ, షిలలామా నుదురుపాటి సీతారామా.

---

(1) ఇది పరిషత్పత్రిక 2 సంపుటము 3 సంచికలో ముద్రింపఁబడినది.

ఈ యింటిపేరివారు కృష్ణామండలము నరసాపురములోఁ గలరు. ఇచ్చటివారే పూర్వము దక్షిణదేశమున స్థిరపడి యుందురు.

మఱియుఁ బూర్వోదాహృత మగుతోండమాన్రాజక్రమమునుబట్టియు, నీపురాణమందలి యాశ్వాసాంతగద్యములలో నున్న "రాయరఘునాథ సభాంకణబిరుదాయమాన, యను తనవిశేషణమునుబట్టియుఁ, దనయాంధ్ర భాషార్ణవ మాతేనికిఁ గృతి యిచ్చుటంబట్టియు నీకవి నవసాలపుర మనఁబడు పుదుకోటకు రాజైన శ్రీవిజయరఘునాథునిపుత్త్రుఁ డగు రెండవరాయరఘు నాథుని యాస్థానములోని వాఁ డనుట స్పష్టము. ఈ పుదుకోట తిరుచునాపల్లికి దక్షిణమున 33 మైళ్లలో నున్నది. ఈ రాజు క్రీ. 1734—1748 నడుమనున్న వాఁ డని మున్నే తెలిపియుంటిని. కావునఁ గవియు నప్పటివాఁడే యనియుఁ బుదుకోటనివాసుఁ డనియు నెఱుంగునది.

కృతిపతివిషయము—ఈ కవి, బిరుదుకుప్పా మల్లుని ప్రేరణచే నాతనికిఁ గృతిగా బ్రహ్మాండ పురాణములోని దేవమల్లచరిత్రము నాంధ్రీకరించిన ట్లీ క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. శ్రీకరుణాకరసార్ద్రీకృతభవనుండు విద్వత్కృపిచ్ఛటావినుతకీర్తి
మల్లవంశాంభోధి హల్లకినీపతి గార్గ్యసగోత్ర విఖ్యాతమాళి
నురుచిరాపస్తంబ సూత్రక్రియావేది యభ్యాసి గండగేహాభిమాని
వేంకటేశ్వరమల్లవీరపుత్త్రాగ్రణి లక్ష్మణాంబాగర్భరత్నభూష
గీ. సకలరాజాధిరాజ ప్రశస్తముద్రా, వడుగనాథేంద్ర దత్తుపవర్ధమాన
సకలనిరవధికైశ్వర్యశాలి పుషిత,బాంధవజనుండు బిరుదాకుప్పాల్ ఘనుండు.
ఉ. కొండలవంటి బల్లకులగోత్రము లేమని తెల్ప లేక యే
యుండుదు రందఱుగ్ దెలియ నొక్కకృతిగ్ రచియింపు మీవు బ్ర
హ్మాండపురాణమందుఁ గలమల్లకులక్రమ మంధ్రభాష భూ
మండలిఁ బండితోత్తములు మానసవీధిఁ దలంచి మెచ్చఁగన్.

ఈ కృతినాయకుఁడు శెట్టివంశములోనివాఁ డయినట్లు పైని జూపిన మల్ల, బల్లకులశబ్దములనుబట్టియు—

'గీ. అల్లఘునునికి నియ్యళగాద్రిశెట్టి, వేంకటేశ్వర మల్లుండు విశదరీతి' అనుచోఁ గృతిపతి పెదతండ్రి తండ్రిపేరులలో నున్నఁ 'శెట్టి, మల్ల' శబ్దములను

బట్టియుఁ దెలియుచుండఁగాఁ నితఁ డాపస్తంబసూత్రుఁ డని కవి వర్ణించుట విచారణీయము. ఇందలి యవతారికను బైపద్యములనుబట్టి యీ కృతినేత ముద్దు వడుగురాజు మొదలగు వారివలన గొప్పయైశ్వర్య మార్జించిన సేనానాయకుఁ డని తెలియుచున్నది. ఈ రాజెక్కడివాఁడో తెలియరాదు గాని యీకు ప్పాలు మల్లుఁడు మాత్రము గంధర్వకోటనివాసుఁ డని తెలియవచ్చుచున్నది. ఇది పుదుకోటకు 20 మైళ్లదూరములో నున్నది.

గ్రంథవిషయము—దీని కింద రెండుప్రతులుగలవు. రెండును మంచి స్థితిలో నున్నవి. తారకాసురుని మనుమఁ డగు వజ్రదంతుఁ డను రాక్షసుఁడు స్వర్గలోకజయంబునకై యీశ్వరునిఁగూర్చి తపస్సుచేసి వరంబులు గొని మదించి యుండఁగా నతని దేవమల్లుఁ డనువాఁడు సంగ్రామంబున నోడించుట, యీ మల్లునివంశము నిందు వర్ణింపఁబడినవి. అం దందు దోషములు గలవు గాని కవిత్వము మృదువుగా నుండును. శైలి తెలియుట కిం కొకపద్య ము దాహరించెదను.

చ. మనకు హితుం డగుణ్ ఖచరమల్లుఁడు పెండ్లికిఁ బిల్వ నీవు న
ల్వని తరుణుల్ హసించుటకు నావలఁ బాటిన విద్వ నంచు ఛా
యను దఱుమంగ నొక్కెడ నరైనను జిక్కక బెళ్కి మళ్ల వె
న్కొన క్రమరేగి పట్ట మదిఁ గోరె నన ర్రవి చేరె నస్తముణ్.

(12) రఘునాథీయము.

ఇదియు నుదురుపాటి వేంకనార్యుఁడే రచించి రాయరఘునాథున కంకిత మొనర్చిన యలంకార గ్రంథము. ఇది నరసభూపాలీ యాదులవలె మనోహర ముగా నున్నది. కాని యిచ్చటనున్న ప్రతిలో నలంకార ప్రకరణము మాత్రము కొంతవఱ కున్నది. నాల్గవ విభావనాలంకారమున కుదాహరణము.

గీ. నీవలన నాజి కలిగినభావ మెంచి, కలియుగమ్మున మించె నక్రమ మటంచు
నడవులకుఁ బాఱు నలికి నీయరులబారు,నమదహితగేయ శ్రీరఘునాథరాయ.

కవి దీనిని స్వకపోలకల్పిత మని వ్రాసికొనుటచే నీగ్రంథ మేసంస్కృతాలంకారగ్రంథమునకో భాషాంతరీకరణ మని తోఁచుచున్నది.

(13) ఆంధ్రభాషార్ణవము.

ఇదియుఁ బై వెంకనార్యుఁడే రచించి పై రాయరఘునాథున కే యంకిత మొనర్చెను. ఇది పైరెండు గ్రంథములవలెఁ గాక యాంధ్రలోక మంతయు వ్యాపించినది. అచ్చతెలుఁగుపదముల కాకరమైన దీని నెఱుంగని యాంధ్ర భాషాభిజ్ఞుఁ డుండఁ డనుటయే దీని ప్రాశస్త్యమునకు గుఱుతు.

(14) పార్వతీకల్యాణము.

ఇదియుఁ బై కవియే రచించి మీనాక్షీసుందరేశ్వరున కంకిత మొన ర్చిన యక్షగానకావ్యము. కవి యిందుఁ దనకుఁ దండ్రికి వలెనే మహోద్దండకవి బిరుద మున్నట్లు వ్రాసికొనెను. ఇది రాగతాళలయయుక్తము లగుననేకాం ధ్ర స్వల్ప సంస్కృత కీర్తనములతోను వచనములతోను నిండియున్నది.

గ్రంథవిషయము—పార్వతీ పరమేశ్వరుల వివాహ మిందు ముఖ్యవిషయ ము. ఇందలి గ్రంథము శిథిలము గాక సంపూర్ణముగా నున్నది. శైలికై యిం దలి సంస్కృతపద మొకటి యుదాహరించెదను.

ఘనమణిదీపే కల్పితధూపే కనదతిచిత్రకలాపే
కనకమయోల్లస దనుపమనైజభవనశుకమధురాలాపే
శ్రీకరవిభవ శ్శివయా సమేత శ్శేతే మాణిక్యసౌధే.
శ్రీకామహర హర హరేతి గీతం ప్రాకార రక్షణం కుర్వంతు.

సంస్కృతాంధ్రములయం దనర్గళపాండిత్యము గల యీతఁడే పార్వతీ పరిణయ మను నాఱాశ్వాసముల ప్రబంధమును రచించి యీరాయరఘునా థుని పేరు పెట్టినట్లుగా వదంతి గలదు. ఆ గ్రంథము ముద్రిత మయియున్నది.

(15) బిల్హణీయము.

ఇది పైఁడిపెద్ది వెంకటకృష్ణస్వామిపేర నున్న బిల్హణీయముకంటె వే ఱైనది. కవులచరిత్ర యెఱుఁగనిది. దీని మహోద్దండకవి బిరుదాంకితుఁ డగు నుదురుపాటి సీతారామార్యునకుఁ బౌత్రుండును వెంకనార్యునకుఁ బుత్రుండు నగు సాంబశివకవి రచించి, తనతండ్రివలన నాంధ్రభాషార్ణవాదులు కృతి నం దిన రాయరఘునాథుని పినతండ్రిపౌత్రుఁ డైన తొండమాన్రాయ రఘునాథున కంకిత మొనర్చెను. చిత్రకవి సింగనార్యుని కాలము సరిగాఁ దెలియకపోవుట నీ

రెండు బిల్హణీయములలో నేది ముందో తెలియరాదు. కవి యిందీరాజవంశము వర్ణించు రెండవరాయరఘునాథునివఱకును గల పద్యములను దన తండ్రియాంధ్రభాషార్ణవములోనివే యిందుఁ బొందుపఱిచి యాతనితరువాత రాజ్యమేలిన యతని పినతండ్రికొడుకగు రెండవవిజయరఘునాథరాజును దరువాతఁ గొంతకాలము రాజ్యమేలిన యితనిపెద్దకొడుకగు మూఁడవవిజయరఘునాథరాజును దరువాత రాజ్యమునకు వచ్చిన యితని తమ్ముఁడును దనకృతిపతియు నగు మూఁడవరాయరఘునాథరాజును వర్ణించెను. మఱియు నితండు—

(16) తొండమానన్వంశప్రతాపమాలిక.

అనుపేర నీ రాజులవంశచరిత్ర వ్రాయుచు నందు మొదల "కోటితిరుమలరాజు మొదలుగా రాయరఘునాథునివఱకును గల యిరువదితరములవారి ప్రతాపము నాతండ్రి వేంకనార్యుఁడు వర్ణించె నవలివారిని నేను వర్ణించెద" నని ప్రతిజ్ఞ చేసి తరువాతివారిచరిత్ర సంపూర్ణముగా నిందు వర్ణించెను.

మఱియుఁ దనకృతినాథుఁ డయిన యాతేని కప్పటి హూణరాజు 'ఎక్సలెన్సి' అనుబిరు దిచ్చినట్లుగా నీమాలికలోఁ దెల్పుటయే కాక బిల్హణీయావతారికలో నిట్లు వర్ణించెను.

సీ. కలశవారిధిలసత్కల్లోలములమాడ్కి నే మేటికీర్తి పైపై మెలంగు
సేతుకాశీమధ్యభూతలంబందున నెవ్వానిరాజ్యాభ వెన్న నెగడు
సకలరాజన్య ప్రశంసనీయంబులై యెవ్వానిబిరుదంబు లెసక మెసఁగుఁ
గవితాతిధూర్వహ కవిలోకముల కెల్ల నెవ్వానిగుణగణం బెలమిఁ జేయు
గీ. హూణరాజన్యవృషభ విషాణమైన, యెక్సలెన్సనుబిరుదు నేనృవుఁడు వడసె
నింద్రవంశాబ్ధిచంద్రుఁడై యెవఁడు వెలయు, నట్టిరఘునాథరాణ్మౌళియనువుమీఱ.

దీనింబట్టియు మున్ను దెల్పిన తొండమానన్వంశక్రమమును బట్టియు నీబిల్హణీయమును గృతి నందినయతఁడు మూఁడవ రాయరఘునాథుఁ డని స్పష్టపడుచున్నది. ఆంధ్రభాషార్ణవాదికృతు లందిన రెండవరాయరఘునాథున కీతనికి నడుమ నతనియన్నయుఁ దండ్రియు నిరువురు రాజ్యము చేయుటచే 1747 వఱకు నున్నయాతని కీతఁడు సుమారు 40 సంవత్సరముల తరువాతివాఁ డని యెంచికొన్నను నీతఁడు క్రీ. 1790 మొదలు గాఁ బందొమ్మిదవ శతాబ్దములోఁ గొంతవఱకు నున్నవాఁ డని తేలుచున్నది. కావున నా రెండవరాయరఘునాథున కే సమకా

లిఖుఁడగు కవి వేంకనార్యుని యాఱుగురు కొడుకులలోఁ గడపటివాఁడని తెలి యఁబడుచున్న యీసాంబశివ కవియుఁ బై కాలముననే యున్నవాఁడని యెఱుం గునది. ఈతని పౌత్రసంతతిలోనివాఁడగు లక్ష్మణయ్య యను నతఁడిపుడా దేశమునఁ బుదుక్కోటసమీప మందలి యొక పల్లెలో నివసించియుండె నని నా మిత్రులవలనఁ దెలియుచున్నది.

గ్రంథవిషయము — ఇది పూర్వభాగము, ఉత్తరభాగము నని రెండుభా గములను గలిగి యున్నది.

కవిత్వము — సారవంతముగా శ్రావ్యముగా నున్నది. సంస్కృత బిల్హ ణీయములోని యొకటి రెండు శ్లోకములకు సరి యయిన యీతని రెండు పద్య ములను శైలి దెలుపుట కుదాహరించెదను.

ఉ. కొందఱు లేడి యంద్రు మఱికొందఱు చిన్న మటంద్రు పిమ్మటం
గొందఱు యుక్తిఁజేసి కనుగొంటిమి భూప్రతిబింబ మంద్రు పో
చందురులోనఁ గానఁబడుచాయ యదానె రేల నం
దంద తమంబు క్రమ్మి నది తజ్జఠరంబునఁ గాన వచ్చెడిన్.

సీ. అద్దంపుబిల్లయో యల్ల జాబిల్లియో వికసితాంభోజమో వెలఁదిమోము!
వాలుగచేఁపలో వలరాజుతూపులో తామరరేకులో తరుణికనులో?
కవఁ బాయ కుందుజకఱవలో పూగుత్తులో బంగరుగిన్నెలో......
నక్షత్రమో నవనవ మైనతీఁగయో కారుమెఱుంగో వాల్గంటిమేనో!

గీ. అకటయేమంచుఁజెప్పుదు నాత్మలోన,నిదియనుచునిశ్చయముచేయ నెవరికైన
వశమె యీరీతి నూరకె పలుకరింప, నందులో నొక్కటిది యైననాను గాక.

ఇట్టిగ్రంథము లెన్నియో ప్రజలెఱుగ మెఱుఁగక మూలమూలలఁ బడి యున్నవి. అందుఁ గొన్ని చెదలపాలు గొన్ని నామమాత్రావశేషములు నగు చున్నవి. మఱియు దక్షిణదేశమందలి యాంధ్రకవులు రచించిన కొన్ని పద్య గద్య కావ్యములనామము లైన నాంధ్రదేశీయు లెఱుఁగకుండిరి. మనవారిపు డైన మేలొంచి యిట్టి ప్రాచీనకావ్యముల నుద్ధరింప యత్నింతురుగాక.

మల్లాది. సూర్యనారాయణశాస్త్రి.

# అంగారకగ్రహము.

గ్రహరాజ మనఁదగు సూర్యుని జుట్టివచ్చుచున్న సప్తగ్రహముల నిదివఱ కెంతకాలమునుండియో మన మెఱిఁగియున్నాము. అంగారకగ్రహ మాసప్తగ్రహములలో నొకటి. సూర్యమండలము చుట్టును సంచరించుగ్రహములలో నిదియే ముఖ్య మైనది. ఆర్యభటాచార్యులవారు సిద్ధాంతీకరించిన మన యాదిమభూభ్రమణసిద్ధాంతమును గమనింపకయే పూర్వజ్యోతిశ్శాస్త్రవేత్తలు భూగోళ మితర గ్రహమండలి కంతకును, మధ్యఁ గేంద్రమువలె నిలిచి యుండు ననియు, సూర్య చంద్రాదిగ్రహము లన్నియు, దమతమకక్ష్యల ననుసరించి భూమిని జుట్టి వచ్చుచుండు ననియుఁ గూడ సిద్ధాంతపఱుపఁజొచ్చిరి ; కాని యీసిద్ధాంతము నిలువఁ జాలక క్రమముగ నబద్ధము కాఁ దొడంగెను. తుదకు నూతనపరిశోధనలచే సూర్యబింబము పరిమాణమునందును, తేజస్సునందును గూడ భూమికంటె వేల లక్షల మడుంగు లెక్కువగ నుండు ననియు, సూర్యుఁడు జ్యోతిర్మండలమందు నట్టనడుమ సుస్థిరముగ నిలిచి యుండి తనసహజతేజస్సుచే వెలుంగుచు నాత్మమహత్త్వముచే భూమ్యాదిసప్తగ్రహములచేతఁ దనచుట్టును బ్రదక్షిణములు చేయించుకొను చుండు ననియు స్థిరపఱుపఁబడెను. జ్యోతిర్మండలమందలి గ్రహము లిప్పటి కేడింటి కంటె నెక్కువగఁ గనుఁగొనఁబడినవి. సూర్యమండలమును జుట్టివచ్చునట్టి గ్రహములలో మొదటివాఁడు బుధుఁడు; రెండవవాఁడు శుక్రుఁడు; మూఁడవది మనము వసియించుచుండిన భూమి; నాలవది యంగారకగ్రహము. సూర్యుని జుట్టివచ్చు గ్రహములలో నీ యంగారకగ్రహము నాల్గవది యైనను, భూకక్ష్యకు వెలుపలఁ దిరుగుగ్రహములలో మాత్ర మీయంగారకుఁడే మొదటివాఁడు. ఈగ్రహ మొక టియే గాక భూకక్ష్యకు వెలుపలఁ గడుదవ్వుననుండి సూర్యునిచుట్టును సంచరించు నట్టి బృహస్పతి శని మొదలగు నితరగ్రహములుగూడ మఱికొన్ని గలవు ; కాని యవి భూమినుండి మనము యంత్రములసహాయమున నయితము చూడఁజాల నంతటిదూరమున నున్నవి. కావుననే మనమింతవఱకును వానినిగూర్చి విపులముగఁ దెలిసికొనఁజాల కున్నాము.

జ్యోతిశ్శాస్త్రసాంకేతికపదములలో భూకక్ష్యకు లోపలిభాగమున సంచరించుగ్రహములకు గురుగ్రహము లనియు, వెలుపల సంచరించువానికి లఘుగ్రహ

ము లనియును జేస్లు. గురుగ్రహములలో శుక్రగ్రహమును, లఘుగ్రహములలో నంగారకగ్రహమును భూమికి సమీపమున నున్నందున భూమికిని, వానికిని సమీప సంబంధము గలదు. శుక్రాంగారకగ్రహము లాకృతియందు సాధారణముగ భూమిని బోలి యుండును. మఱియు నీగ్రహములయందు సర్వశక్తిమంతుఁ డైన యీశ్వరుఁడు స్వభావసిద్ధముగ నొక విధ మైనస్వతంత్రజీవశక్తిఁ గలుగఁజేసి యున్నాఁడని మనయవలోకనములు మనకు గాఢవిశ్వాసము గలుగఁజేయుచున్నవి. భూమిమీఁదవలెనే యచ్చటఁగూడ జంతుజాలమును, వృక్షకోటియుఁ గానవచ్చు చున్నది.

అంగారకగ్రహము భూమి కితరగ్రహములకంటె సమీపమున నున్నది; కాని యీరెండుగ్రహములును, దమతమకక్ష్యలలో సంచరించుచు నభిముఖముగా వచ్చునప్పుడు మాత్ర మంగారకగ్రహము భూమండలమును మిగుల సమీపించుచుండును. ఈలాగు పరస్పరాభిముఖ మగుచుండునప్పుడు రెండురూపము లేర్పడు చుండును. అందు సూర్యుఁ డీ రెంటికిని మధ్య నుండుటయు, నవి రెండును సూర్యున కిరుప్రక్కల నొకదాని కొకటి యభిముఖముగ నుండుటయు నొకటి. అప్పు డంగారకగ్రహము భూమినుండి దూర మవును. ఈ సమయమున భూమికి నంగారకగ్రహమునకును గల దూరము 61800000 మైళ్లని లెక్కవేయఁబడెను. కాని రెండుగ్రహములును సూర్యబింబమున కొకప్రక్కనే యుండి యొకదాని కొకటి యెదురుగా నుండునప్పుడు మాత్రము భూమినుండి యంగారకగ్రహము మిగుల సమీపమునకు వచ్చును; ఇదియే రెండవరూపము. అప్పుడు వానికిఁ గల పరస్పరదూరము 33800000 మైళ్లు గా నుండును. ఇట్లంగారకగ్రహము భూమిని సమీపించునపు డెల్ల మనము దానిని జక్కఁగఁ జూడఁ గలుగుదుము. యంత్రములమూలమున గ్రహవేధఁ జేసిచేసి యీరెండుగ్రహముల గతిప్రమాణమునుబట్టి ప్రతి డెబ్బది తొమ్మిదిసంవత్సరముల కొకసారి యవి యిట్లభిముఖ మగుచుండు నని కనుఁగొనఁబడెను. 1719, 1798 మఱియు 1877 సంవత్సరములయందు ది ట్లభిముఖ మైనట్లు చరిత్రలవలన మనకుఁ దెలియవచ్చుచున్నది. అంగారకగ్రహము భూమికి సమీపమునకు వచ్చునప్పుడు దూరమునుండి దగ్గఱకు వచ్చుటచే దానిప్రకాశము మిగుల హెచ్చి యప్పు డది బొత్తిగ నొకనక్షత్రసదృశముగఁ గాన్పించుచుండును. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు దూరదర్శకయంత్రములసహాయమున నాగ్రహమందలి వాయుమండలమును, దద్దైర్ఘ్యవైశాల్యమును, బరిమాణమును బరిశీలించి చూచిరి. కాని కడపటి

పర్యాయము మాత్రము అనఁగా 1877 వ సంవత్సరమువఱకు వివిధనూతనయంత్రములు కనుఁగొనఁబడి తన్మూలమున నాగ్రహమును సంపూర్ణముగ నవలోకించి, పూర్వోక్తవిషయములను జక్కఁగఁ దెలిసికొనుటయే గాక యంగారక గ్రహమందలి వాతావరణమున నీటియావిరిగూడఁ గలిసియున్న దని కనుఁగొనిరి. ఏలాగున మన యొద్ద నాషాఢశ్రావణమాసములయందుఁ గాఱుమబ్బులు గ్రమ్ముచుండునో, యాలాగుననే యొకప్రత్యేకర్తువునందలి వాతావరణమునందు మేఘపరంపర తిరుగులాడుచుండును. మఱియుఁ గాలానుసరణముగ నచ్చట వర్షించును ; మంచు గురియును. తన్మూలముననే యచ్చటి పశు పక్ష్యాదిజంతుసంతానమును, బుష్పలతాది వృక్షజాతులును జీవింపఁజాలి యుండును. గణితశాస్త్రప్రకారము నేఁటినుండి నలువదిరెండుసంవత్సరముల తరువాత (1956 వ సంవత్సరమున) అంగారకగ్రహము మరల భూమిని సమీపించును. ఈసారి మనయంత్రశాలలయం దత్యుత్తమములైనయంత్రములు సిద్ధముగ నున్నవి. ఆకాశావలోకనమునకై వివిధనూతనవస్తునిర్మాణము గావింపఁబడినవి. కావున నీ గ్రహాభిముఖసమయమున నంగారకగ్రహవిశేషములను గుఱించి యేయేవిషయముల భిన్నాభిప్రాయములు గలవో చక్కఁగఁ బరిశీలించి తీర్మానింపవచ్చును.

అంగారకగ్రహవ్యాస (Diameter) పరిమితి 4400 మైళ్లు. వైశాల్యమును, బరిమితిని బట్టి చూచినచో నది భూగోళమునందు $\frac{1}{6}$ వ భాగమునకు సమానముగ నుండును. ఇఁక భౌతికశక్తిని బరిశీలించిన నది భూమియందుఁ గల శక్తియొక్క $\frac{1}{9}$ వ భాగమునకు సమాన మని తెలియును. కావుననే యంగారకగ్రహమందలి యాకర్షణశక్తి భూమ్యాకర్షణమునకంటె మిగులఁ దక్కువదై యున్నది. ఇక్కడఁ దొమ్మిదిమణుఁగుల భారము గలిగిన యొకవస్తు వంగారకగ్రహమునం దొకమణుఁగు బరువు మాత్రమే గలిగి యుండును. భూమి 365 దినములలో నొకమాఱు సూర్యుని జుట్టివచ్చును. భూకక్ష్యకు వెలుపల సంచరించు నంగారకగ్రహము సూర్యునినుండి సగటున 139000000 మైళ్లదూరమున సంచరించుచుండును. కావున 779 దినములలో నొకపర్యాయము సూర్యుని జుట్టివచ్చును. భూమి సూర్యునిచుట్టు రెండుపర్యాయములు తిరుగుకాలములో నుచ్చస్థానమందుండినయంగారకుఁడు విశేషదూరమును జుట్టి రావలసినవాఁ డగుటచే నొకపర్యాయము మాత్రమే వచ్చును. అంగారకగ్రహములోని యొకసంవత్సరకాలము మనయొద్ద 2 సంవత్సరముల 49 దినములకు సమానము. మఱియు నాగ్రహ మొక్క

మాఱు తనయక్షముమీఁద నాత్మప్రదక్షిణముఁ జేయుటకుఁ గావలసినకాలము దాదాఁపు భూమియొక్క దైనందినగతికి సమానముగా నుండును. భూమి తనచుట్టుఁ దానొకమాఱు తిరుగుటకు 24 గంటలకాలము పట్టును. దానివలన మన కొకపగలును, రాత్రియుఁ గలుగుచున్నవి. అంగారకగ్రహ మాత్మప్రదక్షిణము చేయుట కింతకంటెఁ గొన్నినిమిషముల కాల మెక్కువగఁ గావలసివచ్చును. అనఁగా నది తనచుట్టును దానొకమాఱు తిరుగుటకు 24 గంటల 39 నిమిషముల 21 సెకండ్ల కాలము పట్టును. మొత్తముమీఁద మనభూమియందువలెనే యచ్చటను గూడ 12 గంటలపగలును, 12 గంటలరాత్రియుఁ గలుగుచున్నవి. కావుననే యంగారకగ్రహము భేదమేమియు లేక సాధారణముగ భూమిని బోలియుండు నని చెప్పఁబడుచున్నది. మనభూమి యందువలెనే యచ్చటను రాత్రులును, బవళ్లును గలుగుచుండును; ఇచ్చటవలెనే పంటలు మాఱుచుండును; శీతకాలము మున్నగు కాలములును, హిమవదాదిఋతువులును, వచ్చుచుఁ బోవుచునే యుండును. కాని యచ్చట మంచు చాల దట్టముగఁ గురియుచుండును. అందును విశేషముగ నుత్తర దక్షిణధ్రువములు మాత్ర మెల్లప్పుడును మంచుచేఁ గప్పఁబడియే యుండును. ఇచ్చటఁ గాలములు మాఱుచుండుటకు ముఖ్యకారణము భూమ్యంతిరాళమందలి కేంద్రస్థానము (Centre) క్రాంతిమండల మనంబరఁగు నాకాశమండలము నుండి 23½ యంశము (Degree) క్రిందికి వంగి యుండుటయే యని యెల్లరకుఁ దెలిసినవిషయమే. అంగారకగ్రహ మింతకంటె గొన్నియంశము లెక్కువ యనఁగా 28 యంశముల (Degrees) 21 లిప్తలు (Minutes) తగ్గియున్నది. ఇంచుక భేదమేగాని విశేషభేద మేమియు లేదు. (అనఁగా) ఆకాశమందలి క్రాంతిమండలి యన్ను సాంకేతికనామము గల యొక సంకల్పితస్థల మీరెండుగ్రహములయుఁ గేంద్రముల నంటి దాదాఁపు సమకోణములపై వ్యాపించి యుండు నని యర్థము. ఇట్లు తిరుగుచుండుటయే కాలములు మాఱుచుండుటకు ముఖ్యకారణము.

అంగారకగ్రహమునందుఁ గొన్ని నల్లనల్లని పొడలు గాన్పించుచుండును. అందు విశేషభాగ మెఱుపువర్ణమును గలిగి యున్నవి. రక్తమెట్టుగ నుండును; కావున సనాతను లాగ్రహమును మానవుని పాలిటి మృత్యుదేవత యని భావించుచు నాపేరు తలఁపునఁ బాఱి నంతనే భీతిని జెందుచుండిరి. నూతనపరిశోధన లిప్పుడు మనమనములనుండి యాభయమును బాఱఁద్రోలినవి. ఈ గ్రహగతికిని మన జననమరణ సుఖదుఃఖములకు నెట్టిసంబంధ ముండఁజాల దని మన మిప్పుడు తె

తీసికొంటిమి. మన సుఖ దుఃఖములకు మనకార్యాకార్యకరణమే కారణముగాని వేఱు గాదు. గ్రహగతివలన మనకు వేఱులాభము లనేకములు గలుగవచ్చును; ఆవిషయము వేఱు. సూర్యునివేఁడిమి, తేజస్సును, భూమియందలి జంతుజాలమున కును, వృక్షకోటికి నెట్లు జీవనాధారముగ నున్నవో యట్లే యితరగ్రహముల కిరణ ప్రసారముచే భూమియందు నివసించువారి కేదేని ఫలము గలుగుచున్న దని చెప్పిన నమ్మఁ దగియుండును. అట్లు గాక నక్షత్రాది గ్రహగతులే మన దురదృష్టాదృష్ట ములఁ దీర్మానించు ననియుఁ, దన్మూలముననే మనకు శుభాశుభములు సంప్రా ప్తించు చుండు ననియుఁ, దలంచుట జ్యోతిషమందలి ఫలితభాగమును గల్పించిన వారి జ్ఞాపకచిహ్నముగ వెనుకటినుండియు నంధపరంపరగా వచ్చుచుండిన యొక దుర్భ్రమ కాని వేఱుగాదు.

అంగారకగ్రహము రక్తవర్ణమును గలిగి యుండినంతనె మనము దాని నొక భయంకరగ్రహ మనియుఁ, బాపగ్రహ మనియుఁ దలఁపరాదు. మనకు సూర్య కిరణములనుండి కలుగుచుండిన కాంతివలె నీ గ్రహము నెఱుపుధాతువు గలకాంతి కూడ నాగ్రహవర్ణమును సూచించుచుండును. అంగారకగ్రహవాతావరణము నందు మేఘశకలము లుత్పన్నము లగునప్పుడు నీలవర్ణసమాగమ మై యుండినట్టు చూడఁబడినది. బలమైన దూరదర్శకయంత్ర సహాయమున నంగారకగ్రహదక్షిణ ధ్రువము ధావళ్యముగఁ గాన్పించుచుండును. దానిని జూచునపు డెల్లను మంచు చేఁ గప్పఁబడియుండు హిమవత్పర్వతోన్నతశిఖరములు జ్ఞప్తికి వచ్చుచుండును. ఉత్తరధ్రువముఖము భూమివైపు తిరిగియుండకపోవుటచే నెల్లప్పుడును మనకు నగపడక యంగారకగ్రహము తనకక్ష్యయం దాత్మప్రదక్షిణము సేయుచు సూర్య మండలమునుండి దూర మైనప్పుడే మనకుఁ గనఁబడుచుండును. హార్షల్ దొరగారు తమ బలమైనదూరదర్శక యంత్రసహాయమున నంగారకగ్రహమునందలి యుత్తర దక్షిణధ్రువముల రెంటినిగూడఁ జక్కఁగఁ జూచియుండిరి. ఇందువలన మంచుచేఁ గప్పఁబడిన యీరెండుధ్రువములయందును సాధారణము లైనమార్పులు గలుగు చుండును; కాని నీలవర్ణము గలిగిన మధ్యప్రదేశమునందు మాత్రము వివిధము లైనమార్పులు గలుగుచుండు నని తెలియవచ్చెను. వేసవికాలమునం దుత్తర దక్షిణధ్రువములయందలి మంచుకరుళ్లు కరఁగ నారంభించి యాయాభాగముల యందలి కాంతి సన్నమై పోవుచుండును.

గణితశాస్త్రజ్ఞు లంగారకగ్రహమండలి వ్యాసరేఖ పరిమితిని గనుఁగొనిరి.

కాని యం దనేకులు భిన్నాభిప్రాయు లై యున్నారు. అంగారక గ్రహావరణము, లోహగోళమువలె గుండ్రముగ నుండును. కావుననే దానిపొడవును, వెడల్పును, సమానముగ నుండు నని కొందఱును, భూమి నారింజపండును బోలి యుండు లాగుననే యంగారకగ్రహము కూడ నుత్తర దక్షిణధ్రువముల కడ లోనికి వంగి నాడీమండలము (Equator) నొద్దమాత్రము వెలికుబికి యుండు నని మఱి కొందఱును దమతమయభిప్రాయములను బ్రకటించిరి. కాని యీకడపటియభిప్రాయముఁ బలువు రై కకంఠ్యముగ నొప్పుకొని యున్నారు. భూపటమును జూడఁ దలఁచిన విజ్ఞానచంద్రికామండలివారిచేఁ బ్రకటింపఁబడిన యాజీవగ్రంథ మగుపదార్థ విజ్ఞానశాస్త్రము (6a) పటమును జూడనగును. మృదు వై నమట్టితోఁ జేయఁబడిన యొక మృద్గోళమును బొంగరములాగున గిఱగిఱఁ ద్రిప్పినచో నది యాపై పటమునందలి రూపమునె దాల్చు ననుట సుప్రసిద్ధము. కావున నంగారకగ్రహ మొకప్పుడు పలుచని ద్రవపదార్థమువలె నుండి కాలక్రమమునఁ దనగతి ననుసరించి ఘనీభవించి ప్రస్తుతావస్థం జెందినది. కావున దాని వ్యాసరేఖలు సమానముగ నుండఁజాలవు. 1877 వ సంవత్సరమున నంగారకుఁడు భూమి సమీపమునకు వచ్చియుండె నని చదువరు లీవఱ కెఱింగినవిషయమే కదా ! గణితశాస్త్రజ్ఞు లప్పటి తమ యవలోకనావిషయముల నెల్లను జక్కఁగ వ్రాసియుంచిరి. అట్టివానియం దెల్ల నంగారకగ్రహమున వేలకొలఁది నదులు ప్రవహించుచున్న వని వ్రాయుట మిగుల నచ్చెరువు. ఒకశాస్త్రజ్ఞుఁ డిట్లు వ్రాయుట యవలోకనాలోప మని వ్రాసియున్నాఁడు కాని యంగారకగ్రహపటము లెచ్చటఁ గాంచినను నదీచిహ్నములు లేనిపటము గానరాదు. ఆనదులను జూచుటచే నందు బుద్ధివైశాల్యము గలిగిన జాతి యొకటి గలదనియు, వారే యందలి నదీ నదములను దమతమ భూములను ఫలవంతములుగఁ జేసికొనునిమిత్తము త్రవ్వుకొని యుందు రనియుఁ దోఁచుచున్నది. అచ్చట ధారాధరములు వర్షించు ననటయే నదీ తటాకాదుల యాస్తిక్యమును స్థిరపఱుచుట కొకతార్కాణము. కావున నచ్చట జీవజంతువులుఁ గూడఁ దప్పక యుండితీఱవలయు నను నమ్మకము గలుగుచున్నది.

1877 వ సంవత్సరమున భూమ్యంగారకగ్రహము లభిముఖము లై నప్పుడు మఱియొక నూతనవిషయముగూడఁ గనిపెట్టఁబడెను. అంగారకగ్రహమును నలువై పులఁ జుట్టివచ్చునట్టి మఱిరెండు చంద్రగ్రహములును గలవు. అవి మొనిమిది పది మైళ్లపరిధిని మాత్రమే కలిగియున్నవి. ఆయుపగ్రహములు త్వరితగతిని

దాము తిరుగవలసినప్రదేశము నంతను జుట్టి వచ్చుచుండును. అంగారకగ్రహ మొక మాఱు తనచుట్టుఁదాను దిరుగుటకుఁ దొమ్మిదిగంటలపూర్వ మవి తమధర్మము నెఱవేర్చును. కావున నవి పడమట నుదయించి, తూర్పున నస్తమించుచున్న వని స్పష్టమగుచున్నది. ఈనూతనవిషయమును మన మీభూవలయమున నెచ్చటను గానము. అంగారకగ్రహమునంగల నల్లనిప్రదేశములును, నీలవర్ణస్థలములును జూచి పూర్వశాస్త్రజ్ఞులు వానిని సముద్రము లని భ్రమించి యుండిరి. కాని ఈ సంవత్సరపు నూతనపరిశోధనలచే నవి యచ్చటి నిర్జలపర్వతప్రదేశము లని తెలియ వచ్చెను. పూర్వ మచ్చట మహాతరంగములచే విలసిల్లుచుండిన సముద్రము లన్నియు నిప్పుడింకి నిర్జలప్రదేశము లై యున్న వని నిశ్చయముగఁ దేటపడుచున్నది.

భూప్రజ లంగారకగ్రహవాసులతో సంజ్ఞారూపకసంభాషణ మొనర్పవలయు ననువిచారమున మునింగి యున్నారు. అయిరోపాదేశమం దీప్రయత్నమునకుఁ దగినయుపకరణములు గూడఁ జేర్చి యుంచఁబడినవి. ఒకానొక ప్రసిద్ధివడసిన ప్రకృతిశాస్త్రజ్ఞుఁ డంగారకగ్రహవాస్తవ్యులతో సంజ్ఞారూపమున మాట్లాడుటకు విద్యుచ్ఛక్తి నుపయోగించినచోఁ బ్రస్తుతము పనిచేయుచుండిన యంత్రములకంటె నెన్నియో లక్షలమడుంగు లెక్కువశక్తి గలిగిన విద్యుద్యంత్రములు గావలసియుండు నని లెక్కవేసి యున్నాఁడు. అట్లుగాక మన మొకవెలుతురుమూలమున వారికి సంజ్ఞ చేయవలయు ననిన వారు తమనేత్రములచే నాప్రకాశమును జూచి యొకానొకజాతివారు తమతో భాషించుటకుఁ దమశ్రద్ధ నాకర్షించుచున్నా రని తెలిసికొనునట్లు చేయుటకు నలువదికోట్ల వత్తుల ప్రకాశమును గలిగిన యొక బలమైన శక్తిగల జ్యోతి కావలయు ననియు, నాజ్యోతిని వెలిగించుటకు గంటకుఁ దొమ్మిది వందలపౌనులు వ్యయ మగు ననియుఁ గూడ మదింపు వేసియున్నాఁడు. ఈవిషయము లన్నియు వ్యక్తీకరించిన పిదప నొకవేళ నాగ్రహమందు ధీవిశాల మైనజాతి యేదైన వాసము చేయుచుండిన నాజాతి మనసంజ్ఞల నవశ్యము గ్రహించి ప్రత్యుత్తర మొసంగును; కావున మనము మనసంజ్ఞలను భావసూచకము లగునట్లు చేయుటకుఁ బ్రయత్నింపవలయును. మఱియు నీరీతినే యొకగ్రహవాసులు మఱియొకగ్రహవాస్తవ్యులతో సంభాషించి యొండొరులు తమతమ యభిప్రాయములఁ దెలిసికొని భేదము లున్న మార్చుకొన నగు నని మన మేధావు లైనప్రకృతిశాస్త్రజ్ఞ లభిప్రాయపడుచున్నారు.

ప్రొఫెసర్ లావెల్ దొరగారు తమనూతనానుభవములవలన నంగారకగ్ర

హాముసందు రూపు రేఖలయందు భూమండల మానవకోటికి భిన్నమును, ధీబల సంపన్నము నైన యొకజాతి తప్పక యుండితీఱు నని నిరూపించియున్నారు. మఱియు నీ ప్రకృతిశాస్త్రప్రముఖుఁడు తనయభిప్రాయమును వక్ష్యమాణరీతిం జెప్పియున్నాఁడు. భూగోళమునకంటె చిన్న దైన యంగారకగ్రహమున కిప్పుడు జీవితపరిమాణము ముగిసి విలయకాలము సమీపించుచున్నది. మహాతరంగములచే నలరారు చుండిన సముద్రములును, మహానదులు నింకిపోయినవి. అంగారకగ్రహవాసు లామరుప్రదేశములందుఁ దమజీవితమును గాపాడుకొనుటకును, జలాన్వేషణమునకును ప్రాణములనుగూడ లక్ష్యము సేయక విశ్వప్రయత్నముం జేయుచున్నారు. జలశూన్యతచే నంగారకగ్రహమందు లయకాల మాసన్న మైనట్టు కానవచ్చుచున్నది. జలము లేక జీవించుట యసాధ్యము గదా! సూక్ష్మగ్రాహు లైన యంగారకగ్రహవాసులు జలసమృద్ధికొఱకు వివిధప్రయత్నములును, విచారములును జేయుచున్నారు. అంగారకగ్రహమందు నదులు గల వనుటకుఁ గారణ మారసిన నాగ్రహావరణమునందుఁ గొంతకాలమునకుఁ బూర్వ మీభూమిమీఁదవలెనే సారవంతములు, ఫలప్రదము లైన భూము లుండె నని తెలియవచ్చుచున్నది. భూమిని ద్రవ్వకుండ జలము చేచిక్కదు; కాఁబట్టి మనము నదు లని తలంచుచుండిన గుర్తులాయాఋతువులయందుఁ బచ్చగ నననవలాడుచుండి కాలము మాఱినతోడనే శుష్కించి యెండి పోవుచుండిన యంగారకగ్రహవాసుల పైరుపచ్చ లై యుండు నని యాధునికప్రకృతిశాస్త్రజ్ఞుల యభిప్రాయము. మఱియు నీపైరులు నీటికాలువల కిరుప్రక్కల సాగుచేసి పెట్టఁబడును. అవియే వృద్ధి యైనప్పు డానీటికాలువలను గూడఁ గప్పివేయును. నైలుమహానదీతీరమునఁ బెట్టఁబడిన పైరు లంగారకగ్రహవాస్తవ్యుల కొకనదివలెఁ గానఁబడుచుండు నఁట! వేయేల యంగారకగ్రహమందలి యంతరుష్ణము నశించిన హేతువునఁ బ్రళయకాల మాసన్న మైనట్టు తోఁచుచున్నది. ఆగ్రహము తనజీవితమును ముగింపఁజేయుచున్నది. దానిలోని వృక్షములు జంతుజాలమును నశించును. అప్పు డది చంద్రగ్రహమువలె నొక మృతగ్రహ మగును.

మాదిరాజు వేంకటేశ్వరరావు.

విడబించు చోడచప్పరంబులునుం గలిగి రాజమందిరంబునుం బోలె నైష్ఠి
కాధిష్ఠితంబును, గగనమండలంబునుం బోలె వాజివిహారయోగ్యంబును,
గృష్ణాగమనంబునుంబోలె హరిభక్తవిరాజితంబును, స్వారోచిషమనుసంభ
వంబునుం బోలె వరూథినీప్రధానంబును, మధ్య(మ)పురుష హృదయంబునుం
బోలె రాజసమానంబును నై హిరణ్యకశిపుచరిత్రంబు చందంబున నసహ్యా
తనయాభంగ ప్రవర్తమానాభిరామంబు గాక సహ్యాతనయాభంగప్రవర్తమా
నంబై, నహుషాహంకారంబు విధంబున నహితాపాదనకారణంబు గాక
హితాపాదనకారణంబై, పురుషధనుఃకోదండంబుకైవడి నమార్గణ విహా
రానుకూలం(బు గాక మార్గణవిహారానుకూలంబై), యోగిజనవర్తనంబుపగిది
నభవనవ్యాపార విభవాస్పదంబు గాక భవనవ్యాపార విభవాస్పదం బై
యొప్పు నప్పురంబుఁ బ్రవేశించి. 14

— * విప్రనారాయణుఁడు పుష్పవనము నిర్మించుట. * —

శా. ఆరాజీవభవాన్వయాభరణుఁ డాత్మారాముఁ డై యందుఁ గా
వేరీవార్యవగాహనంబులు మహావిద్వజ్జనాసక్తిచే
శ్రీరంగేశ్వరపాదపద్మయుగళీ సేవాక్రియాసంతత
ప్రారంభంబున నిత్యమాధుకరచర్యన్ ధన్యుఁ డై యుండుచున్. 15

చ. పొలుపుగ రంగధామునకుఁ బువ్వులతోఁట యొనర్చి తొంటి నా
కలిగినపాతకంబులు కకావికగా విడనాడి బ్రహ్మవే
త్తలఁ గని ముక్తిఁ గాంతు నని తత్పురిపశ్చిమసీమఁ గాంచె ని
ర్దళితసమస్తసాధుపరితాపము శ్రీమకుటాంతరీపమున్. 16

క. కని యాదీవికిఁ జేరం, జని యమ్మునివరసుతుండు సహ్యామహీభృ
త్తనయాతటము తలంపున, కనుకూలము సమతలంబు నతులం బనుచున్.

గీ. గ్రామనికటంబు గాక దూరంబుగాక, చౌటిపొరగాక చిట్టాటచోటుగాక
వల్లితలగాక క్రిఁజెదల్వేరుపురువు, రాతిపోటును లేని బారాటినేల. 18

క. పూనిక గడచన విప్వ, క్షేనప్రార్థనము సేసి చేకొని యచ్చోఁ
గానఁబడు చెట్టుసేమలు, గానం బడ నఱికి కంపగట్టిన పిదపన్. 19

ఉ. ఆయనఘుండు దారుజలయంత్రము చేతఁ గవేరకన్యకా
తోయము లెత్తియెత్తి యొకతోయముగాఁ గనుజాడయెత్తి యా

పోయి ధరిత్రి దాఁ దనివిపొందినదాఁకను నీళ్లు గట్టి వ
ర్ధాయముతోడఁ బాటిపడనై యదనైన ముదంబు తోడుతన్. 20

సీ. ఉబ్ధికాద్భుతసిత స్తబ్ధరోమాకృతిఁ దలపోయుచును నేల ద్రవ్వి త్రవ్వి
సింధుగర్వహావం క్తికంధరారిధ్యానకలితులై కట్టలు గట్టికట్టి
యందమొందఁ గళిందనందినీభేదికిఁ దెలుచుచుఁ గాలువల్ దీర్చితీర్చి
చక్రి త్రివిక్రమవిక్రమక్రీడలు గొనియాడుచును మళ్లు గొలిచి కొలిచి

గీ. మిట్టువల్లంబు లెల్లను మెలఁపుతోడ, సరసి నాలుగుమూలలుఁ జదునుగాఁగ
నేర్పుతో నాలవాలంబు లేర్పఱంచి, తమిని నానాఁటికిని వానితతి యెఱింగి,

క. కొన్నిటికి నారునాటుచుఁ, గొన్నింటికి నంట్లు పాదుకొలుపుచు మఱియుం
గొన్నిటికి విత్తనములు త, గన్నాటుచుఁ దోఁట సేయఁగడఁగిన యంతన్.

ఉ. నీటను దేమయెక్కి నసి నిల్చి యొకించుక వాడు దేఱి య
ప్పాటున వేరువాఱి ధృతిపాటన మొప్ప నతం డొనర్చు న
ప్పాటునఁ జెన్నుమీఱి పరిపాటిగఁ గెంజిగు రక్కడక్కడన్
మోటిక లెత్తి క్రొవ్విరులు మొగ్గలు వెగ్గల మయ్యె నయ్యెడన్. 23

క. అమరఁగ లతికలు దరువులు, దమరసమై పసిమి మిసిమి దగ్గక మిగులం
గొమరై ప్రొద్దొకచాయల, గుమురై యెలదోఁట యనలుగొనలుంబార్తన్.

వ. వెండియుం జకచక ప్రభాభరిత జాలకంబు లగువకుళజాలకంబులును, బరితః పరీత పరిమళమిళిత పరాగంబు లగుపున్నాగంబులును, దరవికచప్రసవమం జరీ మంజుళంబు లగువంజుళంబులును, గిసలయశ్యామాయ మానంబులై వెలసి యొండొంటిం గలసి మెలసి విలసిల్లు తులసియును, నిజవాసనాకందళిత సకలజనానందంబులగు కుందంబులును, విరిదేనియలసోనలం దోరంబు లగు కరవీరంబులును, నిరంతర భ్రమరీగానంబు లగుపాటలీవితానంబులును, విరికొలంకులం బొదలు గొజ్జంగిపొదలును, సాయంతన సమయవికసనంబు లగువికచవిచికల నిచయంబులును, మీఱు కురువేరును, అంకురితగంధ కదంబంబు లగులామజ్జకస్తోమంబులును, మితిగడచి లతికలకెల్ల నేలిక లగు నవమాలికలును, వికస్వర ప్రసవగేయంబు లగుచాంపేయంబులును, నర విరి విరులఁ గొఱలి యితరసౌరభలోలుభ ద్విరేఫంబులకు వల్లియ లగు బొండు మల్లియలును, వరుణప్రుంతాంత ఘారంబు లగు మందారంబులును, బరువం బగుమరువంబును, గర్భదళసౌరభ్యనిలయ మలయానిలాపదాత

వ్రాతంబగు కేతకీజాతంబును, రాలచ్చికి రచ్చ యగుపచ్చయును, విరహిణీ జనకంటకంబు లగుకంటకంబులును, నయనానంద సంపాదు లగుజాదు లును, నాదిగా నల్లలిత పల్లవిత కోరకిత ప్రసవిత లతికాతరుషండంబులు తం డతండంబులై ప్రపీలిత చ్ఛాయాజాలంబులు విగుడం బొగడం దగి ఖరకర కిరణప్రకాశంబులకు నిరవకాశంబులై చలువలం జెలు వమరి పథికజన పరి శ్రమం బపనయించుచు సకలసౌరభాభిరామం బగునారామంబుఁ గనుంగొని పరమానంద కందళితహృదయారవిందుండై యవ్విప్రనందనుండు 25

క. అరవిరు లగు *నాపెట్టిన, తరువాటికవిరుల రంగధాము రమేశుః
హరిఁ బూజింపఁగఁ గంటిని, జరితార్థుండ నైతిఁ దపము సఫలం బయ్యెన్. 26

మ. అని గొజ్జంగులచెంగట న్సురభిళం బై దట్టమై చెట్లఁ బ్రాఁ
కినయాచల్లనిమాధవీలతలచకిరం జొక్కమై యుండ నే
ర్పునఁ గావించిన పర్ణశాలకడ నేప్రొద్దుం బ్రవర్తించుచున్
ఘననిష్ఠామహిమం దనర్చి మురజిత్కైంకర్య ధౌరేయుఁ డై. 27

చ. పొలుపుగ నీరుకావిపటముం గటిఁ బింజె మడంచి కట్టి విం
తలు దళుకొత్తుచుండఁ దిరునామముఁ జాఁది తదంతవీథి క్రే
వలను దశావతారములు వ్రాసిన బిల్వకరండమందు రం
జిలు తిరుచూర్ణ మార్ద్రముగఁ జేసి శలాకను రేఖ దీర్చుచున్. 28

చ. అనఘుఁ డతండు నిత్యము నహర్ముఖకృత్యము లాచరించి పా
వనమతి జిడ్డు లేక కయిత్రాలకు వాడక తావివోక వ
చ్చునివసి మొగ్గ గాక (కడ)సారిని మేలిమి నేర్పరించి క్ర
క్కునఁ బరువంపుఁ గ్రొవ్విరులఁ గోయుచు వంశపుటీతలంబునన్. 29

క. సురభిళతులసీపరిమళ, పరిమిళితములుగ నొనర్చి పరిపరిగతులం
గర మరుదుగ నతిచతురతఁ, గరకుశలత మెఱయ మాలికలు గట్టి తగన్.

క. తిరువాముడి పఠియించుచు, హరిభక్తులఁ గన్న భక్తి నడియఁడ ననుచున్
శిరమటు వంచుచుఁ బ్రాకృత, పురుషుల నెడగిల్లి దూరమునకుం జనుచున్.

శా. శ్రీరంగేశ్వరదివ్య గేహమునకుం జేరంగ నేతెంచి త
త్సారంగాంకదినాధినాథనయనున్ దర్శించి యందంద వం

* నేఁ బెట్టిన, మూలము.

దారుం డై తనచేత నున్నసుమనోదామంబు లర్పించి ధ్యా
నారూఢస్థితిఁ గొంతసే పచట నాత్మారాముఁడై యుండుచున్. 32

చ. మరలి వసుంధరామరకుమారుఁడు వైష్ణవరాజమందిరాం
తరముల కేగి యందు నియతం బగుమాధుకరంబుఁ దెచ్చి శ్రీ
హరికి సమర్పణం బని తదన్నము సాపడి రేవగల్లు దా
వరముగ నుండె నయ్యుటజవాటికఁ దోఁటకుఁ బ్రోదిసేయుచున్. 33

— * శ్రీహరి లీలావినోదము. * —

క. ఈలీల నిజపదార్చన, కేలీతత్పరత నతఁడు గిఱికొని యుండన్
నాళీకగేహినీకుచ, పాళీలోలుండు రంగపతి మదిలోనన్. 34

ఉ. ఆజలజాసనప్రముఖు లైన సువర్వులు భక్తియుక్తి మైఁ
బూజలు చేయరో మఱి తపోమహిమం జరియింపలేదొ యే
పూజలు నేతపంబులును బోధనిధాన మితం డొనర్చె నీ
పూజకు నీతపంబునకుఁ బోల్పఁగ నెందును సాటి వచ్చునే. 35

చ. అనుచును సంతసించి తన దైనవినోదముఁ జూపఁ గోరి చ
క్కని దగు నిందుజవ్వని నొకానొక యచ్చరపూవుఁబోఁడిఁ జ
య్యన హృదయంబునం దలఁచి నంతనె సమ్ముఖమందు నిల్చి వం
దన మొనరింపఁ జూచి యెలనవ్వు కనుంగవ నంకురింపఁగన్. 36

సీ. కమలనేత్ర ! కవేరకన్యాతరంగిణీ వరతటంబునకు నుత్తరమునందు
బహుభోగరాగసంపన్నమై యున్నతప్రాకారగోపురభరిత మగుచుఁ
గను పట్టు సర్వజ్ఞమనుపేర దేవతా స్థానమందిర (1) ...............
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

* * * * * *

ఉ. లాలి మనోహరాంగి శుభలక్షణలక్షిత లాలి లాలి యో
లాలితనీలనీలకచ లాలి యటంచు సువర్ణడోలికాం
దోళనఖేలనంబులను నున్నని నిద్దుర సోలగింప నా
బాలికఁ బాడుచుందుదురు పాటలగంధులు జోలపాటలన్. 38

(1) ఇచ్చటినుండి కొన్నిపద్యములు పోయినవి.

— * దేవదేవీ సౌందర్యవర్ణనము. * —

క. (1) తరుణీవిలాసం బెన్నం, దరమే పరమేష్ఠి కైనఁ దలఁపఁగ నోహో
హరిమధ్యం బఁట బంధుర, కరిగమనం బఁట విచిత్రకర మిది గాదే! 39

చ. మొలకమెఱుంగు లింపడర ముష్టదరీఫల మాట వెనుక నా
మలకఫల స్వరూపము క్రమంబున నాట ననంతరంబు శ్రీ
ఫలఫలరూప మాట బహుభంగుల నెన్నఁగ నిక్కమే చుమీ
జలరుహనేత్రచన్గవ భుజంగతపఃఫలరూప మాటయున్. 40

ఉ. తిన్ననిలేఁతసోయగవుఁ దీఁగెలు కన్నియచేతు, లిట్లు గా
కున్న సరాగపల్లవపయోరుచిరూపము తానె, కంకణా
భ్యున్నతిఁ జెందునే, చెలువుఁ జెందునె, వ్రేళ్లను గక్షురోచిరు
త్పన్నవిలాసరేఖ గనుపట్టునె, కొమ్మకు వన్నె దెచ్చునే! 41

క. అందంబున నలవలమురి, చిందంబు ముకుందుఁ డర్థిఁ జేఁ(2) బట్టినదా
నిం దగ నెఱుఁగముగా కీ, యిందీవరనేత్రగళము నెనయంగలదే. 42

గీ. కలికికనుఁగవ యబ్జవిఖ్యాతిఁ దనరు, బింబమును మీఱి తావిడంబించిమించు
దాన నంబుజవైరిచందంబు గెల్చు, దా ననఁగఁ బొల్చు నాప్రమదాననంబు.

క. జలచరములు తలచూపక, కలవరపాటునఁ జెలంగుఁ గన్నులసమతన్
జలరుహదళములు చిలుకల, కొలికిం గనుఁగొన్న నొక్కకొలికికి వచ్చున్.

ఉ. ఎంచఁగ మేచకద్యుతి వహించుట సోఁగ లనంగఁ దాము రా
ణించుట నెమ్మిమైఁ గడు గణింపఁగఁ బొల్పుట దా విభూతిచే
మించుట నాలతాంగినునుమించుకురు ల్పరువై తనర్చియుం
బించెము లై చరించె ననిపించె ఘనాఘనజిద్విలాసతన్. 45

క. పలుకోలమున మేలగు చెలి, పలుకులకును గప్పురంపుఁబ్రతి గాఁ దమ్ముం
బలుకు లనవలసి కాదే, పలుకుల నమ్మృగపదాది పదములు గలవే! 46

ఉ. ఆనలినాక్షి చూడఁ దమిమై కనుపట్ట విభావరీకరుం
డాననబింబ మయ్యెఁ, గురు లయ్యెను గందు, సుధాధరా(ధర)
శ్రీనిగిడించె మున్ను తనుఁజెందిన కెంపు, కృశత్వ మెల్ల నా
హో నడు మయ్యె, దానిదరహాసము వెన్నెల గాక యుండునే! 47

---

(1) దీనికిఁ బైనిగూఁడ గొన్ని పద్యములు పోయియుండును.

(2) చెప్పఁబడినది, స్కందకరగము—అని యున్నది.

వ. ఇట్లభినవరూపరేఖావిలాసంబులకు నావాసంబై, సాహితీనృత్యగీత ప్రసంగావధానంబులం దనకు నెదురు లేకయుండం బెరసి రసికతావిశేషంబులం గురు కుకురు కరూశ మగధ మాళవ చోళ ప్రముఖ దేశాధినాయకులచేత వాదంబునం బవాడంబులం గొనుచు సోదరీ ప్రముఖ నిఖిలసఖీజనపరివృత యై మగిడి శ్రీరంగసమీపంబునం జనుచున్న సమయంబున. 48

— * వేసవివర్ణనము. * —

సీ. అధ్వన్యభిజ్ఞశ్రమాధ్వన్యసంఘంబు ప్రతిపద్ధతిప్రపాపరికరంబు
పల్వలోదస్వీయంపచ్యమానఝషంబు బహుభిదేళిమశిరఃపటలరురుక
మస్తముస్తావిహస్తస్తబ్ధరోమంబు కీచకనికషణోద్గీర్ణదవము
పరితోవిభిన్నభూపదదృష్టపాతాళ మానాభిగళనీరసాచ్ఛభల్ల
గీ. ముదరభాగ (ప్రపూర)ణోద్యోగవిముఖ,వమధువిరహాసన్నమత్తరవ్యక్తవిటప
కించిదాతపహృద్వనీసంచరిష్ణు, మదగజేంద్రంబు వేసవి యెదురుకొనియె.

ఉ. ఏచినఘర్మవాసరము లెవ్వఁడు నేర్చుఁ దరింపఁ దత్సుధా
సేచన మొందియుం జలువఁ జెందియు రాజును నుండ దర్శవే
ళాచకితంబులై మునుపు లావుగ నెండలు గల్గు వేంద్రముం
జూచిన వొట్టఁ గాదె తలచూపవు వెన్నెలలుం దివంబునన్. 50

మ. సెకలూర్పన్ బుసకొట్టు పాన్పుగల రాజీవాక్షుఁడుం జేఁదు కు
త్తుకనుం గల్గిన వేల్పు మున్కలుగఁ బాథోరాశిలో నుండఁ గై
శికమందు న్నది దాల్ప బా మిఁపుడు గాచెం గాక కాదన్న నిం
తకు నేమాదురొ నేఁడు వేసవిని మార్తాండాతపజ్వాలలన్. 51

సీ. కర్పూరశకలసంగతవీటికాచర్వణములఁ జక్కెరపానకములవలన
మిసిమితావులఁ గదంబించు గందంబులఁ దేటకట్టాణిముత్తెంపుసరుల
శైత్యబంధురగంధసలిలగండూషల నభినవతాలవృంతానిలముల
జిలుఁగుఁజెంగావిదువ్వలువల నానీతశీతలనీహారసేచనముల
గీ. మఱియుఁగలిగినవస్తుసంపద్దలఁబొదల,నయినఖేదంబులకుఁబ్రతిక్రియలుగొన్ని
కొన్నివిధములఁదగియొదుకొలఁదినపుడు,కువలయేక్షణలొనరించుకొనుచుఁజనుచు

ఉ. కగ్గిన (చెక్కులుం,) జెమటగాఱెడు మోములు, వాడి వత్తలై
తగ్గిన మేనులు న్వణఁకు దార్కొను కౌనులు సాఁకసారెకున్

ద్రమొగ్గడు పాదము ల్మదుల ముంచినఖేదము లెండసోఁకుడు
న్వగ్గల మైన యూర్పులును విన్ననిమోములు గానిపింపఁగన్. 53

క. జలదాకృతి ధృతతులసీ, దళదాముఁడు రంగశాయి, తద్దయ మనపైఁ
గలదాయెనేని యుండ, న్వలదా యీయెండ సొక్కవన మీయండన్. 54

చ. అనుచును దేవదేవి మొదలైన మృగేక్షణ లాయ్యనోయ్యనం
జన ననుపాత్తపూర్వ మనిజస్థితిదూర మధఃకృతాతపం
బనవసరాగతం బవిదితాత్మజనుష్స్వల మప్రచోదితం
బనితరలభ్య మప్రతిహతార్జవ మత్వరితాగమంబునై. 55

సీ. కొలనిపట్టదయామికుల నెల్లఁ గమ్మఁబ్రామి ననగురివెంగకన్నానఁ దూటి
పొగడలకమ్మపుప్పొడి చొక్కపైఁ జల్లి గృహమేధివికములఁ గికురువెట్టి
విరిదమ్మినెత్తావి సరగున గిలుబాడి పటపైన చిగురుజొంపములు నెమకి
పొన్నలమకరందములు చల్లుపోరాడి తెలిమించు మల్లెమొగ్గలఁ దెరల్చి

గీ. యులబలము సేయుశుకశారికలనదల్చి,శౌర్యహృతవస్తుధృతపరిశ్రమము మీఱ
విప్రనారాయణారామ వీధివెడలి, యలసగతి వచ్చె మందమందానిలంబు.

క. వడదేఱఁ గొంతయలసత, లుడిగెన్ మొగములను దెలువు లొందెను డించె
న్వడిఁ జెమటయు జిహ్వలకుం, దడి వచ్చెం బవనురాకఁ దరుణుల కెల్లన్.

క. మరుదకురదరవిచల, ద్గరుదంచలచంచరీకకాంతనితాంతాం
తరుదంచితపరికుంచిత, తరుదంతురదళలతాంతతాంతప్రౌఢిన్. 58

ఉ. తోరపువేడ్క నేయు నెలదోటఁ గనుంగొని దానియున్న శృం
గారము పుష్పమంజరుల కమ్మనితావులు భృంగరాజముల్
గేరెడు సొంపు నింపు గలిగింపఁగ హోయని చొక్కి యాదరం
బారఁగ దేవదేవి తనయగ్రజ కిట్లనియెం బ్రియంబునన్. 59

శా. అక్కా యీగురివెందపందిరులచాయం గంటివే మంజరుల్
దిక్కూటంకవకాంతితో మనల నుద్దేశించి సౌరభ్యముల్
బుక్కాటముల్గ నొసంగుచు న్మనకుచంబు ల్గాల్చు ఘర్మాంబువుల్
దక్కంగైకొనె మైత్రిచే ననఁగ జూడం దేనియల్ గ్రమ్మెడున్. 60

క. గొనబు లగుచిగురుమామిడి, ననమొగ్గలు మొగ్గలనుచు నమ్మందగదో
వనజేక్షణ యివి గావా, పనివడి తా మతనుఁ బోటుబంటుం జేసెన్. 61

మ. హారిణీలోచన కంటివే యెదుట నొయ్యారంబుగా సౌరభో
త్కరగుంజాతరుసీమఁ దెమ్మెరల రాక న్వేఁక నల్లాడు క్రొ
వ్విరితీఁగం గని యొక్క రాచిలుక శ్రీవిగా బోటు లీక్షింప నం
దిరవై యుయ్యెల లూఁగుచున్నయది తాయిం దుమ్మెదల్ పాడఁగన్. 62

క. గామి డిదె గండుఁ దుమ్మెద, మామిడి విరితేనె లాను మత్తియొకతె చనుం
గామిడి వొడిచెను నావలి, మోమిడి తాఁ గ్రోలె నిందుముఖి కనుఁగొంటే.

వ. అనుచు నయ్యెలజవ్వను లవ్వనవిలాసంబులకుఁ జొక్కుచుఁ బెక్కు చందం
బులఁ గొనియాడుచు నెడనెడ సోఁకుల్ఁ గడలుకొను నొడలిబడలిక లెడలిం
చుచు నెడనెడ శీతలతరుచ్ఛాయామండపంబులం దలిరులశయనంబుల శయ
నించుచుం బురస్కృత తిరస్కరిణీ పరిసరంబుల భాసిల్లు లాస్యకీజనంబుల
చందంబునఁ బుష్పితలతాకుంజంబుల సందుల నందంద తెల్పుచుఁ జెలికత్తి
యలం బిల్చుచు సాయంతన జలధరంబుల మఱుఁగుననుండి యొండొండ
వెడలు క్రొమ్మెఱుఁగుల తెఱంగునఁ జివురుజొంపంబులం బొదలుపొదలు
వెలువడి తళుకుకునఁ బ్రకాశించుచుం గుఱంగట మధ్యప్రదేశంబులు ప్రవే
శించుచుఁ గెందమ్మికొలంకుల కెలంకులఁ జరియించు రాయంచలచందం
బున మకరంద ఝరసనీడంబుల నడయాడుచుఁ బాడుచు మొత్తంబు లగు
జేగుఱు నెత్తంబుల కరిగెడు మయూరవనితలచొప్పునఁ బుప్పొడితిప్పలఁ
బరిభ్రమించు మదభ్రమరంబులఁ జూచుచు రాచిలుకలవలెం గిలకిలం బలు
కుచుం జనిచని. 64

సీ. అలవిధుంతుదునిచే నగుతాప మాఱదే హారిణాంకుఁ డిది చూడఁ డయ్యెఁగాక
కాలకూటానలగ్రసనార్తి మానదే పురహరుఁ డిటు రాకపోయెఁ గాక
బడబాగ్నిశిఖలఁ జొప్పడుపాటు దీఱదే జడధి కియ్యునికి చేపడదుగాక
తపనుఁడు మార్గఖేదము వీడనాడఁడే లీల నిందు వసింపలేఁడు గాక

గీ. యనఁగఁ జలువల నెలవు వాసనల కిరవు, నిబిడమును నైనద్రాక్షపందిరులచక్కి
నున్న యొకకన్నెసురపొన్నగున్న నీడ, జలరుహేక్షణ లుబుసుపోకల వసించి.

చ. ఇల నిశరంపువాసనల నెల్ల నుచు క్కనిపించు చున్నదీ
లలితలతాంతగంధము, కొలంకులఁ దేఁటులపాట వల్లకీ
కలకలరావముల్ చెలువు గా వనిపించె లతాంగులార! యీ
చలమరిగాడ్పులం గలుగుచల్లఁదనం బిఁకఁ జెప్ప నేటికిన్. 66

క. అనుచుం జిలుకలపలుకులు, వినుచుం బూఁబొదలఁ బొదలు విభవంబుఁ గనుం
గొనుచుఁ రెండడుగులు నట, చనుచుం బన్నీటి కాల్వఁ జూడం జూడన్. 67

— * వేశ్యలు విప్రనారాయణుం గనుఁగొనుట. * —

సీ. తొగతేనిలోకందు దిగజాఱె ననఁగ మొగమ్మున బవిరిగడ్డమ్ము మెఱయ
నుదయాద్రిశిఖరంబునుద భానుబింబంబుసాటి నొసఁటఁ గావిఫాటి మెఱయ
బామల నెన్నడిమి పద్మముదళంబుల రేఖ రహిఁజూపు నూర్ధ్వపుండ్రంబునిగుడ
లో నిడిహరిభక్తి పైని ముద్రించెనా శంఖచక్రములు భుజములఁ దెలఁగఁ
త్రిపథగా ఖావమొకచోటఁ దెలుపుచున్న, త్రిదశనదివోలెనఱుతఁజన్నిదముదనరఁ
బూర్ణతరమూలజలకుంభములగణించు, నరణితోడుతమాధవస్మరణమమర.

మ. అలమాకందము కుండ్ల దింపఁ దగు, నియ్యం ట్లొక్కచో వేయఁగా
వలె, సంపంగికిఁ ద్రవ్వటం బిడవలె, న్వాసంతికల్ నేఁడు గూఁ
డులు గట్టం దగుఁ, గన్నెగన్నెరులు వాడుం దేఱె నంచు న్వనిం
గలయం గన్గొనువానిఁ జూచి రెలనాఁగల్ విప్రనారాయణున్. 69

క. కనుఁగొని తన్మతంబు కడకంటను జూడక యొక్కచీరికిం
గొనక వచోవిలాసములకుం జెవి దేలఁగిలంగ నీక యా
నన మరవాంచి తోఁటపయి నాటినకోర్కుల నిర్వికారుఁ డై
యునికికి విస్మయం బొదవ నుగ్మలి సోదరివంకఁ జూచుచున్. 70

ఉ. అంగన నీవు వీనిహృదయంగమమోహనరూపరేఖ లె
ల్లం గనుఁగొంటివే కిలకిల న్నగు క్రొన్ననవిల్తు నైన, నీ
యంగము(తేవ)కుం దగినయందముగా దిరఁ దున్నవేష మై
నం గలఁ కం దలంకదు మనం బిటు వచ్చుట కెంతవింతయో! 71

సీ. జటియు నై ననవిల్తుకుటము గ్రాఁచినస్వామి దారువన క్రీడఁ దగిలె ననఁగ
శుచి యైనయవ్వేల్పుచూపు తాపసకులస్త్రీలపై వలపులఁ జిక్కె ననఁగ
వానిశిరోరత్న మైనయాద్విజరాజు గురువధూటికి మరులొక్కనియె ననఁగ
నమరులకును బెద్ద యతనిసారథి వాలఖిల్యాదిమునులఁ గల్గించె ననఁగ

గీ. వీనికథ యెంత యెన్నంగ వీరిలోన, నెవ్వరిని బోలు మహిమల కెంతదవ్వు
విప్రసామాన్యుఁ డూరకే విఱ్ఱవీఁగు, చున్నయంతనె యధికుఁ డౌనొక్కొ తాను.

క. నామములు దీర్చి తులసీ, దామంబులు వైచి బేలతనమునఁ దగు నీ
సాములె కారా మగువల, బాములఁ బడువారు వేషధారులు గులుతే! 73

సీ. అందెలరవలి విన్నంతనే పోయెనే చిరకాలనియతిఁ జేసినతపంబు
మనలను నిటు గనుంగొనినంతమాత్రనే తఱఁగెనే హరిపదధ్యాననియతి
యే మని మాటాడ నెన్నంగఁ దొడఁగనే పోయెనే తనవ్రతంబులు కొలంతఁ
గటకట యిటు గుఱింగట నిల్చినంతనే పొరయునే షట్కర్మములను హాని
గీ. ఘనతపోరాశి నధికులు గలరు గాని, యిట్లు చరియించు నియతుల నెందుఁ జూడ
మిదియ వర్తన మైనచో నిగురుఁబోఁడి!, కౌశికాదుల కూర్ధ్వలోకములు లేవె!
ఉ. పాటలగంధి! సౌఖ్యపరిపాటి యెఱుంగనిమూఢుఁ డౌట నే
పాటియు వీఁడు తాఁ దనకె పైకొనఁ డాయెనుగాక కాక నా
పాటల నాటల న్మధురభాషలఁ జొక్కి లతాంతబాణుచే
వాటులఁ జిక్కి కెంజిగురుఁబానుపుఁ జెందకయుండ శక్యమే. 75
వ. అనుటయుఁ గటకటంబడి యక్కుటిలకుంతల చెలియలిం జూచి యిట్లనియె.
చ. హరిహరి! యెంతమాట! యెటు లాడితివే తరళాయతాక్షి! కా
పురుషులఁ బల్కినట్లఖిలభోగములు న్విడనాడి సత్క్రియా
నిరతిని బ్రహ్మచర్యసరణిం మహనీయతపో మహత్త్వముం
బొరసినయట్టి యిట్టిమునిపుంగవుభావ మెఱుంగ వేమియున్. 77
క. ఏమరుఁడే యితఁ డెక్కడి, పామరుఁడే నిలువు నూరు పండినరీతిం
దామరవిం దన నున్నాఁ, డోమరునపుమొలక! యెట్టియోగివరుండో. 78
సీ. తెలిమించుమడుఁగు రింగులువారఁ గట్టక కాషాయములు దాల్పఁగాఁ బనేమి
నెలవంకతిరుమణి నీటుగాఁ దీర్పక పెనుపట్టెనామముల్ వెట్ట నేమి
గొనబుమీఱఁగఁ గొరకొప్పు దిద్దక నెరుల్ జడ గట్టఁగా నీళ్లఁ దడుప నేమి
గోవాళ్లతోడుతఁ గూడియాడక తోఁట గావింతు నని యిట్లు గడఁగనేమి
గీ. వికచనానాప్రసూనమాలికలు చాలఁ, గలిగి యుండఁగఁ దులసిపూసలసరంబు
వైవనేమి మహాయోగివరుఁడు గాక, మగువ యీయన యితరసామాన్యుఁ డైన.
క. రాగంబు నొడిచి ముక్తి, శ్రీగౌరవముల కపేక్ష చేయుమునులకున్
నాగేంద్రయాన! యైహిక, భోగం బిది మేడికాయబోనము సుమ్మీ. 80

— * వేశ్యలు పంతములు వేసికొనుట. * —

క. వలువనిమాటలు సారెం, బలుకం బనియేమి హావభావవిలాసా
దుల నీ వితనిఁ గరంచిన, నలికైశిక యేను దాసి నయ్యెద నీకున్. 81

మ. అనుపం గెంపుమెఱుంగు కన్నుఁగవచాయల్ జేవుటింపం గనుం
గొని యెక్కించుక జాఱుపయ్యెద చెఱంగుల్ రంగుగాఁ జేర్చి కొ
ప్పును జక్కన్సవరించి యౌవనమదంబు న్సత్కళాప్రౌఢియుం
దనరం దొయ్యలి రెండుమూఁడడుగు లంతల్ డాయఁగా నేగుచున్. 82

చ. పని మఱి లేనికోడిగపుబాఁపని నీ వొకప్రోదిసేసి పే
ర్కొని మును నావిలాసగుణరూఢి నెఱుంగనియట్లు పన్నిదం
బని కడు మించ నాడితివి యాడినమాటకుఁ దారసిల్లినన్
వెనుకకుఁ బోకు మంచుఁ జెలి వెండియు జంకెన లుల్లసిల్లఁగన్. 83

సీ. మాధవస్మరణంబు మాన్పి కొక్కోకాది పఠనంబునకుఁ బాలుపఱుపనేని
కనుసన్నసేసి యాకడవనె నాయింటి కెల్లను నీళ్లు మోయింపనేని
తిరుచూర్ణరేఖ మచ్చరణలాక్షాలక్త దృష్టితో వియ్య మొందింపనేని
మునిపండ్లఁ గొఱికివైచిన నాగవల్లికాదళములకై యాసగొలుపనేని
గీ. కలఁపనేనియు వలపంతెఁ గఱపనేని, కేళికెలయింపనేని చొక్కింపనేని
విటుల కెకిమీని వీనిఁ గావింపనేని, యుగ్మలీ! నీకు దాసి నై యుండుదాన. 84

వ. అని యమ్మంజులాలాప కెంజిగు రంటినచందంబునఁ గేలుఁగెందమ్మి నగ్రజహ
స్తంబునం బన్నిదం బని చఱచి యనుచరనిచయంబుతోడం గూడ నిజనగరం
బున కనిచి ననిచినకుతుకంబునం గపటనటపరిచయంబునం గాని వీనిం జొ
క్కింప రా దని వితర్కించి కుఱంగటం గురవకలతావలయంబునం గిసలయప్ర
సవమంజరీరంజితం బగు నొక్కతరుకోటరక్రోడంబునందు. 85

క. అరవిందయన శోభా, కరము ల్మణికింకిణీనికరము ల్మణినూ
పురముల్ చీనాంబరము, ల్సరము ల్కర ముల్లసిల్ల శౌటిం బెట్టెన్. 86

గీ. చాతురీరీతి వేర్వేఱ సంగ్రహించి, వనిత యొక జీనిపావడ వానిమీఁద
ముసుఁగువడఁజుట్టి పైలకముద్రఁ బెట్టి, యొరులు గనకుండ నలుదిక్కు లరసిచూచి.

శా. నాభాగప్రతిమాన దానజితకర్ణస్వర్ణగోత్తంస ధా
టీఘాటీధావితజాతవేపథువధూటీచిత్తవైకల్యదీ
ప్తాఖీలానునయానులాపకబరీవ్యాపారసౌభాగ్య ధా
త్రీభూభృత్కులవైరి మోహనమురారీ రాజకంఠీరవా! 88

క. తుక్ఖారధట్టఘనజవ, యుక్ఖురజరజఃపలాయితోదితరక్షా
రక్ఖవచోరిపుయాచిత, మక్ఖాకటకాదిరాజ్య మహిగృహమేధీ! 89

పంచచామరము. అహంక్రియాసమగ్రవిగ్రహస్థలీభటానటీ
మహోహళాహళీవిహారమంత్రయంత్రకల్పిత
స్పృహాస్వయంగతానురాగహృజ్జయాంగనాముహు
ర్ముహుర్భుజోపగూహనానుమోదమానమానసా ! 90

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్య ధుర్య ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర లింగనమనీషిపుత్త్ర శ్రీకాళహస్తీశ్వర దయాసహాయ చెదల్వాడ మల్లయనామధేయప్రణీతం బైన విప్రనారాయణచరిత్రం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీబంధురమందిర బిసి, నీబాంధవతేజ త్రిభువనీగండరగూ
లీబిరుద సత్కృపాంబుని, ధీ బుధనుత మాకరాజుతిమ్మనృపాలా!

గీ. అవధరింపుము సయి, భూషణాంబరాదు, లీవిధంబున దాఁచి తా దేవదేవి
తాను వైష్ణవురాలిచందంబుఁ బూని, చాలఁ దగినట్టి సంజోక సవదరించి.

— * దేవదేవి విప్రనారాయణుం జేరుట. * —

సీ. మెఱుఁగులు పైకిఁ గ్రేళ్లుఱికెడు గబ్బిగుబ్బలమీఁదఁ గావికుప్పసము దొడిగి
యడఁచి క్రొమ్ముడి బయల్పడకుండఁగా ఖండశాటి యాదలను మించఁగ బిగించి
బెళుకుఁజూపులఁ గెలంకులు దాఁటఁగా నీక నిజపదనఖరేఖ నెలవు కొలిపి
హరినీలములదొప్పు నడికించు కెందమ్మిజమిలిపూసలకంటసరి యమర్చి

గీ. యల్లనల్లనహరిహరిహరియటంచు,గోలయునుబోలెనొదుఁగుచుఁగొదిగికొనుచు
విష్ణుపదభక్తి మూర్తిభవించె ననఁగఁ, జకితహరిణాక్షి దాసరిసాని యయ్యె. 3

క. ఇటువలెఁ గుహనానటనా, ఘటనాపర్యటననటనకౌశలయై య
న్నటదిందీవరకుంతల, యట చని కర్పూరకదళికాంతరవీథిన్. 4

చ. ననిచినగుజ్జుమావికెలనం దగుగందపుఁ బ్రమానికొమ్మలం
బెనఁగొని యున్నమల్లికల పెక్కువ గన్గొని నీళ్లు గట్టి సం
జనితకుతూహలాంకురము శాఖలువాఱఁగ వచ్చుచున్న య
మ్మునికులసార్వభౌముని ముముక్షువరేణ్యు మహానుభావునిన్. 5

చ. తనమది భక్తి గల్గినవిధం బటు దోఁపఁగ దవ్వుదవ్వులం
గనుఁగొని తత్పదాంబుజనఖప్రభ లొక్కట ఫాలవీథి సోఁ
కను బ్రణమిల్లి యోమునిశిఖామణి! యోకరుణాపయోధి! యో
యినవిభతేజ! కావఁదగదే నను నార్త ననాథ నెంతయున్. 6

చ. అని కడు నాఁపఁగా భరము లై లవలీదళగండమండలిం
గనుఁగవబాష్పముల్ దొరఁగఁగా నవు డేడ్చెఁ జకోరనేత్రపై

ల్చన నిజసోదరీశపథసమ్యగహంకృతివాక్యవంచనా
ఘనకుహనావిహారపరికల్పితగద్గదకంఠవై ఖరిణ్. 7

గీ. అప్పు డాజంత పలుకువాక్యంబు లెల్ల, మనసులోపల నిక్కంబు లనుచు వగచి
యబల! లే లెమ్ము లెమ్మని యాదరించి, యిట్లు వలికెను వాచంయమీశ్వరుండు.

ఉ. ఎయ్యెడనుండి వచ్చితివె యియ్యెడకుర్ ? హరిభక్తురాల ! పే
రెయ్యది ? యార్తిఁబొందఁ గత మెయ్యది ? నీకును మే మొనర్పఁగా
నయ్యెడుకార్య మెయ్యది ? భయంపడ కిం కెఱిఁగింపు నావుడుం
దొయ్యలి చిక్కె దమ్మఁ డని దుర్భరహర్షనిమగ్నచిత్త యై. 9

క. దేవా ! విన్నప మే మని, కావించెద నీదుసమ్ముఖమ్మున యావ
జ్జీవజుగుప్సాజీవన, జీవాతుఘనాఘ హేతుశీలకులంబుల్. 10

వ. అయినను నార్తజనవరేణ్యుండ వగు నీ నిమిత్తంబునఁ గడతేఱఁగలదాన నగుట నాకల తెఱం గెఱింగించెద దత్తావధానుండ వై యవధరింపు మని యి ట్లనియె.

క. నేరముల కునికి యాఁబడి, కారయ విడిమట్టు వట్టియపకీర్తులకుం
జేరుగడ దోసములకు హా, జారము వెతలకిర వాఁడుజన్మము దేవా ! 12

ఉ. అట్టి మహావిహీనభవ మయ్యును నీలువు మాటవాసియుం
జుట్టఱికంబుఁ బుణ్యమును సున్నగ మిన్నలఁ గూడఁబెట్టు -చో
గుట్టు దొఱంగుచుం బహుపుఁగూటికి నోఁచినవారిజాతిసం
బుట్టి క్రమక్రమంబునఁ దపోధన ! యావన మావహిల్లఁగన్. 13

మ. కళలం దక్కఁ బెసంగి గానములఁ జక్కంజేసి లాస్యక్రియా
కలన న్మెచ్చుఘటించి నేర్పునను గాఁకల్ పుట్టఁగావించి మా
యల వంచించి నరేంద్రనందనుల నుడ్డాడించి సప్తాంగముల్
బలుసొమ్ముల్ గొని సంయమీ ! యినుపులుం బంగారుగాఁ జేసినన్. 14

సీ. పెల్చ నల్లింట్లు నిల్పెద నన్న సదలించుఁ జెఱువు గావింప నెంచినను గసరు
వనము వెట్టింప నెంచిన నెంత లే దను గుడికి యత్న ముసేయ గొణఁగసాగు
బుధుల కీ వేఁడినఁ బ్రొద్దు వో దను నీకు నతిథిపూజలకు మల్లాడఁ దిట్టు
దోసాన కలిగిన నోసి ! పో లె మ్మను బేదసాదలఁ బ్రోవ గీదుపోరు

గీ. దేవ! యిటుగాక మఱియును లావుముట్టి, బలియు బికిరంబు జోగు గోపాళ మనుచు
పీథి కివ్వారు నుడిసిన వెక్కిరించు, నయ్య ! ననుఁగన్న కొయ్య గయ్యాళి తల్లి.

క. సామీ! పలుమఱు దేవర, కే మని వినిపింతు నింక నీఁగకు నిసురుం
బామునకు బలియుఁ బెట్టక, యీమునలిగరాసు పిసిడికైమై వర్తించుఁ. 16

సీ. వదనపద్మము పల్లవప్రకరోచ్చిష్టలాలితవీటీకలాచిఁ జేసి
గాత్రంబు జ్యాకిణీకర్కశభుజు లైనమగలకు గరిడికంబములు సేసి
కూర్మి యొక్కెడఁ బాదుకొననీని యాస్జింపు దొరలకు నిర్వంకతుంగ సేసి
మొలకమెఱుంగుఁజన్నులు భుజంగనఖాంకుశములకుఁ గలభకుంభములు సేసి

గీ. గుట్టు నానయు విడనాడి కొంగుపట్టిచి, యగపడి పడిచి పడసిన యట్టి పసిఁడి
కటకటా! యేమిటికి నెక్కె గడనవంక, నేమి గంటిని దోఁచుసు నాకేల యనుచు.

ఉ. ఏను విరక్తురాల నయి యిట్లు భవత్పదసేవ గోరి యో
మానికులావతంస! గరిమంబున వచ్చితి నాదరంబు లో
నూనఁగఁ జూచి నీ దయినయాడిగముఁ దయచేసి ప్రోవు నీ
యానతిపద్ధతిం దగ నహర్నిశముం బరిచర్య సేసెదఁ. 18

సీ. నెఱినొప్పలకుచముల్ నీచేతఁ గాయలు గాచెఁ బొమ్మనిపింపఁగలఁ గడంగి
చిన్నికొమ్మల మించు కన్నెమామిడి చెట్టుఁజేర్చి నీకును మెచ్చుసేయఁగలను
నెలమిఁబల్వరుసల నీమోవిఫల మంద సారిది నీకును జవిసూపఁగలను
బొగడను దగు విధంబులను బెక్కులు గల్గ నలరించి నిను మరుగ్గొలుపఁ గలను

గీ. జతురబహుబంధములఁ బరిచయము కలిమి, రాజయోగవిలాసాభిరామ నగుట
ఘనకళానుభవంబుచేఁ గలుగు నేర్పు, మించ నిన్నును గడకుఁ దేలించఁగలను.

వ. అనిపలుకుటయు జటివరుండు నమ్మోటుమాయలాడిపలుకులు నిక్కువంబులుగా నగచి విష్ణుకైంకర్యంబునకుఁ దనకు సాహచర్యంబు గలిగె ననుచు నంగీకరించి దానిం దగువిధంబునం బనిగొనుచు నేమంబునఁ బుష్పదామంబులు రంగశాయికి సమర్పించుచు మాధుకరచర్యాసంపన్నంబు లగునన్నంబులు భుజియించి యిష్టశిష్టాదనం బయ్యింతికిఁ బ్రసాదించుచుఁ దనయుటజంబున కనతిదూరం బగునొకలతాకుటీరంబున నుండ నియమించె నివ్విధంబున నొక్కసంవత్సరంబు గడపినయనంతరంబ. 20

— * సూర్యాస్తమయాదివర్ణనము. * —

(1) క. గగనమణియును చ...కి, దగదిన మిది నిదెగాదు తరుణీ యనుచుఁ
వగదేఱు దనకయెడగ్గై, దగవని పైఁబెట్టె నన నబ్ధిఁ దపనుఁడు గ్రుంకెఁ.

---

(1) గ్రంథ్యంతరములేమి నున్నట్లే ముద్రింపఁబడినది.

ఉ. నాదగుతారకారుచిధనంబు హరించిన కన్నగాఁడు వీఁ
డే దివసాహ్వయుం డగుకడిందిమలిమ్లుచుఁ డంచుఁ బశ్చిమా
శాదయితుండు చూడఁ గడసారి నవారణఁ జేలము న్వియ
ద్వాది కడంకతో ముడియ నైచె నన న్రవి గ్రుంకె నంతయున్. 22

చ. తిమిరపుదాడిగాఁడు చనుదేఁ డొడంగెను నా కెదుర్పఁగా
సమయము గాదు గూఢతరచర్యను వర్తిలి వేగ వచ్చెదన్
రమణఁ దమోనుదాశ్రయమున న్నిలు మంచును నైజతేజమున్
గమలహితుండు నిల్పె ననఁగాఁ బొడకట్టెను సాంధ్యరాగముల్. 23

క. జలజహితభీతి నెల్లెడ, నిలిపిన నయ్యిరులదొరలనిసువులు తతిమై
వెలువడె ననఁ దొగమొగ్గల, నెలదుమ్మెదదిమ్ము లటుఁ ధురీ(1)యన వెడలెన్.

క. మురహరున కేకచక్రము, సరసిజబంధునకు నేకచక్రము, కవమై
తిరుగుట కా దనుకరణిన్, సరసులఁజక్రంబు లేకచక్రము లయ్యెన్. 25

మ. అహరంతావసరంబునందు నొకకల్హారంబుచక్కి న్మహా
ర్మహరుచిస్ఫారతిఁ దేలి తేఁటిమిథునంబు ల్గూర్కఁ దత్తద్గరు
త్పిహితంబై తగుతేనె వేఱొకటి యచ్ఛిం గ్రోలెఁ దా నయ్యెడన్
సహజక్రీడలు గావె యెల్లప్రజకున్ జౌర్యక్రియాపైఖరుల్. 26

చ. బుగబుగతావులం బొదలుపుప్పొడిచే మకరందధారచే
నొగిఁ దముఁ బ్రోచినంతవడియు న్గనుసర్తిలిఁ జేరి కొల్చి మా
పగుటయుఁ దుమ్మెద ల్జలరుహంబులతోల్లిటిరూపు దప్పినం
దగఁ దొగల న్వసించెను గృతఘ్నుల నెందును నమ్మవచ్చునే ! 27

సీ. దైవతైర్థికులు మందాకినీతోయము ల్గొప్పరించిన గాజుఁగుప్పెలనఁగ
ఘనపదద్యుతి నవగ్రహరత్నములు దాఁప నిర వైనదంతంపుబరణు లనఁగ
నలవిధూదయహేతు వగుతూర్పుఁజూలాలు హవ్వన నుమియుచిట్టుమ్ము లనఁగ
వెలయురాసులఁ బొల్చువినువీథికళ్లానఁ జెన్నొందు పెలగదోసిళ్లనంగ

గీ. రేయిసురతాణి జగమావరింపఁ దలఁచి, పొలుచు నిరులను బలురికీబులను బనిచి
కొలిలనెత్తిననున్నంపుఁగుండ లనఁగఁ, జాలఁ గనుపట్టెఁ దారకాసముదయంబు.

మ. ఘనధారాధరభూమిక ల్గగనసాకాన్మార్తు లామ్రేడితాం
బనశైలంబు లనేకథావిహృతిమత్సర్వాను లీలల్ విక

(1) యతిచింత్యము.

# శాస్త్రపరిభాష.

[సుప్రసిద్ధము లగుపదములుగూడ నాయాచోటుల నావశ్యక మగుటచే నుపయోగింపఁబడినవి.]

| | |
|---|---|
| జ్యోతిశ్శాస్త్రము | ... Astronomy. |
| జ్యౌతిషశాస్త్రము | ... Astrology. |
| గ్రహము | ... The planet. |
| ఉపగ్రహము | ... The satellite |
| అభ్యంతరగ్రహము | ... The inferior planet. |
| బాహ్యగ్రహము | ... The superior planet. |
| సూర్యుఁడు | ... The Sun. |
| చంద్రుఁడు | ... The Moon. |
| బుధుఁడు | ... The Mercury. |
| శుక్రుఁడు | ... The Venus. |
| భూమి | ... The Earth. |
| అంగారకుఁడు | ... The Mars. |
| గ్రహపోతములు | ... The Asteroids. |
| బృహస్పతి | ... The Jupiter. |
| శని | ... The Saturn. |
| వరుణుఁడు | ... The Uranus. |

(శబ్దసామ్యముచే నీపదము సృజింపఁబడినది.)

| | |
|---|---|
| నభస్స్థానుఁడు | ... The Neptune. |

[‘నభః’ అనుపదమును Neptune అనుపదములోఁ బ్రథమభాగమగు ‘*neb*’ అనునదియు నేకధాతుకము లగుటచేతను, ‘తూణపూరణే’ అను ధాత్వర్థ బలముచేతను, ఈగ్రహము నభస్స్థలమున సూర్యకుటుంబమును బూరించుటచే తను దీని కీనామ మీయఁబడెను.]

| | |
|---|---|
| కక్ష్య | ... The orbit. |
| అక్షము | ... The axis. |

| | |
|---|---|
| ఉత్తరధ్రువము | ... The North pole. |
| దక్షిణధ్రువము | ... The South pole. |
| అపమండలము<br>అపక్రమమండలము<br>క్రాంతిమండలము | ... The ecliptic. |
| విషువద్వృత్తము<br>నిరక్షరేఖ | ... The equator. |
| ఆయతవృత్తము<br>ఉచ్చనీచవృత్తము | ... An ellipse. |
| సౌమ్యగతి | ... The direct motion. |
| వక్రగతి | ... The retrograde motion. |
| సంయోగము | ... The conjunction. |
| అభ్యంతరసంయోగము | ... The inferior conjunction. |
| బాహ్యసంయోగము | ... The superior conjunction. |
| ఆభిముఖ్యము | ... The opposition. |
| భగణము | ... The revolution. |
| భ్రమణము | ... The rotation. |
| ఉచ్చము | ... The Aphelion. |
| నీచము | ... The Perihelion. |
| అపజ్యము | ... The Apogee. |
| పరిజ్యము | ... The Perigee. |

[శబ్దసామ్యముచేతను, అర్థసామ్యముచేతను, ఈపదములు సృజింపఁబడినవి; అపజ్య=జ్యాం (భూమిం) అపక్రమ్య ; పరిజ్య=జ్యాంపరితః.]

| | |
|---|---|
| ఆద్యపాతము | ... The ascending node. |
| ద్వితీయపాతము | ... The descending node. |
| గ్రహణము | ... An eclipse. |
| సూర్యగ్రహణము | ... The solar eclipse. |
| చంద్రగ్రహణము | ... The lunar eclipse. |

ఛాయ ... The Umbra.
ఛాయాకల్పము ... The Penumbra.
పూర్ణగ్రహణము ... The total eclipse.
అల్పగ్రహణము ... The partial eclipse.
కంకణగ్రహణము ... The annular eclipse.
ధూమకేతువు ... A comet.
ఉల్క ... A meteor.
ఉల్కావృష్టి ... The meteoric shower.
ఉచ్చలగ్నము ... The signat the zenith.
దూరదర్శిని ... The Telescope.
సూక్ష్మదర్శిని ... The Microscope.
రశ్మివిభాజిని ... The spectroscope.
ప్రతిమాదాయిని ... The Photography.
తారాగుచ్ఛము ... The star cluster.
ద్వంద్వనక్షత్రములు ... The double stars.
నక్షత్రవీథి ... The Milky Way.
నభోలము ... The Nebula.

['నభః' అనునదియు 'Neb' అనునదియు నేకధాతుకములగుటచేతను, ఇది నభస్స్థలమునలీనమై యుండుటచేతను, శబ్దసామ్యముచేతను, దీని కీనామ మీయఁబడెను.]

శంఖరేఖ ... The spiral.
సమానాంతరము ... Parallel.
శక్తి ... The Force.
ఆకర్షణశక్తి ... The gravitation.
ద్రవ్యము ... Matter.
హోరము ... An hour.

కపిస్థలం కృష్ణమాచార్యులు.

# సృష్టిచిత్రము.

ఉ. అబ్బుర మౌను సృష్టిగతి నారయ నారయ దీనిఁ గాంచి త
బ్బిబ్బు వహించుచుందు రఁట పెల్లుగ దేవతలంతవారలున్
నిబ్బర మొప్ప నెంచుటకు నే నన నెంతటివాఁడ నామదిం
బ్రబ్బినతొట్రుపాటు వినఁ బల్కెద మిత్రము లాలకింపుఁడీ. 1

మ. అతిచిత్రం బతివిస్తృతాకృతి యనాద్యంతంబు నౌసృష్టిసం
గతి మున్నెవ్వరుఁ జర్చసేయక విడంగా నేను జర్చింపఁబూ
నితి నం చెంచ న దే మొకో కలుగుచుండెన్ దీనిపై నిచ్ఛ య
ద్భుతశీలం బగుసృష్టి సద్భుతము లే పుట్టుంగదా! క్రొత్తలై. 2

ఉ. ఈనిఖిలంబునున్ జగదతీతుఁ డొకండు రచించియుండ నౌఁ
గానియెడన్ జనించునొకొ కారణహీనము లైనకార్యముల్
వానియుదారశక్తి యనవద్య మమేయ మటంచుఁ జెప్పనౌఁ
బూనిక గల్గి యొక్కపరిఁ బొల్పుగ సృష్టివిచిత్ర మెంచినన్. 3

క. దివివలనం దెమ్మెర వా,యువువలనన్ వహ్ని దాన నుదకము దానన్
భువి జననమొందె నఁట య,య్యవి యైదున్ విత్తనంబు లఁట జగమునకున్. 4

మ. తొలుతం బల్గతి సృష్టి యెట్టులు మదిం దోఁచెన్ జగత్స్రష్టకున్
గలిపెన్ భూతము లైదు నెన్ని తెఱఁగుల్ గాఁ బంచి యూపాళ్లచే
నలువం దొట్టి రచించె నేగతిఁ దృణాంతం బౌజగం బాతఁడే
తెలియుంగాక యెఱుంగ నౌనె మన దొధీశక్తి నూహించినన్. 5

శా. రేతోరక్తము లేకతం బెనసి నారీకుక్షిలో బుద్బుదం
బై తోడ్తోడనె హెచ్చి పిండ మగు సర్వాంగంబు లం దేర్పడున్
జైతన్యం బొనఁగూడు నింద్రియములున్ స్వాంతాదులుం గల్గెడున్
వాతం బొక్కటి ద్రోయఁగా శిశువు గర్భం బంతటన్ వెల్వడున్. 6

చ. జననపుమున్న గోచరము చానయె కల్గునొ పూరుషుండొ త
త్తనురుచి యంగసంస్థితియు దైర్ఘ్యము హ్రాస్వత యెన్నరాదు చ
య్యన నుదయించు నాశిశువునం దొకయుబ్బపుఁబ్రేమ లోకమె
ల్ల నిలిచె వానితో నని తలంతురు చిత్రము తల్లిదండ్రియున్. 7

ఉ. ఇంతకు మించువింత గల దెయ్యది మానవు లెంద ఱెందఱో
యంతము లేదు వారినిఖిలాంగములుఙ వివరించి చూడ నా
వంతయు లేదు భేద మటు లైనను లక్షజనంబులో జనుం
గాంతుము తాఱుమా ఱొకటి గల్గదు చెప్పఁగలేము భేదముఙ. 8

చ. అగు నగు వర్ణమో నడయొ యంగవిశేషమొ చూపొ దైర్ఘ్యమో
సొగసొ మనుష్యునిం దెలియ సూచక మందురు గాని చెప్పఁగాఁ
దగ దది యుండుఁగాక నరుఁ దప్పక పల్కుఁబడిఙ గ్రహింతు మె
ట్లగు నిది యిట్టి దంచు నడియాలముఁ జూప వశంబె యేరికిన్. 9

శా. సౌందర్యం బొకఁ డయ్యెఁ బత్తెఱఁగులఙ జానొప్పఁ దద్భేద మొ
క్కండుం జెప్ప వశంబె వేఱ్పఱిచి యట్లాయాఫలవ్రాత మిం
పొందు న్మాధురి యొక్కఁ డయ్యు రుచిభేదోపేత మై భిన్నతం
జెందుం బొకవిశేష మొంది రసముల్ క్షీరేక్షుఖండాదులన్. 10

క. పరిపరి తెఱఁగులవిరులం, బరిమళముల్ వేఱు వేఱ పరఁగుచునుండుం
బరికించి భేదకంబుఙ, సరసిజభవుఁ డైనఁ జెప్ప శక్తుం డగునే. 11

శా. ఎమ్ముల్ ప్రేవులు రక్తమాంసములు గావే గోమహిష్యాదిదే
హమ్ముల్ చెప్పట కేవపుట్టును దదాహారంబు ఘాసంబు దు
గ్ధమ్ముల్ వెల్వడు నందు జల్లున సుధాధారానుకారంబు లై
క్రమ్ముఙ వానిని గ్రోలువారి కురుసౌఖ్యశ్రీబలారోగ్యముల్. 12

ఉ. క్షీరము కాఁగి తక్రమును జేరి యగుఙ దధి దానిలోపలం
దేరును మండ మద్ది నవనీత మగుఙ మథియింప నద్ది యే
తీరుగఁ గాఁచ నెయ్యి యగుఁ దెల్లముగా నవియెల్ల వేఱువే
త్రై రుచిభేదముం బడసి యన్ని తెఱంగులఁ దృప్తి నిచ్చెడున్. 13

ఉ. కొంచెపువిత్తునఙ మొలచి కొమ్మలు పచ్చనియాకులఙ విజృం
భించిన వృక్షమందు సురభీకృతదిక్తట మాచుఁ జిత్రవ
ర్ణాంచిత మైనక్రొవ్విరి బయల్పడు నవ్విరియందుఁ బూప జ
న్మించి క్రమంబునఙ రసనమృద్ధఫలం బయి మ్రుగ్గి నగ్గెడున్. 14

క. ఇవి యెల్లఁ బొటిఁజెందిన, వవుటం బరికించువారి కబ్బురముగఁ దోఁ
పవు గాక చిత్తమందుం,దవులం దలపోయ నద్భుతం బగుఁ గాదే. 15

ఉ. ఎచ్చట నుండువాఁడొ మును పెచ్చటి కేగునొ యింక నెన్నినా
ళ్లిచ్చట నుండునో యెఱుఁగఁ డెవ్వఁడు నించుకయున్ ధ్రువంబుగాఁ
జచ్చుట దా నెఱింగియును జా వొకనాఁటికి లేనిచాడ్పునం
జెచ్చెర శాశ్వతంపుఁబని సేయును వృద్ధత నెత్తి కెక్కినన్. 16

ఉ. పుట్టిననాఁటఁగోలెఁ దనపుత్త్రులఁ బౌత్త్రులఁ గాంచి యుబ్బుచుం
జిట్టికుమార తండ్రి యని చేరఁగఁదీయుచు ముద్దులాడుచుం
బట్టఁగరానిపాదములఁ బట్టి మఱిం బెఱవారి నోళులం
గొట్టి యధర్మవిత్తములు గూర్చి యిడుం దొడవుల్ సుభోజ్యముల్. 17

ఉ. పోయినవానికై వగలఁ బొక్కుచు నుందురు వాఁడు వీండ్రదా
కూయి యొకింతయున్ వినునొకో ప్రతిరోదనమే నొనర్చునో
పోయెను వచ్చి యీనడిమిపాత్త్రొకనాఁటికి వీండ్రుఁ గూలరే
పాయనిపోలికం బ్రణయపాశములన్ దృఢబద్ధు లౌదురే. 18

గీ. అల్పకారణమున నన్యుని తలఁద్రుంచు, సకట వానిబ్రతుకు వ్యర్థమొక్కొ
ప్రజల నెల్ల సౌఖ్యపఱుచునొ తానుండి, యుట్టిగట్టి తానె యూఁగఁగలఁడొ. 19

ఉ. చక్కనివాఁడ జవ్వనపుసౌరొనఁగూడుచు నుండె నాకుఁ బెం
పెక్కును బల్సిరుల్ వలఁతి నెల్లవిధంబుల నేనటంచు బ
ల్విక్కుచు నుండ మూషకము వేచినపిల్లియుఁ బోలె నంతలో
గ్రక్కున వచ్చి పై నుఱికి కాలుఁడు మ్రింగిన సున్న లిన్నియున్. 20

చ. పరులధనంబుఁ గొంట పరభామలఁ గోరుట కల్లలాడుటల్
పరుసపుఁబల్కులున్ విషముపై విషముల్ చనరా దొకండు నా
సరస కటం చెఱింగియును స్వాదుఫలాదులకంటె స్వాదుతం
బరఁగు నటంచు వానికయి పాటువహింతురు దుష్టమానవుల్. 21

శా. ఇల్లా లెల్లవిధంబులన్ రుచిరమై యిష్టోపభోగంబు సం
ధిల్లం జేయఁగఁ గ్రూరుఁ డొల్లక కడుం దీవ్రప్రయత్నంబుచే
నిల్లు న్నేనును గుల్లగాఁగ వినువా రిస్సీయనన్ గుండియల్
జల్లుంజల్లునఁ గూల వారలలనాసంగంబుఁ గాంక్షించెడున్. 22

చ. సరిపడ దర్థసంఘటన చాలకయుండును వాక్యపూర్తి య
క్షరములు వ్యక్తరీతిఁ బలుకంబడ కుండెడు నట్టులయ్యు బా

లుర తొలిముద్దు పల్కు లతిలోలుపతం గలిగించు వాని మా
ధురి మితిలేని దార విడఁదోపదు పీనులఁ బెక్కు గ్రోలినన్. 23

ఉ. బాలుఁడు బుద్ధి యించుకయుఁ బ్రౌఢిమహింపకమున్న సర్వవా
గ్జాలముఁ దత్తదర్థముల సంగతి వాని సమన్వయంబులన్
మేలుగ నభ్యసించు ననమీాక్ష్యముతో క్రియలన్ గుణంబులం
గాలముఁ దెల్పు వాక్కులను గక్కున నెంచి గ్రహించుఁ జిత్రమౌన్. 24

చ. గడియకుమున్ను పోలికకుఁగానఁగరాక యు నంతలోన నె
క్కడివొకొ కాననంబువలెఁ గార్కొని క్రమ్ముచు మింట మేఘముల్
బడిబడి నుర్మి మెర్మశనిపాతములు న్వడగళ్లు అంతుగా
జడిగొని శుష్కభూతలము సంద్రముఁ జేయును జూచుచుండఁగన్. 25

ఆ. జ్వలన మంటినంత సర్వంబును దహించు, బావకంబు నగ్నిపక్షి మ్రింగు
వహ్ని నణఁచు జఠరవహ్ని దానికిఁ గల్గెఁ, బ్రకృతి కబ్బురంబుఁ బడఁగవలయు.

క. బంభరము నైజబుద్ధివి,జృంభణమునఁ గీటకంబుఁ జేరిచి గూఁటన్
గంభీరధ్వనిచేఁ దన,డింభకముం జేయు నిది కడిందియరు దగున్. 27

క. ఉదయించి జాతితొలిపోఁ, గదలుటకునుదావులేనికప్ప తినుటకె
య్యది యొదవునో యేగతి నది, బ్రదుకునో మరుదంకురమును బాఱని-చోటన్.

ఉ. లక్షలు గల్గువాఁ డలరు లక్షధనంబు లభించెనేనియున్
భిక్షుకుఁ డౌ జనుం డలరు భిక్షయొకింత లభించెనేనియున్
విక్షతి గల్గునాఁడు పరివేదన యిర్వురికిన్ సమానమౌ
మక్షికయున్ గజంబును సమంబు లగున్ సుఖదుఃఖవేళలన్. 29

ఉ. సౌధనివాస మబ్బి జనసంఘము వశ్యగతిం జరింపఁగా
భూధవుఁడై యఖండతరభోగములన్ సుఖియించు భోగియున్
వ్యాధిదరిద్రతాదశయు నక్షివిహీనత మున్నుగా మహా
బాధలఁ గాంచువాఁడును నపారముగా మృతికై భయంపడున్. 30

చ. జననము నొందు జంతువు లసంఖ్యముగా ధరలోఁ బ్రతిత్రుటిం
జను జముప్రోలి కాక్రియనసంఖ్యముగా ధరలోఁ బ్రతిత్రుటిన్
మనుగడ నిత్యమే జనుఁడు మానఁడు సంతస మొక్కరుం డిలన్
జననము నొందు నాఁ డొకఁడు చచ్చిన నాఁడు విడండు శోకమున్. 31

మ. చిరభోగంబులు గాంచి దేహము కడున్ జీర్ణించి శీర్షంబు పె
న్నెరల న్వెల్లఁదనంబుఁ బూనఁ బటుదంతశ్రేణులన్ జాఱఁగా
నరుఁ డర్థార్జనసక్తుఁడై తిరుగు నెన్నం డెన్నఁడున్ జెంపకున్
సరగ న్వచ్చుచు నుండెఁ గాలుఁడు నిమేషచ్ఛద్మచే నం చహో. 32

ఉ. తాను దలంచుకార్యమున దైవబలం బొనఁగూడె నేనియుం
దానె సమస్తమందును స్వతంత్రుఁడ నంచుఁ దలంచు నట్టులా
నేని రచించినట్టిపను లెల్ల ననాహతి సిద్ధిఁ బొంద నా
మానవుఁ డొక్కరుండు నొకమాట వచించుట కైన శక్తుఁడే. 33

క. ధనువును మౌర్వియు నేకతఁ, బొనరుచు సాయకము నడపుపోలికిఁ బురుషుం
డును దైవము సమబలమున, నెనసినఁ గార్యంబు సిద్ధినెనఁగుం బుడమిన్. 34

మ. ఒకకాలంబున భూరిసంపదలచే నొప్పారుచుండున్ జనుం
డొకకాలంబునఁ గూడు గుడ్డయును లేకుండంగ నెవ్వెన్ సహిం
పక మల్లాడుచునుండు నొక్కపుడు ధీమంతుండు నొక్కప్డు ధీ
వికలుం డౌనె తలంప వాఁడొకరుఁడే వీఁ డన్యుఁడౌనే యహో. 35

ఉ. జంతువు లోషధుల్ పుడమి జాతుల నెన్నియొ జాతిజాతికిం
తెంతయొ సంఖ్య యీశ్వరుఁడు నెన్నఁగలేఁ డది యుండ వానిపల్
వింతదనర్చురూపులు ను వింతగుణంబులు వింతచేష్ట లా
వంతయు గోచరింపవుగదా మది నేఁడులు పూఁడు లెంచినన్. 36

ఉ. కావు హరుల్ వరాహములు గా వురగంబులు గావు బెబ్బులుల్
గా వరయంగ హింస్రము లకారణమే యవి హింసఁజేయఁగా
రా వడిదంబు విల్లును శరంబులు గైకొని పోయి వాని వా
తావులు పల్మఱున్ వెదకి తద్వధసేయు నరుల్ శరారువుల్. 37

క. తునుము దయావిరహితుఁడై, మనుజుఁడు తనభోగమునకు మహిఁ గలవెల్లన్
మనుజుని వలనన్ వానికిఁ, గనరా దుపయోగ మించుకయుఁ దలపోయన్. 38

మ. తొలినాఁ డెట్టిపదార్థముల్ గుడిచి తృప్తుం డయ్యెనో యవ్వియే
మలునాఁ డవ్వలినాఁడు నాపయిని సామాన్యస్థితిన్ నూత్నముల్
వలె నర్పించును గ్రొత్తక్రొత్తరుచి సర్వం బిట్లు భోగించుచున్
నలువు న్మానిసి పిష్టపేషణము నాజన్మంబుగా నద్దిరా. 39

శా. సారాపేతము గష్టసాధ్య మణువుల్ సౌదామనీచంచలం
బౌరా యైహికసౌఖ్య మందులకు నై యత్నంబురాత్రింబవల్
ధీరాత్ముండు నొనర్చుచుండు నుపమాతీతం బమేయుం బసం
హారాకారము పారలౌకికసుఖం బాశింపఁ డొక్కింతయున్. 40

మ. అహహా నూటి కొకండు సంసృతిని హేయుం బంచుఁ జింతించి ని
స్పృహుఁడై పుణ్యవశంబుచేత భగవత్సేవాసమాసక్తుఁడై
యిహభోగంబుల వీడనేని యతనిన్ హీహీమతిం బాసె దు
స్సహవాసంబు లొనర్చి వీఁడని నగన్ సాగింత్రు మూఢాత్మకుల్. 41

క. సత్యపుబ్రహ్మ మసత్య మ, సత్యంబగు నీజగంబు సత్యము గాఁగాఁ
బ్రత్యయ మొసఁగెడు మాయకు, నత్యద్భుత మైనరచనయన సందియమే. 42

శా. జ్ఞానాసి న్మనుజుండు సంసరణబంధంబు న్విడంగోసి పూ
ర్ణానందంబున నుండు దేవుకడ నంచుం బ్రేంచుఁగాఁ గొంద ఱా
శ్రీనాథప్రతిమానుఁ డౌచు నతనిన్ సేవించు నం డ్రొక్కరుం
డానే దైవ మటం చెఱుంగు నిదియాఁ దథ్యం బటం డ్రన్యులున్. 43

క. పెక్కురు పెక్కుతెఱంగుల, వక్కాణించెదరు గాక వారికిఁ బ్రణతుల్
నిక్కం బెంచఁగ నెల్లర, కొక్కటియే సత్య మగుచు నుండుం గడకున్. 44

క. స్థాలీపులాకరీతిం, బోలం దెల్పితిని సర్వముం దెల్పుటకుం
జాలునె నాయట్టిఁడు ధీ,శాలి చిరంబునకుఁ దెల్పఁజాలెడు నేమో. 45

కొంటి భద్రాద్రిరామశాస్త్రి.

---

# సంకీర్తన లక్షణము.



తాళ్ల పాక యన్నమాచార్యు లనునామాంతరము గల యన్నమయ్యంగారు, ఆయనకుమారుఁడు పెద తిరుమలయ్యంగారు మనుమఁడు తిరుమలయ్యంగారు నను నీ ముగ్గురు శ్రీవేంకటేశ్వరునిపై ననేక సహస్రములు సంకీర్తనములు రచియించినారు. ఇవి యన్నియు రాగిరేకుల మీఁదఁ జెక్కఁబడి యారేకులన్నియుఁ దిరుమలలో వేంకటేశ్వరుని యాలయములో భద్రపఱుపఁబడియున్నవి. వారిలో మూఁడవవాఁడగు తిరుమలయ్య రచించిన యీసంకీర్తన లక్షణముకూడ నారేకులలోఁ గొన్నిటిమీఁదఁ జెక్కఁబడి యున్నది. మూలమునకు సరియైనప్రతి యిందుఁ బ్రకటించుచున్నారము. తాళ్లపాక కవులను గుఱించియు వారి కవిత్వమును గుఱించియు ముందు పత్రికలో వ్రాసెదము.

ప. ప. సం.

శ్రీమతేరామానుజాయనమః.

క. శ్రీవేంకటేశ్వరప్రియ, పావనచారిత్ర పూర్వపదకవిమణితే
జోవరహారంబునకుఁ బ్ర,భావహకవినాయకత్వ మలవడుచుండన్. 1

క. వరకవితాగుణచతురత, లరుదారఁగ దాళ్లపాకయన్నయ ధరలోఁ
దిరువేంకటాద్రిపతిపైఁ, దొరకొని చెప్పంగఁ బదము తుదిపద మయ్యెన్. 2

వ. మఱియుం దత్సంకీర్తనంబు లెట్టి వనిన—

క. పావనములు హరిభక్తివి, భావనములు సర్వమంత్రపరమరహస్యో
ద్భావనములు గాయకనిక, రావనములు తాళ్లపాకయన్నయపదముల్. 3

క. రంజనములు దుర్గుణగణ, భంజనములు విమలకమలభవజనకగుణా
సంజనములు సుజ్ఞానధ, నాంజనములు తాళ్లపాకయన్నయపదముల్. 4

క. సారంబులు హరికరుణా, సారంబులు విబుధనికరసంపూర్ణసుధా
హారంబులు బహుదేశవి, హారంబులు తాళ్లపాకయన్నయపదముల్. 5

క. వేదంబులు పౌరాణిక, వాదంబులు వరకవిత్వవాణీవీణా
నాదంబులు కృతసుజనా, హ్లాదంబులు తాళ్లపాకయన్నయపదముల్. 6

క. లక్షణములు పదకవితా, రక్షణములు వివిధకుకవిరాజీమదసం
మోక్షణములు వేంకటపతి, వీక్షణములు తాళ్లపాకవిభుసత్కవితల్. 7

క. విన్నంతఁ బాపసంఘము, లన్నియు నడఁపంగఁ బూఁట యగు తాళులపా
కన్నయపదములు వాడిన, యన్నయకోవిదుల వేంకటాధిపుఁ డేలున్. 8

క. సంకీర్ణవివిధపాతవి, శంకటచిత్తులకు నైన సర్వేశ్వరుపై
సంకీర్తనములు వాడిన, శంకాతంకములు వలదు శమనునివలనన్. 9

క. మదిఁ దాళ్లపాకయన్నయ, పదములపై భక్తి గలిగి పాడిన విభవా
స్పదము లగు వివిధసంప, త్పదములు శ్రీవేంకటేశుపదములు దెలియున్. 10

క. సత్తంచరారి తనకును, భక్తుండై నట్టి తాళ్లపాకన్నయ చా
టూక్తిపదబంధకవితా, రక్తుండై యితరవాగ్విరక్తుం డయ్యెన్. 11

మ. శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీథులై వివిధమంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యంబులై
నుతులై తాళులపాకయన్నయవచోనూత్నక్రియల్ చెన్నగున్. 12

క. భరతాదిగ్రంథంబుల, విరచించినలక్షణములు వేంకటభూమీ
ధరవరకీర్తనలక్ష్యము, లురుపదకవితాపితామహుం డేర్పఱచెన్. 13

ఆ. అట్టియన్నయార్యుఁ డానతిచ్చినపద, లక్ష్యలక్షణముల లాగు దెలిసి
పలుకనేర్చెనేని బాలుండుఁ బ్రోడయౌ, తత్ప్రబంధ మమృతధారఁ బోలు. 14

మ. ధరలోఁ దాళులపాకయన్నయ గురూత్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మును సేయఁబూని తగ నుత్పాదించెఁ దల్లక్షణం
బరుదై మించిన సంస్కృతమ్మునఁ గవీంద్రానందసంధాయియై
పరిపూర్ణాఖిలశాస్త్రసమ్మతముగా భావజ్ఞు లౌ నౌ ననన్. 15

ఆ. అలరుఁ దాళ్లపాకయన్నయార్యసుతుండు, తిరుమలార్యుఁ డఖిలదేశికుండు
తత్సుతాగ్రజుండ ధరలోనఁ జినతిమ్మ, యాహ్వయుండఁ దండ్రియనుమతమున.

మ. పరమామ్నాయసమానమై వెలయు మత్పైతామహగ్రంథమున్
వరచాటూక్తిమదీయపుణ్యజనకవ్యాఖ్యాతమున్ వేడ్కఁ ద
చ్చరణాంభోరుహముల్ మదిం దలఁచి సచ్ఛాస్త్రజ్ఞు లింపొందఁ గా
వరుసం జెప్పెదఁ బద్యరూపమునఁ దద్వాక్యానుసారంబుగన్. 17

వ. మహనీయం బగు సంకీర్తననామకపదసంప్రదాయం బెట్టి దనిన—

సీ. రమణీయసంగీతరత్నాకరప్రబంధాధ్యాయమున నుక్తమయ్యెఁ బదము
సముచితసంగీతచంద్రికాదేశైళియందు మిక్కిలి తేటయయ్యెఁ బదము
అతులతత్సంవాద మైనట్టి సంగీతచూడామణికిఁ బల్కుచోటు పదము
ధన్యసంగీతసుధాకరగ్రంథంబునందు మిక్కిలి చెలు వొందుఁ బదము

గీ. తానె యిన్నిటికిని మూల మైనభరత, మందుఁ బంచదశాధ్యాయమందు విమల
వృత్త చూర్ణనిబంధకవివిధనామ, భవ్యలక్షణములకు నాస్పదము పదము. 18

క. అందఱిలోఁ బదమార్గ, చ్ఛందోమాహాత్మ్య కవిత ఛందంబుల గో
విందపదభక్తివిరహిత, మందుని ధర్మక్రియాక్రమంబున నడఁగున్. 19

క. కృతిచెప్పిన యాతఁ డలం, కృతియుఁ జమత్కృతియుఁ గల్గఁ గీర్తించినచోఁ
గృతి యగు నటుగాక యహం, కృతిఁగృతిసేయంగ మిగులఁ గేలిం బడఁడే. 20

గీ. పెటలు నేరక చూఁడినఁ బెనురవంబు, లొదవ లక్ష్యంబు నైనఁ బ్రయోక్తనైన
సాధనము నైనఁ జెఱచు నీసరవిఁ గాదె, సంప్రదాయంబు నెఱుఁగని జడుని కవిత.

క. వరదానంబున నైనను, గురుముఖమున నైనఁ దెలిసికొను కవిపలుకుల్
పరమామృతమా లేదా, దురహంకృతకవితనోరఁదొం డంబ్రుబుధుల్. 22

గీ. సంప్రదాయాగమజ్ఞానసహితుఁ డైన, మనుజుసత్కవితయు వేదమంత్రసమము
అదియుఁ జాలదె శ్రీవేంకటాచలేశు, చరణములు గను మనుపురశ్చరణమేల? 23

క. పద మగు సుప్తిఙంతము, పదమవయవ మవయవియును బదమనఁ బరఁగున్
దుది నీతెఱంగు లన్నియుఁ, బదకవితామార్గసార్వభౌముఁడు దెలిపెన్. 24

వ. అందు, అవయవపదం బెట్టి దంటేని.

క. విదితచతుష్పాదం బగు, నది వృత్తం బదియ ధాతు వవయవసంజ్ఞం
బదియ యని యన్నయార్యుఁడు, పదిలముగా భరతశాస్త్రపద్ధతిఁ బలికెన్. 25

వ. ఈవృత్తంబులకు ధాతుసంజ్ఞ లెట్లయ్యె నంటేని—

ఉ. వాతముఁ బిత్తముం గఫము వర్జితసర్వశరీరధారణా
హేతువు లయ్యెఁ గావున మహిం జెలు వొందెను ధాతుసంజ్ఞ నీ
రీతిని వృత్తముల్ పదశరీరసముద్భవకారణంబు లై
ధాతుసమాఖ్య లందె భరతప్రముఖాఖిలమానిసమ్మతిన్. 26

వ. ఇందులకు భాషానియమం బెట్లనిన—

ఆ. పదము సంస్కృతమునఁ బ్రాకృతమున దేశ, భాష నైనఁ బొసఁగఁ బలుకవలయుఁ
బ్రాసములు ను యతులు పద్యభంగిని చెల్లు, ననిరి భరతదత్తిళాదిమునులు. 27

శా. కర్ణాటద్రవిళాంధ్ర లాటవిలసద్గౌడాదిభాషాస్థితిన్
గర్ణాపూర్ణసుధాసమానరుచులం గల్గించు దేశైళ దా
స్వర్ణం బాభరణత్వ మొందుకరణిన్ సంగీతశాస్త్రంబులన్
వర్ణింపందగు నానుజాతియుతమై వర్తించుఁ బ్రత్యేకమై. 28

వ. అట్టిపదం బెన్నివిధంబులం జెలువొందు ననిన—

క. బంధురవృత్తపదంబు ని, బంధపదము చూర్ణపదము భరతాగమసం
బంధంబునఁ బదవిజ్ఞా, నాంధులకును దాళ్లపాకయన్నయ తెలిపెన్. 29

వ. అందు వృత్తపదం బెట్టిదనిన—

క. అందములై షడ్వింశ, చ్ఛందోగణయుక్తవృత్తజాతుల పదముల్
కుందనమునకును బరిమళ, మందినక్రియ వృత్తపదము లలరుచు నుండున్. 30

ఆ. వృత్తజాతియెల్ల విషమంబు సమమును, నర్ధసమము నాఁగ నతిశయిల్లు
నందులోన విషమ మనునది నాలుగు, పాదములును వేఱె భంగిఁ జెల్లు. 31

క. నాలుగుపాదంబులు నొక, చాలున వర్తించునదియ సమవృత్తం బా
లీలన్ సమపదమును దా, ళాలంకృతసామ్యపాద మై చెన్నొందున్. 32

గీ. విషమపాదంబు లొకరీతి వెలయుచుండ, సమచరణములు వే ఱొక్కచంద మైన
నర్ధసమవృత్త మనఁ జెల్లు నట్టి పదమె, యర్ధసమపద మనియన్నయార్యుఁడనియె.

వ. మఱి నిబంధనామపదం బెట్టి దనిన—

మ. యతులుం బ్రాసములుం బదంబులును మాత్రానీకముల్ తాళసం
గతులుం గల్గి నిబంధనామపద మాఖ్యాతార్థసంయుక్తసం
స్కృతియై తాళ్ళపాకయన్నయ గురూక్తిన్ లోకవిఖ్యాత మై
జితమాధ్వీకసితాసుధారసరుచిస్ఫీతంబు నై చెన్నగున్. 34

వ. అట్టి నిబంధనామపదంబునకుఁ దదంగంబు లైన యతిప్రాసాదులవిధం బెట్టి
దనిన—

క. పాదములు నాలుగింటికి, నాదుల నక్షముల సవర్ణ మగునవి యతు లా
పాదద్వితీయవర్ణము, పాదుగ నొక్కటియ చెల్లఁ బ్రాస మనంగన్. 35

క. మాత్రయొకటిలఘువనఁదగు, మాత్రాద్వయమైనగురుసమాహ్వయమయ్యెన్
మాత్రాత్రయముప్లుతం బగు, మాత్రార్థము ద్రుతము భరతమతమునఁ జెలఁగున్.

గీ. పూని తాళక్రియాలసన్మానమునకుఁ, దాళశబ్దంబు వర్తించు ధరణి నదియు
దేశియును మార్గమును నాఁగఁ దేజరిల్లు, ధన్య భరతాదిబహుసంప్రదాయలీల.

వ. మున్ను చెప్పిన నిబంధనామపదంబునకు నవయవంబు లైన యవాంతరపదంబు
లకు నామంబు లెయ్యవి యనిన—

క. మొద లుద్గ్రాహము రెండవ, యది మేళాపము తృతీయ మగు ద్రుత మటపైఁ
గదిరినయది యంతర మా, తుది నాభోగంబు ముద్రతోఁ జెలువొందున్. 38

వ. ఈయవయవపదంబులకు ననుకూలం బైనపల్లవి యెట్టి దనిన—

క. పదములయర్థముఁ బల్లవి, వదలక యన్నిటికి నేకవాక్యతఁ జేయన్
గుదిగ్రుచ్చినట్లు తగులై, పదముతుదిన్ మఱియు మఱియుఁ బల్లవి యలరున్.

ఆ. పదసమాసమానపాదయుగ్మముతుది, నలరి పల్లవాఖ్య నతిశయిల్లు
నందులోన నర్థమైనశిఖాపద, మనిరి లక్షణజ్ఞులైనమునులు. 40

వ. ఈపల్లవశిఖాపదంబులకుఁ బ్రయోగసంప్రదాయం బెట్టి దనిన—

గీ. పల్లవంబున్నచో శిఖాపదము గల్గ, దదియ కల్గినఁ బల్లవ మందు నుండ
దనుచుఁ జూడామణిగ్రంథమందుఁ జెప్పె, ననుచు సంగీతచంద్రికయతఁడు వలికె.

వ. అందుఁ జతుర్ధాతుకనిబంధపదం బెట్లుండె నంటేని—

గీ. కల్పితోద్గ్రాహమేళాపకధ్రువంబు, వర్జితాంతర మైకను వన్నె గలిగి
యుచితపల్లవికాభోగయుక్తమైన, యది చతుర్ధాతుపద మని యంద్రు బుధులు.

వ. మఱి త్రిధాతుకనిబంధనామపదం బెట్లుండె నని యంటేని—

గీ. పొసఁగనుద్గ్రాహకధ్రువాభోగములను, బల్లవియుఁ గల్గి యంతరం బరిహరించి
పరివివర్జితమేళాపభాసమాన, మైనయది య త్రిధాతుక మనిరి బుధులు. 43.

వ. మఱి ద్విధాతుకనిబంధనామపదం బెట్లంటేని—

క. యుగమును ధ్రువమును బల్లవి, తగఁ జెప్పిన పద మది య ద్విధాతుక మయ్యెన్
దగ నేత్రకీర్తిలతికలు, చిగిరింపఁగ ముద్ర ధ్రువముఁ జెప్పఁగ సమరున్. 44

వ. మఱి యేకధాతుకపదం బెట్లం టేని—

క. తగ నేకధాతుపద మీ, జగమున నే లేదు నాట్యశాలల దేశిన్
మొగవరి యని పాడుదు రది, యుగముం బల్లవియుఁ గూడి యుండుం జవియై.

వ. మఱియునుం బదవిశేషంబు లెట్టి వనిన—

గీ. ఘనత మీఱంగ జయదేవకవివరేణ్యుఁ, డంద మైనట్టిగీతగోవిందమందు
నంచితాష్టపదులు వల్కె నట్లు పదము, పరఁగు నెనిమిదిపదములు పల్లవియును.

క. రహిగల పల్లవిఁ బెనఁగొని, సహజోజ్జ్వలలీల నర్థచాతురి గూడన్
బహువిధములఁ బదమాలిక, మహిలోఁ జెన్నొందు సీసమాలికరీతిన్. 47

క. ధర నెనిమిదిపాదంబులఁ, బరఁగినపద మదియ శరభపాదపదంబా
వరమీమాంసకసముచిత, పరిభాషలయందు నట్ల పరఁగుటవలనన్. 48

ఆ. ముక్తకంబుఁ గుళకమును నాఁగఁ దగిపద్య, జాతి పరఁగు నట్ల జగతి నొకటి
దరు వనంగఁ జెల్లుఁ దగు గుళకం బెల్ల, పదము నాఁగ నతులభంగి నలరు. 49

మ. పరఁగున్ వృత్తము జాతి యంతయుఁ జతుష్పాదద్విపాదాకృతిన్
వరసంకీర్తనముల్ తదాకృతులనే వర్తించు మానంబుతో



దరువుల్ జక్కులరేకు లేలలును సిద్ధంబైన గొబ్బిళ్లు భా
సురవాక్యంబులుఁ జందమామపదముల్ శోభిల్లు నందంబులై. 50

గీ. దరువు వాక్యంబు నర్ధచంద్రకపదంబు, నేలపాటయు గొబ్బిళ్లు నింపులైన
చందమామపదంబును జగతిఁబాద, యుగళమున బహుజనసంప్రయుక్తిఁబరఁగు.

క. హీనాల్పలోహకాంచన, మానసమానతలు వర్ణమహిమ నగుగతిఁ
హీనాధికపదములకు స,మానత లొదవించు వర్ణమహిమ ధరిత్రిన్. 52

వ. అందు నర్ధచంద్రకపదం బెట్లం టేని—

క. యుగమును ధ్రువమును భోగము, సగమె పలికి పల్లవంబు సంధించినఁ జె
న్నగు నర్ధచంద్రపద మన, నగణితతానప్రతానకాంచిత మగుచున్. 53

వ. మఱియుఁ జూర్ణాఖ్యపదం బెట్టి దం టేని—

క. ధరఁ గృష్ణాచార్యాదిక, పరికల్పిత పదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం, బరఁగు ననిరి యుక్తనామభాసిత మగుచున్. 54

వ. మఱియుం దచ్చూర్ణవిధం బెట్టి దనిన—

క. ఛందోగణముల నియతిం, బొందక తాళప్రమాణమునఁ గడుఁజెలువై
క్రొందళుకే దచ్చూర్ణం, బందముగాఁ దాళగంధి యనఁ బొగ డొందున్. 55

క. పదముల శృంగారవధూ, మృదుమధురమనోజ్ఞవాక్యమిశ్రము లైనన్
విదితార్థగ్రామ్యోక్తులు, పదిలముగాఁ బొంక మెఱఁగి పలుకం జెల్లున్. 56

వ. అది యె ట్లంటేని—

క. పురుషోక్తి సంస్కృతంబును, దరుణీవాక్యమునఁ బ్రాకృతము నీచవధూ
పరిభాష నితరభాషలు, పరఁగిన క్రియ నుచితభాష పదములఁ జెల్లున్. 57

క. పల్లవనారీమ్లేచ్ఛా, ద్యుల్లాసమనోజ్ఞబంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యము లైనను, హల్లీసకముఖ్యనాటకాదికఫణితిన్. 58

క. జగతిఁ గలచెల్లుబళ్ళై, నగి నగి భాషించునట్టి నానుడి పలుకుల్
తగ దన రహిఁ చెనుఁ బువ్వుల, సొగ సుసుగం బిసికి కంపు చూపినభంగిన్. 59

క. వైరాగ్యవృద్ధికరగం,భీరపదశ్రేణి పొసఁగఁ బెనుపుచు సగ్రా
మ్యారమ్యవిష్ణుచరితో, దారములై యున్నఁ జాలు ధరణి న్నలయున్. 60

క. దేహాత్మేశవిదో, త్సాహంబును లోకవేదధర్మాధర్మా
ద్యూహాదోహంబులఁ గల, యూహాతి సంకీర్తనంబు లధ్యాత్మంబుల్. 61

గీ. మహితతానాంచితవిలంబమానమునను, దాలవిరహితమై పదార్థంబు చెంది
కేవలద్విచతుష్పదాకృతిఁ జెలంగు, నదియ ధరవాక్యమనియన్నయార్యుఁడనియె.

గీ. మహిమమీఱంగ ద్రుతమధ్యమానములును, జిత్రవర్ణంబు తాళంబుఁ జెన్నుమీఱ
మునుపఁ బాడినపదవాక్యములఁ బొసంగి, ధరణిద్విచతుష్పదాకృతిదరువు చెలఁగు.

వ. మఱియుఁ జందమామపదం బెట్టు లనిన—

ఉ. దు స్తరవిప్రలంభమున దూతికతోడ మొఱంగి చంద్రవి
న్య స్తభరస్వభావమున నాయకుఁ డేనియుఁ గాంత యేనియున్
వి స్తరపాదివాదముల వేఁకఁ జందురుఁ బేరుకొన్నచోఁ
బ్రస్తుతి కెక్కెఁ దత్పదము భాసురమై ద్విచతుష్పదాకృతిన్. 64

వ. మఱి యేలపదవిధం బె ట్లనిన—

గీ. నాయకాహ్వానపూర్వమై నయము గలిగి, మ్లేచ్ఛపరిభాషఁ దగి రాగమిళితమైన
యేలపాట పదంబునా నిలఁ జెలంగు, మహితనాయకసంబుద్ధిమధ్య మగుచు.

గీ. యక్షగానపదంబులు నవ్విధమున, సముచితానేకవిధతాళసంగతులను
నవరసాలంక్రియాసవర్ణంబు లగుచు, నలరు నని హరికీర్తనాచార్యుఁ డనియె. 66

వ. మఱియుం బదసంధు లెట్టి వనిన—

క. భావితలౌకికవైదిక, పావనగతినంధ్రభాషఁ బల్కెడుసంధుల్
త్రైవిక్రమాదిభాషా, భావజ్ఞులు వల్కునట్టి పద్ధతిఁ జెల్లున్. 67

క. నానావిధదేశంబుల, నానాకవి బుద్ధివర్ణనారచనలచే
మానితతానకరాగము,తో నలరున్ దేశిపదము దొరలకు మెచ్చై. 68

క. భావరసాలంకృతి శ,య్యావిధములఁ దప్పులేక యందము లగుచున్
దైవికమానుషరచనా, పావనబంధంబు లైనపదములు వెలయున్. 69

క. బూరుగుకాయం గొఱికిన, నీరసతూలంబు దిశలు నిండినగతి ని
స్సారపదబంధకవితా, పారీణులపదము హాస్యపద మై యుండున్. 70

వ. మఱి యన్యగీత చౌర్యం బెట్టి దనిన—

ఆ. కూటసాక్షి సాక్షిఁ గోరినఁ బలుకుట, యన్యవిత్తములకు నాశపడుట
ఖలుల నితరగీతచౌర్యంబు సేయుట, భరతమౌని యొక్కపాటి యనియె. 71

(ఈ గ్రంథ మింతవఱకే యున్నది.)

## (17) కార్తికమాహాత్మ్యము.

ఇది యాఱాశ్వాసముల పద్యప్రబంధము. దీని రచించినయతఁడు కుందుర్తి వేంకటాచలకవి. ఇతఁ డొనరించిన దొకటి మిత్రవిందాపరిణయము మాత్రమే కవులచరిత్రలోఁ బేర్కొనఁబడినది.

కవివిషయము—ఇతఁడు గ్రంథావతారికలోఁ దన్నుఁ గూర్చి యిట్లు వ్రాసికొనియుండెను.

సీ. ఏరాజధానికి నిరుచకి గోపాల వేంకటాచలపతుల్ వెలయుచుండు
ఏపురిమధ్య సందీపితుం డగుచు నందీశ్వరుండు వసించుఁ గృపను మనుప
నేపట్టణం బయోధ్యాపురంబునకు జోడై పరాభేద్యమై యలరుచుండు
నేపుటభేదనం బాఘ్రాణరుచిరాష్ట్రలక్ష్మీనివాసమై లలిఁ జెలంగు

గీ. నట్టితీర్థపురీపాలనాతివేల, ధర్మపథవర్తి చంద్రికాధవళకీర్తి
తార్క్ష్యవాతాత్మజధ్వజాద్యఖిలబిరుద, విజితచక్రాయుధాగ్నవిభవుఁ డతఁడు.

......పాండ్యగజకేసరి బిరుదాంకుండు....రాయవేశ్యాభుజంగుఁడు....పంటకులకలశపాథోనిధానరాకాతమిోన బలగోలులింగనృపపుంగవ కులపాలికాపీఠ్యంబికా నిర్భరగర్భశుక్తిముక్తాయమానుండు నగు......వేంకటాచలమహీమహేంద్రుండు......నన్నుఁ బిలిపించి యిట్లనుచుఁ బలికె.

సీ. ఘనుఁడు మీముత్తాత కవ్వహోబలమంత్రి గజపతిసభనుతుల్ గాంచి మించె
మీతాతగోవిందమేదినీసురుఁడు రాయలచేతఁ గాంచె స్వర్ణాభిషేక
మనఘుఁడు మీతండ్రి యును బాండ్యచొక్కనాథావనీశ్వరున కత్యాప్తుఁడయ్యె
నీపూర్వవంశజుల్ నెలకొని రాయసంస్థానంబున నెక్కి నవధరించి

గీ. రనుచు లోకప్రసిద్ధులై తనరిరి గద, నీవువారలవలెనే యనేకకావ్య
నాటకసమగ్రరచనలమేటి వైతి,...........................................

సీ. ఆంధ్రభాషనె ప్రోఢ యనుమాత్రమే కాదు సంస్కృతంబున నీవుసరసమతివి
లక్షణగ్రంథసారము తెలియుగుదు వైనలక్ష్యముల్ నీకు లాలాజలములు
తతచతుర్విధకవిత్వప్రౌఢి నీసొమ్ము నవరసప్రతులు నీనవ్యకృతులు
నీదీవనలు నవమున్న్రిద్రసంపద లిచ్చుఁ బూజ లందితివి భూభుజులచేతఁ

గీ. జాటుకృతులునుబహువిధనాటకములు, బంధురతరార్థపూర్ణప్రబంధములును
రచనగావించి దేవతార్పణముచేసి, పాండ్యవిభుచేఁ బ్రభుత్వసంపదలు గనితి.

గీ. అనఘకార్తికమాహాత్మ్యమాంధ్రభాషఁ, గబ్బ మొనరించి మదభీష్టకలన చెలఁగ
బంధురకృపాలహరికి గోపాలహరికి, నంకిత మొనర్పు మిదియ మాయభిమతంబు.

మఱియు నితఁడు రచించిన—

(18) మిత్రవిందాపరిణయము.

అను ప్రబంధము నవతారికలో నిట్లు వ్రాసికొనెను.

గీ... అతఁడు సామాన్యుఁడే షట్సహస్రకులస, తిత్సు కుందు కీర్తిధవళాంతరీషదీప్తఁ
డాగమాంచలవద్యావిహారకారి, విశ్వపరితోషకారి గోవిందశౌరి.

చ. పటుతరగోస్తనీమధురపాకసమంచితమున్ రసోన్మిష
ద్ఘటమగు భారతీపరిణయం బనుకావ్య మొసంగి వీరవేం
కటపతిరాయలం దనిపి కాంచె మణీకనకాభిషేకము
త్కటగతి నమ్మహామతి సుఖస్థితిశోభియశోఽభిరాముఁడై.

సీ. చదివినా వేమేమి చదువ యోగ్యంబులో యవి యెల్ల నిస్సంశయంబు గాఁగ
వచనకావ్యములు గా రచియించినావు భారతభాగవతములు రామకథయు
ఘటియించినావు ద్రాక్షాపాకముగ బహునాటకంబులు సమున్నతి సెలంగఁ
జాటించినావు దిక్కోటరంబుల బుధకోటి మెచ్చ నపారచాటుకృతులు

గీ. అర్థగుంఫసముజ్జృంభితాశుమధుర, చిత్రవిస్తరకవితాప్రసిద్ధి నీకు
సహజమే కద పాండ్యభూజానిసభఁగ, ధాశుకవి యనఁ గీర్తిఁ జెన్నలరినావు.

చ. కవిజనకల్పకం బఖిలకావ్యరసజ్ఞుఁ డఖండపాండ్యభూ
ధవుఁడు మహానుభావుఁ డతిధార్మికుఁ డర్యగవజ్రధారియై
నవిజయరంగచొక్కనరనాథుఁడు నీకవితాసమగ్రతై
భవముల మెచ్చి నీ కొసఁగె భర్మమణీశిబికాదిసంపదల్.

క. అటుగానఁ దలఁప నీకే, మిట నింత కొఱంత లేదు మేల్మేలు భవ
త్పటుకావ్యహారమునకును, ఘటియింపుము నాయకమణి గా రంగపతిన్.

పైపద్యములం బట్టి యిక్కవి తీర్థపురపాలకుఁడు బలగోలు లింగారెడ్డికుమారుఁడు నగు వేంకటాచలనృపునియానతిచేఁ గార్తికమాహాత్మ్యము గోపాలస్వామి కంకితముగా నొనర్చె నని తెలియుచున్నది. ఈతఁడు శ్రీపాండ్యమండలాధీశ్వరుని సామంతరాజులలో నొకఁడు.

ఈతీర్థపురము తిరుచనాపల్లి కుత్తరముగా 27 మైళ్లదూరములో నున్నది. ఇది యిపుడు 'తుఱైయూరు' అని వాడఁబడుచున్నది. మఱియు నీతనిము

త్రాత యహోబలకవి శ్రీకృష్ణరాయలమామయగు గనిగిరిరాజు నగు వీరరుద్ర గజపతికాలములోనివాఁ డనియు నీతనితాత గోవిందార్యుఁడు విజయనగర సంస్థానరా జగువీరవేంకటపతిరాయల యాదరమున భారతీపరిణయకావ్యము రచించినవాఁ డనియు నీతనితండ్రి రామయమనీషి విజయరంగ చొక్కభూపాలుని యాస్థానమునఁ గవిగా నుండె ననియు నితఁడును శ్రీపాండ్యమండలాధీశ్వరునిచే సత్కరింపఁబడినవాఁ డనియు భారత భాగవత రామాయణ వచన కావ్యములను బెక్కునాటకములను రచించినవాఁ డనియుఁ దెలియుచున్నది. కావున దీనింబట్టి యితఁడు క్రీ. 1731 వఱకు రాజ్యముచేసిన విజయరంగచొక్కనాథునకుఁ బిదపనే యీకార్తికమాహాత్మ్య మిత్రవిందాపరిణయములు రచియించినట్లూహింపఁదగి యుండుటచే నితఁడు 18 వ శతాబ్దము మధ్యభాగము వఱకును జీవించి యుండె నని విశ్వసింపవచ్చును.

ఇతఁడు మధురాపురవాసి - ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. శాండిల్యగోత్రుఁడు. ఇతఁడు రచించిన గ్రంథసంతతిలోఁ బైరెండు గ్రంథములు దక్కఁ దక్కిన వేవియు నింతవఱకును గానరావు.

గ్రంథములవిషయము—పరిషత్తునకుఁ జేరియున్న కార్తికమాహాత్మ్యము సంపూర్ణముగా మంచిస్థితిలోనే యున్నది. ఇందు మిక్కిలి నీతిదాయకములు భక్తిప్రదములు నగు నుపాఖ్యానములు వర్ణింపఁబడినవి. ఇచ్చటకు సంభవించిన మిత్రవిందాపరిణయమున మూఁడాశ్వాసములు మాత్రమే కలవు. అవియైనను నడుమనడుమఁ గొన్నిపద్యములు లేకయున్నవి. ఇది వ్రాఁతకాగితములప్రతి. ఇందు శ్రీకృష్ణునకును మిత్రవిందకును జరగినవివాహము శృంగారప్రధానముగా వర్ణింపఁబడినది.

కవిత్వవిషయము—ఈతనికవిత్వము తాను వర్ణించికొనినంత ప్రౌఢమును నిర్దుష్టమును ధారాళమును గాదు గాని దక్షిణదేశమందలి యాంధ్రకవిత్వములోఁ గొంత మెఱుఁగు చూపకపోదు. శైలి తెలుపుటకు రెంటినుండియు రెండుపద్యము లుదాహరించెదను.

ఉ. ఎందుకుఁ గోప మోసరసిజేక్షణ యెక్కడ డాఁగినా వయో
యిందుముఖీవతంసమ యొకించుక ముందర వచ్చి నిల్వవే
బృందసుధారసం బొసఁగవే పికవాణి చలించుచున్న నా
డెందము చల్లసేయవె కడిందితనంబులు మాని- మానినీ.—కార్తి

చ. చిందిన తేనెసోనల్ చివురిగిచిలిక లాచిగురాకు లెంతయున్
గందినపూవుగుత్తులు వకావకలౌ ఫలమంజరుల్ పెనల్
చెందిన నేలతీవెలు చలించినపుల్గులు వ్రేలు కొమ్మలై
డిందియుఁ బొల్చె నవ్వని కడిందిమిటారులకేళివైఖరిన్—మిత్ర.

(19) గాథేయోపాఖ్యానము.

ఇది యైదాశ్వాసముల పద్యప్రబంధము. దీనికవి రేవూరి అనంతార్యుఁడు. కవులచరిత్ర మీకవికాలమును దెల్పకపోవుటయే కాక యీతని యింటిపేరు తాళవవారని మార్చి యీగ్రంథమే కాశ్వాసశృంగారప్రబంధమని చెప్పుచున్నది. ఇందులకుఁ గారణమేమో యూహ్యము. ఈకావ్యము కృతినందిన బదిర కృష్ణభూపాలుఁడు తన్నుఁగూర్చి చెప్పినట్లుగాఁ గవి గ్రంథావతారికలో నిట్లు వ్రాసికొనెను.

సీ. ఘనమౌనికులమాన్య కౌండిన్యగోత్రపవిత్రుఁ డాపస్తంబసూత్రమహిత
గతిహరి రేవూరికాళహస్తికవీంద్రు పౌత్రులింగకవీంద్రుపుత్రుఁ గాళ
హస్తిమహాకవియనుజన్ము నేకామ్రకవిశిఖామణి గుర్వకవితిలకశి
వానందసుకవుల కగ్రజన్ముని ఘటికాశతగ్రంథసంఘటకు లేఖ
గీ. నీశితకరేణ్యకవితాప్రకాశకునిది, నప్రబంధనిబంధను నను ననంతుఁ
దనరుచిరబోధయుతమనోవనరుహమునఁ, దనరు నెనరునఁ గనుఁగొనియని యెనిట్లు

దీనింబట్టి “యీకవి యింటిపేరు రేవూరివారు. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కాళహస్తికవికిఁ బౌత్రుఁడు. లింగకవికిఁ బుత్రుఁడు. కాళహస్తిమహాకవికిఁ దమ్ముఁడు, ఏకామ్రకవి గుర్వకవి శివానందకవులకు నన్న, ఘటికాశతగ్రంథకర్త, దినైకప్రబంధకర్త” యని తెలియుచున్నది. మఱియు నీతనిపౌత్రుఁ డగు ననంతయజ్వ తనశ్రీముష్ణమాహాత్మ్యమున నీతని నిట్లు వర్ణించెను.

సీ. ఐదేండ్లనాఁడె వేదాదివిద్యలు నేర్చి విభులమెప్పించె గర్వితుల నణఁచి
యట్టిప్రాయమునాఁడె యష్టభాషలఁ జతుర్విధ కృతుల్ ధర వినిర్మించి నిలిపె
ఘటికాశతకదినైకప్రబంధముల మైసూరిచెంజిండ్ల మెచ్చులు ఘటించె
నూలుఘంటములకై నోరారఁగ ఘనాఘనంబనఁ గవిత మిన్నందఁ బలికె
గీ. నేకసంథావధృత ధృతానేకవిబుధ, దుర్గ్రహగ్రంథసాహస్రసమూర్ణతుష్ట
మండలాధీశదత్తసమ్మానఖ్యాల, కవిజనంతేంద్రు డైన త్రిలోకగురుఁడు.

పితామహునియందలి గౌరవముచే నతఁడిందుఁ గొంత యతిశయోక్తి చెప్పె నని యూహించినను నీతని వైదుష్యకవిత్వసామర్థ్యము గొప్పది యని మాత్రము తలంపవచ్చును.

కృతిపతివిషయము—ఈకావ్యముఁ గృతినందిన యాతఁడు బదిర కృష్ణ భూపాలుఁడు. శూద్రజాతియందలి 'కంపళ' మనునది యాతని కుల మైన ట్లీ క్రిందిపద్యము చెప్పుచున్నది.

గీ. చిత్రచారిత్ర మైనలక్ష్మీకళత్రు, చరణశతపత్రమునఁ దుర్యజాతి కుశల
ధుర్యరీతి జనించె నందు నుతిగాంచెఁ, గంపళం బనుకులము సత్కర్మఫలము.

ఈతనితల్లి కామాంబిక, తండ్రి చిన్నభూపాలుఁడు. అవతారికలో నున్న "నర లోకగండ బిరుదసముజ్జ్వలుండు.... వంకినారాయణాంకుండు... చేరచోరపాండ్య బల్లాళరాయమనోభయంకరుండు; ప్రతాపాతిశయాపాదిత తాపాహతద్వీపాంతర భూపాలకుండు.. యాదవరాయ రాజ్యస్థాపనాచార్యుండు...గంగువాడ పాదినెట్టు మన్నియరగండాంకుండు" అను విశేషణములఁబట్టి యు నీతనిపూర్వుల వర్ణనలఁబట్టియు నితనివంశమువారు నితఁడును సుప్రసిద్ధముగా దక్షిణదేశమందు రాజ్యముచేసిన వా రని తెలియుచున్నది. కాని యాయాదవరాజ్యమిపు డేపేర నున్నదో తెలియరాకున్నది. ఈతని వంశమువారు పెక్కండ్రు శత్రురాజులను జయించిన ట్లిం దున్నది. వారిలో నొకర్రిపేరు నిందుఁ జేర్కొనఁబడలేదు. మఱియు నితనిపూర్వులలో నొకఁ డగుతిరుమలరాజు దక్షిణాయోధ్యయనుపేర నొకపట్టణంబు గట్టించి యందుఁ బట్టాభిరామునిఁ బ్రతిష్ఠించిన ట్లిందే వర్ణింపఁబడినది. కాని యాదక్షిణాయోధ్య కిప్పటిపే రేమో తెలియదు. కావునఁ గృతిపతినిబట్టి కవికాల మూహింప నవకాశము గలుగకున్నది గాని యాతనిమనుమఁడు చెప్పిన పూర్వపద్యములోని 'మండలాధీశ దత్తసన్మాన' యను విశేషణమందలి 'మండలాధీశుఁడు' పాండ్యమండలాధీశ్వరుఁ డగు విజయరంగచొక్కభూపాలుఁడే యని యూహించుట సరి యయ్యెనేని యాతఁడు 18 వ శతాబ్దము పూర్వభాగములోనివాఁ డని యనుకొనవచ్చును. విజయరంగచొక్కనాథునకుఁ బాండ్యమండలాధీశ, మండలాధీశాది విశేషణము లుపయోగించుట దాక్షిణాత్యకవులు కాచార మై యున్నది. మఱియు నీ యభిప్రాయంబున కీ కవియే రచించిన వృద్ధాచలమాహాత్మ్యమునవతారిక కూడఁ గొంత సాయపడుచున్నది. చూడుఁడు,

## (20) వృద్ధాచలమాహాత్మ్యము.

ఇది కవులచరిత్రలోఁ జేర్పఁబడలేదు. ఇది లింగాజిరెడ్డి కంకిత మీయఁబడినది. ఈతనియింటిపేరు పంటవారు. వీరు శూద్రులు. ఈతనితండ్రి మెట్టారెడ్డి. ఈతనిరాజధాని వెంగనూరు. ఇతనిభార్య మెట్టాంబికకు వృద్ధాచలేశ్వరుఁడు ప్రత్యక్షమై తనకు వెంగనూరిలో నాలయము కట్టింపు మని కోరిన ట్లామె వలన విని యాతని యాలయము కట్టించిన ట్లిందు వర్ణింపఁబడినది.

ఈవెంగనూరు వెంగుళమునకు సమీపమున 'పెరంబలూరు' తాలూకాలో నున్నదని తెలియుచున్నది. ఈవెంగుళము తిరుచనాపల్లి మండలములోనిది. కవి, యీకృతినాయకుని "బల్లహోల్ శాసనుఁడు, జగదగోవాళ, రాయవేశ్యాభుజంగుఁడు, పాండ్యగజకేసరి, విశుద్ధపంటవంశపావనుఁడు" మొదలు గాఁగల విశేషణములతో వర్ణించియుండుటచే నితఁడు గూఁడఁ బాండ్యభూపాలుని సామంతులలోనివాఁ డేమో యనియుఁ దోఁచుచున్నది.

గ్రంథములవిషయము.—గాధేయోపాఖ్యానము నైదాశ్వాసముల ప్రతియు సంపూర్ణముగా నిం దున్నది. ఇందు విశ్వామిత్రుఁడు రాజ్యముచేయుట వసిష్ఠుని యావు నడుగుట, మొదలుగా ఘోరతపస్సు చేసి యాతనిచే బ్రహ్మర్షి యనిపించుకొనుట యనునంతవఱకును గలకథాభాగ మతిప్రౌఢముగా సరసశైలిని వర్ణింపఁబడినది. వృద్ధాచలమాహాత్మ్యము క్షేత్రమహాత్మ్యమును దెల్పు నైదాశ్వాసముల పద్యప్రబంధము. ఇదియు సర్వవిధములఁ బైకావ్యమునే పోలియున్నది. శైలి దెలుపుటకు రెండుకావ్యములనుండిఁ రెండుమూఁడు పద్యము లుదాహరించెదను.

శా. ఏకాలంబున దీనిఁ గట్ట విడ నీ కెవ్వార లున్నారమో
మాకీలారమునందు దీని నిడినన్ మాకింపు సంధిల్లదో
నీకున్ వేఁడినవేళ నిచ్చి మగుడం దెప్పించుకోమో వృథా
మాకుం గోపము రేఁచి తింకఁ దరమే మమ్ము న్నివారింపఁగన్.

ఉ. ఏ మనవచ్చు నీమహిమ యీమహిమాద్యగిలాతలాధిప
గ్రామణి కిట్టిగోమణి యొకండును గల్గద మేల్గదా ఘనుం
డీముని దీనినిం బడసె నిమ్మొయి నిమ్మొయి నింతకంటె మే
లే మొదవున్ మహాత్మునకు నేమొదవున్ మఱి దీనిఁ బోలునే!—గాధే.

శా. ఆరూపంబుఁ గనుంగొన న్వెలిచి నేత్రాంభోజముల్ మూసి యా
శౌరిన్ బ్రహ్మముఖామరుల్ ప్రణతులై స్వామీ కటాక్షింపవే
యారూపంబుఁ గనుంగొనంగఁ గలమే యేమెల్ల మాదృగ్విధ
జ్ఞారాధ్యం బగురూపుఁ జూపఁగదవే యర్ధేందుచూడామణీ.—వృద్ధా.

(21) శ్రీముష్ణమాహాత్మ్యము.

ఇది మైదాశ్వాసముల పద్యప్రబంధము. దీనిరచించినయతఁడు, కేపూరి అనంతయజ్వ. ఇతఁ డాపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. వైదిక బ్రాహ్మణుఁడు. బాలకవిబిరుదాంకితుఁడు. బాలకవి బిరుదాంకితుఁడు మహాపండితుఁడు నగు ననంతాఖ్యనకుఁ బౌత్రుఁడు. కాళహస్తికవికిఁ బుత్రుఁడు. ఇతఁ డీ గ్రంథమును వెంగుళము కృష్ణమహీంద్రునియానతిచేఁ దెలిఁగించి యాతనికే యంకిత మొనర్చెను. ఈవిషయ మంతయు గ్రంథావతారికలోని యీక్రింది పద్యమువలనఁ దేటపడఁ గలదు.

మ. అనఘున్ ధీనిధి బాలకవ్యుదితపూర్వానంతపౌత్రున్ జగ
జ్జనగేయోదయ కాళహస్తికవిభాస్వత్సూనుఁ గౌండిన్యపా
వనగోత్రాంకు ననంతనాము నను నాపస్తంబసూత్రున్ బ్రియం
బున రావించి సుధారసౌఘముల సొంపుల్ గుల్కఁ బల్కెన్ దయన్.

సీ. ఏవీట నిరవొందు నేత్రాఖ్యధారాపురీశ్వరనాముఁడై విశ్వవిభుఁడు
ఏపురంబున నుండుఁ గాపురంబుగ గౌరి సౌందరనాయికాసముచితాఖ్య
నేత్రోలుపాలించు నెలమిఁ బెట్టనికోట యగుచుఁ గూత్తాండారు జగమెఱుంగ
నేనగరంబున నింపు నింపు ననంతవిద్వత్కవిస్తోమవిశదఘణితి

గీ. నట్టి వెంగుళ మాత్మీయ మైనరాజ, ధానిగా మీఱు నాచంద్రతారకముగ
భరితజగనొబ్బగండాదిబిరుదశాలి, వరదరాజేంద్రు కృష్ణభూపాలమౌళి.

క. శ్రీముష్ణమహత్త్వం బభి, రామం బది తెనుఁగుసేసి రహిఁ గృతిజగత్
క్షేమంకర కృతి మచ్ఛుభ, నామాంకితముగ నొనర్చి నై వుణిఁ గనుమా.

ఈ వెంగుళము పాండ్యదేశములోనిది. ఈ కృతినాయకునితండ్రి వరదరాజరెడ్డి. వీరిది పంటకులము. ఈతనివంశమువారు పాండ్యమండలాధీశ్వరుఁ డగు విజయరంగచొక్కభూపాలుని సామంతులలోనివా రని తెలియుచున్నది. మఱియుఁ గవి తన పితామహునివైదుష్యమును వర్ణించుచు “దుర్గ్రహగ్రంథసాహస్రరూ

ర్ణతుష్ట, మండలాధీశదత్త సన్మానబాల, కవియనంతేంద్రు నెవ త్రిలోకమునఁ గలరె" అని యిందే తెలిపియున్నాఁడు. దీనింబట్టి మున్ను వ్రాసినట్లుగా నిందలి మండలాధీశుఁడు విజయరంగచొక్కనాథుఁడే యని యూహించినచో నిక్కవి 18 వ శతాబ్దము కడపటిభాగములోనివాఁడని తెలుచున్నది.

గ్రంథకవిత్వవిషయములు—పరిషత్తునకు దీని దొక్కప్రతి సంభవించి, నది. అది మిక్కిలి చక్కనివ్రాతలో సంపూర్ణముగా నున్నది. ఆంధ్రదేశములో దీనినామ మింతవఱకు వ్యాపించలేదు గాని యాంధ్రభాషలో వన్నెకెక్కిన ప్రబంధములలో మాత్ర మిది చేరఁదగియున్నది. కవిత్వశైలి యెంతయుఁ బ్రౌఢమై మనోహరముగా నున్నది. స్వయంవ్యక్తంబులై ప్రసిద్ధిఁ గాంచిన వేంకటాచల శ్రీరంగ శ్రీకాళహస్తి కుంభకోణ బ్రహ్మపురాది క్షేత్రంబులలో నొకటి యగు శ్రీముష్ణం బనుపుణ్యక్షేత్రముయొక్క మహత్త్వ మిందు వర్ణింపఁబడినది. మఱియు నిమ్మహాకవి రచియించినదే—

(22) శివరహస్యఖండము.

అనునాంధ్రపురాణ మొకటి యీపరిషత్తునఁ గలదు. ఇందుఁ దొమ్మిదవయాశ్వాసమునఁ దుదిపత్రములు గొన్ని లేవు గాని యిది తొమ్మిదియాశ్వాసములగ్రంథ మని తోఁచుచున్నది. మిగిలియున్నభాగము మంచిస్థితిలోనే యున్నది. ఇది కోడూరి వేంకటాచలకవి రచియించిన శివరహస్యఖండముకంటె వేఱయి యాతనికిఁ బిదప రచియింపఁబడినది. శ్రీముష్ణమాహాత్మ్యమువలెనే కవులచరిత్రను, ఆంధ్రదేశమునుగూడ నెఱుంగదు. ఇక్కవి స్కాందపురాణాంతర్గతమగు నీభాగమును దెలిఁగించి తీర్థపుర (తుఱైయూరు) నందీశ్వరున కంకిత మొనర్చెను. దీనింబట్టి యితఁడు తిరుచనాపల్లికి సమీపమున నున్న "తుఱైయూరు" అను గ్రామమున నున్నవాఁ డని యూహింపఁదగి యున్నది.

ఇందు, సంభవము ఆసురము వీరమాహేంద్రము యుద్ధము నని నాలుగు కాండములు గలవు. సంభవకాండమున నాలుగాశ్వాసములు, ఆసురవీరమాహేశ్వరకాండముల నొక్కొక్కయాశ్వాసమును యుద్ధకాండమున మూఁడాశ్వాసములును గనఁబడుచున్నవి. ఈరెండును క్షేత్రశివమహత్త్వములు దెల్పునవియే యైనను వీనియందుఁ బెక్కులు చక్కని యుపాఖ్యానములును బ్రబంధోచితవర్ణనములును బ్రౌఢముగా వర్ణింపఁబడినవి. శైలి దెలుపుటకు రెండుమూఁడుపద్యము లుదాహరించెదను.

శా. నా నానారదమూని కిట్టులని యెర్గ నానానవారాజు నా
నానానారతభోగయోగములఁ గానం బూన మూఢాత్ముఁడన్
గానన్ లౌకికవైదికోచితగతుల్ గానన్ ననున్ నీవ దే
వా! నీవానిఁగ నెంచి మంచిగతి యెట్లా నట్లు శిక్షింపవే.

సీ. అతివేలరతిశీల గతియేల నసఁజాల ఖలకాండములదండ నిలువకుండ
వరమానహార మైనసురయానకయమాన నలతాపసులతాపకలనఁ బాప
ధనదానమున దీనజనమానసముఁ బూన బలు కల్ల పలు కల్లపలుక నొల్ల
వెరవారఁ బరదార హరణారభటిఁ జేరఁగులవృత్తముల నుత్తములను హత్త

గీ. మందమానస మజ్ఞానబృందమాన, మానదీమాన దీర్ఘైధమానమదము
శరమయో లేఁడు నీపాటిపరమయోగి, కావునను గావు నను ముక్తిగలుగఁ జేసి.

శ్రీ ముష్ణమా—

ఉ. అమ్మకచెల్ల! యంచ లివి యడ్డము నిల్చెఁ జనంగ నీక యీ
నెమ్మియుఁ బింఛమున్ నిబిడనిర్వృతి విప్పుచు నోలమాసయై
సొమ్మసిలంగఁ జేసె నిది సొంపునఁ బెంచిన నాక విన్మతన్
గ్రమ్మఱఁగాఁ దొడంగె నని కొమ్మ యొకర్తు చనన్ విభుం గనన్.

ఉ. బొమ్మలపెండ్లి సేయు చొకబోటి గిరీంద్రసుతాకళత్రుఁ డా
యిమ్ములరాజవీథిఁ జను టేర్పడఁ గాంచి వినిద్రరోమయై
సొమ్ములు పెట్టుచొప్పు సఖిఁ జూచి విపర్యసనంబు గల్గఁ బో
పొమ్మని పంచి తాను మది పొందక వచ్చె గవాక్షరేఖకున్.

శివరహస్యఖండము.

## (23) సేతుమాహాత్మ్యము.

ఇది నాలుగాశ్వాసముల పద్యప్రబంధము. దీని రచించినయతఁడు భాస్కర వేంకటాచల కవి. ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు వసిష్ఠగోత్రుఁడు, ఆశ్వలాయనసూత్రుఁడు. ఈతని పితామహుఁడు వెంగనార్యుఁడు. ఇతఁడు నందవరమునకుఁ బ్రభువై యొప్పినట్లుగాఁ గవి యవతారికలో వర్ణించెను. దీనింబట్టియే యితఁడు నందవరీకుఁ డని యూహింపఁబడినది. ఇకవి తండ్రి సూరయామాత్యుఁడు. తల్లి వెంగాంబ. సోదరుఁడు శేషాచలకవి. ఇతఁడు నాంచారుపరిణయ మనుయక్షగాన కావ్యమును రచియించిన ట్లవతారిక తెల్పుచున్నది. గ్రంథావతారికాదులంబట్టి పైని దెల్పినవిషయము మాత్రమే

తెలియుచున్నది గాని కవికాలమును గూర్చి యేమియుఁ దెలియుట లేదు. కవుల చరిత్ర మీకావ్యమును బ్రశంసించియుండలేదు.

గ్రంథవిషయము :—ఇందు శ్రీరామకథయు సేతువృత్తాంతము రామేశ్వర క్షేత్రమహత్త్వమును సమగ్రముగా వర్ణింపఁబడినవి. ఈ గ్రంథముయొక్క సమగ్ర మైనప్రతి యిందుఁగలదు.

కవిత్వము—ఇది యంతప్రౌఢ మైనదియు నిర్దుష్టమైనదియుఁ గాదు గాని సులభశైలి నొప్పుచున్నది. ఇం దచ్చటచ్చటఁ గొన్ని వృత్తములు వ్రాయఁబడినవి గాని మొత్తముమీఁద గీతకందపద్యములే యమితముగా నున్నవి. శైలి దెలియుట కిందుండి రెండుపద్యము లుదాహరించెదను.

చ. అన విని గౌతముం డతిపరాక్రమధుర్యులఁ బాండవేయులన్
మనము వధింపఁగాఁ గలమె మానితశౌర్యధురీణు శ్రీకురా
జన కతిఁగించి వానిమన సొప్పినయట్టుల చేత మన్న నా
ఘనభుజుఁ డైనద్రౌణి విన కప్పుడ తా వెడలెన్ ధ్రువంబుగన్.

గీ. (తివిరి) సన్నుతిసేసి తత్తీరమున సమగ్రరామషడక్షరమంత్రజపము
చేయుచుండినఁ దన్మంత్రసిద్ధిమహిమ, నిశ్చలం బగుభక్తిచే నెగడె జగతి.

(24) చారుచంద్రోదయము.

ఈపేరఁ గొంచెము శిథిలమై యున్న యొకగ్రంథ మిందున్నది. ఇది యైదాశ్వాసముల పద్యప్రబంధము. దీనికవి, చెన్నమరాజు చెన్నమరాజు. ఈతఁడు 16 వ శతాబ్దము తుదనున్నవాఁ డని కవులచరిత్రము దెల్పుచున్నది. గావున నితనిఁగూర్చి యిందు విస్తరింపలేదు. ఈ గ్రంథము తాడిపర్తిలోని గోపాలస్వామి కంకిత మొనర్పఁబడినది. ఇందు శ్రీకృష్ణుని కుమారుఁ డైన చారుచంద్రుఁ డనువాఁడు రాక్షసుల గర్వమణఁచుట యను కథ వర్ణింపఁబడినది. శైలి దెలుపుట కొకపద్య ముదాహరించెదను.

చ. హరిహాయుఁ డప్పు డాన్నపకులాగ్రణి ఘోరతపఃప్రభావ మ
చ్చరలముఖంబునం దెలిసి సాధ్వస మొంది వియచ్చరాళితో
నరిగి సుధాబ్ధి వాసి యగునంబుజనాభునిఁ గాంచి సన్నుతుల్
వరమతి నాచరించి తనవచ్చినకార్యము విన్నవించినన్.

## (25) షణ్ముఖసహస్రము.

ఇది యొకయపూర్వమైన తెలుఁగుపద్యకావ్యము దీని రచియించిన కవివర్యుఁడు సీనయ్య, కృత్యాది పద్యములలోని వగు—

మ. సరసశ్రీనిధి తిర్మలార్యసుతుఁడన్ సాహిత్యవిద్యాఘన
స్థిరమోదావహ చాతురీలలిత సంధిగ్రామధారాధురం
ధరుఁడన్ సీనయనామధేయుఁడ జగత్యాకల్పమై ధీశుభా
కరమౌ నీతిసహస్రపద్యకృతి నీ కర్పింతు నో షణ్ముఖా.

శా. నానాదేశికచిత్తభూషణములై నాళీకజాతాంగనా
పీనోత్తుంగపయోధరాగ్ర పదవీప్రేంఖన్నిమ్నలదూష్యమ్షలై
నానానీతివిచిత్రవాక్యరుచులై నాణెంబు దీపింపఁగా
నే నీపేర రచింతుఁ బద్యములు వేయిన్నెన్మి దోషణ్ముఖా.

అనుపద్యములంబట్టి యితఁడు తిరుమలార్యునిసుతుఁ డనియు సందిగ్రామనివాసి యనియుఁ జక్కనిసాహిత్యము గలవాఁ డని యు, వేయునెనిమిది పద్యములు శ్రీపార్వతీపరమేశ్వరులపుత్రుఁ డగుకుమారస్వామి కంకితము గా రచించినవాఁ డనియుఁ దెలియుచున్నది. సంది=సెంది+గ్రామము, ఇదియిపుడు తిరుసెందూ రనుపేరఁ దిరునల్వేలిమండలములో నున్నది. ఇంతకంటె నీతనిం గూర్చి తెలుపఁదగిన గద్యపద్యము లేవియు నిందు లేవు.

గ్రంథవిషయము—పరిషత్తునకు సంభవించిన ప్రతి పరిశుద్ధముగా సంపూర్ణముగా నున్నది. ఇందు నూటేసిపద్యములు లొక్కొక్క భాగముగా విభజింపఁబడినవి. ఇది లక్ష్మీసహస్రాదులవలెఁ గేవలము కృతినాయక వర్ణనాపరము గాదు. ఇందు వివిధము లయినలోకనీతులు పురాణగాథలు శాస్త్రచర్చలు గూడ వివరింపఁబడినవి. మఱియు నిందులోకమున వ్యవహరింపఁబడుచుండెడి పెక్కుసంస్కృతశ్లోకములు సరిగా నాంధ్రీకరింపఁబడియున్నవి. కవిత్వమంత నిర్దుష్టమును బ్రౌఢమును గాకపోయినను గొంచెమించుమించుగా నిది నూటేండ్ల నాఁటిది యగుటచేతను నీతికావ్య మగుటచేతను నాంధ్రలోకము నాదరము నొందఁగల దని నమ్మెదను. శైలి తెలుపుట కింకొకపద్య ముదాహరించెదను.

మ. కరవాలాగ్రమున న్మెలంగుట భుజంగస్ఫీతరంగత్ఫణో
దరసచ్ఛాయ వసించుభాతి గజమేదళ్చర్వణోన్మత్తకే

నరికంఠం బవలంబనంబుగొనునోజ్జ రాజసేవామహా
త్త్వరమల్ సేవకకోటి కల్పసుఖముల్ ధాత్రీస్థలిన్ మణ్ముఖా.

(26) కృష్ణవిలాసము.

ఇది షడాశ్వాసముల శృంగారప్రబంధము. దీనికవి, విశ్వేశ్వరవిభుధాగ్రణి. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. అకలంకయజ్వకుఁ బౌత్రుఁడు, గీర్వాణసాహితీశాలి పద్మనాభాధ్వరికిఁ బుత్రుఁడు, కవితార్కికశిరోమణి బిరుదాంచితుఁడు. మఱియు, నవతారికలోనున్న.—

సీ. కర్కశం బగునట్టి తర్కశాస్త్రంబున మిగుల శిరోమణి మించినట్లు
రాణఁ దనర్చుపురాణంబులం దెల్ల భాగవతంబు చొప్పడినపగిది
భవ్యసంస్కృతనవ్యకావ్యంబులం దెల్ల గడు నైషధం బొప్పు గాంచినట్లు
బాగైనయాంధ్రప్రబంధంబులం దెల్ల నాముక్తమాల్యద యలరుకరణి

గీ. నేను రచియించినట్టిసంస్కృతకృతులును,
దెలుఁగుకృతులును గూఢార్థకలన గలుగ
సంస్కృతాంధ్రాది లక్ష్యలక్షణములందుఁ,
దెలియఁ జాలనివారికిఁ దెలియ వశమె?

అనుపద్యమునుబట్టి యితఁడు సంస్కృతాంధ్రకావ్యములు పెక్కు రచియించినట్లు తెలియుచున్నది గాని యీగ్రంథమొక్కటియే కాక యాతనియింకొకకావ్యము పరిషత్తునకుఁ జేరి యుండ లేదు. దీనివలెనే యవియు నామమాత్రముచే నైన నే చరిత్రకు నెక్కియుండ లేదు.

కృతిపతివిషయము:—ఈకవి యీగ్రంథమును, తలమల, రామచంద్రప్రభుని ప్రేరణచే రచియించి యాతనికే కృతియిచ్చి నట్లవతారిక చెప్పుచున్నది.

గీ...అలరుహరిపాదజలజంబునందుఁబొడమి, జగతి నుతికెక్కు నాలవజాతియొకటి
యందుఁగంపళిమనువంశమతిశయిల్లు, నచటనరమంచికులమువిఖ్యాతిగాంచు.

అనుదానివలనఁ గృతినాయకుఁడు శూద్రుఁ డైనట్లును, కంపళమనెడి యొకతెగ యందలి యరమంచి యనెడి కూటమునఁ బుట్టినవాఁ డయినట్లును దెలియుచున్నది గాని యీతనివృద్ధప్రపితామహునితాత యగు పాపరాజు తలమలలో వెంకటేశ్వరునిఁ బ్రతిష్ఠించుటచే వీరికిఁ బిదప, 'తలమల' యను నువనామము గలిగి నట్లిందలి యవతారికయే తాకొనుచున్నది. ఆపాపరాజే 'గో

నూరు' అనెడి పురము గెలిచిన ట్లందే యుండుటచే వీరిది గోనూరు నివాస గ్రామ మనియుఁ దెలియును.

ఈవ్యాసములోని 19 సంఖ్యగలగాధేయోపాఖ్యానమును గృతినందిన బదిర, కృష్ణభూపాలునికి వలెనే యితనికి నీ తనివంశమువారికిని ౘంకినారాయణాంకుఁడు, గంగువాఁడ హదినెట్టు, మన్నియరగండఁడు, పాండ్యచేర చోళ బల్లాలరాయమనోభయంకరుఁడు, యాదవ రాజ్యస్థాపనాచార్యుఁడు, మొదలగు విశేషణము లుండుటంబట్టి యితఁడు దక్షిణదేశమందలి రాజనియు గోనూ రనుపుర మీతనిరాజధాని యనియుఁ దెలియుచున్నది. కాని యాపుర మెక్కడిదో యితఁ డేకాలమందలివాఁడో సరిగాఁ దెలియదు కాని 18 వ, శతాబ్దమునకుఁ బూర్వుఁడు మాత్రము కాఁడని చెప్పవచ్చును. ఇతనికి, ఇమ్మడి రామచంద్ర రాజని మఱియొకనామము గలదు. ఇంతకంటెఁ గృతిపతి కృతికర్తల కాలనివాసాదులను గూర్చి విశేషించి తెలియ రాకున్నది.

గ్రంథవిషయము:—పరిషత్తునకు వచ్చినప్రతి సంపూర్ణముగా మంచి స్థితియందున్నది. శ్రీమద్భాగవతము నందలి కృష్ణకథ ననుసరించి యాగ్రంథమున రుక్మిణీ సత్యభామాది కాంతలను శ్రీకృష్ణుఁడు పెండ్లియాడుట, వారియందు సంతానము వడయుట యనునంశములు శృంగారప్రధానముగా వర్ణింపఁబడినవి.

కవిత్వము:—ఈతని కవితాశైలి తరుఁజ్ఞానంబునఁ గఠినము కాక సాధ్యమయినంతవఱకు నిర్దుష్టముగా నాంధ్రపద బహుళముగాఁ దఱచుగా యమకప్రధానముగా మృదువుగా నలరుచున్నది.

చ. తలఁపున నన్ను నిల్పు నెలతా! నెలతాపము హెచ్చి వచ్చెనే
యలరుల తేనె చిలుక నవలా! నవలాలితసూక్తి వల్కవే
వలపులు సందడింపఁ జెలువా! చెలు వానఁగఁ గాఁగిలింపవే
తలిరులతావి గుల్క వనితా! వనితావుల నన్నుఁ గూడవే.

చ. సుదతిరదాళి పేర నునుఁజుక్కలఁ బల్కుల పేర నాసుధల్
జదురుగ నవ్వుపేర నవచంద్రికల్ నిటలంబు పేర డా
లొప్పఁదలఁగ నుంఘుమండలములో నగ మత్తులపేరఁ గల్వల్
గుదుపుగ నుంచె మోమునకు గోము సుధాకరుఁ డప్పు దీయఁగన్,

## (27) గీతరఘునందనము.

అను యక్షగానకావ్యము—దీని కవియే తనవృత్తాంతమును గ్రంథాంతమున నిట్లు వ్రాసికొని యుండెను.

" అనుచు వాల్మీకి మహామునీశ్వరుఁడు...రచియించినట్టి శ్రీరామాయణమును.
జూచిపఠింపుచుఁ దా సులభార్థములను, తోఁచినంత గ్రహించితోలుత నే నవల
నాపాలి శ్రీదక్షిణామూర్తి పదము, పాపహరంబుగా భక్తి భావించి......
శ్రీరామసాహాయ్యసిద్ధిచే నేను, ధారగా నీప్రబంధము సెప్పినాఁడ......
గొనబు ముమ్మడిదేవకులము వారలము, సలలితవేంకటాచల దక్షిణమునఁ
జెలఁగుచిత్తూరు మాచిరనివాసంబు. నాతండ్రి తిరుమలనామధేయుండు
శ్రౌతి సీతారామ చరణసేవకుఁడు, నాతల్లి లక్ష్మమ్మ నారీలలామ
సీతాభిరామునిఁ జింతించు నెపుడు, మాయమ్మ తాను నిర్మలమానసమునఁ
బాయనిహరిభక్తి పట్టుగాఁ బట్టి......నానాఁటికిని జగన్నాథునికృపను......
సత్యస్వరూపంబు సాధింపుచుండు, నాతండ్రి దేహబంధము వీడి చనఁగ
నాతల్లి హరిచరణమ్ములే నమ్మి, యానాఁడు బహుకష్ట మనుభవింపుచును
దా నన్నుఁ బెంచి విద్యలను జెప్పించి, దినదినంబును బ్రేమ దీవింపుచుండ
ఘన మైన మాతల్లికరుణచే స్వామి, తాను బ్రసన్నుఁడై తవచరిత్రమును
నానోటఁ బలికించె నారాయణుండు, జనులార మీరెల్ల జయరామవిభుని...
రమణీయ మగుగీతరఘునందనమును. బ్రమదంబుతో వినిబ్రహ్మముం గనుఁడి.
అని యిట్లు దక్షిణాస్యప్రసాదమున, ఘనసాహితీకళాకౌశలం బలర
వరపరాశరగోత్ర వార్ధిచంద్రుండు, హరిహరాద్వైత సిద్ధాంతప్రియుండు
చారుమానసరామ చంద్రయతీంద్ర, కారుణ్యఫలమంత్ర గణనాపరుండు
తిరుమలకవి, హరిస్థిరమానసుండు, రచియించెఁ గృతి గీతరఘునందనంబు.

వీనింబట్టి దీనిరచించిన యతఁడు ముమ్మడిదేవుల తిరుమలకవి యని తెలియుచున్నది. మఱియు నితఁడు స్మార్తుఁడు వైదికుఁడు పరాశరగోత్రుఁడు తిరుమల శ్రౌతికిని లక్ష్మాంబకును జన్మించినవాఁడు, చిత్తూరుగ్రామ నివాసుఁడు దక్షిణామూర్త్యుపాసకుఁడు రామచంద్రయతీంద్రుని శిష్యుఁడు సాహితీకలావంతుఁడు

ననియుఁ దల్లిప్రోత్సాహమున శ్రీరాముని కటాక్షముచే నీగ్రంథము రచియిం చినవాఁ డనియుఁ దెలియుచున్నది. మఱియు నిచ్చటకు సంభవించిన యీ గ్రంథము మొట్టమొదటను గట్టకడను గూడ వ్రాయఁబడియున్న—

"గురువారేఽక్షయబాహుళబహుళాష్టమ్యాం ససచ్చిదానందః।
గీతరఘునందనం నిజపితృతిర్మలరచిత మలిఖదిదం"॥

అను శ్లోకమునుబట్టి మాసమేమో సరిగాఁ దెలియుటలేదు గాని, యక్షయ సంవత్సర......మాసబహుళాష్టమీ గురువారమునఁ దనతండ్రియగు తిరుమల కవి రచియించిన యీ గీతరఘునందనమును సచ్చిదానందుఁడు వ్రాసె నని యుండుటచేతను, ఈ సచ్చిదానందుఁడు వ్రాసినయిందలి ప్రతిలోఁ గొన్నిపత్ర ములు చెదలుఁగొట్టివేసినను బత్రములు మాత్రము మాసిపోయిన ట్లుండకపోవుట చేతను గడచిన యక్షయసంవత్సరమునందే యీగ్రంథము వ్రాయఁబడియుండు నని తోఁచుచున్నది. కావున నెట్లయినను గవి యిప్పటి కఱువది డెబ్బదిసంవ త్సరముల నాఁటివాఁ డని నిర్ణయింపఁదగి యున్నది.

గ్రంథవిషయము:—ఇందు శ్రీవాల్మీకిరామాయణకథ యంతయుఁ బద్య ములు పదములు దరువులు ద్విపదలు మొదలుగాఁగల వివిధచ్ఛందములచేఁ బఠనానుకూలముగ సులభశైలిని వర్ణింపఁబడినది. శ్రీతాళపత్రములపైఁ జిన్న యక్షరములతోఁ నాలుకాండముల కథయుఁ దెలుపుచున్న యీగ్రంథము కొం చె మెచ్చుతక్కువగా వాల్మీకిరామాయణ మంతయు నున్నది. కవిత్వమును సరసముగా నున్నది. శైలికై యిఁక రెండుపదము లుదాహరించెదను.

జనకునివచనము విని ముని రాముని ధనువును గొనుమనెను
మనుకులతనయుఁడు విలుగని మ్రొక్కెను మందహాసమునను
వరమునిభావము గని హరకార్ముక మరసి యెత్తి పట్టెన్
గురుకరలీలను వింటికొపునను గుణము నెక్కుపెట్టెన్
ఘనుఁడు గుణాకర్షణము నేయ హరధనువు భగ్నమయ్యెన్
దనుజులహృదయము లదరెను జనకునిమన సిటు కుదరయ్యెన్

(28) చంద్రాననాదండకము.

దీనిని వెనుకటిసంచికలో నుదాహరించిన మల్లపురాణాదికర్త యగు నుద్దండకవి నుదురుపాటి వెంకనార్యునకుఁ బౌత్రుండును బిల్హణీయాదికృతికర్త

యగు సాంబశివకవికి నన్నకుమారుఁడును మాతృభ్రాత పండితునిపుత్త్రుఁడు నగు విద్వత్కవి సాంబన్న రచియించి యందే వివరించిన కోటివంశరాజుల వంశవృత్తములోఁ గడపటివాఁ డగు రామచంద్రనృపాలున కంకిత మొనర్చెను. దీని కిం రెండుప్రతు లున్నవి. ఒకటి తాటాకులప్రతి, రెండవది కాగితములప్రతి. తాటాకులప్రతిలోఁ జివర 'సాంబనాభిఖ్య విద్వత్కవీంద్రుం' డనియుఁ గాగితముల ప్రతిచివర 'శ్రీమచ్చిదాకార విద్వత్కవీంద్రుం' డనియు నుండుటచే నీతనికిఁ జిదాకారుఁ డని నామాంతర మున్నట్లు తోఁచుచున్నది.

. కవి దండకాదియందు వ్రాసిన 'రాజాబహాదర్ మహీనాథపాత్త్రుండు...శ్రీమద్రఘుస్వామి ధాత్రీంద్రపుత్త్రుండు......హయాణాధిరాజన్య సంస్తూయమానోల్ల సద్యెక్క లెన్నీ సమాఖ్యాభిరాముండు. శ్రీమద్బృహన్నాయికా పాదసేవా ప్తకాముండు శ్రీరామచంద్రక్షితీంద్రుండు' అను దానింబట్టియు దండకాంతమందలి 'సత్కలాభోజుఁడై నూత్నసాలాభిధావత్పురీ రాజ్య సంరక్షణోద్యుక్తుఁడై" యను దానింబట్టియు వెనుక సాంబశివ కవి జీవితమందుఁ దెలిపినట్లుగా నీ కృతినాయకుని తండ్రి యగు రాయరఘునాధునికివలెనే యీతనికిని 'ఎక్కలెన్ని' యనుబిరుదమున్నట్లును దండ్రితాతలవలెనే యీతఁడును బుదుకోటకురాజై యుండినట్లును ధ్రువపడుచున్నది. వెనుకటికాలముతో సరిచూడఁగా నీ కవియుఁ గృతిపతియుఁ గూడ 19 శతాబ్దము మొదటి భాగములోనివా రయినట్లు విశదమగుచున్నది.

గ్రంథవిషయము:—ఇందుఁ గృతినాయకునిఁ జంద్రాననయను వారకాంత గోరుట యనువిషయము వర్ణింపఁబడినది. కవిత్వము శుద్ధమైనదిగాదు. ఇతఁడు రచియించిన యితరగ్రంథములేవియు దొరకనందున నీతని పాండిత్యముంగూర్చి చెప్ప వలను పడకున్నది. శైలికై యిందలివి రెండుమాటలు.

ఈమేటి సాళువ్వార్లేమిచేఁ గోటిభూపాలవర్యుం డితండంచు లోకుల్ నుతింపంగఁ గోటీశ్వరాభిఖ్యనుం జెందు భూనాథవర్యుం డితండే సుమీ రామచంద్రక్షమా పాలకంఠీరవుం డీతఁడే నే యనన్ జేఁపడాల్ తీవసింగాణి పూవుల్ లకోరీపాదల్ పూని లోనంజలంబూని.

# ఆంధ్ర భాషాసంస్కరణ విమర్శనము.

శ్రీ గురుభ్యో నమః.

ప్రమాదిసంవత్సరపుటాశ్వయుజమాసమునఁ బ్రకటింపఁబడినయాంధ్ర సాహిత్య పరిషత్పత్రికయందు మహామహోపాధ్యాయ బిరుదాంచితు లగు బ్రహ్మశ్రీ తాతా సుబ్బరాయశాస్త్రులుగా రాంధ్రభాషాసంస్కరణ మనుశీర్షికతో నొక విపులోపన్యాసమును బ్రకటించిరి. అది మిగుల గంభీరముగ నున్నది. నాబోంటి వానికి సుబోధము గాదు. కాని యది తెలుఁగుభాష నుద్దేశించి వ్రాయంబడినది గావునను నేను చిరకాలమునుండి యాంధ్రోపాధ్యాయుఁడను గావునను సవిమర్శ ముగా దానిపై నాయభిప్రాయముం బ్రకటింపవలె నని యాభాషయందలియభిమానమునఁ గుతూహలి నైతిని. దానికిం దోడు నామిత్రులుం గొందఱు ప్రేరించిరి. కాఁబట్టి నాబుద్ధికిం దగున ట్లందలియంశము లుదాహరించి వ్రాయం దలంచితిని. నాయజ్ఞానమున నేని ప్రమాదమున నేని యిందు దోషము లున్నను విద్వాంసులు మన్నింతు రని వినయముతోఁ బ్రార్థించెదను.

ప్రకృతమందు రాజభాషాభివృద్ధిం జూడ నూతనసంస్కారములచే వృద్ధి నొందింపక యెల్లపూర్వనిబంధనలచే నిర్బంధించిన దేశభాష యభివృద్ధి నొందఁ జాల దని కొందఱును, మునుపటివారి నిబంధనల నతిక్రమించిన నపభ్రంశ (నపశబ్ద) సాంకర్యముచే భాషాగౌరవము నశియించు నని కొందఱును దలంచుచున్నా రనునది శాస్త్రులవారియుపన్యాసములోనిమొదటివాక్యసముదాయమున కర్థము. పూర్వనిబంధనము లగువ్యాకరణాదుల నతిక్రమించి యపశబ్దములకు నయితము సాధుత్వము కలుగునట్లు సంస్కరింపవచ్చు నని కొందఱు తలఁచినట్లు దీనం దోఁచును. వాగనుశాసనాదులు పెక్కండ్రు మున్నీ భాషను బురాతననిబంధనానుసారముగా సంస్కరించిరి. వారినిబంధనలకు లోఁగియే యిదివఱకెన్నియో గ్రంథములు జన్మించెను. ప్రకృతమునందును వేనవేలు మిగుల సుబోధము లగు నానావిధము లైనపొత్తములు పుట్టుచున్నవి. నిబంధనలకు లోఁబడి బహుగ్రంథములు వ్రాయుటకుఁ దగినంత మహాభాష యుండఁగా నపశబ్దములకు సాధుత్వ మెట్లో కలుగఁ జేయవలయు ననియు, వానిసాంకర్యమున భాషకు వికృతి గల్పింపవలయు

ననియు నేల తలఁపవలయునో తెలియంజాలము. సంస్కరణము నా బాగుపఱుచుట యని యర్థము గాని మున్ను మనోహరముగా నున్న భాషను గురూపను జేయుట గా దని వారిచిత్తమునకు విశదము గానియంశముగాదు. చిరకాలమునుండి యేకవిధముగాను సుందరముగాను నున్న యీభాష కిప్పుడు సంస్కార మనావశ్యక మని తోఁచును. ఆవశ్యక మయ్యెనేని ప్రాచీన నిబంధనల నతిక్రమింపక యే సంస్కరింపవచ్చును. వ్యవహారములో నున్నభాష లన్నియు నానాఁడు మాఱుచుండు స్వభావము కలవని యందు వ్రాసిరి.

“సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ” యని వాగనుశాసనులు సూత్రించిరి. ఆంధ్రభాష వ్యవహారమూల మనియు నది యేకరూప మనియు (మాఱనిది యనియు) భాషాకావ్యములు గల వనుకారణమునఁ బ్రళయమువఱకు నుండునది యనియు నహోబలపతి కవిశిరోభూషణమున దీని యర్థమును వివరించెను. మఱియును వ్యవహారమువలననే భాషాసిద్ధి యగునపుడు వ్యాకరణమునకుం బ్రయోజనము లే దని శంకించి “సంస్కారార్థో నియమో ఽనియమా ద్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః” యని శాసించిరి. నియమము (లక్షణముఁ=వ్యాకరణము) శబ్దశుద్ధియే ప్రయోజనముగాఁ గలది యనియు, నది లేదేని యపభ్రంశ (అపశబ్ద)ములప్రయోగము గలుగు ననియు, దాని వారింప వ్యాకరణ మావశ్యక మనియు దీనిభావమును వ్యాఖ్యాత వివరించెను. దీనివలన భాష ప్రతిదినము నిచ్చ వచ్చినట్లు మాఱునట్టి స్వభావము కలది గా దని యీ గ్రంథకర్తలు తలఁచినట్లు పండితులకు సుబోధమే. మఱియుఁ గొందఱు వైయాకరణులును మీమాంసకులును శబ్దములు నిత్యము లని చెప్పిరి. శాస్త్రులుగారు సెలవిచ్చినట్లు భాష మాఱుస్వభావము కలది యని యంగీకరించినను స్వభావమువలననే మాఱు నది యని తలంచినపుడు దాని మార్ప యత్నాధిక్య మనావశ్యక మని సహృదయులకుఁ దోఁచు నని తలంచెదను.

మఱియు నందు సంస్కృతభాష కొంతకాలము వ్యవహారములో నున్నట్లు నిశ్చయింపఁ గొన్ని హేతువులు గల వని నిరూపించి యనేకవ్యాకరణములయందు వేఱువేఱు విధముగా సాధింపఁబడిన రూపభేదములు భాష మాఱుటవలనఁ గలిగినట్లు సూచనలు గల వనియు నొకవ్యాకరణమునే యవలంబించినపాణినిపతంజలులకాలములోనే “త్వత్కపితృకః” “త్వకత్పితృక” యని రెండు రూపములున్న వనియు వ్రాసిరి. సంస్కృతభాష మున్ను కొంతకాలము వ్యవహారములో

నున్న దనునంశము నెల్లవారు నిర్వివాదముగ నంగీకరింపకున్నను గొందఱైన నంగీకరింతు రని తలంచెదను గాని యందలి వేఱువేఱురూపముల నాయాయి గ్రంథకర్తలు వారివారిబుద్ధివిశేషమున సూత్రముల కర్థభేదము గల్పించియు నొక వ్యాకరణ కర్త యేకారణముననైనఁ జూడంజాలని గ్రంథముల మఱియొకరు చూచియు సాధించిరి కాని యొకరు నిబంధన మేర్పఱిచిన తరువాత మఱికొందఱు దానికి విరుద్ధము లగు నపభ్రంశములుఁ దమ గ్రంథములయం దుపయోగింపఁగా వానిని సంస్కరింపం దలఁచి వేఱువ్యాకరణముల రచియించినట్లు ప్రమాణ మెద్దియుం గాన్పింపదు. భాష్యకారుఁ డగు పతంజలియును 'త్వత్కపితృక' యని పాణిన్యాచార్యుఁడు చెప్పినతరువాత నొక సూత్రమును లాఘవార్థమై నిరాకరింపం దలఁచి "త్వకత్పితృక" యను రూపమును సాధించెను గాని పాణినితరువాతఁ గొందఱు కవులు "త్వకత్పితృక" యను నపశబ్దముం బ్రయోగింపఁగా దానిని సాధించినట్లు ప్రమాణమువలనం దెలియదు. అట్లు కా దేని పాణినితరువాత నేయేకవు లేయే గ్రంథముల నీపదము నుపయోగించిరో మఱి యేయేశబ్దముల నిట్టివాని నుపయోగించిరో వారు తెలుపవలసి యుండెను. పాణినితరువాతఁ గొంత శబ్దప్రపంచము మార్పు నొందుటచే వార్తికకారుఁడు దానిని సంస్కరింపఁ బ్రయత్నించినట్లు కానవచ్చు నని శాస్త్రులుగారు చెప్పిరి. పాణిన్యాచార్యుఁడు సూత్రమునందుఁ జెప్పనివానిం బూరింపను, ప్రమాదమునఁ జెప్పినవాని నివారింపను దలఁచి కాత్యాయనుఁడు వార్తికము రచించినట్లు వినుదుము గాని పాణినితరువాత నతనివ్యాకరణమునకు విరుద్ధము లగు కొన్ని శబ్దములను గొందఱు కవులు వారికావ్యములం బ్రయోగింపఁగా వానికి సాధుత్వముం గల్పించుటకై యాగ్రంథమును రచించిన ట్లెక్కడను గానరాదు. "సూత్రానుక్త దురుక్తానాం చింతనం యత్ర జాయతే, తం గ్రంథం వార్తికం ప్రాహు ర్వార్తికజ్ఞా మనీషిణ" యను శ్లోకమును నేఁ జదువుకొనుతఱి వింటిని. మఱికొందఱు సూత్రకారులు సూచించినవానినే వార్తికకారుఁడు విపులముగ వ్రాసెను గాని క్రొత్తగా నేమియు వ్రాయలే దందురు. మఱియుఁ గొందఱు ణిని కాత్యాయను లొక్కకాలముననే యున్నవారు గాని భాష మాఱునంతటి వ్యవధానము కలవారు కారందురు. తరువాత శాస్త్రులుగారు వేదమునందును గొన్నిచోట్ల దేశభేదముననుగాని, కాలభేదముననుగాని వేర్వేఱుగా నుచ్చారణమున్న దని వ్రాసి, ప్రాతిశాఖ్యలోని కొన్నిసూత్రములను వానిని వివరించినవారి నామములను జెప్పి కొన్నిరూపభేదముల సయిత ముదాహరించి కడపటఁ బ్రాతి

శాఖ్యలం జూచిన వేదభాషయందు ననేకము లగు మార్పు లున్నట్లు తెలియవచ్చుచున్న దని వ్రాసిరి. వారు సెలవిచ్చిన దేశకాలభేదము చేత నైనను, జదువువారి కంఠభేదముచేత నైనను, వేదభేదముచేత నైనను నుచ్చారణభేద మున్న నుండవచ్చును. సంస్కృతభాషయందును, దెలుఁగుభాషయందును గొన్నిశబ్దముల కొక విభక్తి యందే వేఱువేఱురూపము లున్నట్లు వారు సెలవిచ్చిన రూపభేదములు నుండ వచ్చును గావునను దానికి నేను మున్ను చెప్పిన హేతువే చాలుఁ గావునను, వారు వ్రాసినయంశము లెల్ల వేదవిషయములు గావునను వేదమున మార్పులు గల వనునది యాంధ్రభాషాసంస్కారమునకుఁ దగిన కారణము గాదు గావునను నిట నుదాహరింపవలసినంత యావశ్యకత్వము లే దని యెంచెదను.

ఇదియుంగాక శ్రుతిస్మృతులచే దేవాదిజగమున కెల్ల నుత్పత్తిహేతువు ననాదినిధనము నని నిరూపింపఁబడిన వేదమీశ్వరోచ్చరితము గావున నేకరూపమున సంప్రదాయానుసారముగ నేర్వందగినది యయ్యును బ్రమాదము లనివార్యములు గావున నక్కడక్కడ పాఠభేదములు గలుగఁగా వ్యాఖ్యాతలు వానిలో నెద్ది సంప్రదాయసిద్ధమో తెలియం దగినసాధనము లేక యాయాయిభిన్నపాఠములకు సాధుత్వమును బ్రతిపాదించి యుందురుగాని లోకవ్యవహారము ననుసరించి యందు మార్పులు గలిగిన వనిగాని యాభిన్నపాఠములను బుద్ధిపూర్వకముగఁ గల్పించిరని కాని తెలియ నవకాశము గాన్పింపదు.

మఱియుం దరువాత శాస్త్రిలవారు పై యంశములంబట్టి భాషాసంబంధము లగు మార్పుల ననుసరించి యాయాకాలములందు సంస్కరణము జరుగుచు వచ్చిన ట్లూహింపవచ్చు ననియు, విపుల మగు పాణినివ్యాకరణము నయితము భాషను బూర్ణముగను నసందిగ్ధముగను సంస్కరింపం జాల దయ్యె ననియుఁ గొన్ని యంశములు వ్రాసిరి. భాష మున్ను చక్కఁగ సంస్కరింపఁబడి స్థిరపఱుపఁబడినది గావున మఱల నిప్పుడు సంస్కరింపంబడవలసిన యవశ్యభావము లే దని మున్ను వ్రాసితిని. వారు సెలవిచ్చినట్లు భాషను బూర్ణముగ సంస్కరించుట దుష్కర మనియు, నీ భాషయందు వ్యాకరణములు గొన్ని యున్నను గావలసిన యంశముల నన్నిటి నవి యసందిగ్ధముగాఁ జెప్పంజాల వనియు నంగీకరింప వచ్చును. మఱియు నవకాశము గల పండితులు వానిలోఁ గొన్నియంశముల నైన బూరింప యత్నించిన మిగుల సంతసింపంగలవా రనేకులు గలరు. పాణినివ్యాకరణము నయితము భాషను బూర్ణముగ సంస్కరింపంజాల దనునంశమును గూర్చి శాస్త్రిలుగారు వ్ర

షోదరాది సూత్రమును, దానిభాష్యమును మఱియుం గొన్నియంశములను నిట నుదాహరించిరి. అందుఁ జెప్పంబడినట్టి శిష్టులవ్యవహారముం బట్టి సందిగ్ధాంశములలో సందేహము వారించుకొనవలయు ననునది సర్వసమ్మతమే. కాఁబట్టి నన్నయభట్టారకాదులవ్యవహారము ననుసరించి గ్రామ్యభాషలోని శబ్దములం గొన్నిటిని గవు లెల్లరు నిపుడును స్వతంత్రముగ వ్రాయుచున్నారు.

పండితులకంటెఁ బామరు లెక్కువగా నుందురు గావున నపభ్రంశములు ప్రబలిన వనియు, నీయంశమును గోశబ్దమునకు గోణీ-గావీ-గోతా-గోపోతలికా మొదలగు ననేకాపశబ్దములు పర్యాయములుగా నున్న వను భాష్యోక్తిచేఁ దెలియు ననియు, నివి ప్రాకృతభాషలో సాధువులుగ వాడఁబడుచున్న వనియు, నపశబ్దములొక్కొక్కదేశమున నొక్కొక్కవిధముగా వ్యాపించిన వనియు, సాధుశబ్దము లన్నిదేశములందును విదితము లనియును సంస్కర్తలదివఱకు గ్రంథములలో వాడిన శబ్దములను, సర్వదేశములందు శిష్టులదివఱకు వాడుకచేయు శబ్దములను వేఱుగాఁ దీసి వానికి లక్షణములు వ్రాసినట్లు దోఁచుచున్న దనియు శాస్త్రిలుగారు లిఖయించి యీయంశము "సప్తద్వీపా వసుమతీ" త్యాది భాష్యగ్రంథమువలనను "యద్యపి గావ్యాదయోపి లోకే విదితా" యిత్యాది హారదత్త గ్రంథమువలనను విదిత మగు నని యుపన్యసించిరి. పండిత సంఘముకంటెఁ బామరసముదాయ మెప్పుడు నధికముగా నుండు ననియు, నపభ్రంశము లెప్పుడును గల వనియు నొప్పికొనవచ్చును. అపభ్రంశము లెట్లున్నను వానిని వ్యవహారమునందే యుపయోగించినట్లు కాన్పించును గాని గ్రంథములయందుఁ జొప్పినట్లు కాన్పింపదు. అట్లుపయోగింపఁగూడ దని "శాస్త్రపూర్వకం యశ్శబ్దాన్ ప్రయుఙ్క్తే సోఽభ్యుదయేన యుజ్యతే" యను భాష్యోక్తివలనం దేటపడును. (ప్రకృతి ప్రత్యయవిచార పూర్వకముగా నెవ్వఁడు వ్యాకరణవిరోధము లేకుండ శబ్దములం బ్రయోగించునో వాఁడు మేలుపొందు నని దీనియర్థము.) మహాభాష్యమునఁ బతంజలిముని 'మహాఞ్ఛబ్దస్య ప్రయోగవిషయ' యని యారంభించి సప్తద్వీపా వసుమతీ, త్రయోలోకాః, చత్వారో వేదాః, సాంగా స్సరహస్యాః, బహుధాభిన్నా, ఏకశతమధ్వర్యుశాఖాః, సహస్రవర్త్మా సామవేదః, ఏకవింశతిధా బాహ్వృచ్యం, నవధాథర్వణో వేదః, వాకోవాక్య మితిహాసః, పురాణం, వైద్యక మిత్యేతావాఞ్ఛబ్దస్య ప్రయోగవిషయః ఏతావంతం శబ్దస్య ప్రయోగవిషయ మననునిశమ్య సం త్యప్రయుక్తా ఇతి వచనం కేవలం సాహసమాత్రమేవ, యని చెప్పెను. (శబ్దమునకుం బ్రయోగ

విషయము మిక్కిలి కలదు. ఏడు దీవులు గల భూమియు, స్వర్గాదు లగు మూఁడు లోకములును, శిక్షావ్యాకరణాదులగు నంగములతోఁ గూడినవియు, రహస్యములతోఁ గూడినవియు, బహుప్రకారముల భిన్నములు నగు నాలుగు వేదములును గలవు. అందు యజుర్వేదమునందు నూఱు నొక్క శాఖలును, సామవేదమున వేయి శాఖలును, ఋగ్వేదమున నిరువదియొక్క శాఖలు నాథర్వణమునం దొమ్మిది శాఖలు గలవు. మఱియును బ్రశ్నోత్తరరూప మైన గ్రంథమును, నితిహాసములును, బురాణములును, వైద్యశాస్త్రమును గలవు. ఇ వన్నియు శబ్దమునకుఁ బ్రయోగస్థానములు. వీని నన్నిటినిం జక్కఁగఁ బరిశీలింపక యప్రయుక్తములు గల వనుట కేవలము సాహస మని దీని ముఖ్యార్థము.) ఈగ్రంథము విపుల మగు సంస్కృతభాషయందుఁ గొన్నిశబ్దములం జూచి యెక్కడను బ్రయోగింపంబడినవి కా వని పరిశీలింపక యనఁగూడ దని ధ్రువపఱుచును. కాని తక్కినయంశములలో నొకదానిని దెలుపం జాల దని స్పష్ట మగుచుండఁగా దినివలన నీయంశము స్పష్ట మగు నని శాస్త్రిలుగా రెట్లు వ్రాసిరో తెలియంజాలము. మఱియును "యద్యపి గావ్యాదయోఽపి లోకే విదితా స్తథాపి తేన సర్వలోకవిదితాః ప్రతిదేశం భిన్నత్వా దపశబ్దానాం లోకశబ్దశ్చాయం సర్వస్మిన్ లోకే వర్తతే. సంకోచకాభావా" త్తనునది మొదలగువా రుదాహరించిన హారదత్త గ్రంథము (పరిశీలింపఁగా గావీ-గోణీ-గోపోతలికా మొదలగు నశబ్దములును లోకమునం బ్రసిద్ధములే. కాని యపశబ్దములు వేఱువేఱు దేశములందు వేఱువేఱువిధముగ నున్నవి గావున నెల్లలోకమునం బ్రసిద్ధములు గా వని దీని ముఖ్యమైన యర్థము.) నయిత మపశబ్దము లెల్ల లోకమున విదితములు కా వనియు వేఱువేఱు దేశముల వేఱువేఱువిధముగ నున్న వనియుఁ దెలుపును గాని మీఁదటి తక్కిన యంశములలో నొకదానిం దెలుపఁజాలదు. సంస్కర్తలు గ్రంథములలో వాడుక చేసిన శబ్దములను, నెల్లదేశముల శిష్టులచే వాడంబడినశబ్దములు సుశబ్దములో యపశబ్దములో నిర్ణయింపఁబడలేదు. అవి సుశబ్దము లైన లక్షణముచేయ నాతంకము లేదు. అపభ్రంశము లైనచో హారదత్త గ్రంథముతో విరోధించును.

పిమ్మటఁ గాలక్రమమున సంస్కృత భాషావ్యవహారము నష్ట మైన దనియు, నపభ్రంశ భాషలు దేశభేదముచేత భిన్నము లైన వనియును, శిష్టులును యజ్ఞాది కాలములం దప్ప నితరకాలములో నాయపభ్రంశమునే వాడుకచేయు చుండి రనియు, నప్పటి ప్రాజ్ఞులు ప్రచురముగా వ్యాపించిన యాదేశభాషలను సంస్కరించి

యందే కావ్యములను వ్రాయఁ దొడంగి రనియు నపుడు ప్రాకృతకావ్యములు పెక్కు లుద్భవించె ననియు శాస్త్రులువారి వాఙ్ముఖమునం గలదు. వారు చెప్పినట్లు కాక సంస్కృతభాష వ్యవహారములో నుండఁగనే దేశభాషలు కొన్ని కలట్లును, నవి యపభ్రంశములు గా ననియును గొన్ని నిదర్శనములు గాన్పించును. ప్రపంచమున నాది కావ్యమగు రామాయణమును రచియించిన మహాకవి యగువాల్మీకి ప్రాకృతాదిభాషలకు వ్యాకరణము రచియించెను. దానికిఁ త్రివిక్రమాచార్యులు వృత్తి వ్రాసిరి. దానికి సోమచంద్రసూరిప్రణీత మైన భాష్యముం గలదు.

తే. గీ. ఇలఁ ద్రివిక్రమరచితవృత్తులను సోమ,చంద్రసూరిప్రణీతభాష్యంబుచేతఁ
దనరు వాల్మీకిమూలసూత్రములవలనఁ, బ్రాకృతాదిషడ్భాషలుద్భవముఁ జెందె.

సీ. స్వర్గలోకప్రశస్తము సంస్కృతము మహారాష్ట్రదేశీయంబు ప్రాకృతంబు
శూరసేనాఖ్యఁ బ్రస్తుతికెక్కె నాఁటను జను లాడునదియె సౌరసేని
మగధదేశోక్తులు మాగధీభాష పిశాచసంజ్ఞికములై జగతిఁబొదలుఁ
బాండ్య కేకయసాల్వబాహ్లికానూపగాంధార నేపాళకుంతలసుధేష్ణ

గీ. భోజకన్నోజకంబులఁబొసఁగుమాట,లరయఁ బైశాచి కాచూళికాహ్వయములు
వెస నపభ్రంశ మాభీరవిషయజాత, మాంధ్రభూమిభవం బాంధ్ర మయ్యె శౌరి.

అప్పకవీయము. ఆ. 1.

మఱియు నహోబలపతి "యత్త్వపభ్రంశ" యను సూత్రవ్యాఖ్యానావసరమునఁ గవిశిరోభూషణమునందుఁ "ఆంధ్రభాషాకావ్యనిర్మాణే కవయః ప్రతియుగం ప్రవర్తంత ఇత్యుక్తం. తథాచ తద్గతశబ్దానాం గ్రామ్యతాపరిహారాయ గ్రామ్యాగ్రామ్యవిభాగపరం వ్యాకరణ మేత దావశ్యకమేవ" యని చెప్పెను. కవులు ప్రతియుగమందును నాంధ్రభాషాకావ్య నిర్మాణమునం బ్రవర్తించుచున్నా రని చెప్పంబడినది. కనుక దానియందలి శబ్దములకు గ్రామ్యతాదోషము వారించుటకై గ్రామ్యాగ్రామ్యములం దెలుపు నీవ్యాకరణ మావశ్యకమే యని దీని ముఖ్యార్థము. మఱియు నందే "సమ్మూలకత్వా ద్రూఢత్వాత్ గృహీతత్వాచ్చ సాధుభిః, నాపభ్రంశత్వ మేతస్యా నియమాభావతస్తు తత్ । నివారణాయ తస్యైవ ప్రవృత్తి ర్విదుషామభూత్, తిదర్థమేవ హి వయం భూయసా ప్రయతామహే॥ కవిశోషప్రశుణం దోషం నైవ కించి త్సహామహే" యను పురాతనగ్రంథము నుదాహరించెను. ఆంధ్రభాష మంచి మొదలు కలది గాపు

నను, దేశమునం బ్రసిద్ధ మగుటవలనను, విద్వాంసులచే నంగీకరింపఁబడినది గావునను దీని కపభ్రంశదోషము లేదు. కాని వ్యాకరణాభావమువలన నా దోషము ప్రసక్తించును. విద్వాంసులు దానిం బరిహరింపఁ బ్రవర్తిల్లిరి. మే మును దానికై మిగుల యత్నించుచున్నారము. కవితయం దేకొంలఁది దోష మున్నను సహింప మని దీనియర్థము. మఱియు నాగ్రంథముననే యీ ప్రస్తావముననే "నను సంస్కృతప్రాకృతవ్యాకరణయో రార్షత్వేన భవతి ప్రామాణ్యమ్. నన్నయాథర్వణయో రిదానీంతనకవిమాత్రత్వేన కథం తత్ప్రణీతయో ర్వ్యాకరణయోః ప్రామాణ్యం. కథన్ను తదనుసారేణ కావ్యనిబంధనం స్యాత్. కిం చానుశాసన స్యేదానీంతనత్వేన కుతస్తరాం ప్రాచీనాః కవయః కావ్యనిర్మాణే ప్రావర్తంతేతిచే న్నైవం మంస్థాః. నాన్యృషేః కావ్యకరణ చాతుర్య ధుర్యత్వం సంభవత్యేవ ఖలు, నానృషిః కురుతేకావ్య మిత్యభియుక్తోక్తేః. అని తరకవిసాధారణ వ్యాకరణ నిర్మాణపటుతయా పండిత కవీంద్ర ప్రథమగణ్యత్వేన చ పరిప్రాప్తం సార్వజ్ఞ్యం తయోరధునాతనత్వేన కథం నివార్యతే" యని ప్రౌఢవాదమునం జెప్పి తరువాతను "నచవ్యాకరణ స్యేదానీంతనత్వ మేవ యేన ప్రాచీన ప్రబంధ్కృణాం కావ్యనిర్మాణే ప్రవృత్తి ర్నస్యాత్. కింతు ప్రాగప్యనుశాసనస్య సత్వాత్ అతఏవ శబ్దానుశాసనేన "క్రియాణా" మిత్యాది సూత్రైః బహవః ప్రాచీనాచార్యాః ప్రకాశితాః ఆథర్వణగ్రంథేఽపి పురాతనాంధ్ర శిక్షకాః కవిశిఖామణ్యాదయః బహవః కథితాః యథాపాణినీయే "లోపశ్శాకల్యస్య, ఋతోభారద్వాజస్య, గురోరనృతోఽనంత్యస్యా ప్యేకైకస్య ప్రాచా" మిత్యాదా. తత్ప్రథమ ప్రవక్తృత్వ వ్యపదేశస్తు ఖల కవితానుశాసన యోజనాపేక్ష ఇతిజ్ఞేయ" మ్మని యహోబలపతియే వ్రాసెను. (అయ్యా! సంస్కృత ప్రాకృత వ్యాకరణములు మునిప్రణీతములు గావున వానికిఁ బ్రామాణ్యము గలదు. నన్నయాథర్వణు లిప్పటి కవులు గావున వారి వ్యాకరణమున కెట్లు ప్రామాణ్యము గల్గును? కావ్యనిర్మాణము దాని ననుసరించి యెట్లు చేయ వగును? మఱియు వారియనుశాసన మిప్పటిది గావునఁ బ్రాచీను లగుకవులు కావ్యనిర్మాణమున నెట్లు ప్రవర్తిల్లి రని తలంపందగదు. ఋషికానివాఁడు కావ్యమును రచింపంజాలఁ డను పండితోక్తివలన నార్షజ్ఞానము లేనివానికిఁ గావ్యనిర్మాణము నందలి నైపుణ్యము సంభవింపద. సాధారణు లగు కవులకు సాధ్యము గాని వ్యాకరణ నిర్మాణమునందలి నైపుణ్యముచేతను, బండితకవీంద్రుల

లో మొదట గణియింపంబడుటచేతను వారికిఁ బ్రాప్తమైనసర్వజ్ఞత్వ మిప్పటివా రగుటచే వారింపఁబడదు. మఱియును వ్యాకరణ మిప్పటిదె యయ్యెనేని మునుపటి కావ్యకర్తలకు వానినిర్మాణమునం బ్రవృత్తి లేకపోవును గాని మునుపును వ్యాకరణము గలదు. కనుకనే వాగనుశాసనులు తనసూత్రములందుఁ,బాణిని తనసూత్రములందు భారద్వాజుని శాకల్యుని నింకను గొందఱను బేర్కొన్నట్లే పెక్కండ్రు ప్రాచీనాచార్యులను బేర్కొనెను. అధర్వణుఁడును దనవ్యాకరణమునందుఁ గవి శిఖామణి మొద లగుపెక్కండ్ర నాంధ్రశిక్షకుల నుదాహరించెను. వారే మొదట వ్యాకరణమును రచించినవా రనునది ఖలమైనవ్యాకరణమును మరలం గూర్చుట నపేక్షించి చెప్పంబడినది యని దీని యర్థము.

మఱియు నాగ్రంథముననే "నను దేశభాషాకావ్యస్యాగ్రామ్యస్యాపి ప్రత్యవాయజనకతా సంభావితేతి చేన్నైవం. తథాత్వే నన్నయాథర్వణాపేక్షయా ప్రాచీనానాం తదనుశాసనే ప్రవృత్తానాం కవిభల్లటాదీనాం శిష్టానాం ప్రయాసస్య వైఫల్యాపత్తే ర్ద్రావిడభాషానుశాసనే ప్రవృత్తస్య సర్వజ్ఞాగ్రచరస్యాగస్త్యమహామునేః ప్రాకృతవ్యాకరణే ప్రవృత్తస్య భగవతో వల్మీకసంభవస్య మహర్షిశిఖామణేశ్చ సర్వజ్ఞత్వ స్యాప్రయోజకత్వాపత్తే శ్చేత్యల"మ్మని వ్రాసెను.

(అయ్యా! దేశభాషాకావ్యము గ్రామ్యము గాకున్నను బ్రత్యవాయమును బుట్టించు నని తోఁచునంటేని యట్లని నన్నయాదులకంటెఁ బూర్వులును దెలుఁగుభాసకు వ్యాకరణమును రచించినవారు నగుకవిభల్లటాదులయాయాసము వ్యర్థ మగును గావునను, ద్రావిడభాషకు వ్యాకరణము రచించినవాఁడును సర్వజ్ఞులలో మొదటివాఁడు ను నగు నగస్త్యముని విజ్ఞానమునకును, ప్రాకృతాదిభాషలకు వ్యాకరణమును రచించినవాల్మీకిసర్వజ్ఞత్వమునకును బ్రయోజనము లేక పోవును గావున నట్లన రాదని దీనిముఖ్యార్థము.) మఱియు నహోబలపతియె యీసందర్భముననే "పాకృతాంధ్రయో ర్నాస్త్యేవ మ్లేచ్ఛత్వ మన్యదేశభాషా వదిత్యుక్తం. తథా చాస్యాపి మూలశ్రుతిసద్భావ న్నాపపాదవవ. కావ్యవిషయ ధర్మాధర్మఫలకసుశబ్దావశబ్దప్రయోగావలంబ స్తుతినిందయో రభియుక్తపరంపరయా ప్రతిపాదితత్వా"త్తని వ్రాసెను. (ప్రాకృతాంధ్రభాషలకు నన్యదేశభాషలకు వలెనే యపశబ్దదోషము లేదని చెప్పిం

బడెను. అట్లగుచునుండఁగాఁ గావ్యమందలి ధర్మాధర్మములు ఫలముగాఁగల సుశబ్దాపశబ్దములప్రయోగములను గూర్చినస్తుతినిందలు విద్వాంసుల పరంపరచేఁ జెప్పంబడిన వగుటవలన దీనికిని మూలశ్రుతికలిమి శ్రమ లేకుండం జెప్పం దగినదియే యని దీనియర్థము.) మఱియు నీ విషయమున నీ గ్రంథమున నెన్నియో వ్రాయంబడెను; కాని గ్రంథవిస్తరభయమున వ్రాయం జాలనైతిని. మీఁద వ్రాసిన గ్రంథసందర్భముచే సంస్కృతవ్యవహర్త లగునగస్త్యులు, వాల్మీకులు మొద లగువారికాలముననే ప్రాకృతకావ్యములు కల వనియు నవి యపభ్రంశములు కా వనియు విద్వాంసులకు సుగ్రహమే.

తరువాత శాస్త్రిలుగారు ప్రస్తుతము బంగాళాభాషను సంస్కరించి యందు నూతనగ్రంథముల వ్రాయుట యెల్లరకుం జెల్ల మనియు నిట్లే ప్రాచీనకర్ణాటకము నవీనకర్ణాటకము ననువిభాగము గలిగె ననియు వ్రాసిరి. మీఁదటి రెండుభాషలు నేనెఱింగినవి కావు. కాని యాభాషలను బాగుగ నెఱింగిన మహాకవులు విద్వన్మనోరంజనముగాఁ జక్కంబఱిచి సుబోధములుగా వానియందు గ్రంథములు వ్రాసి రని తదభిజ్ఞులవలన విన్నవాఁడను. మఱియుఁ గన్నడభాషలోఁ బురాతనము లగుకొన్నిశబ్దములు ప్రకృతమందు వ్యవహారములో లేమిచే వాని నుద్ధరింపం దలంచి వానిం జేర్చుకయే క్రొత్తగా గ్రంథములను వ్రాసి రని విన్నవాఁడను. పిమ్మట వారు ప్రకృత మగునాంధ్రభాషలోను దేశ్యము గ్రామ్యము నని విభాగించి రని వ్రాసి (ఇందుఁగర్మము శబ్దసముదాయ మని యర్థ్యాహార్యముగా బోలును.) వానిస్వరూపముం జెప్పి ప్రస్తుతకాలముం దాంగ్లభాష ప్రచురముగా వ్యాపించుటచే నుద్దేశము లేకీభవించుచున్నవి; దేశములోఁ బరస్పరసంబంధము ప్రబలుచున్నది. అందువలన గ్రంథస్థ మైనదేశ్యములకన్న నంతటను విదిత మైనవ్యవహార భాషాప్రపంచము పెరిఁగినది. ఇంతకుమున్ను గ్రామ్యము లని నిరాకరింపఁబడిన శబ్దములలో ననేకములు సర్వదేశవిదితము లై దేశ్యము లని వ్యవహరింపఁ దగియున్న వని చెప్పిరి. ప్రస్తుత మిందింగ్లీషుభాష ప్రచురముగా వ్యాపించిన దనుమాట వాస్తవమే. కాని దానివలన నెవ్వరెవ్వరియుద్దేశము లేయేయంశములలోఁ బ్రబలుచున్నవియో వివరింపరైరి. కాఁబట్టి యావిషయమై యేమియు వ్రాయ నవకాశము గలుగ దయ్యెను. గ్రంథస్థము లగుదేశ్యములకన్న వ్యవహారభాషాప్రపంచము పెరిఁగినను లేకున్నను గ్రంథస్థము కాదు గావున భేదము లేదు. వ్యవహారభాష గ్రాంథికభాషం

టి నెప్పుడు నిందుక వేఱుగ నున్నది గాని దానితోఁ గలిసి లేదు. పూర్వులు గ్రంథరచన చేసినప్పుడును వ్యవహారభాష యట్లే యున్నది గాని గ్రంథరచన యున్నట్లు వ్యవహారభాష యెన్నఁడును లేదని తోఁచును. కాదేని గ్రామ్యము ను బ్రాచీను లేల నిషేధింతురు. గ్రామ్యములను గావ్యములం బ్రయోగింపఁ గూడ దని లక్షణ కావ్యకర్త లంగఱుం జెప్పుచున్నారు. మున్ను గ్రామ్యము లని నిరాకరింపఁబడినవానిలో నెవ్వి సకల దేశవిదితములై యిపుడు దేశ్యము లుగ వాడం దగియున్నవో వానిలోఁ గొన్నిటినేని వా రుదాహరింప కున్కికిఁ గారణము తెలియదు. ఆంధ్రదేశమునందంతటను వాడుకలో నుండుపదములు దేశ్యము లనియుఁ గొన్ని గ్రామములలో మాత్రమే వాడుకలో నుండుపద ములు గ్రామ్యము లనియు వారు వెనుక వ్రాయించిరి. గ్రామ్యము లెపుడును సకలలోకవిదితములు కావని దీనియభిప్రాయము. సత్యముగా నిప్పుడును గ్రా మ్యము లొక్కొక్కదేశభాగమం దొక్కొకరీతిని వాడఁబడుచున్నవి కాని యెల్లదేశములందు నొక్కరీతిని వాడంబడునవి కావని దేశానుభవము కల వా రికి విదితము. "ఇట్టియవస్థలోఁ బూర్వులయుద్దేశము లాలోచింపక వారు చెప్పినమాటలు యథాశ్రుతముగ గ్రహించి యిపుడు దేశ్యములుగా నున్నను బూర్వు లట్లు వ్యవహరింప లేదను కారణమున నిరాకరించినచోఁ గాలస్వభావ మున మాఱుచుండెడిభాషలోఁ గొంతకాలమున కీ భాషాప్రపంచమంతయు గ్రం థములోఁ జేరకుండుటచేనిరుపయోగ మగును. ఇట్టి భాషాప్రపంచమును నిరుప యుక్తముగాఁ జేయుట యుచితమా యనునంశమును బ్రాజ్ఞు లాలోచింతురుగాక" యని వారి యుపన్యాసమున నున్నది. పూర్వులయుద్దేశము గ్రంథములలో గ్రా మ్యము నుపయోగింపఁ గూడ దని కాన్పించుచున్నది. "తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భాషా" యను నన్నయభట్టారకుని సూత్రవ్యాఖ్యాన మున నహోబలుఁడు "చతుర్విధా భాషేతి గ్రామ్యయా సాకం వికృత్యాశ్చా తుర్విధ్యం వదత ఆచార్యస్య క్వచిద్వినియోగ ఇష్టఏవ అన్యథా తత్పరిగణనం వృ థా స్యాత్ వినియోగోపి నాన్యత్ర్యయుక్త ఇతి తత్తత్స్వభావవర్ణనే కార్యః అత ఏవాథర్వణే నోక్తం గ్రామ్యం తత్తద్విధా సాధు" అని వక్కాణించెను. (గ్రామ్య ములోఁ గూడ నాంధ్రభాష నాల్గు తెఱంగులు గలదని చెప్పిన నన్నయాచార్యునకు గ్రామ్యభాషాప్రయోగ మొకానొకచో నిష్టమే. కాని యెడల దాని లెక్కించుట వ్యర్థ మగును. అయినను దానిప్రయోగ మాయాస్వభావమును వర్ణించుటకుఁ గా

వచ్చును. వేఱొకచోఁ దగదు. కనుకనే యాథర్వణుఁడు గ్రామ్యము లాయాయి స్వభావవర్ణనములందు సాధువు లని చెప్పెనని దీనియర్థము. మఱియును గ్రామ్య ప్రయోగ మొకదోష మని యాలంకారికు లెల్ల నిర్వివాదాంశముగ నంగీకరించిరి. ఇప్పటివారు గ్రంథములలో వాడుక చేయకున్న నీభాషాప్రపంచము నిరుపయోగ మెట్లగును? పూర్వులు నిరాకరించిన గ్రామ్యము లిప్పుడు దేశ్యము లైన వని శాస్త్రులుగారు సెలవిచ్చిరి. ఇట్లింకను గొంతకాలము నిరాకరించిన నవి దేశ్యములకంటె నుత్తమశబ్దములుగా మాఱునేమో! ఈ భాషాప్రపంచము వ్యవహారములో నిదిగావున వ్యవహార మున్నంతవఱకు దీనిని నిరుపయుక్తముగ నేవారుం జేయంజాల రని నాయభిప్రాయము.

తరువాత భారతాదుల నాంధ్రీకరించినయాదికవులయుద్దేశము నాలోచింపుఁడు. సంస్కృతభాష యందఱకుఁ దెలియదు గావున నాంధ్రీకరించిన నాంధ్రదేశమున కంతకును సుబోధ మగు ననియే కదా వారియుద్దేశము? ప్రకృతకాలమునఁ బ్రసిద్ధము లగుపదముల విడిచి పూర్వకాలప్రసిద్ధము లగుశబ్దములను మాత్రము వాడుక చేసిన నవి కొంతకాలమునకు సంస్కృతగ్రంథములు వలెనే దుర్బోధములై సామాన్యముగా నుపయోగింపమిచేఁ బూర్వులయుద్దేశము నిర్మూల మగును. భాష యభివృద్ధి నొంద నవకాశ లేదను నర్థముగల గ్రంథము వారిచే నందు వ్రాయం బడియె.

పూర్వకవుల యుద్దేశమును నిప్పటివారి యుద్దేశమును వారు చెప్పినదియే యని యంగీకరింపవచ్చును. గాని పూర్వప్రసిద్ధములు నీ కాలమునఁ బ్రసిద్ధములు నగుశబ్దములు వేఱువేఱుగా లేవు. మును పే శబ్దములు గ్రంథములం బ్రసిద్ధములో నిప్పుడుం దఱుచుగ నవియే. సర్వసామాన్యముగా నెప్పుడు నేభాషలోను గ్రంథములుపయోగించినట్లు తోఁపదు. ఎట్టిపదముల నుపయోగించినను సర్వజనులకు సుబోధము లగుకావ్యముల నిర్మింప నేవారికిని సుసాధ్యము గాదని తలంచెదను. మున్నును సకలకావ్యములు గాని కొన్ని గాని వ్యవహారభాషలో వ్రాసిన ట్లయిన నెల్లవారికిం దెలిసినట్లయినను బ్రమాణ మెద్దియుం గానరాదు. అట్లయ్యె నేని చెప్పువారును వినువారు నను భేదములేక యెల్లవారును బండితులె యయ్యెదరు. “పండితసంఘముకంటెఁ బామరసంఘ మెక్కువ” యని శాస్త్రిలుగారు వెనుక వ్రాసినవాక్యము నిరర్థక మగును. ఆసక్తితో నేర్చినవారికిం దెలియునట్లు గ్రంథములు వ్రాయవలయు నని పూర్వులయుద్దేశముగాని యెల్లవారికిం దెలియుశబ్దములు

గొన్నియున్నవని కాని వానితోఁ గావ్యము రచింపవలెనని కాని యే గ్రంథమైనఁ జదువని వారికిం దెలియవలయు నని కాని యున్న ట్లెక్కడను నెవ్వరుఁ జెప్పలేదు. మఱియు నహాబలుఁడు రసవ్యంజక తత్సమాదిశబ్దచిత్రిత మైన తెలుఁగు కావ్యమునకును బండితులే యధికారులని స్పష్టముగా వ్రాసెను.

కాఁబట్టి వారియుద్దేశమునకు భంగము రాదు. భాష యభివృద్ధినొందుట యనఁగా సుబోధములు సగుణములు నదోషములు రసవంతములు నగుశబ్దములతోఁ గూడిన మంచివిషయములు గలపొత్తములతో భాషం బెంచుట యని కాని వ్యవహారభాషతో గ్రంథములం గల్పించుట కాదని నాయభిప్రాయము. మఱియు నట్టిభాషాభివృద్ధి వ్యాధిచేఁ గలిగిన శరీరాభివృద్ధిం బోలునది యని తోఁచును. వ్యవహారభాష యనఁగా గ్రామ్య భాషయే'యని వారు తలఁచిన ట్లీ సందర్భమునఁ దోఁచి మీఁదటి యంశమును వ్రాసితిని. తరువాత శాస్త్రులు గారసంస్కృతముగా నీ వ్యవహారభాషలో గ్రంథము రచించిన నియమము లేక భాషాగౌరవము చెడు నని శంకింపవచ్చును. కాని వ్యవహారభాష నారీతిగనే యుపయోగించినపుడే యట్టిదోషము. వ్యావహారికభాషలో సకలదేశవిదితములును గర్ణసుఖములు నగుశబ్దముల నుపయోగించి క్రమముగ సంస్కరించినచో నట్టి దోషము లేదని వ్రాసిరి. వ్యవహారభాషలో నట్టిపదములు కలవేని వానిని స్వరూపమున సంస్కరించి యుపయోగింపవచ్చును. నియమమును వదలి వ్యవహారభాషతో గ్రంథములు రచించిన భాషాగౌరవము పోవు ననుట సత్యమే. వాని సంస్కరించుటయు దుష్కరము. వ్యవహారభాషను సంస్కరింప సాధన మెద్దియో తెలియదు. కొన్నిసూత్రములను గల్పింపఁగానే వ్యవహారభాష (గ్రామ్యము) గ్రంథప్రవేశమునకుం దగదు. "ఏకదేశవికృత మనన్య" మను నుక్తిచేఁ గొలఁది మార్పులు చేసినను గ్రామ్యభాష గ్రామ్యభాషయే కాని ప్రయోగార్హము కాదని తోఁచును. గ్రామ్యభాషలో సర్వదేశవిదితములును గర్ణసుఖములు నగుశబ్దము లేవి కలవో వారు నిరూపింపవలెను. గ్రామ్యమన నపశబ్దమని "గ్రామ్యంహియత్త్వపభ్రంశో" యను సూత్రమున వాగనుశాసనులు చెప్పిరి. అపశబ్దములు కర్ణసుఖము లెట్లగునో తెలియదు. అపశబ్దములు వేఱుదేశములయందు వేఱువిధముగా నున్న వని వారే వ్రాసిరి. అవి యిప్పుడు సకలదేశవిదితము లని యెట్లు వ్రాయవచ్చును? మఱియు "సంస్కృతభాషయందును నిట్టి సంస్కరణములు గానవచ్చు చున్న"వని వ్రాసి "తనుగాత్రో శబ్దము స్త్రీలింగ మగునపు డాకారాంతముగ నుండవలయు నని పాణిన్యా

ములయభిప్రాయ మనియును వారివెనుకం గాళిదాసాది మహాకవులు గొందఱు దాని నీకారాంతముగఁ బ్రయోగింపఁగా దాని ననుసరించి వామనాచార్యుఁడు "అంగగాత్రకంఠేభ్యో వక్తవ్య" మ్మని దానికి సాధుత్వమును గల్పించువార్తికము ను రచియించె ననియు 'సుభ్రువనుభట్టి ప్రయోగాదుల ననుసరించి ముగ్ధబోధాది వ్యాకరణములను దత్సంస్కారమొనరించి రనియు లిఖయించి యిట్లనేకప్రయోగ ములు నిటీవలిమహాకవులు వ్యవహరింప వాని ననుసరించి సంస్కారణములు జరిగి నట్లు తత్తద్గ్రంథపరిశీలనశాలులకు స్పష్టమగుననియు వ్రాసి యొకకవి ప్రయోగిం చిన యొకశబ్దమునే యుదాహరించిరి. వార్తికమందింకను గొన్నిశబ్దములు కలవు గాని యిదియేకాదు. కాన సంస్కృతభాషయందలి యీవార్తికమును వామనా చార్యుఁడు పాణిన్యాదు లే కారణముచేత నైనం జూడం జాలని పూర్వవ్యాకరణ ములం గాని, మఱి యేయితర గ్రంథములం గాని చూచి రచియించె నని తోఁచు ను. కాని పాణిన్యాదులకు విరుద్ధము లగుకాళిదాసాదుల ప్రయోగములనే చూచి రచియించె ననిచెప్పుట కాధారమెద్దియుం గాన్పింపదు. వారిప్రయోగములనే యుద్ధరింపం దలఁచి యీవార్తికమును వామనుఁడు రచియించె నని దృఢముగాఁ జెప్పునెడల నామహాకవికాళిదాసుఁడే ప్రయోగించిన "శార్వరస్య తమసో నిషి ద్ధయే" యనుదానియందలి శార్వరశబ్దమును, నతఁడే ప్రయోగించిన "త్రియంబ కం సంయమినం దదర్శ" యను చోటత్రియంబకశబ్దమును నట్టి మహాకవియె యగు భారవి "అనుదితౌషసరాగ" యను దానియందుఁ బ్రయోగించిన "యౌ షస" శబ్దమును, "సమకాలీన" మిత్యాదినైయాయిక ప్రయోగమును "కార్తి కేయో నభస్వాన్" అను చోటికార్తికేయశబ్దమును మఱియు నిట్టివానిం గొన్ని టిని సాధువులం జేయం దలంచి కొనివార్తికముల నేల రచింపలేదో, రచింపక పోవు టయే కాక యిందుఁ గొన్నిటిని స్పష్టముగా నసాధువు లని సూత్రవృత్తియం దేల చెప్పెనో చెప్పవలసినభారము శాస్త్రులువారిదె యై యున్నది. "సుభ్రు" వనుప్రయోగమును ముగ్ధబోధకర్త యెట్లు సాధు వని చెప్పెనో నేనెఱుఁగను గాని యెట్లు సంస్కరించినను గౌముదియందు దీనినుదాహరించి "ప్రమాద ఏవేతి ప్రామాణికా" యని భట్టోజీదీక్షితులు గారు నిరాకరించిరి గాని యంగీకరింపలేదు. నాగేశభట్టులు శేఖరమునం దీయంశమును దలపెట్టి యిది కవిప్రమాదము కాదని యు, రాముఁడు భార్యావియోగ దుఃఖమునం బరవశుఁడై యనవధానమున నిట్లు విలపించె ననియు, భట్టి కవి దాని ననుకరించె ననియు వ్రాసిరి. కాళిదాసాదులు

ను బాణిన్యాదు లొప్పికొననిశబ్దములను వా రనేకవ్యాకరణములు నేర్చినవారు గావున వానిచే సాధువు లగువానినే ప్రయోగించిరి కాని వ్యావహారికభాషలోని యపశబ్దములం బ్రయోగింప లేదని తలంచెదను. ఆంధ్రభాషయందు నాయాయి కాలములందు నూతనప్రయోగముల ననుసరించి సంస్కరణము జరిగినట్లు నిదర్శన ములు కల వని వ్రాసిరి. కాని యేయేనూతనప్రయోగముల ననుసరించి యేయే సంస్కరణము లెట్లెట్లు జరిగెనో యవి జరిగిన ట్లేనిదర్శనములు కలవో చూపిన వారు కారు. వ్యాకరణనిబంధనమునకు మీఱినప్రయోగములు కొన్ని కలవనియు గ్రామ్యంబు లైనను నార్యులు ప్రయోగించినవి గ్రాహ్యము లని పల్కుచిన్నయ సూరి వానిసాధుత్వ మంగీకరించె ననియు వ్రాయించిరి. వ్యాకరణ నిబంధమునకు మించినప్రయోగము లున్న నుండవచ్చును గాని వాని కన్నిటికిని సాధుత్వమును జిన్నయసూరి గారంగీకరింప లేదు. శాస్త్రిలుగారు వెనుక వ్రాసిన నిర్వచనము గల శిష్టులుపయోగించినవానినే గ్రహింపవలయు నని యాయన యభిప్రాయము. కాని సామాన్యముగా గ్రామ్యభాషలోఁ గావ్యనిర్మాణము చేయవచ్చు నని కాదని క్రిందఁ గావించిన గ్రామ్య భాషానిరాకరణమువలన స్పష్ట మగును.

పిమ్మట శాస్త్రులుగారు "ప్రస్తుతకాలమందుఁ గవులు రసానుగుణముగాఁ గొన్నిశబ్దముల వాడినచో నవి యార్యప్రయుక్తములై సాధువులు కాకపోవునా" యని వ్రాసిరి. ఆయాయిప్రస్తావములందు రసానుగుణముగా మహాకవులు గొన్ని గ్రామ్యములం బ్రయోగింప వచ్చునని ప్రాచార్యు లంగీకరించిరి. కాని కావ్యము లం దెల్లెడలను గ్రామ్యములం బ్రయోగింప రాదని నేను వెనుక వ్రాసితిని. "అట్టి స్వాతంత్ర్యము ప్రాచీనులకుఁ గలుగుటకు నిప్పటివారికి లేకుండుటకుఁ గారణముం డునా యనియు గ్రంథకర్తలు కాకున్నను బ్రాజ్ఞు లార్యులు గాకుందురా" యని యు, "వారివ్యవహార మేల గ్రాహ్యముకాదని"యు "నాంధ్రభాషయం దుత్సా హాము కలవా రావశ్యకము లైన నిబంధనల నతిక్రమింపక గ్రంథములలో నిదివఱ కుఁ బ్రయోగింపఁబడని వానినైనను గర్ణసుఖకరములు నాంధ్రదేశమున నంతటను నాగరకవ్యవహృతంబులు రసానుగుణములు నగువానిం బ్రయోగించి రసవత్తరకావ్య ముల నిర్మింపవచ్చు న"నియు "నవియుఁ గాలక్రమమున మహాకవి ప్రయోగము లయి సంస్కరణార్హ లగుననియు నట్లైన భాష యభివృద్ధినొందునని"యు వ్రాసిరి.

ప్రాచీనుల వ్యవహారములో నున్నగ్రామ్యములు గ్రాహ్యము లని చిన్నయ సూరిగారు వ్రాసిన గ్రంథమును జూచి శాస్త్రులుగారు ప్రాచీనుల కట్టి స్వాతంత్ర్య

ము కలదు గావున నిప్పటివారును గ్రామ్యముల నిచ్చ వచ్చినట్లు ప్రయోగింప వచ్చునని కాఁబోలు నిట్లువ్రాసిరి. కాని ప్రాచీనులకు నన్నిచోట్ల గ్రామ్యము లుపయోగింప స్వాతంత్ర్యము లేదు. ఉన్నను వారికిఁ గల దనుకారణముచే నాధునికులకుఁ గల్గు ననుట న్యాయ్యముగాదు. “ భద్రంకర్ణేభి శ్శృణుయామ దేవా” యని వేదమునం గలదు. నలోపసూత్రమునొద్ద నఇతి లుప్తషష్ఠీకం పద మని వ్యాకరణమున నున్నది. గృహ్యాయనియు, కృష్ణస్యసఖ రర్జున యనియు సర్వోపంథాన మనియును, ఎతద్ద్రుశ్యతియనియును. ఋషికావ్యములందుఁ గలవు. మఱియు నిట్టివెన్నియో కల వని యనేకులకుం దెలియనియంశము కాదు. వీని నిట్లిప్పటివారు ప్రయోగింప నగునేమో వారే నిర్ణయింతురు గాక! ఉపయోగింప వచ్చుననిన వ్యాకరణమునకు వైయర్థ్యమే. గ్రంథకర్తలు కాకున్నఁ బ్రాజ్ఞు లార్యులు కా రని యెవ్వరుం జెప్పఁ జాలరు. కాని వా రితరులతో వ్యవహారించునపుడు వారికి శ్రమ లేకుండం దెలియుటకై గ్రామ్యము లనివార్యముగా నుపయోగింతురు గావునను వా రుపయోగించినను గ్రామ్యము గ్రామ్యమే కావునను వ్యవహారభాష గ్రంథప్రవేశార్హము కాదని ప్రాచీనులుం జెప్పిరి. మఱియు నిబంధన లన్నియు నావశ్యకములే కాని యందుఁ గొన్ని యనావశ్యకములు లేవు. కాఁబట్టి వానిలో నొకదానిని మీఱ రాదని నాతలంపు. అనావశ్యకములు కొన్ని కలవేని యేవి యావశ్యకములో యేవి యనావశ్యకములో వారే నిర్ణయింతురుగాక! వ్యవహారభాష యాంధ్రదేశమందుఁ బెక్కుచోట్లఁ బెక్కువిధములుగా నున్నది గాని యేకవిధముగా నున్నట్లు కాన్పింపదు. కావున నెల్లదేశముల విదితము లగుశబ్దములు మిక్కిలి యుండవు. స్వల్పసంఖ్య గల పదము లేవియైన నట్లున్నను నవి సుశబ్దములైననే కాని ప్రయోగార్హములు కావు. ఎట్టయిన వాని బ్రయోగించినను స్వల్పసంఖ్య గల వానితో గ్రంథరచన యనువుపడదు. వ్యవహారభాష యంతయుం బ్రయోగార్హమయ్యె నేని ప్రాచీననిబంధనము లన్నియు నిష్ప్రయోజనము లగును. గ్రామ్యము లెప్పుడును శ్రవణసుఖకరములు గావు, గ్రామ్యములు పండితుల చెవుల కింపుగా నుండు నవి కావని మున్ను వ్రాసితిని. కొందఱ చెవుల కవి యింపుగా నుండు నని వారు చెప్పినను బెక్కండ్ర యనుభవమునకు విరోధము. వానితో రసవత్తర కావ్యనిర్మాణ మసాధ్యము. రసాపకర్షమునకుం గారణము దోష మని యాలంకారికులు దోషలక్షణముం జెప్పి యప్రయుక్తమును గ్రామ్యమును దోషము లని యంగీకరించిరి. “ రసాపకర్షకా దోషాః ” యని విశ్వనాథ కవిరాజాదు

“హేతుంరసాపకర్షస్య బుధాదోషం బభాషిరే” యని సాహిత్యరత్నాకరుఁడును, “దోషః కావ్యాపకర్షస్య హేతుశ్శబ్దార్థగోచర” యని విద్యానాథుఁడుం జెప్పిరి. “రసాపకర్షద్వారా కావ్యాపకర్షహేతుర్దోష” యని కుమారస్వామి సోమయాజులు విద్యానాథుని శ్లోకమునకు రత్నాపణమున నర్థము వ్రాసిరి. మఱియును “అప్రయుక్తమపుష్టార్థం”........“క్లిష్టంగూఢార్థకం గ్రామ్య”మ్మని విద్యానాథుఁడును, “అసమర్థమపుష్టార్థం గ్రామ్యంచైవాప్రయోజకం”...... ......“వ్యర్థమశ్లీలనేయార్థక్లిష్టాసాధ్వప్రయుక్తిమ”త్తని సాహిత్య రత్నాకరుఁడును, దుశ్శ్రవం త్రివిధాశ్లీలానుచితార్థాప్రయుక్తతాః గ్రామ్యో஽ప్రతీత” యని విశ్వనాథకవిరాజును వీనిని బదదోషములలో లెక్కించిరి. “పామరవ్యవహారైకప్రసిద్ధం గ్రామ్య ముచ్యతే” యని గ్రామ్యమునకును, యదప్రయుక్తం కవిభి రప్రయుక్తం తదుచ్యతే” యని యప్రయుక్తమునకును సాహిత్యరత్నాకరమునందును గొంచె మెక్కువతక్కువగా నిట్లే తక్కినయలంకార గ్రంథములందును లక్షణములు చెప్పంబడెను. మఱియును గొన్నిదోషములనే చెప్పినవామనుఁడు సూత్రవృత్తియందు గ్రామ్యపదప్రయోగము దోష మని చెప్పి” లోకమాత్రప్రయుక్తం గ్రామ్య” మని దానిలక్షణము చెప్పెను.

ఇట్లిందఱు ప్రాచీనలాక్షణికు లగుమహాకవు లేకాభిప్రాయముతో రసాపకర్షహేతువు లనిచెప్పిన గ్రామ్యాప్రయుక్తపదములతో రసవత్తరకావ్య నిర్మాణ మెట్లు సాధ్య మగునని శాస్త్రులుగారు వ్రాసిరో చెప్పంజాలను. ఇట వారుదాహరించిన మాళవికాగ్నిమిత్రములోని శ్లోకమునకు “పురాణమిత్యేవన సాధుసర్వం నచాపి కావ్యం నవ మిత్యవద్య”మ్మని నాపాఠము. కాని “నవీన మిత్యేవనచాప్యవద్య”మ్మనికాదు. పాఠ మెట్లున్నను గవి దీని నేప్రసంగమున నుదాహరించెనో గ్రామ్యపదప్రయోగమునకుఁ గాని యప్రయుక్తప్రయోగమునకుఁ గాని యిది యెంత తోడ్పడునో విద్వాంసులు పరిశీలింప నర్హులు. తరువాత శాస్త్రులవా రొకవాక్యమును వ్రాసి పిమ్మట నూతన శబ్దములం బ్రయోగించిన నప్రయుక్తదోషము వచ్చునని శంకింపఁ గూడ దనియు నట్టిపదములు శీఘ్రముగ నర్థముం దెలుపం జాలవు గావున రసస్ఫూర్తికిఁ బ్రతిబంధక మనియె యది దోష మనువారి యభిప్రాయము గాని ప్రత్యవాయహేతు వని కాదనియు శీఘ్రముగ నర్థమును నూతనప్రయుక్తశబ్దములు తెలిపినచో నాదోషము లేదనియు వ్రాసిరి. ఏకవియు నెచ్చటం బ్రయోగింపనిపదములు శీఘ్రముగ నెట్ల

ర్థమును బోధించును ? గ్రామ్యాప్రయుక్తదోషభూయిష్ఠ మగుకావ్యమున రస స్ఫూర్తియెట్టిది ? లాక్షణికు లెల్లరు నిషేధించినవానిం బ్రయోగించిన నెట్లప్ర యుక్తదోషము లేదన వచ్చును ? మఱియుంగొన్నిశబ్దములె శుద్ధములె యు య్యు ననభిధానము (కవులుప్రయోగింపమి) వలనఁ ద్యాజ్యము లని వ్యాకరణ ము వలనం దెలియుచున్నది. శుద్ధశబ్దములును గవిప్రయుక్తములు కా వనుకార ణమునఁ ద్యాజ్యము లగుచుండఁగా వైయాకరణులచే నిషిద్ధములును, గవిప్ర యుక్తములు కానివియు నగుశబ్దములను బ్రయోగింపవచ్చునను వచన మెంత న్యాయ్యమో పండితులు పరిశీలింతురుగాక ! అప్రయుక్తాదిదోషములు ప్రత్య వాయహేతువులు గాకున్నను బ్రయోగార్హములు గావని ప్రాచీనమహాకవు లెల్లరు నిర్దేశించి రని విద్వల్లోకమునకుం దెలియని యంశముగాదు. "విరళాః పేచోషాదికశబ్దాః ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః, ఇహతు ప్రత్యాహార్యం సంకే తితసుప్రసిద్ధ మేవ పద"మని వాగనుశాసనులు సూత్రించిరి. (శబ్దశాస్త్రమం దభిమానము గలవారు లోకమునం బ్రసిద్ధములు గాని పేచోషాదిశబ్దములను సంస్కృతములో నొకానొకచోఁ బ్రయోగించినం బ్రయోగింతురు గాక ! ఈ తెలుఁగుభాషయందు నీశబ్దమున కీయర్థ మని సంకేతింపఁబడినదియు మిగులం బ్రసిద్ధ మగునదియుఁ బ్రామాణికులు ప్రయోగించినదియు నగుశబ్దమే ప్రయో గార్హము గాని యప్రసిద్ధ మట్టిది కాదని దీనియర్థము. "కావ్యంయశస" ఇ త్యాది శ్లోకమును గావ్యప్రకాశమున మమ్మటపాదులుచెప్పిరి. "పరివర్ధతే విజ్ఞాన" మిత్యాది పద్యమును బ్రతాపరుద్రీయమున విద్యానాథుఁ డుదాహ రించెను. "విశ్వోల్లంఘనజాంఘికీం వితనుతే కీర్తిం విధత్తే శ్రియ" మిత్యాది ప్రాచీన శ్లోకమును సాహిత్యరత్నాకరమున ధర్మభట్టు లుదాహరించి "మీమాం మాంస్యం పునరత్ర కావ్య మమునా సిద్ధ్యంతి కీర్త్యాదయ" యను పద్యమును రచించి "న కేవలం కావ్యం దృష్టార్థమేవ కింతు కీర్తిద్వారా స్వర్గాదిఫలక మపి కీర్తిం స్వర్గఫలా మాహు రాసంసారం విపశ్చిత ఇత్యుక్తత్వా"త్తని వ్రాసిరి. విశ్వనాథ కవిరాజు "ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ కరోతి కీర్తిం ప్రీతించ సాధు కావ్యనిషేవణ" మని సాహిత్యదర్పణమున నుదాహరిం చెను. వీని కన్నిటికిని సాధుకావ్య నిర్మాణాదు లిలోకమందలి సుఖమునకుసాధన మగుధనము మొద లగువానిని స్వర్గసాధన మగుకీర్తిని గలిగించునని ముఖ్యతా త్పర్యము. మఱియు "వామనుఁడుకావ్యం సద్దృష్టాదృష్టార్థం ప్రీతికీర్తి హేతు

త్వా” త్తని సూత్రించి దాని క్రిందను” ప్రతిష్ఠాంకావ్య బంధస్య యశస స్సరణిం విదుః అకీర్త్తివర్తనీం చైవ కుకవిత్వవిడంబనాం కీర్త్తింస్వర్గఫలా మాహురా సంసారంవిపశ్చితః అకీర్త్తించ నిరాలోక నరకోద్దేశదూతికా” మనుపురాతనశ్లోకము నుదాహరించెను. నిర్దోషమైన కావ్యము ప్రీతికిం గీర్తికిం గారణము కావున దృష్టఫలము నదృష్టఫలముం గావించునది యని సూత్రార్థము. సత్కావ్యనిర్మాణము కీర్తికిని దోషభూయిష్ఠ మగుకావ్యనిర్మాణ మపకీర్త్తికిం గారణమనియుఁ గీర్తి తా నున్నంతకాలము, స్వర్గఫలముం గావించుననియు నపకీర్త్తి నరకముం బొందించునదియనియు, శ్లోకార్థసంగ్రహము. ఏక శ్శబ్ద స్సమ్యజ్ఞాత స్సుప్రయుక్త స్స్వర్గే లోకే కామధుగ్భవతి” యను శ్రుతివాక్యము లోకప్రసిద్ధము. ఒకశబ్దమైనను బ్రకృతి ప్రత్యయవిచారపూర్వకముగఁ దెలియంబడినదియై ప్రాచీనానుశాసనమునకు విరోధములేకుండఁ బ్రయోగింపంబడినది యగుచు స్వర్గమునం గోరిన కోర్కులను బ్రయోగించువాని కిచ్చునని దీనియర్థము. శాస్త్రపూర్వకే శబ్దప్రయోగేఽభ్యుదయ స్తత్తుల్యం వేదశబ్దేన” యని మహాభాష్యోక్తియుం గలదు. శాస్త్రపూర్వకముగా నెవ్వఁడు శబ్దములం బ్రయోగించునో యతఁడు మేలు పొందును. వేదశబ్దములు నిట్లే చెప్పుచున్నవని దీనిముఖ్యార్థము. వీనినన్నిటిని బరిశీలించి యప్రయుక్తాదిదోషములతోఁ గూడిన గావ్యనిర్మాణము ప్రత్యవాయహేతు వగునో కాదో విద్వాంసులు నిర్ణయింప నర్హులు. దరువాత శాస్త్రులుగారు “కాన గ్రామ్యము లని యిదివఱకు నిరాకరింపఁబడె ననుభయమును విడచి సర్వజనవిదితములును నాగరకవ్యవహృతంబును రసానుగుణములు నగు నూతనశబ్దములఁ జేర్చి మహాకవులు గ్రంథములువ్రాయుట ప్రకృతకాలోచితమును భాషాభివృద్ధికరము నగును. ఆగ్రంథములు రసికులకు నాహ్లాదకము లగు నపుడు గ్రాహ్యములుకాక పోవనియుఁ బ్రాచీననిబంధనల కన్నిటికి లోఁబడినను రసికాహ్లాదములు కానిచో గ్రాహ్యము లని యుద్ఘోషించినను గ్రాహ్యములు కావనియు గ్రాహ్యత్వా గ్రాహ్యత్వములకు రసతదభావములే కారణములనియు “సదోషౌసగుణా” విత్యాది ప్రాచీనకావ్య లక్షణములనిరసించి “వాక్యంరసాత్మకంకావ్య” మని పరిష్కరించిన విశ్వనాథకవిరాజునకిదియే యభిప్రాయ”మనియు వ్రాసిరి. అట్టిశబ్దము లుండనేని సంస్కరించి ప్రయోగింపవచ్చునని మున్ను వ్రాసితిని.

ఇందు నిర్ణయముగా గ్రామ్యములు గ్రంథములలోఁ బ్రయోగింపవచ్చు

వని శాస్త్రులుగారు వ్రాసిరి. కాని గ్రామ్యప్రయోగము దుష్టమని ప్రాచీను లగు లాక్షణికు లెల్ల నిషేధించిరి. గ్రామ్యము నా నపశబ్ద మని వాగనుశాసనులు చెప్పినట్లు మున్ను వ్రాసితిని. ఆచార్యదండి కావ్యాదర్శమునందు "తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టంకథం చన, స్యాద్వపు స్సుందరమపి శ్విత్రే ణైకేన దుర్భగ"మ్మని వ్రాసెను. కావ్యమం దేకొలఁది దోషము ను పేక్షింపఁగూడదు. సుందర శరీరమైనను బొల్లియున్న దర్శనీయము గాదుగదా యని దీనిభావము. "అయాచకత్వ మగ్రామ్యపదాలాపః కథాస్వపి" యని కవికంఠాభరణమున క్షేమేంద్రుఁడు చెప్పెను. యాచింపమియుఁ గథలయందును గ్రామ్యపదముల నుచ్చరింపమియుఁ గవి కుండవలసిన గుణములలోని వని దీనియర్థము.

క. లక్షణవిరహితకావ్యము, పక్షిగమన గ్రామ్యమనఁగఁ బడునది పెద్దల్
వీక్షింపరు లక్షణయుత మీా, క్షితి నగ్రామ్య మని గ్రహింతురు ప్రీతిన్.

గీ. క్షితినపభ్రంశపదములు గృతులయందు, గమలలోచన ఛెప్ప నర్హములుగావు
గాన నాంధ్రకవీంద్రులువానిఁదెలియ, వలయునీశాస్త్రమునఁ దమతలఁపు నిలిపి.

గీ. చులుకగా గ్రామ్యజనములు వలుకునట్టి, తెనుఁగుమాటలు గ్రామ్యంబులనఁ గఁ బడియె
వర్ణలోపంబు నొందికావ్యములఁజొరవు, పరులఁ జెగడెడుచోనొప్పుఁబాలదొంగ.

అప్పకవీయము. ఆ. 1.

వెనుకను గ్రామ్యప్రయోగము దుష్ట మని చెప్పినవా రనేకులు గల రని వ్రాసితిని. అపశబ్దప్రయోగ మట్లుండ దాని వినికిలి సైతము ప్రాచీనులు నిషేధించిరి. "శ్రుతేఽపశబ్దే స్వోక్తేషు ప్రమాదాత్ పాణినిం స్మరేత్, అథవా ఫణి నామీాశం చింతయే ద్భహుశో బుధః, ప్రాకృతే మద్విధే చాపి వాల్మీకిం వామహేశ్వరం ధ్యాయే దత్రతు మామేవ స్మరే త్పండిత సత్తమ" యని యాథర్వణుఁడు నికృతివివేకమునం జెప్పెను. పండితుఁడు ప్రమాదమున సంస్కృతభాషయం దపశబ్దములు వినెనేని పాణినిని గాని పతంజలినిగాని స్మరింపవలెను. ప్రాకృతాదిషడ్భాషలయం దట్లయ్యెనేని వాల్మీకిని గాని శివునిగాని స్మరింపవలెను. తెలుఁగుబాస యందపశబ్దములు వినెనేని నన్నుఁదలంపవలె నని దీని యర్థము. అపశబ్దములు విన్నను మహాపురుషస్మరణము నిట్లు విధింపఁగాఁ దత్ప్రయోగము నిర్భయముగాఁజేయ వచ్చునని యెట్లు శాస్త్రులుగారు వ్రాసిరో యెవ్వరు చెప్పఁగలరు? "అదోషౌ" విత్యాదిలక్షణమును విశ్వనాథ కవిరాజు

తనబుద్ధి చాతుర్యముం బ్రకటింపం దలంచి వేఱులక్షణము చేయం బూని కొన్ని యుక్తులం జెప్పి నిరసించెను గాని దుష్టము లగు గ్రామ్యాప్రయుక్తములం బ్రయోగింపవచ్చు నని తలంచి కా దని శపథపూర్వకముగాఁ జెప్పవచ్చును. ప్రయోగింప వచ్చు ననునభిప్రాయముచేతనే రసాత్మక మగువాక్యము కావ్యమని చెప్పినేని యాయన లక్షణగ్రంథమునందుఁ గావ్యస్వరూపనిరూపణముఁ జేయుచో “దోషా స్తస్యాపకర్షకా” యని దోషస్వరూపముం జెప్పి దోషప్రకరణము ములో గ్రామ్యాదు లగు పెక్కుదోషములం జెప్పి వాని కుదాహరణములం జూపి చివర “గ్రామ్యత్వ మధమోక్తి”ష్వని (నీచులు మాటలాడు నపుడు గ్రామ్యప్రయోగము దోషము కాదని యేల విభజించి చెప్పవలయునో శాస్త్రులువారు తెల్పవలయును. మీఁద నే నుదాహరించిన ప్రాచీనవాక్యములం బరిశీలింపఁగా గ్రామ్యాప్రయుక్తాదులకు గ్రంథప్రయోగార్హత యేకాలఁదియు లేదని స్పష్టము. మఱియు శాస్త్రులుగారు గ్రామ్యములం బ్రయోగింపవచ్చునని యుపదేశించిరిగాని యేలొకో వారీయుపన్యాసమున నట్లుపయోగింప రైరి. పిమ్మట శాస్త్రులు గారీవిషయమును ముగించి యసభ్యవర్ణనము లనునొకయంశమును గూర్చి యుపన్యసించుచు శృంగారప్రబంధములు గల వనియు నవి వ్యంగ్యమర్యాద ననుసరించునంతవఱకు సరసములనియు, వ్యంగ్యమర్యాద నుల్లంఘించిన వైరస్యముం బుట్టించు ననియు నొక్కొకయంశ మొక్కొకకాలమున నాహ్లాదకర మైనను గాలాంతరమున జుగుప్సాకరమనియుఁ గొన్నికాలములలోఁ గొందఱు ప్రధానపురుషు లతికాముకు లై యుండఁ దదనుయాయులు వారి ప్రీతికై యౌచిత్యమును వదలి వారియుద్దేశానుసారముగ మార్గవమును మించిన శృంగారవర్ణనలం జేయుచు వచ్చిరనియుఁ జెప్పి తరువాత నేమేమియో వ్రాసి కాలక్రమమున నది కవితాధర్మ మని యెంచి జుగుప్సాకరము లైన యంశముల వర్ణించి రనియు, నీకాలమున స్త్రీవిద్య యభివృద్ధినొందు చున్నదనియు, నిట్టి కాలమున నాగరకతగలవారి కేవి యేవం బుట్టింపదో యట్టివర్ణనలు గావింపవలయు ననియు నభిప్రాయము గల వాక్యములను వ్రాసిరి. ఇందుఁగొంత వాస్తవమే యైనను మహాగ్రంథములయందు వీరు సెలవిచ్చినంత శృంగారాధిక్యము లేదు. ప్రబంధములందును బెక్కండ్రుకవులు పెక్కుచోట్ల శృంగారమును మృదువుగ నే వర్ణించిరి. కొన్నిచోట్ల నెక్కుడుగా శృంగారవర్ణనము లుండినను వానియందుఁ బ్రేమలేనివారు వానిని విడిచి తక్కినయంశములనే చదువుకొను

వచ్చును. శృంగారమునం దేమియు నిష్టములేని వారట్టి కావ్యములం జూడఁ బోక భగవద్గీతాది గ్రంథములనే చదువవచ్చును. రసనిరూపమునమున నాలంకారికు లది బ్రహ్మానందసహోదర మని చెప్పిరి. మఱియుఁ గొన్ని గ్రంథములందు శృంగారమే ప్రధానముగా నుండవలయు నను నియమము ప్రతాపరుద్రీయాదులందుఁ గానంబడుచున్నది. పూర్వమునందుఁ గొందఱు ప్రధానపురుషులు శృంగారగ్రంథాసక్తులైనం గావచ్చును గాని వారతికాముకు లన న్యాయ్యము గాదని తోఁచును. శృంగారమును వర్ణించిన కవులుగాని యట్టిప్రబంధాసక్తులైన ప్రభువులుగాని యతికాముకు లనునియమము లేదు. కాముకులు గానివారును రసాసక్తులును వర్ణనలుగావించు కవులును గావచ్చును. ప్రధానపురుషుల ప్రీతికై కొందఱు కావ్యములు వ్రాసినను నదియొక యపరాధము గాదు. అప్పుడును బ్రధానపురుషుల ప్రీతికై తమకిష్టములేని విషయములను గ్రంథములు వ్రాయు వా రుండవచ్చును. ప్రధానపురుషుల ప్రీతికై శృంగారగ్రంథములు చేసినవా రటుండ నేవారినాశ్రయింపనివాఁడును నెల్లకవులకు నాశ్రయమును వదాన్యాగ్రేసరుఁడును బాతంజలయోగసూత్రములకు వ్యాఖ్యాతయుఁ బండితకవిశ్రేష్ఠుఁడు నగు శ్రీభోజమహారాజు "రస్యతే స్వాద్యతే" యనువ్యుత్పత్తిచేత సుఖమే యనుభవింపం దగినది గావున సుఖాస్వాదరూప మగు శృంగారమే రసశబ్దార్థమనం దగును; దుఃఖానుభవముతోఁ గూడిన కరుణాదులకు రసశబ్దార్థత్వమే సంభవింప దనునభిప్రాయముతో "వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధి స్సిద్ధాకుతోఽపి వటయక్షవ దావిభాతి, లోకేగతానుగతికత్వవశాదుపేతా మేతాంనివర్తయితు మేష పరిశ్రమోనః. "శృంగారవీరకరుణాద్భుత... రస మామనామ" యని రసప్రకాశమునం జెప్పి శృంగార రసాసక్తిం జూపెను. రసము లనిలోకమునఁ బ్రసిద్ధము లైన వీరాద్భుతాదులయందు మఱ్ఱిచెట్టుపైఁ బిశాచ మున్నదనునట్లిదొయొక కారణమున రసప్రసిద్ధి కలిగినది. గతానుగతికన్యాయమున నంగీకరింపంబడిన యీయంశమును నివారించుటకే యీపరిశ్రమము మాకయ్యెను. శృంగారాదు లగుపదిరసములు కల వని కొందఱు చెప్పిరి. ఏని యనుభవము వలన శృంగార మొకటియేరస మని తలంచెదమని దీని యర్థము.

కవిశిరోభూషణమున నహోబలపతి "సాధ్యోహిరసోయథాయథ" మిత్యాది సూత్రవ్యాఖ్యానము "తత్తద్రసోచిత ప్రదేశేషు తత్తదుచితవిభావాది

సామగ్రీధురీణవచనరచనయా సంస్కృతకావ్యే దేశభాషాకావ్యేవా తత్తద్రసస్య సాధన మేవ కవీంద్రాణాం స్వభావో లోకప్రసిద్ధ” యని చెప్పెను. మహాఋషియు లోకోపకారమునకై పురుషార్థసాధనమైన కావ్యమును మొదట నిర్మించినవాఁడు నగువాల్మీకియు, నతఁడువలెనే పెక్కుపురాణములు రచించిన వ్యాసమహర్షియు శృంగారవర్ణనలు గావించిరి. ఇందలి కొన్ని పద్దెము లొక రొకరికిం జదివి చెప్ప సంశయింపం దగినవియుఁ గలవు. మఱియుం గాళిదాసాదులు రచియించిన గ్రంథములందు నట్టి వర్ణనలు గలవు. భాణములందును, బ్రహసనములందుఁ గల వర్ణనములు పెక్కండ్రకు సువిదితములు. వీరిలో నెవ్వరుం బ్రధానపురుషుల ప్రీతి నపేక్షించినవారు కారని యెఱుంగనివారు లేరు. ఇట్లుండఁగాఁ దెనుఁగు నందుఁ గొందఱు ప్రధానపురుషుల నతికాముకుల సంతసింపఁజేయఁ దలంచి తదనుయాయులు శృంగారము మిక్కిలి వర్ణించి రనునది యెంతసమంజసమో నిష్పక్షపాతులు తెలియుదురుగాక !

మఱియు నెవ్వరిప్రీతి నపేక్షింపనివారు నెల్లవారికి సేవింపందగినవారు బ్రహ్మచర్యమునుండియే తురీయాశ్రమమును గ్రహించినవారు నగు శ్రీ శంకరభగవత్పాదులును గొన్ని శృంగార రసస్ఫోరక మైనవర్ణనలు గలపద్యములను రచియించిరి. వత్సలము స్నేహము భక్తియు ననునవివేఱు రసములని కొందఱును విషయభేదమున వానికి రతిభావమునునే యంతర్భావ మని కొందఱు చెప్పుదురు. “శృంగారప్రాధాన్య మియర్తిప్రాప్నోతి” యను వ్యుత్పత్తిచే నిది రసములలోఁ బ్రధాన మనియుం జెప్పఁబడియె. కావ్యమునకు రసము జీవిత మని పెక్కం డ్రాలంకారికులు నిర్వివాదముగాఁ జెప్పిరి. కాఁబట్టి యెల్లకావ్యములను రసవర్ణన మావశ్యకము. అందు శృంగారము రసికజనప్రీతికర మని కొందఱు తలంచి యట్టికావ్యముల రచించిరి కాని వేఱభిప్రాయమునఁగాదు. స్త్రీవిద్య యీదేశమునం జిరకాలమునుండి యున్నది కాని నేఁడు క్రొత్తగా వచ్చినది కాదు. బృహదారణ్యకమునందలి మైత్రేయీబ్రాహ్మణమును గార్గీయాజ్ఞవల్క్యసంవాదము నీయంశమును స్థిరపఱుచును. సీతామహాదేవి మొద లగువారు చదువుకొన్నట్లు రామాయణమువలనం దేటపడును. భారతమును నీయంశమును బలపఱుచుచున్నది. భోజచరిత్రమున గ్రంథరచనము గావింపఁగల సీతాదు లగుస్త్రీలు పెక్కండ్రున్నట్లు తెలియును. బృహత్కథాసరిత్సాగరమునందు సాతవాహనునిభార్య మహావిద్వాంసురా లని చెప్పంబడెను. మఱియు మోహనాంగి యను పేరుగల కృష్ణదేవరాయనికూఁతురు మా

రీచపరిణయమును, గుమ్మరమొల్ల రామాయణమును, దరిగొండ వెంగమ్మరాజ యోగసాగరమును వెంకటాచల మహాత్మ్యమును రచించిరి. మొల్లరామాయణా దులయందుఁ గొన్ని శృంగారవర్ణనలును గాన్పించుచున్నవి. అయిన నసభ్యవర్ణన ములని పెద్దలు నిర్ణయించినవాని నైనను గ్రంథమునుండి తొలఁగించిన వికృతి కలుగును గావున నట్లుచేయక ముందు గ్రంథముల రచియించెడువారు వానిని విడి చినను విడువవచ్చునని తలఁచెదను.

పిమ్మట శాస్త్రులుగా రర్థానుస్వారము నుద్దేశించి భాషాస్వరూపముం జెప్పి మహాభాష్యమునుండి శబ్దస్వరూపముం జెప్ప కొన్నివాక్యముల నుదాహరించి కొన్ని వాక్యములువ్రాసి ప్రకృతకాలమున నుచ్చారణభేదజ్ఞాపకము గాదు కావున నర్థానుస్వారరేఖ యనావశ్యక మని సెలవిచ్చిరి. మీఁద వారు వ్రాసిన వాక్య ముల కన్నిటికి నిదియే ముఖ్యాభిప్రాయ మని నాకుఁ దోఁచినది. అర్థానుస్వార ము చ్చారణకు సాధ్యమైనను గాకున్నను నుచ్చారణభేదజ్ఞాపకము కాక పోదని తలంచె దను. వేఱుగా నుచ్చరింపఁదగిన శబ్దము కాదుగాని యిది యొకయక్కరమని "ష ట్త్రింశ ద్యత్ర తేన్యేచానుప్రవిశంతి శబ్దయోగవశాత్, ద్వివిధాదిదు దేతోచోవక్ర తమాచాప్యనుస్వారాచ" యను నన్నయభట్టారకుని సూత్రములవలనం దెలియు ను. (ఈ భాషయందు ముప్పదియాఱువర్ణంబులు గలవు. మఱికొన్ని తత్సమాదు లం గలసి యిందుఁ జేరుచున్నవి. అందు అఆ ఇఈ ఉఊ ఎఏఐ ఒఓఔ ఁ ం అను పదునాలు గచ్చులని సూత్రముల యర్థము.) వర్ణమాతృకలోని వర్ణములనేభాష లోను విడిచినట్లుగాని విడువవలసిన యావశ్యకభావ మున్నట్లుగాని కాన్పింపదు. ఇది శబ్దము కానప్పుడు శబ్దస్వరూపమును బోధించు భాష్యగ్రంథ మిట నుదాహరింపఁ బని యున్నట్లును దోఁపదు. ఉచ్చరింప నసాధ్యములైనను సంస్కృతాది శబ్దము లకుఁ గలరూపభేదములు కౌముదియందు నిరూపింపఁబడినవి గాని విడువంబడలేదు. ఉచ్చారణమునందు భేదము లేకున్నను "సు ద్ధ్య్య పాస్య" యను చోట నొక ధకా రము నొక యకారము గలదియును రెండు ధకారములు రెండు యకారములు గల దియు, నొక ధకారము రెండు యకారములు గలదియు, నొక యకారము రెండు ధకారములు గలదియు నగురూపములును గౌముదియందుఁ జెప్పంబడినవి కాని విడువం బడలేదు. "విచారింప నీ యర్థానుస్వారము కొన్నిచోట్ల నర్థవిశేష ప్రతీ తికి సహకారి యగుచున్నదనియుఁ బుస్తకములను జూచువారి కది యుపయోగకర మైన నొక రుచ్చరించు దానిని వినువారి కీరేఖ యేమియు నుపయోగింప లేద"ని

యు శాస్త్రులుగారు వ్రాసి "ఉచ్చారిత ఏవశబ్దః ప్రత్యాయకో నానుచ్చారిత" యను భాష్యపఙ్క్తుల నుదాహరించి "పుస్తకమును జూచువారికిని నుచ్చారణ లేనపుడు డర్థప్రతీతి యుండదు గావున నుచ్చారణ భేదగ్రాహకము గాని యీయ ర్థానుస్వారానుమాపక రేఖ యందఱకు నుపయోగ శూన్యమే యని చెప్పవచ్చు" నని వ్రాసిరి. వినువారికి నుపయోగము లేకున్నను జూచువారికి స్థూలోచ్చారణ ము లేనపుడును నర్థప్రతీతి కలదు. గావున వాని కుపయోగము లేదన రాదు. ఇది తక్కిన యక్షరములువలె వేఱుగా నుచ్చరింపందగినది గాక మఱియొక యచ్చునకుం దరువాత నుచ్చరింపం దగినది యనునియమముచే నొకశబ్దములోనుండునది గాని ప్రత్యేకముగా శబ్దముగాదు గావున నుచ్చరింప సాధ్యము గాకున్నను భేదగ్రాహక ము కాక పోదని తలంచెదను. తరువాత "నర్థానుస్వారరేఖ పూర్వాచ్చు ననునా సికముగా నుచ్చరించుటలో సాయపడుననియు దానిని బట్టి యాయచ్చు విశేషార్థ ప్రతీతిలో సహకారియనియు దానివలన దీనియుపయోగము స్పష్టమగునని శంకింప వచ్చు"ననియు వ్రాసి యట్లు స్పష్టోచ్చారణముండిన కాలములో నది సార్థకమైనను నట్టి యుచ్చారణములేని యీకాలమున నది నిరర్థక మనిచెప్ప సందేహములేదను గ్రంథమును వ్రాసిరి. అర్థానుస్వార రేఖ కర్థవిశేషమును దెలియఁజేయుశక్తి కలప్పు డది కొంత యుచ్చరింపమాని రనుకారణమున నట్టిది కాక పోదని తోఁచును. అర్థాను స్వారతత్త్వమునందు "సానుస్వారము లగు మహారాష్ట్రభాషలోని కొన్ని య క్షరముల నుదాహరించి యిట్లే తెలుఁగునం దర్థానుస్వార ముచ్చరింపవలె"నని యు న్నది. మఱియు దానియందే యీయుచ్చారణము (అర్థానుస్వారోచ్చారణము) "బ్రాహ్మణులలోను జదువుకొన్నవారిలోను లేకున్నను నితరులలోఁ బలుమాఱు వినంబడుననని" వ్రాయంబడియున్నది. మఱియును దానియందే "యీకాలము నందు మనలనేలెడి యాంగ్లేయుల భాషను ధ్వన్యాత్మకభాషయందు తేనియక్షర ములను వ్రాయునపు డుపయోగింతురు. ఈ యశాస్త్రమైన సాంప్రదాయముచే భాషమిక్కిలి చెడిపోయినదానిచేత (చెడిపోయిన దగుటచేత నని యర్థము.) దాని నేర్చువారి కతిప్రయాసమగుచున్నది. అట్లయినప్పటికిని జక్కఁగాఁ జదివిన గుణ గ్రాహులైన పండితులును పైఁజెప్పిన మూఢసాంప్రదాయమును విడువక యున్నా ర"ని యుచ్చరింపని యక్షరములు వ్రాయవలసిన యింగ్లీషుపదములఁ గొన్నిటి నుదాహరించి "సకలవిషయములను జక్కఁగాఁ దెలిసి విమర్శించి గుణగ్రహణము చేయునట్టి యాంగ్లేయవిద్వాంసులును నంథపరంపరాప్రాప్తమైన సంప్రదాయ

మును విడువకయుండగాఁ దెనుఁగువారలు మాత్రము ప్రాచీనకాలమునుండి తమ భాషలోనుండు నర్ధానుస్వారము నెందుకు విడువవలయు"ననియు "నదియునుం గాక యీయర్ధానుస్వారము శబ్దములయుత్పత్తిని భిన్నస్వరూపములైన శబ్దముల పరస్పరసంబంధమును దెలియ ననుకూలమై యున్నదనియు నిట్లర్ధానుస్వార ముచ్చరింపఁబడకపోయినను బలుదెఱంగుల నుపయుక్తమగుటచే దానిని విడుచుట యుక్తము కాదనియు నిది కచేరీమొదలగువానియందుపయోగించు టనావశ్యకమైనను బండితులకు విద్యార్థులకు నత్యావశ్యకమైనద"నియు వ్రాయంబడియున్నది. మీఁద వ్రాసిన గ్రంథమువలన నర్ధానుస్వారము విడువరాదని యెల్లరకుం దెల్లమగుచున్నది. తరువాతను శాస్త్రులుగా రనునాసిక పాఠపరిభ్రంశమాంధ్ర భాషలోనే కాక సంస్కృతభాషలోను నున్నట్లు కానవచ్చుచున్నదని వ్రాసి "హారాం స్తారాఞ్చక్రింస్త్రాయస్వ సంస్కృతం" మొదలగు లక్ష్యములలోఁ బ్రథమవిహితమైన యనునాసికమును విడిచి తదభావపక్షమున విధింపఁబడిన యనుస్వారఘటితరూపము లే కవులచే వ్యవహరింపఁబడుచున్న వని వ్రాసిరి. అట్టిచోట్ల ననుస్వారానునాసికములలో నేదియైన నుండవచ్చును గావునఁ గవులు చదువువారికి శ్రమలేకుండుటకై యనుస్వారపాఠము నుపయోగించుచున్నారుగాని యనునాసికముగల రూపములు వ్యాకరణమున వ్రాయంబడి యున్నవి. విడువంబడలేదు. మఱియుఁ దరువాత ననునాసికపాఠము భ్రష్టమైనట్లు శేఖరములో "ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః" యనుదానివ్యాఖ్యానావసరమున నాగేశోపాధ్యాయులు చెప్పిరనియు నర్థవిశేషముం దెలుపునది యయ్యుఁ ద్రైస్వర్యపాఠము లౌకిక సంస్కృతభాషలయందు భ్రష్టమైనట్లనుభవములో నున్నదనియు ననునాసికపాఠపరిభ్రంశము లోకమునం దేకాక వేదమునందుఁ గానవచ్చునట్లు తైత్తిరీయ ప్రాతిశాఖ్యలో 15 వ యధ్యాయములోని యొకటి రెండు సూత్రములను తదితరస్థలములందును బెక్కుచోట్ల గానవచ్చుచున్న దనియు వ్రాసిరి. మీఁదవారు వ్రాసిన యంశముల నన్నిటిని నంగీకరించినను దెనుఁగుబాసయం దర్ధానుస్వారమును విడువవలసినట్లు తోఁపదు. మఱియు నెవరెట్లు నిషేధించినను వేదమునందును భాషయందును గూడ ననునాసికపాఠమున్నట్లు తెలియుచున్నది. "స్వరేణార్థనిశ్చయో వేద ఏవ నకావ్యే" యని యాలంకారికులు చెప్పుటచే త్రైస్వర్యపాఠము భాషయందు నిష్ప్రయోజనము గావున విడచినను విడువవచ్చును. తరువాత శాస్త్రులుగా రిట్లుచ్చారణ భ్రంశమగుటచే నుచ్చారణములో భేదము లేనపుడర్ధానుస్వారాను మాపక రేఖ శ్రమ

మాత్రఫలకమని పండితులకు 'దోషక పోదని వ్రాసిరి. కొందఱు దీని నుచ్చరింప కున్నను బెక్కండ్రు కొన్నియాంధ్రదేశ భాగములయం దుచ్చరించుచుండగా విను చున్నాము కాఁబట్టి యుచ్చారణ భేదము లేదనరాదు. వెనుక వ్రాసిన కొన్నిప్ర యోజనములు కనఁబడుచున్నవి కావున దానికి శ్రమమే ఫలము కాదని తెలియు చున్నది. మఱియు నర్ధానుస్వారము వాక్యములోఁ గర్మకర్తృ విభాగముచేయు టకుఁ గొన్నిచోట్ల నుపయోగించును; గాన దీనికి శ్రమమే ఫలమని తలఁచుట యుక్తము కాదని తోఁచును. తరువాత నింక నీయర్ధానుస్వారము శాస్త్రబోధిత మగుటచేతఁ బరిత్యజించుట యుచితముకాదని కొందఱు శంకింప వచ్చునుగాని యార్యులచే మూర్ధన్యభాషగా నంగీకరింపఁబడిన సంస్కృతభాషలో వర్ణద్విత్వ మును బోధించు పాణిన్యాదిమ నిశ్చితశాస్త్రమునకు "నహి వ్యంజనాత్పరస్యైకస్యా నేకస్యవా ఉచ్చారణేవిశేష" యను భాష్యకార ప్రత్యాఖ్యానమువలన నుచ్చారణ విశేషము లేనప్పు డట్టివర్ణలేఖనముగాని దానిని బోధించుశాస్త్రము గాని పరిత్యా జ్య మని సూచింపఁబడియున్నందున నట్టిపరిత్యాగము దోషముకాదని చెప్పవచ్చు నను నర్థము గల గ్రంథమును శాస్త్రులుగారు వ్రాసిరి. శాస్త్రవిహితమైన యర్ధాను స్వారము సూచనసేయుగ్రంథసహాయమునఁ బరిత్యాజ్య మని చెప్పనవకాశములేదు సంస్కృతమునందు ద్విత్వవిధాయక శాస్త్రమును భాష్యకారులు ప్రత్యాఖ్యానము చేసిన నాశాస్త్రవిదుల కందఱకదియే సమ్మతమైనట్లు కాన్పింపదు. అట్లంగీకరింపఁ బడినేని భాష్యకారుల తరువాతి వారా శాస్త్రమును విడువవలసి యుండును. తరు వాతి వారాశాస్త్రమును వారిగ్రంథంబులం జెప్పియున్నారుగాని విడువలేదు. భా ష్యకారులు ప్రత్యాఖ్యానము చేయుటచే నాభాషయందు ద్విత్వవిధాయక శాస్త్ర మును బరిత్యజించినఁ బరిత్యజింపవచ్చును, గాని యాభాషయందు ద్విత్వవిధా యక శాస్త్రప్రత్యాఖ్యాన మీభాషలో నచ్చతెలుఁగుననే వాడంబడునదియు నే లాక్షణికులచే నిషేధింపంబడనదియు సప్రయోజనము నగు నర్ధానుస్వారమును నిరా కరింపం జాల దని నుదృఢముగాఁ జెప్పవచ్చును. అర్ధానుస్వారము లోపించిన య క్షరములకు నాదేశమని యభియుక్తులు చెప్పుదురు. మఱియు నీ వాక్యమర్ధాను స్వారతత్త్వము నందునుం గలదు. ఆదేశమును విడిచిన స్థానిజ్ఞానము దుశ్శకము. అర్ధానుస్వార మున్నప్పు డొకయర్థమును లేనియప్పు డింకొకయర్థమును దెలుపు శబ్ద ములుకొన్ని యీభాషయందుఁ గలవు. వానియర్థభేదజ్ఞానము రెండర్థములు గల శబ్దముల యందు వలెనే ప్రకరణాదులవలనం గల్గునని శాస్త్రులవారు వ్రాసిరి.

కాని ప్రకరణాదులకంటె శీఘ్రముగా బోధించునదియుఁ బూర్వసిద్ధము నగునర్థానుస్వారమును విడిచి వాని నవలంబించుటకుం దగినకారణ మేమియుఁ గాన్పింపదు. శాస్త్రులవారు తరువాత నిట్లే శకటరేఫ మనావశ్యక మని యూహింపఁదగునని వ్రాసి యాలోచింపఁగా నీ శకటరేఫార్థానుస్వారములు భాషాచరిత్రమును దెలిసికొనుటకుఁ గొంతసహాకారు లగుచున్నవి కాని యీయుపయోగము ప్రస్తుతమునందు నాంధ్రవ్యాకరణమువలన సిద్ధించు ననియు నట్లు సిద్ధింపనివిషయములలోఁ బ్రకృతకాలమున నెవరైన విద్వాంసులు వానివలనఁ దెలియందగిన చరిత్రగ్రంథ మొకదానివ్రాసి మిగిలినవారినిరర్థకశ్రమమును దగ్గించినచో వారియుపకారము సర్వజనశ్లాఘనీయ మనివ్రాసి యీయంశమును ముగించిరి. అర్థానుస్వారశకటరేఫములవలన నొక్కింతయుపకార మున్న ట్లొప్పికొన్నవారై శాస్త్రులవారు వ్యాకరణమువలనఁ గొంతసిద్ధించు ననుచున్నారు. కాని యది యిట్టి దని నిరూపింపలేదు. మఱియు వానివలనం దెలియం దగిన చరిత్రము నెవ్వరైనను వ్రాసినతరువాత నాగ్రంథమువలన నెంతయుశ్రమముగా నాచరిత్రబోధపడునో తెలిసికొని యైన వాని నిరాకరింపవచ్చునని చెప్పవలెను గాని ముందెప్పుడో యెవరో వానివలనం దెలియు చరిత్రమును వ్రాయుదు రను నభిప్రాయమున నిప్పుడే వాని వదలవలయు నని యెట్లు చెప్పిరో దుర్గ్రాహము మీఁదటియంశములను విద్వాంసులు పరికించి తెలుఁగుభాషపుట్టినప్పటినుండి యున్నవియు, సప్రయోజనములు తెలుఁగుగ్రంథములలో నెక్కడ నిషేధింపఁబడనివియు నగునర్థానుస్వారశకటరేఫములను విడువవలయు ననునంశము తగినదో కాదో నిర్ణయింతురు గావుత. పిమ్మట శాస్త్రులువారు సంధివిషయమై కొన్నివాక్యములను వ్రాసియుపన్యాసమును ముగించిరి. సంధివిషయములో మొదట వా రేమివ్రాసినను గడపట నిప్పుడున్న ట్లుండవలయు నని యొప్పికొన్నవారు గావున వ్రాయవలయు విశేష మేదియు లేదని తలంచెదను.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,

పురాణపండ, మల్లయ్యశాస్త్రి.

# కృతి విమర్శనము.



చెన్నపురాయుర్వేద కలాశాలాధ్యక్షులు వైద్యరత్నబిరుదాంకితులునగు పండిత గోపాలాచార్యులుగారు మాపరిషత్పుస్తకాలయమున కొసంగిన యాయుర్వేదాశ్రమ గ్రంథమాలలోని పుస్తకములను సానందముగాఁ జూచితిమి. ఇందు—

(1) మాధవనిదానము :—సంస్కృతంబున వన్నె కెక్కియున్న యీ యుత్తమపుస్తకమున కాచార్యులవారు సుబోధకమగు తెలుఁగు టీకవ్రాసి యచ్చొత్తించి యాంధ్రదేశమందలి వైద్యులకు మహోపకార మొనరించిరని మానమ్మకము. ఇందు సర్వరోగములను వాని లక్షణములనుబట్టి చక్కఁగాఁ గనిపెట్టుట సులభశైలిని వివరింపఁబడినది. 486 పుటలు గలిగి చక్కనిబైండు చేయఁబడిన యీపుస్తకము వెల రు. 3—0—0 మాత్రమే.

(2) అర్కప్రకాశము:—సంస్కృతంబున రావణుఁడు రచించినట్లుగానున్న యీ గ్రంథమున కాచార్యులుగారు విపుల మగు తెలుఁగువ్యాఖ్యానము వ్రాసిరి. ఇందు నెల్లయోషధులనుండియు ద్రవము తీయుపద్ధతి సులభముగా బోధింపఁబడినది. మఱియు నిందుద్రవము తీయునట్టి యర్కయంత్రముయొక్క పటముగూడ ముద్రింపఁబడి యర్కము తీయుమార్గమంతయు సంగ్రహముగా నక్కడ వివరింపఁబడినది. వేయేల? ద్రవము తీయుపద్ధతి యెఱుంగని తెలుఁగువైద్యుల కిది యత్యంతము సహాయకారిగాఁ గలదు. దీనివెల రు. 2—0—0.

(3) భేషజకల్పము :—ఇది నాలుగాశ్వాసముల యాంధ్రపద్యకావ్యము. సంస్కృతమున, సంకలన వైద్యగ్రంథమగు దీనిని వెంకటాచార్యుఁడను నాంధ్రకవి యాంధ్రీకరించెను. కాని యిది యాంధ్రదేశమున నింతవఱకు వన్నెగాంచకపోవుటయేకాక మూలమాత్రమున లోకమునకుపకరించునట్లుగాఁ గూడలేదు. అట్టి యీవైద్యకోశమునకు నాచార్యులుగా రధిక్రశ్రమచేసి పూర్వోత్తర విరోధములను సవరించి మంచి తెలుఁగు టీకవ్రాసిరి. ఇందు నోషధులు, వానిదేశములు, వాని కాలములు, ఔషధశాలలు మానములు, వాని వినియోగములు, స్నేహాదుల పాకములు మొదలగునవి వివరింపఁబడినవి. మూలవ్యాఖ్యానములు రెండునాంధ్రమం

దేయుండుటచేతను వివిధములయిన మునిమతము లిందుదాహరింపఁబడియుండుట చేతను నిది తెలుఁగువైద్యులకుఁ గల్పకల్పమనఁదగును. దీనివెల రు. 1—0—0.

(4) పథ్యాపథ్యము:—ఇందురోగములను దెలిసికొనుట, వానికిఁ దగిన చికిత్సచేయుట రోగులుచేయఁదగిన పథ్యములు మొదలగు నంశములు తెలుపఁబడినవి. దీనివెల. రు 1—0—0.

(5) ఆయుర్వేదపరిభాష:—ఇందు వైద్యశాస్త్రమందలి యెల్లపరిభాషల నొక్కచోఁజేర్చి వైద్యముచేయు నెల్లరకు నే విషయంబునను సంశయములేకుండఁగా నుండునట్లాచార్యులుగారు చేసిన శ్రమకొని యాడఁదగియున్నది. దీనివెల రు. 1—8—0.

(6) ఆయుర్వేదము. (7) అగస్త్యవైద్యము. (8) ఆయుర్వేదాంగశల్య తంత్రము. (9) వస్తికర్మము.

ఈనాలుగును వైద్యరహస్యములను దెలుపుచు వైద్యులకు సహాయమొనరింపఁదగి యున్నవి. ఒక్కొక్కదానివెల రు. 0—4—0 మాత్రము.

---

బాలనీతి:—ఇది, సికిందరాబాదులో మహబూబు కాలేజిలో నాంధ్ర పండితులుగానున్న చివుకుల, అప్పయ్యశాస్త్రిగారు రచించినది. ఇందు భగవద్భక్తి, మైత్రి, పరోపకారము మొదలగు వానిఁదెలుపు వ్యాసములు సులభశైలిని వ్రాయఁబడినవి. కావున నిది బాలురకుపయోగించునని మాయాశయము.

దీనివెల. రు 0—8—0.

---

# ప్రకటన.

---

## ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజారావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్-వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

ఆగ్రాసనాధిపతి:—

శ్రీపిఠాపురమురాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం.ఏ., బి.ఎల్.
,, ఆచంట లక్ష్మీపతిగారు, బి.ఏ., ఎం.బి., సి.ఎమ్.
,, నెమలి పట్టాభిరామారావు పంతులుగారు, బి.ఎ.

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి.ఐ.ఇ.
రావుబహదూర్ పిట్టి త్యాగరాయ సెట్టిగారు, బి.ఏ.

కార్యస్థానము.

2/7 హారిన్ రోడ్డు, పుదుపేట.

చందానిర్ణయము.

పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించుట, శాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణపూర్వకముగా నిరూపించుటక్షణ శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్య మొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్త్రిక నొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాది విధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

| | | |
|---|---|---|
| 1. ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. పోషకులకు | ,, | 1000. |
| 3. యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్త్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల.

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులయౌన్నత్యము!! ఆంధ్రులబుద్ధివైభవము!!

# ఆంధ్రులచరిత్రము.

## రెండవభాగము.

ఇందు క్రీ. శ. 1100 నుండి 1850 వఱకుఁగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపఁబడినది.

పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయులవ్రాఁతలు, మొదలగువాని నన్నింటిని శోధించి తెలుఁగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు, ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు. నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములు కలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుఁగులోఁగాని మఱియే యన్యభాషలోఁగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాత లేఖకులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపఁబడినది. 400 పేజీలు గలిగి మంచికాగితములమీఁద చిన్నయక్షరములతో ముద్రింపఁబడి చక్కని క్యాలికోబైండు చేయఁబడిన యీయమూల్యగ్రంథము మాచందాదారులకు పోస్టేజితో రు. 1—0—0 కును, చందాదారులు కానివారలకు పోస్టేజిగాక రు. 1—8—0 లకును ఇయ్యఁబడును.

☞ విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథములనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపఁబడును.

విధేయుఁడు,—

ఆ. లక్ష్మీపతి, బి.ఏ., ఎం.బి. సి.ఎం.

మేనేజరు,—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట,—మద్రాసు.

నామములతో వ్యవహరింపఁబడుచున్న జాలంధర లోహారదేశముల నేలురాజులు లలితాదిత్యునికిఁ బన్ను చెల్లించుచుండిరి. లలితాదిత్యునిక్రింద నుద్యోగు లైనసాహిరాజు లనునొక తెగవా రుండిరి. నవమశతకాంతమువఱకు కాబూలు గాంధారదేశముల నేలిన తురుష్కకుటుంబమునకు సాహి యనుబిరుద ముండె నని కల్హణుఁడు చెప్పుచున్నాఁడు. ఈకుటుంబమువారిశాఖలు సింధునదీప్రాంతమందుఁ జిన్న జమీందారీల నేలినట్లు గ్రంథనిదర్శనము గానవచ్చుచున్నది. వీరుఁగూడ కాశ్మీరదేశరాజు శాసనమునకు లోఁబడి యుండి రనిచెప్పుట యనుచితముగా నున్నట్లు కానరాదు. అష్టమశతకారంభమందుఁ గొందఱు యవనులు ప్రబలి కాబూలుదేశముపై దండెత్తెద మని భయపెట్టుచుండిరి. ఆసమయమునందే సింధుదేశములో నుండు మహమ్మదీయరాజు లుత్తరముగా వెళ్లుటకుఁ బ్రయత్నించుచుండిరి. కాబూలు గాంధారదేశములయం దుండుసాహిరాజు లిట్లు నలుఁగడల శాత్రవాభియోగముచే భీతి నొందుచున్నపుడు లలితాదిత్యుఁడు తనరాజ్యమును విస్తరింపఁజేయుట కిదియే మంచిసమయ మని దిగ్విజయమునకు బయలుదేఱెను. ఈదిగ్విజయయాత్రాప్రసంగమునందే కాన్యకుబ్జేశ్వరునితోఁగూడ వైరము తటస్థించియుండును. లలితాదిత్యుఁ డిట్లు యశోవర్మ నోడించి జైత్రయాత్రాపరుఁడై భరతఖండము నంతయుఁ దిరిగెను. తూర్పుసముద్రతీరమందున్న కొన్ని దేశములను, దూర్పున, కొటివారు మొదలుకొని ఆఫ్గనీస్థానమువఱకును జయించెను. ఇదియును గావ్యములయందుఁ గవులచే వర్ణింపఁబడిన పూర్వకాలపురాజుల దిగ్విజయములవంటిదే కాని దేశనామముల నాయాయిసమయములను జరిత్రకారుఁడు సరిగాఁ జెప్పకపోవుటచే దీనివలన వాస్తవచరిత్ర మేమియుఁ దేలదు. రాజు దండయాత్రనుండి స్వదేశాభిముఖుఁడై వచ్చునపు డుత్తరదిక్కున జరిగిన కొన్నిసంగతులు నిజ మయిన చరిత్రములో సంబంధించి యున్నవి. లలితాదిత్యునిచే జయింపఁబడిన వారిలో తుఃఖారు లనుజాతివా రొకరు. ఈతుఃఖారులదేశము బాడక్షాను అక్షస్‌నదికి పైగా నుండుదేశమును గలిసియున్నట్టి ప్రాచీనమహమ్మదీయగ్రంథకర్తలకు నివాసస్థాన మయినట్టి తోకరిస్తా ననుట కేమియు సందియము లేదు. ఇదియే శుంకుణుఁ డనులలితాదిత్యుని మంత్రికి జన్మదేశము. అష్టమశతకమం దీదేశము తురుష్కజాతివారికి నివాసస్థాన మయియున్నట్లు మనకుఁ దెలియవచ్చుచున్నది. లలితాదిత్యునిమంత్రి తురుష్కజాత్యుత్పన్నుఁ డనుట కనేకోపపత్తులు గలవు. తుఃఖారజాతివాఁ డగుశుంకుణుఁడు వాస్తవచరిత్రతో సంబంధించినవాఁ డని ఋజువు

చేయుట కతఁడు నిర్మించిన స్తూపమే గాక 759—763 సం॥ లలో గాశ్మీరదేశ మును జూచి వచ్చిన 'ఓకాం' గను చీనాయాత్రికుఁ డితఁడే కట్టించిన వని చెప్పిన రెండుబౌద్ధవిహారములును జాలును. సేనాధిపతి యనునర్థమిచ్చు శుంగణుఁ డనుశబ్ద మొకబిరుదుగా నితనికి, చీనదేశస్థులచే నివ్వఁబడెను. ఇదియే తరువాత నితనిపేరు గా వాడఁబడెను. తురుష్కులచేఁ గాశ్మీరమం దనేకబౌద్ధవిహారములు కట్టింపఁ బడిన వని చీనయాత్రికుఁ డగు ఓకాంగు తనయాత్రాచరిత్రమందు వ్రాసియున్నాఁ డు. తురుష్కరాజకుటుంబమువారిచేఁ గాశ్మీరమందు స్థాపింపఁబడిన యనేకబౌద్ధ పుణ్యస్థలములఁ గూర్చి ప్రశంసించినపు డెల్ల నాకాలపు కాశ్మీరపువారికిఁ దురుష్క జాతివారికిఁ గలిగియుండెడు నితరసన్నిహితసంబంధములను ఓకాంగు తనయాత్రా చరిత్రమందుఁ బలుచోట్ల వాక్రుచ్చియున్నాఁడు. ఈ తురుష్కరాజవంశపువా రె చట రాజ్యము చేసిరో నిశ్చయించి చెప్పుట దుర్లభము. ప్రకృతమందు మనకుఁ గలచరిత్రజ్ఞానముఁబట్టి యీతురుష్కనృపులు రాజ్యముచేసిన టోకరిస్తా నను దేశ ము కాబూలునకు సింధునదికి నున్న పైభాగమునకు సమీపమం దున్నప్రదేశ మని మన మూహింపఁ గలము. ఈ తురుష్కజాతివారు నిర్మించిన నిర్మాణములు వీరి నామములు వీరిబిరుదములుగుఱించి చీనదేశపుయాత్రికుఁడు చెప్పినదానినిబట్టి యా లోచింపఁగా నాకాలమునాఁటికి వీరు నవీను లనియుఁ బ్రాయికముగా లలితా దిత్యుని రాజ్యపరిపాలనకాలమం దుండెడివా రనియు ఆర్కాక్ శాసనములవలనఁ దెలియఁబడుచున్నది.

పూర్వోక్తు లయినతురుష్కులను లలితాదిత్యుఁ డేదినమందు జయించెనో యాదిన మెల్లపుడు స్మృతిపథమున నుంచుకొనుటకుఁ గాశ్మీరదేశస్థులు ప్రతిసంవ త్సరమందు దేశములో నుండుప్రతిగ్రామమున మహావైభవముతో నాదివసమున నొక గొప్పయుత్సవము జరిగించుచుండెడివా రని యాల్బ్యారూని వ్రాసియున్నాఁడు. ఈలలితాదిత్యుఁడు జగమంతయు జయించి యేలినట్లు కాశ్మీరదేశస్థులు వ్యవహ రించిరి గాని యది సత్యము గా దని యాల్బ్యారూని ఖండించి యున్నాఁడు. తుఖా రులు లలితాదిత్యునిచే నోడింపఁబడిన పిదప ముమ్మని యనువానిని వారు శాసకు నిగా నేర్పఱచుకొనిరి. తరువాత లలితాదిత్యుఁడు టిబెటు దేశస్థులను జయించె ను. వీనిచేఁ జీనదేశపు చక్రవర్తికడకు దూతగాఁ బంపఁబడిన యులిటో యనువాఁ డు తనప్రభువు లలితాదిత్యుఁడు పలుమాఱు టిబెటును జయించియున్నట్లు చెప్పె నని చీనదేశస్థులు స్వదేశచరిత్రయందు వ్రాసిరి. మధ్యహిందూస్థానపురాజు యశో

వర్మను సహాయునిగాఁ గైకొని చీనాచక్రవర్తి యితనితోడ్పాటుకై పంపిన రెండు లక్షలపదాతిబలమును వెంటఁ బెట్టుకొని పోయి యాటిబెటు దేశపు మార్గముల నుపరోధించి యాదేశస్థుల జయించి వచ్చెను. తరువాత నీతఁడు దరదుల నోడించెను. దరదజాతివారు కాశ్మీరమునకుఁ బశ్చిమోత్తరముగా నుండుపార్వతికప్రదేశములయందు నివసించి యుండువారు. దరదులను జయించిన వెనుక లలితాదిత్యుఁడు చేసినదండయాత్రలు పౌరాణికకథాకల్పములు. వానిలో విశ్వసనీయ చరిత్రాంశము లెవ్వియుఁ గానరాకుండుటచే నంతగణనీయములు గావు. ఉత్తరకురుభూములను, ప్రాగ్జ్యోతిషము, జాలంధరదేశము, త్రిగర్తదేశము, స్త్రీరాజ్యము (Land of Amazons) మొదలగుదేశములకు దండయాత్ర లొనర్చినట్లు కల్హణుఁడు వ్రాసియున్నాఁడు. (శూన్యే ప్రాగ్జ్యోతిషపురే నిర్జహానం దదర్శ సః । తద్యోథాన్విగళద్ధైర్యాన్ స్త్రీరాజ్యే స్త్రీజనోఽకరోత్ । తుంగౌ స్తనౌ పురస్కృత్య నతు కుంభౌ కవాటినాం (గజానాం) । ఉత్తరాః కురవోఽవిశం స్తద్భయా జ్జన్మపాదపాన్) లలితాదిత్యుఁడు కట్టించిన భవనములు, దేవాలయములు, బౌద్ధవిహారములు ననేకము లయియుండెను. శిథిలావస్థ నొందిన నిప్పటికిఁ గన్పట్టు కొన్నికట్టడములీరాజుకీర్తి నుద్ఘోషించుచున్నవి. మార్తాండతీర్థనామం దితఁడు కట్టించిన మార్తాండాలయ మీకాలమందు పాడయిన ట్లున్నను దీనియందగపడు ప్రాచీనహిందూశిల్పనైపుణి చూపఱమనస్సులను విస్మయాబ్ధిలో ముంచును. అన్నిటికంటె నెక్కుడాశ్చర్యము గలిగించునది జీర్ణమైన పరిహాసపురసన్నివేశము. ఈరాజు పరిపాలనకాలమందు నిర్మింపఁబడిన దేవాలయములు, వానిలోఁ బ్రతిష్ఠాపితము లయినదైవప్రతిమలు లోనగువానిని జూడఁగా నాకాలమందుఁ గాశ్మీరదేశములో మతాభిమానము దైవభక్తి యెంతమట్టుకు వ్యాపించియుండెనో యాసంగతి మన మూహించుకొనవచ్చును.

లలితాదిత్యుఁడు స్వర్గపదప్రాప్తుఁ డయినపిదప నల్పకాలములో ననఁగా క్రీస్తు వెనుక 759—763 సంవత్సరములలోఁ గాశ్మీరదేశముఁ జూడవచ్చిన ఓకాంగు (Chineese pilgrim) బౌద్ధమత మీదేశమం దానాఁటికి మిక్కిలి ప్రబలముగా నున్నట్లును, స్థూపవిహారసంఖ్య యగణేయ మయి యున్నట్లును జెప్పుచున్నాఁడు. లలితాదిత్యుఁ డొనర్చిన యనేకధర్మకార్యములలో లెక్కలేని స్తూపములును, విహారములను నిర్మించుటయే కాక గణనకు మీఱిన విష్ణ్వాలయములఁ

గూడ నిర్మించియున్నాఁ డని కల్హణుఁడు వ్రాసినవ్రాఁత చీనయాత్రికుఁ డిచ్చినసాక్ష్యముతో సంవదింపుచున్నది. ఈరాజు బౌద్ధమతమతవిషయమయి చేసినమంచి పనులలోఁ బరిహాసపురమందుఁ గట్టించినవిహార మొకటి మిక్కిలి గొప్పది. దీని లో బుద్ధుని ప్రతిమ యుంచఁబడినది. హుష్కపురమందుఁ గట్టించఁబడినవిహారము మఱియొకటి. ఇదియే చీనయాత్రికుఁ డీదేశమున కేతెంచినపుడు మొదట దిగిన బస. ఈ రెండువిహారములును గల్హణునికాలమున కున్న ట్లీతఁడు రాజతరంగిణిలో వ్రాసినశ్లోకములే మనకు సాక్ష్యము. (చక్రే బృహచ్చతుశ్శాలం బృహచ్చైత్యం బృహజ్జినైః । రాజా రాజవిహారం స విరజా స్సతతోర్జితం (4—200) తేన హుష్కపురే శ్రీమాన్ ముక్తాస్వామీ వ్యధీయత । బృహద్విహారో భూపేన సస్తూపశ్చ మహాత్మనా (4—188) ఇట్టి లోకోత్తరచరిత్రుఁ డైన లలితాదిత్యుని గూర్చి కాశ్మీరదేశమం దనేకశ్లాఘాపర కల్పితకథలు బయలుదేఱిన వన్నచో నేమి వింత!

ఈతని లోకాతిశాయి ప్రతాపమును దెల్పెడు నిట్టికథలలోఁ గొన్నింటిని కల్హణుఁడు తనగ్రంథమందు సంగ్రహించి యున్నాఁడు. శుంకుణుఁ డను తురుష్కమంత్రి రాజువిషయమయి చేసినకపటకర్మను గూర్చి చెప్పెడుకథ మిక్కిలి విచిత్ర మయినది. ఒకసమయమం దీలలితాదిత్యుఁడు దిగ్విజయమున కరుగుచుండఁ గ్రొత్తగాఁ గోయఁబడిన ముక్కునుండియుఁ జెవులనుండియు రక్తము కాఱుచున్న పురుషుఁ డొకఁ డడ్డముగాఁ జనుదెంచి యేడ్చుచు రక్షింపు మని యీతనిపాదములపైఁ బడెను. ఈరాజు వానిని జూచి కరుణార్ద్రమనస్కుఁ డై నీ కీయాపద యెట్లు సంభవించె నని యడిగెను. అందుకు వాఁ డి ట్లనియె. "నే నీసికతాసింధువునకు సమీపమం దున్నదేశము నేలెడు రాజుమంత్రిని. వైరిజనదుష్ప్రసహప్రతాపుఁ డగు లలితాదిత్యుని ప్రామాల నమ్రత వహింపు మని నే నుపదేశింప నామాట సరకుగొనక మిక్కిలి క్రుద్ధుఁ డయి న న్నిట్లు శిక్షించెను. ఆదురాత్ముని విషయ మయి పగదీర్చుకొనుటకుఁ గోరుచున్న నాకుఁ దోడ్పాటు గావింపవలయును. ఆ చెనఁటి పాలించుపట్టణ మిచటికి మూఁడుమాసములు నడువఁదగిన దూరమం దున్నది. మన మొకవేళ శ్రమపడి యింతదూరమార్గము నడిచి వెళ్లిన నాసమయమున కాదుష్టుఁడు స్వస్థలమం దుండు నని యేమి నిశ్చయము! కావునఁ బదునైదుదినములలోఁ బోయి చేరఁదగిన దగ్గఱదారి యొకటి యున్నది. ఆమార్గముగుండ పనము పోవచ్చును. కాని యాత్రోవ నిర్జల మగుటచే సైనికు లందఱు కావలసినంత నీటిని సంగ్రహించుకొని బయలుదేఱుదురు గాక." దానికి లలితాదిత్యుఁ

డియ్యకొని యాదిక్కునకు నడచుటకు సేనల కాజ్ఞ నొసంగెను. అందుపై సైన్యములు సికతాద్వైతమగునాఘోరమరుభూమియందు నడచి నడచి యొకపక్షమునకైన దరిఁ జేరలేకపోయెను. సైనికులచేఁ దేఁబడినజలము సరిపోయెను. మఱి యెచటను నీరు కానరాలేదు. సైనికు లందఱు పిపాసాపీడితు లయి యిటుపైని మా ప్రాణములు నిలువ వని మొఱ లిడసాగిరి. అప్పుడు లలితాదిత్యుఁ డామంత్రిని జూచి గమ్యస్థాన మిక నెంతదూర మని యడిగెను. దానికి వాఁడు మోమునందుఁ జిఱునగవు దోఁప రాజున కిట్లనియె. "ఓయి రాజా! నీకు నీ సైనికులకు నిపు డేది గమ్యస్థాన మనుకొంటివి? యమునిపట్టణమా? మారాజుపట్టణమా? స్వజీవితనిరపేక్షి నై మారాజు హితము గోరి నిన్ను మృత్యుముఖమందుఁ బ్రవేశపెట్టుటకుఁ గపటోపాయము వన్ని యిట్లు తెచ్చితిని. ని న్నెవ్వ రిఁక రక్షింపఁగలరు?" అది విని రాజు మిక్కిలి కినిసి "ఓరి దురాత్ముఁడా, నీదు సంకల్పము నీతోడనే నశించునుగాత! ఇదిగోఁ జూడు నామహిమ" యని చెప్పి తనచేతిలో నుండు కుంతముచే భూమియందుఁ బొడిచెను. తోడనే యొకమహాజల ప్రవాహము పైకుబికి సైనికుల ప్రాణములను నిలువరించెను. అనంతర మీలలితాదిత్యుఁ డారాజుపురము సేరి వానిని వానిమంత్రితోఁ దుర్వ్యావస్థునిగాఁ జేసి పిడిచెను. ఇట్లుత్పాదితమైన నదికిఁ గుంతవాహిని యని పేరు. (అద్యాపి కుంతవాహిన్యః ప్రవహం త్యుత్తరాపథే) అని రాజతరంగిణీకారుఁ డానదిని దాఁ జూచినట్లు స్వగ్రంథమందు వ్రాసి యున్నాఁడు.

ఈలలితాదిత్యుని మరణము విషయమయి యనేకు లనేకవిధములఁ జెప్పుదురు. వీనిలో వాస్తవ మెద్దియో తెలియఁజాలము. దండయాత్రాప్రసంగములో దూరముగా నుత్తరపుదిక్కునకుఁ బోయి యచట నారణ్యక మనుప్రదేశమం దత్యుత్కటహిమబాధచే మృతినొందె నని కొందఱు, ఉత్తరదిక్కును జయించుటకుఁ బోయి సైన్యమును విడిచి యొంటరిగా నొకపార్వతికమార్గమం దరుగుచుండ శత్రులచే నుపరుద్ధుఁ డై పరాభవభీతివలన నాత్మహత్య సల్పె నని మఱికొందఱును జెప్పుదురు. ఈకథల కవాంతరభేద మున్న నితఁ డుత్తర దిక్కునకు దాడివెడలి యచట మృతినొందె ననునంశములో నన్నియు నేకీభవించుచున్నవి.

ఇతనితరువాత సింహాసన మెక్కినరాజులు స్వల్పకాలము రాజ్యముచేసిన [illegible] యున్నారు. వారిలో లలితాదిత్యుని జ్యేష్ఠపుత్రుఁ డగుకువలయాపీడుఁ డను

వాఁడొకవత్సర మాత్రకాలము రాజ్యమునేలి పిదప విరక్తిచేఁ దీవ్రతపం బాచరించి సిద్ధినొందె నని చెప్పఁబడియున్నది. లలితాదిత్యుని మరియొకభార్యయందు జనించిన కనిష్ఠపుత్త్రుఁ డైన వజ్రాదిత్యుఁ డతిక్రూరుఁడు. భోగచాపల్యము గలవాఁ డగుటచే నేడువత్సరములవఱకు రాజ్యముఁ జేసి రోగపీడచే మృతినొందెను. ఇతనియనంతర మీతనిపుత్రులు పృథ్వాపీడుఁడు కనిష్ఠుఁ డగుప్రథమసంగ్రామపీడుఁడు నొకనితరువాత మఱియొకఁడు సింహాసనమునకు వచ్చిరి. కాని వీరిలో మొదటివాఁడు నాల్గుసంవత్సరములును రెండవవాఁ డేడుదినములును రాజ్యముఁ జేసిరి.

నాణెములఁబట్టి కాని తదితరలేఖన ప్రమాణములఁబట్టి కాని చరిత్రతో సంబంధించిన యేవిధ మయినప్రసిద్ధి లేనియీయల్పాయువు లయిన రాజులతరువాత వజ్రాదిత్యుని కనిష్ఠపుత్త్రుఁడు, కీర్తిప్రతిష్ఠలు గలవాఁడు చిరకాలము రాజ్యమేలినవాఁడు నైనజయాపీడుని వృత్తాంతము చరిత్రలోఁ దరుగఁ గనఁబడుచున్నది.

ఈజయాపీడుఁడు వీనితాత యగులలితాదిత్యునివలె గొప్పకీర్తిని సంపాదించినవాఁ డనియు, లోకస్తుతిపాత్రుఁ డయ్యె ననియుఁ గల్హణుఁడు చరిత్రములో విపులముగా వర్ణించి యున్నాఁడు. ఏతన్నామాంకితము లయిననాణెములు వాస్తవచరిత్రతో సంబంధించిన యిట్టిరా జొకఁ డున్నాఁ డని దృఢముగా ఋజువుచేయుటచే నీతఁ డుండె నని మనము నమ్మవలసివచ్చెను గాని లేనియెడల నితనినిగూడ రణాదిత్యుఁడు మేఘవాహనుఁడు మొదలగువారి తరగతిలోఁ జేర్పవలసి యుండును. ఇతనికి వినయాదిత్యుఁ డని నామాంతరము కలదు. కాశ్మీరమందును దత్ప్రాంతదేశములందు నిప్పటికి నచ్చటచ్చటఁ గనఁబడునవియుఁ గార్కోటకవంశజుల నాణెములఁ బోలినవియు మిశ్రలోహముచేఁ జేయఁబడినవియు నగునాణెముల పయి నీ రాజు పేరు గానవచ్చుచున్నది. ఈ జయాపీడుఁడు రాజ్యధురము దనభుజదండమందు వహించినతోడనే తాత యగులలితాదిత్యునికీర్తియందు స్పర్థగలవాఁడువలె దిగ్విజయయాత్రకు బయలువెడలెను. కాశ్మీరద్వారమునుండి యితనిసైన్యములు వెలువడుచుండఁగా నెనుబదివేల కర్ణీరథములు లెక్కింపఁబడినవి. ఇట్లు జయాపీడుఁడు దూరదేశమునకుఁబోవఁజూచి యాతని భార్యాసోదరుఁడయిన జజ్జుఁడనువాఁడు సింహాసనము నాక్రమించెను. అంతట రాజుసైన్యములు కాలవిలమ్బ మగుటచే స్వదేశమునకుఁ బోవలె నని యిచ్చ పొడమి మఱియొక యడుగు నైనను ముందుకు వేయక యని రాజులోఁ జెప్ప మొదలసాగిరి. అనుయాత్రికు లయినరాజులును గూడ

వారివారిదేశములకుఁ బోవ నంపి సేనావియుక్తుఁ డయినను స్వానుభావమాత్రసహాయుఁడై తనప్రతాపమును దిక్కులయందుఁ బిక్కటిల్లఁజేయుఁ దొడఁగెను. మిత పరివారముతోఁ బ్రయాగకుఁ జని యచట లక్షగుఱ్ఱములను బ్రాహ్మణులకు దాన మొసఁగెను. అక్కడఁ దనవెంట వచ్చినభటులను గూడ విడనాడి మాఱువేష ముతో నిశీథసమయమున దేకాకిగా బయలుదేఱెను. వెళ్లి వెళ్లి జయంతుఁ డను గౌడరాజుచేఁ బరిపాలింపఁబడుచున్న పౌండ్రవర్ధన మనుపట్టణమును బ్రవేశించెను. అచటఁ గొన్నినాళ్లుండి పురజనుల కతిహింసక మయిన యొకసింహమును బరిమార్చుటచే నతిప్రీతుఁ డయిన యారాజుకూఁతుఁ గళ్యాణదేవి యనుదానిని బెండ్లాడెను. జయాపీడుఁడు తనమామగారి శత్రువు లయిన గౌడదేశపురాజులను జయించి స్వదేశాభిముఖుఁ డై పోవుచు మధ్యమార్గమందు సైన్యసమేతుఁ డయిన తనమంత్రి యగు దేవశర్మతోఁ గలసి కాన్యకుబ్జేశ్వరుని జయించి కాశ్మీరముఁ జేరెను. మూఁడు సంవత్సరములు నిష్కంటకముగా రాజ్యభోగముల నాస్వాదించిన జజ్జుఁడు శుష్కలేత్ర మనుప్రదేశమందు జయాపీడునితో బహుదినములు ఘోరముగాఁ బోరాడి నిహతుఁ డయ్యెను. జయాపీడుఁ డేస్థానమందు రాజద్రోహి యగుజజ్జునివధించి కళ్యాణముఁ బడసెనో యాస్థానమందుఁ గళ్యాణపుర మనుపట్టణము నొకదానిని గట్టించెను. ఇతనియాస్థానమందు వేరస్వామి యను మహాపండితు నుంచి విచ్ఛిన్న మయిన మహాభాష్యప్రవచనమును స్వదేశమందుఁ బ్రవర్తింపఁజేసెను. (ప్రావర్తయత విచ్ఛిన్నం మహాభాష్యం స్వమండలే క్షీరాభిధాచ్ఛబ్దవిద్యోపాధ్యాయాత్సంభృతశ్రుతః) భట్టుఁడు ఉద్భటుఁడు లోనగుపండితులనుగూడఁ బోషించెను. (విద్వాన్ దీనారలక్షేణ ప్రత్యహం కృతవేతనః భట్టోఽభూదుద్భట స్తస్య భూమిభర్తుస్సభాపతిః ఈజయాపీడుఁడు క్రీస్తువెనుక. 751—782 సంవత్సరములలో రాజ్యముఁ జేసినట్లు కల్హణునిగ్రంథమువలనఁ గానవచ్చుచున్నది. లలితాదిత్యునివలె నితఁడు ననేకపరాక్రమచేష్టల నొనర్చె నని యనేకకథలు కల్పింపఁబడియున్నవి. ఈరాజు సుమారు ముప్పదేండ్లు పరిపాలనముం జేసి కొన కుదయించిన దుష్టబుద్ధిచేఁ బ్రజలఁ బీడించి మృతినొందెను. పరమదుష్టు లయినకాయస్థుల కుత్రటమాటలు విని ధనాశాపిశాచికాగ్రస్తుఁడై ధన మిమ్మని స్వదేశ ప్రజలను విశేషించి బ్రాహ్మణులను హింసింపఁ దొడఁగెను. ఇట్లు కొంతకాలము జరిగినపిదప బ్రాహ్మణు లతనివలనఁ గలుగుబాధ సహింపనోపక స్వదేశము విడిచి పరదేశమునకుఁ బోయిరి. మఱికొందఱు ప్రాయోపవిష్టు లయి మడిసిరి. తులమూల్య మనుబ్రాహ్మణాగ్రహారము

నితఁడు హరింపఁగా నావిప్రు లితనివద్దకు వచ్చి నీ కిట్టిపని తగ దని పరుషముగా దూఱిరి. వారిలో నొకతపశ్శాలి యగు బ్రాహ్మణుఁడు "బ్రాహ్మణుల కిట్లు కోపము దెప్పించుట నీకు క్షేమకరము గా దని గద్దించి చెప్పెను. అందుపై నాదురాత్ముఁ డీకాలపు బ్రాహ్మణుల కోపమువలన నేమియనర్థము మాకు వాటి ల్లు ననెను. దాని కాబ్రాహ్మణుఁడు 'ఇదిగో నాప్రభావమును జూపెదఁ జూడు" మని చెప్పి కాలితో భూమిని గొట్టి పూర్వపు ఋషులవంటివాఁడను నే నయినయెడల నీ ఖలుని యందు బ్రహ్మదండము పడును గావుత మని శపింపఁగాఁ దత్క్షణమే యాసభా గృహముయొక్క దూలము విఱిగి వానిపైఁ బడి గాయములు తగిలి కదలలేక మఱి కొన్నిదినములకుఁ జచ్చె నని కల్హణుఁడు వ్రాసియున్నాఁడు. జయాపీడుని మృతివిష యమై వాస్తవహేతు వేమైయుండినను గల్హణుఁడు చెప్పినదానిలోఁ గొంతసత్య మున్నట్లు మన మూహింపవచ్చును.

(సశేషము)

మేడేపల్లి వేంకటరమణాచార్యులు.

# ప్రబోధచంద్రోదయవిమర్శము.



ఉపనిషత్తులు, పురాణములు, బ్రహ్మసూత్రభాష్యము లోనగు వానిచేఁ బ్రతిపాదింపఁబడునదియు న్యాయమీమాంసాదీతరశాస్త్రజ్ఞానసహాయనిర్వ్యపేక్షముగాఁ దెలియ శక్యము కానిదియు నగునద్వైతవేదాన్తశాస్త్రమును మన్దబుద్ధు లగువారు రుచిగలవా రయి సులభముగాఁ దెలిసికొని తరించుటకు కృష్ణమిశ్రుఁ డనునామధేయముతోఁ బ్రసిద్ధి గాంచినయద్వైతాచార్యుఁ డొకం డీయద్వైతవేదాన్తసిద్ధాన్తము నంతయును గడుచమత్కృతితో నాటకరూపముగా రచించి జగమున కుపకార మొనరించెను. ఇట్టినాటకమునకుఁ బ్రబోధచన్ద్రోదయ మని పేరు. (ప్రబోధము = జ్ఞాన మనెడి) చంద్రునియొక్క యుదయము).

భాష్యాద్యనేకగ్రంథము లుండ నీ ప్రబోధచంద్రోదయమువలన నేమిప్రయోజనము? వేదాంతార్థబుభుత్సువు లగువారు మూలగ్రంథములనే చదివి జ్ఞానమును సంపాదించుకొనఁ జాలరా? యని కొందఱు ప్రశ్నింపవచ్చును. కాని వారిప్రశ్న మిటుల సమాధేయ మగును.

నాటకమందుఁ బ్రతిపాదింపఁబడునర్థ మంతయు నభినయప్రధాన మయినది గదా! ప్రబోధచంద్రోదయమందుఁ బ్రతిపాదింపఁబడు వేదాంతార్థమునకుఁ గల్గెడు ప్రాకట్యాతిశయము పరోక్షోపదేశపర్యవసాయు లగుభాష్యాది గ్రంథములయందుఁ గలుగ నేరదు. ఇంతియ కాక బ్రహ్మజ్ఞానసాధనము లగుశ్రవణమనననిదిధ్యాసనవస్తు విచారాదులు వేఱువేఱుగా నొకొక్కటియే చిరకాలాభ్యాసవశ్యములుగాఁ గానవచ్చుచున్నవి. అట్టిసాధనములకుఁ బ్రత్యక్షప్రయోగ ప్రదర్శనాత్మక మగునభినయమువలనఁ గాని విశదతమజ్ఞానము సంభవింపనేరదు. ఎట్లన; యాజ్ఞికుఁడు కల్పసూత్రాదులను బాగుగఁ జదివినవాఁడైనను యాగశాలలయం దాచరింపఁబడుచుండెడు శ్రౌతకర్మలప్రయోగముఁ దాఁ బ్రత్యక్షముగ నీక్షించినఁ గాని ప్రయోగకౌశలము నొందఁ జాలఁడు. మఱియును యోగి గురుముఖముగా యోగశాస్త్రముఁ జదివినను గురువుచేఁ బ్రత్యక్షముగఁ గనపఱచఁబడు స్వస్తికాద్యాసనబంధములఁ గన్నులారఁ జూచినఁ గాని యోగప్రావీణ్యముఁ బడయఁ జాలఁడు. అట్లనే ముముక్షువు గూడ వేదాంతశాస్త్రమును గూలంకషముగఁ జదివినవాఁ డైన

ను బ్రహ్మనిష్ఠులచే నభినీయమానం బగువస్తువిచారాదికముఁ బలుమాఱు ప్రత్యక్షీకరించినఁ గాని బ్రహ్మజ్ఞానసంపాదనసాధన పటిష్ఠుఁడు కా నోపఁడు.

ఇది కాక దీనియందు మఱియొకవిశేషము గలదు. తైత్తిరీయోపనిషత్తు, (ఆనందవల్లి)

"తే యే శతం మానుషా ఆనందాః, సఏకో మనుష్యగన్ధర్వాణా మానందః। తే యే శతం మనుష్యగంధర్వాణా మానందాః। సఏకో దేవగంధర్వాణా మానందః।" అనుశ్రుత్యుక్తరీతిగ నుత్తరోత్తరశతగుణిత నిరతిశయానందరూపుఁడగుపరబ్రహ్మయొక్క నిదిధ్యాసనమం దెట్టియానందభూయస్త్వము గలదో యట్టియానంద మంతయును మునుము న్నుపాసకునిబుద్ధి నారోహింపదు. కావునఁ దొలుతొలుత నేదో సజాతీయ మగునొకయానందము నవలంబించి క్రమక్రమముగా దాని నుత్తరోత్తరాతిశయసమ్పన్న మగుదానిగా ననుసంధించినయెడలఁ గొంత కభ్యాసపాటవము కుదిరి పూర్ణబ్రహ్మానందము బుద్ధ్యారూఢం బగును. నాటకమం దభివ్యజ్యమాన మగుసజాతీయానంద మెద్దియన "లోకే ప్రమదాదిభిః కారణాదిభి స్థాయ్యనుమానేఽభ్యాసపాటవవతాం కావ్యే నాట్యే చ తై రేవ కారణత్వాదిపరిహారేణ విభావనాదివ్యాపారవత్త్వా ద లౌకికవిభావాది శబ్దవ్యవహార్యైర్మమై వేతే। శత్రో రేవై తే। తటస్థ స్యై వేతే। న మ మై వై తే। న శత్రో రేవై తే। న తటస్థ స్యై వై త ఇతి సంబంధి విశేష స్వీకారపరిహార నియమానవసాయా త్సాధారణ్యేన ప్రతీతై రభివ్యక్తస్సామాజికానాం వాసనాత్మతయా స్థిత స్థాయీ రత్యాదికో నియతప్రమాతృగత త్వేన స్థితో ఽపి సాధారణోపాయబలాత్తత్కాలవిగళితప్రతినియతప్రమాతృతా వశో న్మిషిత వేద్యాంతరసంపర్కశూన్యాపరిమితభావేన ప్రమాత్రా సకలహృదయసంవాదభాజా సాధారణ్యేన స్వాకార ఇ వాభిన్నో ఽపి గోచరీకృత శ్చర్వ్యమాణతైకప్రాణో విభావాది జీవితావధిః పానకరసన్యాయేన చర్వ్యమాణః పుర ఇవ పరిస్ఫురన్ హృదయ మివ ప్రవిశన్ సర్వాఙ్గీణ మి వాలిఙ్గ న్నన్య త్సర్వ మివ తిరోదధ ద్బ్రహ్మానందాస్వాద మి వానుభావయ న్నలౌకికచమత్కారకారీ శృఙ్గారాదికో రసః" కావ్యప్రకాశిక. 4. ఉ. అని మమ్మటాద్యాలంకారికులచే నిర్వచింపఁబడిన రసమే. "రసో వై సః, రసగ్ హ్యే వా యం లబ్ధ్వా నందీ భవతి" అను శ్రుతివలన బ్రహ్మరసస్వరూపుఁ డని నిరూపింపఁబడుటచే ధ్యానావలంబనీభూతరసాభివ్యంజకము గావున నీ నాటక మావశ్యకము.

ఈ గ్రంథకర్త యొకపరమహంస. స్వాశ్రమధర్మప్రవర్తకుఁ డగుచు ననేక శిష్యులకు వేదాంతము నుపదేశించుచు దేశమం దంతట నద్వైతవేదాంతసిద్ధాంతమును వ్యాపింపఁజేసెను. ఈతనియొద్ద గ్రంథములఁ జదువుచుండెడి శిష్యులలో నొకని కద్వైతవేదాంతము బోధింపఁబడినను రుచింపక కావ్యనాటకాదులయం దధికప్రీతిఁ గలిగి యుండుట జూచి విచారించి వాని కెట్లైన నద్వైతమందుఁ బ్రవేశము గలిగించుటకు సంకల్పించి యద్వైతసిద్ధాంతము నంతయు శ్రీమద్భాగవతచతుర్థస్కంధములో 25, 26, 27, 28 అధ్యాయములలో నారదునిచేఁ బ్రాచీనబర్హికుపదేశింపఁబడిన "పురంజనోపాఖ్యాన మ"నుతత్త్వగ్రంథము ననుసరించి నాటకరూపముగా వ్రాసి యిచ్చె నని యొకయైతిహ్యము గలదు.

గ్రంథకర్త యీనాటకప్రస్తావనలో మణిమరీచిమంజరీ నీ రాజితచరణకమలేన * * నరపతికుల ప్రళయ మహార్ణవ మగ్నమేదినీసముద్ధరణ మహావరాహేణ * * * * శ్రీమతా గోపాలేన" "యథా ఖ ల్వస్య సహజసుహృదో రాజ్ఞః శ్రీకీర్తివర్మదేవస్య దిగ్విజయ వ్యాపారాన్తరిత * * "శ్లో" అస్తి ప్రత్యర్థి * * గోపాలో భూమి పాలాన్ ప్రసభ మసిలతామిత్రమాత్రేణ జిత్వా సామ్రాజ్యే కీర్తివర్మా నరపతితిలకో యేనభూయో ఽభ్యషేచి" "భ్రమద్భుజదండమందరాభిఘాతి ఘూర్ణాత్సకలపత్తి సవిలసంఘాతం కర్ణసైన్యసాగరం నిర్మథ్య మధుమథనేనేవ క్షీరసముద్ర మాసాదితా సమరవిజయలక్ష్మీః" "యత స్సకలభూపాలకులప్రళయకాలాగ్నిరుద్రేణ చేదిపతినా సమున్మూలితం చంద్రాన్వయపార్థివానాం పృథివ్యా మాధిపత్యం స్థిరీకర్తు మయ మస్య సంరమ్భః" అని వ్రాసి యున్నాఁడు. ఇందువలనఁ గీర్తివర్మ యనునొకరాజుండె ననియు నాతని రాజ్యమును జేదిదేశపురా జగుకర్ణుఁ డనువాఁ డపహరింపఁగా నాకీర్తివర్మకు మిత్రుఁడు మహాపరాక్రమసంపన్నుఁడు మంత్రియు నగు గోపాలుఁ డనుబ్రాహ్మణుఁడు స్వనృపతిరాజ్యాపహర్త యగునాకర్ణునిఁ బరిమార్చి తనరా జయినకీర్తివర్మను దిరుగ రాజ్యాసనమందు స్థాపించె ననియుఁ జెప్పఁ దగు చరిత్రాంశము స్పష్ట మగుచున్నది. కాని యాకీర్తివర్మ లేకాలమునాఁటివారో వీరితో సంబంధించిన చరిత్రాంశము లెవ్వియో వీ రే దేశములఁ బాలించిరో యాయంశములఁ దెలిసికొనుటకుఁ దగినసాధనము లీనాటకమందుఁ గాన రావు. కావున నిచట వారివృత్తాంతము నాంగ్లేయచరిత్రకారులు వ్రాసిన ప్రాచీనభరతవర్ష

చరిత్రమునుండి యథాప్రయోజనముగా సంగ్రహించి వ్రాయుట ప్రాప్తావసర మని యెంచి కొంచెము వ్రాయుచున్నాను.

రాజవంశోత్పత్తి కీర్తివర్ధమవృత్తాంతము రాజపుత్రు లని వ్యవహరింపఁబడు వారిలో గొందఱు పూర్వకాలమందు విదేశములనుండి యీభరతఖండమున కే తెంచి రాజపుత్రస్థానమందును (Rajaputana) గంగానది కుత్తరముగా నుండు దేశమందును జేరిరి. ఇట్లు చేరినవీ రీ హిందూదేశపు ప్రభువులతోఁ బోరిపోరి కొం దఱు నిహతు లైరి. యుద్ధములలో హతశేషు లైనమఱికొంద ఱచ్చటచ్చటఁ జేరి బ్రతికి హిందూదేశపు జనసంఘములో క్షీరనీరన్యాయముగాఁ గలిసిపోయిరి. వీరి సంతతివా రిప్పటికి నసంఖ్యాతు లై దేశమం దంతటఁ గానవచ్చుచున్నారు. ఇట్లు విదేశములనుండి వచ్చి చేరినవీరును, వీరికంటె ముందు వచ్చి చేరినశకజాతివారు యూచిజాతివారు నాకాలమందుఁ బాలించుచుండెడి స్వదేశప్రభువులకుఁ లోఁబడి క్రమముగా వేషభాషలచేత నాచారములచేతను హిందువులుగా మాఱిపోయిరి. వీరు క్షత్రియు లని కాని రాజపుత్రు లని కాని వ్యవహరింపఁబడుచున్నవా రై హిందూదేశపాలకుల రాజ్యతంత్రమందు సైన్యాధిపత్యము మొద లగునున్నతో ద్యోగములందు నియోగింపఁబడిరి. ఉత్తరహిందూస్థానమం దుండుపరిహారులు (ప్రతిహారులు) లో నగు ననేకరాజవంశములవారు క్రీస్తు వెనుక నయిదవశతాబ్ద మందు నాఱవశతాబ్దమందును భరతఖండమునకు గుంపులుగా విదేశమునుండి వచ్చి చేరిన పార్వతికజాతివారే యని చెప్పుటకు లేశము సందియము లేదు. అట్లనే దక్షిణమందుఁ గూడ గాండు (Gonds) భారు (Bhars) ఖార్వారు (Kharwars) మొదలగు పుళిందజాతులు హిందూజనసంఘమునందుఁ గలసి భ్రమరకీటన్యాయ ముగా వేషభాషలయందు నాచారములయందు హిందూజన సాదృశ్యావన్ను లయి కొంతకాలమునకు చాండెలు లనియు (Chandels) రాష్ట్రకోటు లనియు (Rathors) గహార్వారు లనియు (Gaharwars) వ్యవహరింపఁబడువా రై సూర్య వంశజుల మనియుఁ జంద్రవంశజుల మనియుఁ దమ్ముఁ దాము చెప్పుకొను క్షత్రియు లుగాఁ బరిణమించిరి. వీరు నానాఁటికిఁ బలవంతు లై చిన్నచిన్నరాజ్యములను సంపాదించి యేలసాగిరి. అట్లు ప్రబలిన రాజపుత్రవంశములలో చాండెలు లను వా రొకవంశమువారు.

యమునానర్మదానదులకు మధ్య నుండుదేశమునకుఁ బూర్వకాలమందు జెజాకభుక్తి యని పేరు. అది ప్రకృతమందు బుందేల్‌ఖండు (Bundelkhand) అను

పేరు మోసియున్నది దీనికి దక్షిణముగా నుండువిశాల మయిన దేశమునకు బూర్వ కాలమందుఁ జేదిదేశ మని వాడుక. అది యిపుడు మధ్యపరగణా లకధికారి యగు కమిషనరు (Commissioner) పరిపాలనములలో నున్నది. పూర్వోక్తము లయిన జజాకభుక్తియను దేశమును చేదిదేశమును యథాసంఖ్యముగా చాండెలీవంశస్థులు కలచురీవంశస్థులను గొంతకాల మేలినట్లు మధ్యకాలపు చరిత్రమువలనఁ గాన వచ్చుచున్నది. ఈ యుభయవంశములవారును దమలోఁ దమకుఁ గలయానసం బంధముచేఁ గొంతకాలము పరస్పరమైత్రి గలవా రయి మఱికొంతకాలము కార ణాంతరములచే నన్యోన్యవైరముగలవారై యుండుట జగత్ప్రసిద్ధ మైనయంశ మని చరిత్రమునఁ దెలియ నగు. ఏకాదశాబ్ద శతకారంభమందుఁ జేదిదేశము రెండురాజ్యములుగా విభజింపఁబడినది. వానిలో మొదటిదానికిఁ బౌరస్త్య చేది రాజ్య మనియు మహాకోసలదేశ మనియుఁ బేరు. దీనికి రత్నపురము రాజధాని. రెండవదానికిఁ బాశ్చాత్యచేదిరాజ్య మనియు డాహాలదేశ మనియుఁ బేరు. దీనికి త్రిపుర మనునగరము రాజధాని.

ఇతరక్షత్రియవంశముల పేరువలెనే చాండెల్వంశపు క్షత్రియుల పేరుఁ గూడఁ దొమ్మిదవశతాబ్దములోఁ బైకి వచ్చెను. ఈ చాండెలీవంశజులలోఁ బ్రధానుఁ డగు నన్ను చాండెలీ అనువాఁడు క్రీస్తు వెనుక 831 వ సంవత్సరములో నీ జజాకభుక్తి నేలుచున్న పరిహారప్రభువును రాజ్యమునుండి తొలగించి దానిదక్షిణభాగమునకుఁ దా రాజయ్యెను. నౌగానునకు ఛతర్పూరునకు మధ్య నున్న మాసహానీ యనునది పరిహారులనాఁడు. రాజధానిగా నుండెను. ఈపరిహారులకంటె ముందు రాజ్య మేలినవారు గహర్వారీరాజులు. తరువాత వీరివంశస్థులు రాష్ట్రకూటు లనుప్రసిద్ధ నామముతోఁ గాన్యకుబ్జము నేలిరి. మహోబా, కాలంజరు మొద లగుసుందర మైనపట్టణముల నిర్మించినవారీ చాండెలీరాజులే.

హిందువులుగా మాఱినకాంతుజాతివా రగు నీ చాండెలీరాజులు మొట్ట మొదట చతరీపూర్వద్ద నొకచిన్నరాజ్యమును సంపాదించి కాలక్రమమునఁ గాన్య కుబ్జమువఱకుఁ దమరాజ్యమును విస్తరింపఁజేసిరి. వీరిలో మొదటిరాజులు పాం చాలదేశాధిపతులయిన భోజమహేంద్రపాలులయొక్క యధికారమునకు లోఁబడి యుండిరి. కాని పదియవశతాబ్దముయొక్క పూర్వార్ధమం దీచాండెలీరాజులు స్వతంత్రరాజ్యమును స్థాపించిరి. 'హర్ష-చాండెలీ' అనువాఁడు మఱికొందఱ రా జులసహాయమును గూర్చుకొని క్రీస్తు వెనుక 916 వ సంవత్సరమందు రాష్ట్రకూ

టరా జగుమూఁడవ యింద్రునిచే దేశమునుండి పాఱఁదోలఁబడిన మహేంద్రపాలునికిఁ గాన్యకుబ్జరాజ్యమును దిరుగ సంపాదించుటకుఁ దోట్పాటు గావించెను.

సంవత్సరశతముకంటె నెక్కుడు జీవించినవాఁ డని ప్రసిద్ధి గాంచిన యశోవర్మపుత్రుఁ డగుధంగరాజాహ్వయుఁ డీచాండెలీవంశములో మిగులఁ బ్రసిద్ధుఁడు. ఇతఁడు రాజ్యతంత్రప్రవీణుఁడు. ఖజురాహోనగరమం దున్నగొప్పదేవాలయములలోఁ గొన్నింటిని నిర్మించినవాఁ డీతఁడే. ఇతఁడు 950—99 సంవత్సరములలో రాజ్యముఁ జేసెను. ఇతఁడు సుభక్తజీను నెదిరించుటకుఁ బాంచాలదేశపురా జగు జయపాలుఁడు గూర్చిన రాజసంఘములలోఁ జేరి ఘోరముగాఁ బోరాడెను. గజనీ మహమ్మదు హిందూదేశముపైకి దండెత్తి వచ్చినపుడు ధంగరాజుపుత్రుఁడగు గండరాజు (999—1025) జయపాలునికుమారుఁ డైన యానందపాలునిచేఁ బోగుచేయఁబడిన హిందూరాజసంఘమును జేరి గజనీమహమ్మదుతో యుద్ధముఁ జేసెను. దీనికిఁ బదిసంవత్సరముల తరువాత గండరాజుకొడుకు కాన్యకుబ్జముపైకి దండెత్తి వెళ్లి యాదేశపురా జైన రాజ్యపాలుని సంహరించెను. కాని 1023 వ సంవత్సరములో మహమ్మదుతోఁ జేసిన యుద్ధములోఁ బరాజితుఁ డై కాలంజరు దుర్గమును గోల్పోయెను.

ఈకాలమం దీగండరాజునకు సమకాలికుఁడు చేదిదేశమునకు రా జగు గాంగయదేవకలచురి (1015—40) గొప్పబలవంతుఁ డై యుత్తరహిందూస్థానమందు రాజాధిరాజత్వమును సంపాదించుటకుఁ దగిన పుష్కలప్రయత్నముల నొనరించెను. 1019 వ సంవత్సరమందు వానియధికారము దూరదేశస్థు లయినరాజులచేఁ గూడ నొప్పుకొనఁబడెను. ఆతనితరువాత నాతనికుమారుఁ డగుకర్ణదేవుఁ డనువాఁడు తండ్రివలెనే సర్వదేశాధిపత్య సంపాదనమందుఁ బట్టుదల గలవాఁడై ఘూర్జరదేశపురా జైన భీమునితోఁ గలసి 1060 సంవత్సరములో మాళవదేశాధీశ్వరుఁడు మహావిద్వాంసుఁడు కవికల్పభూజము నని ప్రసిద్ధి నొందిన భోజనరేంద్రు నోడించెను. కాని కొన్నిసంవత్సరములు గడచిన పిమ్మట నీకర్ణదేవుఁడు భాగ్యదేవతాకటాక్షువై ముఖ్యమువలన 1049—1100 సంవత్సరములలో రాజ్యముఁ జేసినకీర్తివర్మ చాండెలీచే నోడింపఁబడి రాజ్యపదభ్రష్టుఁ డాయెను. ఈ కీర్తివర్మనామాంకితము లైననాణెము లిప్పటికి లభ్య మగుచున్నవి. ఈతనిచే సన్మానింపఁబడెడు కృష్ణమిశ్రుఁ డనునొక యద్వైతాచార్యుఁడు శాంతరసప్రధాన మగుప్రబోధచంద్రోదయ మనువేదాంతనాటకమును వ్రాసి దానిప్రస్తావనలో "నీతఁడు చేదిదేశపు

రా జగు కర్ణదేవుని జయించె. ననునంశమును సూచించెను. కాఁబట్టి యీనాటక కవి పదునొకండవ శతాబ్దమువాఁ డని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. "స్వకర్మాను గుణముగా ననేకశరీరముల ధరించువాఁడు గావున పురంజనుఁ డనఁగా జీవుఁడు. పురము శరీరము. ఇతని సఖుఁడగు నవిజ్ఞాతుఁ డనువాఁడీశ్వరుఁడు. ఆస్త్రీ తామస బుద్ధి. దానివెంట వచ్చుపదునొకండు భృత్యులు. ఏకాదశేంద్రియములు. ఐదు తలలుగలసర్పము, పంచప్రాణవృత్తి. పురమునకు నవద్వారములనఁగా శరీరముయొ క్క నవరంధ్రములు. మృగయావిహారమే విషయోపభోగము. కాలకన్యావార్ధక ము. దానిసైనికులు ఆధివ్యాధులు.

ఈశరీరమం దున్నజీవుఁడు తామసబుద్ధికి లోనయి సంసారమందుఁ దగిలి దారపుత్రాది సంగసుఖము స్థిర మని యెంచి కుటుంబపోషణమున కై నానావిధ తాపముల నొందుచు సుఖప్రదము లనుభ్రాంతిచే దుర్విషయముల సేవించుచు నరిషడ్వర్గమునకు జిక్కి లేశ మైనను సుకృతము జేయ నొల్లక పాపరతియై స్త్రీలచే గ్రీడామృగమువలె నాడింపఁబడుచుఁ బ్రమత్తుఁడై కాలముఁ బుచ్చుచుండఁ దుద కనేకవ్యాధులు శరీర మంతట నిండి పీడింపఁగా నాబాధ సహింపఁజాలక మృతి నొందును. నిర్యాణకాలమందుఁ దా నెద్ది స్మరించుచుఁ గళేబరము విడుచునో యది యైపుట్టును. ఆజన్మ మం దీశ్వరకటాక్షమునకుఁ బాత్రుఁడై సదాచార్యసమాశ్ర యణమువలన సంసారము హేయ మనియు భగవచ్చరణారవింద ముపాస్య మని యుఁ దెలిసికొని సంసృతిబంధవినిర్ముక్తుఁడగును." అని యీగ్రంథమునకు మూల మగు పురంజనోపాఖ్యానము తాత్పర్యసంగ్రహము.

---

## ప్రబోధచంద్రోదయమందుండు వేదాంతము.

నిస్సంగుఁడైన యీశ్వరుని కనాది యగుమాయతో సంగము గలుగఁగా మన స్సనెడితనయుఁ డుద్భవించెను. అతనికిఁ బ్రవృత్తి నివృత్తు లనెడువా రిద్దఱు భా ర్యలు. ప్రవృత్తియందు మహామోహాదు లుత్పన్ను లయిరి. నివృత్తియందు వివే కాదివర్గము జనించె. మహామోహునిభార్య మిథ్యాదృష్టి, దీనికి విభ్రమావతి యనునదిసఖి. చార్వాకుఁడు మహామోహుని మిత్రుఁడు. కామక్రోధలోభదం భాహంకారములు మహామోహుని మంత్రులు. రతి, కామపత్ని. హింసక్రోధ పత్ని. తృష్ణలోభపత్ని. దిగంబరుఁడు, భిక్షువు, క్షపణకుఁడు, కాపాలికుఁడు, బుద్ధ జినాదిమతప్రవర్తకులు.

వివేకుఁడు ప్రధాననాయకుఁడు. ఇతనిభార్య మతి. వస్తువిచారుఁడు వివేకుని కింకరుఁడు. సంతోషము వివేకుని సహచరుఁడు. శాంతి వివేకభగిని. కరుణశాంతికి సఖి. మైత్రి సాత్త్వికశ్రద్ధకు సఖి. విష్ణుభక్తి యుపనిషత్సఖి. సరస్వతి విష్ణుభక్తి సఖి. క్షమ వివేకునిదాసి. సంకల్పవైరాగ్యనిదిధ్యాసములు మనస్సునకుఁ బుట్టినవారు. పురుషుఁ డుపనిషత్పతి. ప్రబోధచంద్రుఁడు పురుషపుత్రుఁడు.

పైనివ్రాయఁబడిన యిరుపక్కలవారును బరస్పరము ఘోరవైరముగలవారయి చిరకాల మొకరి నొకరు జయింపవలయు నని ప్రబలప్రయత్నముల గావించి కొనకు విష్ణుభక్తి సహాయమువలన వివేకుని పక్షము బలిష్ఠమయిన దగుటచే కామక్రోధలోభదంభాహంకార సహకృతుఁడగు మహామోహుని పక్షమునంతయు రూపు మాపి విజయము నొందెను. పురుషుఁ డుపనిషదధ్యయనమువలనఁ బొడమిన జ్ఞానముచే ముక్తుఁ డాయెను.

---

దీని యందుఁ బ్రతిపాదింపఁబడిన మతములు.

చార్వాక మతము.

దీనికి లోకాయతమనియు బృహస్పతిమత మనియుఁ బేర్లు. "అథలోకాయతం, పృథివ్యాపస్తేజో వాయురితితత్త్వాని, తేభ్య శ్చైతన్యం కిణ్వాదిభ్యో మదశక్తివత్‌" అని బృహస్పతిసూత్రము. ఈ మతమందు పృథివి, సలిలము, అగ్ని వాయువు" అని తత్త్వములు నాలుగు. కిణ్వాదులనుండి (సురాప్రకృతి ద్రవ్యము) మదశక్తివలెను క్రముకఫలతాంబూలదళసుధాదులలోఁ బ్రత్యేకముగఁ బరీక్షించి చూచినఁ గానరానియరుణిమ తత్తదవయవసంయోగ విశేషమువలన నుదయించునట్లు దేహారంభకపరమాణు సంశ్లేష విశేషమువలననే చైతన్య మావిర్భవించు ననియు, శరీరముతోడనే యాచైతన్యము నశించు ననియుఁ జెప్పుదురు. "యావజ్జీవం సుఖం జీవే న్నాస్తి మృత్యో రగోచరః । భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః। (మృత్యువశము నొందనివాఁ డెవ్వఁడును లేఁడు గావున మనుజుఁడు బ్రతికి యుండునంత కాలము సుఖముగ జీవింపవలెను. దహింపఁబడినశరీర మెట్లు తిరుగ రానోపు! అందఱచేఁ గోరఁబడు నర్థకామములే పురుషార్థములు. అదృష్టము నలౌకికపురుషార్థము నగు మోక్షము నీమతస్థు లొప్పుకొనరు గావున నిట్లు సర్వలోకాభి మతార్థము నుపదేశించుటచే లోకములయం దాయతమయినది. (విస్తరించినది) గావున దీనికి లోకాయత మని పేరు. సురగురు వైన

బృహస్పతిచే నిది కల్పింపఁబడుటచే బృహస్పతిమత మనియు వ్యవహరింపఁబడు చున్నది. ధర్మాధర్మంబులు సుఖదుఃఖములచే ననుమేయములు కావు. మయూర ములకుఁ జిత్రవర్ణము వలె స్వభావమువలననే సుఖదుఃఖములు పొడమును. ఇహ లోకముకంటెఁ బర మగుస్వర్గనరకాదులు లేవు. శివలోకాదులు మూఢు లగు వారిచేఁ గల్పింపఁబడియె. ఇష్టభోగావాప్తియే స్వర్గము. వైరిశస్త్రాద్యుపఘా తమే నరకము.

## ఆ ర్హ త మ త ము.

దీనికే జైనమత మని పేరు. ఈమతమందు జగత్తు కార్యరూపముగా నసత్యము, భిన్నము, ననిత్యము, కారణరూపముగా సత్యము, అభిన్నము, నిత్య ము. ఆత్మ దేహానురూప పరిమాణము గలది. ఈ మతస్థులు ప్రాణిహింసను మాని దిగంబరు లై, విషయవైరాగ్యము నవలంబించి దేహమునందు మలము బూసికొని పాణిపాత్రభోజను లై కేశోల్లుంచనముఁ జేసికొని వాఙ్నియమము గలవా రై యుండవలయును. మలధారణాదికము వలనను, ఆత్మజ్ఞానము వల నను, బ్రకృతివినిర్ముక్తు లై యూర్ధ్వగతి ప్రాపించుటయే మోక్షము.

---

## బౌ ద్ధ మ త ము.

దీనికి సౌగతమత మని మఱియొక పేరు. ఈ మతస్థులు నాలుగు తెగల వారు. 1. యోగాచారులు. 2. సౌత్రాన్తికులు. 3. వైభాషికులు. 4. మాధ్య మికులు. వీరిలో మొదటివా రగు యోగాచారులు జ్ఞాతృజ్ఞేయంబులవలన జ్ఞాన మొక్కటి జ్ఞాతృజ్ఞేయ జ్ఞానభ్రాంతిం గలిగించుచున్నది. అదియును క్షణిక మని చెప్పుదురు. రెండవ తెగవారు మూఁడవ తెగవారు పరమాణు సంఘాతమే జగ మనియు, క్షణిక విజ్ఞానమే యాత్మ యనియుఁ బలుకుదురు. కాని వైభాషికులు జగము ప్రత్యక్షసిద్ధం బనియు, సౌత్రాంతికు లనుమానసిద్ధం బనియుఁ జెప్పు దురు. ప్రమాతృ ప్రమాణ ప్రమేయంబు లన్నియు శూన్యంబు లనియు శూన్య ముచేత శూన్యము నెఱుంగుటకంటెఁ బరమార్థంబు లే దనియు మాధ్యమి కుల మతము.

## పా శు ప త మ త ము.

పాశుపతు లీశ్వరుం డనుమానానుగృహీత శైవాగమసిద్ధుం డనియు నతఁడ జగంబునకు నిమిత్తకారణుఁ డనియుఁ బరమాణువులె యుపాదానకారణం

బనియు, శైవాగమంబునఁ జెప్పఁబడిన కంఠిక, రుచకము, కుండలము, శిఖామణి, భస్మము, యజ్ఞోపవీతము నను నాఱుముద్రలను ధరించుటయు, సురాకుంభస్థాపనంబును, సురాకుంభస్థదేవతార్చనంబును, గూఢాచారంబును, శ్మశానభస్మస్నానంబును, ప్రణవపూర్వకధ్యానంబును, మొదలగు కర్మలచే నణుస్వరూపుం డగుజీవునకు గలమలమయకర్మ తిరోధానము నివర్తించఁగా శివసారూప్యంబు నొందుటయె మోక్షం బని చెప్పుదురు.

---

## నైయాయికవైశేషికమతము.

ఈశ్వరుఁడు నిమిత్తకారణము. అట్టియీశ్వరుఁ డున్నాఁ డనుటకు జగము సావయవము గావున ఘటాదులవలెనే పుట్టినది. జనిమత్తయిన దంతయు దానియుపాదానోపకరణసంప్రదాన ప్రయోజనాదు లెఱింగినవానిచేతనే చేయఁబడుట కానవచ్చుచున్నది. కాఁబట్టి జగము నిర్మించునేర్పుగలవాఁడును కర్మపరవశు లైపరిమితజ్ఞానముగల జీవులకంటె విలక్షణుం డగునొకఁడు సర్వజ్ఞుఁ డుండవలయు నను ననుమానంబు సాధకము. అనాదికర్మప్రవాహంబున సుఖదుఃఖానుభవం బనుసంసారముం జెందియున్న జీవులలో నొక్కొక్కం డెవ్వఁడేని యీశ్వరప్రీత్యర్థంబుగా వేదోక్తకర్మంబుల నాచరింపుచుం దత్ప్రసాదలబ్ధం బైన యష్టాంగయోగంబున నాత్యంతిక దుఃఖనివృత్తి యనుమోక్షంబుఁ బడయును. ఆత్యంతికదుఃఖనివృత్తి యనఁగా మఱియెన్నఁడుఁ బుట్ట కుండ దుఃఖము మళ్లిపోవుట యని నైయాయికవైశేషికమతము. జ్ఞానసుఖదుఃఖాదు లెవ్వియు నుండవు గావున నిది పాషాణముక్తి యని వీ రందురు.

## పూర్వమీమాంస.

వీరుభాట్టు లనియుఁ బ్రాభాకరు లనియు రెండువిధములు. ఆత్మముల కనాదికాలమునుండియుఁ జేయంబడు పుణ్యపాపరూపకర్మప్రవాహంబున సంసార మనాదిగా నున్నది. ఒక్కకాలంబున సృష్ట్యాదులు నొకకాలంబునఁ బ్రళయంబునుం గలుగదు. కర్మములలో నిషిద్ధకర్మంబులఁ జేయువారు వానిప్రాబల్యతారతమ్యంబునం గ్రిమికీటాదిజన్మంబులును, నరకంబును జెందుదురు. కామ్యకర్మంబులఁ జేయువారు వెండియుం బుట్టుచుందురు. వేదవిహితంబు లగు యజ్ఞాదికర్మంబుల ఫలాభిసంధిరహితంబుగా నాచరించినయెడల దత్కర్మాచరణంబున నుద్భవిల్లు నపూర్వంబె కర్మనమ్బంధ నివృత్తిపూర్వకం బగు కేవలాత్మప్రాప్తి

యనెడుమోక్షంబు గలిగించును. అప్పుడు నిత్యసుఖాభివ్యక్తి యగును. చతుర్థ్యంత వినియోగంబె దేవత యని వ్యవహరింపఁబడును గాని ఫలము నిచ్చు దేవత యనుచేతనుం డని యుభయులును జెప్పుదురు.

---

## అద్వైతము.

నిర్విశేషచిన్మాత్రం బగుబ్రహ్మం బొక్కటియే పరమార్థము. తదతిరిక్తంబు లగుజ్ఞాతృజ్ఞేయజ్ఞానభేదంబులు లేవు. నిర్విశేష మనఁగా సకలవిశేషరహితము. విశేష మనఁగాభేదము. అది సజాతీయవిజాతీయస్వగతభేదము లని మూఁడువిధములు. వీనిలో సజాతీయభేద మనఁగా నొకజాతి వయిన ఘటాదివస్తువులలో నొకదానితో మఱియొకవస్తువుకుఁ గలభేదము. చిద్బ్రహ్మలభేదము సజాతీయభేద మనంబడు, చిత్తు లనంబడుజీవు లెల్ల బ్రహ్మంబుకంటె వేఱుగాదు. కాన నిట్టిచిద్బ్రహ్మభేదంబు లేదు. అచిత్తనంబడునవిద్య యను నొకవిజాతీయవస్తువు గలదు. అది హేయవస్తువు. దానిసమ్పర్కమువలన బ్రహ్మమునకు జీవిత్వంబు గలిగె. ఈ యవిద్యకు మాయ యనియు, బ్రకృతి యనియు నచిత్తనియు నామాంతరములు. ఇది యనాది. దీని కావరణశక్తి యనియు విక్షేపశక్తి యనియు రెండుశక్తులు గలవు. ఇది యీశక్తిద్వయముచే జీవులకు స్వస్వరూపంబు గానరా కుండఁ జేసి నానావిధ భేదభ్రాంతులను గలిగించుచున్నది. అట్లుండియు నది మిథ్యాభూతంబు గాన నచిద్బ్రహ్మభేదం బనువిజాతీయభేదంబుం గలుగదు. సచ్చిదానందఘనస్వరూపం బగుబ్రహ్మమునకు స్వరూపముకంటె వేఱుగా సత్తాజ్ఞానానన్దాదిగుణములు లేవు గాన స్వగతధర్మభేదంబును లేదు. అట్టియవిద్యచేత భ్రమనొందుచుండుటయే జీవునకు సంసారము. తత్త్వమస్యాది వాక్యజన్యజ్ఞానంబున నవిద్య నివర్తిల్లుటయే మోక్షము.

---

## మధ్వమతము.

ఈశ్వరుండు జగంబునకు నిమిత్తకారణుఁడు. అతండె విష్ణువు. అతఁడనంతకల్యాణగుణపరిపూర్ణుండు, జ్ఞానానందాద్యాత్మక కల్యాణ విగ్రహవిశిష్టుండు. జీవు లణుస్వరూపులు. వారలు తమోయోగ్యులు. నిత్యసంసారులు ముక్తియోగ్యులు నని మూఁడుదెగలవారు. అందు ముక్తియోగ్య లగువారి కిహాముత్ర ఫలభోగవిరాగాది విష్ణూపాసనాంత సాధనసంపత్తివలన యోగ్యాపరోక్షజ్ఞానంబు గలిగిన నందు వలనం దత్తత్స్వరూపయోగ్యం బగునానందం బావిర్భవించు నని చెప్పుదురు.

ఈ నాటకమునకుఁ గృష్ణదేవరాయలమంత్రి యగుసాళ్వతిమ్మరాజు (తిమ్మరసు) నకు భాగినేయుఁ డగునాదిళ్ల గోపనమంత్రిచే రచింపఁబడిన చంద్రిక యనువ్యాఖ్యాన మొక్కటియు భట్టవినాయకాత్మజ దీక్షిత రామదాసవిరచితంబగుప్రకాశ యనువ్యాఖ్యాన మొక్కటియు నచ్చుపడి యున్నవి.

## ఆంధ్రీకరణము.

ఈ ప్రబోధచంద్రోదయముఁ దెలిఁగించిన కవులు నందిమల్లయ్య ఘంటసింగయ్య యని లోఁగడ జెప్పి యున్నాను. ఈయిరువురు కవులు కలిసియే గ్రంథములను వ్రాయుచు వచ్చిరి. వీరు రచించిన మఱి యొకగ్రంథము వరాహపురాణము. దీనిని వీరు కృష్ణదేవరాయల తండ్రి యైననృసింహరాజున కంకితముఁ జేసిరి. ఈ ప్రబోధచంద్రోదయము ననంతామాత్యునిపుత్త్రుఁ డయినగంగయ్యమంత్రికిఁ గృతి యిచ్చిరి. ఈయుభయులలో మొదటివాఁ డైననందిమల్లయ్యకు రెండవకవి యైనఘంట సింగయ్య భాగినేయుఁడు. ఘంటసింగయ్యకు మలయమారుతకవి యని బిరుదు గలదు. వీరిరువురకును గలబంధుత్వము ప్రబోధచంద్రోదయములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. కలఁడు కౌశికగోత్రకలశాంబురాశిమన్దారంబు సంగీతనందినంది
సింగమన్త్రికిఁబుణ్యశీలపోతమ్మకు నాత్మసమ్భవుఁడు మల్లయమనీషి
యతనిమేనల్లుఁ డంచితభరద్వాజగోత్రారామచైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁబుణ్యచరిత్రయమ్మలాంబకు గూర్మితనయుండు మలయమారు
గీ. తాహ్వయుఁడు సింగనార్యుండు నమృతవాక్కు లీశ్వరారాధకులు శాంతు
లిలఁ బ్రసిద్ధు
లుభయభాషలనేర్పరులు సమరులును,మధుర లీకృతిరాజ నిర్మాణమునకు.

వీరు స్వప్రణీతప్రబన్ధముల యాశ్వాసాంత గద్యములలో గూడ నుభయనామములను జేర్చి

"ఇది శ్రీమదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారస్వతాభినందినంది సింగయామాత్యపుత్త్ర మల్లయ మనీషితల్లజ మలయమారుతాభిధాన ఘంటనాగయ ప్రధానతనూభవ సింగయ కవిపుంగవ ప్రణీతంబయిన"

అని వ్రాసికొని యున్నారు. వీ రిద్దఱును నియోగిబ్రాహ్మణులు. వీరిలో మొదటివాఁడయిన నందిమల్లయ్య కౌశికగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు, దక్షిణామూర్తిశిష్యుఁడు. రెండవవాఁడైన ఘంటసింగయ్య భరద్వాజగోత్రుఁడు. ఆప

స్తంబసూత్రుఁడు. అఘోరశివశిష్యుఁడు. వీరురచించిన వరాహపురాణమందీ యంశములనే యిట్లు వ్రాసియున్నారు.

"సీ. అపుడు సభావేది కాగ్రస్థితుల మైన మమ్ము వాగీశ్వరీమంత్రరాజ
సిద్ధిపారగుల కౌశికభరద్వాజ గోత్రుల మహాదేవాంఘ్రిజలజభక్తి
పరతంత్రమతుల నాపస్తంబసూత్రుల గురుదక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యులనతికాన్త చిత్తులఁ దనకునాశ్రితుల భాషాద్వయకృతి నిరూఢ
గీ. శేముషీభూషణుల నందిసింగనార్య, తనయుమల్లయకవికులోత్తమునిఘంట
నాగధీమణికీర్తినందనుని మలయ, మారుతాంకితు సింగయ్యమంత్రిఁ జూచి."

---

వ రా హ పు రా ణ ము.

ఈ కవులు వరాహపురాణమునందుఁ గృతిపతియైన సాళువనృసింహరాజు యొక్క వంశమును వర్ణించుచుఁ జంద్రవంశపురాజయినగుండరాజునకు సాళువ మంగరాజును, అతనికి గౌతరాజు నమ్మహీపతికి గుండరాజు నానరపాలునికిఁ దిమ్మ రాజును జైమినిభారతము గృతి నందిన నరసింహరాజును జనియించినట్లును, వరాహపురాణమును గృతినందిన సాళువ నరసింగరాజు తండ్రి యైన యీశ్వరరాజు పైని వ్రాయఁబడిన నరసింహరాజువద్ద సేనాధిపతి యై యుండినట్లును వీరిది తుళువవంశ మయినట్లుఁ జెప్పియున్నారు.

ఈ తిమ్మయ యీశ్వరరాజు సాళువ గుండనరసింహరాజునకు సేనానాయకుఁడై యుండుటయే కాక దాయాదుఁడు కూడనై యుండుటచే నాతనియనంతరము రాజ్యభారమును వహించినట్లు గ్రంథనిదర్శనమువలన గానవచ్చుచున్నది. వరాహపురాణమును గృతి నందిన నరసింహరాయనికాలము మనకుఁ దెలియును గనుక, యించు మించుగా నీ కవులకాలమును మనకుఁ దెలియును. కృష్ణదేవరాయల తండ్రి యైన యీనరసింహదేవరాయలు క్రీస్తు శకము. 1487 వ సంవత్సరము మొదలుకొని 1502 వ సంవత్సరమువఱకు రాజ్య మేలినట్లు శాసనాదులవలనఁ దెలియవచ్చుచున్నది. కాఁబట్టి నరసరాయలకాలములో నున్న యీకవులు హూణశకము. 1487 వ సంవత్సరమునకును 1502 వ సంవత్సరమునకును మధ్యకాలమునందీ ప్రబంధములను రచియించి రని యూహింపవచ్చును. ఈ యిరువురు కవులును గలిసి గ్రంథరచనఁ జేసినట్లు చెప్పఁబడియున్నను. వీరిలో మలయమారుతకవి యనఁబడెడు ఘంటసింగన్నయే ప్రసిద్ధతరుఁడై నకవి యైనట్టు గ్రంథాంతరనిదర్శనమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈ సింగయ్య తండ్రి నాగయ్య; తల్లి, అమ్మలాంబ. పారి

జాతాపహరణమును రచియించిన ముక్కు తిమ్మకవి యీమలయమారుత కవికి మేనల్లుఁడై నట్లు పారిజాతాపహరణ ప్రబంధముఖమందు ముక్కు తిమ్మకవియే వ్రాసి యున్నాఁడు.

"సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబసూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁదనయుండు సకలవిద్యావివేక
చతురుండు మలయమారుతకవీంద్రునకు మేనల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయాన మహాగ్రహారసన్మానయుతుఁడు
గీ. తిమ్మయార్యుండు శివపరాధీనమతియ, ఘోరశివగురుశిష్యుండుఁ పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నంధ్రభాష,నాదివాకరతారాసుధాకరముగ."

---

పా రి జా తా ప హ ర ణ ము.

ఇట్టి వీరు దృశ్యకావ్య మైన ప్రబోధచంద్రోదయమును శ్రవ్యకావ్యముగా నాంధ్రీకరించియున్నారు. నాటకమును మార్చి ప్రబంధముగా వ్రాయుట కావ శ్యక మైన మార్పులఁ జేసియున్నారు. కాని యచ్చ టచ్చట మాతృకలో సంగ్ర హముగా నున్నయభిప్రాయములఁ గొంతమట్టుకు విస్తరింపఁజేసి యు మఱికొన్ని స్థలములయందు విస్తృతముగా నున్న యభిప్రాయములను సంగ్రహింపఁజేసి యు నాంధ్రీకరించి యున్నారు.

ఎట్లన ; వఖలు ప్రయోజనం కారణం వా విలోక్యమాయా ప్రవర్తతే । స్వభావః ఖ
ల్వయం స్త్రీపిశాచీనాం । పశ్య॥ శ్లో॥ సమ్మోహయన్తి రమయన్తి విషాద
యన్తి నిర్భర్త్సయన్తి మదయన్తి విడంబయన్తి । ఎతాః ప్రవిశ్య సదయం
హృదయం నరాణాం కిం నామ వామనయనా న సమాచరన్తి॥
గీ. అరయ నాతఁడు నిర్లేపుఁడగుటహానిఁ, బొరయఁడిమాయ కావించుబూటకములు
పాయ కెప్పుడు పురుషుల భ్రమల నిడుట, సహజ మింతియ నారీపిశాచములకు.
సీ. వన్నెలు పచరించి కన్నుసన్నలు చేసి వెడమాటలను బ్రేమ గడలు కొలిపి
తరితీపునటనలఁ దమకంబు పుట్టించి వట్టిప్రియంబుల గుట్టు తెలిసి
కలికితనంబునఁ గాఁకలు గావించి తోడిసీడలు వోలెఁ గూడిమాడి
యలుకుల నలయించి కలయిక వలపించి బాసల నడియాన పాదుకొల్పి
తే. మనసుకరఁగించిభ్రమయించివిస్తరించి,మిగులజొక్కించియెంతయుఁదగులుపఱిచి
పాసి మొదఁబాసి తమఖంటుఁ జేసికొనరె, వామలోచన లెంతటివారి నైన.

ఈపద్యములో మూలములో లేని మఱికొన్నింటిఁ గూర్చియున్నారు.

నాటకాదియందలి రెండుశ్లోకముల యర్థమును "ఎఱుఁగని వానికి దేవుఁడు" అను సీసపద్యమున సంగ్రహించిరి.

2. (శ్లో) నిహతస్య పశో ర్యజ్ఞే స్వర్గప్రాప్తి ర్యదీష్యతే ।
స్వపితా యజమానేన కిం న తస్మా న్నిహన్యతే॥

ఈ శ్లోకమున కాంధ్రీకరణము కానరాదు.

3. చార్వాకమతమం దీకవులు "పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లే తత్త్వంబులు" అని వ్రాసియున్నారు. చార్వాకమతమం దాకాశమను భూతము లేదు, ఆమతస్థులు నాల్గు భూతముల నే యొప్పుకొన్నారు.

4. మహామోహః. భో అసత్సంగ ఆదిశ్యంతాం కామక్రోధలోభమదమానమాత్సర్యాదయః యథా యోగినీ విష్ణుభక్తి ర్భవద్భి రే వావహితై ర్విహంతవ్యేతి.

యోగిని యగువిష్ణుభక్తిని సంహరించుటకుఁ బ్రయత్నము సల్పు మని మహామోహుఁడు కామక్రోధాదుల కసత్సంగునిద్వారా వర్తమాన మంపినట్లు మూలములోనున్నది. తెలుఁగులో "కామక్రోధాదు లెదుట నున్నట్లును, వారితోనే మహామోహుఁడీవార్త చెప్పినట్లున్నది.

5. " మ. పడఁతీ తల్లిని దండ్రిఁ జంపుట తృణప్రాయంబు తోఁబుట్టులన్
మడియం జూచుట లెక్కగా దనిన జన్మక్షాతికీటంబులన్
గెడపం బూనుట నాకు దొడ్డ గుడిగ్రమింగేవానికిం దల్పుల
ప్పుడము ల్గావుసఁ బిల్లపిల్లతరము న్భక్షింతు దాయాదులన్

మూలములో లేని లోకోక్తి నొకదాని నిందులోఁ జేర్చిరి.

9. మూఁడవయాశ్వాసములోఁ గాపాలికుఁడు చెప్పుచున్నాఁడు.

సీ. పుట్టింప రక్షింపఁ బొలియింపఁ గర్తయా భైరవేశ్వరుఁడు మాపాలివేల్పు
ప్రమద నటద్భూతభయదశ్మశాన శృంగాటకంబులు మాకు నాటపట్లు
నక్షత్రపటలీవళక్షంబు లైననరాస్థిఖండములు మాహారలతలు
నీహారకరబింబనిభమానవశిరః కపాలము ల్మాభుక్తిభాజనములు

గీ. గాఁ జరింతుముతమలో జగంబు లెల్ల, వేఱు వేఱైనశివునితో వేఱుగావ
టంచుఁ జూతుము సిద్ధయోగాంజన ప్రదీపితం బైనసుజ్ఞాన దివ్యదృష్టి.

పైని వ్రాయఁబడిన పద్యమున కీక్రింద నున్నశ్లోకము.

మూలము. శ్లో. నరాస్థిమాలాకృతభూరి భూషణ శ్శ్మశానవాసీ నృకపాలభోజనః
పశ్యామియోగాంజనశుద్ధదర్శనో జగన్మిథోభిన్నమభిన్నమీశ్వరాత్।

ఇట్లు పలుచోట్ల వీరిభాషాంతరీకరణమందు వైషమ్యము కాన వచ్చుచున్నది. కాని గ్రంథవిస్తరభయమువలన వాని నన్నింటి నిచటఁ జూపుట మానితిని.

## శైలి.

శైలికదళీపాకము. కవిత్వము రసవంతముగా నున్నది. 1 అచ్చటచ్చటఁ గొన్నిమామూలపదములు ప్రయోగింపఁబడినను జదువువారికి సులభముగా నర్థమగును. 2 కొన్నిచోట్లసంధులు పదప్రయోగములు విలక్షణముగాఁ గానవచ్చుచున్నవి. 3 ఈకవులు తమపద్యములలో విరళముగా లోకోక్తులను వాడియున్నారు.

1 ఇందులోని యపూర్వపదములు.

1 సురతాణి. 2 మోస (మోసము) 3 అడవోడ. 4 ఎడమపెని. 5 నల్లమేకతప్పు. 6 సంబెళ. 7 సాహెబూ. 8 కటికవారు. 9 విరాకులవిత్తు. 10 గాజు. 11 కరవేదన. 12 ఇవతాళించు. 13 వరాళి. 14 కోయిలతొత్తులమిూరి. మొదలగునవి.

వీనిలో విరాకులవిత్తు, వరాళి యనుపదము లేనిఘంటువునందును గానరావు.

2. ప్రయోగములు = అణగుండె. 2 బంట్లైనకవి నీకుఁ బదివేల దండాలు. 3 గుడి ట్రింగేవానికి. 4 చాలదినాలనుండి. 5 గూడితంటరాకు. 6 ఒడిసివడిన్నెగయు గృధ్రియుంబలెనన్నున్. 6 ఊరక వేదాలు నోరికోలఁది.

3. వీరు రెండుమూఁడుపద్యములలో లోకోక్తుల నిమిడ్చిరి.

1. సీ. ఏమిరా తాఁ జెడ్డకోమటి వెనకయ్య చేతికి వెసల యిచ్చిన విధమున,

2. రెండిటికిని జెడినరేవఁడవై వృథాఁబోడవైతి వెందుగూడవైతి.

3. గుండిట్రింగేవానికిం దల్పులప్పడముల్గావున.

మేడేపల్లి వేంకటరమణాచార్యులు.

# ఉపన్యాసవిమర్శనము.

[ఆంధ్రసాహిత్యపరిషత్తృతీయవార్షికోత్సవమున నగ్రాసనాధిపతు లగు రావుబహదరు కిళాంబిరామానుజాచార్యులుగారు ప్రారంభమున నిచ్చిన యుపన్యాసమునీఁది విమర్శనాభిప్రాయము.]

లక్షణవిరహిత మగుభాష గ్రామ్యమనఁబడును ఇయ్యదిగ్రాంథికభాషగా వాడుటకుఁ దగినది కాదు. అందువలననే మనపూర్వులగుకవివరు లందఱు గ్రామ్యము నాదరింపక తమకావ్యముల నెల్ల గ్రాంథికభాషయందే వెలయించిరి గ్రామ్యశబ్దము. శాస్త్రముచే సాధురూపము గల దయ్యును నసభ్యార్థము నిచ్చు శబ్దమనియు, సభ్యార్థము కల దయ్యును శాస్త్రముచే నసాధురూపము గలశబ్ద మనియు, నర్థద్వయము లభించుచున్నది. ఈయపశబ్దమును "నమ్లేచ్ఛితవై నాపభాషితవై" యనుభాష్యకారులవారి యనుశాసనముసైతము ప్రయోగింపఁ గూడదనియే బోధించుచున్నది. మఱియు "ఏకశ్శబ్దస్సుష్ఠుప్రయుక్త స్సమ్యఙ్జ్ఞాతస్స్వర్గే లోకే చ కామధుగ్భవతి" అనియు శ్లో॥ గౌర్గౌఃకామదుఘాసమ్యక్ప్రయుక్తాస్మర్యతే బుధైః। దుష్ప్రయుక్తా పున ర్గోత్వంప్రయోక్తు స్సైవ శంసతి॥ అనియుఁ గలదు. ఇట్లున్నను దీనిని లంఘించి. అవైహి - త్రియంబకం - హేసుభ్రు - మొదలగునవి సంస్కృతకవివరులును. జీవగట్టు - ప్రాణగొడ్డము - కవిలగడ్డము - కపిలజడలు - కలకంఠుఁడు - పసుపుకీచ్చిరి - వాయింపుచు - పట్టుక - నెట్టుక - మొదలగుశబ్దముల నాంధ్రకవివరులును బ్రయోగించినట్లు మనమును నిచ్చకు వచ్చినపగిది గ్రామ్యము నెందుల కుపయోగింపరాదు? అందురేని, అసాధురేవ - ప్రమాదపాయం - ఇత్యాదివచనములచే లాక్షణికులు వానిని నిరాకరించియే యున్నారు. కొందఱు మహాకవులయందలి గౌరవముచే వారు వాడినగ్రామ్యములను మాత్రమే తమగ్రంథములలోఁ గాదాచిత్కముగ బుజ్జగించుచు వచ్చిరి కాని వానికాయపశబ్దబిరుదము మాత్రము తొలఁగింప నేరరైరి. పూర్వకవులైనను "ప్రమాదో ధీమతామపి" అనియుండుటం బట్టి ప్రమాదముగ వాని నుపయోగించియుందురు కాని యర్వాచీనుల కీ మనగ్రామ్యశబ్దములు సుఖముగా గ్రామ్యభాషను గ్రాంథికభాషగా వాడికొనుటకుఁ బ్రమాణమగుఁ గాకయని మనలఁ గనికరించి బుద్ధిపూర్వక

ముగ వాడినవారుకారు. ఈకారణములవలన పూర్వులగ్రంథములలో గ్రామ్యము గ్రాంథికముగ నుపయోగించుకొనుటకుఁ దగినయాధారము లేవియు మనకున్నట్లగపడదు. పోనిండు సత్కార్యాచరణమున కొకరిమార్గదర్శిత్వ మేల? లోకోపకార మగునట్లు, పఠితలసౌలభ్యసంపత్తికిని భాషాభివృద్ధికిని హేతువుగా సార్వజనీన మగువ్యావహారికభాషను మనయంత మనమే స్వతంత్రించి గ్రాంథికముగఁ జేసికొనఁ గూడదా? అనిన మంత్రద్రష్టల కెనవచ్చెడి యసామాన్యబుద్ధివైశద్యము గల బహుభాషాశోధకు లగునన్నయాదులు మనభాషావిషయ మంతయుఁ గరతలామలకముగ వీక్షించి యధునాతనుల కవకాశము లేకుండఁగ నే తగురీతి సంస్కరించి పూర్ణస్థితికిఁ దెచ్చి భాషకుగ్రంథార్హత సంపాదించి పెక్కుగ్రంథములు సైతము రచించి సౌలభ్యమును గూర్చుటయే గాక పదపడి గ్రామ్యాదుల సంపర్కముచే భాష చెడి తన్మూలమున జను లనాగరకప్రాయులు కాకుండ ననుల్లంఘ్యము లగువ్యాకరణాది నియమములఁగూడఁ గావించి లోకమున కనితరసాధ్య మగు మహోపకారము నొనరించియే యుండిరి. అట్టినియమముల నెల్లనిఁ దొలగించికొని మనము భాష కింక నేదేని నూతనవిలక్షణము సంపాదింపవలయు నని సదుద్దేశముతోఁ బ్రయత్నించినను నది వేఱుతీరుగఁ బరిణమింపక మానదు. ఇకఁను గ్రంథములయందే కాక వ్యవహారములోఁ గూడ నుండినప్రతిదేశభాషయుఁ గాలక్రమమున మార్పుఁ జెందుచుండుట స్వభావసిద్ధ మగుటవలన మనభాషయు నప్పుడప్పుడు దానియంత నదియే యించించుక మాఱుటకన్న నాస్వాభావిక మగు మార్పును మన మంగీకరించి యందున కూఁతముగ నొక్కమాఱుగనే «ఏసమయమున నున్నపండితుల వాడుకభాష యాసమయమునఁగలవారిచే సాధుత్వనిర్ణయమునఁ బ్రమాణముగ నంగీకరింపఁబడుచు వ్యావహారికభాషయందే యిఁక నుండి గ్రంథముల వ్రాయవలసిన” దని నిశ్చయించు కొనుటయే సమంజస మని తలంచినచో నాస్వభావసిద్ధ మగుమార్పు మన కిదివఱ కేమియు నుపచరించిన ట్లగపడదు కాన దానిని శాశ్వతముగఁ గావలయు నని వెనుకటికంటె నధికముగఁ దెచ్చి నిలుపుకొనుట కన్న నీప్రయత్నము లన్నియు నెల్లవారిచేఁ గొనియాడఁ బడుచు నెందును గొఱంతవడక చిరకాలానుష్ఠితమై వచ్చుచున్న మనగ్రాంథికభాష కే.యొనర్చి దానినిఁ బరిశుద్ధముగఁ గాపాడికొనుచుఁ బూర్వులు చూపినమార్గముననే మనభాషావ్యాకరణమునకు వశపడునట్లు నూతనశబ్దములఁ గైకొనుచు నపూర్వవ్యాపారములు వృద్ధినొందునకొలంది నూతనశబ్దములఁ గల్పించుకొనుచుండుటయే

ల గ్గగును. ఇంకను వాడుకభాషకుఁ బండితుల వ్యావహారికభాష నాదర్శముగ నుంచికొనుటకు నిప్పటివారును నికముందు రాఁబోవువారును రాజభాష నేర్వ ని ది పండితులేకారు. గాన నాయితరభాషాధ్యేత లగుపండితులు వాడుకొనుభాష చాల వఱకు నితరభాషాపదములు గలదిగనే యుండును తక్కినది మన కెంత సాధుత్వ సంపాదకముగ నుండునో తెలియదు. ఇది గాక వారివ్యవహారములో భాషలోని యెల్లశబ్దము లుండుట కవకాశ మెక్కడిది ? ఇఁక రాజభాష నేర్వనిసంస్కృతభాష నభ్యసించిన దేశభాషావేత్త లన్ననో సుశబ్దముగనో యపశబ్దముగనో యితర భాషాపదప్రయోగ కుతూహలముననో విది లేక యో యెట్లో కొద్దియో గొప్ప యో వాడుకలో నన్యభాషాపదప్రయోగము చేయుచునే యుందురు. వీరివ్యవ హారమందును భాషలోని సకలశబ్దములకును బ్రయోగముగ విషయమున పరిపూ ర్ణతకలిగియే యున్నది. కానఁ బండితులవాడుకభాష వాడుకభాషకు సాధుత్వ నిర్ణాయకము కానేరదు పృషోదరాదులవలె శిష్టోచ్చారితములు గ్రహింపఁబడుట భాషవ్యాకరణాదినియమములు లేక పరిపూర్ణపరిణామస్థితికి రాకమునుపు గాని తరువాతఁ గాదు. వ్యావహారికభాషలో గ్రంథములు వ్రాయుటవలన భాషాభివృద్ధి యైనను గాకపోయినను నొకమండలములోని వారిచే వ్రాయఁబడిన గ్రామ్యభాషా గ్రంథములు వేఱొకమండలములోనివారి కెంత పండితులకేనిఁ దలనొప్పి ఘటింపక పోవు. అందునను నాంధ్రదేశపు నడిగడ్డలో నున్నమండలములోని గ్రామ్యభాష లకుఁ గలపరస్పరభేదమున కన్న నైజాముమండలములలోని శిష్టులచే వాడఁబడు భాషలోఁ గూడ సగమునకుఁ బైగా మ్లేచ్ఛభాషాపదము లుండును. వానిని తీసి వేయఁగా మిగిలినవానిలోఁ జాలభాగము చాఱుమూలములేక మా కందఱకు నవ్వు పుట్టించు వింతపదములు గలది గనుండును. మొత్తముమీఁద నైజాముమం డలములలోని యాంధ్రభాష యది యొకయభినవాంధ్రభాష యనుటలో నతిశ యోక్తి లేదు.

ఈయభినవాంధ్రభాషలో నైజామురాష్ట్రవాసులును గ్రంథములు వ్రా సినచో నవియెట్లుండునో యది యనుభవైకవేద్యముఁ పోనీ వారు వ్రాయ కుం దురుగాక యనికొందమేని యితరమండలములవారి కందఱకును గ్రామ్యగ్రంథము లు వ్రాసికొన నధికారము గలిగినప్పుడు వారు మాత్ర మెట్లు వ్రాయకుందురు ? ఇం కొకటి యాంధ్రదేశమధ్యమమున నున్నమండలములలోని భిన్నభిన్న మగుగ్రా మ్యభాష వారిలోవారికే వియో యల్పసంఖ్య గలకొన్నిశబ్దములు దక్కఁ దక్కిన

దంతయు సుగమముగనే యుండును. ఈ నైజామమండలములలోని గ్రామ్యభాష మాత్ర మట్లుకాక నైజాము రాష్ట్రవాసులకంటె నితరు లగుసకలమండలవాసుల కును భాషయంతయు దుర్గ్రాహ్యముగనే యుండును. మచ్చుఁజూపుటకు నైజాము మండలములలోని గ్రామ్యశబ్దములను మాత్రమిచటఁ గొన్నిటి నుదాహరించు చున్నాఁడను.

కంకపెనాలు - వెదురుగుములు.
గుల్ల - బుట్ట.
రాతు - శిల.
బొక్కలు - ఎముకలు.
చేరేళ్లు - ద్వారబంధములు.
దుత్త - పశువులమెడపట్టెడ.
పిక్కలు - మామిడిపండ్లు మొదలగువాని గింజలు.
పడగొట్టు - పంపించు.
పుల్లగండోడు - పోకిరివాఁడు.
పాలబిందె - నలికండ్లపాము.
పోరి - బాలిక.
పోరడు - బాలుఁడు.
పెంకాసు - పెంకు.
పానాదులు - బజారులు.
పెయ్యి - శరీరము.
గీరలు, గిఱ్ఱలు - బండిచక్రములు.
పుంటికూర - గోఁగాకు.
తొంగులుబోడుచుట - మొట్టుట.
కచ్చడం - సవారిబండి.
కణలలుతీయుట - ఊరేగింపుచేయుట.
కంచుడు - మూఁకుడు.
పంజకొక్కులు-బావిగిలకతిరిగెడిచెవులు.
కుడితినీలు - చొక్కాలు.
అయ్యోపట్టికనే - కనుకనే.

తేవులు - త్రేఁపులు.
దుబ్బ - దుమ్ము.
దొడ్డు - లావు.
తాయపెంకు - ఇనుపసిబ్బి.
ఆరిశలుజోడు - సులోచనములు.
అలుకుట - విత్తనములు చల్లుట.
ఇక్కెర - హారతి కర్పూరము.
ఇలపీట - కత్తిపీట.
కలప, అశ్వ - మంగలివానిపొది.
కొత్తలు - పైసాలు - హాలీడబ్బులు.
కొరకాసు - కొఱవి.
చక్కిలంముక్కిలం - పద్మాసనము.
లండోడు - పనికిమాలినవాఁడు.
లొల్లి - అల్లరి.
లెంకులాడుట - వెదకుట.
జోకుట - తూఁచుట.
యాష్ట - విసువు.
కూసం - చిన్నఅయికగుడ్డ.
పాపచ్చులు - ముచ్చెలు.
శాయి - సిరా.
బరిబాతల - దిగంబరిగా.
చికిలుడుకాయలుపెట్టుట - గిలిగింతపెట్టుట.
యారాలు - తోడికోడలు.
తోలుకొనిపోవుట - పిలిచికొనిపోవుట.

ఇత్యాది నైజామురాష్ట్ర గ్రామ్యశబ్దము లాంధ్రదేశమధ్యమండలముల వారికిఁ గొంచెమేని యెట్లు తెలియవో యట్లే పైఁ జెప్పినశబ్దములవంటి గ్రామ్య శబ్దముల నింక నెన్నియేని నిత్యకృత్యములతో వ్యవహరించుకొను నైజామరాష్ట్ర వాసులకును నాంధ్రదేశమధ్యమండలవాసులభాష యేమియుఁ దెలియఁ దని వే రుగఁజెప్పబనిలేదు. కావున గ్రామ్యభాష పలుకారణములవలన మహాకఠినమై సకలజనవేద్యము కాదు. ఉత్తములవ్యావహారికభాష గ్రహింత మన్నను వారి వాడుకలోఁ గూడ సార్వజనీనములు కానిపైఁ జెప్పినభేదము లనేకములు కన్పట్టు చున్నవి. అందు వలన మనగ్రాంథికభాషలో వ్రాయఁబడిన గ్రంథములును వా డుకభాషలో వ్రాయఁబడిన గ్రంథములును గురూపదేశములేక తెలిసికోఁదగినవి గాక గ్రామ్యవాదుల యభిప్రాయప్రకారముగ సౌలభ్యవిషయముగ రెండును నొ క్కటియే యైనవి. ఆకారణమున జనసామాన్యమునకుఁ దెలియుటకై యాయా మండలములవా రాయామండలముల వారికొఱకు వారివారిసామాన్య గ్రామ్య ముననే పుస్తకములు వ్రాయవలసివచ్చుచున్నది. అట్లు వ్రాయుటవలన నొక్క టిగ నున్నయాంధ్రభాషను బహుభేదములు గలదిగఁ జేసికొనుటయు దానివలన లాభ మేమియు లేకపోవుటయుఁ బైపెచ్చు మనయభివృద్ధికిఁ గూడ హాని కలుగు టయుఁ దటస్థించుచున్నది. ఏలయిన, మనయగ్రామ్యభాషకును మనమతమున కును నవినాభావసంబధము కలదు. మననాగరకతకు హేతువు లగునెల్లవిషయ ములును సంస్కృతభాషనుండి గ్రాంథికబాషలోనే యనువదింపఁబడి యున్నవి. అవి యన్నియు మన కిఁక దుర్లభము లగును. పునఃపాకప్రయత్నముగ వాని న న్నిటి మరల గ్రామ్యమునకుఁ దెచ్చికొనుటయు దుర్ఘటము. కావున గ్రాంథికభా షను జేతులారఁ జెడఁగొట్టికొని తరువాతఁ బశ్చాత్తాపము నొందుట మాత్రము సరి కా దని విన్నవించుచున్నాఁడను.

చిప్పకుల వేంకటాచలశాస్త్రి.

శుభమస్తు.

శ్రీమతేరామానుజాయనమః.

# రేఫ ఱ కా ర ని ర్ణ య ము.



[తాళ్లపాక అన్నమాచార్యులకుమారుండు తిరుమలయ్యంగారు కవిత్రయము మొదలైన పూర్వకవీశ్వరుల ప్రబంధాలలోని రేఫఱకారా లేర్పఱచి లక్షణ గ్రంథముగా నానతిచ్చిన రేఫఱకారారపద్యాలు.]

క. శ్రీవేంకటేశ నీకుం, గావించెద సంకితంబుగా ఱారేఫల్
వావిరి నేర్పఱచినకృతి, శ్రీవనితానాథ రామ చేకొనుకృష్ణా! 1

క. అచ్చులు హల్లులు వరుసన, వచ్చిన రేఫలును ఱాలు వర్ణించెద మున్
మెచ్చుగ నాదికవీశ్వరు, లచ్చుపడం గృతులఁ జెప్పినటువలెఁ గృష్ణా. 2

క. ఇచ్చిరి తెచ్చిరి యనియెడి, యచ్చతెలుంగులఁ గ్రియాపదాంతంబులపై
వచ్చినవి యెల్ల రేఫలు, అచ్చల ... ... రచనలు కృష్ణా. 3

క. ఇల ఘోషాక్షరములపైఁ, గలుగవు తెలుఁగునను ఱాలు కడఁగును రేఫల్
తలఁపఁగ సంస్కృతపదముల, గలిగినవియు రేఫ లగును గనుఁగొనఁ గృష్ణా. 4

క. ఎఱుక యిర వనుట మొదలగు, మొఱసెడి యెత్వములు నిత్వములు తెలుఁగున నేర్పఱచినవి యెల్ల నచ్చులు, పెఱిఁగి యకారములు గావు పెంపుగఁ గృష్ణా. 5

క. అరి యనఁగ నప్పనం బగు, గ న్నానఁగా
నరిది యరవాయిగొనక, ట్లరగవి యన వెలితిరేఫ లనఁదగుఁ గృష్ణా. 6

క. ఆరసి చల్లారఁగఁ గ,న్నారఁగ నా రెండు ననఁగ నారఁగ ధర్మం
బారంగాఁగినపా లన, నారంగూరె నన రేఫ లయ్యెను గృష్ణా. 7

క. ఆరెకులనఁగాఁ దలవరు, లారాటము నారటంబు నారయు నట పొం
గారెడు నారని యనలం, బారంగా ననఁగ రేఫ లయ్యెను గృష్ణా. 8

క. ఇర యనఁగ నెలవు చెప్పట, యిరువురు నిరువది యని రవు నిరవారంగా
నిరుఁగెలఁకుల నొల్లం బోఁయిరి యనఁగా రేఫ లయ్యె నెయ్యెడఁ గృష్ణా. 9

క. ఈరికెలొత్తె మనంబున, నీరస మీరెలుఁగు దాన మీరి యనంగా
నీరవఁగ మిమ్ముఁ జెప్పట, యీరేడన రేఫ లయ్యె నెమ్మఁగఁ గృష్ణా. 10

క. ఉఱులొడ్డి యుఱులఁద్రోయుట, యుఱవడితో నుఱవణించు టొత్తుట డెందం
బుఱియఁగ నుఱియాడుట యన, నుఱులింప ననంగ రేఫ లొనరెను గృష్ణా. 11

క. ఊఱకయుండుట యనఁగా, నూఱార్చుట యనఁగ దుఃఖ ముడుపుట భువిలో
నూఱనఁగ గ్రామనామం, బూఱటవుచ్చుకొన రేఫ లొక్కటఁ గృష్ణా. 12

క. ఎఱుగలి చిచ్చున నెఱి యఁగ, నెఱగా నాహార మనఁగ నేఱికిఁ జిత్తం
బెఱియఁగ నన నెఱ వి మ్మన, నెఱవనఁగా లాఁతిరేఫ లెన్నఁగఁ గృష్ణా. 13

క. ఒఱు లోఱనేసి రన మి,న్నొఱయంగా నోఱలేక యోఱీ యాఱా
యొఱసిన దైత్యుఁడు వడె నొం,డొఱు లనఁగా రేఫల య్యె నున్నతిఁ గృష్ణా. 14

క. కఱ మిష్టము కఱణియనం, గఱువునఁ బోసిరి యనంగఁ గఱఁగి రనంగాఁ
గఱిసెన మనఁ గృషియగు నొ,క్కఱుఁడన నివి రేఫ లగుచుఁ గనఁబడెఁ గృష్ణా. 15

క. కోఱప్పన మనఁగాఁ జే, కూఱుటయనఁ దక్కి ఱనఁగఁ గోఱుట యనఁగాఁ
గూఱిమి యనఁగా నతనికి, గూఱుతు నన రేఫ లయ్యె గుణనిధి కృష్ణా. 16

క. కోఱనఁగ గిన్నె యమ్ములు, కూఱంగా నాటె ననఁగఁ గుఱిసెను వానల్
కాఱింప ననుట నొంచుట, కాఱాకులు రేఫ లగుచుఁ గనఁబడుఁ గృష్ణా. 17

క. కాఱుకొనె మొగులు శత్రులు, గాఱనఁగాఁ దాఁకి రనఁగఁ గఱువలి యనఁగాఁ
గాఱులు కల్లలు కగ్జము, కాఱియ మన రేఫ లయ్యెఁ గలయఁగఁ గృష్ణా. 18

క. కఱికఱిఁ గఱమొప్పఁగఁ దొ,ల్కఱివాన లనంగఁ గెఱలి కఱకఱఁ గాలన్
గఱవాఁడియమ్ము లేసిన, గొఱప్రాణము లనఁగ రేఫ గుణములు కృష్ణా. 19

క. కూఱలు గాయ లనంగాఁ, గాఱాటము తోడ నొకఱిఁ గఱిఁ గోఱి రనన్
కూఱుకుట నిద్రవోవుట, కూఱుట పొగులుటలు రేఫ కులములు కృష్ణా. 20

క. గాఱవము గలిగె గఱువము, గాఱా మన గ్రమ్మి ఱనఁగ గఱుసడి యన బం
గాఱము గుఱుగులు గఱితలు, గోఱది యన రేఫ లయ్యె గుణనిధి కృష్ణా. 21

క. గుఱువు లన గతివిశేషము, గఱుత్రాల్చెను మే ననంగఁ గడఁగి ఱనంగా
గఱువన గర్భము ఘనతయు, గఱువతనము రేఫ లగుచుఁ గడఁగెను గృష్ణా. 22

క. గుఱుసులఁ గూడంగా వే,గిఱపడి జేగుఱున గోఱ గిఱగిఱ వ్రాయన్
గఱుసులు దాఁటఁగఁ దాఁకిన గఱు సింగాఱ మన రేఫగతు లివి కృష్ణా. 23

క. చేఱువఁ దెచ్చిరి చెచ్చెరఁ, జేఱిరి యచ్చెరువు చొఱఁగఁ జెఱుపుట చీఱల్
చీఱికొన కచ్చెరియము, చూఱే యన రేఫలయ్యె సొంపుగఁ గృష్ణా. 24

క. చిరుఁగని చీరలతో వ,చ్చిరి యచ్చర లనఁగ జరగి చీరలఁ దగని
చ్చిరి చేరువు టనఁ జేర్చుట, చోరువనఁగా రేఫ లయ్యె సొంపుగఁ గృష్ణా: 25

క. తరిచాడె తరువ తరమిడి, తిరుగుట తిరియుటయుఁ దిరము తెరలుట తెరువున్
దరలఁగఁ దరతరమును మా,ర్తురు నెత్తురు రేఫ లయ్యె రూఢిగఁ గృష్ణా. 26

క. తోరంబు తెరయుఁ దొరుగుట, తేరా భూషణము లనఁగఁ దెక తేరయు నే
తేరఁగ నేర్తురు తారును, దేరెక్కు మనంగ రేఫ తెలియఁగఁ గృష్ణా. 27

క. తర మెంచక చను దెంతురు, తొరలినఁ బలు తెరఁగు లందుఁ దూరుపు దెస వ
త్తురు తీరని కోపముతోఁ, దరఁగ లనఁగ రేఫ లయ్యె! తప్పవు కృష్ణా. 28

క. తెరలంగాఁగిన నెయి క,స్తురివంటిది మంచి దనఁగఁ దొలితొలి కడుఁ జి
త్తరు వ్రాయఁగ నుద్యోగిం,తురు వేడ్క ననంగ రేఫ దూకొనెఁ గృష్ణా. 29

క. దరికొని కుదురుగఁ జూదరి, దొర దొరకో ద్దురము నెదురు దురపిల్లుట యున్
దొరయఁడు సరిగాఁ డనునది, దరిఁ ద్రొక్కుట రేఫ లయ్యె తలఁపఁగఁ గృష్ణా. 30

క. దొరకొన్నయపుడె చెంతకు, దొరకొల్పుట మే లనంగ దూరులు వల్కన్
దురదుర నేల కడంగెదు, దొరసినచో రేఫ లయ్యెఁ దొడిఁబడఁ గృష్ణా. 31

క. నేరిమి నరములు నరలును, నారలు నోరెత్తి నీరు నారసమును గ
న్నారము నెరయఁగఁ జల్లుఁడు, నేరక నుసువు లన రేఫ నిక్కము కృష్ణా. 32

క. నేరేడు పండ్లు నెరసులు, నేరుపుతో వింటినారి నిగిడింపుచు ను
న్నా రహితులు కదనంబున, నీరై రని పల్క రేఫ నెలవులు కృష్ణా. 33

క. పరఁగఁ బరికింపఁ బరువడి, పురు డీడగు సూతకంబు పురు డగుఁ బరిమా
ర్చిరి డెప్పర మిప్పరుసనఁ, బొరయక యన రేఫలయ్యెఁ బొలుపుగఁ గృష్ణా. 34

క. పొరిఁబొరిఁ బరుసనఁ బొరిగొని, పురఁబురఁ బొక్కంగఁ బెరుగు పొంపిరివోవన్
బెరుగుట వర్ధిల్లుట యగుఁ, బొరు గన నివి రేఫ లయ్యెఁ బొందుగఁ గృష్ణా. 35

క. పరిగొని పరిచను దెంచుట, పరువము పెనుపరియు నేరుపరి పురిగొలుపన్
బొరిపొచ్చెముఁ జప్పరమును, బొరలితి మన రేఫ లయ్యె పొందుగఁ గృష్ణా. 36

క. పొరితము పోరు పిరిగొనఁ, బే రన నామంబు తేనెపెర పేరురమున్
బేరడి పరపుట నించుట, పోరచి యన రేఫ లయ్యెఁ బొలుపుగఁ గృష్ణా. 37

క. పరువుగలచోటఁ బరువులు, పరుసములును బెరసు బద్ధపరి పరిగోలల్
పరఁగించిరి పొరిఁగలుగఁగఁ, బరిసరవర్తు లన రేఫ పొల్పడెఁ గృష్ణా. 38

క. పేరిననేతికినై కడుఁ, బోరాటము లేల వలదు పోరా యనినన్
పోరం బెనఁగకు మింకను, బోరామి యొనర్పు రేఫ పొలు పగుఁ గృష్ణా. 39

క. బూరటిల బారిసమరేన్, బోరగిలం బరవసంబు బోరని క్రమ్మెన్
బారిఁబడ బెరసి బరిమెయి, బీరము నిబ్బరము రేఫఁ బేర్పడెఁ గృష్ణా. 40

క. బురజ లనంగా గజ్జెలు, బిరుదులు పాదములఁ గట్టిపెట్టఁగవలె నా
బురబురఁ బొంగినచల్లలు, బరు లుబ్బఁగఁ ద్రాగు రేఫ పనుపడెఁ గృష్ణా. 41

క. మురిసెం దొండము దంతికి, మరలుట మరిగించి కొనుట మది మెరతొర సు
మ్మురమెఱపరాళ్లు తేంటులు, మొరసె ననన్ రేఫ లయ్యె మురహర కృష్ణా. 42

క. మేరలు దప్పిన శత్రుల, మారిమసంగుటలు మొరడు మరియాద యగున్
మీరలు దెండా యీమరి, మారేళ్లన రేఫ లయ్యె మాధవ కృష్ణా. 43

క. మురియ లనంగాఁ దునియలు, మిరియము లని పల్కుచోట మెలఁతల మనముల్
మరుపఁగవలె ననఁగాఁ దా,మ్సుర లనఁగా రేఫ లయ్యె మహిలోఁ గృష్ణా. 44

క. మురిపెముతో నిలిచెను గ్ర,మ్మర మారట విగ్రహంబు మది వేమారున్
మురమురయనియెడి కోపపు, మరు లుడుపుట రేఫ లయ్యె మానుగఁ గృష్ణా.

క. రూపించి రేయు రచ్చయు, రూపును రమ్మనుట రిచ్చ రోయక రెంటన్
రూపును రాలుట రంకెలు, నీపగిదిన్ రేఫ లయ్యె నెన్నఁగఁ గృష్ణా. 46

క. రాయంచ రిత్త రక్కసి, రాయుచు రాయుటయు రొడు రాచూలి యనన్
రేయెండ రేకు రూడియు, రాయిడి రుచి యనఁగ రేఫరచనలు కృష్ణా, 47

క. రారు రమణ నటు రోఁజుచు, రారా రాగిల్లి రమ్ము రాసి యొకటనే
నేరా మాటలు వినరా, యీరీతుల రేఫ లయ్యె నెన్నఁగఁ గృష్ణా. 48

క. వారించుట యెవ్వరికిన్, వారికి వారకము విరులు వారక యొనఁగన్
వ్రారువములు పల్వురకును, వీరనఁగా రేఫ లయ్యె వెలయఁగఁ గృష్ణా. 49

క. వరటము వరువు ల్లేవురు, విరియుట యున్ వరుస వెరవు విరవిర మనఁ గా
ల్వురు నవ్వరె యప్పురి గొన, వెరవిఁడి యన రేఫ లయ్యె వెలయఁగఁ గృష్ణా.

క. వారకుల నెక్కి యార్వురు, వేరము తలవరులు వెరసు విరియం జల్లెన్
వారని వోవరి దేవర, వారాశి యనంగ రేఫ వరుసలు కృష్ణా. 51

క. శరబడి నేసిరి సైరణ, సురిగితి రన సరియ నంగ సూరె లనంగన్
సిరియనఁగ లక్ష్మి చేసిరి, సరకు లనన్ రేఫ లయ్యె సతతము కృష్ణా. 52

క. సురియలు సోరణగండ్లును, సొరిదిన్ వేసరుల నెక్కి సొరటా సారెల్,
సరకేమియుఁ జేయకు మన, సరు లనఁగా రేఫ లయ్యె సతతముఁ గృష్ణా. 53

క. మోహారము చొచ్చి యెడనెడ, నోహరి గా మలసి మలసి యొక్కొక్క దెసఁ
సాహరిగొన నుప్పొంగెడి, బేహారు లనంగ రేఫ పెంపగుఁ గృష్ణా. 54
క. పుట్టిరి తిట్టిరి కూలిరి, నెట్టన భూపాలు రనఁగ నెయ్యురు లేరే
గట్టిగ గండరు లెప్పము, నెట్టనఁ బోటరియు రేఫ నెలవులు కృష్ణా. 55

## పెద్ద ఱాలు.



క. ఆఱవఱలై యఱకట నుక్కఱ యఱిముఱి యఱచు ననఁగ నఱువుడు జోల్లే
పఱియుఱు మెడలక పొల్పడి, యఱువది గొట్లనఁగ ఱాల నమరెను గృష్ణా. 1
క. అఱపొఱఁపు గుజ్జు రూపఱ, నఱపులు బిట్టఱ యసంగ నఱచితి కింగా
దఱుగుడుఁ గుబుసము సిగ్గఱి, యఱుముట యన ఱాల యోజ లనిశముకృష్ణా.2
క. అఱ లేనివాని కఱుగును, అఱకాలం దన్నుఁ దన్ని యఱుకమ్ముట నా
నఱ గొఱ లేక యనఁగఁ బెం,బఱ యనఁగాఁ బెద్దఱాలయనువులు కృష్ణా. 3
క. ఆఱడి యన నడలాఱఁగ, నాఱంపులు నాఱుచవులు నాఱని తేజం
బాఱమ్ములఁ బాపములో, టాఱె ననఁగ ఱాలు కృతుల నమరెను గృష్ణా. 4
క. ఇఱికికొని యిఱులు గొనఁగా, నిఱికిట మిఱు చన్నుఁగవయు నిఱమి యనం గ్రి
క్కిఱియఁగ నిఱిసిన కడియుట, యిఱికిప ఱాగఱులె ఱాలయిరవులు కృష్ణా. 5
క. ఉఱవుగ సేనలమీఁదట, నుఱుకుడుఁ బడ మూఱి మెట్టి యుఱుముచు సేన
ట్లుఱక పగవారి నఱుచి, చ్చుఱికింతు ననంగ ఱాలయునుకులు కృష్ణా. 6
క. ఉఱఁడనఁ గ్రై కొనఁ డను నది, యుఱున ట్టేవంబె యూఁగి యూఱడిలంగా
నుఱిడన నిలుకడ యూఱెస, నుఱుగడ యనఱాలుకృతుల గొదగెను గృష్ణా! 7
క. ఎఱచి యన మాంస మేఱులు, నెఱగుట వందనము దిగుట యెఱ మం టనఁగా
నెఱుకు తల యెఱువ నెఱకలు, నెఱిఁగినయెఱుక లన ఱాలయిక్కువ కృష్ణా. 8
క. ఒఱవ శరీరము మన్మథు, నొఱపుల నొఱిగాల నుండి యొఱగె ననంగా
నొఱపు గలకత్తి యొఱలో, నొఱలుచు ననఁ బెద్దఱాలయోజలు కృష్ణా. 9
వ. కవర్గువు.
క. కఱపె ననఁగ నేర్చుట య, క్కఱపడి క్రిక్కిఱిసి వేడ్క కాఱులు వెస ను
క్కఱపడి కుఱుకుల్ గట్టుక, కఱతల కలికి యన ఱాలు కనుఁగొనఁ గృష్ణా. 10
క. కఱపింపఁ గఱచుఁ బండ్లను, గఱపెడి ననఁ గఱచు ననఁగఁ గల వవి నేర్పుల్
కఱదులు బుద్ధులు కుఱుకొని, కుఱుగలి కొను ననఁగ ఱాలు గొనకొనఁ గృష్ణా.

క. కొఱమాలి కొఱత వడినను, గఱ్ఱం గొఱ గాదు కొఱవి కాఱియఁ బెట్టన్
కఱదిం దెలుపఁగఁ గాదనఁ, గఱకంఠా యనిన ఱాలగని యగుఁ గృష్ణా. 12

క. కుఱుగలి యనఁ జేర్పనఁ బఱుఁ, గొఱలుట యనఁ బూర్ణ మగుట కోఱలు వచ్చెన్
గఱకు లనఁ బ్రల్లదములు, కైఱ యనఁగాఁ బెద్దఱాలు గీల్కొనెఁ గృష్ణా. 13

క. కుఱుచనఁ గాఱెఁడు సనఁగాఁ, గొఱపము కాఱడవి కొఱడు కుఱుమా పనఁగాఁ
గొఱ గలవాఁ డితఁ డనఁగా, గుఱుకుఱ యనఁ బెద్దఱాల గుణములు కృష్ణా. 14

క. కఱలేని కందుచే కుఱుఁ, గఱు కెక్కినపింజ వింజ గఱచి కొఱుకుటల్
కఱ కనఁగాఁ గఠినంబగుఁ, గఱకఱి యనఁ బెద్దఱాలగతు లివి కృష్ణా. 15

క. గిఱుపుట గుఱుగొని గొఱియల, గిఱిగొనఁ గన్ని ఱిపి పగఱ గీఱినగుఱుతున్
గుఱియు గగుఱుమలు గింజలు, గఱిగుఱుకలు పెద్దఱాలకై వడి కృష్ణా. 16

క. గఱుఁ జెప్పలతో డగ్గఱి, గుఱిచి యనఁగఁ గూర్చి యనుట గుఱుగుఱ్ఱనుచున్
గుఱుపెట్టుచు నిద్రింపఁగ, గఱు లనఁగాఁ బెద్దఱాలకై వడి కృష్ణా. 17

క. చెఱుచు నది యనఁగఁ గ్రచ్చఱ, చఱు కనఁ బెడ చేతఁ జఱచు చఱిఁ జిఱుమఱచి
చ్ఛఱపిడుగై చుఱచుఱఁ జిచ్ఛఱకంట నసంగ ఱాలు సమకొనెఁ గృష్ణా. 18

క. చెఱ నునుచుట చెఱు వమయుట, చుఱుపుచ్చుట చెఱకు విల్లుచూఱవిడుచుటల్
చిఱునగవు చిఱుత తనమును, జెఱుతట యన ఱాలు భువిని జెల్లును గృష్ణా. 19

క. చఱిగొనె నసఁ జలమగు ముచ్చిఱుట య ముచ్చటయుఁ జెఱఁగు చీఱుట యనవా
చఱచి యిలఁ జఱచి పాఱుట, చెఱిసగమనఁ బెద్దఱాలు చేకొనెఁ గృష్ణా. 20

క. జఱిగొని మొక్కవో జాజఱ. జఱజఱ నొకజెట్టిపోతు జాఱె ననంగా
జఱుపుచ్చ జఱచి జొఱజొఱ, జిఱజిఱ యనఁ బెద్దఱాలు చెలువుగఁ గృష్ణా. 21

క. తఱిగొని నడవఁగ దఱుముచు, దొఱఁగువసుట తొఱఁగె ననుట తూఱు చుఁ బనులన్
దొఱఁగులు వోమొడిఁదఱుముఁడు, తొఱఁగుటపసుఁడనుట ఱాలుదూకొనెఁగృష్ణా.

క. తఱియగుఁ దఱ చగున త్తఱి, తెఱవలు వా తెఱలు దెఱచి తెఱపి గనుట యే
డ్తెఱ దోఁపఁ దెఱఁగు గలుగుచుఁ, దెఱఁగేది యనంగ ఱాలు దెల్లమి కృష్ణా. 23

క. తెఱగిన తావియు నిసుమల, తొఱగమిఁ గసుఁ దుఱగలింపఁ దుదఁ గలుపంబున్
దఱుగుట తీఱమి తాఱుట, తఱులన విలసిల్లె ఱాలు తప్పవు కృష్ణా. 24

క. తుఱుము తుఱిగొనిరె ననఁగాఁ, తఱిగె ననఁగఁ దక్కు వనుట తలపోయంగాఁ
ధఱి కొలిపి తిఱికనుంగొనఁ, దఱుముఱ యనఁ బెద్దఱాలు తలకొనెఁ గృష్ణా. 25

క. తఱిమి యని నేసె ననఁగాఁ, దఱియం జొఱు మనఁగఁ దలలు దఱిగెద రనఁగాఁ
దొఱయుట తీఱఁగఁ దఱఁకినఁ, దఱలక యనఁ బెద్దఱాలు తథ్యము కృష్ణా. 26

క. తెఱఁగొప్పఁ గన్ను దెఱవఁగఁ, దెఱ గన్నన దూఱె ననఁగఁ దీఱుదు రనఁగాఁ
దొఱలిడెఁ దీఱుగఁ జేయుము, తఱఁగని కింకనఁగ ఱాలుతలకొనఁ గృష్ణా. 27

క. దఱికె నన వెలితి యగుముం,దఱ యన నొకకాల వాచి తన యెదుఱను ముం
దఱ యనఁబడు నొకచో నం,దొఱు ననఁగాఁ బెద్దఱాలు తూకొనెఁ గృష్ణా. 28

క. ఇందఱ మిద్దఱు చెదఱుట, యెందఱు కొందఱు ననంగ నే దిఱ యనఁగా
నందఱు పెద్దఱికం బన, నిందఱు ననఱాలు పుడమి నేర్పడెఁ గృష్ణా. 29

క. నెఱి నెఱ యనెఱసి నఱకిన, నెఱి దప్పం బడియె ననఁగ నెఱమంటలు నా
నిఱి గొనియె ననఁగ నింపుట, నెఱివెంద్రుక లనఁగ ఱాలు నెలకొనెఁ గృష్ణా. 30

క. నెఱకులె యమ్ముల నఱుమై, నుఱుముగ నఱుమాడె నంత నుఱుమాడె ననన్
నెఱుపనలము నెఱపాఱిన, నెఱుపఱి సింగ మన ఱాలు నెలకొనెఁ గృష్ణా. 31

క. నూఱుపదు లనఁగ నెఱసన, నీఱు పయిం గవిసి యున్న నిప్పు లనంగా
నూఱుచు నున్నాఁడనఁగా, నాఱు విడిచి యనఁగ ఱాలు నయముగఁ గృష్ణా. 32

క. నెఱి లేనిసఖుం డె మ్మెలు, నెఱపఁగ నెఱనారసంబు నీఱుగఁ జేయన్
నెఱవుగ నెఱ నాఁటించిన, నిఱు పేద యనంగ ఱాలు నెలకొనెఁ గృష్ణా. 33

క. నెఱి చెడక నెఱిక గట్టుట, నెఱవాదులు సఱువు దుడిచి నెఱి మొగ మనఁ గా
నెఱ ద్రోవ యనఁగ నఱుఁజన, నెఱ బిరు దనఁ బెద్దఱాల నెలవులు కృష్ణా. 34

క. పఱచె నన వేగఁ బోవుట, పఱపెదఁ బఱపితి ననంగ బడిఁదోలు టగున్
పిఱుసనుట వెనుకదీయుట, పఱచినపా ట్లనఁగ ఱాలు పనుపడెఁ గృష్ణా. 35

క. పిఱికి తనంబను...నం,పఱ కోపక పఱియ లగుచుఁ బఱిమార్చె నన్
పఱికొనుట ముంచి కొనుటగుఁ, బిఱుదన చొచ్చె నన ఱాలు పెంపగుఁ గృష్ణా. 36

క. పెఱమూఁకలు పెఱచేతను, బఱిపఱియలు సేయు టనఁగఁ బఱివోయె ననం
బఱవఁగనోపక తొడిఁబడఁ, బిఱివోయె ననంగ ఱాలు పెనఁగొనెఁ గృష్ణా. 37

క. పెఱిగినచందము చూపఱ, బిఱిదికిఁ బాఱెడుననంగఁ బిఱుదు లనంగన్
పెఱుకలు చిక్కులు పఱుపఁగఁ, బఱపకు పఱచు టన ఱాలు పాల్పడెఁ గృష్ణా. 38

క. పాఱించు నాజి నెడతెగఁ, బాఱుట జలమెల్ల నింకఁ బాఱుట యనఁగాఁ
బాఱుఁ డనంగను విప్రుఁడు, పేఱిన వలు వనఁగ ఱాలు పేర్పడెఁ గృష్ణా. 39

క. పెఱికితిఁ గొండలు పెంపఱఁ, బొఱ యన గఱుపాఱె ననఁగఁ బొఱ తెగె ననఁ దె
ప్పఱి పొదువెఱిగిన ట్లనఁ, బిఱివెం డననంగ ఱాలు పెంపగుఁ గృష్ణా. 40

క. పఱవఁగ ననఁ బ్రవహించుట, పఱపుపయిం బొల్పఁ బఱచి పఱిపఱియలు గాఁ
బఱతెంచి తొల్లి తెప్పఱ, పుఱియలు పాఱకలును ఱాలపోఁడిమి కృష్ణా. 41

క. బిఱువోవుచుఁ గదనంబున, బిఱబిఱ గద ద్రిప్పి నైవఁ బేర్కొని యదిద
బ్బఱ యనుచుఁ బట్టి యీడ్చెను, బఱబఱఁగా ననఁగ ఱాల పగుదులు కృష్ణా.

క. మఱచిన మఱవక మఱియును, మెఱయు నెడన్ మెఱసి మఱపు మిఱుమిట్లుగొనన్
మెఱుములుమీఱఁగ మీఱియు, మెఱుఁగులెకాంతులనఱాలుమించెనుగృష్ణా.

క. ముఱిముఱి చీఁకటి గ్రమ్మఱి, మఱుఁగున విహరించి మఱఁది మాఱుమొగము ప
ల్మఱు మాఱిమసఁగియేమఱి, మఱవరె మఱి యనఁగ ఱాలు మహిలోఁ గృష్ణా.

క. మెఱుఁగును మేఘము మఱతురు, మఱుచు నొకో మొఱకి యింక మాఱటనోర్వన్
మెఱుఁగెక్కి మెఱుచు దిక్కులు, మఱతును నే ననఁగ ఱాలుమానుగఁ గృష్ణా.45

క. మా ఱేడగు నాతఁడు న్నే, మాఱును గునియంగ నేల మచ్చిక తోడన్
మాఱలుగక చేకొను ము,మ్మాఱును బలికినను ఱాలు మానుగఁ గృష్ణా. 46

క. మెఱములు నైచుచు మెఱసియు, మొఱఁగుచు ముఱుమొండె మనఁగ మొఱలిడి రనఁగా
మఱువు లనమాటు పెడ మఱి, మొఱపఁదనంబనఁగ ఱాలు మునుకొనెఁ గృష్ణా.

క. మఱ లేక పెక్కు మాఱులు, మఱునాఁడన మాఱుపసుట మైమఱువు లనన్
మిఱుఁజూపులు మా ఱేయఁగ, మాఱఁద లనం బెద్దఱాలు మహిలోఁ గృష్ణా.48

క. వఱలఁగ ననుటయు వేడుక, వెఱవఱ వెఱచఱవ విల్లువిఱుగఁగ ననిఁ దా
వెఱగువడి విఱిచి విఱుగుట, వెఱమృగము లనంగ ఱాలు వెలసెను గృష్ణా.49

క. వఱపులు గూసెను వేఱొక, నఱతం ద్రోవంగ వెఱచి వఱలి వెఱఁగుతో
విఱిగాలి యు పీఁఱిడిని, వ్వేఱపాట దె యనఁగ ఱాలు వినఁదగుఁ గృష్ణా. 50

క, సుఱ సుఱ యని యెడిచోటను, సాఱసొచ్చుట యనుట ఱాలు చొప్పడె నిటపై
మఱి కలిగనేని తెలియుఁడు, తఱచెందును లేవు కృతులఁ దలఁపఁగఁ గృష్ణా.51

ఆ. ఱట్టు ఱవికె ఱంకు ఱాయి ఱిక్కించుట, ఱేపు ఱేవు ఱేను ఱేసి ఱెక్క
ఱేఁచు ఱొప్ప మూసి ఱివ్వన నది దాఁటి, ఱాచుఁ డనఁగఁ బెద్దఱాలు కృష్ణా.52

గీ. క్షీరనీర విభేదంబు చేసినట్లు, ధరణి రేఫఱకారముల్ తాళ్లపాక
తిరుమలార్యుంశువేర్వేఱఁ దేటపఱిచె, నుచిత మిది గాదె పరమహంసోత్తమునకు.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

[యథామూలముగా ముద్రింపఁబడినది. ఈనిర్ణయమునకు నిప్పటివ్యవహారమునకును బలుచోట్ల భేదము గలదు.]

శ్రీమతే రామానుజాయ నమః.

తాళ్లపాక అన్నమాచార్యులకుమారుఁడు తిరుమలయ్యంగారు చెప్పిన

# చక్రవాళమంజరి.

---

శ్రీలలనాధారుఁ జిన్మయాకారుఁ, గారుణ్యవర్తి వేంకటగిరిమూర్తి
మూర్తిత్రయశరీరు మునిజనోద్ధారు, ధారుణీసంగు నుత్తమశోభితాంగు
నంగుష్ఠభవసింధు యదుకులోకబంధు, బంధురబలశూరు భక్తవిచారుఁ
జారుచక్రాబ్జాంకు సమరనిశ్శంకు, శంకకర్ణాధ్యక్షు జలజపత్రాక్షు
నక్షుద్రగుణసారు నఖిలసంసారు, సారూప్యకృతిసంధు శయనితసింధు
సింధురీశాధీను శీతలభాను, భానులోచను విష్ణుఁ బాలితకృష్ణుఁ
గృష్ణుఁ గౌస్తుభహారుఁ గేశవు ధీరు, ధీరూపగుణములు దెసలఁ బేరుకొని
కొనియాడ విని యొక్కకొండిక కొమ్మ, కొమ్మలలో నెలకొన్న పూమొగ్గ
మొగ్గనిమురుదంతి మోహనవాణి, వాణీశసంస్తుత వరహావభావ
భావజయంత్రంబుపగిది బూఁబోఁడి, పోఁడిమిగలముంచిపుత్తడిబొమ్మ
బొమ్మజంకెనలయకృతచంద్రవదన, వదనంబువాంచి నెవ్వగఁ జింతనొంది
యొండ్లిలి నేకాంత మొకతెతో నాడి, యుడికికోడి యొయ్యనగుట్టుతోడఁ
దోడఁబుట్టు మొఱంగి తుంటవిలుకాని, కానిపించనియంపగముల చేఁబొరలి
పొరలిచ్చి చిత్తంబుపాలు పెల్లఁదక్క, తక్కనవన్నియుఁ దడవక మాని
మానినీమణి యున్నమతకంబులెల్ల, నెల్లగానఖులెల్ల నెఱిఁగియాచెలువ
చెలువంబు వింతయై చెలువొందెనమ్మ, యమ్మదనావేశ మడఁగెనో కాక
కాకైనది వనాంతకౌతుకలీల, లీలావతిని జెంగలింపింత మంచు
నంచుముట్టంగనయ్యబలతోనిగిడి, గుడిగొని వనము గ్రక్కునఁ జొచ్చునపుడ
పుడమివసంతంబు పొడమె నందంద, యందమై కారాకు లవనిజతతులు
తతులు దప్పక రాల్చెఁ దగఁ జిగురొత్త, నొత్తిన మొగ్గల నొనరి కార్కమ్మ
కమ్మనివిరులతోఁ గాయలతోడఁ, దోడనె ఫలియించి తొరఁగు తేనియల
యలమావిమొత్తంబు లడరెఁబున్నాగ, నాగరంగాశోకనాగకేసరక
కేసరకరవీరకింశుకాంకోల, కోలజంబీరలికుచపిచుమంద

రాశికెక్కినయట్టిరాచిల్క లేచి, యేచింతయును లేక యింపుగాఁ బలుకఁ
బలుకందువలనుండి భ్రమరముల్మ్రోయ, రయమునశారికారావంబులెనయ
నయముగాఁ జలిగాలినవ్యవాసనలు, నలువంకలఁ జరింప నలినాక్షు లంత
నంతకంతకు మీఱి యఱుగుంపు గట్టి, గట్టిఁచీరలు గడుఁ బిఱిచుట్టి
చుట్టుచు జంటలై సారిది నొండొకరుఁ, గరులయానముల నొక్కట గుటీవాటి
వాటి నీపంబుపైఁ బరఁగెడు కేకి, కేకిస ల్గొట్టి మూఁగినసుర్లసంది
సందీక మెలఁగెడుశాఖామృగముల, గములఁ జూచి హసించి కందరాళముల
ములముల మూఁగుచు మొనయుకొక్కెరలఁ గెరలుగఁ జేయుచుఁ గ్రీడంగ
రంగు

రంగుమీఱినపావురంబులు పలుకఁ, బలుకరించుచుఁ దమపైముద్దుచిలుకఁ
జిలుకలం బొంచి పచ్చికఁ జేరిపట్టి, పట్టికఁ దమతమపయ్యెద ల్మూసి
మూసినముత్యాలమురువుదొలంకి, లంకించి మాధవీలతలడోలికలఁ
గలసియూఁగుచును వేడ్కలు గడుఁ బొదలఁ, బొదలతేనియలు సొంపులఁ
గోరి యాన

నానానాంబుజముల హర్షము ల్వెలయ, వెల యడుగని విరు ల్వెసఁ గోసి
బెరసి

రసికతతో నొక్కరమణిగోరంట, గోరంటఁ గౌఁగిటఁ గూరిచెఁ బొగడఁ
బొగడపై నుమిసెను పుక్కిటి మదిర, మదిరాక్షి యొక్కరామాతిలకంబు
తిలకంబుఁ జూచె నొద్దిక నొకకాంత, కాంతాళమున నశోకముఁ దన్నె
నొకతె

నొకతె యలంగునఁ గరంబొనరరసాల, సాలంబుపైఁ జూచె సకియ లీరీతి
రీతి దప్పక సంచరించి వసంత, సంతతోత్సాహంబు సలుపంగఁ బూని
పూనిటం గోరకంబులను నొండొంటి, నొంటిమై వ్రేయుచు నొగిఁగ్రమునను
ననుఁ జూడు మని కాంచనంపుఁబుట్టికలఁ, గలకల నగి గుప్పి కన్నులఁ జిమ్మఁ
జిమ్మనగ్రోవుల జీరి పన్నీట, నీటగ్గలముగాఁగ నించి యొద్దికను
గనుఁగొనమెరసి బంగరుకొమ్ములంది, యందియల్ మొఱయ నీరటు ముంచి
పోసి

పోసిగ్గువడిఁ దట్టుపునుఁగులువిసరి, సరికి బెసకి వేడ్క నలిపి చేరువన
వనమధ్యమున సరోవరమటు గాంచి, కాంచీరవాంచితగతి డిగ్గిపాదివి
పొదివిచ్చకటు జలంబుల నీఁదులాడ, నాడం జలించు రాయంచల నలడి

యలమీనములఁ బట్టి యటబారవలను, వలనుగాఁగొంచక వంచి పైనెక్కి
యెక్కినమదముల నెసఁగి జక్కవల, కవలఁజన్నుల నిండుగా మోపిసోలి
సోలి తేటులఁబాఱఁ జోఁపి కఁజములు, ములు వాడి గోళ్లఁ దున్మచు బద్మనాళ
నాళంబులజలంబునలిఁ బీల్చి యుమిసి, మిసిమిఁగొందఱు తమమీఁదఁ గల్హార
హారముల్ ధరియించి యంబువు ల్చల్లఁ, జల్లఁగా జలకేళి సలుపుచుఁ జెదరి
దరికి నేతెంచి నూతనసమీచీన, చీనాంబరములు దాల్చి ముదంబు గదుర
దురమరసొమ్ములు దొడిగి వేడుకలఁ, గలవిరుల్ కొప్పులఁ గైసేసి చెక్కు
చెక్కిళ్లజవ్వాది చిప్పిల నదిమి, యది మీఱఁ గస్తూరి యలఁది రమించి
మించినఁ జూచి యశ్శిలిఁబరిరవన, వనరక్షకులు వచ్చి వరుసనీకతలు
తలు కొత్త విన్నవింపఁ దగు వినుకలిని, గలి నర్మధనుఁడు వేంకటగిరీంద్రుండు
ఇంద్రుండుబ్రహ్మయు నిరువంక నడువ, నడవడిగలపక్షినాథుపై నమరి
మరిగియూడిగముల మగువలింపొందఁ, బొం పైనభూషణంబులు దాల్చి
ప్రబలి
బలిమిఁ బీతాంబరప్రభలతోఁ దివిరి, విరివిఁ గేలీవన వీథి కేతెంచి
తెంచి వేయనితటితఁపుఁ గోరికలఁ, గలఁగొన విహరించెఁ గాంతకై తగిలి
గిలిగింతవలపులఁ గీలొన్నరమణి, మణిమయకేళిహర్మ్యమునఁ బంతానఁ
దానకం బైనగందంపువేదికను, దనుపట్ట మరునిచొకపు రూపు వ్రాసి
వాసితోఁ బూజించి వరములు వేఁడి, వేఁడి దీటుగ మ్రొక్కి వెసఁ బుష్ప
రసము
సముకాన నర్పించి సరిఁ బెంచె నాస, నాసమీపమున శేషాద్రీశుపసలు
సలుపుచూపులఁ జూచె శౌరియుఁగృపను, బనుపడనచట నప్పడఁతిరూపమును
మునుకొనిచూచి యామోదంబుదమల, మలగొన్నసంపంగి మ్రాఁకుల
క్రిందఁ
క్రిందటిలతమి నెడగిరి యుండె నిచ్చ, నిచ్చట మది గుందు నిండి కేసార
నాటనిమై కాఁకలగ్గలంబయ్యె, నయ్యెడఁ గను విరహాతిరేకమును
మునుముట్టెఁ గోయి లల్మాఁకలుచూపెఁ, జూపెట్టుకొనియలుల్ జుమ్మని
మొఱసె
మొఱనేసి వెఱపించె మొనసి శారికలు, కలుగుమ్రోఁతల నీలకంఠములొప్పెదల
దళ మైనమన్మథతాపంబుకతనఁ, దనమేనిచెమట లంతటను దైవాఱె
(సశేషము)

## (29) ధనుర్విద్యావిలాసము.

కవులచరిత్ర కెకరిని యీగ్రంథముప్రతి యొకటి యిచ్చుటకు వచ్చినది. దీని రచియించినయతఁడు కృష్ణమాచార్యుఁడు. గ్రంథావతారికలోనున్న—

క. భాసురసూరిగ్రామణి, భూసురముఖపంకరుహానభోమణి వినమ
ద్దాసనిచయచింతామణి, నే సింగరగురుశిఖామణిం గణుతింతుఁ.

...గీ. ఆయురారోగ్య పుత్త్రపౌత్త్రాభివృద్ధి, గలిగి రేపల్లెనగరశృంగారసౌధ
రత్నసింహాసనస్థితి రాజ్య మేలు భవ్యగుణశాలి జంగభూపాలమౌళి.

శా. ఆజంగక్షితిపాలుతమ్ముఁ డలరుఁ హస్తాగ్రభాస్వద్ధనూ
రాజద్వజ్రముఖాదిఘోరశరధారాదారితారాతిసే
నాజంఘాలగజాంగభూషణభరానమ్రావనీధారణే
హాజాగ్రన్నిజబాహుఁడై తిరుపతిక్ష్మాధీశ్వరుం డిమ్ములఁ.

... (అతఁడు) మహోత్సవసమయ సముజ్జృంభితకుతుబశాహప్రముఖ పురాతన పాదుశానుగ్రహ పితృపితామహ ప్రపితామహలబ్ధపటుతరపటహ... డిండిమప్రముఖ హృద్యానవద్యవాద్య ఘుమఘుమధ్వానపూరిత దిగంతరాళుండై......ప్రాజ్యంబగు రాజ్యంబు పాలింపుచు రాజరాజాభిరక్షితం బగునలకాపురంబునకైవడి ధనధాన్యకరటి రథతురగభటసముదటం బగు రామూరి పట్టణంబున యథేష్టభోగంబులం బ్రవర్తిల్లుచు నొక్కనాఁడు......

మ. నను రామానుజపాదపద్మయుగళీనవ్యావ్యయధ్యానపా
వనహృద్భావగతావతంసపదసేవాసక్తచిత్తుఁ మరు
త్తనయారాధనలబ్ధచారుకవితాధారుఁ సదారూఢభావను
నాస్థానకవిఁ నిజాశ్రితునిఁ బిల్వం బంచి పల్కెఁ గృపఁ.

క. శ్రీరామభద్రుపనుపున, ధారాళంబై తనర్చుధనురాగమ మి
ద్ధారుణిఁ గావ్య మొనర్పఁగ, నారంభించితి భవత్సహాయముకలిమిఁ.

వ. వెండియుఁ గోదండదీక్షాగురుం డగురఘుపతికటాక్షంబునం జేసి సద్గురులాభంబున నిద్ధనుశ్శాస్త్రంబు మాకు నధీతం బయ్యె. తత్తల్లక్షణంబులు శాస్త్రసమ్మతంబులుగా నుపన్యసించెద నీవును దత్తత్ప్రకారంబు లధికరించి గద్యపద్యాత్మకంబుగాఁ గావ్యం బొనర్పుము......

క. పాత్రుఁడవై మైత్రేయస, గోత్రుఁడవై నారసింహగురువర్యునకుం
బుత్త్రుఁడవై వెలయుదు వి, ద్ధాత్రిక్ మాపనువు నేయఁదగుఁ గృష్ణకవీ.

అను పద్యములంబట్టి యీకవి సింగరగురుని శిష్యుఁడు, నృసింహగురుని తనయుఁడు, మైత్రేయస గోత్రుఁడు ననియు గుంటూరుమండలములోని రేపల్లెకు రాజైన పున్నపల్లి లేక కృష్ణాని యనునుపనామము గలిగిన జంగన మాణిక్యరాయలకుఁ దమ్ముఁడై రాచూరిలోఁ బ్రభుత్వము చేయుచున్న తిరుపతిరాయలయానతిచే నీధనుశ్శాస్త్రలక్షణ గ్రంథము రచియించె ననియుఁ దెలియుచున్నది. ఆ శ్వాసాంతగద్యములయందలి యాచార్యపదము మాధ్వ వైష్ణవనామసామాన్యవాచకముగా నున్నను 'లక్ష్మణపాదభక్తుఁడను, ఆంజనేయోపాసకుఁడ' నని చెప్పికొనుటచే నితఁడు మాధ్వబ్రాహ్మణుఁ డని తోఁచుచున్నది. ఈతనియింటిపే రేమో తెలియదు.

కవికాలనిర్ణయము :—పైసోదరరాజులకుఁ బితృపితామహక్రమములో నెనిమిదవపురుషుఁ డగు రాజామానికరాయలు 184 గ్రామములతో విలసిల్లు ముర్తుజాన్నగరసామ్రాజ్య మేలిన ట్లిందలియవతారికయే చెప్పుచున్నది. ఈ ముర్తుజాన్నగరమునకు రెండవపేరు కొండవీ డని యు దీనివలననే తెలియుచున్నది. ఈసామ్రాజ్య మీతనికిఁ గ్రీ. 1630-1660 ప్రాంతములలోనివాఁడును గోలకొండనవాబు నగు కుతుబశాహ యచ్చిన ట్లుండుటచేతను, ఈతని మునిమనుమఁ డగు నప్పారాయమాణిక్యరాయలను గ్రీ. శ. 1658-1707 నడుమ ఢిల్లీరాజ్య మేలిన యౌరంగజేబు గౌరవించిన ట్లుండుటచేతను ఈతనితరువాత రాజ్యము చేసినవారు సంఖ్య కేడుగురు గనఁబడుచున్నను బుత్రపౌత్రక్రమమును బట్టి నలుగురు మాత్రమే యేలిక లయినట్లు చెప్పఁదగి యుండుటచేతను గవిప్రేరకుఁ డయినతిరుపతిరాయలు నాతనిభ్రాత యగుజంగన మాణిక్యరాయలు నుగవియునుగూడ గ్రీ. శ. 19 శతాబ్దము ప్రారంభమున నుండిన ట్లూహింప వచ్చును. ఇందులకు గ్రంథాంతమందలి యీక్రిందివచనము గూడ సహాయపడఁగలదు.

"కీలకనామసంవత్సర మాఘ బ ౧౧ శుక్రవారంవరకు మహారాజశ్రీ, రాజామాణిక్యరావు తిరుపతిరాయనింగారికి గడ్డ...ముత్తంరాజు ధనుర్విద్యావిలాసం సంపూర్ణముగా వ్రాసెను" ఈ పుస్తకము వ్రాయించికొనిన తిరుపతిరాయ లితఁడో నిశ్చయముగాఁ దెలియరాదు గాని నామసామ్యమునఁ బై సోదరరాజుల

సంతతిలోనివాఁ డని మాత్రము చెప్పవచ్చును. ఇది యిప్పటికి 67 సంవత్సరముల క్రిందట ననఁగాఁ క్రీ. 1847 సంవత్సరమున వ్రాయఁబడియుండుటను, బూర్వరాజుల పరిపాలనకాలమును బట్టి చూడఁగా మనకృతికర్తయు నతనిప్రేరకుఁడును బూర్వోక్తకాలమునకు గొంచె మీవలావల నుండి యుందు రనుటలో నాక్షేపణ ముండ దని నాయభిప్రాయము.

గ్రంథవిషయము:—ఇదిమూఁడాశ్వాసముల లక్షణగ్రంథము. ఇచ్చటిప్రతి మిక్కిలి పరిశుద్ధముగా సంపూర్ణముగా నున్నది. తిరుపతిరాయనిప్రేరణచేఁ గవి యీగ్రంథమును గుంటూరిమండలములోని యీమనిగ్రామ మందలి కోదండరాఘవస్వామి కంకిత మొనర్చెను. ఇందు మొదటి యాశ్వాసమున ధనుర్నిర్మాణపరిమాణము, మార్గణపరిగణన, శరవిధానమానప్రశంస, పుంఖోపసంఖ్యానము మొదలయినవియు, రెండవయాశ్వాసమున ధనుర్బాణగోపనార్హ్మని-చోళనిషంగరచనాప్రవచనము, మౌర్వీవిధానకథనము, అంగుళిత్రాణప్రకీర్తనము, జ్యారోపణప్రకరణము,......శరగ్రహణోపాయ ప్రతిపాదనము మొద లగునవియు, మూఁడవయాశ్వాసమున లక్ష్యశుద్ధిలాభము,...నారాచమోచనప్రకారము, చిత్రలక్ష్యభేదనోపాయము, శాబ్దలక్ష్యశరాభ్యాసవిలాసము, మొద లయినవియు నతిసరసముగా సుగమముగా వివరింపఁబడినవి. కవిత్వమును రసవంతమై యుత్తమశైలిచే నొప్పుచున్నది. ఇందుండి యొకటిరెం డుదాహరించెను.

శా. ఆకర్ణాంతము కాండముం దివియుచో నర్ధాంగుళం బాశుగం
బేకస్ఫూర్తినిలోనికిం దిగిచి లావెక్కించి యిట్టట్టునుం
బైకిం గ్రిందికిఁ దీక పుంఖముబిగింపన్ నిశ్చలంబై రయో
ద్రేకం బొప్పఁ గదంబకంబు నడచున్ ధీరుల్ ప్రశంసింపఁగన్

మ. శరసంధానవిధానతానకములన్ సంధిల్లునిర్దోషముల్
పరిభావించి ధనుష్కళానుకలనాభాస్వన్మనోవృత్తియై
శరసంధానవిమోచనమ్ముల విశేషమ్ముల్ పిసాళింపుచున్
నరుఁ డానందము పొందుచుండు ధరణీనాథుల్ ప్రశంసింపఁగన్

[ఇందు "కందాళ వెంకటాచార్యులుగారి పద్యాలు" అని కొన్ని కలవు. ఈ యతనిను గూర్చి తెలియరాదు]

## 80. రుక్మిణీపరిణయము.

పూర్వము గోదావరీమండలమునందే యవతరించిన దయ్యు నాంధ్రకవుల చరిత్రము నెఱుంగనిమదనగోపాలచరిత్ర మనునామాంతరము గల యీ ప్రబంధముయొక్క సంపూర్ణమైనప్రతి యొకటి యిచ్చటకు లభించినది. దీనిని రచియించిన యతఁడు కొప్పర్తి నరసింహకవి. ఈతనినివాసగ్రామము, ఇపుడు కృష్ణామండలములోఁ జేరిన మొగలతుఱ్ఱుకోటకుఁ గోసులో నున్నసీతారామపురము. ఈతని తండ్రి గోపనమంత్రి, తల్లి, అచ్చమాంబ; ఇతఁడు భారద్వాజగోత్రుఁడు, కాత్యాయనసూత్రుఁడు, యాజ్ఞవల్క్యని యోగిబ్రాహ్మణుఁడు. ఇతఁడు గ్రంథావతారికలో స్వవంశమూలపురుషుఁ డగు రామశౌరినిగూర్చి యిట్లు వర్ణించెను.

సీ. గురుతరాంతర్వేది నరసింహమూర్తికిఁ గోవెల ల్గట్టించెఁ గొమరుమిగుల
భావనారాయణస్వామికిఁ గల్పించె వరగేహములు సర్వవరమునందు
రహి మీఱ విశ్వాసరాయపురం బనునగ్రహారము చేసె నధికలీల
నాయగ్రహారంబునందును దిగువయాతిరుపతి గావించె నరహరికిని

గీ. గడిమి నరసాపురస్థలధరణితోడఁ, గాల్వసీమకుఁ దా స్థలకరణ మగుచు
భూతిఁదనరెసీతారామపురమునందు, రమ్యగుణహారి కొప్పర్తిరామశౌరి.

క. సీతారామపురంబును, ఖ్యాతిగఁ గొప్పర్తి యనెడి గ్రామములకు వి
స్ఫీతస్థావరికత్వవి, భూతిని రామాఖ్యమంత్రి భువిపైఁ దనరెన్.

వీనింబట్టి కవి మూలపురుషుని వృత్తాంతము దెలియుచున్నది. మఱియుఁ గవి యవతారికలో—

"...గీ. కనకకౌశేయవసనంబు కటినిబొదల, నిడుదవాల మల్లార్చుచు నిలిచె నాదు కలను దా నాంజనేయుఁడు కరుణ మీఱ నొక్కరేయిని బ్రాహ్మముహూర్తవేళ.

ఇట్లు మదీయస్వప్నంబున సాక్షాత్కరించి నీవు ప్రయోజనంబున సంచారంబు సల్పు. కొండపల్లి మండలంబునఁ గృష్ణవేణీనద్యుత్తరభాగసార్ధయోజనస్థలంబునఁ గోడూ రనియెడు గ్రామంబుదక్షిణజాంగలస్థలంబున నొక్క నీలప్రస్తరాంతరంబున వెలయుప్రతిమారూపంబు గల యాంజనేయుఁడను. మదీయానుజ్ఞను నాస్థలంబున మదనగోపాలపురం బనునగరంబు గట్టించి యందు మదనగోపాలమూర్తిని బ్రతిష్ఠ గావింపుము. అద్దేవునకు నంకితంబుగా నొక్క దివ్యప్రబంధంబు మదనగోపాలచరిత్రం బనునామంబున రుక్మిణీపరిణయ కథానుబంధురముగా నొక్క

సుకవిసింధురసాహాయ్యానుగ్రహంబున రచియింపు మని పలికిన......ప్రణామం బుసలిపి...నిలువ నద్దేవుండు సుఖంబుండు మని పలికి తిరోహితుండైన, మేల్కని తదీయప్రబంధ నిబంధనంబునకు సమకట్టి తదాంజనేయోక్తమార్గంబునఁ దత్పుర (క్రోడూరు) దక్షిణజాంగలంబున నీలోపలంబులోన నాంజనేయబింబంబు గని సంతుష్టాంతరంగుండనై నిశ్చితస్వాపకలాపుండనై తదీయస్థలంబునఁ దటాకంబు నూతనంబుగా సంఘటించి పురంబు నిర్మించి తదుక్తకావ్యంబు రచింప సమకట్టి తత్సహాయంబునకు నొక్కమహాకవిసందర్శనం బపేక్షించి యున్నసమయంబున నొక్కనాఁడు—

సీ. శ్రీకృష్ణపదయుగాశ్రితుఁడు సాంఖ్యాయనగోత్రుఁడు రఘుపతిపౌత్రుఁడు గురు
వకవీంద్రపెద్దమాంబాపుత్రుఁడురఘునాధునకుఁబూర్వజుఁడుమృత్యుంజయున క
నుజుఁడు రావ్యూరివంశజుఁడు ననుమకొండసంజ్ఞను గలయాదిశాఖను వెల
సినవాఁడు జాతకసిద్ధాంతముఖకథాచతురుఁడు నుభయభాషావిశేష

గీ. రసగుణాలంకృతికవిత్వరాజితుఁడు వి,రచితబహుకావ్య వీరనారాయణాది
శతకదండకసంస్కృత సరసపద్య, గేయపదుఁడైనసంజీవరాయసుకవి.

అమ్మహానుభావుండు మదీయభాగ్యంబునఁ జనుదెంచి దర్శన మిచ్చిన నత నికి జాంబూనదాంబరాభరణంబు లొసంగి బహూకరించి నిలిపి తత్సహాయాను గ్రహంబుపైఁ బ్రబంధారంభంబు గైకొన్నవాఁడ" అని వ్రాసికొనెను, ఇందలి స్వప్నము నిజమైనది యైనను లేకున్న నాంజనేయునియందలి భక్తిచేఁ గల్పించుకొని నది యైనను గావచ్చును గాని యీస్వప్నవృత్తాంత మంతయు మాత్రము క్రోడూరియొద్ద మదనగోపాలపురము కట్టించుట మొదలుగా సంజీవరాయ కవి సహాయముచే రుక్మిణీపరిణయము వ్రాయుట యనునంతవఱకును సత్యమై ప్రత్యక్ష మగుచున్నది. ఈ నరసింహకవికి సహాయపడిన పైరావూరి సంజీవరాయకవి రచియించిన కావ్యములలో—

## 31. వీరనారాయణశతకము.

మాత్రము పరిషత్తునకు లభించినది. ఇదియు "వీరనారాయణ ముకుంద విశ్వతుంద" అనుమకుటము గలిగిన నూటతొమ్మిది సీసపద్యములతో విలసిల్లుచున్నది. ఈ ప్రతియుఁ బరిశుద్ధముగా నున్నది. ఇందలిపద్యములు "లక్ష్మీశనాథ

రక్షణపరాయణుండ నారాయణుండ" యను దశావతారపద్యములవంటి గునుకు సీసములు. ఇందులకు నరసింహకవి యవతారికలోని దని పైనుదాహరించిన సీస పద్యమే ప్రమాణము. ఆపద్యము సంజీవరాయకవి రచియించిన యావీరనారాయణ శతకములోఁ జివర—

సీ. "శ్రీకృష్ణపదయుగాశ్రితుఁడ సాంఖ్యాయనగోత్రుఁడ రఘుపతిపౌత్రుఁడ గురు
వక వీంద్రపెద్దమాంబాపుత్రుఁడ" అని యుత్తమపురుష విశేషణములతో

నున్నది. ఇందలి పద్యమే రుక్మిణీపరిణయమునఁ బ్రథమపురుష విశేషణములతో మార్పఁబడి యున్నది.

కవులకాలము:—రుక్మిణీపరిణయాంతమున—

సీ. శకమజఖర్షీందుసంఖ్యను దగుపరాభవరాధపూర్ణిమాభానుతిథికిఁ
బరిపూర్ణరుక్మిణీపరిణయ మనెడిప్రబంధంబు మదనగోపాలచరిత
భారతరణమందుఁ బార్థున కాప్తుఁడై కృష్ణదేవుఁడు నిర్వహించినట్లు
రావూరిసంజీవరాయకోభయభాషఘనకవి నిర్వాహకంబు సేయఁ

గీ. జెప్పి యాకృతి నీకు నర్పింపఁ గంటి, నుభయకవులకుఁ గైవల్య మొదవఁ గోరి
నరసకొప్పర్తి గోవన్నసచివసుతుఁడ, భువిని నరసింహనామక కవిని నేను.

అనుపద్యముంబట్టి యాగ్రంథము శాలివాహన శకవర్షములు 1709 అనఁగాఁ గ్రీస్తుశకము 1787 వ సంవత్సరమున సమాప్తి నొందినట్లు స్పష్టమగుచున్నది. అనఁగా నిప్పటికి 127 సంవత్సరముల క్రిందట నీకవు లిద్దఱు నున్నట్లు నిశ్చయము. పరిషత్తునకు వచ్చిన యాగ్రంథమును నరసింహకవిపౌత్రుఁ డగు వెంకనార్యుఁడు వ్రాసినట్లుగా "వికారినామ సం॥ అధిక జ్యేష్ఠ బ 3 శుక్రవారంవరకు సీతారామపురం కొప్పర్తి చినరామేశం కొమారుఁడున్ను యాకృతీశ్వరుఁ డైన నరసయ్యకు మనుమఁడున్ను నయిన వెంకన్నస్వంతముకు స్వహస్తంగా రుక్మిణీపరిణయము సర్వమున్ను పంచమాశ్వాసం సంపూర్ణంగా వ్రాసుకొనెను" అని యున్నది. దీనింబట్టి యాగ్రంథ మిప్పటికి 76 సంవత్సరములక్రిందట వ్రాయఁబడినట్లు తెలియుచున్నది నరసింహకవిని నాతనికాలమును గూర్చి తెలియఁజేయుచు విశేషములు తెలుపుఁడని యాప్రతివ్రాసిన వెంకన్నగారికిఁ బౌత్రులును బరిషత్తునకు గ్రంథ మొసంగిన వారు నగు రామచంద్రరావుగారికి నేను వ్రాయఁగా వారు సీతారామపురమునుండి యొకజాబువ్రాసిరి. అందలి విశేషాంశముల నిందుఁ బొందుపఱుచుచుంటిని.

"అయ్యా, నరసింగకవిగారికి రుక్మిణీపరిణయము లిఖించిన వెంకన్నగారు పౌత్రులు. ఆ వెంకన్నగారు మత్పితామహులు. వెంకన్నగారికి రుక్మిణీపరిణయము వ్రాయునప్పటికి సుమారు 30 సంవత్సరములుండు నని యిప్పుడు జీవించి యుండిన యాయనకొమార్తె చెప్పుచున్నది. ఎట్లయినను వెంకన్నగారి జననకాల మిప్పటికి నూఱేండ్లు కావచ్చును. గ్రంథకర్తకును దత్పౌత్రుఁడగు వెంకన్నగారికిని 70 సంవత్సరముల భేదముండవచ్చునని యూహింపవచ్చును.

చిత్తగించవలెను.

సీతారామపురం, నరసాపురంపోస్టు. | ఇట్లు విధేయుఁడు, కొప్పర్తి రామచంద్రరావు.

---

గ్రంథవిషయము:—ఇది యైదాశ్వాసముల ప్రబంధము.

ఇందలివిషయము గ్రంథ నామమే తెల్పుచున్నది. గ్రంథ మందందుఁ జెదలు కొట్టినను దెలియఁ దగినస్థితిలో నున్నది. అముద్రిత మయిన యీగ్రంథమును దద్వంశజులు గాని యాంధ్రభాషాభిమానులు గాని శీఘ్రముగా నచ్చొత్తించిన చో భాష కుపకారము గావించిన వారగుదురు.

ఈగ్రంథము వ్రాయుటలోఁ గొన్ని శకటరేఫములు గూడఁ బరిపాటిసేయఁ బడినవి గాని యింతకంటె నామూలాగ్రముగా నరసున్నలు తెలుగులో ౧ ఒకటి యంకె వలెఁ గనుపట్టుచున్నవి. ఇది విశేషాంశము.

కవిత్వవిషయము:—ఇది సరసవర్ణనములతో శృంగారప్రధానముగా మనోహరముగా నేకవిధ మగుశైలిచే నొప్పుచున్నది. కాని యందందు వ్యతిరేకక్త్వార్థకములను ద్రుతాంతముగాఁ బ్రయోగించుట మొదలు గా వ్యాకరణదోషములు లేక పోలేదు. మఱియు 'నుభయభాషాకవి యగుసంజీవరాయకవి తోడ్ప డె'నని చెప్పికొనుటకుఁ దగినట్లుగా యత్నసాధ్యము లగు 'దైత్యభిత్కథాధ్యాయుఁడు, సాధుసంగధనదాయుఁడు," మొద లగు ప్రయోగములు గూడ నందందుఁ గన్పట్టుచున్నవి. మొత్తము మీఁదఁ గవిత్వము క్లిష్టము గాక మృదువుగా రసవంతముగా నున్నదనుటలో నాక్షేపణము లేదు. శైలి తెలుపుటకు రుక్మిణీపరిణయమునుండి రెండుపద్యములును, వీరనారాయణశతకము నుండి యొకపద్యము ను దాహరించెదను.

చ. హితమతి యుం బురోహితుఁడు నింగితవేది దయాపరుండు స
ద్వ్రతుఁ డతికార్యవాది యగువాఁ డొకభూసురుఁ డీరహస్య మా
తతగతిఁ దాల్చి శీఘ్రగతి ద్వారక కేగి మురారిఁ గాంచి యీ
మతము నుపన్యసించి గరిమం గొని రాఁగలవాఁడు గల్గునే?

శా. నిన్నుం గా వేల్పులవే ల్పటం జెఱుఁగఁగాఁ నేడితఁ డాయోధనా
సన్నుం జేచు మహాపరాధము ఘటింపం బల్కి దద్గర్వవి
చ్ఛిన్నుం డయ్యె మదగ్రజుం డితఁడు రక్షింపంగఁ బాత్రుం డగుం గా
నన్నుం గా మన్నన చేసి కావుము జగన్నాథా యనాథావనా.

ఇందలి పద్యములు చాలవఱకు భాగవతమునందలి రుక్మిణీకల్యాణములోని పద్యముల ననుకరించుచున్నవి.

సీ. ఆర్తులఁ గాచుటకై దీక్ష చేసి కంకణము గట్టిన జగత్కారణపర
మేశు రమేశు నమేయగుణస్వరూపు ననంతు నిన్ను నర్గాఁ బ్రోవు మనుచు
మాటి మాటికి బతిమాలు కుశీలు న దూరదర్శనుఁ గృతదురితబుద్ధి
హీను నజ్ఞాననిదాను న న్నేనె తలపోసి కొని నవ్వ దరలనుండుఁ

గీ. గాదె బ్రహ్మాండకాండసర్గస్థితిలయ, కల్పనానల్ప సంకల్ప కరుణజనిత
గురువిలాసధూతభ్రూక కొలనుపాక, వీరనారాయణ ముకుంద విశ్వతుంద

ఉభయభాషాకవియగు నీతని యీశతకమందును వ్యాకరణదోషములు తఱచుగా నున్నవి.

---

## 32. వాస్తుసారసంగ్రహలక్షణము.

ఇదియు నేచరిత్రలోను జేర్కొనఁబడని గ్రంథమే. దీనికవి పేరుసోమల గణపయామాత్యుఁడు. ఇతఁడు తన్నుఁ గూర్చి యవతారికలో నిట్లు వ్రాసికొనెను.

"సీ. శ్రీకృష్ణపదభక్తిసేవాధురంధరుఁడ వసిష్ఠగోత్రసంభవుఁడ ఘనుఁడ
ననుపమానాశ్వలాయనమానిసూత్రుండ విద్వత్కవీశ్వరవినయపరుఁడ
శ్రీమంతుఁ డగుపేరుసోమలశివరామవంశవార్నిధికి జైవాతృకుండు
కమనీయగుణకీర్తి గరాపణ్మంత్రికిఁ, బౌత్రుఁడఁ బరమపవిత్రచరిత

గీ. మల్లమకు వెంగనామాత్యమణికి సుతుఁడ, సకలసిద్ధాంత గణితశాస్త్రజ్ఞు లెంచ
వాస్తుశాస్త్రంబు మదియించి వ్రాత గాంచి, మహిని జెలు వొందు గణపయా
మాత్యకవిని.

ర్తనభాకృత్యవధాదిమార్గములు నక్తంవార్ధిశై వాలము
లుఁబనరుక్తార్కసుతాచ్ఛట ల్దగెఁ దమంబు ల్తండతండంబు లై. 29

క. దిక్కుల నిండి ధరిత్రిం, గ్రిక్కిఱిసి మహాతమంబు గిఱికొనె నిఁకఁ దా
నొక్కింత దలఁకి కాంతు, ల్దక్కక విలసిల్లు చుక్కలం గప్పుతఱిన్. 30

గీ. పొడిచె ధవళిమ జాబిల్లి పొడుపునందు, రమణసమయపు వజ్రపురాజురాక
తగ నెఱింగింపఁ జీఁకటు ల్దామె దారి, కడకు వ్రాయంగఁ దెచ్చు కాకల మనంగ. 31

వ. అంత. 32

చ. కుముదములందు సామముఁ జకోరములందును దానము న్రథాం
గములయెడ న్విభేదనము గాటపుఁజీఁకటియందు దండన
క్రమమును గానిపింపఁగఁ దగం బగ నెల్లను నీఁగి విక్రమ
క్రమ మమరంగ రాజు దగఁ గైకొనె నయ్యుద * యాద్రిపీఠమున్. 33

ఉ. ఎల్లజను ల్పయోరుహభవేశ్వరవిష్ణుమయాత్ముఁ డైనవాఁ
డల్లవికర్తనుం డనుచు నాడుదు రాతఁడు గాఁడు నేన సూ
తెల్ల మటంచు లోకులకుఁ దెల్పినరీతిని జంద్రునందు రా
గిల్లెను మేనిపైఁ బొడుపుఁగెంపును బాండిమముం గళంకమున్. 34

సీ. ఖరకరుం డతిశీతకరలీలఁ దనయందు వహియించె నీతనివంకఁ గాదె
మును దిస్సమొలసామియును రాజశేఖరత్వము దాల్చె నీతనివంకఁ గాదె
యమరు లై వేల్పు లందరు దినదినము లున్నవారు దా రీతనివంకఁ గాదె
నరులు సేవను జిదానందానుభవయోగివరు లౌదు రీతనివంకఁ గాదె

గీ. జలజభవువంక హరివంక శౌరివంకఁ, గొదవ లెన్నుచు మ్లేచ్ఛులు మొదలుగాను
వరుస నీక్షింతు రీతనివంకఁ గాదె, యనఁగ జాబిల్లిఁ బ్రాఁకె నయ్యభ్రవీథి.

ఉ. పెంపునఁ జందమామ ప్రతిబింబముఖంబునఁ జుంబనంబు గా
వింపను రాయఁ దత్కరనవీనరుచు ల్పలితభ్రమంబు పు
ట్టింపఁగ రోసి పద్మిని ముడించెను మోమునఁ దమ్మి మోడ్పునా
యిం పటు సూచి నవ్వె నన నెంతయును న్వికసించెఁ గల్వయున్. 36

గీ. భూనభోవీథిఁ బా లారఁబోసినట్లు, కడలిదొరపట్టి వెన్నెల గాయసాగెఁ
బులిశిఁ బుట్టినకూనకుఁ బొసఁగ నొక్క, చాఱయును లేదె దీని కాశ్చర్య మేల?

* యాచలసింహపీఠమున్. అని మాతృక.

వ. (1)ఇవ్విధంబునఁ జంద్రికాపూరంబులు తోరంబులై బిసప్రసవకోరకవిసరంబులం బొదల దళంబుల సందుసందులం దెఱపి గని చొరంబాఱి మధురసమిళితపరాగయోగంబు పొంగార గాఱ యుచ్చినచందంబున నందంద తారొ్కను కోకనదగేహినీగేహంబులకు నోముబిల్లలఁ గప్పినయొప్పును గల్పించుచు నటమున్న హిమకరతరుణకిరణఘనఘనికనికరక్రియానటీరంగంబు లగు సురంగంబులును దరవికచోత్పలనిర్ముక్తప్రభామండల యంత్రోపలంబులను దళంబు లను కొత్తళంబులు విరియించి మకరందవాహినీనిర్ఝరంబులకుఁ దగుతత్తటంబు లను వంకదారులఁ జొచ్చియు నగ్గలికలం గలకుముంగడినంగడిం జడిసి యెడనెడఁ దొరంగు లగు మధుకరఝుంకారంబు * * * * * *
రావంబు తననందనునికువలయప్రతిపాలనఖేలనావిశేషంబు గనుంగొని హర్షోత్కర్షంబునం బొంగి నింగి ముట్టంబోలుఁ గాకున్న మకరకర్కటమీనంబుల క్రిందనుం బడి యేమి యని వెఱఁగున సురగరుడసిద్ధవిద్యాధరముగ్ధధవళేక్షణాసముదయంబు వీక్షింప జారసారసముఖజాలంబులకుఁ బ్రబలికూలంబును మలిమ్లుచప్రచారంబులకు దూరంబును విరహిణీజననివహంబునకు దుర్వహంబును జంద్రకాంతశిలావిటంకంబులకుఁ బొంకంబును నై జగదండఖండంబున నిండి మెండుకొనియె, నయ్యవసరంబున. 38

గీ. అంతకటమున్నసమయకృత్యములుదీర్చి, యువనిసురుఁమండెఁబర్ణశాలాంతరమున
దేవదేవియుఁ దాఁ దదాదేశమునను, గడక మునుమాపె తనపాదకడకు వచ్చి.

సీ. మెదిచి మెత్తినమృగీమదపంక మాయెను మడవలు గట్టఁ బైఁబడినరొంపి
తావి గుబాళింపఁ దగుగందవొడి యయ్యెఁ బాఁదులుద్రవ్వఁ బైఁబడినదుమ్ము
నిండారు కుల్కుపన్నీటితుంపురు లయ్యె బడలికచేఁ గానఁబడినచెమట
కంతుకేళిని గచాకచిఁబెనంగుట యయ్యె వడిఁ బొదల్ చొరఁ జిక్కువడినకురులు

గీ. అనుచుఁ దనయింట సకలభాగ్యములు గలిగి
తొలుతఁ దానున్నయునికియుఁ దలఁచి యప్పు
డచటఁ దానున్న యునికియు నరసి యరసి
దిగులు మదిఁ దోఁప మఱియుఁ జింతింపఁ దొడఁగె. 40

(1) ఈ వచన మసంపూర్తిగా నుండుటచే నున్నంతవఱ కున్నట్లే యుంచితిమి.

— * దేవదేవి విప్రనారాయణుని వంచింపలేక వగచుట. * —

ఉ. అక్కటా! నాఁడు మాయపువనానిల మేటికి వచ్చె వచ్చెఁబో
యిక్కడికంచు వెంబడిన యే నరుదేఁ బని యేమి గల్గెఁబో
యిక్కతినాత్మఁ డయ్యెడల నేల వసించె వసించెఁబో యితం
డెక్కడఁ బోయె నే మనక యీగతిఁ బన్నిద మేల వైచితిన్! 41

క. నటనల విలాసరేఖా, ఘటనల నీజటిఁ గరంపఁగల నని మున్నే
నటు సూచితి నటుగా దని, యిటు సూచితిఁ దెమలఁ డింక నే మనుదానన్.

క. నేరము చేసితి నెంతయు, నీరేరుహనాభ! కృష్ణ! నీతిరువెళ్లం
జేరితి నానతివే శ్రీరంగా! రంగరంగ! సేవకఫలదా! 43

— * దేవదేవికి రంగనాథుఁడు స్వప్నంబునఁ గనఁబడుట. * —

వ. అనుచుఁ జింతాపారవశ్యంబునఁ గొంత నిద్రించుసమయంబునఁ నార్తజనశర ణ్యుండును నిఖిలదేవతావరేణ్యుండును భక్తజనఫలప్రదాయకుండు నగురంగ నాయకుం డయ్యింతి భావంబున నావిర్భావంబు నొంది, యిందువదనా! భవ దీయమనోరథంబు సఫలం బయ్యెడు మెల్లి యీప్రొద్దు దనుకం దాళుమా మ్మని యనుగ్రహించి యప్పంచశరగురుండు తిరోహితుం డైనం గనుంగొని మే ల్కాంచి చంచత్కుతూహలాద్భుతభయసంభ్రమంబులు మనంబునం బెనం గొన నాత్మగతంబున. 44

. ఈకల నిజమో కాక ప,రాకో చోద్యమగు ... ...లు గలవే
నాకల యెన్నఁడు నిక్కల, గాకుండఁగ నిటు పరాకు గాఁ బనిగలదే. 45

. అని మొపుమ తెల్లవాఱును, దినకరుఁ డీఁక నెప్పు డపరదిక్కున కరుగున్
వనరుహనాభునివాక్యం, బనుకూలం బెప్పు డగునో యని యున్నంతన్. 46

— * సూర్యోదయాదివర్ణనము. * —

. రక్కసులగురువు గురునకు, వెక్కస మగుమతికినిరవు వెరవుల కెల్లన్
దిక్కు నుతికెక్కువేగురుఁ, జుక్క (దివి) న్పొటులు గఁడు నుచుక్కనఁ బొడిచెన్.

. ఇననిభుఁ డై వగౌతమ మునీంద్రువివేకము పీటఁబుచ్చి యా
యనఘునిధర్మపత్నికి నహల్యకు నాఱడి దేఁ దలంచి వం
చనగతిఁ గూయు కోడిగపుజాతి జగద్విపరీతచర్య మిం
చను బిరణాయుధంబు లగుసాములు దా నెఱిఁగించె నెంతయున్, 48

మ. పలుకంబాజి నగారచారుతరదీపజ్వాలిక ల్దిక్తటం
బులఁ గన్పట్టె విటీభుజంగనయనంబుల్ నిద్రఁ జెందెన్ విధూ
పలజాలంబులజా లడంగె శశిబింబస్ఫూర్తి తగ్గె న్నవో
త్పలకాంతు ల్గ్రహిఁ దీసె దాఁగె నిరు లంతన్ గహ్వరాంతంబులన్. 49

శా. స్మర్తల్ తత్త్వ మటంచు నెంచఁగ మహాశైవు ల్మనోజద్విష
న్మూర్తింగా నుతియింప వైష్ణవులు విష్ణుం డంచు నెంచం దగం
గర్తారుం డనుచుం దురుష్కులు మొదల్గాఁ గొల్వఁ బ్రత్యక్షమై
మార్తాండుం డుదయించె నబ్ధితటసీమప్రాశితౌర్వాకృతిన్. 50

క. అప్పుడు మేల్కని చెలి ముద, మొప్ప న్సుఖమజ్జనాదు లొగిఁ దీర్చుచుఁ దా
నెప్పటివలె మును సెప్పిన, చొప్పన నెలదోఁట సేయ సూర్యుఁడు గ్రుంకెన్.

మ. కలికాలంకృతనీప ముర్ఘితసరః కాదంబ ముత్కోకచకం
దల ముద్విగ్నశకుంత ముల్లసదుదన్వల్లోల (కల్లోల) ము
త్కలికాయుక్తమయూర మున్మిషత్సముద్యచ్చాతకంబు న్సము
జ్జ్వలజంతువ్రజ మంబుదాగమము విశ్వస్తుత్య మయ్యెం దగన్. 52

చ. మొనసె ఘనాఘనంబులు తమోనికరంబులు మచ్చరించి పే
ర్చిన మఱి యొక్కవేళ నొకచెల్వన నొక్కవిలాసరేఖఁ జ
య్యన నుది తంబులై ... ... ... ఘనంబులై
మునుకొని కారుక్రమ్ముకొని ముంచెనజాండకరండమండలిన్. 53

క. పెలపెలపెలయని చిలికెం, బెళపెళపెళ యనుచు నుఱిమె బెళుకు మెఱుంగుల్
తళతళతళ యని మెఱసెన్, బళిబళిబళి యనుచు హాలికపటలి నటించెన్. 54

క. చిటిపొటిచినుకులు మిగులన్, బొటబొటబొట యనుచుఁబడఁగఁ బొదరిల్లుగనుం
జొటజొట నురియఁగ గురుకుచ, కటకటకట యనుచు వగపు గడలుకొనంగన్.

సీ. పనిలేనివనివట్టి పాలార్చి పన్నిదం బనినతొల్లిటినేరమునకుఁ దోడు
కుడిచి కూర్చుండి యేఁ గ్రొవ్వి యివ్వేషంబుఁ బూనినయవివేకమునకుఁ దోడు
గుఱు తెంచ నొగాము లెఱుఁగక చెన్నారుగొనినట్టి మూఢత్వమునకుఁ దోడు
తలఁచిన తలఁపు బాములు దెచ్చినట్టి యీతనువు వయోగర్వమునకుఁ దోడు

గీ. గొంటుబాఁపఁడుతారాతికొడుకుఁబోలె, నటనలకులోనుగాకయుండుటకుఁదోడు
... వడవడ వణఁకించినలఁపవలసి, వర్ష మిదె యీదయును దాను వచ్చె ననుచు,

క. తడయక మిక్కిలి వానం, దడియక వసియింపఁ దగును దాపసిపంచం
*గడుకుంజమంత నుటజము, కడకుం జనవలయు ననుచుఁ గదిరి కడంకన్. 57

సీ. అడు గిడు నడుగు గొంకిడు గొంకి తడవును దడవి యొయ్యనదాఁటు దాఁటి నిలుచు
నిలిచియొంటిఁదలంకుఁదలఁకిదైవముదూఱు దూఱిపొదల్దూఱుఁదూఱియలయు
నలసి నివ్వెఱఁ గందు నంది యుస్సురు మను నని కెలంకుల చప్పు డరయు నరసి
చనఁగొంచుఁగొంచియమ్మునిపాలంకువ విను వినికొంతధృతివహించును వహించి

గీ. కటికిచీఁకటిగములకుఁ గలఁగుఁ గలఁగి, మెఱుఁగుమొత్తమ్ము లడరినమెచ్చు మెచ్చి
చినుకుపడినగగుర్పాటు సెందుఁ జెంది, యలసగతితోడ మెలపున నరుగునరిగి,

క. ఆవనజేక్షణ గాంచెం, బావన మగుపర్ణశాలపజ్జను ఘనసా
రావి న్నిజదళచలనవి, రావిన్ శాఖాపరంపరావిన్ రావిన్. 59

వ. ఇత్తెఱంగునం గురంగనయనారత్నం బతియత్నంబునం గనుంగొని యంతంతఁ దనయునికిఁ గొంతయనుకూలం బగుతదీయమూలంబున నిలిచి విసీలిమధామం బగుధూమంబునసుమం గడు మెఱయు పావకజ్వాలచాదంబునఁ జంచరీకమాలికాభిరామం బగుకుఱంగటి ధామంబున మషీమలినపటఖండంబునం బొదిగిన మాణిక్యశలాకవిలాసంబున వసిఁ గరువలి విసవిస విసరం గసర ముసర (సర)సంగల కటికిచీఁకటి మొత్తంబుమధ్యంబున నిగనిగని నెమ్మేనుదీఁగె రాగిల్ల నల్లన వసియించె నయ్యవసరంబున. 60

క. మూఁగినఘనములు తారం, గ్రాఁగినధరణీతలంబుకడసెక లెల్లన్
లోఁగినఁ గుంభద్రోణము, గాఁ గురిసెం బాము వ్రేలఁగట్టినతేవన్. 61

చ. పడువడగండ్లపెల్లు గనుపట్టు మిఱుంగుఱుఁబుర్వు లంచు సం
దడిగొను నింద్రగోపములు దర్దురఘోరరవంబు తోడుతం
దడఁబడు నార్తజాంతవనినాదము మోదము మీఱ నెల్లెడం
గడుఁ జరియించు రాజిలనికాయములుం దఱి చయ్యె నయ్యెడన్. 62

క. దిగువం బాఱెడు వెల్లువ, కగపడి పైజాఱు వ్రానియాకులనీటం
బొగులుచును జల్లువాన, న్నొగులుచు నయ్యింతి యిట్లను న్మదిలోనన్. 63

శా. చెప్పం జిత్రముగాఁ జలంబు గొని వచ్చె న్నాలిపెన్వాన యే
నెప్పాటం దరియింతు దీని మఱి యిం కెవ్వారు దిక్కేఁగతిం

* ఇది సాధుపాఠముగా లేదు.

దప్పం ద్రొబ్బఁగ వచ్చు నీ వకట నిన్న న్నాకలం గన్న రం
గప్పా! యెక్కడ నున్నవాఁడవు పరాకా న న్నుపేక్షింతువా! 64

చ. అనుచును బల్కరించు వసుధామరవల్లభుఁ బిల్వఁ జూచు ని
మ్మనుజ లతిక్రోపను ల్పరమమూర్ఖులు తాళుకొనంగనేర రే
మని శపియింతురో యని భయంపడుఁ బోయిన ప్రొద్దువోయినం
జనుదున క్రోర్చి యిందునె వసించుట మే లనుఁ బెక్కుభంగులన్. 65

క. ఇవ్విధమున నవు డయ్యెల, జవ్వని తలపోయుచున్నసమయంబునఁ దా
నవ్వేలని పర్ణశాలం, బువ్విలుఁగునితండ్రిఁ బోలుమునినాథుండున్. 66

సీ. కావేరిపూర మొక్కట వెల్లివిరిసెనో యొద్దిగాలువ యెద్ది యుర్లఁబడెనో
అసదైనమ్రాఁకు లెయ్యవి పెల్లగిల్లెనో యాకు లేవంకఁ జీకాకుపడెనో
కలిగొట్టుచిన్నరె మ్మలఁ... బెట్టెనో మడిసి యేకొమ్మలు బడలువడెనో
గాడ్పుచే నూటాడి కారె మేమయ్యెనో లతికలచెలువ మేగతిని జనెనో

గీ. తెలియ నింతయు వర్షంబు వెలుప దాయె, మొగులు మొత్తంబు లెప్పటివగిదితోడఁ
గారుక్రమ్ముచునున్నవో కాక కొంత, పలుకఁ బాటెనో కనుఁగొనవలయు ననుచు.

క. లేచి మెలపునఁ దాను గిలించియున్న, మెట్టు సడలించి వాకిటఁ బెట్టినట్టి
తడికఁ గేడించిపాదరునఁ దార్చిభూమి, సురశిఖామణియటులొంగిచూచునవుడు.

క. చలనం బందక చెంగటి, వలనం గనుపట్టు నిందువదనం జూచెం
(1)గలవాణీనిందితకోకిల, నంచితకలన రావి కెలనం గెలనన్. 69

— * విప్రనారాయణుఁడు దేవదేవింగాంచి పర్ణశాలకు రమ్మనుట. * —

చ. కని దూరీకృతకంటకస్మితగతో గ్రగ్రావరాజి న్నిర
స్తనికుంజావళిఁ బొల్చు నిచ్చలదళచ్ఛాయ న్సదాచారపా
వన వేదిం బవడంపుఁదీఁగె నమరే వర్తింపుచుండం బనే
మని శంకింపఁ దళుక్కున న్మెఱసె నుద్యచ్ఛంచలాజాలముల్. 70

క. క్రొమ్మెఱుఁగుల దగదగరుచి, చిమ్మనిచీఁకటుల విరియఁ జేసిన నవుడా
కొమ్మం దెలియఁగఁ గనుఁగొని, క్రమ్మదయం దేవదేవిగా నెఱిఁగి తగన్. 71

క. వానం దడియఁదొడంగిన, దాన న్నేననుచు నాకుఁ దగ నెఱిఁగింపం
బూనదు మది నానదు ధృతి, మానదు వర్షంబు గోల మగువ యటంచున్.

(1) గలనిందితవాణినిగో,—అని మాతృక.

పంచచామరము. అదే మదేమి దేవదేవి! యాంతరుచ్ఛదావళీ
భిదాపదాన మైన యట్టి పెంజడిం గడు న్వడం
కేదే మదీయదీప్యమానగేహ మూహసేయను
న్నదేకదే మదేభయాన యండ నుండరా దటే. 73

చ. అని మునినాథచంద్రుఁడు దయారస ముప్పతిలంగఁ బల్కిన
న్విని యలివేణి తా నిదియె వేళ యిఁక న్మఱి పీనిఁ దక్కఁగాఁ
బెనఁగకయున్న నన్ను వెడపేరునఁ బిల్తురు లోకు లంచు దం
డను దరుకోటరంబుకడ డాఁచిన సొమ్ములు నంబరాదులున్. 74

క. నెమ్మిని గైకొని యయ్యెడ, జమ్మునకుం గిరవాణి చని తత్ప్రీతిహా
రమ్మొ కడ నిలువ, రా రా, రమ్మని యమ్మునివరుండు రమణిం బల్కెన్. 75

ఉ. అక్కడనుండ నేల ధవళాయతలోచన వానగొట్టునం
జిక్కితిగా యిఁకం దడవు సేయక నాచిగురాకు శయ్యయా
దిక్కున నున్న దీవిటు మదీయపదంబులదండ నుంచు పెం
పెక్క ధరింపఁగావలయుఁ గొమ్మిదె నాదగుకావిశాటియున్. 76

సీ. తడికాళ్లతోఁ ద్రొక్కదవు చుమీఁయిదెకుశాస్తరణమాత్మధ్యానసమయమయ్యె
నెడలేదు వేష్టువ లిట రమ్ము ముట్టెదుగనుక ప్రాతస్స్నానమునకు వలయుఁ
బీఠంబుపైఁ దీర్థ పెరుమాళ్లు వేంచేసియున్నవా రపచార మోసరిల్లు
పెట్టెనారము పట్టెబుట్టిలోఁ *దులసిని జతనంబు భానువాసరము తేవు

గీ. పల్ల మామూల వలిపిరి చల్లు నిచట, నురియు నీచాయ నిద్రమైనుందు నచట
మహితరామానుజోదీర్యమాణభాష్య, ముఖబహుగ్రంథసామీప్యమునకుఁ
జనకు. 77

క. కన్నియ! కమండలూదక, మున్నది నీ వటు దొలంగ కుండఁగ దండన్
దిన్నెఁదనంబున నుంచు మ,టన్నను మన్ననకు నలరి యబలామణియున్. 78

ఉ. అప్పుడు జిల్లు దువ్వలు వొయారముగా సవరించి క్రొవ్విరుల్
గొప్పున నొప్పుగాఁ దుఱిమి కుంకుమ గందము మై నలంది తా
నుప్పు తిలక విభూషణసముత్కరమున్ ధరియించి హారముల్
గొప్పచనుంగవందు నెఱికొల్పి తనర్చి విలాసవైఖరిన్. 79

* దిరుతులసీజదళంబు—అని మాతృక.

ఉ. నూతనరత్నభూషణమనోహరకాంతులు దీపదీప్తవి
ఖ్యాతి వహింపఁ గ్రొమ్మెఱుఁగు కైవడి మై నిగుడంగ దేవదే
వీతరళాక్షి యప్పుడమివేలుపుచెంతకుఁ దారసిల్లి హే
లాతిశయంబునం బలికె సంకురితప్రమదానురాగయై. 80

ఉ. గోపవధూసనాథ(పదకో)కనదద్వయభక్తియుక్త! యో
తాపసవర్య! యీచలికతంబున నిద్దుర రాదు విష్ణుగా
థాపదలీలలం గడపెదం దగుప్రొద్దని విన్నవించి యా
లాపము సేసి కోకిలకలధ్వని యెంతయు వింతసేయఁగన్. 81

మ. తలిరుంబోఁడి దొడంగి మాధవుఁడు రాధం గూడి క్రీడించుగా
థలు కుబ్జం గయిగొన్నవార్తలును సత్యావాంఛ లీడేర్చుసు
ద్దులు నాభీరవధూటులందుఁ గల పొందున్ రుక్మిణీదేవిపై
చెలిమిన్ గ్రొన్ననవిచ్చులాగు వినిపించెన్ మాధురీవైఖరిన్. 82

వ. ఇవ్విధంబున శృంగారరసప్రధానంబు లగుకథాప్రసంగంబులం గొంత యభి
ముఖుం జేసి కలఁక యగుధైర్యంబున నున్నయతనిఁ జేరంజని. 83

చ. పడఁతుక తేనె లుట్టిపడఁ బల్కెను మౌనికులావతంస! యిం
పడరఁగ మార్దవంబునెల వయ్యెడునీచరణంబు లొత్తెదన్
బడలినవార లిందనుకఁ బాదులు ద్రవ్వియుఁ గారె మెత్తియున్
మడవలు దీర్చియుం బిదప మార్చియుఁ గాలువ లేర్పఱించియున్. 84

గీ. అనుచుఁ గెంగేలుఁజిగురుల నతనిచరణ, కమలయుగళినిజాంకపీఠమున నునిచి
యంగుళీయకఖచితంబులైనమణుల, డాలు నఖరుచితోఁ బల్లటీలుగొనఁగఁ.

క. ఒత్తెం జరణము లటు దళు, కొత్తెం దమి మునికి లాక లొత్తెం బులకల్
చిత్తజుఁడు వింటఁ దూపున్, జత్తాయతపఱిచి చిత్త జల్లుగ నేసెన్. 86

సీ. అప్పుడు చిట్టిముట్టాడుకోరికలనుదమకంబుచే నైన తత్తఱములఁ
జేపెత్తి నిలుకడఁ బెడఁబాయుసిగ్గుల నొక్కింత నుజ్జూఁత లూఁగఁదారి
యుదుటుఁ జన్నులకునై యుఱుకు నగ్గలికల మన సొగ్గసీయని మౌగ్ధ్యములను
అధరమాధురికి నట్ట్రాడు ముచ్చటలను గొదలేక ముప్పిరి గొన్నమమతఁ

గీ. దపసి డెందంబు వెన్నచందమునఁ గరఁగెఁ, గలయి కలమీఁదితిమురువఁ దొలఁ
గుచుండఁ
జిత్తజునిసేవ లెలగోలు సేసినట్లు, కులుకుఁబలుకులఁ జిలుకులకొలికి పలికె. 87

క. లాలనసేయవు నన్నుం, గేళీసంగతుల బుజ్జగింపవు నీపై
హాళిం జిక్కితిఁ గన్నడ, యేల దయం జూడ లాఁతినే మునినాథా! 88

మ. అనుచుం గంకణనిస్వనంబులు బెడం గై మ్రోయఁ గాంచీకల
స్వనముల్ వీనులవిందు సేయ నుదుటుంజన్నుల్ గదియాళింప లో
చనదీప్తుల్ చెలఁగంగఁ బైకొనుసరోజాతాస్యతోడం గడం
కను గ్రీడింపఁదొడంగె సత్తపసి రంగస్వామి ప్రేరేపఁగన్. 89

సీ. చక్కెరకెమ్మోవి చవిచూచి చవిచూడ నొయ్యనఁ గొనగోర నొత్తి యొత్తి
కివకివఁ బారువ క్రియఁ బల్కి పల్కంగ నలకళాదేశంబు లంటి యంటి
చుంబనక్రియలను జొక్కించి చొక్కింపఁ గమునొయ్యారముగాఁగఁ గవిసి కవిసి
బిగియారుకౌఁగిట సాగియించి సాగియింపఁ (జిట్టంటు)చేతలఁ జెనకి చెనకి
గీ. యుచితబంధానుబంధత నుండి యుండ, ననఁగి పుంభావరీతుల ననఁగి పెనఁగఁ
దపసికిని నేర్పియతనిమార్ధ్యంబు నెల్ల, రమణి* విడనాడె† నతసుప్రౌఢిమ చెలంగ.

చ. అవితథయోగధుర్యుఁ డగునమ్మునికిన్ మఱపించె నెంతయున్
ధవళవిలోచనాధరసుధారసధార నిజోపరిస్థలైం
దవకరమాధురీధరసుధారసధారఁ దలోదరీమణీ
నవమణితప్రసంగకలనాద మనాహతనాదముం దగన్. 91

చ. మెలఁతయుఁ దాను సంయమి తమిన్ విహరింపఁ గవేరకన్యకా
పులినతలంబునందు సురపొన్నలనీడల మాధవీలతా
వలయములన్ మరందరసవాహినులన్ మదకీరశారికా
కులకలనాదసంకులనికుంజములం గమలాకరంబులన్. 92

వ. ఇవ్విధంబునఁ గతిపయదినంబు లిచ్ఛావిహారంబులం గ్రీడించి యయ్యంగనాల లామంబు నిజమనోరథానుసరణపరాయణుం డగునవ్విప్రనారాయణుం దోడ్కొని యగ్రజసమీపంబునకుం బోవం దలంచి యయ్యారామంబు నిర్గమించె నయ్యవసరంబున— 93

ఉ. రంజితశింజితాభరణరమ్యనటీనట ... ... ...
రంజయపుంజనావనిధరప్రభుతత్పరతాశుకీమణీ

---

* విడనాడెన్. ఇం దిది ప్రేరణమునం దుపయోగింపఁబడె. † అతనిప్రౌఢిమ - మాతృక.

పంజరకుంజరాశ్వభటబంధురదర్పితశత్రుభూమిభృ
ద్భంజనకంజనాయకసుతస్ఫుటనీతికళావిశారదా ! 94

క. ... ... ... సం,చారిత యింపాన్నృపాలచంక్రమఖురళీ
ధారితకరేచితప్లుత, ధారాధారేయజవనతరగంధర్వా ! 95

కవిరాజవిరాజితము. పురహరసూనుసమానసమిజ్జయ ! పుష్పసుగంధసుగంధిలధీ
కరటిఘటాశ్రవణాంచలబంధురగంధమహాపచితార్చిరతి
స్ఫురదనలప్రతిమాద్భుతతేజ ! యశోరుచిజాలసచోళబహిః
పరిపిహితాబ్జభవాండకరండకృపాశరధీ ... ధీశరధీ. 96

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానందకందళితసౌం
దర్యధుర్య ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర లింగనమనీషిపుత్త్ర శ్రీకాళహస్తీశ్వర
దయాసహాయ చెదల్వాడ మల్లయనామధేయప్రణీతం బైన విప్రనారాయణ
చరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

చతుర్థాశ్వాసము.

క. శ్రీవిలసితగోవిందమ, దేవీహృదయేశ వంశదీపక పదరా
జీవ*నమద్వైరిధరి,శ్రీవల్లభ మాకరాజుతిమ్మనృపాలా! 1

గీ. అవధరింపుము నిజపురీయాత్ర సేయు
నావధూటిని విప్రనారాయణుండు
తమకమునఁ జూచి మమత చిత్తమునఁ బెనఁగ
నపుడు తానును వెనువెంట నరుగఁదలఁచి. 2

సీ. శ్రీవిభుఁ డవధరించిన † గండవడములు తిరుమణిపెట్టియ ‡ విరులగరిడి
కౌపీనముల నొలిగట్టినదండంబు గావివేష్టువ యుత్తరీకళవసంబు
సురచిర(ంబగు) నూర్ధ్వచూర్ణకరండంబు జలకమండలువును దులసిపేరు
సధ్వఖేదాపహం బైనదవిత్రంబు పుస్తకంబులు కుశప్రోత బ్రుసియు

గీ. మఱియు దొరకినగొడ్డలి మచ్చుకత్తి, సలగపాఱయు మొదలుగాఁ గలిగినట్టి
సాధనంబు లివెక్కుడిసడి యటంచుఁ, బలుతెఱంగుల నల్లటు పాఱవైచి. 3

మ. నలినాక్షీమణివెంబడిన్ సురటియున్ బంగారుభృంగారువున్
జిలుగుంబావడయున్ విభూషణములుం జీనాంబరంబుల్ సరం
బులు కర్పూరకరండముల్ పరిమళంబుల్ గందపుంగప్పుపా
వలునుం గావట నించుకొంచుఁ జనియెన్ వాచంయమస్వామియున్. 4

క. ఈపగిది నతఁడు గునగున, గోవనవెనువెంట నరిగెఁ గొంకక కామాం
ధోఽపి నపశ్యతి యనిమెడి, యాపలుకులు పలుక నిశ్చితార్థము గాదే! 5

గీ. వారిరుహనేత్ర తనయిూడువారిలోనఁ, బంత మీఁడేటి ననుచును సంతసించి
త్రోవ నమ్మౌని నటువలెఁ దోడితెచ్చె, నటువలెనె తెచ్చి యక్కచెంగటనునిచె.

క. ఇట్టొఁగద నీచూచివ, యట్టిమహాయోగి యూతఁ డౌఁగద మును నేఁ
బట్టినప్రతిజ్ఞ యిటుతుది, ముట్టెంగద చూడుమిూ ముముక్షువరేణ్యున్. 7

---

* నమత్పరిపంథిధరిత్రీ - అని మాతృక. † గండవిడియలు - మాతృక. ‡ పూలగరడి - మాతృక.

ఉ. అప్పుడు దేవదేవిని దదగ్రజ గన్గొని మానివంకయుం
దప్పకచూచి నివ్వెఱఁగు నానయు సంభ్రమముల్ మనంబులో
నుప్పతిలంగ నోచెలియ! యోవికచోత్పలపత్రనేత్ర! నీ
కిప్పొలఁతుల్ దలంపఁ బ్రతి యెవ్వరు! నిన్ను నుతింపశక్యమే! 8

క. చక్కఁదనంబులులేవో? చొక్కపుసరసతలులేవో? సుదతుల్ లేరో?
నిక్క మిటువంటి చిత్రము, లెక్కడనుం జూచి యెఱుఁగ నేఁ దరలాక్షీ. 9

క. ఓకన్న! యింతజాణవు, గాకున్నను రాజులెల్ల గారవమొప్పన్
నీకుం గైవస మగుదురొ, యీకడ నీరానియీవు లిత్తురొ? చెపుమా. 10

సీ. నెఱవాది నని వచ్చి నీకుటంగట నిల్చి యేచెలి వీణవాయింప నేర్చు?
భరతశాస్త్రక్రియాప్రౌఢిచే నేకాంత నీకడఁ జక్కఁగా నిలువనేర్చు?
నంగనాగమరహస్యము లెఱుంగుదు నని యెవ్వతె యెదుట వాక్రువ్వనేర్చు?
లావణ్యరేఖావిలాససంపద మేటి నని యేవధూటి నిన్నెనయనేర్చు?

గీ. అఖిలగుణగణసంపన్నవైననీదు, తెఱఁగు సకలంబు నెఱిఁగియు నెఱుఁగలేక
ముదిత! నీతోడ నేను బన్నిదము చఱచి, యోడితిని నీకు నిఁక మాటలున్నవేల?

గీ. అనుచుఁ గౌఁగిటఁ గదియించి యగ్రజాత
చెలియలిని నిట్లు మూఁడుమెచ్చులును మెచ్చె
దేవదేవియు వివిధసంభావనముల
వారభామిను లెంతయు గారవింప. 12

క. నయగారవుఁదమిఁ గపట, ప్రియముల మెఱమెచ్చుఁబల్కరింతను మిథ్యా
చయములను బైపచారవు, నయమున మునిఁగూడి కొన్నినాళ్లు రమింపన్. 13

క. భూదేవుఁడు దా నేమిట, బూదారియు నొక్కకాసుఁ బొరయించుటయున్
లే దఁట సకలము నడపిన, యాదొరగతి సంచరించునఁట యిది తగవే? 14

గీ. అనివిచారంబు తనకు నింతైనలేక, సుగుడితన మనుమా టెల్ల నున్ననేసి
యన్నిటికిఁ దాన చనవరి యగుచుఁ దిరుగ, నావిధము నెల్లఁ గడు దేవదేవి రోసి.

సీ. కన్నులల్లార్చి రొక్కారొక్కములు మాళ్లవరుసగా గడియించువారిఁ జూచి
కట్టడ కినుమంత కడమైన వేఱొక్కవైపులఁ జనఁ జూచువారిఁ జూచి
తత్తఱీవు పుట్టించి తక్కచేకాసెల్ల వడివెట్టి రాఁ దీయువారిఁ జూచి
మొగమోట యడిగి సొమ్ములమీఁదఁ గళవారి వదలక యార్జించువారిఁ జూచి

గీ. విటుల మఱియును వంచించు విధముఁ జూచి
యమ్మునీంద్రుండు కడుఁ బేద యగుటఁ జూచి
తల్లి వేసారికొనెడుచందంబుఁ జూచి
సఖులు ముదుగుల్లఁబోయెడుసరణిఁ జూచి. 16

క. ఈయునికి వారకాంతకు, నాయమె యిది యాఁడుతోడును నాఁటికి నాయం
బాయె నిఁకం గలకాలము, పాయక యత్తపసిగొడవఁ బడఁగాఁగలదే. 17

క. అపకీర్తి గాక యుండఁగ, నెపుడును నే మెలఁగుకరణినే మెలఁగుచు నీ
తపసిని నిలువెడలింపఁగ, నుప మూహింపంగ లే దొకో! యనునంతన్. 18

— * వేశ్యమాత విప్రనారాయణుని వెడలఁగొట్టుట. * —

సీ. గమకించుకీలుగుజ్జీముపదంబులరీతి నున్నదంతంబు లుఱ్ఱూఁత లూఁగ
వక్షోజములు జాఱి వ్రాలిపో మీఁగాళ్లకడదాఁక దూఱుదుంకంబు లాడఁ
బలుకరించినను జెంతల జేర రాకుండ వాతుంపురులు చిత్తవాన గురియ
గుజ్జుగు జ్జని కొర్లుకొర్లన దగ్గుచోఁ దవిలిన చెవులు చిందర్లుపోవ
గీ. బుజముపై నొక్కదోఁకలి పూనిపట్టి, గదరుకొనుచును గసరుచుఁ బెదవు లదరఁ
గొదవ లెన్నుచుఁ దాఁగన్నకూఁతు రున్న, తావునకు వచ్చె నల దేవదేవితల్లి. 19

క. ఇటువలెఁ జేరంజని య, వ్విటకంటకి కూఁతు నదరవేయుచుఁ బట్టీ!
యిటువంటివెఱ్ఱిదానవు, కటకట! తగవగునె వీనికడ వసియింపన్? 20

మ. కొలఁదుల్ మీఱినసంపదల్ గలభుజంగుల్ వీట లేరో! వదా
న్యులుగారో! వలవంతలం గలఁగి నిన్నుం గోరి రారో! నవో
త్పలపత్రేక్షణ! వీనిమాయలకు బందా గాక నీయీడుభా
మలలో వన్నెయు వాసియుం గలిగి యమ్మా! సొమ్ముపార్జింపవే. 21

చ. ప్రతి మఱి లేని లేఁగొమిరె ప్రాయపునాఁడె విలాసవైఖరిన్
మితిగడవం బదార్థము దమిం గడియించుట నీతిగాక యీ
తతి చని పిమ్మటన్ ముదిమి దారసమైన మ ఱేటిసుద్దులే
గతజలసేతుబంధములు గావె ధనార్జనపుంబ్రసంగముల్? 22

చ. నెటికలు దీసి యిచ్చకము నేర్చి ప్రసంగము దీసి యప్పట
ప్పటికి నుతించి మాటలను బందిరివెట్టి సటల్ ఘటించి ము
చ్చట లెఱిఁగించి బాస సహజంబుగ నందఱ కన్నిరూపులై
విటులఁ గలంచి తీయఁదగు విత్తము లుత్తమవారకాంతకున్. 23

వ. అని యవ్విటకంటకి యివ్విధంబునం గూరిమిపట్టిఁ గిట్టి దిసంతులు గొట్టి కట్టి
దుటం గంబంబుమఱుంగునం గదలమెదల వెఱచియున్న యమ్మహానుభావుం
జేవెలుంగునం గనుంగొని నెన్నడుమం జీర జాఱఁ జుట్టుకొని కొంకిబికిమొకం
బునఁ జికిబికివెండ్రుకలు జుంజుఱుఁగొప్పునం జెదరి యుప్పరం బెగయ రోఁ
జుచు నసుగులు దడఁబడం బడఁబోవుచుఁ గదలి యదలించి విదలించి వైచుచుఁ
జేరం జని— 24

ఉ. ఓరి యుటంకి! యీవికసితోత్పలగంధిని మారునింటిసిం
గారపుఁబూజవారువముఁ గారుమెఱుంగులలోని తేట నా
కూరిమిపట్టి నిట్టినసగూఁటితనంబున బేలువెట్టి తొ
రొర! గణింప నన్ను వినవా! మఱి యిప్పరిలోనితక్కరిన్. 25

క. ఇలుసొచ్చి వెడలనేరవు, మలయుచు నేనాఁటిచుట్టమవురా మోరీ
ములుచ! యిటునాగృహంబునఁ, గలిగినసొమ్మెల్ల గుల్లగట్టి తినంగన్? 26

ఉ. ఎన్నఁడుఁ గాసు వీసమొక టిచ్చినవాఁడవుగావు వీట నీ
వన్నియకోడెకాండ్రు తగవారవధూటులకై యొసంగునా
చిన్నెలు నీవు చూచియు నిసీ! తలవంపఁగ నేర విన్నిటం
బిన్నతనంబు దాల్చితివి పెద్దగ నిన్నిఁక నాడనేటికిన్? 27

సీ. కడుబట్టతలల మోకాళ్లను ముడివెట్ట నేనేర్తు మఱియును నే నెనేర్తుఁ
గోటికిఁ బడగెత్తి టాటాలుగుణియింప నేనేర్తు మఱియును నే నెనేర్తుఁ
గొలిచి మింటికి నేలకును సూత్రపట్టంగ నేనేర్తు మఱియును నేననేర్తుఁ
బుడమిలో వట్టియగా బూమెలుసేయంగ నేనేర్తు మఱియును నేననేర్తుఁ
గీ. దవిలి యిలువిద్య తక్కిడితనము నాది
కపట మేనిచ్చువారికిఁగాని దొరక
వహహా! ననుఁ గన్నుఁ బ్రామినయట్టి గమన!
యుందువుగాని యింక నోరోరి! యనుచు. 29

క. మెడఁబట్టి వెడలద్రొబ్బినఁ, గడు నతఁ డీడిగిలఁబడఁగఁ గ్రమ్మఱఁ దపసిం
బుడిసిటిపట్టుగఁబట్టుచు, వడి నొకజరఠయును దాను వాకిట వైచెన్. 30

గీ. వైచి సరగునఁ గ్రమ్మఱ వచ్చి తలుపు, మూసి గడెపెట్టి యిఁకఁ ముని ముచ్చు కావ!
యిటు మొగంబైన నొక్కొద్దిమొత్తెగెదనుచు, నింటికినివచ్చె నవ్విటకంటకియును.

క. జనని గయాళితనంబును, మునిపతికిం గలుగుతమకమును గులధర్మం
బునఁ గినుక దనకు సమ్మతి,యనుగా నలదేవిదేవి యూరకయుండెన్. 31

చ. అలధరణీసురేశ్వరుఁడు నవ్విటకంటకిచేతఁ జెక్కు భం
గుల నిటమాటలం బడి దిగుల్ దుదిఁ దోఁపఁగ దేవదేవిపై
గలవలవంత యేమఱ కొకానొకచోటికిఁ బోనెఱుంగ క
న్నులఁదగ్రహంబుపఁచఁ దినెమీఁదను రంగపతిం దలంచుచున్. 32

క. ఒకచోట నొదిఁగె నమ్ముని, మకరాంకశరానువిద్ధమానసుఁ డగుచున్
ల...యవుడు తపనుఁడు, చకచకరుచితోడ నపరజలధిం గ్రుంకెన్. 33

ఉ. అంతటరంగశాయి వివిధావనరాన్నము లారగింపుచు
న్నంత నవీనగానకలనానటనశ్రవణావలోకనా
నంతరవేళ సేవకుల నందఱఁ బంచి మణీమనోజ్ఞశు
ద్ధాంతనికేతనంబున రహస్యపినోదపిహారహారియై. 34

సీ. భుజగేంద్రుఁడుపధానముగనునొయ్యననొక్కహస్తంబుతలక్రిందనంద మొందఁ
జక్కఁగాఁ గటిమీఁదఁ జాఁచినడాకేలు పద్మానుబంధసంపదలు దెలుప
జలదంబుపైఁ గ్రొత్తతళుకిచ్చుసాంధ్యరాగము తేవఁ బీతాంబరము చెలంగఁ
జాయకుంకుమదట్టిఁ జక్కఁజెక్కినవంకి చెలువుపిలాసంబు జిగి దొలంక

గీ. నిండువేడుకఁ బాలమున్నీటిసుతయుఁ, బంటవలఁతియు నీళయుఁ భక్తితోడ
నడుగుఁదమ్ముల నొత్తఁగ నతులసౌఖ్య,లీల నారంగపతి పవ్వళించియుండె 35

క పనిలేనిపని ముఖాంబుజ,మునకుం జెన్నగ్గలింప ముసిముసి నగినన్
వనరుహగేహిని పిభునిం, గనుఁగొని యిట్లనియె నర్మగర్భముగాఁగన్. 36

చ. మమతఁ బితామహార్భ భువనమాన్యునిఁ గన్నపురాణపూరుషో
త్తమ! నునుమించుఁజెక్కుల సుధారుచి పర్వఁగ నిర్నిమిత్త మీ
క్రమమున లేఁతనవ్వుఁజిలుకం బని యెయ్యది? యేవధూటిపైఁ
దమిఁగను వేసితితో ... ... నీకిపు డాప్రసంగముల్. 37

క. రంగద్విలాసకుబ్జా, లింగనతోషితమదీయలీలాసేవా
సాంగత్యవచనరచనల, భంగుల నేమైనఁ గొదవపడెనో? యుపేంద్రా! 38

వ అని సచాతుర్యంబుగాఁ బలికిన రంగనాయకుం డయ్యంగనాలలామంబు వదనం
బాలోకించి. 39

క. ఓలలనామణి! నాపై, నీలాగున సంశయింప నేటికి నన్న
ల్లీలాదరహాసాగమ, మూలం బామూలచూడముగ నెఱిఁగింతున్. 40

ఉ. తోయరుహప్రభూతకులదుగ్ధపయోధివిధుండు విప్రనా
రాయణనామధేయుఁడు మహాత్మవిధేయుఁడు యోగమార్గధౌ
రేయుఁడు పొల్చు సద్గుణగరిష్ఠుఁడు మచ్చరణారవిందసే
వాయతబుద్ధియై యహరహంబును బువ్వులతోఁట సేయుచున్. 41

ఉ. ఆమహితాత్ముఁ డొక్కవెలయాలికి మిక్కిలి తాను గూర్చువాఁ
డై మమతన్ మెలంగుచు నొకప్పుడు నేమియు నీయకున్నచోఁ
గామిడి దానితల్లి విటకంటకి యిల్వెడలింప వంతచే
భామినియింటిపంచ బహుభంగులఁ జింతిలుచుండ నవ్వితిన్. 42

క. నావుడు నిందిర దేవా! దేవరపదభక్తుఁ డిట్లు దీనతఁ బొందం
గావెన నతనిం గావం, గావలదే యింత(దనుక) గడచినపనియున్. 43

సీ. పాఱుఁడ నని పట్టపగలు నట్టేటిలోఁ బలువచేఁతలకుఁ బాల్పడినవాని
విదితంబుగ విచిత్రవీర్యుని రాణివాసములకు నడి దెచ్చి చనినవానిఁ
బుణ్యతీర్థము లాడఁబోయి యులూచి యనక్కన్యకాపత్యంబు గన్నవాని
మోహినిపై మోహమునఁ బెక్కుదివసముల్ దన్నుఁ దానెఱుఁగక యున్నవాని
గీ. దయను రక్షించి భక్తవాత్సల్యమహిమ, దనర మీరట దివ్యచిత్తంబునందు
నవధరింపఁగఁ ద(గదె)? మహానుభావ! జీవితేశ్వర! యిట్లుపేక్షింపఁదగునె? 44

క. కేవలమూఢులఁ బొరసిన, కైవడిఁ జింతాభయాదికంబులు వొరయం
గావచ్చునె జగదీశ్వర! తావకదాసానుదాసదాసుల కైనన్. 45

ఉ. ఏతటినైన నిన్ను భజియించిననిత్యుల లోఁదలచినం
బాతకముల్ దరింపని ప్రపన్నులు నెవ్వగ లుజ్జగించి వి
ఖ్యాతులు గానిభక్తులు నిజాధిపతిత్వము దాము పూని నీ
చేతఁ దగం బనిం గొననిసేవకులుం గలరే జనార్దనా! 46

ఉ. కావున నమ్మహీసురశిఖామణి దుర్దశమాన్పి యింతటం
గావఁగదయ్య నామనవి గైకొని నీవు దయాపరుండవై
నా విని రంగశాయి వదనంబున లేనగ వంకురింప న
దేవిం జూచి యతం బునిదిదీరగ ధీరతరస్వరంబునన్. 47

క. శతపత్రపత్రలోచన! యతఁడు మహాయోగి మామకాద్భుతమాయా
గతి నట్లున్నాఁ డెంతయు, నితరులవలె నతనిఁ బొరయునే మోహాదుల్? 48

సీ. నిక్కమాడఁగఁ గల్గనే యంబరీషుని దూర్వాసుఁ డొనరించు దుర్నయములు?
పై చేయఁ గలిగనే ప్రహ్లాదుని హిరణ్యకశిపుచే నగునవగడపుఁబనులు?
పోరయఁ గల్గెనె పాండుపుత్రులసతి దుస్ససేనుండు సభను జేసినకొఱంత?
కారింపఁగల్గనే గజరాజు నిర్వక్రనక్రభీకరవిక్రమక్రమంబు?

గీ. వీరు వారన నేటికి? వినవె నాదు, భక్తకోటిని హరిహయబ్రహ్మలైన
ధిక్కరింపఁగ శక్తులో? చక్క నెదుట, నిలువనైనను శక్తులో? తలిరుఁబోఁడి! 49

ఉ. ఆపద లొంద వచ్చునొ? భయంబులు చేరఁగ వచ్చునో? మన
స్తాపము డాయ వచ్చునొ? విచారము చెంతల నుండ వచ్చునో?
పాపము లాచరింప మతి పైకొన వచ్చునొ? మామకీననే
వాపరతంత్రచిత్తు లగువారిని నీలవినీలకుంతలా! 50

క. కలవే యిహాపరసుఖముల్? దలఁపఁగ మద్భక్తివిరహితము లగుయజ్ఞా
దులయందు నెందునైనను, జలజానన! నేల విడిచి సాదన గలదే? 51

క. మన్న్యస్తాత్మకులైతగు, నన్యస్తుతిరహితు లున్నతాఖిలలోకా
ధ్వన్యుల్ శతశతమన్యుల్, ధన్యుల్ గతమన్యు లమరతాపసమాన్యుల్. 52

మ. హరిణీలోచన! యట్లుగావున మదీయం బైన లీలార్థ మై
ధరణీదేవకులావతంస మనురక్తస్వాంతుఁడుంబోలె నీ
కరణిన్ వర్తిలు నే తదాచరితమత్కైంకర్యపూజానమ
స్కరణధ్యానఫలంబు లెన్నఁ దరమే చర్చింపఁగా నేరికిన్? 53

వ. అయినను దగువిధంబుల నీవునుం జెప్పెదవుం గనుక కరుణాతరంగితావలోకనంబులం గటాక్షించి రక్షింపఁ దగు నని యరవిందమందిరకుఁ దెలిపి పురోభాగనిక్షిప్తంబును విభీషణదత్తంబును నానారత్నఖచితంబును నుచితోపచారయోగ్యంబునుం బర్యంతవ్యాప్తనైగనిగ్యంబును నగుకనకపాత్రంబు గైకొని— 54

క. డం బలరఁగ నొకవటు వై, శంబరరిపుజనకుఁ డైననఫలత నర్థి
త్వం బని బలి నడుగుట హృద,యంబునఁ గడు రోసి దాత యయ్యె ననంగన్.

— • రంగపతి దేవదేవికి బంగరుగిన్నె యిచ్చుట. • —

ఉ. ఈయుపరంజిగిన్నె యిపుడే విటకంటికి కిచ్చి విప్రనా
రాయణు దేవదేవిని రయంబునఁ గూర్చి సుఖానుభూతులం

చేయఁ దలంచి యెంచి నరసీరుహనాభుఁడు నేకయామికా
త్యాయతభీకరార్భటి నిజావసథం బటు నిర్గమించుచున్. 56

క. చిటు కనక మాఁటుమడఁగిన, పుటభేదనవీథి నరసి పొలఁతుకతలవా
కిటికడ నోవిటకంటకి!, విటకంటకి! తలుపు తీయవే యని పలుకన్. 57

క. ఆపలుకు తా వెడల్చిన, తాపసిపలు కనుచు లంజతల్లియుఁ గోపో
ద్దీపిత యై యిఁక నాచే, నీపరి పెట్లఁ బడ కరుగునే వీఁ డనుచున్. 58

పంచచామరము. ఇసీ యిసీ! మొగంబు సూడ కిల్లు వెల్వరించినన్
వెస న్విసింగి పోవు సిగ్గు వీసమంత లేదు నీ
దెసం బసల్ ఘటించె దేర! త్రిమ్మరీ! మ ఱిట్లు వ
చ్చి సారెసారె నన్నుఁ గెర్లఁజేయరాక పొ మ్మిఁకన్. 59

క. కాదేని చేతిరోఁకటి, వాదులు వారించి లెన్స వడ్డించినచో
నీదిక్కున నీకెవ్వరు, రా దిక్కని పల్క నవ్వి యతఁ డిట్లనియెన్. 60

క. †ఓ ముదియ! నీవు గొట్టిన, నే మగు నెవ్వారికైన నీరోఁకటిచేఁ
దాముసు వడి కెద ననఁదగు, సాములు మాయంతకులము చాలరె చెపుమా.

సీ. వింతవాఁడను గాను విటకంటకీ! విప్రనారాయణుం డంపినాఁడు నన్నుఁ
దాళుకొ మ్మొకకొంతతడవు నానామధేయము *రంగరా జని యంద్రు జనులు
తత్ప్రియశిష్యుండ ధగధగద్యుతులచేఁ గనుమెఱుంగారు బంగారుగిన్నె
తెచ్చినాఁడను నీకు నిచ్చి ర మ్మనఁగను గైకొను మిది యనర్ఘంబు సుమ్ము

గీ. పలుకు తెలియంగ వినుము సొమ్ములకు నేమి, వలసినవి యెల్ల నగు సువర్ణపాత్ర
మాత్రమనియుండవలదునీమనసులోన, గడియసడలించుతల్పుమొక్కరముదిగిచి

క. అనుమాట లోను వెలిగా, మొనసినపేరాస వారముఖ్య యు మఱి త
జ్జననియు నొండొరుఁ గడవం, జని దిగ్గనఁ దల్పు దీసి సంభ్రమ మొదవన్.

చ. వినయము సేయుతేవను రవి(ప్రతి)బింబము వోలె నప్పు డ
య్యనఘుని కేలుఁగెంజిరుటాకునఁ బొల్చుపసిండిగిన్నె గ్ర
క్కున ముదిచెంచడంబు గయికొన్నది యై కుహనావటూత్తముం
దనయవరోధమందిరమునం దగునైందవర్ణతవేదికన్. 64

గీ. ఉనిచి కనుగారవంబున ననఘచరిత
నట్టనడురేయి చెప్పచున్నాను షమ్ము

† అర్ధమాహ్యము. * శ్రీరంగరాజనుల్ కాంతోపయంద్రు—మాతృక.

* నరమరలు లేక మీయుపాధ్యాయువలెను
నడపుకొనువార లెవ్వ రున్నారు గనుక. 65

క. తన్నెప్పుడు పొడగన్నం, గన్నులఁ గప్పుకొనుఁ బ్రియము గయికొను నామా
టన్న జవదాఁటఁ డతఁడీ, కన్నియఁ దనప్రాణపదముగా భావించున్. 66

సీ. అదలించి యే మించనాడిన నెంత లే దను గాని మాఱుమా టాడరాఁడు
నెమ్మిమై మెలఁగంగ నేర్చుఁ గన్నుల ద్రొక్కు మనసున దీవించు మతముదోఁప
నొకనాటికంటె వే ఱొకనాఁడు లాలించు నొకటఁ గా దన్నిట నుచితగతుల
నలవారు వీరలవలె జూటుతనము లే దోడ కెంతింగినవాఁడు గాఁడు

గీ. తాను మా దేవదేవియుఁ దమకములను, గరగరికలందు నొక్కరొక్కరికిఁ దొరసి
జోడువాయక మెలఁగంగఁ జూచునప్పు, డనఘ! సంతోష మాత్మ నింతంత గాదు.

క. ఈనటనల మేమును మీ, మానియు నిన్నాళ్లు గూడిమాడి మెలంగన్
నానోటను † బుట్టునె సని, యేనెఱుఁగక బేలనే మహీసురముఖ్యా! 68

వ. గృహకృత్యప్రసంగంబులఁ గొంత యీపడుచుపై నడిచిపడుచుఁ గసరుకొ
న్నం జూచి (తన్నా)డిన చందంబు దోఁచినం గాఁబోలు న య్యభిమాన
శీలుండు నిజస్వరూపస్వభావంబు లెఱుఁగనివారికిం బంపిన తెఱంగునం గనక
పాత్రం బిమ్మహానిశీథినీసమయంబున మిమ్ముఁ గనుబడ(లింప)మీచేతఁ బెట్టి
పంపిన వాఁ డయ్యె. ఈయనుచితప్రయోజనంబు లెల్లఁ బరులయెడం గాక
మాయెడాటంబునం దగవు లగునే యని వెండియు. 69

క. నావలని నేర్పు నేరమి, దేవరవలె నున్న మీకుఁ దేఁటపడంగా
నే వినిపింపక మఱి యిం,కేవారికి విన్నవింతు నిద్ధచరిత్రా! 70

మ. తనకుం గూర్చువధూమణుల్ చనవుచేతన్ మందిమేలంబువం
కను వేసారియు నవ్వులాటలకుఁ బల్కం బల్కువాక్యంబు లె
ల్లను నిక్కంబులుగాఁ దలంచి తగ దల్ల న్నిర్నిమిత్తంబు ము
క్కునసే యుండుఁ గదా మునీశ్వరులకుం గోపంబు సాటోపమై. 71

ఉ. ఏనటు చిట్టు ముట్టనుచు నించుక కోపము తాళలేమి నా
పై నొకలాగునం గిటుకు పట్టిన దోసము గాదు దానునుం
దానును నేటిదాఁక మమతం దగ నర్మిలిఁ గూడి యున్నవా
రౌనన రైననుం దలఁపఁ డయ్యెను దీని గణించి యేనియున్. 72

---

*నరవరలు లేక యీయుపాధ్యాయువలెను—మాతృక. † బుట్టినసని—మాతృక.

క. గుఱిచేసి గిన్నెఁ బంపిన, తఱువాతను మల్లి పంపఁ దగ దంపినచో
మఱి నిన్నుఁ గొదవసేసిన, తెఱఁ గగుఁ గెలవులును మీామదిం గనునెడయుఁ .73

క. తనసొమ్ము గాదె మాకల, ధన మెల్లను నేఁట నేమి తా మది నిఁక ము
న్నెనుకలకు మమ్ము నెట్లుఁ, మనువుం దాఁ గాక మాకు మఱియుం గలదే.74

క. విను మే నటువలె దూఱితి, నని నీమునిఁగోడ మఱవ కనుమీా యని యా
చెనఁటి తనముద్దుఁగూఁతుం, గను గెఁటెన నదియు వగపు గదిరిన శేవఁ.

మ, తనసింగారపుఁ జెక్కుటద్దములమీఁదం జాఱుకన్నీరు కే
లినఖాగ్రంబులఁ బాఱమీటుచును దల్లి న్నార్లనుగ్గించి మో
మునకుం దైన్యము గొంత తెచ్చికొని డంబుల్ సూపి యవ్విప్రు నొ
య్యన డాయం జని యిట్లు వల్కెను రహస్యాలాపరూపంబునన్. 76

గీ. తా నెఱింగియు నీజాతి గానిదాని, మాట లెల్లను గొండగా మదిఁ దలంచి
యల్లనవురేయి గిన్నె యి ట్లంపనేల, కుడిచి కూర్చుండి నను బాళిగొలుపనేల.

ఉ. ఆమెలదోఁటలోన సొబ గయ్యెడుపుప్పొడితిన్నెమీఁదఁ గెం
జాయలఁ బొల్చు లేఁజిగురుశయ్యఁ గెలంకులయందుఁ దుమ్మెదల్
మ్రోయఁగ గోరువంకలను ముంగురు లల్లన దువ్వి దువ్వి న
న్నాయన గారవించిన ప్రియంబులు నామదిఁ బాయ నేర్చునే. 78

క. ఈపాటి తనకు నెప్పుడు, నాపై దయ గలిగినందు(నకునిఁక) నన్నుం
జేపట్టు మనుము కంతుని, తూపుల నగునాదుమనసు*తుందుడు కడఁగున్.

క. ఓయనఘచరిత యిటువలె, నాయసచిత్తంబు వచ్చు నటు వలె వివిధో
పాయములఁ దెలిపి సరగున, నీయెడకుం బంప మీారలే కలవారల్. 80

సీ. అని గారవించి నెయ్యము మీఱఁ బలికినఁ బనివిని యామహాబ్రహ్మచారి
తనలోనఁ దా నవ్వుకొనుచు వెల్వడి వచ్చి తలవాకిటను నిల్చి దండఁ బంచ
తిన్నెపైఁ బవళించి యున్న వాచంయమముఖ్యునిఁ గనుఁగొని మునుఁగు దిగిచి
వివరించి చూచి యోవిప్రనారాయణా! యొంటిమై నిచ్చోట నుండనేల

గీ. ప్రియము మీఱంగ విటకంటకియును దేవ
దేవియును మిమ్ముఁ దోడ్కొని తెమ్మటంచు

* మనసుతుందును కలుగును—మాతృక.

నన్నుఁ బంపిరి తాము నిం దాఁక వెఱచి
వచ్చినా రింక సరగఁ బోవలయు మీరు. 81

క. అన విని కల గనఁ బోలుదు, నని దిగ్గన లేచి చూచె నప్పుడు కృష్ణా
జినదండకమండలుశో,భనములు గల మధురవచనపటువుఁ వటువుఁ. 82

వ. చూచి నివ్వెఱుంగునం బులకితశరీరుం డై యి ట్లనియె. 83

క. ఈలీల మదనవిశిఖ, జ్వాలలఁ బడకుండఁ గావ వగచినకరుణా
శాలివి నీవెవ్వరు నా, పా లింటను గల్గు రంగపతివో తండ్రీ! 84

క. కనికరముతోడ నిటువలెఁ, బనివడి నెమ్మోము సఱచి పఱదినఁ గానీ
కనరానికటికిచీఁకటి, యనక ననుం గానవచ్చునా యొరుఁ డైనన్! 85

మ. అని సంతోషితచిత్తుఁ డై బహువిధవ్యాపారమాధుర్యలీ
ల నుతింపం దనపాణిపల్లవము కై లా గిచ్చి యమ్మానిఁ ద
ద్ఘనగేహప్రతిహారిగేహాళిఁ జేరంగాఁ బంపి తా నాత్మమం
మ్యనిశాంతంబున నుండె రంగపతి పద్మాదిప్రియాసక్తుఁ డై. 86

— * విప్రనారాయణుఁడు మరల వేశ్యయిల్లుసొచ్చుట. * —

గీ. అంత నిక్కడ మానికులాగ్రగణ్యఁ, డావటూత్తముఁ డటు సాగ నంపి చనినఁ
దొలుతమాటలుపడిపుల్లసిలినవాఁడు, గనుకకొంకుచుఁదనయాత్మగతమునందు.

ఉ. కల్లరి శేరజంబు విటకంటకి మిక్కిలి తత్తనూజయుం
దల్లి నతిక్రమించినను దాను వహించికొనంగఁ జాల ద
ట్లల్లనఁ జేరఁదీసి యిపు డాచెదు గెక్కడ మొక్కపాటు దే
నుల్లమునం దలంచిన దొకో యని పో నటు దేవదేవియున్. 88

ఉ. వెన్నెలబైట నొక్కమణివేదికమీఁద మిటారి తేటవా
ల్గన్నులకన్నియ ల్కొలఁకులన్ భజియింపఁగఁ దానమానసం
పన్ననవీనగానరసమాధురి వీనులవిందు సేయఁగాఁ
గిన్నెర మీటుచుండి పరికించుచు మానికులావతంసమున్. 89

చ. గరువము మీఱఁ జూచి గజగామిని దిగ్గన లేచి చేతికి
న్నర చెలిచేతి కిచ్చి రశనామణి కింకిణికానినాదనూ
పురకఘుళంఘుళక్వణనము ల్మకరాంకచమూహాళాహాళి
స్ఫురణ వహింపఁ గ్రక్కునను బోయి యెదుర్కొని సంభ్రమంబునన్. 90

క. వేదండయాన తా నపు, డాదండను బోలుచుమణిగృహాంతరమునకుం
గైదండ యిచ్చి సుమనః, కోదండసమానుఁ దోడుకొని చని కడఁకన్. 91

క. అక్కడఁ దగఁ గుందనపుం, జెక్కడములఁ జాల నుల్లసిల్లుచు మిగులం
జొక్కమగుచున్న (రత్నపు), మొక్కలిపై మానిచంద్రముని నుంచి తగన్. 92

క. అంబుజముఖి బంగారపుఁ, దంబుగ పన్నీట నడుగుఁదమ్ములు గడిగెం
బంబిన నిగ్గులవెన్నెల, డంబు వి(డంబించుపావడం) దడియొత్తెన్. 93

గీ. మేనఁగలపంబుఁ గమవింతగానలంది, గొనబుమీఱంగఁ దావిక్రొన్ననలుదుఱిమి
సన్నవలిపెంపువలెవాటు సవదరించి, కప్పురము నించి పచ్చిబాగా లొసంగి. 94

సీ. సకినెలపట్టెమంచము మించుపఱుపును గొంబట్టు బటువులు గిండి జీని
పావడ బంగారుపావలు కాళంజి కురువేరు పన్నీరు గోరజంబు
గోవజవ్వాది కుంకుమ గంధసారంబు పునుఁగు కస్తూరి కప్పురము చాఁదు
జాలవల్లిక పుష్పతాళవృంతము నపరంజిగద్దియ వాలురుమంజిసురటి

గీ. యాదియగునట్టి వస్తువు లగురుధూప, ధూపితంబు వితానబంధురము సాల
భంజికాకీరదీపికాపరివృతంబు, భరితపారావతము నైన భవనమందు. 95

క. తరుణి రమించెను నత్తఱిఁ, బఱిపరివిధములను వింతబాగుల హేలా
పరివర్ధితమోహారసా, చరితపునఃపునరనంగసంగరకేళిన్. 96

క. ఈలాగున రతికేళిన్, దేలి పరిశ్రాంతిఁ బొంది నిద్రించిరి యా
లీలావతియుఁ దపోధన, శాలియు నంతం బ్రభాతసమయం బయ్యెన్. 97

ఉ. సమ్మదలీలఁ బంకరుహసద్మహజారములం గొలంకులం
గ్రమ్ముమిళిందమాగధులగానము మించెను రంగశాయిగే
హమ్మున బోరున న్మొరసె నప్పు డహర్ముఖసూచకంబులై
యిమ్ముల శంఖదుందుభిసమీహితమంజులవాద్యఘోషముల్. 98

సీ. శ్రీరంగరంగసంస్కృతపూర్వజల్పాకసద్యోవినిద్రపంజరశుకంబు
సగ్రతక్షోణీసమానీతపునరుక్తి ... ... నఖముఖ విహద్ధేనుకంబు
వివిధహేమకవాటవిఘటనావసరాయనాన్వేషబహిరుద్యదరుణభంబు
మలయభూధరమరుచ్చలితనానాగోపురార్ద్రిస్థలీవైజయంతికంబు

గీ. మాగధానూనజేగీయమానగాన, రససమాకర్ణనోత్ఫణప్రమదసమద
భావపర్యంకభుజగాధిపంబు నగుచు, వెలసె నప్పుడు శ్రీరమావిభునినగరు. 99

శా. ప్రౌఢస్సై ్వరభుజప్రతాపరుచిదీప్తవ్యాప్తపర్యంతయు
గ్గాఢారణ్యమహీమతంగజఘటాగమ్యస్థలస్థాయి ఘం
టాఢాంకారవిమోహితాహితచమూనానామృగాఖేటధీ
రూఢోత్సాహ ! కదాచిదప్రతిహతక్రోధప్రసాదోదయా ! 100

క. బబ్బరబాహాంక రమా, బిబ్బోకవతీనిశాంక బృందారకధు
న్యబ్బంధుకీర్తిరచితక, కుబ్బాలాకుచపటీర ! గుణగంభీరా ! 101

మాలిని. సరసిజదళచక్షుశ్చక్రవాకస్తనద్వ
య్యురుపులిననితంబప్రోల్లసజ్జహ్నుకన్యా
ఖరకిరణతనూజాగాఢసాపత్న్యదోష
త్వరితశరధిగచ్ఛద్దానధారాధునీకా ! * 102

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య
ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర లింగనమనీషిపుత్ర శ్రీకాళహస్తీశ్వర దయా
సహాయ చెదలువాడ మల్లయనామధేయప్రణీతం బైన విప్రనారాయణచరిత్రం
బనుమహాప్రబంధంబునం జతుర్థాశ్వాసము.

---

* దానధారానిరాకా—మాతృక.

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

## పంచమాశ్వాసము.

క. శ్రీమహితమహాకాళీ, నామకగృహదేవతాభినవకరుణాల
బ్ధామితవైభవ మానవ, తీమన్మథ మాకరాజుతిమ్మనృపాలా! 1

గీ. అవధరింపు ప్రభాత మిట్లరుగుదేర, నంతి కట మున్న మేల్కని యహిశయాను
నర్చనము సేయుటకు వేళ యయ్యె ననుచు, నతిరయంబున సహ్యా కన్యకకు నరిగి.

వ. సముచితకరణీయంబులు దీర్చి వైష్ణవలక్ష్యమాణుంఁడును గుండమండపవిధాన
రథోత్సవ ధ్వజోత్సవ మాసోత్సవ ప్రతిష్ఠాప్రమదవ దిందిరాయమాన మురదమ
నుంఁడును గరకుంచితావలంబి యగునంబి చనుదెంచి రంగేశ్వరదర్శనాభిలా
షంబుల బహిర్ద్వారప్రదేశంబుల నందంద క్రందుకొని యున్నతైర్థికుల ప్రసా
దావలోకనంబులఁ గటాక్షించి యొండొండ తలుపుల గడియలు సడలించి య
భ్యంతరమందిరంబునకుం జని— 3

క. నాగేంద్రశాయిఁ బేర్కొని, యాగర్భగృహప్రదేశ మారసి చూడన్
రాగిల్లుచును దదగ్రిమ, భాగంబున నున్నకనకపాత్రము లేమిన్. 4

క. నివ్వెఱఁగు భయము మనమున, నివ్వటిలం గడుఁ దలంకి నిన్నటినడురే
యివ్వాలన నున్నగిన్నియ, యెవ్విధమునఁ జనెనొ? తెలియ దే మనువాఁడన్. 5

సీ. అని గర్భగృహ మెల్ల నల్లనఁ బరికించి లెస్సగా నంతరా*ళిందమరసి
తిరుమజ్జనంబుబిందెలలోన శోధించి పుష్పకరండకంబులను నెమకి
నిపుణత రంగమండపములో నారసి యెలమి నుగ్రాణపుటిండ్లఁ జూచి
పటపల్లి చక్కఁ దా నటు పరామరిసించి యందులందుల సందు గొందు లరసి

గీ. అడుగఁదగువారి నెల్లను నడిగిమఱియు, వెదకఁ దగుతావు లెల్లను వెదకి యతఁడు
గిన్నె గానక యత్యంత ఖిన్నుఁ డగుచు, సరభసంబుగఁ దోడియర్చకులుఁ దాను.

క. ఇదియెల్లను నధికారికి, విదితంబుగఁ దెలుపఁదగు నె వెసఁ దెలుపనిచోఁ
దుద నేరమి మన దెస నగు, నది గాకీసొమ్ము నరువు మందు రటంచున్. 7

---

* నంతరాళిమును వెదకి—మాతృక.

క. ఆరంగవిభుని తిరుపం, దేరంబులు తేరుబుట్లు తిన్నియ లలరుం
బేరులు తీర్థపుఁజెంబుల్, తోరము లగుగందవడియలుఁ గని వారల్. 8

వ. అయ్యెడ.

సీ. జియ్యు లర్ధాసనాసీనుఁ డై వసియింపఁ బొంతల నాచార్యపురుషుఁ డుండఁ
గెలన సాత్తనివైష్ణవులు ద్రోపు ద్రోపాడ వలన సంకీర్తనపరులు చనఁగఁ
గలగూటులొక్కవంకను దొలంగుచునుండఁ గొండికాండ్రునుగెలంకుల నటింప
సూరెల వేత్రహస్తులు బరాబరిసేయఁ బరిజనంబులు చాల బలసి కొలువ

గీ. గరిమఁగొలువున్న నయ్యధికారవరునిఁ, దాము దెచ్చిన స్వామిగంధప్రసాద
పరికరం బిచ్చి పొడఁ గని భయముమీఱఁ, జేరి వా రిట్లు విన్నవించిరి కడంగి. 10

గీ. అధిప! యిదియేమిదైవమాయాబలంబొ? గర్భగృహమున నైదుబంగరువుగిన్నె
లుండ నాగిన్నియలలోన నొక్కగొప్ప, గిన్నెఁ గానము తగఁ జిత్తగింపవలయు.

చ. వినుము రమావిభుండు తిరువీసము నిన్నటిరేయి యారగిం
చినతఱిఁ గోవెలం గలయశేషపదార్థచయంబు నుండఁగాఁ
గని నలుదిక్కు సూచి తిరుసావుల నైచితి మిందు సందియం
బనఁగఁ నొకింత లేదు తెలియం దగు దీనికి హేతు వెద్దియో! 12

వ. అని పలికినఁ బ్రత్యుత్తరం బేమేనియు వచియింపం బూని యున్నయధి
కారి నధిక్షేపించి ప్రకటభ్రుకుటీఘటనాదుర్నిరీక్ష్యుం డగుచు నయ్యెడ జియ్యు
*భయభ్రాంతులగు నంబులం జూచి యి ట్లనియె. 13

క. పాతకులార! యనర్ఘం, బైతగు నపరంజిగిన్నె హరియించి కడుం
జాతురి మీ రెఱుఁగనిగతి, నీతెఱఁగునఁ బోయె నందురే యవ్వారిన్? 14

మ. కనియుం గానమిఁ జేసికొన్నను నెఱుంగఁ లేక మారంగనా
ఘునిసా మ్మెల్లను బొల్లుగాఁ దిని దినద్రోహంబు వాటించి కై
కొనుటల్ చాలక గిన్నె యెత్తికొని బొంకుల్ పల్కుచుఁ మేము గా
మనినం బోవునె? వేళ్లతోఁ జెఱకు దీ పంచుఁ దినం బాడియే. 15

శా. ప్రాకారంబు లలంఘనీయములు తోరంబుల్ కవాటంబు లా
యాకక్ష్యాంతరభూమి యామికు లసంఖ్యాకుల్ గఁచుఁ బీగముల్
వాకిళ్లుం బదిలంబు లిట్టి నగ రెవ్వారల్ చొరం జొత్తు రి
ట్లేకాంతావసథంబునం దిరుగుమీరే కాక చర్చింపఁగఁ. 16

* భయభ్రాంతంబు లగుమనంబులం జూచి—మాతృక.

గీ. అనిన గజగజ వణఁకుచు నయ్య రంగ, ధామకోవెల మున్ను తాతలతరంబు
నాఁటనుండియు మాకుఁ గాణాచి గాదె, యెన్ని గుండెలు గలవయ్య యింతపనికి!

క. రంగప్పసామ్ము మేము తి, నంగను సుతుల మయి పుట్టినారము నిజ మై
నం గలదే మావలనను, దొంగతికంబులును వింతద్రోహము లెందుఁన్. 18

సీ. విను మేము ప్రాలుమాలిన దీవెనుడి గాక కినిసిన రెంఁడు గుగ్గిళ్లు గాక
తక్కిన నింత గంధప్రసాదము గాక మన(సై ననొ)కవడతునుక గాక
యటమటించినఁ గుంచెఁడంత సాదము గాక కాదేని యొకగుల్లకాసు గాక
దాఁచికొన్నను బలితంపుఁ జింపుడు గాక సిక్కిన నొకపోఁకవక్క గాక

గీ. యగణితానర్ఘమణిధగద్ధగితమహిమ, భాతిరోధాన మృగితాహిపతిశయాన
సన్నిధానప్రతీప మిాగిన్నె మమ్ము, వంటివారలు గొన నెంతవారలయ్య ! 19

క. అనిన యతి ముద్రకర్తం, గనుఁగొని యీ(దొడ్డ)కాంస్య కసుమంచితనం
బున మనము సామ్ము దె మ్మని, యనిచినఁ దేనేర్చువారలా? యే మైనన్. 20

మ. మొగమోటంబున నుండఁగాఁ జనదు నంబుల్ దుండగీ లింత కే
వగిది న్వచ్చు సువర్ణపాత్రము గణింప న్వీంద్రుచే నాగతిం
దగఁ దెప్పింపక నీవు కన్నడవుచేతం బట్టి ప్రార్థించిన
న్మిగులం గెర్లుదుఁ గాక తాఁయకొనఁ జుమ్మీ యన్న భీతాత్ముఁ డై. 21

క. యతివల్లభ ! దేవరయా, నతికి న్నాతాఁమవాఁడనా ? గిన్నియ యే
గతి వేగమె తెప్పించెద, మతి మిా రలుగుదురె? యింతమాత్ర కటంచున్. 22

మ. అటు వీక్షించిన నీలికాసెలు వినీలాకారముల్ మేటిదు
ప్పటముల్ కోరసిగల్ పిడెంబులు ధనుర్బాణంబులుం బాణిసం
ఘటితోద్యల్లగుడంబులుం గలిగి యుగ్రస్ఫూర్తి నారక్షు లు
ద్భటవృత్తిం దనచెంగట న్నిలువ నాతం డత్యహంకారుఁ డై. 23

చ. తలవరులార ! రంగపతిధామమునందునఁ బైఁడిగిన్నెము
చ్చిలినదురాత్ము లీదురితచిత్తులు నంబులు వీరి నందఱన్
సిలుగులఁబెట్టి వే హాయపుసేయుఁడు పొం డని పంప వేగ వా
రలఁ గొనిపోయి తద్భటపరంపర యాఁకనుబెట్టి యుండఁగన్. 24

ఉ. ఆరజ మెల్ల నొక్కపాడ వయ్యె ననంగను బ్రాఁతిగానిసిం
(గారి)ము తీరుమాలినవికారము నల్లనిబూదివంటి యా

కారము జుంజుఱై తిరులు గట్టి నెఱుల్తుద బీఁటవాఱి వి
ప్పారెడుకీలుగంటుఁ బెఱయ న్విటకంటకిదాసి యయ్యెడన్. 25

సీ. జూదంబు లాడెడుచోటికై యరుగుచు గంజాప్రదేశంబుకడకుఁ జనుచుఁ
దననీడఁ ద్రోవవెంటను జూచికొనుచును బనిలేనిపని పకపకని నగుచు
నెవ్వారిఁ బొడగన్న నెకసక్కె మాడుచు నంగన ల్గలసి తిట్లాడ వినుచు
మాటిమాటికిని సుమాళించి పాడుచుఁ బులియుచుఁ దనుఁదానె పొగడికొనుచుఁ

గీ. బని యొకటి గల్గి రంగనాథుని గృహంబు, వలని కేతెంచి చంచలవాణి యనెడు
పేరు నిజముగ నట నడ్డపెట్టియున్న, నంబులను జూచి యానిమిత్తంబుఁ దెలియ.

చ. ఒకటఁ గొఱంత లేక హరియాడిగముం దగఁ జేయుచున్నయ
ర్చకులకు నింతదుర్దశలు రాఁ బని యేమని వారి వారల
న్సకలము లెస్సగా నడిగి చంచలవాణి యెఱింగి యింతమా
త్రకు నిటు బాములం బఱతురా గుడికిం దగు లైననంబులన్. 27

క. ఆపనిఁడిగిన్నె యెవ్వరి, చేపడియెనొ వీరి నేల సిలుగులఁ బెట్టం
జూపోపరుగా మీాయది, యేపాటిది గలదు తెలుపుఁ డింతయు నన్నన్. 28

ఉ. అక్కడ నున్నవార లహహా యని నవ్వి పిసాళితొత్త! నీ
వెక్కడ నింతలేసిపను లెక్కడ పోవుగదంచు నందఱుం
బక్కునఁ దిట్టినం గసరి పల్కెను మీారిటు సల్పినంతనే
తక్కువ యయ్యెనే కలితనంబును నా దొకమాటవాసియున్. 29

క. ఈలాగున నన్నేటికిఁ, గేలిగొనం బోయి యున్నగిన్నియ తగ మా
యేలికసాని గడించిన, మేలిమిగిన్నియకుఁ దుల్యమే యేమైనన్. 30

వ. అని పలికినం దదీయవచనంబులు విని వెండియుం బదిలపడ నడిగి వారు దానిం దోడ్కొని వారియధికారి సన్నిధానంబునం బెట్టిన నతండు సామవచనంబులం బుజ్జగించియు నదలించియుం గల్గినవిధం బెఱింగింపు మనవుఁడు నదియును వడ వడ వడంకుచు ని ట్లనియె; నయ్యా! నిన్న నగరంబు మాఁటుమడంగిన సమయంబున ము న్నెన్నఁడుఁ గన్న తెఱంగువాఁడు గాఁడు వటువేషధారుం డగు నొక్కరుం డింటికి నొంటి మైఁ జనుదెంచి చూడ్కులు మిఱుమిట్లు గొను నొకయపరంజిగిన్నియఁ దెచ్చి మాయేలికసానిచేతి కిచ్చి క్రమ్మఱం జనియె నిది నాయెఱింగిన చందంబు. ఇట మీాఁద నేమియుం దెలిసినదానఁ గా నని విన్న

వించిన నాగొంటరివెంటఁ దలవరులఁ గూర్చి మీా రిది చూపినజాడ (వేశ్య) మందిరంబున కరిగి కనకపాత్రం బిచ్చినవాసిం బుచ్చికొన్నదానిం బట్టి తెం డని పనిచిన— 31

క. గుడినంబులకును దయతో, నుడుగర లిప్పించి ద్రోహ మొక్కింతయు మీా
యెడ ... ... , యుడిగం బేమఱకుఁ డనుచు నొగిఁ దలవరులున్.

క. అందఱుఁ జని విటకంటకి, మందిరమున కరిగి పట్టెమంచమునందున్
గందళితానందంబున, ... ... సందడించుచునుండన్. 33

క. వసియించి యున్నతపసిం, బొసఁగం దత్పదము లొత్తుపొలఁతిన్ దండన్
మిసమిసల మెఱుఁగుగిన్నియు, వెసఁ గన్గొని వారు రోషవివశాత్మకులై. 34

శా. ఇన్నాళ్ళన్ గణికాశిరోమణులలో నెల్లం గడున్ మేటిసై
మన్నీ లెల్లరు గారవింపఁగను హేమగ్రామనానార్థసం
పన్నత్వంబున నున్నదాన వని చెప్పన్ విందు మిస్సిస్సిరో!
... ... ... దొంగసొమ్ములకు నై యెట్లేల ప్రాల్మాలితే? 35

— * తలవరులు బంగరుగిన్నె కనిపెట్టుట. * —

క. నీతి విచారించినచో, జాతులయం దెల్ల విప్రజాతికిఁ బ్రతి లే
దేతఱి బాఁపఁడ వయ్యును, నీ తెఱఁగున దొంగిలింప నె ట్లెఱిఁగితిరా! 36

గీ. అనుచు నలదేవదేవిని నమ్మునీంద్రుఁ, దగువిధంబున రాజపథంబుఁ దరిసి
తోడికొని వచ్చునప్పుడు వాడవాడ, బలసి మూఁకలు మూఁకలై పౌరులెల్ల. 37

ఉ. ఈసరసీరుహాక్షి జన మెల్ల నెఱుంగఁగ నిప్పురంబులో
మూసినముత్తియంబుగతి ముగ్ధ యనంగఁ బ్రసిద్ధిఁ గన్న దా
భూసురవర్యుఁ డెంతటితపోమహిమాఢ్యుఁడొ కాక చూచినం
జేసినపాపముల్ పొలియఁ జేయఁ దొడంగెఁ దదీయతేజముల్. 38

గీ. ఇతఁడు చోరుఁడు గాఁ డని యెంతకైన, నిలువ నాడంగవచ్చు నీనీలవేణి
గోల యగుటయు నిక్కంబ యేల యిట్లు, వచ్చె వీరికి నీయపవాద మిపుడు.

సీ. నగరికి నాదాయ మగువేళ యిది యని తగవు మాలిన పనుల్ తడవి లేని
యొంటనివారిపై నోర్వఁ జాలనివారు లేనినేరంబు గల్పించి లేని
తోడఁబడి సొమ్ము పోఁబడి యెఱుంగక నోరఁ గొలఁదు లొక్కనిఁ జూచి పలికిరేని
యొదుదలగా వచ్చి యొగి మఱుంగు పడంగఁ జెవి నిల్లు గట్టుక చెప్పిరేని

గీ. వదర కధిపతి తెలియంగఁ బాడియగును, గాక యె ట్లీవె నవఁ గొంది గట్టుపనికి
నేమనఁగ వచ్చుఁ బ్రజలకు నెల్లయెడలఁ, దల్లి దండ్రియు నేలినాతండు గాఁడె?
ఉ. యోగివిలాసరేఖ నలువొందెడు నీయనయందు నంగనా
భోగవశాత్ముఁడై నిజతపోమహిమంబులు వీటఁబుచ్చి ల
జ్జాగరిమల్ దొఱంగుటలు చాలక యీతఁడు దొంగకూటికే
లాగునఁ జొచ్చెఁ దాఁ దలపాలంబుల నిల్చెనె సాదు లేఁగినన్? 41
క. అని పౌరులు పలుదెఱఁగులఁ, గొనకొని పలుకంగ వారిఁ గొని రభసమునన్
జని ముద్రకర్త సమ్ముఖ, మునఁ దలవరు లుంచి కేలు మోడ్చిన నతఁడున్. 42
ఉ. ఇంతప్రయోజనంబు తను నేలినయేలిక చోళధారణీ
కాంతునకున్ సవిస్తరముగా వినిపింపక నే నహంక్రియా
వంతుఁడనై గణించి తగువైపునఁ దీర్చ నతండు విన్న నా
కింతయు మాటవచ్చు నని యెన్నిక నయ్యధికారి గ్రక్కునన్. 43
శా. ఆలీలావతి నత్తపోధనునితో నాగిన్నె చోళక్షమా
పాలాగ్రేసరుసన్నిధి న్నిలుపఁ దత్పర్యాయవార్తల్ గభీ
రాలాపంబుల విన్నవించిన నతం డాశ్చర్యముం బొంది యౌ
రా! లెస్సాయెను స్వామిసొమ్ము గొనినారా! ద్రోహులంచుం గడున్. 44
వ. పాదముకినుక యెడ నిడికొని చౌర్య ప్రసంగంబులు సాంగంబుగాఁ దెలియ
వలసి దేవదేవి నాలోకించి— 45
సీ. వనజాక్షుసమ్ముఖంబున నుండుగిన్నియ యువిద! నీ కెక్కడనుండి వచ్చె?
నెవ్వరైనను దెచ్చి యిచ్చిరో మఱి నీవె కైకొన్న దానవో? కనుమొఱంగి
యీ విప్రుఁ డుండెడితావు దా నెక్కడ? నెన్నాళ్లు కలఁ డితఁ డిటకు వచ్చి
యింతనేరము సేయ నేరీతి మనసొగ్గె? మేటివస్తువుల నేమిటఁ గొఱంత?
గీ. వివరపుట్టంగ నానుపూర్వియునుగాను, దగ నెఱింగింపు మన మహీధవకులేశుఁ
డానతిచ్చిన విని పంక*జాయతాక్షి, వినయ మెనయంగ నటు వెనువెనుక కరిగి.
సీ. (తా నె)లదోఁట కేగిన విధంబు మునిం గన్గొన్న చందమున్
వానికిఁ గాఁ గఁ బన్నిదము వైచినమాటయు బేలువెట్టి య
మ్మానిని దోడితెచ్చిన క్రమంబుఁ దమిన్ మొగమోట మొక్కయిం
తైనను లేక తల్లి విడనాడినచందముఁ జెప్పి వెండియున్. 47

---

*జాతస్త్రీ—మాళిక

శా. ఓరాజన్యభవాన్వయాభరణ ! యీయుర్వీసురేంద్రుండు మే
మారీతిన్ వెడలంగ ద్రొబ్బినను లజ్జాక్రాంతుండై పైఁడిగి
న్నేరూపంబునఁ దెచ్చెనో యెఱుఁగ నా కిప్పించెఁ దా శిష్యుచే
శ్రీరంగప్పఁడె సాక్షి యింతకు వితర్కింపన్ వివేకోన్నతా ! 48

గీ. అనుడు ధరణీశుఁడాతపోధనునిఁ జూచి, వింటివా యోయి! యీమచ్చెకంటియాడి
నట్టిమాటలు తెలియ నేమైన నిందుఁ, గలది లేనిది గలిగినఁ దెలుపవలయు. 49

మ. అనినన్ సంయమి (చిత్తగిం)పఁ దగు న్యాయాన్యాయముల్ కల్లతో
డ నిజం బొప్ప......బ్బ లోకు లగు మాటల్ నిక్కముల్ రూఢి కె
క్కునె ? నామాటల తీరు దీని వగఁబొంకుల్ విన్నచో నైన నే
నును నా నేర్చినరీతిఁ దథ్య మెఱిఁగింతున్ ధారుణీవల్లభా ! 50

క. ఇది చెప్పినట్ల యేనది, మొదలన్ గీనింటఁ దమకమున మెలఁగుటయుం
దుద నను వెడలించుటయును, విదితము కడమాట విన్నవించెద నీకున్. 51

ఉ. న న్నటు వీడనాడిన మనంబున ముప్పిరి గొన్నజాలి నే
విన్నఁదనంబుఁ దాల్చి నమవీథికడం దగుపంచతిన్నెపై
నున్నను దాను బంప వటు వొక్కఁడు చామనచాయ మేనివాఁ
డన్నఁ డు రేయి వీరల గృహంబునకుం గొనిపోయె నర్మిలిన్. 52

ఉ. ఈమటుమాయలాడియును నెప్పటికంటెను నన్నుఁ గైతవ
ప్రేమను గారవించి యలరింపఁగ నుండితిఁ గాని గిన్నెమా
టేమియు నే నెఱుంగ ధరణీశ్వర ! కా దని పల్కితేని యా
స్వామియె సాక్షి యింతయు నిజం బిఁక నావుడు దేవదేవియున్. 53

క. పొరిఁబొరిన యోరి దొంగల, గురువ ! మహారాజు వినఁగఁ గొంకక మిథ్యా
పరిభాషలు పచరింతురె, సరివారలు నవ్వ నీహజారమునందున్. 54

గీ. నాలిమాటలు నీపట్టినామములును, శపథములుఁ జూచి నిక్కంబు సాధువనుచు
నమ్మితినిగాక యి ట్లల్లనాఁడె నీదు, గుణ మెఱింగిన వెడలంగఁ గొట్టి వినుతు. 55

ఉ. వాదుల కేమి (కార్యోగుల) వన్నియశిష్యునిచేతఁ బంపఁగా
లేదె సువర్ణపాత్రము మలిమ్లుచ శేఖర ! యెల్లవారిచేఁ
గా దనిపించుకో ఫలము గల్గునె యీరక రిత్తమాటలం
బోదునుమీ యవజ్ఞ (యనఁ బోటిఁ) గనుంగొని సంస్మితాస్యుఁ డై. 56

గీ. ఏల పదరెదు నీకును హెచ్చు కుందు, మాటలకు నెంత యిన్నాళ్లు మాకు లేని
వటువు నడు రేయి యెం దుండి వచ్చెఁ జెపుమ, యిట్టిమాట ... ... నది విధి.

వ. అని పలుకువారలకలహంబు వారించి వయోరాజ్యదుర్వారగర్వారంభ శీలుం డగునమ్మహీపాలుండు *సభ్యులం జూచి మీ రీయిరువురకలహంబు లాకర్ణించితిరి. నామనంబునం దెలిపిపడిన తెఱం గెఱింగించెద. 58

క. వెలయాలి కెవ్వ రిచ్చిన, వలసినగతిఁ గైకొనంగవచ్చుఁ గా సొమ్ముల్
తలఁప నటు గాక ... , ... ... క్తి గలుగునే యేమైనన్. 59

క. అటు గాక తన్నుఁ బిలువఁగ, వటు వొక్కఁడు వచ్చె ననియె వసుధామరుఁడుం
గుటిలాలకకును వటువే, యట కిన్నియఁ దెచ్చి యిచ్చె ... ... 60

ఉ. కానఁ దపస్విఁ బిల్వఁగ నొకానొకచేడియ లేదె బంటువాఁ
డైనను లేఁడె యవ్వటువు నంపఁగ నేటికి? బ్రహ్మచారియుం
దా నడురేయి దీని సదనంబునకుం జనుదేర నేమి యీ
(మానినియొద్ద) లేవు వెడమాయలునుం బొరలింపుమాటలున్. 61

శా. తానే దొంగిలి కిన్నె శిష్యవరుచేతం బంపి చౌర్యంబు పై
లైనం దూఁటిచనంగ నేరమిని యీ ... ... ... నం
గా నేర్పుల్ పచరించి బొంకెద నెఱుంగ న్రాదె యీనుల్పు వీఁ
డే నిక్కం బగుకన్నగాఁ డని ధరిత్రీశాగ్రగణ్యుం డనన్. 62

క. ఆనృపతి పలుకు లుచితం, బై(నవి యని) యెల్లవారు నని రప్పుడు "రా
జానుమతో ధర్మ", యనం, గా నుత మగుపల్కు +నమ్మఁగా నగుఁ గాదే. 63

వ. ఇవ్విధంబున నమ్మహీపాలపుంగవుండు తనయందుఁ గలుగనిదొంగతికం బాపాదించుటకుం గనలి యపవాదంబు పరిహరించుకొనునుపాయంబును గానక యమ్మునివరుండు నిజహృదయకర్ణికాధాముం డగురంగధాముం దలంచిన— 64

సీ. శీవిమైఁ గటిని గట్టినపచ్చపట్టును బొక్కిలి నెత్తమ్మిఁ బొలుచు నిసువు
నిగనిగప్రభల నీనెడుకౌస్తుభంబును బేరురంబున విడంబించుసతియు
మిసమిసల్ నిగిడించు మొసలివాతమ్మంట్లు నొక కేలఁ బద్మంబు నొకట గదయు
నగణితరుచి ధగధగిత కిరీటంబుఁ గరుణాసుధాధార గ్రమ్ముచూపు

* సభికులం జూచి—మాతృక. + నిశ్చయంబగు—మాతృక.

గీ. గలిగి సురసిద్ధగంధర్వఖచరసాధ్య, మఘవముఖదేవసంస్తూయమానుఁ డగుచు
విహగపతి నెక్కి శ్రీరంగవిభుఁడు తపసి, యగ్రభాగంబునందుఁ బ్రత్యక్ష మయ్యె.

గీ. విప్రవర్యుఁడు భయమును విస్మయంబుఁ, బ్రమదరసమును మనమునఁ బల్లవింప
ఫాలవీథిక నంజలి పరిఢవిల్ల, బహువిధంబుల నిట్లని ప్రస్తుతించె. 66

లయగ్రాహి.

ఇందురవినేత్ర యరవిందభవముఖ్యసురవందితపదాబ్జ ధృతమందరధరా సం
క్రందనమణీఘనమిళిందసమదేహరుచి వందితప్రసన్నహరిచందన కటాక్షా
మందకరుణారస ముకుంద మురమస్మర సనందనముఖాదిమునిబృందనుతవిద్యా
నందమయరూప హరి నందకులధారివరనందన ఫణీగ్రసనతుందిలతురంగా. 67

చ. హరిహయపద్మసంభవముఖామరదుర్లభలీలఁ బొల్చునీ
చరణసరోరుహంబులు ప్రసన్నత నాకొసఁగూర్చె మత్పురా
చరితము లైనయట్టికలుషంబులు వీడెఁ గృతార్థభావముం
బొరసితిఁ గోర్కెలున్ ఫలముఁ బొందెను భక్తజనావనప్రియా! 68

గీ. ఎందు మాదృశు లగువారి యందుఁ గలుగు
కొదవ లెన్నవు భుక్తిముక్తులు నొసంగఁ
జాలుచున్నాఁడ వేమని సన్నుతింతుఁ
జక్రధర నీదుభక్తవాత్సల్యమహిమ. 69

క. అనుచుం బెక్కుతెఱంగుల, వినిపించిన రంగశాయి వెలిదమ్మికనుం
గొనలఁ గనికరపుఁదుంపర, చినుకఁగ నిట్లనియె యోగిశేఖరుతోడన్. 70

ఉ. ఆర్యవరేణ్య! నీ వహరహంబు నొసర్చిన పుష్పదామకైం
కర్యము మన్మనఃప్రమదకారణ మయ్యెను నీదుభక్తితా
త్పర్యము గారుడప్రముఖభాగవతాచరితార్చనాతప
శ్చర్యలకంటె నన్నును బ్రసన్నునిఁ జేసె విశేషసంపదన్. 71

క. కావున నోవత్స! జగ, త్పావనచారిత్ర నీకుఁ బరమప్రీతిం
గావలసినవర మిచ్చెద, నే వేఁడు మటంచు నానతిచ్చిన నతఁడున్. 72

క. క్రమ్మఱఁ బ్రణమిల్లి మదిన్, సమ్మద ముప్పొంగ భక్తజనవత్సల ని
న్నిమ్ముల దర్శించితి వర, మిమ్మనఁగాఁ గలదె యింక నెయ్యది యైనన్. 73

వ. అని సకలశుభావహం బగుభవదనుగ్రహం బపరిహార్యంబు గావున మనంబు

నం గల తెఱంగు వినిపించెద. దేవా! భక్తాంఘ్రిరేణు వనియెడు నామధే
యంబు నాకుం బ్రసాదించి కృతకృత్యుం జేయు మని ప్రార్థించిన— 74

క. ఆనలినోదరుఁ డట్టే, కానిమ్మని వరము మునిశిఖామణికి దయం
... ... ... , నానతుఁ డగుచోళనృపవరాగ్రణిఁ బలికెన్. 75

ఉ. ఓరినృపాల! యీయనఘు యోగికులాభరణంబు మత్పదాం
భోరుహసేవనారతుఁ దపోధను ... ... ...
... ... ... ... నీతి దొఱంగి సభాంతరంబునం
జోరుఁ డటంచుఁ బల్కి పడుచుంబని సేయుట నీకు ధర్మమే. 76

చ. కనకపుగిన్నెఁ దెచ్చి విటకంటకి కిచ్చినవాఁ(డ నేను) మ
త్తనయుఁడు (వీఁడుసూ కొడుకు) తండ్రిధనంబున కర్హుఁ డౌట ము
న్వినవె! వివేకి గానిధరణీధవురాజ్యమునం బ్రజానురం
జన మొనఁగూడ నేర్చునె విచారము లేదె యొకించుకేనియున్? 77

క. ఇమ్మునివరు మామాఱుగ, నెమ్మిన్ భజియింపు చోళనృపతీ! యని యా
క్రొమ్మించుగిన్నె పసుపుం, గొమ్మకు నిప్పించి మానికుంజరుఁ బల్కెన్. 78

గీ. మునుపు నే దానికొసఁగిన కనకపాత్ర, తెచ్చితివి దేవదేవికిఁ దిరుగ నిమ్ము
ఎందు వెల్లాటకత్తియ కిచ్చినట్టి, సొమ్ము మగుడంగఁ గొనుట యేసుగుడితనము?

సీ. నా దగుగోపకాంతాపహారము విన్నవారల కెట్టి శాశ్వతవిభూతి
దొరకు నట్టిది గల్గుఁ బరమహా (నీవిప్ర)చరితంబు వినినట్టి జనుల కెల్ల
నని యానతిచ్చిన నతఁడు శ్రీమాలిక యనఁగఁ బ్రాబోధిక యనఁగఁ బరఁగు
కృతులను వర్ణింపఁ గృతకృత్యుఁ గావించి రంగశాయి తదంతరంగమందుఁ

గీ. దాఁ బ్రవేశించె దివ్యవాద్యములు మొరసె
జలజలని నింగిఁ బుష్పవర్షములు గురిసె
నమోజయజయశబ్దఘోషములు బెరసె
నప్పు డచ్చర (బోంట్లు) లాస్యములు మెఱసె. 80

క. ఆచోళనృపవరేణ్యుఁడు, వాచంయమువరునిఁ జేరవచ్చి మునీంద్రా!
నాచేసినయపరాధము, గాచి ననుం గావవయ్య కరుణాజలధీ! 81

క. దేవర తల్లివి తండ్రివి, దైవంబవు గురుఁడ వఖిలదాతవు నిన్నుం
గేవలమర్త్యుఁడ వనుచున్, భావించితి దీని కే మనంగలవాఁడన్. 82

వ. అని ప్రార్థించి గంధవహబాంధవంబు లగుసైంధవంబులును ... ...
తరంబు లగు ద్విరదంబులును పరభయదమహోర్భటు లగువీరభటులును, నీతి
కళాధాను లగుప్రధానులును, బలాక్రమవంతు లగుసామంతులును ... ...
గాణిక్యమాణిక్యంబులును మొదలుగాఁ గొల్వ సకలసన్నాహసమేతుం డై
మహావైభవంబునం జోళేశ్వరుం డమ్మునికులేశ్వరు ... ... భేరీ శంఖ
మృదంగాది వాద్యఘోషంబులు బోరుకలంగఁ బురంధ్రీకరకనత్కనకపాత్ర
నీరాజనంబులు, భూసురాశీర్వాదంబులు ... ... మణివితానంబులం గను
పట్టుతిరువీథుల నెల్లం గొలిచి సేవించి, తత్ప్రసాదంబునం గృతార్థత్వంబునుం
బొంది ప్రజాపాలనంబు గావించుచు శాశ్వత(సుఖం)బు లనుభవించుచుండె.

ఉ. అంచితపుణ్యుఁ డమ్మునికులాగ్రణియు న్సుమదామము ల్సమ
ర్పించుచుఁ బెక్కువైఖరులఁ బేర్కొనుచుక్ హృదయాబ్జమందు భా
వించుచు రంగశాయిఁ గడు వేడుక నిచ్చలు నెప్పు టట్లు సే
వించుచునుండె సర్వజనవిస్మయహేతుమహానుభావతక్. 84

క. ఆదేవదేవియును ముని, యాదరమున ధన్యనై తి నని రంగేశ
శ్రీదయితునకును ధనకన, కాదు లొసంగె న్విరక్తురాలై యుండెక్. 85

మ. ఎనయు న్స్నానవు లెట్టివా రయినఁ దా రీవిప్రనారాయణా
ఖ్యుని* ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... 86

† గద్య. ఇది శ్రీ శంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్య
ధుర్య ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర లింగనమనీషిపుత్త్ర శ్రీకాళహస్తీశ్వర
దయాసహాయ చెదలువాడ మల్లయనామధేయప్రణీతం బైన విప్రనారా
యణచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

---

* ఈ ఫలశ్రుతిమొదిభాగమును నాశ్వాసాంతపద్యములును లేవు.

† మాతృకలో లేనియీగద్యము పూర్వగద్యములను బట్టి వ్రాయఁబడినది.

# ప్రకటన.

---

## ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజా రావువేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్-వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీపిఠాపురము రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం.ఏ., బి.ఎల్.

,, ఆచంట లక్ష్మీపతిగారు, బి.ఏ., ఎం.బి., సి.ఎమ్.

,, నెమలి పట్టాభిరామారావు పంతులుగారు, బి.ఏ.

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి.ఐ.ఇ.

రావుబహదూర్ పిట్టి త్యాగరాయ సెట్టిగారు, బి.ఏ.

కార్యస్థానము.

2/7 హారిస్ రోడ్డు, పుదుపేట.

### చందానిర్ణయము.

పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాషకు నితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించుట, శాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణపూర్వకముగా నిరూపించులక్షణశాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్త్రిక నొకదానిని బ్రకటించుట, సమగ్రమగుపుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాది విధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

| | | |
|---|---|---|
| 1. | ఉద్ధారకులకు | రు. 5000. |
| 2. | పోషకులకు | ,, 1000. |
| 3. | యావజ్జీవసభ్యులకు | ,, 100. |
| 4. | సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, 6. |

పరిషత్సభ్యులు పత్త్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును

